శ్రీ ర స్తు.

# చ ర క సం హి త

అ గ్ని వే శ మ హ ర్షి కృ త ము

చరకప్రతిసంస్కృతము

## చికిత్సాస్థానము

బ్రహ్మశ్రీ పణ్డిత నుదురుపాటి విశ్వనాథశాస్త్రి

ప్రణీతాంధ్రవ్యాఖ్యాసమలంకృతము.



చె న్న పు రి:

...వెల్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్‌వారిచే

ప్ర క టి త ము.

1 9 3 9.

శ్రీ ర స్తు.

# చరకసంహిత

అగ్నివేశమహర్షికృతము

చరకప్రతిసంస్కృతము

## చికిత్సాస్థానము

బ్రహ్మశ్రీ పణ్డిత నుదురుపాటి విశ్వనాథశాస్త్రి

ప్రణీతాంధ్రవ్యాఖ్యాసమలంకృతము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్‌వారిచే

ప్రకటితము.

1939.



శ్రీ పండిత
నుదురుపాటి విశ్వనాథశాస్త్రులు
వ్యాఖ్యానకర్త.



# ఉపోద్ఘాతము

చరాచరాత్మకమైన సకలప్రపంచమునకు సృష్టికర్తయైన యాది దేవుడగు బ్రహ్మకు మనోమాత్రగోచరములై స్వయంప్రకాశములైన వేదములు వెలయుచుండునని ఆర్యులసిద్ధాంతము. అట్టివేదముల కుప వేదములలో చేరిన యాయుర్వేదంబును బ్రహ్మయందే తొలుదొలుత లీనమై యుండెను. అట్టి వేదసారాంశమైన యాయుర్వేదమును బ్రహ్మ లోకహితార్థమై వెల్లడింపగోరి లక్షశ్లోకసమ్మితమైన అష్టాంగవిశిష్టాయు ర్వేదసంహిత నొకదానిని తనపేర ప్రకాశింపజేసెను. అదియే బ్రహ్మ సంహిత యనుపేరుతో వెలయుచుండెను. అట్టి సంహితను సకలక్రియా దక్షుడును, అసదృశప్రజ్ఞావంతుడును నగుదక్షప్రజాపతికి తొలుత నుప దేశించెను. పదంపడి యాదక్షప్రజాపతివలన నశ్వినీదేవత లుపదేశము నంది దేవతలకు వలసినచికిత్సావిధానము చేయుచుండిరి. పిమ్మట ఇంద్రుడు అశ్వినీదేవతలవలన సాంగముగ నాయుర్వేదమును గ్రహించియుండెను. పైజెప్పిన పరంపరాగతమైన యాయుర్వేదము కేవలము స్వర్గమునందే ప్రచారము కల్గియుండెను.

ఇట్లుండ ఒకసమయమున అంగిరసుడు, జమదగ్ని, వసిష్ఠుడు మున్నగుదేవబ్రహ్మఋషివర్యులు, ఒకసభచేరి చతుర్విధపురుషార్థములకు సాధనమైన యారోగ్యమును కాపాడికొనుటకు సాధన మెద్దియని యోచించుచు నట్టిసాధనము ఆయుర్వేదమనియు నయ్యది యింద్రుని వద్ద నున్నదనియు జ్ఞానదృష్టిచే నెరింగి, యాయుర్వేదమును గ్రహించి లోకమున కుపకరించుటకై సహస్రాక్షునిచెంతకు భరద్వాజుని పంపుట యును, నాశతక్రతువు భరద్వాజుని ప్రతిభావిశేషమునకు తగునట్లు హేతు - లక్షణ - ఔషధ - స్కంధత్రయాత్మకమైన యాయుర్వేదము పూర్తిగ నుపదేశించెను. ఆభరద్వాజునివలన అంగిరసుడు మున్నగు ఋషివర్యులు నష్టాంగవిశిష్టమైన యాయుర్వేదమును సమగ్రకముగ

గ్రహించి యారోగ్యవంతులై తపస్సున కంతరాయములు లేక దీర్ఘాయువు నొందియుండిరి.

అట్టియెడ వారిలో తపోధనుడైన యాత్రేయుడు భూలోకమున నాయుర్వేదప్రచారమును పూర్తిగ వ్యాపింపచేయదలంచి అగ్నివేశుడు, భేలుడు, జతూకర్ణుడు, పరాశరుడు, హారీతుడు, క్షారపాణి యను నార్గురు శిష్యులకు సాంగముగ నుపదేశించెను. వారార్గురును వారి వారిపేర వేరువేరుగ తంత్రముల రచించిరి. వారిలో నగ్ని వేశుడు తొలుతనే తనపేర నగ్నివేశతంత్రమను నాయుర్వేదతంత్రమును రచియించెను. అయ్యది నూటయిరువది యధ్యాయములపరిమిత మనియు, లోకహితార్థమై యగ్నివేశునిచే విరచితంబనియు నీతంత్రాంతర మున నిట్లు చెప్పబడినది:—“ఇత్యధ్యాయశతం వింశం ఆత్రేయమునివాఙ్మయమ్, హితార్థం ప్రాణినాం ప్రోక్తం అగ్నివేశేన ధీమతా”(సి. అ. ౧౨.)

ఈ యాయుర్వేదావతరణక్రమమును ఈతంత్రమున:—“విఘ్నభూతా యదా రోగాః” అని యుపక్రమించి, “అథ మైత్రీపరః పుణ్యమాయుర్వేదం పునర్వసుః, శిష్యేభ్యో దత్తవాన్ షడ్భ్యః సర్వభూతానుకమ్పయా. అగ్నివేశశ్చ భేలశ్చ జతూకర్ణః పరాశరః, హారీతః క్షారపాణిశ్చ జగృహుః తన్మునేర్వచః. బుద్ధేర్విశేష స్తత్రాసీత్ ఉపదేశాన్తరం మునేః, తన్త్రస్య కర్తా ప్రథమం అగ్నివేశో యతోఽభవత్. అథ భేలాదయశ్చక్రుః స్వం స్వం తన్త్రం కృతాని చ.” (చ-సూ. అ. ౧. శ్లో. ౬-3౨.) అనుగ్రంథముచే నీతంత్రకారుడు స్పష్టముగ చెప్పెను.

ఈవిషయమును వాగ్భటాచార్యులు నిట్లు సంగ్రహముగ తెలిపెను.

“బ్రహ్మా స్మృత్వాయుషో వేదం ప్రజాపతిమజిగ్రహత్, సోఽశ్వినౌ తౌ సహస్రాక్షం, సోఽత్రిపుత్రాదికాన్ మునీన్. తేఽగ్నివేశాదికాం స్తే తు పృథక్ తన్త్రాణి తేనిరే.” (అ. హృ. సూ. అ. ౧.)

పై వివరణమునుబట్టి భరద్వాజశిష్యుడైన యాత్రేయునివలన నాయుర్వేదమును అగ్నివేశులు పూర్తిగ నుపదేశమునొంది గురూపదిష్టమునకు న్యూనాతిరేకము లేకుండునట్లు తనపేర నాయుర్వేదతంత్రమును రచించెనని స్పష్టముగ నేర్పడును.

అట్టి యగ్నివేశకృతతంత్రము మిక్కిలి విపులముగ నుండుటంజేసి పాఠప్రవచనాదులకు కష్టముగనుండునని తలంచి చరకుడను మహనీయుడు సంస్కరించి సంగ్రహరూపముగ రచించి లోకమున కుపకృతి నొనరించెను. అయ్యది సంస్కర్తృనామముచే 'చరకసంహిత' యని ప్రశస్తిగాంచి వెలయుచున్నయది.

అగ్నివేశకృతతంత్రమును చరకులు ప్రతిసంస్కరించె ననువిషయ మీక్రిందివచనములచే స్ఫుటముగ తెలియుచున్నది:—

"అగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే." (సిద్ధిస్థానాంతము.)
"అస్మిన్ సప్తదశాధ్యాయాః........అగ్నివేశస్య,
తన్త్రే చరకసంస్కృతే." (చ. చి. అ. 30. శ్లో. ౨౮౯.)

ప్రతిసంస్కారమన శాస్త్రమునందు అతివిపులముగ చెప్పబడిన విషయమును క్లుప్తముగ సంగ్రహించియు, అతిసంక్షిప్తముగ చెప్పబడిన దానిని విస్తరించియు, శాస్త్రమును క్రొత్తగ రచించుటయే ప్రతిసంస్కారము. ఈవిషయము సిద్ధిస్థానమున నిట్లు చెప్పబడినది:—

"విస్తారయతి లేశోక్తం సంక్షిపత్యతివిస్తరమ్,
సంస్కర్తా కురుతే తన్త్రం పురాణం చ పునర్నవమ్.
అతస్తన్త్రోత్తమమిదం చరకేణాతిబుద్ధినా,
సంస్కృతం." (చ. సి. అ. ౧౨.)

పైవాక్యములబట్టి అగ్నివేశకృతతంత్రమును అతివిస్తృతముగ నున్నస్థలములయందు సంగ్రహించియు, సంకుచితముగ నున్నచోట్ల విస్తరించియు సంస్కరించి, పాఠకులకు సుగమముగ నుండునట్లును, క్రొత్తగ నుండునట్లును, చరకులు చేసెనని స్ఫుటముగ తెలియదగియున్నది.

శ్రీమహావిష్ణువునకు పర్యంకముగనుండు సహస్రవదనుడైన యాదిశేషుడు భూలోకమునంగల కొన్నివిశేషముల బరికింప నుత్సుకుడై యాదిదేవుని యనుమతినొంది భూలోకమున తానవతరింప ననువైన స్థలము నరయుచుండ నొక్కచో నొకపతివ్రతాశిరోమణి తపంబొనరించు వేళ నర్ఘ్యమును విడచు సమయముం గని యాయంజలిలో (అయోనిజన్మముగ) తనయంశమున మనుజాకారుడై జనించెను. అంజలిలోనుండి

యూడిపడినట్లు జనించుటంజేసి పతంజలి యనునన్వర్థనామముచే ప్రశస్తి గాంచెను. అని ప్రాచీనగాథ తెలిసెడి. అట్టి శేషాంశసంభూతుడగుపతంజలిమహర్షి వ్యాకరణమహాభాష్యప్రణేత యనునంశము నిర్వివాదము. ఆపతంజలియే యగ్నివేశకృతాయుర్వేదమును సంస్కరించెను.

ఈవిషయము క్రిందివాక్యములచే స్ఫుటముగ తెలిసెడి. చరకవ్యాఖ్యాతయగు చక్రపాణివ్యాఖ్యానప్రారంభమున నాందీశ్లోకము నిట్లు చెప్పెను:—

"పాతంజలిమహాభాష్యచరకప్రతిసంస్కృతైః,
మనోవాక్కాయదోషాణాం హర్త్రేఽహిపతయే నమః.
సూత్రాణి యోగశాస్త్రే వైద్యకశాస్త్రే చ సంహితామతులాం,
కృత్వా పతంజలిమునిః ప్రచారయామాస జగదిదం సర్వమ్."

(పతఞ్జలిచరితం సర్గ. ౫.)

ఈవాక్యములనుపట్టి పాతంజలయోగసూత్రములను, వ్యాకరణమహాభాష్యమును, చరకసంహితయను నాయుర్వేదతంత్రసంస్కారమును జేసినది పతంజలియని స్ఫుటముగ తెలిసెడి.

మరియు నాదిశేషుడు లోకవృత్తము నరయగోరి పైజెప్పినరీతిగ నవతరించుసమయమున తనస్వరూపమును విడచి మానుషసామాన్యరూపముతో (ఒకగూఢచారుడు తనస్వరూపమును మరుగుజేసి వేషాంతరమును బూని లోకమున నిగూఢముగ సంచరించురీతి) నవతరించును. కావున పతంజలికి చరకుడనునామాంతరము నన్వర్థముగ కల్గెను. ఈవిషయము భావప్రకాశమున నిట్లు చెప్పబడినది:—

"యదా మత్స్యావతారేణ హరిణా వేద ఉద్ధృతః,
... ... ... ... ...
అనన్తశ్చిన్తయామాస రోగోపశమకారణమ్,
సంచింత్య స స్వయం తత్ర మునేః పుత్రో బభూవ హ.
ప్రసిద్ధస్య విశుద్ధస్య వేదవేదాఙ్గవేదినః,
యతశ్చర ఇవాయాతో న జ్ఞాతః కేనచిద్యతః.
తస్మాచ్చరకనామ్నాఽసౌ ఖ్యాతశ్చ క్షితిమణ్డలే,
స భాతి చరకాచార్యో దేవాచార్యో యథా దివి.

ఆత్రేయస్య మునేశ్శిష్యాః అగ్నివేశాదయోఽభవన్,
మునయో బహవస్తైశ్చ కృతం తన్త్రం స్వకం స్వకమ్.
తేషాం తంత్రాణి సంస్కృత్య సమాహృత్య విపశ్చితా,
చరకేణాత్మనో నామ్నా గ్రన్థోఽయం చరకః కృతః"
(భావప్రకాశము. ౧-వ ప్రకరణము.)

ఈవాక్యములచేత ఆదిశేషుడు గూఢరూపముగ నవతరించుటం జేసి చరకుడని వ్యవహరింపబడెననియు, అట్టి చరకాచార్యుడే ఆత్రేయ శిష్యులగు అగ్నివేశాదితంత్రముల సంస్కరించి సంగ్రహముగ చరక సంహితయనుతంత్రమును తనపేరుతో నెలకొల్పెననియు దృఢమగు చున్నది.

కొందరు మహాభాష్య - యోగసూత్ర - చరకసంస్కర్తలు వేరు వేరుగ నున్నవారేకాని యేకవ్యక్తిగ నిర్ణయింప వలనుపడదని కొన్ని కారణముల జూపెదరు. కాని పైనికనిన చక్రపాణివాక్యముచేతను, పతంజలిచరితవాక్యముచేతను, మహాభాష్య-యోగసూత్ర-చరకసంస్కరణముల మూటికిని పతంజలియే కర్తయని స్ఫుటముగ తెలియుచున్నయది.

మరియు నాగేశభట్టుడు శబ్దేందుశేఖరమను సిద్ధాంతకౌముదీ వ్యాఖ్యానమును రచించుతరి ప్రారంభమంగళమున "పాతఞ్జలే మహాభాష్యే కృతభూరిపరిశ్రమః, శివభట్టసుతో ధీమాన్............నత్వా ఫణీశం నాగేశస్తనుతేఽర్థప్రకాశకమ్.....,లఘుశబ్దేన్దుశేఖరమ్." అని చెప్పెను. ఈశేఖరమునకు వ్యాఖ్యాతయగు భైరవమిశ్రుడు ఇట్లు వ్రాసెను:—

"పాతఞ్జల ఇత్యాదినా:—ప్రథమం పాతఞ్జలశబ్దోపాదానం మఙ్గళాయ, మహాభాష్యమాత్రోక్తౌ శారీరకసూత్రభాష్యస్యాపి బోధః స్యాత్. అతః పాతఞ్జలపదమ్. తావన్మాత్రోక్తౌ చరకే అతివ్యాప్తిః. అతో 'మహాభాష్యే' ఇతి." (శేఖరవ్యాఖ్యచంద్రకల.)

ఇచ్చట 'పాతఞ్జలే' అనుపదముచేత పతంజలిప్రోక్తగ్రంథము అని యర్థమగును. అట్టిగ్రంథమున పరిశ్రమము చేసినవాడన్నపుడు పతంజలిప్రోక్తచరకమునందు అనియు నర్థము కావచ్చును. కావున అట్టి

అతివ్యాప్తిని వారించుటకై "పాతంజలే, మహాభాష్యే" అని మహాభాష్యపదము చెప్పబడెనని పై వాక్యమున కర్థము. ఈభైరవమిశ్రుని వాక్యమునుబట్టి నీరికాలమున చరకము ప్రచారమున నున్నదనియు, అయ్యది మహాభాష్యప్రణేతయగు పతంజలివిరచితమని భైరవమిశ్రునకు తెలిసినవిషయమనియు తేటతెల్లముగ నేర్పడుచున్నయది.

మరియు ప్రాచీనగ్రంథములయందు ఆయాగ్రంథకర్తృనామముల పేర్కొనునపుడు యౌగికనామాంతరముల గ్రహించుట సంప్రదాయసిద్ధము. భాష్యకారుల పేరునకుబదులుగ "గోనర్దీయస్త్వాహ" ఇత్యాది స్థలములయందు యౌగికనామాంతరగ్రహణము మహాభాష్యమునందనేకస్థలముల గాననగును. అట్లేయందునే పతంజలికి పై జెప్పినరీతిగ చరకపదము యౌగికనామాంతరమని చెప్పదగియున్నది. అట్టి చరకుడు తనపేరునే స్వీయతంత్రమునకు చెప్పియుండుటంజేసియే ప్రతియధ్యాయాంతమునను "చరకప్రతిసంస్కృతే" అని తననామమునే నుడివెను.

పై గనబరచిన ప్రమాణములచే మహాభాష్యకర్తయగు పతంజలియే ఈతంత్రమునకు సంస్కర్తయనియు, పతంజలికే చరకుడను నామాంతరము కలదనియు తేలుచున్నయది.

## దృఢబలసంస్కారవిషయము.

అగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగు నీతంత్రము ప్రచారముననుండుతరి కొంతకాలమునకు కారణాంతరములచేత చికిత్సాస్థానమున పదునేడధ్యాయంబులును, కల్ప-సిద్ధిస్థానంబులు పూర్తిగను, ఖిలమై దొరకకుండుటయు, అట్టిసమయమున పంచనదపురవాస్తవ్యుడును కపిలబలుడు అనువానిపుత్రుండును నగుదృఢబలుడను నాయుర్వేదవిద్యాకోవిదుడు పై జెప్పిన గ్రంథశేషమును పూర్తిగావించి చరకతంత్రమును పూర్తిగావించెను. ఈవిషయమును దృఢబలుడే చికిత్సాస్థానాంతమునను, సిద్ధిస్థానమునను కంఠోక్తిగా నిట్లుచెప్పెను:—

"అస్మిన్ సప్తదశాధ్యాయాః కల్పాస్సిద్ధయ ఏవ చ,
నాసాద్యన్తేఽగ్నివేశస్య తన్త్రే చరకసంస్కృతే.

తానేతాఙ్ కాపిలబలిః శేషాఙ్ దృఢబలో౽కరోత్,
తన్త్రస్యాస్య మహార్థస్య పూరణాయ యథాతథమ్."
(చ. చి. అ. ౩౦ శ్లో. ౧౭౯.)

"అత స్తన్త్రోత్తమమిదం చరకేణాతిబుద్ధినా,
సంస్కృతం తత్త్వసంపూర్ణం త్రిభాగేనోపలక్ష్యతే.
తచ్ఛఙ్కరం భూతపతిం సంప్రసాద్య సమాపయత్,
అఖణ్డార్థం దృఢబలో జాతః పఞ్చనదే పురే.
కృత్వా బహుభ్యః తన్త్రేభ్యః విశేషోఞ్ఛశిలోచ్చయమ్,
సప్తదశౌషధాధ్యాయసిద్ధి-కల్పైరపూరయత్."
(చ. సి. అ. ౧౨.)

ఈదృఢబలవాక్యముచే చికిత్సితమున పదునేడధ్యాయములను, కల్పసిద్ధిస్థానములను, తాను పూర్తిగావించెనని తెలియుచున్నయది; కాని చికిత్సాస్థానమున తాను శేషపూరణముగావించిన యధ్యాయము లివి యని యేర్పడియుండలేదు.

చక్రపాణిదత్తవిరచితంబైన యాయుర్వేదదీపికయను నీతంత్ర వ్యాఖ్యానమును పరిశీలించినయెడ చికిత్సాప్రారంభమునుండి రాజయక్ష్మ చికిత్సాంతమువరకుంగల యెనిమిదియధ్యాయంబులును, అర్శశ్చికిత్సిత మనుపదునాల్గవయధ్యాయంబును, అతిసారచికిత్సిత మనుపందొమ్మిదవ యధ్యాయంబును, విసర్పచికిత్సితమను నిరువదియొకటవయధ్యాయంబును, మదాత్యయచికిత్సితమను నిరువదినాల్గవయధ్యాయంబును, ద్విప్రణీయ చికిత్సితమను నిరువదియైదవయధ్యాయంబును, (ఇవి పంచాధ్యాయి) చేరి పదుమూడధ్యాయంబులును చరకప్రతిసంస్కృతంబులనియు, ఇవిదక్క తక్కినపదునేడధ్యాయంబులు దృఢబలునిచే పూర్తిగావింపబడినవనియు నేర్పడినది.

ఎట్లులనః—రాజయక్ష్మచికిత్సితమునకుపై నున్మాదచికిత్సా (తొమ్మి దవయధ్యాయము) ప్రారంభమున పూర్వోత్తరాధ్యాయములకు సంబంధము దెలుపుచు నిట్లు వ్రాసిరి:—

"ఇదానీం ఉపోద్ఘాతితం రాజయక్ష్మచికిత్సితమభిధాయ క్రమ ప్రాప్తం ఉన్మాదచికిత్సితం బ్రూతే, అయంచ క్రమః చరకప్రతిసంస్కృతాం పఞ్చాధ్యాయీం అర్శోఽతీసారవీసర్పమదాత్యయద్వివ్రణీయరూపాం పరిత్యజ్య జ్ఞేయః." (చి ౯ చక్రపాణి.)

ఈయవతారికనుపట్టి అధ్యాయక్రమమున సూచించినవరుస ననుసరించి రాజయక్ష్మచికిత్సితానంతరము ఉన్మాదచికిత్సితము చెప్పబడుననియు, ఈయధ్యాయక్రమము చరకప్రతిసంస్కృతములైన అర్శస్సు, అతిసారము, విసర్పము, మదాత్యయము, ద్వివ్రణీయము అను నైదుచికిత్సితములబోధించు నైదధ్యాయముల వరుసక్రమమును వదలి చెప్పబడినదనియు తెలిసెడి. అర్శశ్చికిత్సితము మున్నగు పైయధ్యాయములు ఖిలము చరకప్రతిసంస్కృతాధ్యాయక్రమమునకు జేరియుండక నడుమ నచ్చటచ్చట దృఢబలసంపూరితాధ్యాయములచే వ్యవధికల్గియుండుటం జేసి ఎనిమిదవయధ్యాయమునకు పైన వరుసగ నుండవీలులేదు కావున వానిక్రమమును వదలి యున్మాదచికిత్సితాదిక్రమము ననుసరించి చెప్పబడునని చక్రపాణియభిప్రాయము.

మరియు—"అస్మిన్ సప్తదశాధ్యాయాః.........పూరణాయ యథాతథమ్." (చి. అ. ౩౦ శ్లో. ౧౭౯.) అనుమూలమునకు వ్యాఖ్య జేయుతరి చక్రపాణి యిట్లు వివరించెను:—

"అస్మిన్ సప్తదశాధ్యాయా ఇతి:—చికిత్సాస్థానే, సప్తదశాధ్యాయాః, తే చ యక్ష్మచికిత్సాన్తాన్ అష్టావధ్యాయాన్, తథా అర్శోఽతిసారవీసర్పమదాత్యయద్వివ్రణీయోక్తాన్ విహాయ జ్ఞేయః."

(చక్రపాణి.)

ఈవాక్యముచేతను, రాజయక్ష్మచికిత్సితమువరకుంగల అధ్యాయము లెనిమిదియు, అర్శోఽతిసారాదిపఞ్చాధ్యాయముం గలసి పదుమూడధ్యాయములు చరకసంస్కృతములని స్పష్టముగ దెలియుచున్నది. చికిత్సాస్థానమున తక్కుంగలపదునేడధ్యాయంబులును, కల్ప-సిద్ధిస్థానంబులును చరకునిచే సంస్కరింపబడినవి దృఢబలునికాలమున నుపప్లవాదులచే ఖిలమై దొరకలేదుకాని యీభాగమును చరకుడు సంస్కరింప

వదలినదికాదని 'నాసాధ్యన్తే' అనుపదముచే నూహింపదగియున్నది. అట్లు ఖిలమగునప్పుడు అచ్చటచ్చట కొన్ని యధ్యాయములువదలి నడుమ నడుమ ఖిలమగుటంజేసి యధ్యాయక్రమము ననుసరింపక పైకనుపరచిన పఙ్క్త్యాధ్యాయిలభించెననియు, అట్లు దొరకినయధ్యాయములను ఆలాగునే గ్రహించి వానినడుమ నచ్చటచ్చట లోపించినయధ్యాయముల పదునేడింటిని దృఢబలుడు సంస్కరించి యధ్యాయక్రమానుసారముగ చేర్చి చికిత్సాస్థానము పూర్తిగావించెననియు చక్రపాణిదత్తవ్యాఖ్యాను సారముగ తేలినది. లోకమున తాళపత్రలిఖితమైన గ్రంథము చెదలు పురుగులు మున్నగువానిచే శిథిలమైనపుడు వరుసక్రమములేక నడుమ నడుమ శిథిలమగును కదా? అట్లేరంగుననే చరకప్రతిసంస్కృతమున క్రమములేక శిథిలమై దొరకినదని చెప్పదగియున్నది.

మరియు చక్రపాణి వ్యాఖ్య రచించునప్పుడు అధ్యాయప్రారంభమున పూర్వోత్తరాధ్యాయముల సంబంధమును చెప్పియున్నారు. అట్టి సందర్భమును దెలుపునపుడు సూత్రస్థానమున గనబరచిన చికిత్సాధ్యాయక్రమము ననుసరించియే అన్ని యధ్యాయములకు చెప్పిరి. కావున రాజయక్ష్మచికిత్సితమునకు చేరినట్లు పఙ్క్త్యాధ్యాయిని వరుసగ చేర్చుట సమంజసము కానేరదు.

పండితకులపతి జీవానందవిద్యాసాగరులచే (1896 సంవత్సరము) కలకత్తానగరమున ముద్రింపబడిన చరకమూలప్రతియందు రాజయక్ష్మచికిత్సితానంతరము పైగనబరచిన పఙ్క్త్యాధ్యాయిని వరుసగ 9-10-11-12-13 యధ్యాయములుగ చేర్చియున్నది. ఇది చరకసంస్కృతాధ్యాయములు పదుమూడును వరుసగనుండిన బాగుండునని చేసినదికాని చక్రపాణి వ్యాఖ్యాసమ్మతము కానేరదు. మీదుమిక్కిలి యధ్యాయక్రమము సూచించుశ్లోకములను తదనుసారముగనే మార్పుచేసియున్నది. వ్యాఖ్య ననుసరించి పైనిర్ణయింపబడిన యధ్యాయక్రమమే సమంజసమని నాయభిప్రాయము.

ఈచరకతంత్రము తక్కిన యాయుర్వేదతంత్రముల కన్నిటికిని యాదర్శకమైనదనియు, ఆయుర్వేదమునకు సంబంధించినవిషయము

లన్నియు దీనియందే యిమిడియున్నవనియు, తంత్రాంతమున దృఢబలుడు ఇట్లు చెప్పెను:—

"చికిత్సావహ్నివేశస్య సుస్థాతురహితం ప్రతి,
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్." (సి.అ.౧౨.)

వాగ్భటాచార్యులును చరకసుశ్రుతములరెంటిని యార్షగ్రంథములలో మిక్కిలి ప్రశస్తములని కొనియాడుచు నిట్లు చెప్పెను:—

"ఋషిప్రణీతే ప్రీతిశ్చేత్ ముక్త్వా చరకసుశ్రుతౌ,
భేడాద్యాః కిం న పఠ్యన్తే తస్మాద్గ్రాహ్యం సుభాషితమ్."
(అ. హృ. ఉత్తరస్థానాంతమున)

పైజెప్పిన వాగ్భటాదీతరతంత్రకారులప్రశంసాపాత్రమై చరకదృఢబలసంస్కృతమైన యీచరకసంహిత మిక్కిలి గంభీరార్థవిశిష్టంబగుటంజేసి కేవలము పండితమాత్రవేద్యంబై సామాన్యులకు గోచరముగాకయున్నయది. అట్టి యీతంత్రము ఆంధ్రభాషాభిజ్ఞులకు సుగమముగ నర్థమగునట్లు సులభశైలితో నాంధ్రవ్యాఖ్య రచించినాడ. ఈ వ్యాఖ్యరచనయందు చక్రపాణిదత్తవిరచితమైన యాయుర్వేదదీపికయను వ్యాఖ్యానమును ప్రధానముగ జేసికొని కొన్నిస్థలములయందు సుశ్రుతవాగ్భటాదితంత్రములను సాహాయ్యముగ గైకొని అచ్చటచ్చట విశేషాంశముల వివరించుచు, చికిత్సాభాగమున తైల - క్వాథ - లేహాద్యౌషధకల్పనావిధానములకు వలసినపరిభాషల నాయాస్థలముల గనబరచుచు, నాంధ్రవ్యాఖ్య వ్రాసినాడ.

తంత్రకర్తలకాలము జన్మభూమి మున్నగు చరిత్రాంశముల విమర్శించుభారమును అందు ప్రశస్తిగాంచిన పండితాగ్రగణ్యులపై నిడి, నాదోచినకొలది కొన్నివిషయములుమాత్రము ఇచ్చట చూపబడినవి. ఇందు భ్రమప్రమాదములచే దోషము లేవైననున్నచో వానినిదూరంబుచ్చి గుణలేశమును మాత్రము గ్రహించి నాపరిశ్రమమును సఫలతనొందింప పండితప్రవరుల వేడెద.

ఇప్పటి కాలపరిస్థితిలో చిరంతనగ్రంథముల వెల్లడింప బద్ధాదరులై లోకమునకును పండితులకును నుపకృతిచేయుచు భాషోద్ధారకాది బిరుదవిరాజితులైన బ్రహ్మశ్రీ శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు ఈవ్యాఖ్యరచించుటకు నన్ను ప్రోత్సాహపరచి తగుపారితోషికము నొసంగి సంవిధానమును గల్పించుటయేగాక ముద్రణాదివ్యయప్రయాసముల సరకుచేయక యీగ్రంథమును ముద్రింపించి లోకోపకారము నొనరించిరి.

ఇత్తెరంగుననే నామమాత్రావశిష్టములై నిగూఢములైన సంస్కృతాంధ్రగ్రంథము లనేకముల మిగుల ప్రయత్నముతో వెలికిందీసి ముద్రింపించి లోకమున ప్రచారమును కల్పించుచున్న శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి ఆయురారోగ్యభాగ్యములనొసంగి, యింతకన్న నధికముగ వీరియుద్యమమును నిష్ప్రత్యూహముగ సాగింప పరమకారుణికుండగు దేవదేవుండు ప్రోత్సహించుగాక! ఇతి శమ్.

ఇట్లు విద్వద్విధేయుడు,

పణ్డిత సుదురుపాటి విశ్వనాథశాస్త్రి,

వ్యాఖ్యానకర్త.

# అధ్యాయానుక్రమణిక.

ఈయధ్యాయానుక్రమణిక సూత్రస్థానమునందలి 30 అధ్యాయమున "అభయామలకీయం చ......త్రింశచ్చికిత్సితాన్యుక్తాని" శ్లో. 58-63 శ్లోకముల చెప్పబడినది.

* ఈ అధ్యాయములు పదుమూడును చరకసంస్కృతములు. తక్కిన పదునే డధ్యాయంబులును దృఢబలసంస్కృతంబులు.

# విషయసూచిక.

## చికిత్సాస్థానము.

### ప్రథమాధ్యాయము, ప్రథమపాదము.



### ప్రథమాధ్యాయము, రెండవపాదము.

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|

## ప్రథమాధ్యాయము, మూడవపాదము.



## ప్రథమాధ్యాయము, నాల్గవపాదము.

విషయము. పుటసంఖ్య.



ద్వితీయాధ్యాయము,
ప్రథమపాదము.



ద్వితీయాధ్యాయము,
ద్వితీయపాదము.



ద్వితీయాధ్యాయము,
తృతీయపాదము.



ద్వితీయాధ్యాయము,
చతుర్థపాదము.



CENTRAL LIBRARY
TIRUPATI
19757

## చతుర్థాధ్యాయము,
## రక్తపిత్తచికిత్సితము.

విషయము. — పుటసంఖ్య.



D

విషయము. — పుటసంఖ్య.



## పంచమాధ్యాయము,

## గుల్మచికిత్స

## షష్ఠాధ్యాయము,
## ప్రమేహచికిత్సితము.

## అష్టమాధ్యాయము,

## రాజయక్ష్మచికిత్సితము

## నవమాధ్యాయము,
## ఉన్మాదచికిత్సితము.

## దశమాధ్యాయము,

## అపస్మారచికిత్సితము.

ఏకాదశాధ్యాయము,

క్షతక్షీణచికిత్సితము.

## ద్వాదశాధ్యాయము, శ్వయథుచికిత్సితము.

త్రయోదశాధ్యాయము,

ఉదరచికిత్సితము.

## చతుర్దశాధ్యాయము, అర్శశ్చికిత్సితము.

విషయము. పుటసంఖ్య.

పఞ్చదశాధ్యాయము,
గ్రహణీదోషచికిత్సితము.



F

## షోడశాధ్యాయము,
## పాండురోగచికిత్సితము.

ఏకోనవింశాధ్యాయము,

అతిసారచికిత్సితము.

## ద్వావింశాధ్యాయము,
## తృష్ణారోగచికిత్సితము.

## త్రయోవింశాధ్యాయము,
## విషచికిత్సితము.

## చతుర్వింశాధ్యాయము,
## మదాత్యయచికిత్సితము.

## పంచవింశాధ్యాయము,
## ద్వివ్రణీయచికిత్సితము.

## షడ్వింశాధ్యాయము,
## త్రిమర్మీయచికిత్సితము.

## సప్తవింశాధ్యాయము, ఊరుస్తంభచికిత్సితము.

## త్రింశాధ్యాయము,
## యోనివ్యాపచ్చికిత్సితము.

J

# సంస్కృతగ్రంథములు.

## వేదాంతగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అష్టోత్తరశతోపనిషత్తులు, చక్కనికూర్పు, మూలము | ... | 6 | 0 |
| ఉపదేశసాహస్రి, ఆంధ్రతాత్పర్యవివరణసహితము | ... | 2 | 8 |
| కామకలావిలాసము ,, | ... | 2 | 0 |
| జ్ఞానవాసిష్ఠము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 8 | 0 |
| జీవన్ముక్తిప్రకాశిక, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| నైష్కర్మ్యసిద్ధి, సురేశ్వరాచార్యకృతము, టీకాతాత్పర్యసహితము | ... | 3 | 8 |
| పంచదశీప్రకరణము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 5 | 0 |
| బ్రహ్మసూత్రభాష్యము, (సంస్కృతము) శారీరకమీమాంసాభాష్యముతోడను, శ్రీగోవిందానంద భగవత్పాదవిరచిత రత్నప్రభాఖ్యవ్యాఖ్యతోడను, శ్రీసదాశివేంద్రవిరచితబ్రహ్మతత్వప్రకాశికవృత్తితోడను, గ్రంథాంతమున శ్రీసుబ్రహ్మణ్యసూరివిరచిత భాష్యార్థరత్నమాలయును చేర్చి ముద్రించినారము | ... | 8 | 0 |
| బ్రహ్మసూత్రార్థచంద్రిక, తెనుఁగువచనము, శ్రీశంకరాచార్యులవారిభాష్యము అందరికిని తెలియుట దుర్లభమని తలఁచి చక్కనిశైలిలో అనేకవృత్తుల ననుసరించి తెనుఁగువ్యాఖ్యానమును ప్రకటించినారము, 2 సంపుటములు | | 12 | 0 |
| రామగీతా, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| వివేకచూడామణి ఆంధ్రతాత్పర్యసహితము, క్రొత్తకూర్పు | ... | 0. | 12 |
| శంకరవిజయము, సవ్యాఖ్యానము | ... | 2 | 0 |
| శివగీతా, ఆంధ్రతాత్పర్యసహితము, చిన్నసైజు | ... | 0 | 12 |
| సదాముక్తిసుధార్ణవము | ... | 0 | 8 |
| హఠయోగప్రదీపిక | ... | 2 | 8 |

## వైద్యగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| అజీర్ణమంజరి, ఆంధ్రటీకాసహితము | ... | 0 | 4 |
| అనుపానమంజరి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 8 |
| అష్టాంగహృదయము, సూత్రస్థానము | ... | 6 | 0 |
| డిటో చికిత్సాకల్పస్థానములు | ... | 5 | 0 |
| డిటో శారీరనిదానస్థానములు | ... | 3 | 8 |
| డిటో ఉత్తరస్థానము | ... | 6 | 0 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| ఇలాజుల్ గుర్బా, యూనానివైద్యగ్రంథములలో మిక్కిలి యుత్తమమైనది, ఉర్దూకు తర్జుమా, కాలికోబైండు | ... | 3 | 0 |
| కాలజ్ఞానము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| కుమారతంత్రము, రావణకృతము | ... | 0 | 6 |
| గదనిగ్రహము, సోఢలకృతము, సాంధ్రతాత్పర్యము | ... | 2 | 8 |
| చక్రదత్త, ఆంధ్రతాత్పర్యము | ... | 3 | 12 |
| చరకము, సూత్రస్థానము, తాత్పర్యసహితము | ... | 6 | 0 |
| చరకము, నిదాన, విమాన, శారీర, ఇంద్రియస్థానములు | ... | 5 | 0 |
| చికిత్సాసారము, ఆంధ్రతాత్పర్యము | ... | 2 | 8 |
| ధన్వంతరినిఘంటువు, సాంధ్రతాత్పర్యము | ... | 2 | 8 |
| నాడీజ్ఞానము, సాంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 4 |
| బసవరాజీయము, ఆంధ్రతాత్పర్యసహితము, మేలుప్రతి | ... | 7 | 0 |
| భేషజకల్పము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 6 |
| మాధవనిదానము, ఆంధ్రవ్యాఖ్యానసహితము | ... | 3 | 0 |
| మశూచికము, (Small-pox) | ... | 0 | 4 |
| రసప్రదీపిక, పద్యకావ్యము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 12 |
| రాజమార్తాండము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 10 |
| లోలంబరాజీయము, (సద్వైద్యజీవనము) | ... | 0 | 8 |
| వస్తుగుణమహోదధి, (తెనుఁగువచనము) | ... | 5 | 0 |
| విషవైద్యచింతామణి, సాంధ్రతాత్పర్యము | ... | 2 | 0 |
| వంధ్యాతంత్రము ,, | ... | 0 | 8 |
| వృక్షాయుర్వేదము ,, | ... | 0 | 4 |
| వైద్యశతశ్లోకి ,, | ... | 0 | 6 |
| శార్ఙ్గధరసంహిత, క్రొత్తకూర్పు ,, | ... | 3 | 0 |
| శార్ఙ్గధరత్రిశతి ,, | ... | 0 | 8 |
| సుశ్రుతశారీరము ,, | ... | 2 | 0 |
| షడ్రసనిఘంటువు, అభిధానరత్నమాల | ... | 0 | 12 |
| సహదేవపశువైద్యశాస్త్రము, తాత్పర్యసహితము | ... | 0 | 6 |
| సర్వౌషధిగుణకల్పకము, సాంధ్రతాత్పర్యము | ... | 2 | 8 |

## వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, మదరాసు.

శ్రీ ర స్తు.

# చరకసంహిత

## ఆంధ్రవ్యాఖ్యానసహితము.

# చికిత్సాస్థానము

## ప్రథమాధ్యాయము—ప్రథమపాదము.

మూలము. అథాతోఽభయామలకీయం రసాయనపాదం
వ్యాఖ్యాస్యామః. 1
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. 2

వ్యాఖ్యానప్రారంభము.

శ్లో. యద్ధ్యానామృతసారం పాయంపాయం రసాయనం మనసా,
సంసృతిముక్తాః కృతినో యాన్త్యానన్దం పరం తమాకలయే.
యోగేన మానసభవం మలినం తథైవ వాచోఽపి శబ్దవితతేరనుశాసనేన,
శారీరకం త్వమలవైద్యకబోధనేన యోఽపాకరోద్భువి పతఞ్జలిమానతస్తమ్.
బ్రహ్మాణం దక్షమహిం బలసూదనమశ్వినౌ భరద్వాజమ్,
నత్వా చరకచికిత్సా వ్యాక్రియతే భగవతః కృపాలేశాత్.
స ఏవ పూర్ణాం చరకస్య కౌముదీం వ్యాఖ్యాం తనోత్యార్యజనోపయోగినీమ్,
స విశ్వనాథో లఘుధీరయం స్వయం విమోహమాయాన్తి చ యత్ర యోగినః.
గైర్వాణ్యా బహుభిరియం వ్యాఖ్యాతా చరకసంహితా పూర్వైః,
ఆన్ధ్రీ కౌముద్యాఖ్యా వ్యాఖ్యా క్రియతే మయా చికిత్సాయాః.

అవతరణిక:—పైస్థానమునందు రోగియొక్క యాయుఃపరిమాణమును నిర్ణయించుటకు సాధనములైన రిష్టలక్షణములు వివరింపబడినవి. అట్టి రిష్టలక్షణములు లేని రోగికి ఆయువును నిర్ణయించినపిదప ధర్మమునకును అర్థమునకును యశస్సునకును కారకమగు చికిత్స జేయవలసియుండును; కావున అట్టి చికిత్సావిధానమును దెలుపునట్టి

చికిత్సాస్థానము చెప్పబడును. అట్టి చికిత్స స్వస్థున కూర్జస్కరంబును, వ్యాధిప్రశమనంబునని రెండువిధములు. అందు తాత్కాలికవ్యాధిని వర్తకచికిత్సకన్న శాశ్వతికజరానివర్తకమైన యోజస్కరచికిత్సారూపమగు రసాయనప్రకరణము తొలుత జెప్పబడును.

వ్యా. ఇంద్రియస్థానమును చెప్పినపిదప చికిత్సాస్థానమును జెప్పదలంచి రసాయనాధ్యాయమునందలి అభయామలకీయము అనురసాయనపాదము (అభయామలకముల ప్రధానముగ జేసిన రసాయనచికిత్సను దెలుపునట్టి ప్రథమాధ్యాయ ప్రథమపాదము) ఆత్రేయు లుపదేశించినదానికి న్యూనాతిరేకము లేకుండునట్లు వివరింపబడునని యర్థము.

చికిత్సితపర్యాయనామములు.

మూ. చికిత్సితం వ్యాధిహరం పథ్యం సాధనమౌషధమ్,
ప్రాయశ్చిత్తం ప్రశమనం ప్రకృతిస్థాపనం హితమ్. 3
విద్యాద్భేషజనామాని

వ్యా. చికిత్సితము, వ్యాధిహరము (రోగములహరించునది), పథ్యము (హితమైనది), సాధనము (ఆరోగ్యమును సంపాదింప సాధనము), ఔషధము, ప్రాయశ్చిత్తము (ధర్మశాస్త్రవిహితప్రాయశ్చిత్తవిధానము అధర్మమును హరించువిధముగ వైద్యశాస్త్రవిహితచికిత్సయు అధర్మజన్యమగురోగమును హరించునుగాన ప్రాయశ్చిత్తశబ్దముచే జెప్పబడును). ప్రశమనము (వ్యాధిని శమించునది), ప్రకృతిస్థాపనము (ఆరోగ్యమును కల్గించునది),హితము, అను నీపదములు భేషజము అనునర్థమునకు పర్యాయవాచకములుగ నుండును.

(చికిత్సాసామాన్యలక్షణము సూత్రస్థానమున నీతంత్రకారు లిట్లు చెప్పిరి:—
"చతుర్ణాం భిషగాదీనాం శస్తానాం ధాతువైకృతే, ప్రవృత్తిర్ధాతుసామ్యార్థా చికిత్సేత్యభిధీయతే" వైద్యుడు, ద్రవ్యములు, పరిచారకుడు, రోగి యనునాల్గును పాదములు. ఈనాల్గిటికిని వేరువేరుగ నాలుగేసి గుణములవంతున పదునారుగుణములు చెప్పబడినవి. అట్టి పదునారుగుణములతోగూడిన వైద్యాదిపాదచతుష్టయంబును విషమస్థితి నుండు ధాతువుల సమస్థితికి దెచ్చుటకై జూపు తమతమ వ్యాపారము చికిత్స యనబడును. అట్టి షోడశగుణవిశిష్టమైన వైద్యాదిపాదచతుష్టయవ్యాపారరూపమైన చికిత్స నెగనబరచిన వ్యాధిహరాదిపర్యాయపదములచే నీతంత్రమున వ్యవహరింపబడునని భావము. అట్టి చికిత్సాంతర్భూతమై యంగమైన స్థావరజంగమరూపద్రవ్యంబును భేషజశబ్దముచే జెప్పబడును.)

## భేషజద్వైవిధ్యము.

మూ. భేషజం ద్వివిధం చ తత్,
స్వస్థస్యోర్జస్కరం కిఞ్చిత్ కిఞ్చిదార్తస్య రోగనుత్. 4

వ్యా. పైజెప్పబడిన భేషజము రెండువిధముల నుండును. జ్వరాదిరోగములు లేక స్వస్థతనుండువారికి బలమును కల్గించునది యొకటి. వేరొకటి జ్వరాదిరోగపీడితులకుగల రోగముల హరించునది. (రోగరహితుడుగ గనబడుచుండురోగికి మనుజసామాన్యముగ స్వాభావికముగ సంభవించువ్యాధియైన జర (ముసలితనము) అను స్వాభావికరోగమును హరించియు (ఇది రసాయనము), సంభోగశక్తి క్షీణించినవారి కింద్రియపాటవమును కల్గించియు (ఇది వృష్యము వాజీకరణము.) బలమును కల్గించుటంజేసి స్వస్థున కూర్జస్కరము మొదటిచికిత్స యనియు; స్వాభావికములుకాని జ్వరాదిరోగముల నివర్తింపజేయునది రెండవది యనియును భావము.)

## అభేషజద్వైవిధ్యము.

మూ. అభేషజం చ ద్వివిధం బాధనం సానుబాధనమ్,

వ్యా. అభేషజము (హితకరముకాని యౌషధము. ఇదియే అపథ్యము) తత్కాలమున మాత్రము బాధించునది బాధనమనియు, శరీరముననే జీర్ణించి దీర్ఘకాల మనుసరించియుండు కుష్ఠాదిరోగముల గల్గించునది సానుబాధనమనియు రెండువిధములు.

## ద్వివిధభేషజవివరణము.

మూ. స్వస్థస్యోర్జస్కరం యత్తు తద్వృష్యం తద్రసాయనమ్.  5
ప్రాయః; ప్రాయేణ రోగాణాం ద్వితీయం ప్రశమే మతమ్,
ప్రాయశ్శబ్దో విశేషార్థో హ్యుభయం హ్యుభయార్థకృత్.  6

వ్యా. పైజెప్పబడిన రెండువిధములైన యౌషధములతో స్వస్థోర్జస్కరమనునది విశేషముగ వృష్యంబును, రసాయనంబునై యుండును. (అధికముగ వృష్యంబును రసాయనంబునై సామాన్యముగ జ్వరాదిరోగముల శమించునదిగ నుండునని భావము.) వ్యాధిప్రశమనమను రెండవ యౌషధము విశేషముగ వ్యాధుల శమించునదియు, సామాన్యముగ రసాయనంబును వృష్యంబునై యుండును. ఇచ్చట "ప్రాయః" అనుపదమునకు విశేషముగ నని యర్థము. ఔషధములన్నియు పైజెప్పిన ఊర్జస్కర-వ్యాధిప్రశమనరూప కృత్యముల రెండిటిని చేయుచుండును. (అయినను, విశేషముగ వృష్యరసాయనకృత్యముల జేయుచు వ్యాధిని శమింపజేయునది యూర్జస్కరమనియు, విశేషముగ వ్యాధుల

శమింపజేయుచు సామాన్యముగ వృష్య-రసాయనము లైనవి వ్యాధిహరమనియు వ్యవహరింపబడునని భావము.)

—రసాయనమున గల్గుప్రయోజనము.—

మూ. దీర్ఘమాయుః స్మృతిం మేధాం ఆరోగ్యం తరుణం వయః,
ప్రభావర్ణస్వరౌదార్యం దేహేన్ద్రియబలం పరమ్. 7
వాక్సిద్ధిం ప్రణతిం (వృషతాం) కాన్తిం లభతే నా రసాయనాత్,
లాభోపాయో హి శస్తానాం రసాదీనాం రసాయనమ్. 8

వ్యా. ప్రశస్తములగు రసరక్తాదిధాతువులను పొందుటకు సాధనమైన యౌషధము రసాయనమునాబరగును. అట్టి రసాయనముల సేవించుటవలన మనుజులకు దీర్ఘకాలాయుష్యంబును, స్మృతి (జ్ఞాపకశక్తి)యు, మేధయు (బుద్ధిబలంబును), ఆరోగ్యంబును, యౌవనవయస్సును, మంచి శరీరకాంతియు మంచి శరీరవర్ణంబును, మంచి కంఠస్వరంబును, శరీరమునకును ఇంద్రియములకును ప్రశస్తమైన బలంబును, వ్యర్థముకాని వాగ్బలంబును, లోకమున పూజ్యతయు (లేక వీర్యపుష్టియు), ఇవి యన్నియు నలవడును.

"రసానాం (ప్రశస్త రక్తాదిధాతూనాం) అయనం (ప్రాప్తిసాధనం) రసాయనమ్" అనువ్యుత్పత్తిచేత నిర్దుష్టములగు రసాదిధాతువుల గల్గించి పుష్టినొందింప సాధనమైనయౌషధము రసాయన మనబడును. అట్టి రసాయనముల సేవించుటచేత ధాతువులు పరిశుద్ధములై వృద్ధినొందును. దానం జేసి మనుజులకు నాయుర్వృద్ధి మున్నగు పైజెప్పబడిన గుణములన్నియు స్వయముగనే సిద్ధించును. కావున పైజెప్పిన యాయుర్వృద్ధి మున్నగు ప్రశస్తగుణముల కన్నిటికిని రసాయనము కారణమగునని ఫలితార్థము.)

—వాజీకరణసేవనఫలము.—

మూ. అపత్యసన్తానకరం యత్సద్యః సంప్రహర్షణమ్,
వాజీవాఽతిబలో యేన యాత్యప్రతిహతః స్త్రియః. 9
భవత్యతిప్రియః స్త్రీణాం యేన యేనోపచీయతే,
జీర్యతోఽప్యక్షయం శుక్రం ఫలవద్యేన దృశ్యతే. 10
ప్రభూతశాఖశ్శాఖీవ యేన చైత్యో యథా మహాన్,
భవత్యర్చ్యో (భవత్యర్ఘ్యో) బహుమతః ప్రజానాం సుబహుప్రజః
సన్తానమూలం యేనేహ ప్రేత్య చానన్త్యమశ్నుతే,
యశశ్శ్రియం బలం పుష్టిం వాజీకరణమేవ తత్. 12

వ్యా. ఏయౌషధమును సేవించుటవలన పుత్ర-పౌత్ర-ప్రపౌత్రాదిరూపముగ సంతతి యవిచ్ఛిన్నముగ వృద్ధినందునో, ఏయౌషధమువలన సేవించిన వెంటనే సంభోగ విషయక కుతూహలము బొడమునో, ఏయౌషధమువలన మిక్కిలి బలవంతుడై గుఱ్ఱము బోలె నిరంకుశముగ స్త్రీలనుబొంద సమర్థుడును, అప్రతిహతసంభోగశక్తి కల్గియుండుటం జేసి స్త్రీలకు ప్రీతిపాత్రుండునునై శరీరము పుష్టినొంది యౌవనము జీర్ణించినను శుక్రము క్షీణించక ఫలవంతమై (పుత్రో)త్పాదనసమర్థమై యుండునో, అయ్యది వాజీకరణౌషధ మని చెప్పబడును.

మరియు నేయౌషధముచేత మానవుడు విశాలములగు ననేక శాఖోప శాఖలు కల్గి దేవాయతనముననుండు గొప్పవృక్షముబోలె ననేకసంతానమును (పుత్ర పౌత్రాదిసంతతిని) బడసి, ప్రజలకు మిక్కిలి పూజ్యత వహించి మిక్కిలి యిష్టుడును; అట్టి సంతానమును కారణముగ జేసి యిహపరలోకములయందు ననంతసుఖమును, కీర్తి సంపదలను శరీరపుష్టిని బుద్ధిబలమును పొందగలవాడు నగునో, అట్టి యౌషధంబు వాజీ కరణ మనబడును.

ఇచ్చట "భవత్యతిప్రియః స్త్రీణాం" అనుచోట వాజీకరణసేవనమునం జేసి శుక్రము మిక్కిలి వృద్ధినొంది సంభోగశక్తి నిరాఘాటముగ నుండుటవలన సంభోగ ప్రియలగు స్త్రీలకు ముఖ్యముగ ప్రీతిపాత్రుడగునని భావము. ఈవిషయము తంత్రాంతర మున సాభిప్రాయముగ నిట్లు సూచింపబడినది:—"విరూపమపి యోద్ధారం భృత్యమిచ్ఛన్తి పార్థివాః, వ్యవాయ వ్యాయతం మూర్ఖం ధృష్టం పతిమివ స్త్రియః" "అపత్య సంతాన కరమ్" అనుచోట పుత్రపౌత్రాదిపరంపరారూపముగ నవిచ్ఛిన్నసంతతికరమని యర్థము.)

## చికిత్సితార్థము.

మూ. స్వస్థస్యోర్జస్కరం త్వేతత్ ద్వివిధం ప్రోక్తమౌషధమ్,
యద్వ్యాధినిర్ఘాతకరం వక్ష్యతే తచ్చికిత్సితే. 13
చికిత్సితార్థ ఏతావాన్ వికారాణాం యదౌషధమ్,
రసాయనవిధిశ్చాగ్రే వాజీకరణమేవ చ. 14

వ్యా. వ్యాధిలేక స్వస్థత నుండువానికి ప్రాశస్త్యమును కల్గించునది 'స్వస్థస్య ఊర్జ స్కరమ్' అయ్యది పైని వివరించినరీతిగ రసాయన-వాజీకరణభేదములచే రెండువిధములని చెప్పబడినది. వ్యాధిహరమగునౌషధము జ్వరచికిత్సితమున వివరింపబడును. చికిత్సితమన వికారముల నుద్దేశించి యే యౌషధము ప్రయోగింపబడునో అది చికిత్సితశబ్దార్థమగును. అందు రసాయనవాజీకరణవిధానములు తొలుత జెప్పబడును.

ఇచ్చట నీసంగ్రహము నెఱుంగునది:—పదునారువిధములైన గుణములతోఁగూడి వైద్య-ద్రవ్య-పరిచారక-రోగులు ధాతువుల సమస్థితికి దెచ్చుటకై ప్రవర్తించుట చికిత్స యనబడును. అదియే చికిత్సితాదిపర్యాయపదములచే వ్యవహరింపబడును. అట్టి సాంకేతికభేషజమునకు స్థావరజంగమరూపములగు ద్రవ్యములును అంగభూతములు కావున నట్టి చికిత్సోపయోగ్యౌషధద్రవ్యములును ఔపచారికముగ భేషజశబ్దముచే బిలువంబడును. అట్టి భేషజము స్వస్థోర్జస్కరమనియు, (జ్వరాది)వ్యాధిహరమనియు రెండువిధముల నుండును. అందు ఊర్జస్కరము అను భేషజము వృష్యమనియు రసాయనమనియు రెండువిధములు. (వృష్యమే వాజీకరమనియు జెప్పబడును). అందు ఊర్జస్కరము అను భేషజము (రసాయనవాజీకరములు) ఈక్రింద జెప్పబడును. వ్యాధిహరరూపమైన రెండవభేషజము జ్వరాదిచికిత్సయందు చెప్పబడునని ప్రకరణార్థము.

### అభేషజవివరణము.

మూ. అభేషజమితి జ్ఞేయం విపరీతం యదౌషధాత్,
తదసేవ్యం, నిషేవ్యం తు ప్రవక్ష్యామి యదౌషధమ్. 15

వ్యా. భేషజమునకు జెప్పినలక్షణమునకు విరుద్ధమైనది అభేషజ మనబడును. (ధాతువైపరీత్యమున ధాతుసామ్యమునకై ప్రవర్తించునది యౌషధము కావున దానికి విపరీతముగ ధాతువైపరీత్యమును గల్గించునది అభేషజమని భావము.) అట్టి యభేషజమును సేవింపందగదు. ఈక్రింద జెప్పబడు ఔషధమును (విధ్యుక్తముగ) సేవింపందగును.

### రసాయనప్రయోగద్వైవిధ్యము.

మూ. రసాయనానాం ద్వివిధం ప్రయోగమృషయో విదుః,
కుటీప్రావేశికం చైవ వాతాతపికమేవ చ. 16

వ్యా. పలుదెఱంగులైన రసాయనౌషధములప్రయోగము కుటీప్రావేశికము వాతాతపికము నను నీరెండుతెఱంగుల నుండునని మునివరులు తలచెదరు. (కుటి యన—చిన్న గుడిసె; గుడిసెలో ప్రవేశించి యందు నివసించుచు సేవింపబడిన రసాయనవిధానము కుటీప్రావేశికము. గాలిని ఎండను సేవించుచు నాచరింపబడు రసాయనసేవనము వాతాతపికమునని యెఱుంగునది.)

### కుటీప్రావేశికరసాయనవిధి, అందు కుటీనిర్మాణము.

మూ. కుటీప్రావేశికస్యాదౌ విధిస్సముపదేక్ష్యతే,
నృపవైద్యద్విజాతీనాం సాధూనాం పుణ్యకర్మణామ్. 17

నివాసే నిర్భయే శస్తే ప్రాప్యోపకరణే పురే,
దిశి పూర్వోత్తరస్యాం చ సుభూమౌ కారయేత్కుటీమ్. 18
విస్తారోత్సేధసమ్పన్నాం త్రిగర్భాం సూక్ష్మలోచనామ్,
ఘనభిత్తిమృతుసుఖాం సుస్పష్టాం మనసః ప్రియామ్. 19
శబ్దాదీనామశస్తానాం అగమ్యాం స్త్రీవివర్జితామ్,
ఇష్టోపకరణోపేతాం సజ్జవైద్యౌషధద్విజామ్. 20

వ్యా. పైజెప్పిన రెండువిధములైన రసాయనములలో కుటీప్రావేశికవిధానము ఈ క్రింద జెప్పబడును:— ప్రభువులును, వైద్యులును, బ్రాహ్మణులును, సాధువులును, పుణ్యకర్మలజేయువారును నివసించునదియు, ఏవిధమైన భయమున కవకాశము లేనిదియు, ప్రశస్తంబును, రసాయనవిధికి ఆవశ్యకము లగునుపకరణములు సుఖముగ దొరకునదియు నగుపట్టణమున తూర్పుదిక్కునందైనను ఉత్తరపుదిక్కునయైనను సుఖకరమగు ప్రదేశమున రసాయనోపయోగ్యమైన కుటిని (గుడిసెను) నిర్మించవలెను. వైశాల్యంబును ఎత్తును కల్గి, మూడుగర్భగృహములతో గూడి, సూక్ష్మములగు రంధ్రములుకల్గి, లావైనగోడతో గూడి, తాత్కాలికఋతువునకు తగినట్లు సుఖకరంబును, సంబాధములేక మనస్సునకు రమ్యంబును, అప్రశస్తములగు శబ్దస్పర్శాదుల ప్రవేశము లేనిదియు, స్త్రీలులేనిదియు, ఆవసరమైన సామగ్రులన్నియు కల్గినదియు, వైద్యులును చికిత్సోపయుక్తంబు లగునౌషధులును బ్రాహ్మణులును సిద్ధముగ నుండునదియు నగునట్లు నిర్మింపనగును.

### కుటీప్రవేశయుక్తకాలము.

మూ. అథోదగయనే శుక్లే తిథినక్షత్రపూజితే,
ముహూర్తకరణోపేతే ప్రశస్తే కృతవాపనః. 21
ధృతిస్మృతిబలం కృత్వా శ్రద్ధధానః సమాహితః,
విధూయ మానసాన్ దోషాన్ మైత్రీం భూతేషు చిన్తయన్. 22
దేవతాః పూజయిత్వాగ్రే ద్విజాతీంశ్చ ప్రదక్షిణమ్,
దేవగోబ్రాహ్మణాన్ కృత్వా తతస్తాం ప్రవిశేత్కుటీమ్. 23
తస్యాం సంశోధనైశ్శుద్ధః సుఖీ జాతబలః పునః,
రసాయనంప్రయుఞ్జీత తత్ప్రవక్ష్యామి(తతో వక్ష్యామి) శోధనమ్.

వ్యా. పైజెప్పినరీతిగ కుటీనిర్మాణము జేసినపిదప ఉత్తరాయణమున శుక్లపక్షమున ప్రశస్తములగు తిథి-నక్షత్ర-ముహూర్త-కరణములతోగూడిన ప్రశస్తదినమునందు, రసా

యనము జేసికొనదలచినమానవుడు క్షౌరమును జేసికొని ధృతిస్మృతిబలమును కల్గి, మిక్కి
శ్రద్ధతో గూడి, మనస్సును ఏకాగ్రముగ నుంచుకొని, కామ-క్రోధ-లోభ-మో
మద-మాత్సర్యములను మానసికదోషముల వదలి, సకలప్రాణులయందును మిత్రత్వ
జూపుచు, తొలుత దేవతలను పిదప బ్రాహ్మణులను చక్కగ బూజించి, దేవతలకును గ
లకును బ్రాహ్మణులకును ప్రదక్షిణముచేసి, పిమ్మట పైజెప్పిన కుటీరమున బ్రవేశించవ
పిమ్మట సంశోధనౌషధములచే వమన-విరేచన-ఆస్థాపన - శిరోవిరేచనరూపశోధనముల
కొని దోషనిర్ముక్తుడైన పిదప, సంశోధనముచే గల్గినబలహీనము నానాట తగ్గి బలమ
రోగములులేక సుఖముగ నుండుమనుజుడు పైజెప్పిన గుడిసెలోనేయుండి రసాయనవ
ప్రయోగించవలెను. అట్టి సంశోధనవిధి క్రింద చెప్పబడును.

ఇచ్చట "సంశోధనైశ్శుద్ధః" అనుబహువచనముచేత వమనవిరేచనాది సంశ
నములన్నియు చేయదగునని కొందరు అర్థముచేసెదరు. రసాయనమునందు క్రింద చె
బడు హరీతక్యాదిసంశోధనమే యౌగికముగ నుండును కావున నీసంశోధనము మాత్ర
చేయదగుననియు, నిర్మలముగ శుద్ధుడగునందాక యెన్నిపర్యాయములైనను హరీతకా
సంశోధనమును పలుమా రుపయోగించుటకై 'సంశోధనైః' అనుబహువచనము చెప్ప
నది యనియు కొందరాచార్యులు చెప్పెదరు.

రసాయనమునకు పూర్వము సంశోధనవిధి.

మూ. హరీతకీనాం చూర్ణాని సైన్ధవామలకే గుడమ్,
వచాం విడఙ్గం రజనీం పిప్పలీం విశ్వభేషజమ్.
పిబేదుష్ణామ్బునా జన్తుః స్నేహస్వేదోపపాదితః,
తేన శుద్ధశరీరాయ కృతసంసర్జనాయ చ.
త్రిరాత్రం యావకం దద్యాత్ పఞ్చాహం వాపి సర్పిషా,
సప్తాహం వా పురాణస్య యావచ్ఛుద్ధేస్తు వర్చసః.
శుద్ధకోష్ఠం తు తం జ్ఞాత్వా రసాయనముపాచరేత్,
వయః ప్రకృతిసాత్మ్యజ్ఞో యౌగికం యస్య యద్భవేత్.

వ్యా. రసాయనమును సేవించవలసినమనుజుడు తొలుతస్నేహస్వేదవిధులను వి
క్తప్రకారముగ నాచరించి పిదప—కరకకాయలు, సైంధవలవణము, ఉసిరికకాయ
వస, వాయువిడంగములు, పసుపు, పిప్పళ్లు, శుంఠి వీనినన్నిటిని సమభాగముగ చే
చూర్ణముజేసి యందు బెల్లము కలిపి ఉష్ణోదకమున జేర్చి త్రాగవలెను. అట్టి యా

పానముచే విరేచనమూలముగ శుద్ధమైన శరీరముకలవానికి సంసర్జనవిధిప్రకారము (పేయాదిక్రమముగ) నాహారమును విధ్యుక్తప్రకారము ఆచరింపజేసిన పిదప చక్కగ శుద్ధమైన కోష్ఠముకలవాడై యున్నచో మూడురాత్రులవరకును, మధ్యమముగ శుద్ధమైన కోష్ఠము కల్గియున్నచో నైదురాత్రులవరకును, హీనముగ శుద్ధమైనకోష్ఠము కల్గియున్నచో నేడురాత్రులవరకును యవాన్నమును ఆహారముగ వానికి నిడవలెను. మరియు పురాణ (ప్రాత) మలము నివర్తించి కోష్ఠము శుద్ధమగునందాక వానికి యవాన్నమునే పెట్టవలెను.

పిమ్మట పైజెప్పినవిధానముచే పరిశుద్ధమైన కోష్ఠము కల్గినపిదప వానివయస్సును, ప్రకృతిని, సాత్మ్యమును చక్కగ నెరింగి, ఏపనికి ఏరసాయనము యోగికముగ నుండునో అట్టి రసాయనమును సేవింప జేయనగును.

ఇచ్చట "కృతసంసర్జనాయ చ" అన్నచోట వమనవిరేచనములచే శుద్ధకోష్ఠునకు విధించిన "అథైనం సాయాహ్నే అపరేఽహ్ని .........సప్తరాత్రేణ ప్రకృతిభోజనమాగచ్ఛేత్" (సూత్రస్థాన. అధ్యాయ. ౧౫. సూత్ర. ౨౧—౨౮) ములచే జెప్పబడిన పేయాదిక్రమము నెఱుంగునది. ఈపేయాదిక్రమమే సిద్ధిస్థానమునను ఇట్లు తంత్రకారు లుపదేశించిరిః—"పేయాం విలేపీమకృతం కృతం చ యూషం రసం త్రిర్ద్విరథైకశశ్చ, క్రమేణ సేవేత విశుద్ధకాయః ప్రధానమధ్యావరశుద్ధిశుద్ధః" (సిద్ధి. అ. ౧. ౧౧-౧౨) దీనివివరణ మచ్చటనే చూచునది.

### హరీతకీ (కరకకాయల) గుణవీర్యాదులు.

మూ. హరీతకీం పఞ్చరసాముష్ణామలవణాం శివామ్,
దోషానులోమనీం లఘ్వీం విద్యాద్దీపనపాచనీమ్. 29
ఆయుష్యాం పౌష్టికీం ధన్యాం వయసః స్థాపనీం పరామ్,
సర్వరోగప్రశమనీం బుద్ధీన్ద్రియబలప్రదామ్. 30
కుష్ఠం గుల్మముదావర్తం శోషం పాణ్డ్వామయం మదమ్,
అర్శాంసి గ్రహణీదోషం పురాణం విషమజ్వరమ్. 31
హృద్రోగం సశిరోరోగం అతీసారమరోచకమ్,
కాసం ప్రమేహమానాహం ప్లీహానముదరం నవమ్. 32
కఫప్రసేకం వైస్వర్యం వైవర్ణ్యం కామలాన్ క్రిమీన్,
శ్వయథుం తమకంఛర్దిం క్లైబ్యమఙ్గావసాదనమ్. 33

స్రోతోవిబన్ధాన్ వివిధాన్ ప్రలేపం హృదయోరసోః,
స్మృతిబుద్ధిప్రమోహం చ జయేచ్ఛీఘ్రం హరీతకీ.
(అజీర్ణినో రూక్షభుజః స్త్రీమద్యవిషకర్శితాః,
సేవేరన్న (న్నా)భయా మేతే క్షుత్తృష్ణోష్ణార్దితాశ్చ యే.)

వ్యా. కరకకాయలు లవణరస మొక్కటిదక్క తక్కినమధురాదిరసము లైదిం
గల్గి, ఉష్ణవీర్యంబై వాతాదిదోషముల ననులోమముగ జేయునదియు, ప్ర
గుణముల గల్గియుండుటంజేసి మంగళకరంబును, లఘుగుణంబును, జఠరాగ్నిని జ్వలిం
జేసి యాహారమును పచనము నొందించునదియు నగును. మరియు నిది యాం
వును వృద్ధినందించును, పుష్టిని కల్గించును, మిగుల శ్రేష్ఠమైనది, యౌవనవయస్సును
ముగ నిలుపుటకు మిక్కిలి ప్రశస్తమైనది, రోగముల నన్నింటిని శమింపజేయును,
కిని ఇంద్రియములకును బలమును కల్గించును. కుష్ఠము, గుల్మము, ఉదావర్తము, శోష
(క్షయభేదము), పాండురోగము, మదము, అర్శోరోగము, గ్రహణిరోగము,
విషమజ్వరము, హృదయరోగము, శిరోరోగము, అతిసారము, అరోచకము, కాస
ప్రమేహము, ఆనాహము (కడుపుబ్బరము), ప్లీహవృద్ధిరోగము, నూతనముగను
మహోదరము, నోటివెంట కఫము వెడలుట, కంఠస్వరము మారియుండురోగము, కామ
రోగము, క్రిమిరోగము, వాపు, తమకశ్వాసము, వమనము, నపుంసకత్వము, అవ
ములనొప్పి,పలుదెరంగులైన స్రోతోబంధములు(స్రోతోమార్గములు అడ్డుపడియుండు
హృదయంబును రొమ్మును కఫముచే పూసినట్లుండుట, స్మృతియు బుద్ధియు మారియు
డుట, అను నీరోగముల నన్నింటిని కరకకాయలు శీఘ్రముగ హరించును. (మరి
అజీర్ణరోగము కలవారును, రూక్షములగు నన్నాదుల భుజించువారును, స్త్రీప్రసంగ
చేతను మద్యపానముచేతను విషసంబంధముచేతను మిక్కిలి కృశించినవారును, ఆకలి
లచే బీడింపబడినవారును, ఉష్ణపీడితులును కరకకాయల సేవింపదగదు.)

ఇచ్చట వేయివత్సరంబులును పదివేలవత్సరంబులును ఆయువును వృద్ధినంది
రసాయనద్రవ్యము లనేకములున్నను సర్వరోగహరణపూర్వకముగ నాయుర్వృద్ధి
ములు కరకకాయలును ఉసిరికకాయలును అగుటంజేసి రసాయనములలో శ్రేష్ఠము
తొలుత జెప్పబడినవి. అందును "ఆమలకం వయస్థాపనానాం" (సూ. అ. ౨౫-౪
అను వాక్యముచేత వయస్థాపనములలో నామలకముశ్రేష్ఠమని అగ్ర్యాధికారమున జెప్ప
న్నను, రోగహరములలో నామలకమునకన్న హరీతకీ యుత్తమమని తొలుత జెప
నంబడినది. మరియు కరక-ఉశిరికలు రెండును ఉత్పత్తికారణములైన మహాభూతస

విశేషప్రభావమునంజేసి లవణ మొక్కటిదక్క తక్కిన యైదురసముల గల్గియుండునని యెరుంగునది. మరియు నిది స్వాభావికముగ సర్వరోగహరమైనను కుష్ఠాదిరోగముల విశేషముగ హరించునని ప్రత్యేకముగ నిర్దేశింపబడినది. ఇయ్యది దోషప్రవర్తకమైనను అతిసారగ్రహణులయందు సంభవించు స్వల్పవిబంధమును శూలమును నివర్తింపజేయుటం జేసి గ్రహణ్యతిసారనివర్తకమని చెప్పబడినది. ఈవిషయ మిట్లు చెప్పబడినది:—"స్తోకం స్తోకం విబద్ధం వా సశూలం యోఽతిసార్యతే, అభయాపిప్పలీకల్కైః సుఖోష్ణైస్తం విరేచయేత్"

ఆమలక (ఉసిరికకాయల) గుణవీర్యకర్మములు.

మూ. తాన్ గుణాంస్తాని కర్మాణి విద్యాదామలకేష్వపి,
యాన్యుక్తాని హరీతక్యాః వీర్యస్య తు విపర్యయః. 36
అతశ్చామృతకల్పాని విద్యాత్కర్మభిరీదృశైః,
హరీతకీనాం శస్యాని భిషగామలకస్య చ. 37

వ్యా. కరకకాయల నుద్దేశించి యేగుణంబులును కర్మంబులును చెప్పబడినవియో అట్టిగుణకర్మములే ఉసిరికకాయలయందును కల్గియుండును.వీర్యముమాత్రము కరకకాయ కన్న వ్యత్యస్తముగ నుండును. (కరకకాయ లుష్ణవీర్యములు కావున దానికి వ్యతిరేకమైన శీతవీర్యము ఉసిరికకాయలయం దుండునని భావము.) మరియు విత్తనములు వేరుగ తీయబడిన కరకకాయలబెరడును ఉసిరికకాయలబెరడును పైజెప్పబడిన కర్మములజేయు శక్తి కల్గియుండుటంజేసి యవిరెండును అమృతతుల్యములని వైద్యు డెరుంగునది. (ఇచ్చట శస్యమన విత్తనముల వేరుగ తీయబడినకాయలని యెరుంగునది.)

ఓషధిగ్రహణవిధి గ్రాహ్యౌషధిలక్షణములును.

మూ. ఓషధీనాం పరా భూమిః హిమవాన్ శైలసత్తమః,
తస్మాత్ఫలాని తజ్జాని గ్రాహయేత్కాలజాని తు. 38
ఆపూర్ణరసవీర్యాణి కాలే కాలే యథావిధి,
ఆదిత్యపవనచ్ఛాయాసలిలప్రీణితాని చ. 39
యాన్యజగ్ధాన్యపూతీని నిర్వ్రణాన్యగదాని చ,
తేషాం ప్రయోగం వక్ష్యామి ఫలానాం కర్మ చోత్తమమ్. 40

వ్యా. పర్వతములలోశ్రేష్ఠమైన హిమాలయము ఓషధులకెల్ల మిగులశ్రేష్ఠమైనస్థలము. కావున నాపర్వతశ్రేష్ఠమునందు సకాలమున బుట్టి పూర్ణమైన రసవీర్యములు కల్గినవియు,

ఆయాకాలమున ఎండచేతను గాలిచేతను నీడచేతను జలముచేతను చక్కగ నాప్యాయత నొందినవియు, జంతువులచే తినబడక దుర్గంధము లేక వ్రణములు (పుప్పి) లేక యౌషధ యోగ్యమై ఫలపరిపాకకాలమున విధ్యుక్తప్రకారము గ్రహింపబడినవియు నగు కరక కాయల ప్రయోగించువిధంబును, వానిప్రయోగమున గల్గు నుత్తమకర్మంబును, ఈ క్రింద వివరింపబడును.

("హిమవానౌషధభూమీనాం" (సూ. అ. ౨౫-౪౬) అనుఅగ్ర్యాధికారవాక్యముచే హిమవంతము ఔషధముల కుత్తమభూమియని తెలియుచున్నను ఇచ్చట మరల "ఔషధీనాం పరా భూమిః...సత్తమః" అని చెప్పినది రసాయనౌషధములను హిమవంతమున పుట్టినవానినే గ్రహింపనగునని తెలియుటకని యెరుంగునది.)

### 1. బ్రాహ్మరసాయనము.

మూ. పఞ్చానాం పఞ్చమూలానాం భాగాన్ దశపలోన్మితాన్,
హరీతకీసహస్రం చ త్రిగుణామలకం నవమ్. 41
విదారిగన్ధాం బృహతీం పృశ్నిపర్ణీం నిదిగ్ధికామ్,
విద్యాద్విదారిగన్ధాద్యం శ్వదంష్ట్రాపఞ్చమం గణమ్. 42
బిల్వాగ్నిమన్థశ్యోనాకం కాశ్మర్యమథ పాటలామ్,
పునర్నవాం శూర్పపర్ణ్యౌ బలామేరణ్డమేవ చ. 43
జీవకర్షభకౌ మేదాం జీవన్తీం సశతావరీమ్,
శరేక్షుదర్భకాశానాం శాలీనాం మూలమేవ చ. 44
ఇత్యేషాం పఞ్చమూలానాం పఞ్చానాముపకల్పయేత్,
భాగాన్ యథోక్తాం స్తత్సర్వం సాధ్యం దశగుణేఽమ్భసి. 45
దశభాగావశేషం తు పూతం తం గ్రాహయేద్రసమ్,
హరీతకీశ్చ తాస్సర్వాః సర్వాణ్యామలకాని చ. 46
తాని సర్వాణ్యనస్థీని ఫలాన్యాపోథ్య కూర్చనైః,
వినీయ తస్మిన్నిర్యూహే చూర్ణానీమాని దాపయేత్. 47
మణ్డూకపర్ణ్యాః పిప్పల్యాః శఙ్ఖపుష్ప్యాః ప్లవస్య చ,
ముస్తానాం సవిడఙ్గానాం చన్దనాగురుణో స్తథా. 48
మధుకస్య హరిద్రాయాః వచాయాః కనకస్య చ,
భాగాంశ్చతుష్పలాన్ కృత్వా సూక్ష్మైలాయా స్త్వచ స్తథా. 49

సితోపలాసహస్రం చ చూర్ణితం తులయాధికం,
తైలస్య ద్వ్యాఢకం తత్ర దద్యాత్త్రీణి చ సర్పిషః. 50
సాధ్యమౌదుమ్బరే పాత్రే తత్సర్వం మృదునాగ్నినా,
జ్ఞాత్వా లేహమదగ్ధం చ శీతం క్షౌద్రేణ సంసృజేత్. 51
క్షౌద్రప్రమాణం స్నేహార్ధం తత్సర్వం ఘృతభాజనే,
తిష్ఠేత్సమ్మూర్ఛితం తస్య మాత్రాం కాలే ప్రయోజయేత్. 52
యా నోపరున్ధ్యాదాహారం ఏవం మాత్రా జరాం ప్రతి,
షష్టికః పయసా చాత్ర జీర్ణే భోజనమిష్యతే. 53
వైఖానసాః వాలఖిల్యాః తథా చాన్యే తపోధనాః,
రసాయనమిదం ప్రాశ్య (ప్య) బభూవురమితాయుషః. 54
భుక్త్వా జీర్ణం వపుశ్చాగ్ర్యం అవాపుస్తరుణం వయః,
వీతతన్ద్రాక్లమశ్వాసాః నిరాతఙ్కాస్సమాహితాః. 55
మేధాస్మృతిబలోపేతాః చిరరాత్రం తపోధనాః,
బ్రాహ్మం తపో బ్రహ్మచర్యం చేరుశ్చాత్యన్తనిష్ఠయా. 56
రసాయనమిదం బ్రాహ్మమాయుష్కామః ప్రయోజయేత్,
దీర్ఘమాయుః వయశ్చాగ్ర్యం కామాంశ్చేష్టాన్ సమశ్నుతే. 57

(ఇతి బ్రాహ్మరసాయనమ్.)

వ్యా. ఐదువిధములైన పంచమూలముల నైదిటిని ఒక్కొక ద్రవ్యమును పదేసిపలముల వంతునను, చక్కగ పండి యెండినకరకకాయలు వెయ్యి, మంచి క్రొత్తయుసిరికకాయలయు కరకకాయలవు మూడింతలు (మూడువేలు), ఇత్తెరంగున భాగముల గల్పించి యొకటిగ జేర్చునది.

(పంచమూల పంచకవివరణము)—ముయ్యాకుపొన్న, వాకుడు, కోలపొన్న, పెద్దములక, పల్లేరు ఇవియైదును చేరినగణము విదారిగంధాదిపంచమూలము. (ఈగణమే హ్రస్వపంచమూలమనియు చెప్పబడును.)

మారేడు, కూరసెల్లి, దుండిగపుచెట్టు, పెగ్గుమ్ముడు, కలిగొట్టు ఈయైదును చేరిన గణము బిల్వాదిపంచమూలమగును. (ఇదియే మహాపంచమూలములనియు చెప్పబడును.)

గలిజేరు, శూర్పపర్ణీద్వయము (అడవిపెసర, అడవిమినుప), బల (చిట్టాముట్టి), ఆముదపుచెట్టు (ఇవియైదును చేరినగణము బలాదిపంచమూలమనియు, మధ్యమపంచమూలమనియుం జెప్పనగును).

జీవకము, ఋషభకము, మేద, పాలకూర, పిల్లిపీచర (ఈయైదును చేరినగణము జీవనపంచమూల మనబడును).

కుశదర్భ, చెరకు, దర్భ, రెల్లుదర్భ, వరిపైరు (ఈయైదిటిమూలములు చేరినగణము తృణపంచమూల మనబడును.)

పైజెప్పబడిన ఐదుతెరంగులైన పంచమూలగణములయందలి ద్రవ్యములను, కరక-ఉసిరికకాయలను పైజెప్పినభాగప్రకారముచేర్చి అట్టి ద్రవ్యమునకు పదింతలు నీళ్లుబోసి, పదియవపాలు మిగులునట్లు కషాయమును విధ్యుక్తప్రకారను కాచి యాకషాయమును వడకట్టియుంచునది. మరియు నాకషాయమున పక్వమైన కరకకాయలను, ఉసిరికకాయలను గ్రహించి, యందలివిత్తనముల వేరుపరచి దూరంబుచ్చి పక్వమైన పైబెరడును గ్రహించి రాతిపైన మెత్తగ నూరి పైజెప్పబడిన కషాయమున జేర్పనగును.

పిమ్మట:—సరస్వతియాకు, పిప్పళ్లు, శంఖపుష్పి, ప్లవము (కైవర్తముస్తలు-తుంగగెడ్డలలోభేదము), వాయువిడంగములు, చందనము, అగరు, అతిమధురము, పసుపు, వస, నాగకేసరములు, పిన్నయేలకులు, లవంగపుపట్ట (దాల్చినిచెక్క), ఇవియన్నియు ప్రత్యేకము నాలుగేసి పలములును; పదునొకండువందలపలములు శీనాకలకండయు నుండునట్లు భాగముల గల్పించి అన్నిటిని చూర్ణముచేసి యాచూర్ణమును, రెండుఆఢకములు నువ్వులనూనెను, మూడు ఆఢకములు ఆవునెయ్యిని, (వీని నన్నిటిని) పైజెప్పిన (హారీతకీ ఆమలకచూర్ణముతోగూడిన) కషాయమున గూర్చి తామ్రపాత్రములో బోసి సన్నని మంటయందు (లేహపాకవిధిప్రకారము) పక్వముజేయునది. ఇత్తెరంగున నాలేహము అడుగంటకుండునట్లు గమనముతో పక్వముజేసి దించి చల్లారినపిదప పైజెప్పిన నువ్వులనూనెపరిమితిలో సగపాలు (ఒక ఆఢకము) మంచితేనెను లేహములో జేర్చి, యాలేహమును నేతితో మాగినకుండయందు పదిలముగ నునిచి, చక్కగ మాగునంతకాలము ధాన్యరాశిలో బెట్టి, యుక్తమైనకాలమున ఆకలికిని వయసునకును తగినట్లు జీర్ణమగునంత పరిమాణమును గల్పించి సేవింపనగును. లేహప్రమాణము మధ్యాహ్నహారమును అడ్డుపరుపక జీర్ణమై యాకలి బుట్టించునట్లు కల్పింపనగును. ఆయౌషధము జీర్ణమైన పిదప అరువదినాళ్ల సంబావుబియ్యపు అన్నమును ఆవుపాలతో భుజింపవలెను.

మరియు నీరసాయనమును సేవించి వైఖానసులును వాలఖిల్యులును తపోధనులైన యితరమహర్షులును మితిమీరిన యాయుపునొంది ముసలిశరీరమును విడచి యౌవనపూర్ణమైనవయసు నొంది, తొట్రుబాటును బడలికయు ఆయాసంబును లేక, వ్యాధివిముక్తులై, చిత్తైకాగ్రత కలిగి, మేధాశక్తియు జ్ఞాపకశక్తియు కల్గి, బ్రహ్మచర్యము నవలంబించి, మనోబలము కలవారై, చాలకాలము బ్రహ్మనవలంబించిన తపంబాచరించిరి. కావున నిది బ్రాహ్మరసాయన మనబడును. అట్టి యీరసాయనమును దీర్ఘకాలము ఆయువును యౌవనమును కోరువారందరును సేవింపనగును.

## 2. ద్వితీయబ్రాహ్మరసాయనము.

మూ. యథోక్తగుణానామామలకానాం సహస్రం పిష్ట్వాస్వేదనవిధినా పయస ఊష్మణా సుస్విన్నమనాతపశుష్కం అనస్థి చూర్ణయేత్. తదామలకసహస్రస్య రసపరిపీతం—స్థిరా పునర్నవా జీవన్తీ నాగబలా బ్రహ్మసువర్చలా మణ్డూకపర్ణీ శతావరీ శఙ్ఖపుష్పీ పిప్పలీ వచావిడఙ్గస్వయఙ్గుప్త్యాఽమృతా చన్దనాగురుమధుకమధూకపుష్పోత్పలపద్మమాలతీ యువతీయూథికాచూర్ణాఽష్టభాగసంయుక్తం, పునః నాగబలాసహస్రపలస్వరసపరిపీతమనాతపశుష్కం, ద్విగుణితసర్పిషా క్షౌద్రసర్పిషా క్షుద్రగుడాకృతిం కృత్వా, శుచౌ దృఢే ఘృతభావితే కుమ్భే భస్మరాశేరధః స్థాపయేత్ అన్తర్భూమేః పక్షం కృతరక్షావిధానం అథర్వవేదవిదా.

పక్షాత్యయే చోద్ధృత్య కనకరజతతామ్రప్రవాళకాలాయసచూర్ణాష్టభాగసంయుక్తం, అర్ధకర్షవృద్ధ్యా యథోక్తేన విధినా ప్రాతః ప్రాతః ప్రయుఞ్జానోఽగ్నిబలమభిసమీక్ష్య; జీర్ణే చ షష్టికం పయసాససర్పిష్కముపసేవమానః యథోక్తాన్ గుణాన్ సమశ్నుత ఇతి. 58

వ్యా. పైని "హరీతకీం పంచరసాం... తాన్ గుణాంస్తాని కర్మాణి విద్యాదామలకీష్వపి యాన్యుక్తాని హరీతక్యాః......భిషగామలకస్య చ" (౫-౩౭) అను గ్రంథముచే జెప్పబడినగుణములుకల వేయియుసిరిక కాయలను తెచ్చి, యొకపాత్రలో పాలు బోసి గుడ్డమున్నగువానిచే నాపాత్రను వాసెనగట్టి యాగుడ్డపై యుసిరిక కాయల నునిచి యాకాయలకు తగలకుండునట్లు మూతమూసి పొయిమీద బెట్టి యుడ్డెనమున్నగువాని నుడి

కించువిధముగ నాయావిరిచే నుడికించి చక్కగ నుడికినపిదప వెలికిం దీసి, నీడనే చక్కగ నెండించి, వానివిత్తనముల విడదీసి పైబొబ్బెరను మాత్రము గ్రహించి చూర్ణము చేయునది. ఆచూర్ణమును వేయియుసిరికకాయలస్వరసమున విధ్యుక్తప్రకారము ఆరసమంతయు చూర్ణమునం దిముడునట్లు భావనచేయునది.

పిమ్మట—ముయ్యాకుపొన్న, గలిజేరు, పాలకూర (మనుబాల-లేక పాలగురుగు), జిబిలిక, బ్రహ్మసువర్చల (ఆదిత్యభక్తి-ప్రొద్దుతిరుగుడుచెట్టు), మండూకపర్ణి (వల్లారియాకు), పిల్లిపీచర, శంఖపుష్పి, (శంఖమువంటి యాకారము గలపువ్వుల బూయుచెట్టు) పిప్పళ్లు, వస, వాయువిడంగములు, దురదగొండి, తిప్పతీగె, శ్రీచందనము, అగరు, అతిమధురము, ఇప్పపువ్వులు, కలువలు, తామరపువ్వులు, జాజిపువ్వులు, ప్రేంకణము, అడవిమొల్లపువ్వులు, వీని నన్నింటి నొకటిగ చూర్ణముచేసి, పైజెప్పిన యుసిరికలచూర్ణమునకు నెనిమిదవవంతు ఉసిరికలచూర్ణమున కలిపి యుంచునది.

పిమ్మట జిబిలికస్వరసమును వేయిపలములు తీసి యందు పైజెప్పిన చూర్ణమును కలిపి యాస్వరసమంతయు చూర్ణమున నిముడునంతదనుక (విధిప్రకారము) భావనజేసి నీడ నెండించి యాచూర్ణమునకు రెట్టింత ఆవునెయ్యినైనను, తేనెతో గూడిన నేతినైనను కలిపి జెల్లపుపాకమువలె జేసి, నేతితోమాగి దృఢమైన పరిశుద్ధమైనమంటిపాత్రలో నునిచి భూమిలో గుంటత్రవ్వి యందు బూడిదెను బోసి యందు పైజెప్పిన యౌషధభాండము నునిచి పదిలముగ మూతమూసి గుంటను మూసి పదునైదుదినములవరకును అధర్వణవేదవేత్తలచే రక్షగట్టించి భద్రముగ కాపాడునట్లు చేయునది.

ఒకపక్షము (పదునైదుదినములు) కడచినపిదప నాయౌషధభాండమును వెలికిం దీసి యందు బంగరు వెండి తామ్రము పగడము ఉక్కు అనువానిభస్మములను, ఉసిరికల చూర్ణమునకు నెనిమిదవభాగమును కలిపి యాయౌషధమును అర్ధకర్షమువంతున ప్రతిదినమునను అగ్నిబలానుసారముగ ప్రాతఃకాలమున సేవించునది అట్టికాలమున కుటీప్రవేశక విధి ననుసరింపనగును. మరియు నాయౌషధము జీర్ణమైనపిదప అరువదినాళ్లసంబావుల బియ్యపుఅన్నమును పాలతోడను నేతితోడను కలిపి భుజించుచుండవలెను. ఇత్తెరంగున నీరసాయనమును సేవించినచో పైని బ్రాహ్మరసాయనసేవనమునకు జెప్పినగుణముల నొందగల్గును.

## ద్వితీయబ్రాహ్మరసాయనగుణములు.

భవన్తి చాత్ర:—

మూ. ఇదం రసాయనం బ్రాహ్మం మహర్షిగణసేవితమ్,
భవత్యరోగో దీర్ఘాయుః ప్రయుఞ్జానో మహాబలః. 59

కాన్తః ప్రజానాం సిద్ధార్థః చన్ద్రాదిత్యసమద్యుతిః,
శ్రుతం ధారయతే సత్త్వం ఆర్షం చాస్య ప్రవర్తతే. 60
ధరణీధరసారశ్చ వాయునా సమవిక్రమః,
స భవత్యవిషం చాస్య గాత్రే సమ్పద్యతే విషమ్. 61
(ఇతి ద్వితీయం బ్రాహ్మరసాయనమ్.)

వ్యా. పైజెప్పబడిన బ్రాహ్మరసాయనము మహర్షిగణముచే సేవింపబడినది. దీనిని సేవించుటవలన (పైజెప్పబడిన గుణములు కల్గుటయే కాక) రోగవిముక్తుడై దీర్ఘకాలమాయుష్యమునొంది మిక్కిలి యధికమైనబలము నొంది జనులకందరకును చూడ రమ్యమగు రూపముకల్గి తనమనోఽభీష్టముల సిద్ధినొంది సూర్యచంద్రులబోలె తేజస్సుకల్గియుండును. తాను ఒకతూరి వినినదానినెల్ల మనస్సున ధరించు ధారణాశక్తి కల్గియుండును. ఋషులతో సమానమైన మనోబలము కల్గియుండును. పర్వతములకు సారభూతమగు ఇనుముతో సమానమైనబలమును వాయువునకు సమమగు వేగంబును కల్గియుండును. అట్టిమనుజునిశరీరమున విషసంబంధము కల్గినను, అయ్యది తనప్రభావము నుడిగి పనిసేయ నేరకుండును. (ఇదియే రెండవ బ్రాహ్మరసాయనము.)

ఇచ్చట "ధరణీధరసారః" అన్న చోట "ధరణీధరస్య సారః-ధరణీధరసారః, ధరణీధరసారస్యేవ సారో యస్య" అనువిగ్రహముచేత పర్వతసారమైన లోహమువంటి పటుత్వము కల్గునని భావము.

## 3. చ్యవనప్రాశరసాయనము.

మూ. బిల్వోఽగ్నిమన్థశ్శ్యోనాకః కాశ్మర్యః పాటలిర్బలా,
పర్ణ్యశ్చతస్రః పిప్పల్యః శ్వదంష్ట్రా బృహతీద్వయమ్. 62
శృఙ్గీ తామలకీ ద్రాక్షా జీవన్తీ పుష్కరాగురు,
అభయా చామృతా ఋద్ధిః జీవకర్షభకౌ శటీ. 63
ముస్తం పునర్నవా మేదా సైలా చన్దనముత్పలం,
విదారీవృషమూలాని కాకోలీ కాకనాసికా. 64
ఏషాం పలోన్మితాన్ భాగాన్ శతాన్యామలకస్య చ,
పఞ్చ దద్యాత్తదైకధ్యం జలద్రోణే విపాచయేత్. 65
జ్ఞాత్వా గతరసాన్యేతాన్యౌషధాన్యథ తం రసం,
తచ్చామలకముద్ధృత్య నిష్కులం తైలసర్పిషోః. 66

పలద్వాదశకే భృష్ట్వా దత్వా చార్ధతులాం భిషక్,
మత్స్యణ్డికాయాః పూతాయాః లేహవత్సాధు సాధయేత్. 67
షట్పలం మధునశ్చాత్ర సిద్ధశీతే ప్రదాపయేత్,
చతుష్పలం తుగాక్షీర్యాః పిప్పలీద్విపలం తథా. 68
పలమేకం నిదధ్యాచ్చ త్వగేలాపత్రకేసరాత్,
ఇత్యయం చ్యవనప్రాశః పరముక్తో రసాయనః. 69
కాసశ్వాసహరశ్చైవ విశేషేణోపదిశ్యతే,
క్షీణక్షతానాం వృద్ధానాం బాలానాం చాఙ్గవర్ధనః. 70
స్వరక్షయమురోరోగం హృద్రోగం వాతశోణితం,
పిపాసాం మూత్రశుక్రస్థాం దోషాంశ్చాప్యపకర్షతి. 71
అస్య మాత్రాం ప్రయుఞ్జీత యోపరున్ధ్యాన్న భోజనం,
అస్య ప్రయోగాచ్చ్యవనః సువృద్ధోఽభూత్పునర్యువా. 72

వ్యా. మారేడువేళ్లు, కూరనెల్లివేళ్లు, పెద్దమ్రానువేళ్లు, పెగ్గుమ్మడు, కలిగొట్టుచెట్టువేళ్లు, చిట్టాముట్టివేళ్లు, పర్ణిచతుష్టయము (కోలపొన్న, ముయ్యాకుపొన్న, అడవిమినుము, అడవిపెసర అను నాల్గును చేరి పర్ణిచతుష్టయము), పిప్పళ్లు, పల్లేరువేళ్లు, బృహతీద్వయము (ములక, వాకుడు), కర్కాటకశృంగి, నేలయుసిరిక, ద్రాక్షపండు, పాలకూర, పుష్కరమూలము, అగరు, కరకకాయలు, తిప్పతీగె, ఋద్ధి, జీవకము, ఋషభకము, కచోరములు, తుంగగడ్డలు, గలిజేరు, మేద, ఏలకులు, మంచిగంధము, నల్లకలువలు, నేలగుమ్మడు, అడ్డసరమువేళ్లు, కాకోళి, కాకిదొండ ఇవి యన్నియు ప్రత్యేకమొక్కొకపల ముండునట్లు భాగముల గల్పించి నలియగొట్టి కుండలో నునిచి, అందు చక్కగ పండిన ఐదువందల యుసిరికకాయల జేర్చి, యాకుండలో నొకద్రోణపరిమితమగు జలమును బోసి, కషాయవిధిగ వండవలెను.

పిమ్మట నాయోషధులరసమంతయు కషాయమున జేరి యెనిమిదవపాలు మిగులునట్లు కషాయము కాగినపిదప నాకషాయమునుండి యుసిరికకాయలను వేరుగ దీసి వానియందలివిత్తనముల నూడదీసి కషాయమును ఉసిరికకాయలను వేరువేరుగ నుంచునది. పిదప నాయుసిరికపండ్లయొలుపును బాణలిలో నునిచి యందు పండ్రెండు పలములు నువ్వులనూనెను పండ్రెండు పలములు ఆవునెయ్యిని చేర్చి చక్కగ వేయించి పైజెప్పిన కషాయమున జేర్చి అర్ధతులము (ఏబదిపలములు) చక్కెరను కలిపి పాకముబట్టి ఇనుప

గరిటెతో కలియబెట్టుచు లేహమువలె నగునట్లు వండునది. పక్వమైనదానిని దింపి చల్లబడిన పిదప నారుపలములు తేనెను, నాల్గుపలములు వెదురుప్పును, రెండుపలములు పిప్పళ్లను, ఏలకులు లవంగపుచెక్క లవంగపత్రి నాగకేసరములు అను నాల్గిటిని ఒక్కొకపలమును వీని నన్నిటిని చూర్ణము జేసి పైజెప్పిన లేహమున జేర్చి యొక పాత్రలో నుంచునది.

ఈలేహము మిగుల శ్రేష్ఠమైన చ్యవనప్రాశరసాయనమని చెప్పబడును. దీనిని సేవించినచో కాసశ్వాసముల ముఖ్యముగ హరించునని మునులచే జెప్పబడినది. ధాతువులు క్షీణించినవారికిని, ఉరఃక్షతరోగముకలవారికిని, వృద్ధులకును, బాలులకును, శరీరమును వృద్ధినందించి పుష్టిని కల్గించును. మరియు కంఠస్వరక్షయమును, రొమ్మునొప్పిని, హృద్రోగమును, వాతరక్తమును, దప్పిని, మూత్రమునకును శుక్రమునకును సంబంధించిన రోగములను, వీనినన్నిటిని హరించును. ఈలేహము ఆకలిని చక్కగ కల్గించి యాహారమును అడగింపకుండునంత పరిమాణమును కల్పించి సేవింపనగును. ఈరసాయనమును సేవించుటవలన ముదుసలియగు చ్యవనమహర్షి మరల యౌవనవంతు డాయెను. కావున నియ్యది చ్యవనప్రాశరసాయనమని యన్వర్థముగ చెప్పబడునని భావము.

ఇచ్చట "జ్ఞాత్వా గతరసాన్యేతాని" అనుచోట నాల్గవవంతు కషాయము మిగులునట్లు చుండ కాచినచో రసము కషాయమున జేరునని యీతంత్రకారునియభిప్రాయము. ఈవిషయమునే వాగ్భటాచార్యులు "పాదశేషం రసం తస్మాత్" (ఉత్తరతంత్రము ౩౯ అధ్యాయము) అని కంఠోక్తిగ నుడివిరి. చరకవ్యాఖ్యానమున—"గతరసత్వ మిహ ద్రవ్యాణాం చతుర్భాగస్థితజలే భవతి" అని నుడివిరి.

"తైలసర్పిషోః పలద్వాదశకే భృష్ట్వా" అనుచోట నీతంత్రవ్యాఖ్యాత చక్రపాణి—"తైలసర్పిషోరితి సమాసనిర్దేశాత్ ఉభాభ్యామేవ ద్వాదశపలాని, న పృథక్ పృథక్" అని వివరించిరి. నీమతమున తైలఘృతములు రెండును జేరి పండ్రెండుపలములని స్పష్టమగుచున్నది. 'అష్టాఙ్గహృదయమున—"తైలఘృతాద్ద్వాదశభిః పలైః" అని యున్నది. దీని సర్వాంగసుందరవ్యాఖ్యానమున—"ప్రత్యేకం ద్వాదశభిః పలైః భర్జయేత్" అని యున్నది. ఈభేదమును విమర్శకులు గమనించెదరుగాత.

### చ్యవనప్రాశసేవనమున గల్గు విశేషగుణములు.

మూ. మేధాం స్మృతిం కాన్తిమనామయత్వం
　　ఆయుః ప్రకర్షం బలమిన్ద్రియాణాం,
స్త్రీషు ప్రహర్షం పరమగ్నివృద్ధిం
　　వర్ణప్రసాదం పవనానులోమ్యమ్. 73

రసాయనస్యాస్య నరః ప్రయోగాత్
లభేత జీర్ణోఽపి కుటీప్రవేశాత్,
జరాకృతం రూపమపాస్య సర్వం
బిభర్తి రూపం నవయౌవనస్య. 74

(ఇతి చ్యవనప్రాశః)

వ్యా. పైజెప్పిన చ్యవనప్రాశరసాయనమును విధిప్రకారము సేవించుచు కుటీప్రవేశవిధి ననుసరించి యున్నచో బుద్ధివృద్ధియు జ్ఞాపకశక్తియు శరీరకాంతియు కల్గి ఆయువు వృద్ధినొంది జ్వరాదిరోగములు కల్గక ఇంద్రియములు బలిష్ఠములై తమతమ వ్యాపారములయందు నిరంకుశముగ ప్రవర్తించును. స్త్రీవిషయకసంభోగేచ్ఛ యధికమగును. అగ్ని వృద్ధినందును. శరీరవర్ణము నిర్మలముగ నుండును. వాతము అనులోమముగ సంచరించును. మనుజుడు ముదుసలి యైనను ఈకుటీప్రవేశరసాయనమువలన అట్టి జరాభూయిష్ఠమగురూపమును బాసి యౌవనమునకు జేరిన మంచిరూపము నొందును.

## 4. ఆమలకరసాయనము.

మూ. అథామలకహరీతకీనాం, ఆమలకవిభీతకానాం, హరీతకీవిభీతకానాం ఆమలక-హరీతకీ-విభీతకానాం వా పలాశత్వగవనద్ధానాం, మృదా అవలిప్తానాం, కుకూలస్విన్నానాం అకులకానాం పలసహస్రములూఖలే సంపోథ్య, దధిఘృతమధుపలలతైలశర్కరాసంయుక్తం భక్షయేత్ అనన్నభుగ్యథోక్తేన విధినా. తస్యాన్తే యవాగ్వాదిభిః ప్రత్యుపస్థాపనం, అభ్యఙ్గోత్సాదనం సర్పిషా యవచూర్ణైశ్చ. అయం చ రసాయనప్రయోగప్రకర్షో ద్విస్త్రావదగ్నిబలమభిసమీక్ష్య, ప్రతిభోజనం యూషేణ పయసా వా షష్టికస్య సర్పిష్కః, అతః పరం యథాసుఖవిహారః కామభక్ష్యస్స్యాత్. అనేన ప్రయోగేణ ఋషయః పునర్యువత్వమవాపుః, బభూవుశ్చానేకవర్షశతజీవినో నిర్వికారాః పరం శరీరబుద్ధీన్ద్రియబలసముదితాః, చేరుశ్చాత్యన్తనిష్ఠయా తపః. 75

(ఇతి చతుర్థమామలకరసాయనం.)

వ్యా. ఉసిరికకాయలను కరకకాయలనైనను, ఉసిరికకాయలను తానికాయలనైనను, కరకకాయలను తానికాయలనైనను, ఉసిరికకాయలను కరకకాయలను తాని

కాయలను మాటిమైనను వేయిపలములను ఒక్కొక యోగముగ జేర్చి మోదుగచెట్టు పట్టలో నునిచి కట్టి పైని చీలమన్ను బూసి యెండించి పిడకలపుటమున బెట్టి యుడికిన పిదప ఆకాయలయందలి విత్తుల వెలికిందీసి రోటిలో నునిచి మెత్తగ దంచి చూర్ణముచేసి యాచూర్ణమున పెరుగును నేతిని తేనెను నువ్వుల తెలికపిండిని నువ్వులనూనెను చక్కెరను కలిపి రసాయనవిధ్యుక్తప్రకారము సేవించుచు అన్నాహారమును వదలి యుండవలెను. ఈయౌషధ సేవను వదలిన పిదప యవాగువు మున్నగు ద్రవాహారవిధిక్రమము ననుసరించి (వమనవిరేచనప్రకరణమున జెప్పబడిన పేయాద్యాహారక్రమానుసారముగ) యాహారము జేయుచు మామూలుగ చేయునాహారస్థితి నభ్యసించి మరల యథాస్థితికి దెచ్చుకొనవలెను. మరియు నేతితో నభ్యంగనము జేసికొని యవలచూర్ణముచే నలుగు పెట్టుకొనవలెను. ఈరసాయనమును అగ్నిబలమును అనుసరించి దినమునకు రెండుపర్యాయములు సేవింపనగును. భోజనకాలమున అరువదినాళ్ల సంబావుబియ్యపు అన్నమును పెసలకట్టుమైనను పాలనైనను కలిపి నెయ్యి చేర్చి భుజింపవలెను. అలవాటైనపిదప తన కిష్టమువచ్చినరీతిగ భోజనముచేసి యిష్టానుసారముగ విహరింపనగును.

ఈరసాయనమును సేవించుటవలన ఋషిపుంగవులెల్ల యౌవనము నొంది అనేక శతవత్సరములు రోగవర్జితులై శరీరబుద్ధీంద్రియబలమునొంది మిక్కిలి నిష్ఠతో తపంబొనరించుచు ననేకశతవత్సరములు జీవించిరి.

### 5. హరీతకీరసాయనయోగము.

మూ. హరీతక్యామలకవిభీతకపఞ్చపఞ్చమూలనిర్యూహే, పిప్పలీమధుక
మధూక కాకోలీక్షీర కాకోలీఆత్మగుప్తాజీవకర్షభక క్షీరశుక్లాకల్క-
సంప్రయుక్తేన, విదారీస్వరసేన, క్షీరాష్టగుణసమ్ప్రయుక్తేన చ
సర్పిషః కుమ్భంసాధయిత్వా ప్రయుఞ్జానోఽగ్నిసమాం మాత్రాం
(ప్రయుఞ్జీతాగ్నిబలం సమవేక్ష్య). జీర్ణేచ క్షీరసర్పిర్భ్యాం శాలి
షష్టికముష్ణోదకానుపానమశ్నన్ జరావ్యాధిపాపాభిచారవ్యపగత
భయః శరీరేన్ద్రియబుద్ధిబలం అతులముపలభ్య అప్రతిహతసర్వా
రమ్భః, పరమాయురవాప్నుయాత్. 76

(ఇతి ప[illegible] హరీతకీ[illegible]గః.)

వ్యా. కరకకాయలు, ఉసిరికకాయలు, తానికాయలు, పంచమూలపంచకము (ఐదువిధములైన పంచమూలగణద్రవ్యములు ఇరువదిన్నియు [illegible] పంచమూల[illegible] మనబడును.) వీనినన్నిటిని జేర్చి పరిభాషానుసారముగ క[illegible]ముగా [illegible]



ఇప్పపువ్వులు, అతిమధురము, కాకోలి, క్షీరకాకోలి, దురదగొండివిత్తులు, జీవకము, ఋషభకము, పాలగుమ్మడి, వీనికల్కమును; నేలగుమ్మడిస్వరసమును, నేతికి, నెనిమిదింతలు ఆవుపాలను జేర్చి, కుంభపరిమితము రెండుద్రోణములు నెయ్యి కలిపి ఘృతపాక విధి ప్రకారము ఘృతమును సిద్ధముచేసి జాఠరాగ్ని కనురూపముగ పరిమితి గల్పించి సేవించునది. అయ్యది జీర్ణమైనపిదప శాల్యన్నమునైనను అరువదినాళ్లసంబావులయన్నము నైనను పాలను నేతిని కలిపి భుజించుచు వేడినీళ్లను త్రాగనగును. దీని సేవనముచే ముసలితనమును వ్యాధులను పాపకృత్యముచేతను దుష్టప్రయోగాదులచేతను సంభవించెడి యాపత్తులను వదలి, శరీరమునకును ఇంద్రియములకును బుద్ధికిని అసదృశమైన యపార బలము నొంది, సకలకృత్యములయందును నిరంకుశప్రవర్తనము కల్గి యపరిమితమైన యాయువు నొంది సుఖముగ నుండగల్గును.

ఇచ్చట నీఘృతపాకమున ఒకభాగము ఘృతంబును, అందుకు సమభాగము పైజె ప్పిన హారీతక్యాది కషాయంబును, ఘృతమునకు నెనిమిదింతలు క్షీరంబును జేర్చి ఘృత పాకవిధిప్రకారము పాకము చేయనగును. కుంభమన—ద్రోణస్తు ద్విగుణః శూర్పో విజ్ఞేయః కుమ్భ ఏవ చ." అను మానపరిభాషచేత రెండుద్రోణములని యెరుంగునది. పంచమూలపంచకవివరణము మాయాయుర్వేదపరిభాషాగ్రంథమున జూచునది.

### 6. ఆమలకరసాయనము.

సూ. హరీతక్యామలకవిభీతక హరిద్రాస్థిరా బలా (వచా) విడఙ్గాఽమృత వల్లీవిశ్వభేషజమధుకపిప్పలీ సోమవల్కసిద్ధేన క్షీరసర్పిషా మధు శర్కరాభ్యామపి చ సన్నీయామలకస్వరసశతపలపరిపీతం ఆమలక చూర్ణం అయశ్చూర్ణచతుర్భాగసమ్ప్రయుక్తం పాణితలమాత్రం ప్రాతః ప్రాతః ప్రాశ్య యథోక్తేన విధినా సాయం ముద్గయూ షేణ పయసా వా ససర్పిష్కం శాలిషష్టికాన్నం అశ్నీయాత్. త్రివర్షప్రయోగాదస్య వర్షశతమజరం వయస్తిష్ఠతి, శ్రుతమవ తిష్ఠతే, సర్వామయాః ప్రశామ్యన్తి. విషమవిషం భవతి గాత్రే, గాత్రమశ్మవత్ స్థిరీభవతి, అధృష్యో భూతానాం భవతి. 77

(ఇతి షష్ఠో హరీతకీయోగః.)

వ్యా. హరీతకి (కరకకాయలు), ఉసిరికకాయలు, తానికాయలు, పసుపు, కోల పొన్న, వాయువిడంగములు, తిప్పతీగె, శుంఠి, అతిమధురము, పిప్పళ్లు, వెలిచంద్ర వీని నన్నిటిని చేర్చి క్షీరమునుండి తీయబడిన నేతిని ఘృతపాకవిధిప్రకారము పక్వముజేసి

యాఘృతమున తేనెను చక్కెరను కలిపి యుంచుకొని, పిమ్మట నుసిరికకాయల చూర్ణ మును నూరుపలముల యుసిరికకాయలస్వరసమున భావనజేసి, అందు నాల్గవవంతు ఉసు చూర్ణమును కలిపి, యాచూర్ణమున పాణితల (అక్ష) మాత్రము పైజెప్పిన ఘృతమున కలిపి ప్రతిదినమునందు నుదయకాలమున సేవించుచు, ప్రతిదినమునందును సాయం కాలమున పెసలకట్టును పాలను నేతిని కలిపిన రాజనపు టన్నము నైనను అరువదినాళ్ల సంబావులయన్నమునైనను భుజింపనగును.

ఇత్తెరంగున నీరసాయనమును మూడుసంవత్సరములకాలము సేవించినచో నూరు సంవత్సరములవరకును ముదిమి లేక యౌవనము నిలచి యుండును. వినబడినవిషయ మంతయు జ్ఞాపకమున నుంచుకొనుశక్తి కల్గియుండును. రోగము లన్నియు శమించును. వానిశరీరమున విషము సోకినను అయ్యది నిర్వీర్యమగును. శరీరము రాతివలె స్థిరముగ నుండును. ఇతరులు ఎదిరించినను వారిచే హాని లేక యుండును.

రసాయనసేవనముచే గల్గుగుణములు.

భవన్తి చాత్ర:—

మూ. యథామరాణామమృతం యథా భోగవతాం సుధా,
తథాऽభవన్మహర్షీణాం రసాయనవిధిః పురా. 78
న జరాం న చ దౌర్బల్యం నాతుర్యం నిధనం న చ,
జగ్ముర్వర్షసహస్రాణి రసాయనపరాః పురా. 79
న కేవలం దీర్ఘమిహాయురశ్నుతే
రసాయనం యో విధివన్నిషేవతే,
గతిం స దేవర్షినిషేవితాం శుభాం
ప్రపద్యతే బ్రహ్మ తథేతి చాక్షయమ్. (చా.శు.రమ్.) 80

వ్యా. దేవతలకును నాగులకును అమృతముబోలె మనుజులకును మహర్షులకు నీరసాయనవిధానము గుణోత్తర మైయుండును. ఈరసాయనవిధిని విధ్యుక్తప్రకారము సేవించువారు ముదిమిని, బలహీనమును, రోగములను, మరణమును అనేకసహస్రవత్సర ములవరకును నొందక పూర్వకాలమున నుండిరి. మరియు నీరసాయనసేవనముచేత కేవలము దీర్ఘాయుష్యమును మాత్రము నొందుటయె కాక దేవర్షిగణనిషేవితంబగు నుత్తమలోకమును బొంది తుట్టతుద కనశ్వరంబును పునర్జన్మరహితంబునైన శాశ్వతమగు మోక్షము చేకూరును.

ఇచ్చట రసాయనవిధి సేవించినవారు జరావ్యాధులు లేక దీర్ఘకాల మాయు ర్వృద్ధి నొందుదురు; కావున వారు దానంజేసి చిత్తశుద్ధికలవారై చాలకాలము నిర్విఘ్నముగ తపస్సు నాచరించి యుత్తమమైన లోకములజేరి కడపట బ్రహ్మైక్యరూపమైన ముక్తి బడయగల్గుదురు; కావున రసాయనవిధానము మోక్షమునకు సాధనమని "బ్రహ్మ తథేతి చాక్షరమ్" అనువాక్యముచే జెప్పబడినది.

## రసాయన ప్రథమపాద విషయసంగ్రహము.

తత్ర శ్లోకః—

మూ. అభయామలకీయేఽస్మిన్ షడ్యోగాః పరికీర్తితాః,
రసాయనానాం సిద్ధానాం ఆయుర్వైరనువర్తతే. 81

వ్యా. అభయామలకీయ మనునీరసాయన పాదమందు సిద్ధములగు నాయుర్వృద్ధి కరములైన రసాయనయోగములు ఆరును వివరింపబడినవి. (ఇచ్చట బ్రాహ్మీరసాయనము, రెండవబ్రాహ్మీరసాయనము, చ్యవనప్రాశరసాయనము, ఆమలకరసాయనము, హరీతకీ రసాయనము, ఆరవది యామలకరసాయనమును, ఇవి యన్నియు జేరి యారువిధములైన రసాయనము లగునని యెరుంగునది. ఇట్టి సంఖ్యాపరిగణనమును సందేహనివర్తికై చెప్ప బడినది. పైజెప్పబడు సంఖ్యాపరిగణనమును గమనించునది.)

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే చికిత్సాస్థానే
అభయామలకీయోనామ రసాయనపాదః ప్రథమః.

ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకమహర్షిచే సంస్కరింపబడినదియు నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి చికిత్సాస్థానమున ప్రథమాధ్యాయ మునందు అభయామలకీ యను ప్రథమ పాదము సంపూర్ణము.

---

## ప్రథమాధ్యాయము—రెండవపాదము.

అవతరణిక:—పూర్వపాదమున ఆమలకరసాయనయోగములు కొన్ని చెప్పబడి నవి. అట్టి యామలకయోగముల మరి కొన్నివివరించుటకై ప్రాణకామీయమను రెండవ పాదము చెప్పబడును.

మూ. అథాతః ప్రాణకామీయం రసాయనపాదం వ్యాఖ్యాస్యామః. 1
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. 2

వ్యా. అభయామలకీయమను రసాయనపాదమును చెప్పినపిదప ప్రాణకామీయమను (ప్రాణకామశబ్దము నధికరించి చెప్పబడు పాదము) రెండవరసాయనపాదము భగవంతుడగు నాత్రేయమహర్షి చెప్పినదానికన్న న్యూనాతిరేకము లేకుండునట్లు వివరింపబడునని భావము.

రసాయనోపయోగకాలమున నుండవలసిన క్రమము.

మూ. ప్రాణకామాశ్శుశ్రూషధ్వమిదముచ్యమానం అమృతమివాఽపరమదితిసుతహితకరం అచిన్త్యాద్భుతప్రభావం ఆయుష్యం ఆరోగ్యకరం వయసః స్థాపనం నిద్రాతన్ద్రాశ్రమక్లమాలస్యదౌర్బల్యాపహారమనిలకఫపిత్తసామ్యకరం స్థైర్యకరం అబద్ధమాంసహారం అన్తరగ్నిసన్ధుక్షణం ప్రభావర్ణస్వరోత్తమకరం రసాయనవిధానం.
అనేన చ్యవనాదయో మహర్షయః పునర్యువత్వమాపుః నారీణాం చేష్టతమా బభూవుః,స్థిరసమసుభక్తమాంసాః,సుసంహతస్థిరశరీరాః, సుప్రసన్నబలవర్ణేన్ద్రియాః సర్వత్ర అప్రతిహతపరాక్రమాః క్లేశసహాశ్చ.
సర్వే శరీరదోషా భవన్తి గ్రామ్యాహారాత్ అమ్లలవణకటుకక్షారశుష్కశాకమాంస(మాష)తిలపలలపిష్టాన్నభోజినాం, విరూఢనవశూకశమీధాన్యవిరుద్ధాఽసాత్మ్య రూక్షక్షారాభిష్యన్దిభోజినాం, క్లిన్నగురుపూతిపర్యుషితభోజినాం, విషమాధ్యశనప్రాయాణాం దివాస్వప్న స్త్రీమద్యనిత్యానాం, విషమాతిమాత్ర వ్యాయామసంక్షోభితశరీరాణాం, భయక్రోధశోకలోభమోహాయాసబహులానాం.
అతో నిమిత్తం హి (నిమిత్తాద్ధి) శిథిలీభవన్తి మాంసాని, విముచ్యన్తే సన్ధయః విదహ్యతే రక్తం, విష్యన్దతే చ అనల్పం మేదః, న సన్ధీయతేఽస్థిషు మజ్జా, శుక్రం న ప్రవర్తతే, క్షయముపైత్యోజః.
స ఏవంభూతో గ్లాయతి, సీదతి, నిద్రాతన్ద్రాలస్యసమన్వితో నిరుత్సాహః శ్వసితి, అసమర్థశ్చేష్టానాం శారీరమానసీనాం, నష్టస్మృతిబుద్ధిచ్ఛాయః రోగాణామధిష్ఠానభూతః నసర్వమాయురవాప్నోతి.

తస్మాదేతాన్ దోషాన్ అవేక్షమాణస్సర్వాన్ యథోక్తానహితా
నపాస్య ఆహారవిహారాన్ రసాయనాని ప్రయోక్తుమర్హతీత్యుక్త్వా
భగవాన్ పునర్వసురాత్రేయ ఉవాచ. 3

వ్యా. అపరిమితమగు నాయుర్బలాదుల గోరునోమహర్షులారా! ఈక్రింద జెప్పంబడు రసాయనవిధానము నాలకింపుడు! ఈరసాయనము దేవతలకు రెండవ యమృతమును బోలె హితకరంబును, మనస్సుచే నూహింపరాని యాశ్చర్యమును కల్గించుప్రభావము కల్గినదియు, ఆయువును వృద్ధినొందించునదియు, ఆరోగ్యకరంబును, యౌవనవయస్సును స్థిరముగ నిల్పునదియు, అతినిద్రను కునికిపాటును శ్రమమును బడలికను ఆలసత్వమును బలహీనమును పోగొట్టునదియు, వాతపిత్తకఫదోషముల మూటిని న్యూనాధిక్యము నొందనీయక ఆయాదోషమునకు నియమితమగు సమస్థితి నుంచునదియు, శరీరమును దృఢపరచునదియు, శిథిలమైనమాంసమును శైథిల్యమును పోగొట్టి దృఢముగ జేయునదియు, శరీరమునందలి కాయాగ్నిని రగులజేయునదియు, ఉత్తమములగు శరీరకాంతిని వర్ణమును కంఠస్వరమును కల్గించునదియు నగును.

మరియు నీక్రిందనిరూపింపబడు రసాయనముల సేవించుటచే చ్యవనుడు మున్నగు మహర్షులు ముదిమిని వదలి యౌవనము నొందిరి. మరియు నసేవులు స్త్రీలకు మిక్కిలి ప్రియమైనరూపము నొందిరి. శరీరమునందలి మాంసము దృఢమై సమముగ నాయాఅవయవవిశేషముల నుండవలసిన స్థితి నుండియుండిరి. వారియవయవములు ఒండొంట కలిసి దృఢములగు సంధిబంధములు కల్గియుండెను. శరీరబలంబును వర్ణంబును చక్షురాదీంద్రియములును నిర్మలములై యుండెను. వారు సర్వకాలసర్వావస్థలయందును అడ్డులేని పరాక్రమము కలవారై యెంతటికష్టములనైన నోర్వగలిగియుండిరి.

మరియు శరీరసంబంధములైన రోగము లన్నియు నింద్యములగు నాహారముల సేవించుటంజేసి సంభవించును:—మరియు పులుపు, ఉప్పు, చేదు, కారము, అనునీరసముల మితిమీరి సేవించుటవలనను, ఎండినకూరగాయలను, మాంసమును, ముడినువ్వులను, తెలికపిండిని, పిండివంటకములను విశేషముగ భుజించినను, మొలకలెత్తిన ధాన్యమును క్రొత్తధాన్యమును శూక (నెమలివరి) ధాన్యమును శమీధాన్యమును ఉద్దులు పెసలు మున్నగు కాయధాన్యములను) సేవించుటవలనను, పరస్పరసంయోగాది విరుద్ధములగు క్షీరమాత్స్యాదుల జేర్చి భుజించుటవలనను, సాత్మ్యములుకాని (తనకు వాడుకలో లేమింజేసి శరీరతత్త్వమునకు ఇమడని) పదార్థములనైనను రూక్షంబులును క్షారంబులును అభిష్యందకర (నాసాదిరంధ్రముల ద్రవమునుబుట్టించు) పదార్థములనైనను భుజిం

చుటవలనను, కుళ్లినపదార్థములనైనను ఘనపదార్థములనైనను దుర్గంధమైనపదార్థములనైనను, పర్యుషిత (ముందుదినము పక్వముచేయబడిన) అన్నాదులనైనను భుజించుటవలనను, అకాలమున భుజించినను, భుజించినవెంటనే మరల భుజించినను, ఎడతెగకపగటిపూట నిద్రించినను, మితిమీరి స్త్రీసంభోగముచేసినను, అమితముగ మద్యపానముజేసినను, విషమంబుగను అమితముగను వ్యాయామము చేయుటవలన శరీరక్షోభము కల్గినను, భయము క్రోధము దుఃఖము లోభము మోహము శరీరప్రయాసము ఇవి యధికముగ కల్గినను, ఈకారణములవలన మనుజులకు శరీరవ్యాధులు సంభవించును.

పైజెప్పినకారణములచే మనుజులకు శరీరమునందలి మాంసములు సడలి శిథిలములగును. కీళ్లు వదలును. రక్తము మిక్కిలి వేడియగును. దానంజేసి మేదస్సు కరగి యధికముగ స్రవించును. అస్థులయందలి మజ్జ (క్రొవ్వు) చేరదు. శుక్రము వృద్ధినొంది వ్యాపింపదు. ప్రాణమున కాధారమైన యోజస్సు క్షీణించును.

ఇట్టిపరిస్థితి నొందినమనుజుడు మిక్కిలి బడలికనొంది కృశతనొందును. నిద్రయు కునికిపాటును సోమరితనంబును కల్గి, పనులయం దుత్సాహము లేక నిశ్వాసము విడచుచు శరీరమునకును మనస్సునకును సంబంధించిన చేష్టల జేయుటకును సామర్థ్యము లేక జ్ఞాపకశక్తియు బుద్ధియు శరీరకాంతియు లేక పలుతెరంగులైన జ్వరాదిరోగములకు నెలవై బాధపడుచు తుదకు పూర్ణాయువు లేక మధ్యకాలముననే యంత మొందును.

కావున పైజెప్పబడిన దోషముల నన్నిటిని గమనించి వానికి కారణములైన పైజెప్పబడిన గ్రామ్యాహారాది అయుక్తాహారవిహారముల నెల్ల దూరంబుచ్చి క్రిందజెప్పబడు రసాయనముల బ్రయోగింప దగునని భగవత్స్వరూపుడగు నాత్రేయులు చెప్పెను. (ఏవిధమగు రసాయనమును సేవించునపుడును శారీరమానసికదోషకారణములైన గ్రామ్యాహారాదుల సేవింప దగదని ముఖ్యభావము.)

ఇచ్చట తంద్ర యన—"ఇంద్రియార్థేష్వసంవిత్తిః గౌరవం జృమ్భణం క్లమః, నిద్రార్తస్యేవ యస్యేహా తస్య తన్ద్రాం వినిర్దిశేత్." (సుశ్రుతశారీర. అ. ౪) అనులక్షణము నెరుంగునది.

## ౧. ఆమలకఘృతము.

మూ. ఆమలకానాం సుభూమిజానాం కాలజానాం అనుపహతగన్ధవర్ణరసానాం ఆపూర్ణరసప్రమాణవీర్యాణాం స్వరసేన, పునర్నవాకల్కపాదసంప్రయుక్తేన, సర్పిషః సాధయేదాఢకం, అతః పరం

విదారీస్వరసేన జీవన్తీకల్కసంప్రయుక్తేన, అతః పరం చతుర్గుణేన పయసా బలాతిబలాకషాయేణ శతావరీకల్కసంయుక్తేన.

అనేన క్రమేణైకైకం శతపాకం సహస్రపాకం వా శర్కరా క్షౌద్రచతుర్భాగసంప్రయుక్తం సౌవర్ణే రాజతే మార్త్తికే వా శుచౌ దృఢే ఘృతభావితే కుమ్భే స్థాపయేత్.

తదృథోక్తేన విధినా యథాగ్ని ప్రాతః ప్రాతః ప్రయోజయేత్, జీర్ణే (తు) చ క్షీరసర్పిర్భ్యాం శాలిషష్టికమశ్నీయాత్. అస్య త్రివర్షప్రయోగాత్ వర్షశతం వయః అజరం తిష్ఠతి, శ్రుతమవతిష్ఠతే, సర్వామయాః ప్రశామ్యన్తి, అప్రతిహతగతిః స్త్రీషు అపత్యవాన్ భవతీతి. 4

వ్యా. మంచిభూమియందు పుట్టినవియు, యుక్తముగ నుండుకాలమున బుట్టి, గంధంబును వర్ణంబును రసంబును చెడక పూర్ణమైన రసమును ప్రమాణమును వీర్యమును కల్గియుండు ఉసిరికకాయలనుండి స్వరసము దీసి, ఆస్వరసమునకు నాల్గవపాలు ఆవునేతిని నేతికి నాల్గవపాలు గలిజేరువేళ్లకల్కమును కలిపి ఒక ఆఢకపరిమితమైన ఘృతమును ఘృతపాకవిధి ననుసరించి పక్వము జేయునది. మరల నత్తెరంగుననే ఒక ఆఢకపరిమితమైన యావునేతిలో నాలుగాఢకములు నేలగుమ్మడి స్వరసమును ఘృతమునకు నాల్గవపాలు పాల కూరకల్కమును కలిపి ఘృతపాకవిధి ననుసరించి పక్వముచేయునది. పిమ్మట మరల నా ఘృతమునందే నాలుగింతలు ఆవుపాలను చిట్టాముట్టి, పేరాముట్టి కషాయమును నాలుగింతలును ఘృతమునకు నాల్గవపాలు పిల్లిపీచరకల్కమును జేర్చి పక్వము జేయునది. ఇత్తెరంగున పైజెప్పిన మూడుయోగములలో నొక్కొకయోగమునను నూరేసిమారులైనను వేయిమారులైనను ఒకేఘృతమును పక్వము జేయనగును.

పైజెప్పినరీతిగ మూడువందలమారులైనను మూడువేలమారులైనను పక్వముచేయ బడిన యాఘృతమున దానికి నాలుగవవంతు పంచదారను తేనెను కలిపి బంగరుపాత్రయందైనను వెండిపాత్రయందైనను నేతితో మాగి దృఢమైన మంచి మంటిపాత్రయందైనను బోసి పదిలముగ నుంచునది.

పిమ్మట సుముహూర్తమున నాఘృతమును రసాయనవిధివిహితముగ కుటీప్రవేశ విధి ననుసరించి ప్రతిదినంబును ప్రాతఃకాలమున జాఠరాగ్నిబలమును (జీర్ణశక్తిని) గమనించి తదనుగుణముగ సేవింపనగును. సేవింపబడిన ఆయౌషధము జీర్ణమైనపిదప రాజనంపు టన్నముసైనను అరువదినాళ్ల సంబావుబియ్యపుటన్నముసైనను నేతిని పాలను కలిపి

భుజింపవలెను. ఇత్తెరంగున నాఘృతమును మూడుసంవత్సరములకాలము సేవించినచో వినినవిషయముల సెల్ల ధారణచేయుశక్తి కల్గును. రోగము లన్నియు శమించును. స్త్రీలతో అడ్డులేక సంభోగించుశక్తి కల్గును. సంతతి కల్గును.

ఇచ్చట నీకల్పము నెరుంగునది:—"కల్కాచ్చతుర్గుణీకృత్య ఘృతం వా తైల మేవ వా, చతుర్గుణే ద్రవే సాధ్యం" అను సామాన్యపరిభాషానుసారముగ నిచ్చట నాఢకపరిమితమైన ఘృతమున నాలుగాఢకములు ఉసిరికకాయలరసమును ఘృతమునకు నాల్గవవంతు గలిజేరుకల్కమును జేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేయవలెను. ఇత్తెరంగుననే తక్కిన రెండుపాకవిధులయందును ఘృతమునకు నాలుగింత ద్రవమును నాల్గవభాగము కల్కమును జేర్చి పక్వము జేయవలెను. మరియు సౌవర్ణ - రజత - మృణ్మయపాత్రములలో క్రమముగ నొకదానికన్న నొకటి గుణహీనమని యెరుంగునది.

### ఆమలకఘృతోపయోగగుణవిశేషములు.

భవతశ్చాత్ర:—

మూ. బృహచ్ఛరీరం గిరిసారసారం స్థిరేన్ద్రియం చాతిబలేన్ద్రియం చ,
అధృష్యమన్యైః అతికాన్తరూపం ప్రశస్తిపూజాసుఖచిత్తభాక్చ.
బలం మహద్వర్ణవిశుద్ధిరగ్ర్యా స్వరో ఘనౌఘస్తనితానుకారీ,
భవత్యపత్యం విపులం స్థిరం చ సమశ్నతో యోగమిమం నరస్య.
(ఇత్యామలకఘృతమ్.)

వ్యా. పైజెప్పబడిన యామలకఘృతమును సేవించువారికి శరీరము గొప్పదిగ వృద్ధినొందును. ఉక్కుతో సమానమగు సత్తువ గల్గును. ఇంద్రియములు మిక్కిలి దార్ఢ్యమునొంది వానివానిపనుల నెరవేర్చుటయందు సామర్థ్యము కల్గియుండును. శత్రువులు మున్నగు నితరులచే ధిక్కరింపనలవికాని బలంబును మిక్కిలి రమ్యమగు రూపంబును, ప్రశంసార్హమైనగుణంబును, సుఖంబును, మనస్సును కల్గియుండును. మిక్కుటమైన శరీరబలంబును, కాంతివిశేషంబును, మేఘగర్జనము ననుకరించు కంఠస్వరంబును, అపాయము లేక స్థిరమైన యధికసంతానంబును కల్గును.

### ఆమలకావలేహము.

మూ. ఆమలకసహస్రం పిప్పలీసహస్రసంప్రయుక్తం పలాశతరుణక్షారోదకోత్తరం తిష్ఠేత్, తదనుగతక్షారోదకమనాతపశుష్కం అనస్థి చూర్ణీకృతం చతుర్గుణాభ్యాం మధుసర్పిర్భ్యాం సంనీయ శర్కరా

చూర్ణచతుర్భాగసమ్ప్రయుక్తం ఘృతభాజనస్థం షణ్మాసాన్ స్థాపయేత్ అన్తర్భూమేః.

తస్యోత్తరకాలం అగ్నిబలసమాం మాత్రాం ఖాదేత్, పౌర్వాహ్ణికః ప్రయోగో నాపరాహ్ణికః సాత్మ్యాపేక్షశ్చాహారవిధిః.

అస్య ప్రయోగాద్వర్షశతం అజరం వయస్తిష్ఠతీతి సమానం పూర్వేణ. 7

(ఇత్యామలకావలేహః.)

వ్యా. పైజెప్పినరీతిగ గుణశ్రేష్ఠములైన వేయి యుసిరికపండ్లు వేయి పిప్పళ్లను (రెంటిని) ఒకపాత్రలో నునిచి మిక్కిలి లేతదియు ముదిరినదియు గాక నడిపయసున నుండు మోదుగచెట్టు ఆకులచే క్షారకల్పనవిధి ప్రకారము క్షారోదకమును సిద్ధముచేసి యాక్షారోదకమును పైజెప్పిన పాత్రలోనుండు ఉసిరికకాయలును పిప్పళ్లును మునిగి దానిపైని క్షారోదకము నిలిచియుండున ట్లుంచునది. ఇత్తెరంగున నాక్షారోదక మంతయు నారెంటియందును ఇమిడి యింకునందాక నునిచి పిమ్మట నాయుసిరికకాయలను పిప్పళ్లను వెలికిం దీసి కాయలయందలి గింజలను వేరుగ దీసి పైయొలుపును నీడ నెండించి మెత్తగ చూర్ణముజేసి యాచూర్ణమునకు నాలుగింతలు తేనెను నేతిని జేర్చి, యాచూర్ణమునకు నాల్గవవంతు చక్కెరను కలిపి, వీనినన్నిటిని నేతితో మాగినకుండలో నునిచి పదిలముగ మూసి యారుమాసములవరకును భూమిలో స్థాపితముచేసి యుంచనగును.

ఆరుమాసములు గడచినపిదప నాయౌషధమును వెలికిం దీసి జఠరాగ్నిబలానుసారముగ దగిన పరిమాణమును గల్పించి సేవింపనగును. ఇత్తెరంగున ప్రతిదినంబును ఉదయకాలమున మాత్రము సేవింపనగుగాని సాయంకాలము సేవింపదగదు. తనకు అలవాటుగనుండు మామూలుగ నాహారవిధి చేయదగును. దీనిని సేవించుటవలన నూరువత్సరములకాలము ముసలితనము లేక యౌవనవయస్సు కల్గి సుఖముగ నుండును. ఇంతియకాక పైజెప్పబడిన గుణములు గూడ గల్గును. ఇది యామలకావలేహరసాయన మనబడును.

### 3. ఆమలకచూర్ణము.

మూ. ఆమలకచూర్ణాఢకం ఏకవింశతిరాత్రం ఆమలకస్వరసపరిపీతం మధుఘృతాఢకాభ్యాం ద్వాభ్యామేకీకృతం అష్టభాగపిప్పలీకం శర్కరాచూర్ణచతుర్భాగసమ్ప్రయుక్తం ఘృతభాజనస్థం ప్రావృషి భస్మరాశౌ నిదధ్యాత్.

తద్వర్షాన్తే సాత్మ్యపథ్యాశీప్రయోజయేత్. అస్య ప్రయోగా ద్వర్షశతం అజరమాయు స్తిష్ఠతీతి సమానం పూర్వేణ. 8

(ఇత్యామలకచూర్ణమ్.)

వ్యా. ఉసిరికపండ్లచూర్ణమును ఒక ఆఢకపరిమితము గ్రహించి యాచూర్ణమును ఉసిరికపండ్లరసమున నిరువదియొకదినము నానబెట్టి రసము నాకర్షించిన యాచూర్ణమున ఆఢకపరిమితమగు తేనెను నేతిని కలిపి, అందు చూర్ణమునకు నెనిమిదవవంతు పిప్పలి చూర్ణమును నాల్గవవంతు పంచదారను చేర్చి, నేతితో మాగినకుండలో నునిచి పదిలముగ మూసి వర్షాకాలమున బూడిదెరాశిలో భద్రముగ నుంచునది.

వర్షాకాలము గడచినవెంటనే దాని వెలికిందీసి జాఠరాగ్నికి దగిన పరిమాణముతో ప్రతిదినంబును సేవించుచు శరీరమున కిమిడిసపియు పథ్యకరంబును నగునాహారమును భుజింపవలెను. ఈరసాయనముచు ప్రయోగించుటవలన నూరువత్సరములు ముదిమిలేకయుండుటయ కాక పైన ఆమలకఘృతమునకు జెప్పిన యుక్తగుణంబులను కల్గును.

౫. విడంగావలేహము.

మూ విడఙ్గతణ్డులచూర్ణానాం ఆఢకం, ఆఢకం పిప్పలీతణ్డులానాం, అధ్యర్ధాఢకం సితోపలాయాః, సర్పిస్తైలమధ్వాఢకైః షడ్భిరేకీకృతం ఘృతభాజనస్థం ప్రావృషి భస్మరాశావితి సర్వం సమానం పూర్వేణ యావదాశీః. 9

(ఇతి విడఙ్గావలేహః.)

వ్యా. వాయువిడంగములోని బియ్యము (పొట్టొలిచినగింజలు) ఒక ఆఢకపరిమితంబును, పిప్పలిగింజలను ఒక ఆఢకమును జేర్చి చూర్ణముజేసి అందు ఒకటిన్నర ఆఢకము శీనాకల్కండచూర్ణమును, నెయ్యి, నూనె, తేనె, ఇవి మూడును జేరి ప్రత్యేకమొక్కొక ఆఢకంబును కలిపి, వీనినాఱిటి నొకటిగ కలిపి విధ్యుక్తప్రకారము అవలేహపక్వముజేసి నేతితో మాగిన కుండలో నునిచి పదిలముగ మూసి పైజెప్పినరీతిగ వర్షాకాలమున బూడిదెరాశిలో వర్షాకాలమంతయు భద్రముగ నునిచి, వర్షాకాలము గడచిన పిదప దాని వెలికిందీసి జఠరాగ్ని కనుగుణముగ మాత్రగల్పించి ప్రతిదినంబును సేవించినచో మొదట నామలకఘృతమునకు జెప్పినగుణము లన్నియుం గల్గి వర్షశతకాలము సుఖముగ యౌవనవంతుడై సుఖించును. (ఇది విడంగావలేహ మనబడును.)

### 5. రెండవ ఆమలకావలేహము.

మూ. యథోక్తగుణానామామలకానాం సహస్రం ఆర్ద్రపలాశద్రోణ్యాం సపిధానాయాం బాష్పమనుద్వమన్త్యాం ఆరణ్యగోమయాగ్నిభిరుపస్వేదయేత్. తాని సుస్విన్నశీతాన్యుద్ధృతకులకాన్యాపోథ్య, ఆఢకేన పిప్పలీచూర్ణానాం, ఆఢకేన చ విడఙ్గతణ్డులచూర్ణానాం, అధ్యర్ధేన చాఢకేన శర్కరాయాః, ద్వాభ్యాం ద్వాభ్యామాఢకాభ్యాం తైలస్య మధునః సర్పిషశ్చ సంయోజ్య, శుచౌ దృఢే ఘృతభావితే కుమ్భే స్థాపయేదేకవింశతిరాత్రమ్. అత ఊర్ధ్వం ప్రయోగః. అస్య ప్రయోగాద్వర్షశతమజరమాయుస్తిష్ఠతీతి సమానం పూర్వేణ. 10

(ఇత్యామలకావలేహోఽపరః.)

వ్యా. "ఆమలకానాం సుభూమిజానాం" అని యుపక్రమించి పైని చెప్పబడిన గుణములు కల వేయియుసిరికపండ్లను పచ్చిమోదుగచెక్కలతో జేయబడిన తొట్టిలో నునిచి యందుండి యావిరి బైటపోకుండునట్లు పదిలముగ మూతమూసి సందులను బిగించి అడవియేరుడుపిడకలమూటులో నుడికించవలెను. ఆతొట్టిలోనుండు నుసిరికపండ్లన్నియు చక్కగ నుడికి చల్లారినపిదప వానియందలి గింజలను వెలికిం దీసి వానియొలుపును మాత్రము రోట నునిచి దంచి, అందు ఒక ఆఢకము పిప్పలీచూర్ణమును, పొట్టు తీయబడిన వాయువిడంగములలోని గింజలచూర్ణము నొకయాఢకపరిమితంబును, ఒకటిన్నరయాఢకము చక్కెరను, నూనెను తేనెను నేతిని ప్రత్యేకము రెండేసి యాఢకములను కలిపి, పక్వము జేసి పరిశుద్ధంబును దృఢంబును నేతితో మాగినదియు నగు నొక కుండలో నునిచి యిరువదియొకదినమువరకును పదిలముగ నుంచవలెను. ఇరువదియొక దినము గడచినపిదప నారసాయనమును జాఠరాగ్ని బలానుసారముగ పరిమాణను గల్పించి ప్రతిదినంబు నుదయముప్రాట సేవించినచో పైని యామలకఘృతమునకు జెప్పిన గుణములన్నియు గల్గి నూరువత్సరములకాలము ముదిమి లేక సుఖముగ జీవించి యుండును.

### 6. నాగబలారసాయనము.

మూ. ధన్వని కుశాస్తీర్ణే స్నిగ్ధకృష్ణమధురమృత్తికే, సువర్ణవర్ణమృత్తికే వా వ్యపగతవిషశ్వాపదపవనసలిలాగ్నిదోషే కర్షణవల్మీకశ్మశాన

చైత్యోష రావసథవర్జితే దేశే యథర్తుసుఖపవనసలిలాదిత్య సేవితే జాతాని అనుపహతాని అనధ్యారూఢాని అబాలాని అజీర్ణాని అధిగతవీర్యాణి శీర్ణపురాణపర్ణాని అసంజాతాన్యపర్ణాని (అసంజాతఫలాని) తపసి తపస్యే వా మాసే శుచిః ప్రయతః కృతదేవార్చనః స్వస్తి వాచయిత్వా ద్విజాతీన్ చ సుముహూర్తే నాగబలా మూలాని ఉద్ధరేత్.

తేషాం సుప్రక్షాళితానాం త్వక్పిణ్డమాత్రమాత్రం అక్షమాత్రం వా శ్లక్ష్ణపిష్టమాలోడ్య పయసా ప్రాతః ప్రయోజయేత్, చూర్ణీకృతాని వా పిబేత్పయసా, మధుసర్పిర్భ్యాం వా సంయోజ్య భక్షయేత్. జీర్ణే చ క్షీరసర్పిర్భ్యాం (పయసా ససర్పిష్కం) శాలిషష్టికమశ్నీయాత్. సంవత్సరప్రయోగాదస్య వర్షశతమజరం వయస్తిష్ఠతీతి సమానం పూర్వేణ. 11

(ఇతి నాగబలారసాయనమ్.)

వ్యా. దర్భలచే నావరింపబడినదియు, నునుపుగల్గిన నల్లమట్టినైనను బంగరువంటి పసుపురంగు కల మట్టినైనను కల్గినదియు, విషజంతువులయొక్కయు విషపుగాలి యొక్కయు విషపునీటియొక్కయు విషసంబంధమైన యగ్నియొక్కయు స్పర్శముచే దుష్టము కానిదియు, దున్నుటచేతను పుట్టలు శ్మశానము చైత్యము జంతువధస్థానము చౌటిమన్ను ఇండ్లు అనువానిచేతను ఆక్రమింపబడక యుండునదియు, వసంతగ్రీష్మాది ఋతువులయందు ఆయాఋతువులకు స్వాభావికధర్మములుగనుండు గాలివాన యెండ మున్నగువానిచే సుఖసంస్పర్శము కల్గినదియు, పల్లము కాక మెట్టగ నుండునదియు నగు జాంగల (మెరక) ప్రదేశమున మొలచి, తీవెలు మున్నగువానిచే నాక్రమింపబడక, ఇతరవృక్షజాతిచే జుట్టబడక, లేతవి ముదిరినవియు గాక మధ్యస్థితి నుండి పూర్ణమైన శక్తికల్గి, పాతాకులు రాలి క్రొత్తచిగుళ్లును కాయలును పుట్టక యుండునట్టి నాగబల (జిబిలికె) యొక్క వ్రేళ్లను; మాఘమాసమునందైనను ఫాల్గునమాసమునందైనను సుముహూర్తమున మనుజుడు శుచిస్నాతుడై నియమముతో గూడి దేవపూజ నొనరించి స్వస్తివాచనము చేసి బ్రాహ్మణుల బూజించి చరలగ్నమున పెకలించి దాని వేళ్లను వెలికిం దీయనగును.

పిమ్మట నావేళ్లను నీళ్లచేత శుభ్రముగ కడిగి వానిపైపట్ట నొలిచి దానిలో ఆమ్ర (ఒకపలప్రమాణ) మాత్రమైనను కాలుపలమైనను గ్రహించి మెత్తగ నూరి ముద్దజేసి పాలతో గలిపి యుదయకాలమున ప్రతిదినంబును త్రాగవలెను. లేక పైజెప్పిన పరిమాణప్రకారము మెత్తగ చూర్ణము జేసి పాలతో జేర్చియైనను తేనెను నేతినైనను కలిపి యైనను త్రాగవలెను. అయ్యది జీర్ణమైనపిదప సంబావుబియ్యపుటన్నముసైనను అరువదినాళ్ల సంబావులబియ్యపుటన్నముసైనను పాలను నేతిని కలిపి భుజింపనగును. పైజెప్పినప్రకారము ఒకసంవత్సరకాలము సేవించినచో పూర్వము జెప్పినగుణములు గల్గి నూరువత్సరములకాలము యౌవనవయసు స్థిరమై సుఖముగ జీవించును.

## 7-24 బలాదిస్వరసయోగములు పదునెనిమిదియు.

మూ. బలాఽతిబలా చన్దనాగురుధవ (తినిశ) ఖదిర శింశపాఽసనస్వరసాః, పునర్నవాన్తాశ్చౌషధయో దశ నాగబలయా వ్యాఖ్యాతాః. స్వరసానామలాభే త్వయం స్వరసవిధిః—చూర్ణానామాఢకమాఢకముదకస్య అహోరాత్రస్థితం మృదితపూతం స్వరసవత్ ప్రయోజ్యమ్ 12

వ్యా. చిట్టాముట్టి, పేరాముట్టి, చందనము, అగరు, చంద్ర, (నెమ్మిచెట్టు), వెలిచంద్ర, ఇరుగుడుచెట్టు, వేగిచెట్టు, అను నీచెట్లవేళ్లను, "అమృతాభయా...పునర్నవాః" (సూత్రస్థానము. ౪ అధ్యా) అనుగ్రంథముచేత షడ్విరేచనశతాశ్రితీయాధ్యాయమున జెప్పబడిన తిప్పతీగెమొదలు గలిజేరువరకునుంగల వయస్థాపనములగు పదిచెట్లవ్రేళ్లను ఒక్కొకదానిని వేరువేరుగ స్వరసకల్పవిధిప్రకారము స్వరసముజేసి వేరువేరుగ నుపయోగింపనగును. వీనిసేవించుక్రమము పథ్యము మున్నగునవి నాగబలారసాయనక్రమము ననుసరించి యుపయోగింపందగును. కావున పైజెప్పిన నాగబలాకల్పమును గమనించునది. పైజెప్పినవాని స్వరసము లభింపనిచో నీక్రింద విధింపబడు ప్రకారాంతరముగ స్వరసమును గల్పించునది:—పైజెప్పిన చెట్లవేళ్లను నాగబలాకల్పప్రకారము గ్రహించి మెత్తగ చూర్ణము జేసి యాఢకపరిమితమగు చూర్ణమున నొకయాఢకపరిమిత మగుజలమును బోసి యొక యహోరాత్రకాలము నాననిచ్చి చేతితో చక్కగ పిసికి గుడ్డచే వడగట్టి యారసమును స్వరసమునువలెనే సేవించునది.

ఇచ్చట "పునర్నవాన్తాశ్చౌషధయో దశ" అనుచోట "అమృతాభయాధాత్రీముక్తాశ్వేతాజీవన్త్యతిరసామణ్డూకపర్ణీస్థిరా పునర్నవాః, ఇతి దశేమాని వయస్థాపనాని భవన్తి." (సూత్ర. ౪ అధ్యాయ. ౨౩ సూత్రము) అని షడ్విరేచనశతాశ్రితీయమున

జెప్పబడిన తిప్పతీగె, కరకకాయలు, ఉసిరికకాయలు, సన్నరాష్ట్రము, దుంపరాష్ట్రము, పాలకూర, పిల్లిపీచర, వల్లారియాకు, ముయ్యాకుపొన్న, గలిజేరు అనునీపదిటిని గ్రహింప వలెనని తెలియునది.

స్వరసకల్పనము:—"ఆహతాత్ తత్క్షణాకృష్టాత్ ద్రవ్యాత్ క్షుణ్ణాత్ సముద్భవేత్, వస్త్రనిష్పీడితో యశ్చ రసస్స్వరస ఉచ్యతే" వేరు ఆకు మున్నగు నోషధిద్రవ్యమును తీసి పచ్చిగ నుండునపుడే మెత్తగ దంచి గుడ్డలో నునిచి పడబెట్టి పిండినచో దాన స్రవించురసము స్వరసము. అట్టిస్వరసమును తీయ వలనుపడనినాడు "చూర్ణానామాఢకం...స్వరసవత్" అని పైనిచెప్పబడినప్రకారాంతరముగ స్వరసమును గల్పించునది.

## 25 భల్లాతకక్షీరరసాయనయోగము.

మూ. భల్లాతకాన్యనుపహతాని అనామయాని ఆపూర్ణరసప్రమాణ వీర్యాణి పక్వజామ్బవప్రకాశాని, శుచౌ శుక్రే వా మాసే సంగృహ్య, యవపల్లే మాషపల్లే వా నిధాపయేత్. తాని చతుర్మాసస్థితాని సహసి సహస్యే వా మాసే ప్రయోక్తుమారభేత శీతస్నిగ్ధమధురోపస్కృతశరీరః.
పూర్వం దశభల్లాతకాన్యాపోథ్య అష్టగుణేనాఽమ్భసా సాధు సాధయేత్, తేషాం రసమష్టభాగావశేషం పూతం సపయస్కం పిబేత్ సర్పిషాఽన్తర్ముఖ మభ్యజ్య, తాన్యేకైకభల్లాతకోత్కర్షాపకర్షేణ దశ భల్లాతకాన్యా త్రింశతః ప్రయోజ్యాని, నాతఃపరముత్కర్షః. ప్రయోగవిధానేన సహస్రపర ఏవ భల్లాతకప్రయోగః. జీర్ణే చ ససర్పిషా పయసా శాలిషష్టికాశనముపచారః ప్రయోగాన్తే చ ద్విస్తావత్ పయసైవోపయోగః తత్ప్రయోగాద్వర్ష శతమజరం వయస్తిష్ఠతీతి సమానం పూర్వేణ. 13

(ఇతి భల్లాతకక్షీరమ్.)

వ్యా. ఎండ గాలి వర్షము మున్నగువాని యధికమైన తాకుడుచే చెడక, జీడ పుప్పి మున్నగువృక్షసామాన్యములైన రోగములచే చెడక, పూర్ణములగు రసంబును పరిమాణంబును వీర్యంబును గల్గి, చక్కగ పండిన నేరేడుపండ్లవలె నల్లనికాంతి కల్గియుండు

నల్లజీడిగింజలను జ్యేష్ఠమాసమునందైనను ఆషాఢమాసమునందైనను గ్రహించి, యవలరాశి యందైనను, ఉద్దులరాశియందైనను నాల్గుమాసములకాల మునిచి పిమ్మట నాగింజలను వెలికిందీసి యుంచుకొనునది.

పిమ్మట మనుజుడు గుణవీర్యంబులచే శీతంబులును స్నిగ్ధంబులును మధురంబులును నగుపదార్థముల సేవించుటచే శరీరమును సంస్కరించుకొని పైజెప్పిన జీడిగింజల బ్రయో గింప ప్రయత్నము చేయవలెను. అందు తొలుత పదిజీడిగింజలను నలియ దంచి దాని సెనిమిదిభాగములు నీళ్లు బోసి యెనిమిదవవంతు మిగులునట్లు కాచి యారసమును వడగట్టి యందు ఆవుపాలు కలిపి ముందు నోటికి నెయ్యిపూసికొని పిమ్మట పాలతో గూడి యాజీడిగింజలరసమును మార్గశీర్షమాసమునందైనను పుష్యమాసమునందైనను త్రాగ వలెను. ఇది మొదటిదినమున సేవించువిధి.

పిమ్మట రెండవదినము మొదలు ఒక్కొకదినమునకు ఒక్కొకజీడిగింజవంతున ప కన్న అధికముగ జేర్చికొని పైజెప్పినరీతిగ సెనిమిదిపాళ్లు నీళ్లు బోసి యెనిమిదవపాలు మిగుల కాచి వడగట్టి పాలు కలిపి త్రాగవలెను. ఇత్తెరంగున దినమున కొక్కొక గింజ వంతున హెచ్చించుచు ముప్పదిగింజలగునందాక పైజెప్పినరీతి సేవించునది. గింజలసంఖ్య ముప్పదియైన మరుసటిదినమునుండి దినమున కొక్కొకగింజవంతున తగ్గించుచు ప్ర దినంబు పైజెప్పినవిధముగ సేవించునది. పదిగింజలవరకు తగ్గించి మరల మునుపటివ హెచ్చించునది. ఈతీరున తాను మొదటినుండియు నుపయోగించిన గింజలన్నియు జే గింజల మొత్తము సంఖ్య వేయియగునంతవరకును ప్రయోగింపవలెను. వేయిసంఖ్య పూర్తియగుసరికి మానవలెను.

ఇత్తెరంగున సేవించునపుడు ప్రతిదినంబును ఔషధము జీర్ణమై యాకలి క నప్పుడు రాజనములయన్నమునైనను అరువదిసాళ్ల సంబావులయన్నమునైనను నేతి పాలను కలిపి భుజింపనగును. ఈయౌషధసేవన ప్రయోగము పూర్తియైనపిదప దినమ నకు రెండుసారులు పాలను మాత్రము కలిపి భుజింపవలెను. ఈరసాయనము నుపయో గించుటవలన యౌవనము స్థిరముగ నిలిచి పైజెప్పబడిన గుణములన్నియుఁ గల్గి నూరి వత్సరములకాలము సుఖముగ జీవించి యుండును. ఇయ్యది భల్లాతక్షీరరసాయన మ బడును.

ఇచ్చట పైజెప్పిన భల్లాతకక్షీరమును పైజెప్పినవిధిప్రకారము వేయిజీడిగింజల పూర్తియగునంతలో నేయే ప్రకృతికి నెంతకాలము సేవించుట యుక్తముగ నుండునో అంతవరకు నుపయోగించవలె ననియు వేయిసంఖ్యకు పైన సేవింపదగదనియు పరమావ పరిమాణము సెరుంగునది.

### 26 భల్లాతకక్షౌద్రరసాయనము.

మూ. భల్లాతకానాం జర్జరీకృతానాం పిష్టస్వేదనం పూరయిత్వా భూమావాకణ్ఠం నిఖాతస్య స్నేహభావితస్య దృఢస్య ఉపరి కుమ్భస్య ఆరోప్య, ఉడుపేనాఽపిధాయ, కృష్ణమృత్తికావలిప్తం గోమయాగ్నిభిరుపస్వేదయేత్. తేషాం యస్స్వరసః కుమ్భం ప్రపద్యేత, తమష్టభాగమధుసంయుక్తం ద్విగుణఘృతమద్యాత్. తత్ప్రయోగాద్వర్షశతమజరం వయస్తిష్ఠతీతి సమానం పూర్వేణ.
(ఇతి భల్లాతకక్షౌద్రమ్.)

వ్యా. పైని చెప్పబడినగుణములు కల నల్లని జీడిగింజలను ముక్కలుముక్కలుగ జేసి యాముక్కలను ఇడ్డెనమున్నగు పిండివంటకమును పక్వముజేయు పాత్రవలె సన్నని రంధ్రములు కల్గియుండు నొకకుండలో నిండుగ బోసి, నూనె నెయ్యి మున్నగుస్నేహములచే మాగిన వేరొకకుండను భూమిలో గంటత్రవ్వి యందు కంఠమువరకును భూమిలో నిమిడియుండునట్లు పాతి, దానిపైని జీడిగింజలచే నింపియుండు పాత్రము నునిచి నల్లనిబంకమట్టిచే నారెండిటిసందును బంధించి, దానిపై నొకమూకుడు మూసి యేరుడు పిడకలచే మూటుబెట్టి యుడికించునది. అట్టియెడ క్రింద పాతియుండుపాత్రలోనికి జీడిగింజలనుండి తైలము జారును. అట్టిజీడిగింజలస్వరసమునకు నెనిమిదిభాగములు తేనెను, రెండింతలు నేతిని కలిపి ప్రతిదినమున నుదయముపూట జాఠరాగ్ని ననుసరించి యుపయోగించునది. ఈరసాయనమును బ్రయోగించినయెడ నూరువత్సరములవరకును ముసలితనము లేక ముందు జెప్పబడినగుణము లన్నియు కల్గి సుఖముగ జీవించును. (ఇది భల్లాతకక్షౌద్రరసాయన మనబడును.)

### 27 భల్లాతకతైలప్రయోగము.

మూ. భల్లాతకతైలపాత్రం సపయస్కం మధుకేన కల్కేన అక్షమాత్రేణ శతపాకం కుర్యాత్. ఇతి సమానం పూర్వేణ. 15
(ఇతి భల్లాతకతైలమ్.)

వ్యా. (పైని "భల్లాతకానాం......యస్స్వరసః కుమ్భం ప్రపద్యేత" అను గ్రంథముచే జెప్పబడిన విధిప్రకారము సిద్ధమైన భల్లాతకస్వరసము. ఇదియే భల్లాతకతైలమనియు చెప్పబడును) అట్టి భల్లాతకతైలమును పాలును ఒకపాత్రప్రమాణము(ఆఢకము)

సిద్ధము చేసికొని అందు సమభాగము ఆవుపాలను బోసి అక్ష(కర్ష)ప్రమాణము అతిమ
కల్కమును జేర్చి స్నేహపాకవిధిప్రకారము పక్వము చేయునది. ఇత్తెరంగున పైజె
పాలను అతిమధురకల్కమును మాటిమాటికి జేర్చుచు నూరుపర్యాయములు ఆజీడివి
తైలమును పక్వము చేయనగు, ఈభల్లాతకతైలమును పైజెప్పినభల్లాతకస్వరసమున
నెనిమిదింతలు తేనెను నాల్గవపాలు నేతిని చేర్చి తగినపరిమాణముచే సేవింపనగు
తక్కినక్రమంబును ఫలంబును పైజెప్పినప్రకారమని యెరుంగునది. (ఇది భల్లాతక
ప్రయోగవిధానము).

## 28-37. భల్లాతకయోగవిశేషములు.

మూ. భల్లాతకసర్పిః, భల్లాతకక్షీరం; భల్లాతకక్షౌద్రం గుడభల్లాత
భల్లాతకయూషః, భల్లాతకతైలం, భల్లాతకపలలం, భల్లాతకసక్తు
భల్లాతకలవణం, భల్లాతకతర్పణమితి భల్లాతకవిధాన ము
భవతి.

(ఇతి భల్లాతకవి

వ్యా. మరియు భల్లాతకఘృతము, భల్లాతకక్షీరము, భల్లాతకక్షౌద్రము,
భల్లాతకము, భల్లాతకయూషము, భల్లాతకతైలము, భల్లాతకపలలము (జీడిగింజల
సంస్కరింపబడినమాంసము), భల్లాతకసక్తువు (భల్లాతకముల జేర్చి సంస్కరింపబడిన
పిండి), భల్లాతకలవణము, భల్లాతకతర్పణము నని పదివిధములగు భల్లాతకయోగవి
ముల నూహించి యథోక్తముగ నుపయోగించునది.

ఇచ్చట నెయ్యి, పాలు, తేనె, బెల్లము, గంజి, తైలము, మాంసము, సత్తు
లవణము, తర్పణము అను నీపదిటిని వేరువేరుగ జీడిగింజల జేర్చి సంస్కారము చేయ
నదియు లేక, చేర్చబడినదియు, పైజెప్పబడిన భల్లాతకఘృతము మున్నగు శబ్దము
జెప్పబడును. ఈవిషయము జతూకర్ణతంత్రమున నిట్లు చెప్పబడినది:—"భల్లాతకసంయ
సంస్కృతాని చ ఘృతక్షీరక్షౌద్రగుడయూషతైలపలలసక్తులవణతర్పణాని."

## భల్లాతకసామాన్యగుణములు.

భవన్తి చాత్ర:—

మూ. భల్లాతకాని తీక్ష్ణాని పాకీన్యగ్నిసమాని చ,
భవన్త్యమృతకల్పాని ప్రయుక్తాని యథావిధి.
ఏతే దశవిధాస్త్వేషాం ప్రయోగాః పరికీర్తితాః,
రోగప్రకృతిసాత్మ్యజ్ఞః తాన్ ప్రయోగాన్ ప్రకల్పయేత్.

కఫజో న స రోగోఽస్తి న విబన్ధోఽస్తి కశ్చన,
యం న భల్లాతకం హన్యాత్ శీఘ్రం మేధాగ్నివర్ధనమ్. 19

వ్యా. భల్లాతకములు (జీడిగింజలు) మిక్కిలి తీక్ష్ణగుణంబులు కల్గినవియు, పాచనంబులును, అగ్నినిబోలె మంటను బొబ్బలను కల్గించునవియు నగును. అట్టిగుణములు కల్గియున్నను విధిననుసరించి వీని నుపయోగించినచో నివి యమృతతుల్యములై జరావ్యాధుల నివర్తిపరచి యమితాయువును వృద్ధిచేయును. వీని నుపయోగించు ప్రయోగములు పైజెప్పిన భల్లాతకఘృతాది భేదములచే పదివిధములుగ నుండును. అట్టి పదివిధములైన యోగములను రోగములను వాతాదిప్రకృతిభేదములను వారివారిసాత్మ్యమును (అలవాటును) చక్కగ గమనించి, తత్తదనుగుణముగ కల్పించి యుక్తియుక్తముగ నుపయోగింపం దగును. మరియు భల్లాతకయోగప్రయోగముచే నివర్తించని కఫరోగంబైనను మలబద్ధకమైనను ఒక్కటైన లేదు. (అన్నివిధములైన కఫరోగములను మలబద్ధకమును భల్లాతకయోగప్రయోగముచే తప్పక హరించునని భావము.) మరియు నీయోగసేవనముచే బుద్ధికౌశలంబును అగ్నిదీప్తియు వృద్ధినొందును.

## రసాయనసేవనప్రాశస్త్యము.

మూ. ప్రాణకామాః పురా జీర్ణాః చ్యవనాద్యా మహర్షయః,
రసాయనైశ్శివైరేతైః బభూవురమితాయుషః. 20
(జ్ఞానం) బ్రాహ్మం తపో బ్రహ్మచర్యం అధ్యాత్మధ్యానమేవ చ,
దీర్ఘాయుషో యథాకామం సంభృత్య త్రిదివం గతాః. 21
తస్మాదాయుఃప్రకర్షార్థం ప్రాణకామైస్సుఖార్థిభిః,
రసాయనవిధిస్సేవ్యో విధివత్సుసమాహితైః. 22

వ్యా. చిరంతనకాలమునందు చ్యవనుడు మున్నగు మహర్షులు ముదిమిచే శిథిలములైన శరీరము కలవారై అట్టిముదిమిని నివర్తిపరచి బలమును ఆయుర్వృద్ధిని చేసికొనదలచి పైజెప్పబడిన మంగళకరములగు రసాయనముల సేవించి దానంజేసి యపరిమితాయుష్యము నొంది బ్రహ్మోపాసనరూపమైన తపస్సును బ్రహ్మచర్యమును ఆధ్యాత్మికపరమార్థవస్తుధ్యానమును చేయుచు, చిరకాలము ఆయుష్యముకలవారై తమకు వలసినంతకాలము పరమార్థసాక్షాత్కారసాధనమగు జ్ఞానమును పూర్తిగ సంపాదించి చిట్టచివరకు బ్రహ్మసాయుజ్యపదవి నొందగల్గిరి. కావున లోకమున ప్రాణకాములును సుఖాభిలాషులును చిరకాలమువరకాయుర్వృద్ధిని అభిలషించువారును పైజెప్పిన రసాయనవిధిని విధ్యుక్తప్రకారము మిక్కిలి జాగరూకులై సేవింపనగును.

—౨ ద్వితీయపాదవిషయసంగ్రహము. ౧—

తత్ర శ్లోకః.—

మూ. రసాయనానాం సంయోగాః సిద్ధా భూతహితైషిణా,
నిర్దిష్టాః ప్రాణకామీయే సప్తత్రింశన్మహర్షిణా. 23

వ్యా. ఇత్తెరంగున ప్రాణకామీయ మను నీరసాయనద్వితీయపాదమున ముప్పది యేడు సిద్ధరసాయనయోగములు ప్రాణులహితమును గోరు అగ్నివేశమహర్షి యను నీతంత్రకారులచే నిర్దేశింపబడినవి.

ఇచ్చట 'బలాతిబలాచందన' అనుసూత్రమున చెప్పబడిన యోగములు పదునెనిమిదియు, భల్లాతక ఘృతాదియోగములు పదియు, తక్కిన ఆమలకరసాదియోగములు తొమ్మిదియు జేరి ముప్పదియేడురసాయనయోగము లగునని యెరుంగునది.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, చికిత్సాస్థానే
ప్రాణకామీయో నామ రసాయనపాదో ద్వితీయః.

ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకమహర్షిప్రతిసంస్కృతంబును నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమున చికిత్సాస్థానమున ప్రథమాధ్యాయమున ప్రాణకామీయమనునది ద్వితీయరసాయనపాదము సంపూర్ణము.

---

## ప్రథమాధ్యాయము—మూడవపాదము.

అవతరణిక:—ద్వితీయపాదమునందుపలెనే యామలకముల ప్రధానముగజేసి యుపక్రమింపబడుటంజేసి అట్టి .కరప్రచితీయమను తృతీయరసాయనపాదము క్రింద వివరింపబడును.

మూ. అథాతః కరప్రచితీయం రసాయనపాదం వ్యాఖ్యాస్యామః 1
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. 2

వ్యా. ప్రాణకామీయ మనురసాయనపాదమును జెప్పినపిదప కరప్రచితీయమను (కరప్రచితశబ్దము నధికరించి చెప్పబడు) రసాయనపాదము భగవంతుడగునాత్రేయు డుపదేశించిన దానికన్న న్యూనాతిరేకము గాకుండునట్లు వివరింపబడునని యర్థము.

—౨ 1. ఆమలకాయసరసాయనము. ౧—

మూ. కరప్రచితానాం యథోక్తగుణానాం ఆమలకానాం ఉద్ధృతాస్థ్నాం
శుష్కచూర్ణితానాం పునః, మాఘే ఫాల్గునే వా మాసే త్రిస్సప్త

కృత్వః స్వరసపరిపీతానాం, పునశ్శుష్కచూర్ణితానాం ఆఢకమేకం గ్రాహయేత్. 3

అథ జీవనీయానాం, బృంహణీయానాం, స్తన్యజననానాం, శుక్రజననానాం, వయస్థాపనానాం, షడ్విరేచనశతాశ్రితీయోక్తానాం (షడ్విరేచనశతీయోక్తానాం) ఔషధగణానాం, చన్దనాగురుధవతినిశఖదిరశింశపాఽసనసారాణాం చ, అణుశః (ఖణ్డశః,) కృత్తానాం అభయావిభీతకపిప్పలీవచాచవ్యచిత్రకవిడఙ్గానాం చ సమస్తానామాఢకమేకం దశగుణేనాఽమ్భసా సాధయేత్. 4

తస్మిన్నాఢకావశేషే రసే సుపూతే తాన్యామలకచూర్ణాని దత్త్వా గోమయాగ్నిభిః వంశవిదళశరతేజనాగ్నిభిర్వా సాధయేద్యావదపనయాద్రసస్య. 5

తమనుపదగ్ధముపహృత్య ఆయసీషు పాత్రేషు ఆస్తీర్య శోషయేత్ సుశుష్కం తత్ కృష్ణాజినస్యోపరి దృషది శ్లక్ష్ణపిష్టమయస్థాల్యాం నిధాపయేత్సమ్యక్, తచ్చూర్ణమయశ్చూర్ణాష్టభాగ సంయుక్తం మధుసర్పిర్భ్యాం అగ్నిబలమభిసమీక్ష్య ప్రయోజయేదితి. 6

వ్యా. ప్రాణకామీయ రసాయనపాదమున 'ఆమలకానాం సుభూమిజానాం' అని యుపక్రమించి చెప్పబడిన లక్షణములు కల్గియుండు నుసిరికపండ్లను మాఖఫాల్గున మాసములయందు చెట్టునుండి (తమంతట రాలనీయక) చేతులతో కోసి గ్రహించి (రోటదంచి) వాని లోపలిగింజలను వేరుగ తీసివేసి యెండించి మెత్తగ చూర్ణము చేసి యా చూర్ణమును ఒక ఆఢకపరిమితమును ఇతరములగు నుసిరికకాయలస్వరసమున (భావనావిధి ప్రకారము) భావనజేయవలెను. ఇత్తెరంగున నిరువదియొకమార్లు భావనజేసి యారస మంతయు చూర్ణమున నిమిడినపిదప మరల చెమ్మలేకుండునట్లు చక్కగనెండించి మెత్తగ చూర్ణము చేసి ఆఢకపరిమితమును గ్రహించి యుంచుకొనునది.

పిమ్మట సూత్రస్థానమునందలి షడ్విరేచనశతాశ్రితీయమను నాల్గవయధ్యాయమున జెప్పబడిన జీవనీయములు, బృంహణీయములు, స్తన్యజననములు, శుక్రజననములు, వయస్థాపనములు అను నీకషాయవర్గము లైదిటియందును జెప్పబడిన యౌషధములను; మంచిగంధము, అగరు, వెలిచంద్ర, నెమ్మిచెట్టు, చంద్ర, ఇరుగుడు చెట్టు, వేగిచెట్టు,

అనుసీచెట్లయొక్క చేవచెక్కలను; కరకకాయలు, తానికాయలు, పిప్పళ్లు, చవ్యము, చిత్రమూలము, వాయువిడంగములు, అనుసీద్రవ్యములను; వీనినన్నింటిని ముక్కలు ముక్కలుగ ఖండించి ఇవియన్నియు చేరి (సమభాగములుగ జేరిన సముదాయము) యొక ఆఢకపరిమితముగ నుండునట్లు గ్రహించి, అందు పదింతలు (పదియాఢకములు) నీళ్లు బోసి ఒక ఆఢకపరిమితముగ మిగులునట్లు కషాయము కాచవలెను.

పిదప నాకషాయమును వడియకట్టి యందు పైజెప్పినరీతిగ భావనజేసి యుంచబడిన ఒక ఆఢకపరిమితమగు నుసిరికకాయలచూర్ణమును బోసి కలిపి యొకపాత్రలో నునిచి ఆవుపేడపిడకల నిప్పునందైనను, వెదురుబద్దల నిప్పునందైనను, రెల్లుకాడలనిప్పునందైనను, కామంచిపూరినిప్పునందైనను, ఔషధమునందలికషాయమంతయు నిగురునందాక పక్వము చేయవలెను.

ఇత్తెరంగున నాకషాయమంతయు చుండి ఔషధము మాడకయుండుపక్వసమయమును గమనించి యగ్నినుండి వెలికిందీసి యినుపమూకుళ్లయందు బోసి నెరచి చెమ్మ లేకుండునట్లు ఎండించవలెను. చక్కగ నెండినపిదప నొకకృష్ణాజినమును క్రింద పరిచి దానిపై నొక నూరుడురాతిని బెట్టి అందుపై యౌషధము నునిచి మెత్తగ నూరవలెను. అట్లు నూరబడిన యాచూర్ణమును ఇనుపపాత్రలో నునిచి మూసి పదిలముగ నుంచవలెను.

పిమ్మట శుభముహూర్తమునం దాచూర్ణమునకు ఎనిమిదవవంతు లోహభస్మమును కలిపి జీర్ణశక్తికి దగిన పరిమాణముగ గ్రహించి అందు తేనెను నేతిని కలిపి పుచ్చుకొనవలెను.

ఇచ్చట 'కరప్రచితానాం' అని చెప్పుటచేత తమంతట వ్రాలిన యుసిరికకాయలు ఈయౌషధయోగమునకు దగదనియు, "మాఖే ఫాల్గునే వా" అనుటచేత మాఖఫాల్గున మాసములయందు కాలస్వభావమునంజేసి యామలకములు వీర్యవత్తరములుగ నుండును కావున నట్టికాలముననే గ్రహింపనగుననియు నెరుంగునది. మరియు "స్వరసపరిపీతానాం" అన్నచోట వస్తువిశేషనిర్దేశము లేకున్నను ఆమలకయోగము ప్రకృతమగుటవలన నామలకస్వరసమునే గ్రహింపదగును. "జీవనీయానాం... ఔషధగణానాం" అను చోట సూత్రస్థానమున నాలవయధ్యాయమున, 'జీవకర్షభకౌ' (సూ. ౨౮) అను సూత్రముచే జెప్పబడిన జీవనీయగణద్రవ్యములు పదియును, "క్షీరిణీ రాజక్షవక" (సూ. ౨౯) అనుసూత్రమున జెప్పబడిన బృంహణీయగణద్రవ్యములు పదియును, "వీరణశాలిషష్టికేక్షు" (సూ. ౪౦) అనుసూత్రమున జెప్పబడిన బృంహణీయగణద్రవ్య

ములు పదియును, "జీవకర్ష భకకాకోలీ" (సూ. ౪౨) అనుసూత్రమున జెప్పబడిన బృంహణీయగణద్రవ్యములు పదియును, "అమృతాభయాధాత్రీ" (సూ. ౭3) అను సూత్రమున జెప్పబడిన వయస్థాపనగణద్రవ్యములు పదియును గ్రహింపనగును. భావనయన రాత్రియంతయు స్వరసమున చూర్ణము మునిగి తడియునట్లు నానబెట్టి పగలు ఎండ నెండింపనగును. ఈవిషయమున పరిభాషయిట్లున్నది.—"ద్రవేణ యావతా సమ్యక్ చూర్ణం సర్వం ప్లుతం భవేత్, భావనాయాః ప్రమాణన్తు చూర్ణే ప్రోక్తం భిషగ్వరైః, దివాదివాతపే శుష్కం రాత్రౌ రాత్రౌ నివాసయేత్."

మరియు గోమయాగ్ని మున్నగు నుపకరణవిశేషముల నిర్దేశించుటచే అట్టివస్తు విశేష సంయోగముచే ప్రభావమునంజేసి గుణోత్తేజనము కల్గునని తెలిసెడి. ఈవిషయమున నార్షమునకు ప్రమాణము అట్టిప్రభావము కేవలము ఋషివర్యైకవేద్యమని "ఋషయస్త్వేవ జానంతి యోగసంయోగజం ఫలమ్" అనువచనాంతరము తెలుపుచున్నది.

మరియు కషాయమునకు జెప్పిన జీవనీయగణాదిద్రవ్యములకు వేరువేర భాగములు చెప్పకుండుటచే "భాగేఽప్యనుక్తే సమమేవ దేయం" అనుసామాన్యపరిభాషచే నాద్రవ్యములు సమభాగములుగ నుండవలెననియు, 'సమస్తానామాఢకమేకం' అని చెప్పుటచేత అట్లు సమభాగములుగ జేరిన కషాయద్రవ్యము లన్నియును కలిసి యొక యాఢక (అరువదినాల్గుపలములు) పరిమితమై యుండవలెననియు నెరుంగునది. కృష్ణాజినముపై రాతినుంచి దానిలో నౌషధము నూరవలెనుట వేదసిద్ధమైన ప్రాచీనశ్రౌత సంప్రదాయానుసారమని తెలియనగును.

## ఆమలకాయసరసాయనప్రభావగుణములు.

భవన్తి చాత్రః—

మూ. ఏతద్రసాయనం పూర్వం వసిష్ఠః కశ్యపోఽఙ్గిరాః,
జమదగ్నిర్భరద్వాజః భృగురన్యే చ తద్విధాః. 7
ప్రయుజ్య ప్రయతా ముక్తాః శ్రమవ్యాధిజరాభయాత్,
యావదైచ్ఛంస్తపస్తేపుః తత్ప్రభావాన్మహాబలాః. 8
ఇదం రసాయనం చక్రే బ్రహ్మా వార్షసహస్రికం,
జరావ్యాధిప్రశమనం బుద్ధీన్ద్రియబలప్రదమ్. 9

(ఇత్యామలకాయసం బ్రాహ్మరసాయనమ్.)

వ్యా. పైజెప్పబడినరసాయనమును పూర్వకాలమున వసిష్ఠుడు, కశ్యపుడు, అంగిరసుడు, జమదగ్ని; భరద్వాజులు, భృగువును, వీరికి సమానులగు ఇతరదేవర్షి బ్రహ్మర్షి

లును విధ్యుక్తప్రకారము నియమవంతులై సేవించి శ్రమము వ్యాధులు ముసలితనము అనువానిచే భయమించుకేనియు లేక, వారి కిచ్చవచ్చినంత కాలము తపస్సుచేసి దీనిప్రభావమునంజేసి బలాధికులై కడపట పరమపురుషార్థమగు ముక్తిని బడసిరి.

మరియు వర్షసహస్రములవరకును జరావ్యాధుల రానీయక శమింపజేయునదియు, బుద్ధికిని ఇంద్రియములకును బలమును గల్గించునదియు నగు నీరసాయనమును సృష్టికర్త యగు బ్రహ్మ తొలుత జేసెను. (కావున నీరసాయనము బ్రాహ్మ మనియు చెప్పబడును).

### రసాయనసేవనమున సామాన్యనియమములు.

మూ. తపసా బ్రహ్మచర్యేణ ధ్యానేన ప్రశమేన చ,
రసాయనవిధానేన కాలయుక్తేన చాయుషా. 10
స్థితా మహర్షయః పూర్వం, న హి కిఞ్చిద్రసాయనం,
గ్రామ్యాణామన్యకార్యాణాం సిధ్యత్యప్రయతాత్మనామ్. 11

వ్యా. పురాతనకాలమున రసాయనవిధానమును సహాయముగ జేసికొని అనియత కాలమగు నాయుష్యమునొంది, తపస్సును బ్రహ్మచర్యమును పరంబ్రహ్మధ్యానమును ఇంద్రియప్రశమమును బొందియుండిరి. అటుగాక కేవలము నీచములగు నైహికకార్యముల జేయుచు నింద్రియనిగ్రహము లేనిమానవులకు రసాయనము కొంచెమైనను పని సేయ నేరదు. (తపస్సు బ్రహ్మచర్యము ధ్యానము మున్నగుపనులను ఇంద్రియనిగ్రహపూర్వకముగ జేయువారికి మాత్రమె యీరసాయనవిధానము ఫలవంతమగును గాని కేవలము ఐహికమగునీచఫలము నపేక్షించి యింద్రియపరవశుడై ఐహికకృత్యముల మాత్రము చేయువానికి రసాయనము ఫలవంతము కానోపదని భావము.)

### 2. కేవలామలకరసాయనము.

మూ. సంవత్సరం పయోవృత్తిః గవాం మధ్యే వసేత్సదా,
సావిత్రీం మనసా ధ్యాయన్ బ్రహ్మచారీ యతేన్ద్రియః. 12
సంవత్సరాన్తే పౌషీం వా మాఘీం వా ఫాల్గునీం తిథిం,
త్ర్యహోపవాసీ శుద్ధశ్చ (శుక్లస్య) ప్రవిశ్యామలకీవనమ్. 13
బృహత్ఫలాఢ్యమారుహ్య ద్రుమం శాఖాగతం ఫలం,
గృహీత్వా పాణినా తిష్ఠేత్ జపన్ బ్రహ్మామృతాగమాత్. 14
తదా హ్యవశ్యమమృతం వసత్యామలకే క్షణం,
శర్కరామధుకల్పాని స్నేహవన్తి మృదూని చ. 15

భవ న్త్యమృతసంయోగాత్ తాని యావ న్తి భక్షయేత్,
జీవేద్వర్ష సహస్రాణి తావన్త్యాగతయౌవనః. 16
సౌహిత్యమేషాం గత్వా తు భవత్యమరసన్నిభః,
స్వయం చాస్యోపతిష్ఠ న్తే శ్రీర్వేదాః వాక్చ రూపిణీ. 17

(ఇతి కేవలామలకరసాయనమ్.)

వ్యా. రసాయనమును సేవింప దలచినమానవుడు ఒకసంవత్సరకాలము ఆహారము నకు ఆవుపాలను మాత్రము త్రాగుచు బ్రహ్మచర్యము నవలంబించి చక్షురాదీంద్రియ ముల నిగ్రహించి స్వవశమున నుంచుకొని గాయత్రీమంత్రమును మనస్సునందే ధ్యానము చేయుచు వత్సరకాలము పూర్తియగునంతవరకును ఆవులగుంపునడుమనుండవలెను. సంవత్సర కాలము పూర్తియైనపిదప పుష్య-మాఘ-ఫాల్గునమాసములలో వచ్చుపూర్ణిమతిథులలో నొకపూర్ణిమకు ముందు మూడుదినము లుపవాసముచేసి పరిశుద్ధుడై యుసిరికచెట్లువన ములో ప్రవేశించి గొప్పపండ్లతో నిండియుండు నొకయుసిరికచెట్టుపై నెక్కి యాచెట్టుకొమ్మనుండు పండ్లను చేతబట్టుకొని బ్రహ్మామృతము ఆపండ్లయందు వచ్చువరకును పరంబ్రహ్మరూపమైన ప్రణవమును (ఓంకారమును) జపముచేయుచు నుండవలెను. అట్టి సమయమున నాయుసిరికపండునందు అమృతము ఒకక్షణకాలము అవశ్యముగ నావహించి యుండును. అప్పు డట్టియమృతసంబంధమునంజేసి యాయుసిరికపండ్లు చక్కెరతోను తేనెతోను సమములై స్నిగ్ధంబులును మృదుమధురంబులు నై యుండును.

ఇత్తెరంగున నాపండ్ల నభిమంత్రించి తినవలెను. ఇత్తెరంగున నెన్ని యుసిరిక పండ్లను తినునో అన్ని వేల సంవత్సరములు జరావ్యాధులబాధలేక నిత్యయౌవనవంతుడై జీవించియుండును. మరియు నిత్తెరంగున కడుపునిండుగ (తాను మామూలుగ నాహారము చేయుపరిమితముగ) తినినచో దేవతలతోసమానమైన రూపాదులు కల్గి జరామరణ రహితుడై సుఖముగ నుండును. లక్ష్మియు వేదంబులును వాక్కు కధిష్ఠాన దేవతయగు సరస్వతియు స్వస్వరూపముతో వానిచెంత జేరి యుండును.

ఇచ్చట పైజెప్పిన నియమవ్రతాచరణ ప్రభావమునంజేసి యుసిరికపండ్లయం దమృతసాన్నిధ్యము కల్గునని యెరుంగునది. "సంవత్సరాన్తే పౌషీం వా" అనుచోట తాను వ్రతమును బూనుదినము మొదలు పుష్యమాఘఫాల్గునమాసములయందలి పూర్ణి మలలో నొకతిథికి సంవత్సరకాలము పూర్తికావలెను. పూర్తియైననాటిదినమే పైజెప్పిన రీతిగ నుసిరికపండ్ల గ్రహించి సేవింపనగునని తెలియునది. (ఇయ్యది వస్త్వంతర సంయోగము లేక యుసిరికపండ్లచేత నే చేయదగిన రసాయనవిధి.)

### 3. లోహాదిరసాయనయోగము.

మూ. త్రిఫలాయా రసే మూత్రే గవాం క్షారే చ లావణే,
క్రమేణ చేఙ్గుదీక్షారే కింశుకక్షార ఏవ చ. 18
తీక్ష్ణాయసస్య పత్రాణి వహ్నివర్ణాని సాధయేత్ (వాపయేత్),
చతురఙ్గుళదీర్ఘాణి తిలోత్సేధతనూని చ (సమాని చ). 19
జ్ఞాత్వా తాన్యఞ్జనాభాని సూక్ష్మచూర్ణాని కారయేత్,
తాని చూర్ణాని మధునా రసేనామలకస్య చ. 20
యుక్తాని లేహవత్కుమ్భే స్థితాని ఘృతభావితే,
సంవత్సరం విధేయాని యవపల్లే తథైవ చ. 21
దద్యాదాలోడనం మాసే సర్వత్రాలోడయన్ బుధః,
సంవత్సరాత్యయే తస్య ప్రయోగో మధుసర్పిషా. 22
ప్రాతఃప్రాతః బలాపేక్షీ సాత్మ్యం జీర్ణే చ భోజనం,
ఏష ఏవ చ లౌహానాం ప్రయోగస్సంప్రకీర్తితః. 23
అనేనైవ విధానేన హేమ్నశ్చ రజతస్య చ,
ఆయుః ప్రకర్షకృత్సిద్ధః ప్రయోగస్సర్వరోగనుత్. 24

వ్యా. ఉక్కులోహమును నాలుగంగుళములనిడివియు నువ్వుగింజంత ఘనంబు నుండునట్లు రేకులుకొట్టించి వానిని నిప్పులలో నెఱ్ఱగకాల్చి త్రిఫలాకషాయమున ముంచవలెను. మరల నారేకుల నెఱ్ఱగ కాల్చి గోమూత్రమున ముంచవలెను. ఇత్తెరంగున జ్యోతిష్మతి (మాల్కంగిని) క్షారోదకమునందును, గారచెట్టుఆకులక్షారజలమునందును, మోదుగాకులక్షారజలమునందును వరుసగ నిప్పున కాల్చుచు ముంచవలెను. (ఒకక్షార మున ముంచి మరల నెఱ్ఱనగుదాక కాల్చి వేరొకక్షారమున ముంచుచు క్రమముగ పై జెప్పినక్షారములలో ముంచవలెనని భావము.) ఇత్తెరంగున ద్రవములలో ముంచునప్పుడు ఇనుపరేకులు కాటుకవలె నల్లబడినప్పుడు ఆరేకుల నన్నిటిని మెత్తగ చూర్ణముచేసి నేతితో మంగిన యొకకుండలో నునిచి అందు తేనెను ఉశిరికకాయలరసమును కలిపి లేహమువలె నుండునట్లు చక్కగ కలియబెట్టి పదిలముగ మూసి యవధాన్యపురాశిలో నొకసంవత్సరకాలము భద్రముగ నుంచవలెను. మరియు నాయౌషధమును మాసమున కొకతూరి వెలికిం దీసి యౌషధమును చక్కగ కలియంద్రిప్పి మరల మునుపటివలెనే ధాన్యరాశిలో నుంచుచుండవలెను. ఇత్తెరంగున చేయుచు సంవత్సరకాలము పూర్తియైన

పిదప నాలేహమును బైటదీసి యందు తేనెను నేతిని కల్పి జీర్ణశక్తికి దగినపరిమాణముచే ప్రతిదినంబు నుదయకాలమున సేవింపదగును. ఔషధము జీర్ణమైనపిమ్మట తనకలవాటు ననుసరించి యాహారము జేయనగును. తక్కినలోహముల నన్నిటిని పైజెప్పిన విధిప్రకారము రసాయనయోగముజేసి యుపయోగింపనగును. మరియు వెండిని బంగరును కూడ పైజెప్పినవిధి ననుసరించి రసాయనముజేసి యుపయోగింపనగును. దీనివలన సర్వరోగములును నశించి ఆయుష్య మధికమగును.

ఇచ్చట మాల్కంగిని మున్నగువాని క్షారోదకపరికల్పనము నీక్రింద జెప్పెడు విధముగ గల్పించుకొనవలెను. క్షారముగ జేయవలసిన ఆకులు మున్నగువానిని నిప్పులో బూడిదెవలె కాల్చి యాబూడిదెను నాల్గింతలనీళ్లలో కలిపి చక్కగ కాచి తేరబెట్టి యానీటిని యుపయోగింపవలెను.

మరియు "ఏష ఏవ చ లౌహానాం ప్రయోగః సంప్రకీర్తితః" అని చెప్పుట చేతనే స్వర్ణ - రజతములకును ప్రయోగ మేర్పడుచున్నను ప్రత్యేకముగ చెప్పుటచేత నీరెండుప్రయోగములును ప్రధానములనియు ఫలాధికములనియు తెలియదగియున్నది.

## లౌహరసాయనప్రయోగగుణములు.

మూ. నాభిఘాతైర్న చాతఙ్కైః జరయా న చ మృత్యునా,
స ధృష్యస్స్యాద్గజప్రాణః సదా చాతిబలేన్ద్రియః. 25
ధీమాన్ యశస్వీ వాక్సిద్ధః (వాగ్మీ చ) శ్రుతధారీ మహాధనః (బలః,)
భవేత్సమాం ప్రయుంజానో నరో లౌహరసాయనమ్. 26
(ఇతి లౌహాదిరసాయనమ్.)

వ్యా. పైజెప్పిన లోహరసాయనము నొకసంవత్సరకాల ముపయోగించినచో అభిఘాతమునకును వ్యాధులకును ముసలితనమునకును మరణమునకును లోబడక ఏనుగుతో సమానమైన బలముకల్గి ఎల్లప్పుడును ఇంద్రియబలము కలవాడై ప్రశస్తమైన బుద్ధియు యశస్సును వాక్పటుత్వంబును కల్గి జ్ఞాపకశక్తిబలముచే ధారణశక్తి కల్గి మిక్కిలి ధనవంతు డగును.

ఇచ్చట రసాయనప్రయోగప్రభావమునం జేసియే ధనవంతుడు నగునని యెరుంగునది.

## 4. ఐంద్రరసాయనయోగము.

మూ. ఐన్ద్రీ మత్స్యాక్షకో బ్రాహ్మీ వచా బ్రహ్మసువర్చలా,
పిప్పల్యో లవణం హేమ శఙ్ఖపుష్పీ విషం ఘృతమ్. 27

ఏషాం త్రియవకాః భాగాః హేమసర్పిర్విషైర్వినా,
ద్వౌ యవౌ తత్ర హేమ్నస్తు తిలం దద్యాద్విషస్య చ. 28
సర్పిషశ్చ పలం దద్యాత్తదైకధ్యం ప్రయోజయేత్,
ఘృతప్రభూతం సక్షౌద్రం జీర్ణే చాన్నం ప్రశస్యతే. 29
జరావ్యాధిప్రశమనం స్మృతిమేధాకరం పరం,
ఆయుష్యం పౌష్టికం ధన్యం స్వరవర్ణప్రసాదనమ్. 30
పరమోజస్కరం చైతత్సిద్ధమేతద్రసాయనం,
నైనం ప్రసహతే కృత్యా నాఽలక్ష్మీః న విషం న రుక్. 31

వ్యా. చేదుపుచ్చకాయ, పొన్నగంటియాకు, సరస్వతి (వల్లారి) యాకు, వస, బ్రహ్మసువర్చల (ప్రొద్దుతిరుగుడాకు), పిప్పళ్లు, సైంధవలవణము, బంగరు, శంఖపుష్పి (దింటెన), వసనాభి, నెయ్యి ఈద్రవ్యములలో బంగరు వసనాభి నెయ్యి దక్క తక్కిన ద్రవ్యములను దినుసుకొకటికి మూడుయవలప్రమాణంబును, బంగరు రెండుయవలప్రమాణంబును, వసనాభి ఒకనూగింజప్రమాణంబును, నెయ్యి యొకపలంబును జేర్చి, వీని నన్నింటిని నేతిలో నొకటిగ కలిపి (ప్రతిదినంబు నుదయకాలమున) సేవింపనగును. అయ్యది జీర్ణమైన పిదప అన్నమునందు అధికముగ నేతిని తేనెను కలిపి భుజించుట చాల ప్రశస్తము. ఈరసాయనము జరావ్యాధుల శమింపజేయును. జ్ఞాపకశక్తిని బుద్ధిని యధికముగ వృద్ధినందించును. ఆయువు నధికముగ జేయును. శరీరపుష్టిని కల్గించి ధనమును సమృద్ధిగ కల్గించును. కంఠస్వరమును శరీరవర్ణమును నిర్మలముగ జేయును. ఈసిద్ధరసాయనమును సేవించువానిని ఆభిచారకప్రయోగంబులును, అలక్ష్మియు, స్థావరజంగమరూపమగు విషంబును బాధింపనేరవు.

ఐంద్రరసాయనసేవచే నివర్తించువ్యాధులు.

మూ. శ్విత్రం సకుష్ఠం జఠరాణి గుల్మాః
ప్లీహా పురాణో విషమజ్వరశ్చ,
మేధాస్మృతిజ్ఞానహరాశ్చ రోగాః
శామ్యన్త్యనేనాతిబలాశ్చ వాతాః. 32

(ఇతి ఐన్ద్రిరసాయనమ్.)

వ్యా. మరియు నీయైంద్రరసాయనమును సేవించుటచే జరావ్యాధ్యాదులు జేరక యాయుష్యము వృద్ధినందుటయ కాక శ్విత్రము (తెల్లని కుష్ఠము), క్షుద్రమహాకుష్ఠములు, మహోదరములు, గుల్మములు, ప్లీహాభివృద్ధి, చిరకాలమునుండి అనుసరించియుండు

విషమజ్వరములు, బుద్ధిని జ్ఞాపకశక్తిని జ్ఞానమును హరించు మానసికరోగములు, ప్రబలములగు వాతవ్యాధులు ఇవి యన్నియు శమించును. ఇయ్యది యైంద్రరసాయన మన బడును.

### 5—8. మేధాకరములగురసాయనములు నాల్గును.

మూ. మణ్డూకపర్ణ్యాః స్వరసః ప్రయోజ్యః
క్షీరేణ యష్టీమధుకస్య చూర్ణం,
రసో గుడూచ్యాస్తు సమూలపుష్ప్యాః
కల్కః ప్రయోజ్యః ఖలు శఙ్ఖపుష్ప్యాః. 33
ఆయుఃప్రదాన్యామయనాశనాని
బలాగ్నివర్ణస్వరవర్ధనాని,
మేధ్యాని చైతాని రసాయనాని
మేధ్యా విశేషేణ చ శఙ్ఖపుష్పీ. 34
(ఇతి మేధ్యరసాయనచతుష్టయమ్.)

వ్యా. వల్లారియాకు స్వరసమునైనను, అతిమధురముయొక్క చూర్ణమునైనను, తిప్పతీగెరసమునైనను, శంఖపుష్పి (కడిలచెట్టును) వేళ్లుపువ్వులు మున్నగుసమష్టితో గూడినదానికల్కము నైనను, ఆవుపాలతో కలిపి సేవించవలెను.

ఈరసాయనయోగములు నాల్గును ఆయుఃవును వృద్ధినందించును. రోగముల నన్నిటిని శమింపజేయును. బలమును జఠరాగ్నిని శరీరవర్ణమును కంఠస్వరమును వృద్ధినందించును. బుద్ధికి మిక్కిలి హితకరములు. అందును శంఖపుష్పియోగము మిక్కిలి మేధాశక్తిని కల్గించును.

### 9. పిప్పలీరసాయనయోగము.

మూ. పఞ్చాష్టౌ సప్తదశ వా పిప్పలీర్మధుసర్పిషా,
రసాయనగుణాన్వేషీ సమామేకాం ప్రయోజయేత్. 35
తిస్రస్తిస్రస్తు పూర్వాహ్ణే భుక్త్వాగ్రే భోజనస్య చ,
పిప్పల్యః కింశుకక్షారభావితాః ఘృతభర్జితాః. 36
ప్రయోజ్యాః మధుసమ్మిశ్రాః రసాయనగుణైషిణా,
జేతుం కాసం క్షయం శోషం శ్వాసం హిక్కాం గలామయాన్.

అర్శాంసి గ్రహణీదోషం పాణ్డుతాం విషమజ్వరం,
వైస్వర్యం పీనసం శోఫం గుల్మం వాతబలాసకమ్.
(ఇతి పిప్పలీరసాయనమ్

వ్యా. పిప్పళ్లను మోదుగక్షారముచే సిద్ధమైన క్షారోదకమున విధిప్రకార భావనజేసి, పిదప నేతిలో వేయించి, రసాయనమునకు జెప్పిన జరావ్యాధినివృత్తిని అ తాయువు మున్నగుగుణముల గోరుమనుజుడు ప్రతిదినంబును దినమున కైదువంత నైనను, ఎనిమిదేసియైనను, ఏడేసియైనను, పదేసియైనను తేనెను నేతిని కలిపి సేవిం నగును. మరియు పైజెప్పినరీతి సంస్కరింపబడిన పిప్పళ్లను పూర్వాహ్ణమున (ఉదం కాలమున) మూడును, భోజనమునకు ముందు మూడును, భుజించినపిదప మూడు తేనెలో కలిపి సేవింపనగును.

ఇత్తెరంగున పిప్పళ్లను ప్రతిదినంబును ఒకసంవత్సరకాలము సేవించినచో కా బును, క్షయంబును, శ్వాసంబును, ఎక్కిళ్లను, కంఠమునకు సంబంధించినరోగంబులు అర్శోరోగంబును, గ్రహణిరోగంబును, పాండురోగంబును, విషమజ్వరంబును, కం స్వరభేదంబును, పీనసంబును, శోఫంబు (నంజు)ను, గుల్మంబును, వాతబలాసకంబు నివర్తించును. (ఇవి నివర్తించుటయే గాక రసాయనమునకు జెప్పినగుణములును కల్గున భావము).

ఇచ్చట "త్రీణి ద్రవ్యాణి నాత్యుపయుఞ్జీత-పిప్పలీ, క్షారో, లవణం" (విమా అ. ౧) అని పిప్పళ్లి నధికముగ నుపయోగించుట నిషిద్ధమైనను దాని కపవాదము నిచ్చట మరల విధించుటచే రసాయనప్రయోగమున పిప్పళ్లి నభ్యాసయోగముగ ను యోగించుట విరుద్ధము కాదని యెరుంగునది.

పిప్పలీవర్ధమానరసాయనము.

మూ. క్రమవృద్ధ్యా దశాహాని దశపిప్పలికం దినం,
వర్ధయేత్పయసా సార్ధం తథైవాఽపనయేత్పునః. 3
జీర్ణే జీర్ణే చ భుఞ్జీత షష్టికం క్షీరసర్పిషా,
పిప్పలీనాం సహస్రస్య ప్రయోగోఽయం రసాయనమ్. 4
పిష్టాస్తాః బలిభిస్సేవ్యాః శృతా మధ్యబలైర్నరైః,
చూర్ణీకృతాః(శీతీకృతాః) హ్రస్వబలైః యోజ్యాదోషమయాన్ప్రతి
దశపైప్పలికః శ్రేష్ఠః మధ్యమష్షట్ప్రకీర్తితః,
ప్రయోగో యస్త్రిపర్యన్తః సకనీయాన్ స చాబలైః. 4

బృంహణం స్వర్యమాయుష్యం ప్లీహోదరవినాశనం,
వయసః స్థాపనం మేధ్యం పిప్పలీనాం రసాయనమ్. 43
(ఇతి పిప్పలీవర్ధమానం రసాయనమ్) (వర్ధమానపిప్పలీ.)

వ్యా. రసాయనసేవనము నభిలషించుమనుజుడు తొలుత నొకదినమున పదిపిప్పళ్లను పాలతో కలిపి పుచ్చుకొనవలెను. రెండవదినమున నిరువదిపిప్పళ్లను పాలతో జేర్చి సేవింపనగును. ఇత్తెరంగున తొలుత పదిపిప్పళ్లనుండి మొదలిడి దినమునకు పదేసిపిప్పళ్లవంతున నధికముచేయుచు సేవింపనగును. ఇత్తెరంగున పదిదినములు సేవించి, పదునొకండవదినము మొదలుజేసి (పదియవనాడేర్పడు మొత్తమునుండి) దినమునకు పదేసివంతున తగ్గించుచు క్రమముగ సేవించునది. ఇత్తెరంగున సేవించునపుడు ఆయ్యది జీర్ణమైనవెంటనే యరువదినాళ్లసంబావుల బియ్యపుఅన్నమును పాలను నేతిని కలిపి భుజింపనగును. ఇత్తెరంగున పిప్పళ్లమొత్తము వేయియగునంతవనుక సేవింపవలెను.

మరియు పైజెప్పినరీతిగ సేవించునపుడు బలిష్ఠులుగ నుండువారు పిప్పళ్లను పచ్చివే నూరి పాలతో గలిపి సేవింపనగును. మధ్యమబలముకలవారు పాలతో జేర్చి యుడికించి యుపయోగింపవలెను. స్వల్పబలముకలవారు చూర్ణముజేసి యుపయోగింపనగును. ఇత్తెరంగున నానాదోషములును రోగములును హరించునిమిత్త ముపయోగించవలెను.

మరియు నిత్తెరంగున పదినుండి యారంభించి దినమునకు పదేసివంతున ఆరోహావరోహణక్రమము ననుసరించి కడపట పదియగునందాక సేవించుట మిగుల శ్రేష్ఠము. లేక ఆరుమొదలుగ నుపక్రమించి యారేసివంతున వృద్ధిహ్రాసక్రమముగ సేవించుట మధ్యమము లేక దినమునకు మూడేసివంతున వృద్ధిహ్రాసక్రమముగ సేవించుట అధమము. ఈమూడుపక్షములును బలహీనులకు దగియుండును. ఇదియే పిప్పలీవర్ధమానరసాయనమని చెప్పబడును. (వర్ధమానపిప్పలి యనియు కొందరు చెప్పెదరు.)

ఈరసాయనయోగమునంజేసి శరీరపుష్టియు, మంచికంఠస్వరంబును ఆయుర్వృద్ధియు కల్గును. ప్లీహోదరము నశించును. యౌవనవయస్సు నిల్కడగ స్థిరపడును. మంచి బుద్ధి వృద్ధినందును.

11. త్రిఫలారసాయనయోగము.

మూ. జరణాన్తేఽభయామేకాం ప్రాగ్భుక్తే ద్వే వి
భుక్త్వా తు మధుసర్పిర్భ్యాం చత్వార్యామల 44



ప్రయోజయన్, సమామేకాం త్రిఫలాయా రసాయనం,
జీవేద్వర్షశతం పూర్ణం అజరోఽవ్యాధిరేవ చ.

(ఇతి త్రిఫలారసాయన

వ్యా. మనుజుడు భుజించిన యాహారము జీర్ణమైనపుడు ఒక కరకకాం భుజించుటకుమునుమున్ను రెండుతానికాయలను, భుజించినవెంటనే నాలుగు ఉ పండ్లను తేనెతోను నేతితోను కలిపి వరుసగ సేవించవలెను. ఇత్తెరంగున నొకసంవ కాలము ఈత్రిఫలారసాయనమును ప్రయోగింపనగును. దీని సేవించుటవలన నూరువ ములకాలము జరావ్యాధులును లేక సుఖముగ జీవించియుండును. (ఇది త్రిఫలారసా యోగమనబడును.)

## 12. రెండవత్రిఫలారసాయనము.

మూ. త్రైఫలేనాయసీం పాత్రీం కల్కేనాలేపయేన్నవాం,
తమహోరాత్రికం లేపం పిబేత్ క్షౌద్రోదకాప్లుతమ్.
ప్రభూతస్నేహమశనం జీర్ణే తత్ర ప్రశస్యతే,
అజరోఽరుక్ సమాభ్యాసాత్ జీవేచ్చైవ సమాశ్శతమ్.

(ఇతి త్రిఫలారసాయనమపర

వ్యా. త్రిఫల (కరక-తాని-ఉసిరికకాయలను) కల్కము చేసి యాకల్క క్రొత్తయినుపపాత్రకు బూసి యొకరేయింబవలునిచి పిమ్మట నాకల్కమును తేనెత నీళ్లతోను కలిపి సేవించవలెను. అయ్యది జీర్ణమైనపిదప నేతిని విశేషముగ జేర్చి భుజింపవలెను. దీనిని ఒకసంవత్సరకాల మభ్యాసముచేసినచో నూరువత్సరములకా జరావ్యాధులు లేక జీవించును. (ఇది రెండవ త్రిఫలారసాయనయోగము.)

## 13. త్రిఫలారసాయనము, మూడవయోగము.

మూ. మధుకేన తుగాక్షీర్యా పిప్పల్యా క్షౌద్రసర్పిషా,
త్రిఫలా సితయా చాపి యుక్తా సిద్ధం రసాయనమ్.

(ఇతి త్రిఫలారసాయనమపర

వ్యా. అతిమధురము, వెదురుప్పు, పిప్పళ్లు, తేనె, నెయ్యి వీనితో దేనితోనైన దానితో త్రిఫలాచూర్ణమును కలిపి సేవించినచో నిది త్రిఫలారసాయనమను సిద్ధర మగును. (ఇచ్చట అతిమధురము మున్నగువానితో నెద్దానితో జేర్చినను నేతిని తే అనుపానముగ జేర్చవలెను.)

14-15. వేరొకత్రిఫలారసాయనయోగములు రెండు

మూ. సర్వైర్లోహైః సువర్ణేన వచయా మధుసర్పిషా,
విడఙ్గపిప్పలీభ్యాం చ త్రిఫలాలవణేన చ. 49
సంవత్సరప్రయోగేణ మేధాస్మృతిబలప్రదా,
భవత్యాయుఃప్రదా ధన్యా జరారోగనిబర్హిణీ. 50
(ఇతి త్రిఫలారసాయనమపరం.)

వ్యా. త్రిఫలచూర్ణమును ఉక్కు మొదలగు లోహములభస్మము, సువర్ణభస్మముతో నైనను; వాయువిడంగములు పిప్పళ్లు సైంధవలవణముతో నైనను చేర్చి అందు తేనెను నేతిని (అనుపానముగ) కలిపి యొకసంవత్సరకాలము సేవించినచో బుద్ధియు జ్ఞాపకశక్తియు కల్గును. ఆయువు వృద్ధియగును. ధనసంపత్తు కల్గును. జరారోగముల నివర్తింపజేయును. (ఇది యొకవిధమైన త్రిఫలారసాయన యోగము.)

(ఇచ్చట "సర్వైర్లోహైః" అనునది యొకయోగము "విడంగపిప్పలీభ్యాం చ" అనునది మరియొకయోగమునని యెఱుంగునది).

శిలాజతుసామాన్యగుణములు.

మూ. అనమ్లం చ కషాయం చ కటు పాకే శిలాజతు,
నాత్యుష్ణశీతం ధాతుభ్యః చతుర్భ్యస్తస్య సమ్భవః. 51
హేమ్నశ్చ రజతాత్తామ్రాత్ వరాత్కృష్ణాయసాదపి.
రసాయనం తద్విధిభిః తద్వృష్యం తచ్చ రోగనుత్. 52

వ్యా. శిలాజతువు అమ్ల (పులుపు) రసము లేక, వగరురసము కల్గినదియు, కటువిపాకము కల్గినదియు, మిక్కిలి యుష్ణంబును శీతంబును గాక సమశీతోష్ణమయినదియు నగును. అయ్యది బంగరు, వెండి, రాగి, ఉక్కు అను నాల్గుధాతువులవలన (వానిసారముగ) పుట్టును. అయ్యది ఆయావిధానము ననుసరించి యుపయోగించినచో రసాయనంబును, వృష్యంబును, రోగహరంబును నగును. పైజెప్పిన నాల్గిటిలో నుక్కువలన బుట్టిన శిలాజతువు మిగుల శ్రేష్ఠము.

వాగ్భటాచార్యులు—"హేమాదిషడ్ధాతురసం ప్రోచ్యతే తచ్ఛిలాజతు" (అష్టాంగహృదయ-ఉత్తరతంత్ర-అధ్యాయము-౩౯) అనువాక్యముచేత సీసమును తగరమును కూడ చేర్చుకొని ఆరుధాతువులవలనను శిలాజతువు పుట్టునని చెప్పిరి. సుశ్రుతమునను షడ్ధాతుసంభవమనియే చెప్పిరి. అయినను ఇచ్చట రసాయనవిషయమున నాల్గుధాతువులవలన పుట్టినదియే ప్రధానమని యీతంత్రకారు లుద్దేశించినట్లు తోచెడి.

శిలాజతుభావనావిధానము.

మూ. వాతపిత్తకఫఘ్నైశ్చ నిర్యూహైస్తద్విభావితం,
వీర్యోత్కర్షం పరం యాంతి, సర్వైరేకైకశోఽపి వా. 53
ప్రక్షిప్తోద్ధృతమప్యేతత్ పునస్తత్ప్రక్షిపేద్రసే,
కోష్ణే సప్తాహమేతేన విధినా తస్య భావనా. 54

వ్యా. మరియు పైజెప్పబడిన గుణాదులు కల శిలాజతువును వాత-పిత్త-కఫముల హరించుద్రవ్యములచే సిద్ధమైన కషాయములచే భావనచేసినచో మిక్కిలి యుత్కృష్టమైన వీర్యము గల్గి సకలరోగముల హరించును. పైజెప్పిన వాతాదిహరములగు కషాయములలో నొక్కొక కషాయమునందైనను, అన్నికషాయములయందైనను, సుఖోష్ణముగ నున్నపుడు శిలాజతువునువైచి నానసిచ్చి మరల బైటదీసి మరల కషాయములలో నుంచవలెను. ఇత్తెరంగున నేడుఅహోరాత్రములును భావనజేయవలెను. సుఖోష్ణముగ నుండు వాతహరాదిసిద్ధకషాయమున నొకరాత్రి నానబెట్టి పగలు ఎండబెట్టి మరల రాత్రి నానబెట్టవలెను. ఇత్తెరంగున నేడు అహోరాత్రములు భావనచేయవలెనని భావము.

మరియు శిలాజతుభావనావిధానమును వాగ్భటాచార్యు లిట్లుచెప్పిరి.—"సమగిరిజమష్టగుణితే నిఃక్వాథ్యం భావనౌషధం తోయే, తన్నిర్యూహేఽష్టాంశే పూతోష్ణే ప్రక్షిపేద్గిరిజమ్. తత్సమరసతాం యాతం సంశుష్కం ప్రక్షిపేద్రసే భూయః. సైవసైవరేవం క్వాథైః భావ్యం వారాన్ భవేత్సప్త." (భావనకషాయౌషధములన్నియు జేరి భావనజేయం దగిన శిలాజతువునకు సమభాగముగ నుండునట్లు గ్రహించి, ఆకషాయద్రవ్యములకు ఎనిమిదిభాగములు నీళ్లు పోసి యెనిమిదవపాలు మిగులునట్లు కాచి వడియగట్టి వేడిగ నుండునాకషాయమున శిలాజతువును వేయనగును. అయ్యది నానినపిదప చక్కగ నెండించి మరల నాకషాయమున వేయవలెను. ఇత్తెరంగున వాతాదిదోషములగు నాయాకషాయములలో నేడేసి పర్యాయములు భావనచేయవలెను.) ఈవాగ్భటవాక్యమున భావనావిధానము స్పష్టముగ జెప్పబడినది.

16. శిలాజతురసాయనప్రయోగవిధానము, దానిఫలము.

మూ. పూర్వోక్తేన విధానేన లోహైశ్చూర్ణీకృతైస్సహ,
తత్పీతం పయసా దద్యాత్ దీర్ఘమాయుస్సుఖాన్వితమ్. 55
జరావ్యాధిప్రశమనం దేహదార్ఢ్యకరం పరం,
మేధాస్మృతికరం ధన్యం క్షీరాశీ తత్ప్రయోజయేత్. 56

ప్రయోగస్సప్త సప్తాహాః త్రయశ్చైకశ్చ సప్తకః,
నిర్దిష్టస్త్రివిధస్తస్య పరో మధ్యోఽవరస్తథా. 57
పలమర్ధపలం కర్షో మాత్రా తస్య త్రిధా మతా,

వ్యా. పైని "త్రిఫలాయా రసే...సూక్ష్మచూర్ణాని కారయేత్" (౧౭-౧౮) అనుగ్రంథముచే జెప్పబడినవిధముగ చూర్ణము చేయబడిన లోహచూర్ణమునకు సమభాగముగ పైజెప్పినరీతిగ భావనజేయబడిన శిలాజతువును కలిపి ఆవుపాలయనుపానముచే ద్రాగినయెడ సుఖముతో గూడి దీర్ఘాయుష్యము కల్గియుండును. జరయును వ్యాధులును నివర్తించును. దేహమునకు దృఢశక్తిని కల్గించును. బుద్ధిని జ్ఞాపకశక్తిని కల్గించును. ధనసంపత్తు కల్గును. ఈశిలాజతువు రసాయనమును ప్రయోగించునపుడు పాలను ఆహారముగ జేయనగును. ఇత్తెరంగున నీరసాయనమును ఏడుసప్తాహముల (నలువదితొమ్మిది దినముల) కాలము నైనను, మూడుసప్తాహముల (ఇరువదియొకదినముల) కాలము నైనను, ఒకసప్తాహ (ఏడుదినముల) కాలమైనను సేవింపనగును. అందు పైజెప్పిన సప్తసప్తాహసేవన ముత్తమము. త్రిసప్తాహసేవనము మధ్యమము. ఏకసప్తాహసేవనము అధమము. మరియు అట్టిశిలాజతు మాత్ర (పరిమాణము) ఒకపలము ఉత్తమము. అర్ధపలము మధ్యమము. కర్షము (కాలుపలము) అధమము. (ఇత్తెరంగున ప్రయోగకాల పరిమాణమును బట్టియు, మాత్రాప్రమాణమును బట్టియు ప్రవర మధ్య అవర భేదముల నెరుంగునది).

{ శిలాజతుస్వరూపము, దానియుత్పత్తివిశేషంబులును, విధానవిశేషంబులును, ప్రత్యేకగుణాదులును. }

మూ జాతేర్విశేషం సవిధిం తస్య వక్ష్యామ్యతః పరం 58
హేమాద్యాః సూర్యసన్తప్తాః స్రవన్తి గిరిధాతవః,
జత్వాభం మృదు మృత్స్నాచ్ఛం యన్మలం తచ్ఛిలాజతు. 59

వ్యా. పైని "అనమ్లం చ కషాయం చ...తృష్ణాయసాదపి" అనుగ్రంథముచేత శిలాజతూత్పత్తికి ఉపాదానకారణంబును వానిగుణాదులును సంక్షిప్తముగ సామాన్యముగ జెప్పబడినది. ఈక్రింద వానియుత్పత్తివిశేషంబులును, ప్రయోగవిధానంబును, గుణాదులును వేరువేరుగ వివరింపబడును:—బంగరు వెండి మున్నగు లోహములు పుట్టు స్థలమునందలి రాళ్లు సూర్యకిరణముల తీవ్రమైన వేడిచే తపింపబడి వానినుండి యొకవిధమైన ద్రవము (జిగురు) స్రవించును. ఆట్టిధాతుమలము లక్కనుబోలె మృదువును స్నిగ్ధంబును స్వచ్ఛంబును నైయుండును. అయ్యది 'శిలాజతువు' అని చెప్పబడును,

(శిలాజతువన:—రాతియందు లక్కనుబోలె పుట్టిన ధాతుమలమని అన్వర్థముగ జె
బడును. మరియు బంగరు వెండి మున్నగుధాతువులనుండి ద్రవము స్రవించుట యస
వము కావున "హేమాద్యాః ధాతవః" అనుచోట బంగరుమున్నగునవి పుట్టుటకు స
మైన కొండరాళ్లు అని యర్థము లక్షణచే గ్రహింపబడును. కావున బంగరు మున్న
వాని యుత్పత్తికి స్థానములగు కొండరాళ్లనుండి సూర్యసంతాపమునంజేసి ద్రవరూపవ
స్రవించుమలము శిలాజతువని నిష్కృష్టార్థము).

బంగరువలన బుట్టినశిలాజతురూపగుణాదులు.

మూ. మధురశ్చ సతిక్తశ్చ జపాపుష్పనిభశ్చ యః,
కటుర్విపాకే శీతశ్చ స సువర్ణస్య నిస్రవః.

వ్యా. సువర్ణధాతువువలన ద్రవరూపముగ స్రవించినశిలాజతువు మధురకటురస
లును, దాసానిపువ్వును బోలె నెఱ్ఱని వర్ణంబును, కటువిపాకంబును, శీతవీర్యంబును
యుండును. (ఇచ్చట తిక్తరససంబంధముచే కటువిపాకము గల్గియుండునని యెరుంగున

రూప్యజ-తామ్రజశిలాజతురూపగుణాదివిశేషములు.

మూ. రూప్యస్య కటుకశ్శ్వేతః శీతః స్వాదు విపచ్యతే,
తామ్రస్య బర్హికణ్ఠాభః తిక్తోష్ణః పచ్యతే కటు.

వ్యా. వెండివలన బుట్టినశిలాజతువు కటురసంబును శ్వేతవర్ణంబును శీతవీర్యంబ
కల్గి మధురముగ విపాకము నొందును. రాగివలన బుట్టినశిలాజతువు నెమలికంఠమ
బోలినవర్ణంబును తిక్తరసంబును ఉష్ణవీర్యంబును కటువిపాకంబును కల్గియుండు
(ఇచ్చట "కటుతిక్తకషాయాణాం విపాకః ప్రాయశః కటుః." (సూత్రస్థాన-అధ్యా.-
అనుసామాన్యశాస్త్రముచే కటురసము కల్గిన వెండి శిలాజతువు కటువిపాకము నొందవ
యున్నను, ఈవాక్యవిధానసామర్థ్యముచే కటువిపాకమని యెఱుంగునది.)

ఇనుముచేగల్గినశిలాజతువర్ణగుణాదులు.

మూ. యస్తు గుగ్గులుకాభాసః తిక్తకో లవణాన్వితః,
కటుర్విపాకే శీతశ్చ సర్వశ్రేష్ఠః స చాయసః.

వ్యా. ఇనుముచే గల్గిన శిలాజతువు గుగ్గిలమువంటి రంగును లవణరసము
గూడిన తిక్తరసంబును కటువిపాకంబును, శీతవీర్యంబును కల్గియుండును. ఇయ్యది తక
శిలాజతువులకన్న మిగుల శ్రేష్ఠముగ నుండును.

## ఆయసశిలాజతువు రసాయనమునకు ప్రశస్తమనుట.

మూ. గోమూత్రగన్ధయస్సర్వే సర్వకర్మసు యౌగికాః,
రసాయనప్రయోగేషు పశ్చిమస్తు విశిష్యతే. 63

వ్యా. పైని వివరింపబడిన నాల్గువిధములగు శిలాజతువులును గోమూత్రగంధము వంటి వాసన కల్గినవియు, సర్వచికిత్సలయందును ప్రయోగింపదగినవియునగును. రసాయన చికిత్సయందు కడపటి లోహజశిలాజతువు మిక్కిలి గుణోత్తర మైయుండును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—శిలాజతు సామాన్యగుణాదుల జెప్పునపుడు "అనమ్లం చ...నాత్యుష్ణశీతం ధాతుభ్యః చతుర్భ్యస్తస్య సంభవః" అని సమశీతోష్ణ ముగ జెప్పబడినది. ఇచ్చట విశేషగుణముల నిర్దేశించునపుడు స్వర్ణ-రూప్య-లోహసంభ వములగుశిలాజతువులు "శీతః" (శీతవీర్యము) అనియు, తామ్రభవము 'తిక్తోష్ణః' అనియుం జెప్పబడినది. ఇది యెట్లు సంగతమన్నచో వీనికి ప్రత్యేకముగ ఉష్ణశీతవీర్యములు చెప్ప బడినను, అయ్యవి యుత్కటముగాక తక్కినవీర్యంబును జేరియుండి మొత్తమున నన్నియు సమశీతోష్ణములుగ నుండుననియు, అందును వానివానికి విహితమగువీర్యము ప్రధానముగ నుండుననియు తంత్రకారునియాశయము.

## నాల్గుశిలాజతువులకును ప్రత్యేకప్రయోగవిశేషవిధానము.

మూ. యథాక్రమం వాతపిత్తే శ్లేష్మపిత్తే కఫే త్రిషు,
విశేషతః ప్రశస్యన్తే; మలా హేమాదిధాతుజాః. 64

వ్యా. పైజెప్పినరీతిగ వాతాది దోషసామాన్యముగ శిలాజతువును ప్రయోగిం చుట యౌగికమైనను, హేమజశిలాజతువు వాతపిత్తముల సంసర్గమునందును, రూప్యజ శిలాజతువు కఫపిత్తసంసర్గమునందును, తామ్రభవశిలాజతువు కేవల కఫమునందును, ఆయసశిలాజతువు త్రిదోషసన్నిపాతమునందును ప్రయోగించుట చాల ప్రశస్తము.

## శిలాజతుసేవనమున నిషిద్ధములు.

మూ. శిలాజతుప్రయోగేషు విదాహీని గురూణి చ,
వర్జయేత్సర్వకాలం తు కులుత్థాన్ పరివర్జయేత్. 65
తే హ్యత్యన్త విరుద్ధత్వాత్ అశ్మనో భేదనాః పరం,
లోకే దృష్టాః తతస్తేషాం ప్రయోగః ప్రతిషిధ్యతే. 66

వ్యా. శిలాజతువు నుపయోగించునపుడు విదాహకరములగు (మంట బుట్టించు) నన్నపానంబులును, గురుగుణము కల (అజీర్ణకరములగు) అన్నపానములును వర్జింపనగును.

(వానిని తినకూడదనుట). మరియు ఉలవలను ఎల్లప్పుడు నుపయోగింపం జనదు
రాతినికూడ పగులజేయునవి యని లోకమున చాల ప్రసిద్ధి జెందినవి కావున
శిలాజతువునకు మిక్కిలి విరుద్ధము లైనవి. కావున ఉలవలను రసాయనగు
పూర్తిగ శరీరమున వ్యాపించునంతకాల ముపయోగింపం జనదని భావము.

సుశ్రుతాచార్యులు—'తద్భావితః కపోతాంశ్చ కులుత్థాంశ్చ వివర్జ
అనువాక్యముచేత రసాయనసేవనముచే భావితమైన శరీరము కల మనుజుడు ఉ
కపోతమాంసమును బొత్తుగ విడువవలెనని తెలిపిరి. ఈవచనముచేత రసాయనమున
చినవారు ఉలవలను యావజ్జీవితకాలమున నుపయోగింపంజనదని తెలిసెడి.

## శిలాజతురసాయనానుపానములు.

మూ. పయాంసి తక్రాణి (శుక్తాని) రసాస్సయూషాః
తోయం సమూత్రా వివిధాః కషాయాః,
ఆలోడనార్థం గిరిజస్య శస్తాః
తే తే ప్రయోజ్యాః ప్రసమీక్ష్య కార్యమ్.

వ్యా. పాలు, మజ్జిగ, మాంసరసములు, యూషములు, ఉదకము, గోమూ
మున్నగు మూత్రములు, పలుదెరంగులైన కషాయములు అను నీద్రవములలో
ఆయాకార్యమును గమనించి తత్తదనుకూలముగ శిలాజతువును సేవించుట కనుపా
కలుపుకొనవలెను. (ఇచ్చట పాలు గురుపదార్థమగుటచే నిషిద్ధమైనను మరల విధిం
జేసి యుపయోగార్హమని యెరుంగునది).

## శిలాజతుప్రాశస్త్యము.

మూ. న సోఽస్తి రోగో భువి సాధ్యరూపః
శిలాహ్వాయం యం న సహేత్ ప్రసహ్య,
తత్కాలయోగైః విధిభిః ప్రయుక్తం
స్వస్థస్య చోర్జాం విపులాం దదాతి. (ఇతి శిలాజతురసాయ

వ్యా. శిలాజతువు శమింపజేయ నేరని రోగము ఇతరౌషధములచే సాధింప
లోకమున నొకటియైన నుండదు. (శిలాజతువు అసాధ్యస్థితి నున్నరోగములైన
నోపును. అట్టిశిలాజతువునకు శమింపరాని రోగము ఇతరౌషధములచే సాధింప
డును వలనుపడదనుట) మరియు తత్కాలోచితములగుయోగములచే విధిప్రకా
శిలాజతువు నుపయోగించినచో స్వస్థత నుండువానికి అధికమైన బలమును కల్గిం

(శిలాజతువును ప్రయోగించుటవలన క్రూరస్థితినుండు వ్యాధులును శమించుననియు, స్వస్థత నుండువారికి అధికమైనబలము కల్గుననియు ముఖ్యభావము).

రసాయనమూడవపాదమునందలివిషయసంగ్రహము.

తత్ర శ్లోకః—

మూ. కరప్రచితికే పాదే దశ షట్చ మహర్షిణా,
రసాయనానాం సిద్ధానాం సంయోగాస్సముదాహృతాః. 69

వ్యా. కరప్రచితీయమను నీమూడవరసాయనపాదమునందు సిద్ధరసాయనయోగములు పదునారు ఋషిపుంగవుడగు నగ్నివేశులచే వివరింపబడినవి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, చికిత్సాస్థానే
ప్రథమేఽధ్యాయే కరప్రచితీయో నామ రసాయనపాదస్తృతీయః.

ఇత్తెరంగున అగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి సూత్రస్థానమున ప్రథమాధ్యాయమున కరప్రచితీయ మను మూడవరసాయనపాదము సంపూర్ణము.

---

## ప్రథమాధ్యాయము - నాలగవపాదము.

అవతరణిక.—కరప్రచితీయరసాయనపాదమును వివరించిన పిదప పరిశిష్టరసాయనముల (పూర్వపాదత్రయమున జెప్పబడని కొన్ని రసాయనముల) వివరించుటకై యాయుర్వేదసముత్థానీయమను నాల్గవ రసాయనపాదము వివరింపబడును.—

మూ. అథాత ఆయుర్వేదసముత్థానీయం రసాయనపాదం
వ్యాఖ్యాస్యామః. 1
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. 2

వ్యా. కరప్రచితీయరసాయనపాదమును జెప్పినపిదప నాయుర్వేదసముత్థానీయమను (ఆయుర్వేదోత్పత్తిప్రచారములుగల) రసాయనపాదమును భగవంతుడగు నాత్రేయమహర్షి యుపదేశించినదానికన్న న్యూనాతిరేకము లేకుండునట్లు వివరింపబడునని యర్థము.

ఆయుర్వేదసముత్థానీయమనః—"ఆయుర్వేదస్య సముత్థానం (ఉత్పత్తిప్రచారక్రమం) అస్మిన్నస్తీతి, ఆయుర్వేదసముత్థానీయం" అనువ్యుత్పత్తి చేత ఆయుర్వేదము

యొక్క యుత్పత్తిప్రకారక్రమముకల రసాయనపాదమని యర్థము. మత్వర్థమున వ-
చ్ఛప్రత్యయముచే నీయర్థము లభించును.

భృగ్వాదిమహర్షులు రసాయనము నరయుటకై హిమవంతము జేరుట.

మూ. ఋషయః ఖలు కదాచిత్ శాలీనాః యాయావరాశ్చ గ్రామా
ధ్యాహారాః సన్తః సాంపన్నికాః మన్దచేష్టాః నాతికల్యాణా
బభూవుః. తే సర్వాసామితికర్తవ్యతానాం అసమర్థాస్సన్తః గ్రా
వాసకృతమాత్మదోషం మత్వా, పూర్వనివాసమపగతగ్రా
దోషం, శివం, పుణ్యముదారం, మేధ్యమగమ్య మసుకృతి
గఙ్గాప్రభవమమరగన్ధర్వకిన్నరానుచరితం, అనేకరత్ననిచయ
అచిన్త్యాద్భుతప్రభావం, బ్రహ్మర్షిసిద్ధచారణానుచరితం, దివ్యతీ
షధిప్రభవం, అతిశరణ్యం, హిమవన్తమమరాధిపతిగుప్తం జ
భృగ్వఙ్గిరోఽత్రివసిష్ఠకశ్యపాగస్త్యపులస్త్యవామదేవాసితగౌ
ప్రభృతయో మహర్షయః.

వ్యా. శాలీనులును (అరణ్యమున ఫలించు నీవారాది (నివ్వరి)ధాన్యము నా
రముచేసి జీవించుఋషులు), యాయావరులును (భిక్షావృత్తిచే జీవించువారును)
కొందరు మహర్షులు ఒకప్పుడు గ్రామ్యములగు (గ్రామములయందు పుట్టిన) ఓషధు
ఆహారమును ఉపయోగించువారై, కృత్యములయందు ఉత్సాహము లేక ఆరోగ్య
దక్కియుండిరి. అట్టియెడ నాఋషివర్యులు ఆవశ్యకకృత్యములయం దన్నిటియంద
నిర్వర్తించుసామర్థ్యము లేనివారై అట్టి యసమర్థత గ్రామనివాసదోషమునం జేసి స
వించినదని తలంచి, తమకు పూర్వనివాసస్థలంబును, గ్రామ్యదోషము లేనిదియు, మం
కరంబును, పుణ్యవంతంబును, ఫలవంతంబును, పరిశుద్ధంబును, పాపకృత్యముల జే
వారికి పొందరానిదియు, గంగకుత్పత్తిస్థానంబును, దేవగంధర్వకిన్నరులకు సంచార
గ్యంబును, అనేకరత్నముల కునికిపట్టును, మనస్సునకు గోచరపడక యద్భుతమైన ప్రభా
విశేషము కల్గినదియు, బ్రహ్మఋషిసిద్ధచారణులసంచారము కల్గినదియు, దివ్యనదులక
దివ్యౌషధులకును ఉత్పత్తిస్థానంబును, మిక్కిలి యాశ్రయయోగ్యంబును, దేవేంద్రుని
రక్షింపబడినదియు నగు హిమవత్పర్వతమునకు, అత్రి, వసిష్ఠుడు, కశ్యపుడు, అగస్త్యు
పులస్త్యుడు, వామదేవుడు, అసితుడు, గౌతముడు మున్నగుమహర్షులును వెళ్లిరి.

భృగ్వాదుల కింద్రుడు రసాయనయోగ్యకాలము చెప్పుట.

మూ. తానిన్ద్రస్సహస్రదృక్ అమరగురురబ్రవీత్ — స్వాగతం బ్రహ్మవిదాం జ్ఞానతపోధనానాం బ్రహ్మర్షీణామ్. అస్తి నను వో గ్లాని రప్రభావత్వం, వైస్వర్యం, వైవర్ణ్యం చ గ్రామ్యవాసకృతం అసుఖమసుఖానుబన్ధం చ, గ్రామ్యో హి వాసో మూలమశస్తానాం, తత్కృతః పుణ్యకృద్భిః అనుగ్రహః ప్రజానామ్, స్వశరీరమవేక్షితుం కాలః కాలశ్చాయమాయుర్వేదోపదేశస్య బ్రహ్మర్షీణామ్. ఆత్మనః ప్రజానాం చ అనుగ్రహార్థం ఆయుర్వేదం అశ్వినౌ మహ్యం ప్రాయచ్ఛతాం, ప్రజాపతిరశ్విభ్యాం, ప్రజాపతయే బ్రహ్మా.

ప్రజానామల్పాయుర్జరావ్యాధిబహుళమసుఖం అసుఖానుబన్ధమల్పత్వాదల్పతపోదమనీయమధ్యాయనాధ్యయనసఙ్చయం మత్వా, పుణ్యతమమాయుః ప్రకర్షకరం జరావ్యాధిప్రశమనం, ఊర్జస్కరం అమృతం శివం శరణ్యముదారం భవన్తో మత్తః శ్రోతుమర్హత, అథోపధారయితుం ప్రకాశయితుం చ ప్రజానుగ్రహార్థమార్షం బ్రహ్మ చ ప్రతిమైత్రీం కారుణ్యమాత్మనశ్చ అనుత్తమం పుణ్యముదారం బ్రాహ్మమక్షయం కర్మేతి. 4

తచ్ఛ్రుత్వా విబుధపతివచనమృషయః సర్వఏవ అమరవరమృగ్భిస్తుష్టువుః, ప్రహృష్టాశ్చ తద్వచనమభినన్దుశ్చేతి. 5

వ్యా. పై జెప్పినవిధముగ వచ్చిన ఋషివరులం జూచి యింద్రుడిట్లు చెప్పం దొడంగెను:—"బ్రహ్మవేత్తలును జ్ఞానమును తపస్సును ధనముగగలవారును బ్రహ్మర్షులును నగుమీరాక సుఖకరము. బడలికయు, ప్రభావహానియు, కంఠస్వరభేదంబును, వివర్ణతయు, గ్రామవాసమునం జేసి కల్గినయసౌఖ్యంబును, రోగరూపమైన యసుఖముయొక్క యనుబంధంబును, మీకున్నట్లు కనబడుచున్నది. గ్రామసేవనం బెప్పటికైనను అప్రశస్తములగు పాపకృత్యములకెల్ల మూలకారణమగును. అట్టి దోషభూయిష్ఠమగు గ్రామ్యవాసము పుణ్యశీలురును మహర్షివరులును నగుమీచే మానవులహితమును గోరి (మానవులకు

నాయుర్వేదపద్ధతుల నుపదేశించి సద్ధర్మమునాచరింపజేసి కాపాడుటకై) యం
బడినది.

తనుతమ శరీరముల కాపాడుకొనుటకును, బ్రహ్మర్షుల కాయుర్వేదము నుప
టకును ఇయ్యది మంచి తరుణము. అట్టియాయుర్వేదమును మాకును ప్రజలకును
గ్రహమును కల్గి యశ్వినీదేవతలు మా కుపదేశించిరి. అశ్వినీదేవతలకు ప్రజా
(సృష్టికర్తయగుదక్షప్రజాపతియు), ప్రజాపతికి బ్రహ్మయు ననుగ్రహించి
యుండిరి.

మరియు ప్రజలకు అల్పాయుష్యమును, జరావ్యాధులు భూయిష్ఠములుగ
అసౌఖ్యమును, అట్టియసౌఖ్య మనుసరించి రొడలేక బాధించుటను గమనిం
ఆయుష్యము మిక్కిలి యల్పమగుటంజేసి తపంబును దమంబును (ఇంద్రియని
బును), నియమంబును (సదాచారంబును), దానంబును, వేదాధ్యయనంబును మ
సత్క్రియాకలాపంబు మిగుల స్వల్పమయినదని తలంచియు; మీరు పుణ్యతమ
ఆయువును వృద్ధినందించునదియు, జరావ్యాధుల శమింపజేయునదియు, శరీరమున
కరంబును, అమృతమును బోలినదియు, మంగళకరంబును, ప్రాణుల కాపాడ సమర్థ
సర్వోత్తమంబును నగునాయుర్వేదమును నావలన (మీరు) వినదగుదురు. వ
నేనుపదేశించు నాయుర్వేదమును జ్ఞప్తి నుంచుకొనుటకును, ప్రచారము నొ
వ్యాపింపజేయుటకును చికిత్సావిధానముచే ప్రజల ననుగ్రహించుటకును, ఋ
మును బ్రహ్మచర్యమును మైత్రినిభూతదయను కూర్చియు, మీకు నిరతిశయమగు
మును నాశరహితమైన పరంబ్రహ్మప్రాప్తి సాధనమగు నుత్తమమైన కృత్యమనియు
నావలన మీరు పరమప్రాచీనమగు నీయాయుర్వేదమును పొందనగుదురని పై
ఋషులతో నింద్రుడు సెప్పెనని భావము. పైజెప్పిన యింద్రవాక్యమును మహర్ష
గును విని సంతుష్టులై యింద్రుని వేదమంత్రములచే స్తుతించి యింద్రవాక్యమును
వించిరి.

## ఇంద్రప్రోక్తరసాయనము.

మూ. అథ ఇన్ద్రః తదాయుర్వేదామృతం ఋషిభ్యః సంక్ర
ఉవాచః—ఏతత్సర్వమనుష్ఠేయం. అయం చ శివః కాలః
యనానాం,దివ్యాశ్చౌషధయో హిమవత్ప్రభవాః ప్రాప్తవీ
తద్యథా—ఐన్ద్రీ, బ్రాహ్మీ, పయస్యా, క్షీరపుష్పీ, శ్రావణీ,
శ్రావణీ, శతావరీ, విదారీ, జీవన్తీ, పునర్నవా, నాగబలా,

వచా, ఛత్రా, అతిచ్ఛత్రా, మేదా, మహామేదా, జీవనీయా శ్చాన్యాః పయసా ప్రయుక్తాః షణ్మాసాత్పరం ఆయుర్వయశ్చ తరుణం అనామయత్వం చ స్వరవర్ణసమ్పదముపచయం మేధాం స్మృతిముత్తమబలం ఇష్టాంశ్చాపరాన్ భావానావహన్తి సిద్ధాః.6

(ఇతి ఇన్ద్రోక్తం రసాయనమ్.)

వ్యా. పిమ్మట ఇంద్రుడు అమృతమును బోలిన యాయుర్వేదమును పైజెప్పిన భృగువు మున్నగుమహర్షులకు బోధించి తెలిపి యిట్లు చెప్పందొడంగెను:— నేను చెప్పిన యాయుర్వేదపద్ధతి నంతయుఁ మీరలుఅనుష్ఠింపవలెను. ఇయ్యది రసాయనముల కనుకూల మైన కాలము. హిమవంతమున బుట్టిన దివ్యౌషధు లన్నియుఁ నిక్కాలమున సంపూర్ణమైన యౌవనము గల్గియున్నవి. అవి యెవ్వియన:— చేదుపుచ్చ, సరస్వతియాకు, పయస్య (కాకోళి), క్షీరపుష్పి (క్షీరకాకోళి), బోడతరము, తెల్లబోడతరము, పిల్లిపీచర, నేల గుమ్మడు, పాలకూర, గలిజేరు, జిబిలిక, ముయ్యాకుపొన్న, వస, సదాప, అతిచ్ఛత్ర (గొడుగువంటి యాకారముగల తృణజాతివిశేషము), మేద, మహామేద, ఇవి గాక జీవ నీయగణములో జేరిన యితరములగు నోషధులును, వీనిని పాలతో జేర్చి యారుమాస ముల కాలము సేవించినచో నాయుష్యము పూర్ణముగ వృద్ధినందును. మరియుఁ యౌవ నంబును, ఆరోగ్యంబును, మంచి కంఠస్వరంబును, మంచి వర్ణంబును, బుద్ధికౌశలంబును, జ్ఞాపకశక్తియు, శ్రేష్ఠమైన బలంబును, ఇవియే కాక తమ కిచ్ఛవచ్చిన యితరగుణంబు లన్నియును గల్గి సిద్ధులలో నుత్తములై వెలసియుందురు.

## బ్రహ్మసువర్చలాదిఓషధిస్వరూపము.

మూ. బ్రహ్మసువర్చలానామ ఓషధిః యా హిరణ్యక్షీరా పుష్కరసదృశ పత్రా, ఆదిత్యపర్ణీ నామ ఓషధిః యా సూర్యకాన్తేతి విజ్ఞాయతే సువర్ణక్షీరా సూర్యమణ్డలాకారపుష్పా చ, నారీనామ ఓషధిః అశ్వబలేతి విజ్ఞాయతే యా బల్బజసదృశపత్రా (పునర్జసదృశ పత్రా), కాష్ఠగోధానామ ఓషధిః గోధాకారా, సర్పానామౌషధిః సర్పాకారా, సోమో నామౌషధిరాజః పఞ్చదశపర్వా (పఞ్చదశ పర్ణః) స సోమ ఇవ హీయతే వర్ధతే చ, పద్మా నామౌషధిః పద్మా కారా పద్మరక్తా పద్మగన్ధా చ, అజా నామౌషధిః అజశృఙ్గీతి

విజ్ఞాయతే, నీలానామౌషధిస్తు నీలక్షీరా నీలపుష్పా లతాప్ర
తానబహుశేతి. 7

వ్యా. బ్రహ్మసువర్చలయనునోషధి బంగరురంగువంటి రంగుకలపాలు కల్గి తామర రేకుల బోలిన యాకులతోగూడియుండును. ఆదిత్యపర్ణి యనునోషధి సూర్యకాంతయను నామాంతరముచే వ్యవహరింపబడును. ఇయ్యది బంగరురంగుగలపాలును సూర్యమండల మునుబోలె గుండ్రనైన పువ్వులును కల్గియుండును. (దీనినే ఆదిత్యభక్తియనియు, ప్రొద్దు తిరుగుడుచెట్టనియు లోకమునవాడెదరు.) నారి యనునోషధి అశ్వబలయను నామాంతర ముచే వ్యవహరింపబడును. ఇయ్యది బోదకసువును బోలిన యాకులుకల్గి యుండును. కాష్ఠగోధ యనునోషధి యుడుమువంటి యాకారముకల్గి యుండును. సర్పయను నోషధి సర్పమువంటి యాకారము గల్గియుండును. సోమమను నోషధి రాజము పదునైదు గణుపులు (పదునైదు ఆకులు) కల్గి చంద్రునిబోలె శుక్లపక్షమున నొక్కొకగణుపువం తున వృద్ధినొందుచును, కృష్ణపక్షమున నొక్కొకగణుపువంతున క్షీణించుచుండును. పద్మ యనునోషధి తామరపువ్వువంటి యాకారంబును దానివలెరక్తవర్ణంబును దానిగంధంబును కల్గియుండును. అజయను నోషధి అజశృంగి యనునామాంతరముచే జెప్పబడును. (దీనిని దుష్టపుతీగె యని యాంధ్రమున వాడెదరు.) నీల యనునోషధి నల్లనిపాలును నల్లని పువ్వులును గల్గి తీవె జొంపములు విశేషముగ గూడియుండును.

## బ్రహ్మసువర్చలాది రసాయనయోగము.

మూ. ఆసామోషధీనాం యాం యామేవోపలభేత తస్యాస్తస్యాః
స్వరసస్య సౌహిత్యం గత్వా స్నేహభావితాయామార్ద్రపలా
శద్రోణ్యాం సపిధానాయాందిగ్వాసాః శయీతః, తత్ర ప్రలీయతే
షణ్మాసేన పునస్సమ్భవతి, తస్యాజం పయః ప్రత్యవస్థాపనమ్,
షణ్మాసేన దేవతానుకారీ భవతి వయోవర్ణస్వరాకృతిబలప్రభాభిః,
స్వయం చాస్య సర్వవాచోగతాని ప్రాదుర్భవన్తి, దివ్యం చాస్య
చక్షుః శ్రోత్రం చ భవతి, గతిర్యోజనసహస్రం, దశవర్షసహ
స్రాణ్యాయు రనుపద్రవం చేతి. 8

వ్యా. పైజెప్పిన యోషధులలో నెయ్యది దొరకునో యద్దానినుండి స్వరసము దీసి దానిని తృప్తిగ పుచ్చుకొని నేతిలో నానిన పచ్చి మోదుగకొయ్యతో జేయబడిన తొట్టిలో వస్త్రహీనుడై దిగంబరుడుగ పరుండి యుండవలెను. ఇత్తెరంగున నారుమాస

ములవరకును నాద్రోణియందు దాగియున్నచో వాని కప్పటిశరీరము లీనమై క్రొత్త శరీరము సంభవించును. ఈరసాయనమును సేవించునపుడు మేకపాలు ఆహారమునకై యుపయోగింపనగును. ఆరుమాసములు కడచినపిదప దేవతలకు సమానుడై యుండును. వయస్సును వర్ణంబును కంఠస్వరంబును ఆకారంబును బలంబును కాంతియు దేవతలకు సమానముగ నుండును. వీనికి సకలవిద్యలును స్వయముగనే తెలియును. వానినేత్రంబులును శ్రోత్రంబులును దివ్యమైన యమోఘశక్తి కల్గియుండును. వేయియోజనముల దూరము వాడు నడువజాలును. పదివేలవత్సరములవరకును వానికి ఆయువు వృద్ధినొంది జరావ్యాధులచే నుపద్రవము లేక సుఖముగ నుండగల్గును.

భవన్తి చాత్ర:—

మూ. దివ్యానామోషధీనాం యః ప్రభావః స భవద్విధైః,
శక్యస్సోఢుమశక్యస్తు స్యాత్ సోఢుమకృతాత్మభిః. 9
ఓషధీనాం ప్రభావేణ తిష్ఠతాం స్వే చ కర్మణి,
భవతాం నిఖిలం శ్రేయః సర్వమేవోపపత్స్యతే. 10
వానప్రస్థైః గృహస్థైశ్చ ప్రయతైర్నియతాత్మభిః,
శక్యా ఓషధయో హ్యేతాః సేవితుం విషయాభిజాః. 11

వ్యా. పైజెప్పబడిన యోషధుల దివ్యప్రభావమును సహింప మీవంటిజితేంద్రియులకు శక్యమగునుగాని, ఇంద్రియనిగ్రహము లేని సామాన్యజనులకు ఒకప్పుడును సాధ్యము కాజాలదు. మరియు తపోయోగాదికర్మలయందు నియమము గల్గియున్న మీకు ఈయోషధులప్రభావమువలన పలుతెరంగులైన శ్రేయస్సులును చేకూరును. ఇంద్రియనిగ్రహము గల్గి వ్రతపరాయణులగు వానప్రస్థులైనను గృహస్థులైనను ఈ యోషధులను సేవింప సమర్థులుగ నుందురు. అట్టివారును హిమవంతము మున్నగు దివ్యదేశముల జనించిన యోషధులనే సేవించవలెగాని సామాన్యప్రదేశమున బుట్టినవి యల్పవీర్యములుగ నుండును. కావున అట్టి యోషధుల సేవింప దగదు.

మూ. యాస్తు (తాస్తు) క్షేత్రగుణైస్తేషాం మధ్యమేన చ కర్మణా,
మృదువీర్యతరాస్తాసాం విధిర్జ్ఞేయస్స ఏవ తు. 12
పర్యేష్టుం తాః ప్రయోక్తుం వా యేఽసమర్థాస్సుఖార్థినః,
రసాయనవిధిస్తేషాం అయమన్యః ప్రశస్యతే. 13

వ్యా. పైఁజెప్పఁబడిన బ్రహ్మసువర్చల మున్నగు దివ్యౌషధులు హిమవంత
వింధ్యము మున్నగు దివ్యములగు ప్రదేశమున జనించినచో నయ్యవి మిగుల ప్రశస్త
వీర్యము కల్గియుండును. అటుగాక యవి యితరస్థలముల జనించినవై యున్నచో స
స్థలవిశేషములకుం గల గుణవిశేషములచేతను వానిసేవనావిధి యథోక్తముగ లేక మ
మముగ నుండుటచేతను మందవీర్యము లగును. ఐనను వాని నుపయోగించునప్పుడు పైన
దేశింపఁబడిన విధానమునే యనుసరింప దగును.

మఱియు పైఁజెప్పిన దివ్యౌషధుల వెదకుటకును వానిని విధ్యుక్తప్రకారము సే
చుటకును సామర్థ్యము లేక రసాయనమున గల్గు సుఖమును మాత్రము కోరునట్టి వా
ప్రస్థులు గృహస్థులు మున్నగువారికిఁ క్రింద వివరింపఁబడు రసాయనవిధానము ప్రశ
ముగ నుండును.

### ఇంద్రప్రోక్తరసాయనాంతరము.

మూ. బల్యానాం జీవనీయానాం బృంహణీయాశ్చ యా దశ,
వయసః స్థాపనానాం చ ఖదిరస్యాఽసనస్య చ.
ఖర్జూరాణాం మధూకానాం ముస్తానాముత్పలస్య చ,
మృద్వీకానాం విడఙ్గానాం వచాయాశ్చిత్రకస్య చ.
శతావర్యాః పయస్యాయాః పిప్పల్యాః జోఙ్గకస్య చ,
ఋద్ధ్యా నాగబలాయాశ్చ ద్వారదాయాః ధవస్య చ.
త్రిఫలాకణ్టకార్యోశ్చ విదార్యాశ్చన్దనస్య చ,
ఇక్షూణాం శరమూలానాం శ్రీపర్ణ్యాస్తినిశస్య చ.
రసాః పృథక్పృథగ్గ్రాహ్యాః పలాశక్షార ఏవ చ,
ఏషాం పలోన్మితాన్ భాగాన్ పయో గవ్యం చతుర్గుణమ్.
ద్వే పాత్రే తిలతైలస్య ద్వే చ గవ్యస్య సర్పిషః,
తత్సాధ్యం సర్వమేకత్ర సుసిద్ధం స్నేహముద్ధరేత్.
తత్రామలకచూర్ణానాం ఆఢకం శతభావితమ్,
స్వరసేనైవ దాతవ్యం క్షౌద్రస్యాఽభినవస్య చ.
శర్కరాచూర్ణపాత్రం చ ప్రస్థమేకం ప్రదాపయేత్,
తుగాక్షీర్యాః సపిప్పల్యాః స్థాప్యం సమ్మూర్ఛితం చ తత్.

సుచౌక్షే మార్త్తికే కుమ్భే మాసార్ధం ఘృతభావితే,
మాత్రామగ్నిసమాం తస్య తత ఊర్ధ్వం ప్రయోజయేత్. 22
హేమతామ్రప్రవాళానాం అయసః స్ఫటికస్య చ,
ముక్తావైడూర్యశఙ్ఖానాం చూర్ణానాం రజతస్య చ. 23
ప్రక్షిప్య షోడశీం మాత్రాం విహాయాయాసమైథునం,
జీర్ణే జీర్ణే చ భుఞ్జీత షష్టికం క్షీరసర్పిషా. 24

వ్యా. సూత్రస్థానమునందలి షడ్విరేచనశతాశ్రితీయాధ్యాయమున జెప్పఁబడిన బల్య(బలకర)ములగు పది ద్రవ్యంబులును, జీవనీయగణమున జెప్పబడిన జీవము మున్నగు పది ద్రవ్యంబులును, బృంహణీయగణమున జెప్పబడిన క్షీరిణి మున్నగు పది ద్రవ్యంబులును, వయఃస్థాపనవర్గమున జెప్పబడిన అమృత మున్నగు పది ద్రవ్యంబులును, (ఈగణములు నాల్గును జేరి నలువదిద్రవ్యములును) ఇవి గాక చంద్ర, వేగి, ఖర్జూరము కాయలు, ఇప్పపువ్వులు, తుంగగడ్డలు, కలువపువ్వులు, ద్రాక్షపండ్లు, వాయువిడంగములు, వస, చిత్రమూలకము, చల్లపిల్లిగడ్డలు, పాలతీగ, పిప్పళ్లు, జోంగకము (అగరు), బుద్ధి, జిబిలిక, ద్వారద (దూలగొండి), వెలిచంద్ర, త్రిఫలములు (కరక-తాని - ఉసిరిక కాయలు), వాకుడు, నేలగుమ్మడు, సుంబిగంధము, చెరకు, దర్భవేళ్లు, పెద్దగుమ్మడి, వెమ్మి చెట్టు అనునీయోషధులరసమును వేరువేరుగ గ్రహించునది. ఇవిగాక మోదుగాకులను క్షారముజేసి యాక్షారోదకమును గ్రహించునది. ఇత్తెరంగు పైనిచెప్పబడినద్రవ్యముల స్వరసమును మోదుగాకులక్షారోదకము ప్రత్యేకముగ నొక్కొకటి యొక్కొకపలము వంతున భాగముల గల్గించి యొకటిగ జేర్చి యాసముదాయరసమునకు నాల్గింత యావు పాలను, రెండుపాత్రములు (ఆఢకములు; నూటయిరువదెనిమిదిపలములు) నువ్వుల నూనెను, రెండు ఆఢకములు ఆవునేతిని కూడ కలిపి, వీనినన్నిటిని ఒకటిగ గూర్చి స్నేహ పాకవిధి ప్రకారము పక్వము జేసి, యాస్నేహమును (చమురును) గ్రహింపనగు. మరియు నయ్యది పక్వమగునప్పుడు ఉసిరికకాయలరసములో నూరుసారులు భావనజేయ బడిన యుసిరికకాయలచూర్ణమును ఒక ఆఢకంబును, ఖండచక్కెర చూర్ణము ఒక ఆఢ కంబును, తుగాక్షీరి (వెదురుప్పు) ఒకప్రస్థంబును, పిప్పలిచూర్ణ మొకప్రస్థంబును కలిపి పక్వముజేసి దించుకొని చల్లారినపిదప క్రొత్తతేనె నొక ఆఢకమును కలిపి సిద్ధమైన యా రసాయనమును నేతితో మాగినకుండలోఁ నునిచి, పదునైదుదినములవరకును పదిలముగ నుంచవలెను.

పదునైదుదినములు కడచినపిమ్మట నాయౌషధమును జఠరాగ్నిబలము ననుసరి తగినమాత్ర గల్పించి యుపయోగించునది. మరియు నారసాయనము నుపయోగించు బంగరు, వెండి, పవడము, ఉక్కు, స్ఫటికము, ముత్యములు, వైడూర్యము, శంఖ వెండి, వీనిభస్మము లన్నియు జేరి పైజెప్పిన యామలకచూర్ణమునకు పదునారవభా ముందునట్లు ఆఘృతమున జేర్చి అగ్నిబలానుగుణముగ సేవించునది. మరియు దీ సేవించుతరి శరీరమున కాయాసమును గల్గించుపనులను స్త్రీసంభోగమును మానవలె ఔషధము జీర్ణమైనపిదప నరువదినాళ్లు సంబావుబియ్యపు అన్నమున ఆవుపాలను సే కలిపి భుజించవలెను.

ఇచ్చట సూత్రస్థానమున షడ్విరేచన శతాధ్యాయమున "ఐన్ద్రీఋషభక... అతిబలా ఇతి దశేమాని బల్యాని భవన్తి" (సూత్ర. ర. అ. సూత్రము. ౩౦.) అనిచెప్ బల్యావర్గమును, "జీవకర్షభకౌ......దశేమాని జీవనీయాని భవన్తి" (సూత్రస్థాన. ర. సూత్రము. ౨ర.) అని చెప్పిన జీవనీయగణమును, "క్షీరిణీ......దశేమాని బృం ణీయాని భవన్తి" (సూత్రస్థాన. అ. ర. సూత్రము. ౨౯.) అని చెప్పిన బృంహణీ వర్గమును "అమృతాభయా......దశేమాని వయస్థాపనాని భవన్తి" (సూత్రస్థాన. ర. సూత్రము. ౨౩.) అని చెప్పిన వయస్థాపనవర్గమును గ్రహించునది.

## పైజెప్పిన రసాయనగుణములు.

మూ. సర్వరోగప్రశమనం వృష్యమాయుష్యముత్తమం,
సత్త్వస్మృతిశరీరాగ్నిబుద్ధీన్ద్రియబలప్రదమ్.
పరమూర్జస్కరం చైవ వర్ణస్వరకరం తథా,
విషాలక్ష్మీప్రశమనం సర్వవాచోగతప్రదమ్.
సిద్ధార్థతాం చాభినవం వయశ్చ ప్రజాప్రియత్వం చ యశశ్చ లో
ప్రయోజ్యమిచ్ఛద్భిరిదంయథావత్ రసాయనంబ్రాహ్మముదారవీర్యం
(ఇతి ఇన్ద్రప్రోక్తరసాయనపరమ్

వ్యా. పైజెప్పబడిన రసాయనమును యథోక్తముగ సేవించినయెడ రోగ లన్నియు శమించును. సంభోగముసం దిచ్ఛ యధికమగును. ఆయువు వృద్ధినొందు సత్త్వమును (మనశ్శక్తిని), జ్ఞాపకశక్తిని, కాయాగ్నిని, బుద్ధిని, ఇంద్రియములను యుక్తములుగ జేయును. శరీరబలమును వర్ణమును కంఠస్వరమును బలపరచును. మును అలక్ష్మిని హరించును. సకలవిద్యలను అప్రయత్నముగ లభింపజేయును. తాగో

మనోరథము లీడేరును. నూత్నమైన యౌవనము కల్గును. ప్రజలకందరకును వీనియందు దనురాగము కల్గును. లోకమున మంచికీర్తి కల్గును. కావున పైజెప్పబడిన గుణవిశేషముల గోరువా రందరును ఈచెప్పబడిన బ్రాహ్మరసాయనమును విధ్యుక్తప్రకారముగ సేవించవలెను. (ఇయ్యది యింద్రప్రోక్తమగు రెండవ బ్రాహ్మరసాయనము.)

కుటీప్రావేశిక-వాతాతపికరసాయనయోగ్యపురుషులు.

మూ. సమర్థానామరోగాణాం ధీమతాం నియతాత్మనాం,
కుటీప్రవేశః క్షణినాం (క్షమిణాం) పరిచ్ఛదవతాం హితః. 28
అతోఽన్యథా తు యే తేషాం సౌర్యమారుతికో విధిః,
తయోశ్శ్రేష్ఠతరః పూర్వః విధిస్స తు సుదుష్కరః. 29
రసాయనవిధిభ్రంశాత్ జాయేరన్ వ్యాధయో యది,
యథా స్వమౌషధం తేషాం కార్యం ముక్త్వా రసాయనమ్. 30

వ్యా. సమర్థులును, ఆరోగ్యవంతులును, బుద్ధిమంతులును, ఇంద్రియనిగ్రహము కలవారును, ఓర్పుకలవారును రసాయనవిధికి కావలసినవస్తుసమృద్ధికలవారును నగువారికి పైజెప్పబడిన కుటీప్రావేశికవిధిప్రకారము రసాయనము సేవించుట మిక్కిలి హితకరమగును. పైజెప్పిన లక్షణములు లేక వ్యతిరేకముగ నున్నవారికి వాతాతపికరసాయనవిధి హితమగును. అట్టి కుటీప్రావేశిక - వాతాతపికముల రెంటిలో మొదటిది (కుటీప్రావేశికము) మిగుల శ్రేష్ఠమైనది; కాని అయ్యది మిక్కిలి కష్టముచే జేయందగి యుండును.

మరియు రసాయనము సేవించుతరి దానివ్యత్యాసమునంజేసి యేవిధైన వ్యాధులు సంభవించునెడ తత్కాలమున రసాయనవిధానమును విడచి,అప్పుడు సంభవించిన ఆయా రోగములకుం దగినచికిత్సల జేయనగును.

రసాయనవిషయపురుషగుణ-ఆచారాదులు.

మూ. సత్యవాదినమక్రోధం నివృత్తం మద్యమైథునాత్,
అహింసకమనాయాసం ప్రశాన్తం ప్రియవాదినమ్. 31
జపశౌచపరం ధీరం దాననిత్యం తపస్వినం,
దేవగోబ్రాహ్మణాచార్యగురువృద్ధార్చనే రతమ్. 32
ఆనృశంస్యపరం నిత్యం నిత్యం కరుణవేదినమ్ (కారుణ్యవేదినమ్),
సమజాగరణస్వప్నం నిత్యం క్షీరఘృతాశినమ్. 33

దేశకాలప్రమాణజ్ఞం యుక్తిజ్ఞమనహంకృతం,
శస్తాచారమసఙ్కీర్ణం అధ్యాత్మప్రవణేన్ద్రియమ్. 34
ఉపాసితారం వృద్ధానాం ఆస్తికానాం జితాత్మనాం,
ధర్మశాస్త్రపరం విద్యాన్నరం నిత్యరసాయనమ్. 35
గుణైరేతైస్సముదితైః ప్రయుఙ్క్తే యో రసాయనం,
రసాయనగుణాన్ సర్వాన్ యథోక్తాన్ స సమశ్నుతే. 36

వ్యా. ఎల్లపుడును సత్యము బల్కువాడును, కోపము లేనివాడును, మద్యపానమును స్త్రీసంభోగమును విడచినవాడును, ప్రాణిహింస జేయనివాడును, శరీరమున కాయాసమును కల్గించుపనుల జేయనివాడును, శాంతచిత్తము కలవాడును, ప్రియవాక్యముల బల్కువాడును, మహామంత్రముల జపించుటకును పరిశుద్ధక్రియలయందును ఆసక్తి కలవాడును, ధైర్యము కలవాడును, ఎల్లపుడును దానధర్మముల జేయువాడును, తపస్సంపన్నుండును, దేవతలను గోవులను బ్రాహ్మణులను ఆచార్యుని (షడంగములతో గూడిన వేదములను అర్థముతో గూడ నుపదేశించినగురువును) తండ్రి మొదలగు గురువులను జ్ఞానముచేతను వయస్సుచేతను పెద్దలగువారిని (వీరినందరిని) పూజించుటయందాసక్తి కలవాడును, ఒకప్పుడును క్రూరకర్మల జేయనివాడును, ప్రాణిసామాన్యముగ కరుణ జూపువాడును, నిదురించుటయందును నిదుర మేల్కాంచుటయందును శాస్త్రానుసారముగ వ్యత్యాసము లేక నడచుకొనువాడును, ఎల్లప్పుడును పాలను నేతిని జేర్చి భుజించువాడును, దేశముయొక్కయు కాలముయొక్కయు పరిమాణమును దెలిసి (ఆయాదేశకాలానుగుణముగ) నటించువాడును, యుక్తిమంతుడును, అహంకారము లేనివాడును, ప్రశస్తమైన యాచారసంపత్తి కలవాడును, సత్కులమున బుట్టినవాడును, అధ్యాత్మజ్ఞానమునందు ఆసక్తములగు నింద్రియవ్యాపారము కలవాడును, పెద్దలసేవించువాడును, ఆస్తికులను ఇంద్రియనిగ్రహముకలవారిని సహవాసము చేయువాడును, ధర్మశాస్త్రములలో విధించినప్రకారము నడచుకొనువాడును నగుపురుషుని స్వభావముచేతనే రసాయనగుణములు కలవానిగ నెరుంగునది.

మరియు పైజెప్పినసత్యము మున్నగుగుణవిశేషములు గల పురుషుడు పైజెప్పిన రసాయనముల సేవించినచో రసాయవిధికి జెప్పినగుణముల నన్నిటిని పూర్తిగ నొంద గలడు. (పైజెప్పిన గుణసంపత్తి గల్గి రసాయనమును సేవించినచో రసాయనమున జెప్పిన గుణములన్నియు పూర్తిగ గల్గుననియు పైజెప్పినగుణములు లేనియెడ రసాయనమున జెప్పినగుణములు పూర్తిగ నొందనేరడనియు ముఖ్యభావము).

మరియు 'ఆచార్యగురువృద్ధార్చనే రతమ్' అనుచోట "ఉపనీయ తు యః పూర్వం వేదమధ్యాపయేద్ద్విజః, సార్థం చ సరహస్యం చ తమాచార్యం విదుర్బుధాః." అను మనువచనము ననుసరించి ఉపనయనము జేసి రహస్యార్థముతో సాంగములగు వేదమును జదివించినగురువు ఆచార్యుడనియు, తండ్రి మున్నగువారు సామాన్యగురువులనియు భేదము నెరుంగునది.

మనశ్శరీరశుద్ధులకు రసాయనసిద్ధి, ఇతరులకు లేదనుట.

మూ. యథా స్థూలమనిర్వాహ్య దోషాన్ శారీరమానసాన్,
రసాయనగుణైర్జన్తుః యుజ్యతే న కదాచన. 37
యోగా హ్యాయుఃప్రకర్షార్థాః జరారోగనిబర్హణాః,
మనశ్శరీరశుద్ధానాం సిధ్యన్తి ప్రయతాత్మనామ్. 38
తదేతన్న భవేద్వాచ్యం సర్వమేవ హతాత్మసు,
అరుజేభ్యో(అరజోభ్యో)ద్విజాతిభ్యః శుశ్రూషా యేషు నాస్తి చ.

వ్యా. శరీరమునకు సంబంధించిన వాతాదిదోషములను మనస్సునకు సంబంధించిన రజస్తమోరూపదోషములను పూర్తిగ నివర్తిపగుపకయే రసాయనముల సేవించినచో రసాయనముల గుణముల నొకప్పుడు నొందనేరడు. మరియు నాయువును వృద్ధినొందించుటకును జరారోగముల నివర్తింపజేయుటకును ఏర్పడిన యీరసాయనయోగములు మనశ్శరీరములు శుద్ధములై యింద్రియములను తమవశమున నుంచుకొనినవారికి తప్పక ఫలవంతము లగును. మరియు నింద్రియనిగ్రహము లేనివారికిని, రజోగుణము లేకయుండు బ్రాహ్మణుల శుశ్రూష లేనివారికిని యీరసాయనవిధానమును జెప్పంపగదు.

వైద్యుని పూజించుట యావశ్యకమనుట.

మూ. యే రసాయనసంయోగాః వృష్యయోగాశ్చ యే మతాః,
యచ్చౌషధం వికారాణాం సర్వం తద్వైద్యసంశ్రయమ్. 40
ప్రాణాచార్యం బుధస్తస్మాత్ ధీమన్తం వేదపారగం,
అశ్వినావివ దేవేన్ద్రః పూజయేదతిశక్తితః. 41

వ్యా. రసాయనయోగంబులును, వృష్యయోగంబులును, జ్వరాదిరోగముల నుద్దేశించి చెప్పబడిన యౌషధంబులును ఇవి యన్నియు వైద్యుని ఆశ్రయించి యుండును. కావున అట్టి ప్రాణాచార్యులను (పైజెప్పిన రసాయనాదిత్రయము నుపయోగించి ప్రాణసంరక్షణము జేయువాడు) ప్రతిభాశాలియు ఆయుర్వేదపారంగతుడు నగు వైద్య

వరుని అశ్వినీదేవతల నింద్రుడు పూజించువిధమున తమశక్తికి వంచనసేయక గౌరవ
వలెను. (ఇచ్చట 'ప్రాణాచార్య' అనుచోట 'ప్రాణివర్య' అనుపాఠాంతరము క
రసాయనాదియోగములకెల్ల నాశ్రయమగుటం జేసి మనుజులలో పూజార్హుడై శ్రే
డని భావము.)

## వైద్యుని ప్రాశస్త్యము.

మూ. అశ్వినౌ దేవభిషజౌ యజ్ఞవాహావితి స్మృతౌ,
దక్షస్య హి శిరశ్ఛిన్నం పునస్తాభ్యాం సమాహితమ్.
ప్రశీర్ణాః దశనాః పూష్ణో, నేత్రే నష్టే భగస్య చ,
వజ్రిణశ్చ భుజస్తమ్భః తాభ్యామేవ చికిత్సితః
చికిత్సితశ్చ శీతాంశుః గృహీతో రాజయక్ష్మణా,
సోమాభిపతితశ్చన్ద్రః కృతస్తాభ్యాం పునస్సుఖి
భార్గవశ్చ్యవనః కామీ వృద్ధస్సన్ వికృతిం గతః,
వీతవర్ణస్వరోపేతః కృతస్తాభ్యాం పునర్యువా.
ఏతైశ్చాన్యైశ్చ బహుభిః కర్మభిర్భిషగుత్తమౌ,
బభూవతుర్భృశం పూజ్యావిన్ద్రాదీనాం మహాత్మనామ్.
గ్రహాః స్తోత్రాణి మన్త్రాణి తథా నానా (న్యాని) హవీంషి చ,
ధూమ్రాశ్చ పశవస్తాభ్యాం ప్రకల్ప్యన్తే ద్విజాతిభిః.
ప్రాతశ్చ సవనే సోమం శక్రోఽశ్విభ్యాం సహాశ్నుతే,
సౌత్రామణ్యాం చ భగవాన్ అశ్విభ్యాం సహ మోదతే.
ఇన్ద్రాగ్నీ చాశ్వినౌచైవ స్తూయన్తే ప్రాయశో ద్విజైః,
స్తూయన్తే వేదవాక్యేషు న తథా న్యా హి దేవతాః.
అజరైరమరైస్తావత్ విబుధైస్సాధిపైర్ధ్రువైః,
పూజ్యేతే ప్రయతైరేవం అశ్వినౌ భిషజావితి.
మృత్యువ్యాధిజరావశ్యైః దుఃఖప్రాయైస్సుఖార్థిభిః,
కిం పునర్భిషజో మర్త్యైః పూజ్యాస్స్యుర్నాతిశక్తితః.

వ్యా. అశ్వినీదేవతలు దేవతలకు చికిత్సజేయు వైద్యులనియు, యజ్ఞమునకు
వించిన విఘ్నమును నివర్తింపజేసి నిర్విఘ్నముగ నెరవేర్చినవారనియు వేదములు మున

ప్రమాణగ్రంథములయందు దెల్పఁబడినది. దక్షునియాగమునందు వీరభద్రునిచే ఛేదింపబడిన దక్షునిశిరస్సును అశ్వినీదేవతలు మరల మునుపటివలె నతికించి యాగమును నిర్విఘ్నముగ పూర్తిజేయించిరి. పూష అనుపేరుగల సూర్యునికి ఊడి రాలిపోయిన దంతములను మరల యథాస్థితిగ చక్కజేసిరి. భగుడను నామాంతరముకల సూర్యునికి పోయిన కన్నులను మరల నెప్పటివలె నుండునట్లు చక్కజేసిరి. ఇంద్రునకు భుజము స్తంభించి కదలకుండిన, దానికి చికిత్సజేసి చక్కబరచిరి. చంద్రునకు రాజయక్ష్మము (క్షయరోగము) సంభవించినపుడు చికిత్సజేసి యారోగరాజమును మాన్పిరి. చంద్రుడు ఒకసమయమున అధికముగ సోమపానము జేసినందువల్ల కల్గినబాధను కూడ తగుచికిత్స జేసి స్వస్థపరచిరి. భృగువంశజుడగు చ్యవను ముసలితనము సంప్రాప్తించి కంఠస్వరంబును శరీరవర్ణంబును మారి వికృతిజెందియు కామోపభోగములయం దనురాగము కల్గియున్న తరి వానికి రసాయనవిధిరూపమైనచికిత్స జేసి ముదిమిని పోగొట్టి యౌవనమును మరల యథాస్థితిగ నిలిపి చెడిన రూపవర్ణస్వరాదులు చక్కగ నుండునట్లు చేసి కామోపభోగముల ననుభవింపజేసిరి. (ఈగాథ—"యువం చ్యవానమశ్వినాజరంతం......చక్రథుః శ్శచీభిః" అను ఋగ్వేదమునందలి ఋక్కుచే తెలిసెడి). ఇవియేగాక యుత్తరములగు నిట్టి కర్మవిశేషములచే గూడ అశ్వినీదేవతలు వైద్యోత్తములనియు దానం జేసి మహనీయులగు నింద్రాదిదేవతలచే మిక్కిలి పూజింపదగి యున్నారు.

మరియు:—అగ్నిష్టోమాది యాగములయందు 'గ్రహము' అనుసోమపాత్రములచే నశ్వినీదేవతల నుద్దేశించి "యావాంకశామధుమత్యశ్వినా......మాధ్వీభ్యాం త్వా" "ప్రాతర్యుజౌ...అశ్విభ్యాం త్వా" (యజుస్సంహిత. కాం-౧. ప్ర. ౪. అ. ౬, ౭.) ఇత్యాది మంత్రములచే సోమమును గ్రహిహోమము చేయబడును. అశ్వినీదేవతల నుద్దేశించి సామగానరూపమైన స్తోత్రములచే నుద్గాతలును, అశ్వినీసహస్రము మున్నగు శస్త్రములచే హోతలును, హోమమంత్రములచే నధ్వర్యులును యాగవిశేషములయందు స్తుతియించెదరు.

మరియు అశ్వినీదేవతల నుద్దేశించి పురోడాశము, ఆమిక్ష, చరువు మున్నగు నానావిధములైన హవిస్సులును; ధూమ్రవర్ణములైన యాగపశువులును ఆయాయాగవిశేషములయందు బ్రాహ్మణులచే విధ్యుక్తములుగ గల్పింపబడును. యాగములలో ప్రాతస్సవనమునందు ఇంద్రుడు అశ్వినీదేవతలతో గూడి సోమపానము జేయును. సౌత్రామణి యను యాగవిశేషమునందు ఐశ్వర్యసంపన్నుడైన యింద్రుడు అశ్వినీదేవతలం గలిసి సంతుష్టుడైయుండును. అట్టియాగములయందు ఇంద్రుడును, అగ్నియు, అశ్వినీదేవతలును, బ్రాహ్మణులచే విశేషముగ స్తుతియింపబడుదురు. మరియు వేదమంత్రములయందు

అశ్వినీదేవతల స్తుతించినట్లు ఇతరదేవతల స్తుతించినట్లు కానంబడదు. (ఇట్టికారణములచేత అశ్వినీదేవతలు అందరకును మిక్కిలి వారివారిశక్తికన్న నధికముగ బూజింపదగినవారని ప్రకరణముఖ్యాభిప్రాయము).

మరియు జరామరణములు లేక స్వతంత్రశక్తి పూర్తిగ కల్గి చలనము లేక స్థిరముగ నుండు దేవతలే మిక్కిలి మనోనియమముతో శ్రద్ధాభక్తియుక్తులై వైద్యవరులగు నశ్వినీదేవతలను మిక్కిలి గౌరవముతో బూజించుచుండ; జరామరణములకు వశులై నానావిధవ్యాధులచే బీడింపబడుచు సుఖము నభిలషించుమానవులు వైద్యులను వారివారి శక్తికి మిక్కుటముగ భక్తిశ్రద్ధలతో పూజించుట యావశ్యకమని వేరుగ చెప్పనక్కరలేదు. (పూజార్హులని భావము).

### ప్రాణాచార్యవైద్యగుణములు.

మూ. శీలవాన్ మతిమాన్ యుక్తః ద్విజాతిశ్శాస్త్రపారగః,
(త్రిజాతిశ్శాస్త్రపారగః)
ప్రాణిభిర్గురువత్ పూజ్యః ప్రాణాచార్యస్స హి స్మృతః. 52
విద్యాసమాప్తౌ భిషజః ద్వితీయా (తృతీయా) జాతిరుచ్యతే,
అశ్నుతే వైద్యశబ్దం హి న వైద్యః పూర్వజన్మనా. 53
విద్యాసమాప్తౌ బ్రాహ్మం వా సత్వమార్షమథాపి వా,
ధ్రువమావిశతి జ్ఞానాత్ తస్మాద్వైద్యః ద్విజః (త్రిజః) స్మృతః. 54
నాభిధ్యాయేత్ న చాక్రోశేత్ అహితం న సమాచరేత్,
ప్రాణాచార్యం బుధః కశ్చిత్ ఇచ్ఛన్నాయురనిత్వరమ్. 55

వ్యా. మంచిస్వభావము బుద్ధియు యోజనాశక్తియు కలిగి యాయుర్వేదమను శాస్త్రమును పూర్తిగ నభ్యసించి త్రిజుడైన వైద్యవరుడు ప్రాణాచార్యుడు (ప్రాణమున కపాయకరములగు నాధివ్యాధుల నివర్తింపజేసి కాపాడు) అనబడును. అట్టివైద్యవరుడు మనుజులచే గురువువలె బూజింపదగును.

మరియు ('జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః' అనువచన ప్రకారము ఉపనయనముచే బ్రాహ్మణుడు ద్విజుడు (రెండుమార్లు పుట్టినవాడు) అనబడును). శిష్యోపనయనీయ విధ్యుక్త ప్రకారము ఆయుర్వేదాంగముగ నుపనయనవిధి నాచరించి గురువులచెంత నాయుర్వేదవిద్యను పూర్తిగ నభ్యసించి సమాప్తియైనపిదప నాద్విజునకు మూడవజన్మము (ఆయుర్వేదోపనయనరూప తృతీయజన్మము) కల్గును. (అప్పుడు వాడు

త్రిజశబ్దముచే జెప్పందగియుండును) ఆయుర్వేదాధ్యయనసమాప్తిరూప తృతీయజన్మము నందున త్రిజుడై 'వైద్య' అనుపదముచే జెప్పదగియుండునుగాని కేవలము ద్విజత్వమాత్రమునసే వైద్యపదవాచ్యుడు కాజాలడు.

మరియు:—ఉపనయనపూర్వకవిద్యాభ్యాసము పూర్తియైనపిదప బ్రాహ్మ (వేదసంబంధమైన) జ్ఞానంబును, ఆర్ష (ఋషులచే గమనింపబడిన యాయుర్వేదవిషయకమైనని జ్ఞానంబును స్థిరముగ వైద్యునకు నిలబడును; అట్టిజ్ఞానముచేత వైద్యవరుడు త్రిజుడ) చెప్పబడును. (వేదాధ్యయనము పూర్తియైనపుడు వేదసంబంధజ్ఞానము స్థిరమగుననియు, ఆయుర్వేదాధ్యయనము పూర్తియైనపుడు ఋషిదృష్టమైన యాయుర్వేదజ్ఞానము దృఢమగుననియు, అట్టి జ్ఞానగరిమనుబట్టి వైద్యుడు త్రిజుడనియు చెప్పబడుననియుభావము)

అట్టి వైద్యవరునకు సంబంధించిన ధనాదుల నపహరింప యత్నింపదగదు. వానిపై నాక్రోశము జూపదగదు. వానికి హితములు కానిపనుల నాచరింపదగదు. ప్రాణాచార్యుడైన యావైద్యవరునకు ఒకప్పుడును శాశ్వతమగునాయువును కోరువాడు ప్రతికూలము నాచరింపంజనదు.

ఇచ్చట "ద్విజ త్రిజ" అనుపాఠభేదములు కన్పట్టుచున్నవి. అందు 'త్రిజ' పదమునె ప్రధానముగ జేసి వ్యాఖ్యానము చేయబడినది. ద్విజ అనుపదమునకు శాస్త్రాంతరమున నిర్వచనంబును ప్రయోజనంబును జెప్పబడినవి. విమానస్థానమునందలి రోగభిషగ్జితీయాధ్యాయమున "తముపస్థితమాజ్ఞాయసమే..." చ. విమాన. అ. ౮. సూ. ౧౦-౧౧) అని యుపక్రమించి శిష్యోపనయనవిధి హోమాదిపూర్వకముగ నుపదేశించి, అధ్యయన-అధ్యాపనవిధులును శిష్యాచార్య నియమాదులును విస్తృతముగ జెప్పబడినవి. ఆపద్ధతి నవలంబించి నియమముతో నాయుర్వేదాధ్యయనము సక్రమముగ జేసి పూర్తియైనవాడు, (వేదాధ్యయనము పూర్తిగావించినమాణవకుడు ద్విజుడని చెప్పబడువిధముగ) త్రిజుడని చెప్పబడుట సమంజసముగ నుండునని యీప్రకరణమున త్రిజశబ్దమునే గ్రహించి నిర్వచనము చేయబడినది. మరియు నట్టివైద్యవరుడు (ఒకగురువు తనశిష్యుని సద్గుణముల నుపదేశించి చక్కదిద్దువిధముగ) ప్రాణమునకు గల్గు సంకటములను చికిత్సావిధానముచే దూరంబుచ్చి కాపాడుటంజేసి ఆచార్యసాదృశ్యమునుజూపి "ప్రాణాచార్య" అనుపదముచే బేర్కొనంబడియె.

## వైద్యున కుపకృతిచేయుట యావశ్యకము.

మూ. చికిత్సితస్తు సంశ్రుత్య యోవాఽసంశ్రుత్య మానవః,
నోపాకరోతి వైద్యాయ నాస్తి తస్యేహ నిష్కృతిః. 56

వ్యా. వైద్యునివలన తగుచికిత్స నందినమానవుడు వైద్యునకు తాను ముందు యిచ్చెదనని చెప్పియున్నను చెప్పకయున్నను ప్రతిఫలముగ తనశక్తికొలది యుపకరి యెవరుందురో అట్టివారికి నిష్కృతి యెకప్పుడును కల్గనేరదు.

రోగివిషయమై వైద్యుడుండవలసినపద్ధతి.

మూ. భిషగప్యాతురాన్ సర్వాన్ స్వసుతానివ యత్నవాన్,
ఆబాధేభ్యో హి సంరక్షేత్ ఇచ్ఛన్ ధర్మమనుత్తమమ్.

వ్యా. వైద్యుడును రోగుల నందరిని తారతమ్యభేదమెన్నక మిక్కిలి ప్రయ ముతో శ్రద్ధగా తనబిడ్డలనువలె గమనించి వారికి సంభవించిన బాధలనుండి తొలగి కాపాడవలెను. అట్లు చేసినచో వైద్యుడు తాను కోరినప్రకారము ధర్మము సాయపడును.

వైద్యునికుండవలసిన గుణములు.

మూ. ధర్మార్థంచార్థకామార్థం(నార్థకామార్థం) ఆయుర్వేదో మహర్షి
ప్రకాశితో ధర్మపరైః ఇచ్ఛద్భిస్థానమక్షరమ్.
నార్థార్థం (నాత్మార్థం) నాపి కామార్థం అథ భూతదయాం ప్ర
వర్తతే యశ్చికిత్సాయాం స సర్వమతివర్తతే.
కుర్వతే యే తు వృత్త్యర్థం చికిత్సాపణ్యవిక్రయం,
తే హిత్వా కాఞ్చనం రాశిం పాంసురాశిముపాసతే.

వ్యా. ధర్మము, అర్థము, కామము అను నీమూడు పురుషార్థములకుగాను మ ర్షులు మిక్కిలి ధర్మమునం దాసక్తి కల్గి నాశరహితమైన పరమపదమును కోరి యా ర్వేదమును ప్రకాశింపజేసిరి.

మరియు నేవైద్యుడు కేవలము ద్రవ్యమునైనను కోరికనైనను తలంపక స భూతములయందును దయగల్గి చికిత్సజేయునో అట్టివైద్యవరుడు అన్నివిషయములం దును అడ్డు లేక సుఖముగ నుండగలడు.

అటు గాక యేవైద్యులు చికిత్సను విక్రయింప దగిన ధనముగ దలచి య తురులై తమ జీవనార్థము చికిత్సను డబ్బుకు విక్రయించి జీవించెదరో అట్టివైద్యు బంగరు ప్రోవును వదలి మట్టిదిబ్బ నాశ్రయించినవారగుదురు. (ధర్మమును దయ కొంచెమైన దలంచక తమపొట్టకూటికై రోగుల బీడించి డబ్బు లాగి చికిత్స జేయువా ధర్మమువలన గల్గు పారత్రికసుఖమునకు దూరులై కేవలము కుక్షింభరు లగుదు భావము).

మూ. దారుణైః కృష్యమాణానాం గదైర్వైవస్వతక్షయం,
ఛిత్వా వైవస్వతాన్ పాశాన్ జీవితం యః ప్రయచ్ఛతి. 61
ధర్మార్థదాతా సదృశ_స్తస్య నేహోపలభ్యతే,
న హి జీవితదానాద్ధి దానమన్యద్విశిష్యతే. 62
పరో భూతదయా ధర్మ ఇతి మత్వా చికిత్సయా,
వర్తతే యస్స సిద్ధార్థః సుఖమత్య_న్తమశ్నుతే. 63

వ్యా. యమపాశములబోలె మిక్కిలి క్రూరములగు రోగములచే నాకర్షింపబడి యమసదనమునకు బోవ సిద్ధముగ నున్నరోగిని యమపాశతుల్యములగు రోగముల ద్రెంపి ప్రాణదానము చేసి కాపాడు వైద్యునకన్న ధర్మార్థముల సాధించుచుమానవుడు వేరొక డుండబోడు. లోకమున ప్రాణములు అందరకును మిక్కిలి యభిలషణీయములు కావున నట్టిప్రాణదానమునకన్న ప్రశస్తమైనది వేరొండు దానము లేదు. (కావున ప్రాణ దానము చేయువైద్యుడు మిగుల శ్లాఘాపాత్రుడని భావము).

మరియు భూతదయారూపమైనధర్మము మిక్కిలి యుత్కృష్టమైనది యని తలంచి చికిత్స జేయువైద్యుడు ఇష్టసిద్ధికలవాడై మిక్కిలి సుఖమును పొందగలడు.

చతుర్థపాదవిషయసంగ్రహము.

మూ. ఆయుర్వేదసముత్థానం దివ్యౌషధవిధిం శుభం,
అమృతాల్పా_న్తరగుణం సిద్ధిం రత్నరసాయనమ్. 64
సిద్ధేభ్యో బ్రహ్మచారిభ్యః యదువాచామరేశ్వరః,
ఆయుర్వేదసముత్థానే తత్సర్వం సంప్రకాశితమ్. 65

వ్యా. ఆయుర్వేదోత్పత్తిపరంపరాప్రకారము, కొంచె మించుమించుగ నమృతముతో సమానగుణంబులు గల్గి సిద్ధంబులును శ్రేష్ఠంబులు నగురసాయనయోగంబులును, ఇంద్రుడు సిద్ధులకును బ్రహ్మచారులకును నుపదేశించిన రసాయనయోగంబులును, ఈ యాయుర్వేదసముత్థానీయమను రసాయనపాదమున వివరింపబడినవి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, చికిత్సితస్థానే
ప్రథమాధ్యాయే ఆయుర్వేదసముత్థానీయో నామ
రసాయనపాదశ్చతుర్థః.

ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకునిచే సంస్కరింపబడినదియు నగు చ
సంహితయను నాయుర్వేదతంత్రమునందలి చికిత్సాస్థానమున ప్రథమాధ్యాయమ
నాయుర్వేదసముత్థానీయమను రసాయనపాదము నాల్గవదియు అధ్యాయంబు
సంపూర్ణము.

---

## ద్వితీయాధ్యాయము—ప్రథమపాదము.

అవతరణిక:—పైయధ్యాయప్రారంభమున—"భేషజం ద్వివిధం చ తత్. స్వ
స్యౌజస్కరం కిఞ్చిత్ కిఞ్చిదార్తస్య రోగనుత్" అని యౌషధమును ద్వివిధమ
జెప్పి, అందు స్వస్థౌజస్కరౌషధము వృష్య-రసాయన భేదముచే రెండు తెరంగులని యు
దేశింపబడినది. ఆరెంటిలో రసాయనము పైయధ్యాయమున విపులముగ నిరూపితమ
అందు రెండవది యగు వృష్యము ఈయధ్యాయమున వివరింపబడును. వాజీకరణస్వరూ
పము పైయధ్యాయమున—"అపత్యసన్తానకరం......వాజీకరణమేవ తత్" (చికిత్సి
అ. ౧. శ్లోక. ౯-౧౨) అనువాక్యముచే నిరూపింపబడినది.

మూ. అథాతస్సంయోగశరమూలీయం వాజీకరణపాదం వ్యాఖ్యా
స్యామః.
ఇతి హ స్మాహ భగవానాత్రేయః.

వ్యా. రసాయనౌషధమును జెప్పినపిదప సంప్రయోగశతమూలీయమను వా
రణపాదము భగవానుడగు నాత్రేయుం డుపదేశించినదానికన్న న్యూనాతిరేకము గాకుం
నట్లు వివరింపబడునని యర్థము.

(సంయోగశరమూలీయమన:—"సంయోగశ్శరమూలానామస్మిన్నస్తీతి-సంయో
శరమూలీయః" అనువ్యుత్పత్తిచేత శరవరి మూలప్రయోగము కలయోగములతోగూ
పాదము సంయోగశరమూలీయమని పాదసంజ్ఞ నెరుంగునది).

వాజీకరణావశ్యకత.

మూ. వాజీకరణమన్విచ్ఛేత్ పురుషో నిత్యమాత్మవాన్,
తదాయత్తౌ హి ధర్మార్థౌ ప్రీతిశ్చ యశ ఏవ చ.
పుత్త్రస్యాయతనం హ్యేతత్ గుణాశ్చైతే సుతాశ్రయాః,

వ్యా. (ఏయౌషధమును సేవించుటచే పురుషుడు అధికబలము కల్గి అడ్డు
స్త్రీలతో గుఱ్ఱమువలె సంభోగము జేయగల్గునో ఆయౌషధము వాజీకరణమనబడు

ఈయర్థము "అవాజీ వాజీవ అత్యర్థం మైథునే శక్తః క్రియతే యేన-తత్ వాజీకరణమ్" అనువిగ్రహముకల చ్వి ప్రత్యయాంతముచే సిద్ధించును. గుఱ్ఱముకానిమనుజుడు గుఱ్ఱమువలె బలాధికుడై స్త్రీసంభోగమునం దప్రతిహతముగ బ్రవర్తించునట్లుచేయు నౌషధము వాజీకరణమని నిష్కృష్టార్థము. ఈవిషయమునే "వాజీవాతిబలో యేన యాత్యప్రతిహతః స్త్రియమ్" అని స్థలాంతరమున జూపిరి).

ధర్మంబును, అర్థంబును, ప్రీతియు, యశంబును గల్గుటకు పుత్రుడు ఆశ్రయముగ నుండును. అట్టిపుత్రుడు జనించుటకు వాజీకరణము కారణముగ నుండును; కావున లోకమున పైజెప్పినధర్మము మున్నగుగుణముల కోరి వానికాశ్రయమగు పుత్రోత్పత్తి నభిలషించు యౌవనవంతుడగు సత్పురుషుడు రసాయనసేవనానంతరము వాజీకరణమును ప్రతిదినంబును సేవింప బ్రయత్నింపవలెను.

ఇచ్చట:—'పురుషః' అని చెప్పుటవలన సంభోగార్హుడగు యౌవనము కలపురుషుడె వాజీకరణమును సేవింపవలెగాని సంభోగనిషిద్ధులగు బాలురును వృద్ధులును సేవింపదగదని సూచితము. బాలవృద్ధులు సంభోగానర్హులని స్థలాంతరమున నిట్లు చెప్పబడినది:— "అతిబాలో హ్యసంపూర్ణసర్వధాతుః స్త్రియో వ్రజన్, ఉపతప్యేత సహసా తటాకమివ కాజలమ్. శుష్కం రూక్షం యథాకాష్ఠం జన్తుజగ్ధం విజర్జరమ్. స్పృష్టమాశు విశీర్యేత తథా వృద్ధః స్త్రియో వ్రజన్" మిక్కిలి బాలునకు రసాదిధాతువులు సంపూర్ణములు కాకయుండును. కావున వాడు స్త్రీసంభోగము చేసినచో స్వల్పజలముకల సరస్సు సూర్యునియాతపముచే (ఎండచే) ఎండిపోవునట్లు రసాదిధాతువులు శుష్కించి క్షీణించును. మిక్కిలి ముసలియగువాడు స్త్రీసంభోగము చేసినచో (ఎండి నిస్సారమై కీటాదులచే పిప్పిబట్టి రంధ్రములు చేయబడిన కట్టెను తాకినంతమాత్రముననే విఱుగునట్లు) చెడును; కావున బాల-వృద్ధులు సంభోగానర్హులని భావము.

మరియు:—రసాయనము జరామరణముల నివర్తిజేసి యనంతాయువును గల్గించుటంజేసి ఫలాధికముగ నుండును. వాజీకరణము కేవలము ఐహికసుఖసాధన మగుటంజేసి స్వల్పఫలదము; కావున రసాయనమును సేవించుటమొదటిపని. లేక వాజీకరణమును సేవించుట రెండవపక్షము. అనువిషయమును సూచించుటకై 'అన్విచ్ఛేత్, (అను-ఇచ్ఛేత్)" అని చెప్పబడినది. 'నిత్యం' అని చెప్పుటచేత రసాయనసేవనమువలె నొకసారి మాత్రము కాక వాజీకరణము నిరంతరముగ నుపయోగింపవలెనని తెలిసెడి. 'ఆత్మవాన్' అనువిశేషణముచేత నింద్రియముల తనవశమున నుంచుకొని నియమముతో గూడిన యుత్తమపురుషుడు ధర్మాదిసాధనభూతమగు పుత్రుని గోరి వాజీకరణమును సేవించవలెనుగాని, దుర్వృత్తుడై తనకిచ్చవచ్చినట్లు పలుపోకల బోవు దుష్టుడు సేవించినచో నగమ్యాగమనాది

పాపకృత్యముల జేయ సమకట్టునుకావున అట్టిదురాత్ములు వాజీకరణము సేవింపదగరని యర్థము.

వాజీకరణయోగములలో స్త్రీ శ్రేష్ఠమనుట.

మూ. వాజీకరణమగ్ర్యం చ క్షేత్రం స్త్రీ యా ప్రహర్షిణీ. 4
ఇష్టా హ్యేకైకశోఽప్యర్థాః పరం ప్రీతికరాః స్మృతాః,
కిం పునః స్త్రీశరీరే యే సఙ్ఘాతేన ప్రతిష్ఠితాః. 5
సఙ్ఘాతో హీన్ద్రియార్థానాం స్త్రీషు నాన్యత్ర విద్యతే,
స్త్రీష్వాశ్రయో హీన్ద్రియార్థో యః స ప్రీతిజననోఽధికం,
స్త్రీషు ప్రీతిర్విశేషేణ స్త్రీష్వపత్యం ప్రతిష్ఠితమ్. 6
ధర్మార్థౌ స్త్రీషు లక్ష్మీశ్చ స్త్రీషు లోకాః ప్రతిష్ఠితాః,
సురూపా యౌవనస్థా యా లక్షణైర్యా విభూషితా. 7
యా వశ్యా శిక్షితా యా చ సా స్త్రీ వృష్యతమా మతా,

వ్యా. పురుషునిమనసున కుల్లాసమును గల్గించు స్త్రీ క్షేత్రరూపమై ముఖ్యమైన వాజీకరణ మగును. (లోకమున భూరూపమైన క్షేత్రమున నాటబడిన విత్తనమును మొలువజేయు విధమున పురుషునిచే విసర్జింపబడిన శుక్రమునకు స్థానమై పుత్రోత్పాదక మగుటంజేసి స్త్రీ క్షేత్రమని చెప్పంబడినది).

మరియు:—మనసుకింపైన యింద్రియార్థములు (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధ ములు) ఒక్కొకటియు మిక్కిలి ప్రీతిని కల్గించును. అవియన్నియు స్త్రీశరీరమునందు ఒక్కమ్మడి చేరియున్నచో నాస్త్రీ మనసునుల్లాసమును గల్గించుట యాశ్చర్యమా? స్త్రీని యాశ్రయించియుండునింద్రియార్థసముదయము మిక్కిలి యధికముగ పురుషునకు తప్పక ప్రీతి బుట్టించును. స్త్రీలయందు ప్రీతియు, సంతతియు, ధర్మంబును, అర్థంబును, సంప దయు, లోకములును స్థిరములుగ నిలచియుండును.

కావున మంచిరూపవతియు, యౌవనవతియు, కళాశాస్త్రమున జెప్పబడిన పద్మి న్యాదిలక్షణములతో గూడినదియు, తనకు వశ్యురాలును, గీతవాద్యనృత్యాదికళలయందు శిక్షితురాలును నగుస్త్రీ శ్రేష్ఠమైన వృష్యమగును. (అట్టిస్త్రీ కామోద్రేకమును గల్గిం చుటం జేసి ప్రధానముగ వృష్యమగునని భావము).

ఇచ్చట సకలధర్మములయందును భార్యతో గూడియున్నపుడే అధికారి యగును కావున ధర్మమును, అనురాగవతియగుస్త్రీ యర్థమును రక్షించుటంజేసి యర్థంబును,

స్త్రీలయందాశ్రయించియుండునుకావున 'ధర్మార్థౌ స్త్రీషు' అని చెప్పబడినది. స్త్రీలయందు లక్ష్మీ యావహించియుండునపుడు సంపత్తు కల్గునుకావున "లక్ష్మీశ్చ స్త్రీషు" అని చెప్పబడినది.

### సంభోగార్హవృష్యతమస్త్రీలక్షణములు.

మూ. నానాభక్త్యా తు లోకస్య దైవయోగాచ్చ యోషితామ్. 8
తం తం ప్రాప్య వివర్ధన్తే నరం రూపాదయో గుణాః,
వయోరూపవచోహావైః యా యస్య పరమాఙ్గనా. 9
ప్రవిశత్యాశు హృదయం దైవాద్వా కర్మణోఽపి వా,
హృదయోత్సవరూపా యా యా సమానమనశ్శయా. 10
సమానసత్త్వా యా వశ్యా యా యస్య ప్రీయతే ప్రియైః,
యా పాశభూతా సర్వేషాం ఇన్ద్రియాణాం పరైర్గుణైః. 11
యయా వియుక్తో నస్త్రీకం అరతిర్మన్యతే జగత్,
యస్యా ఋతే శరీరం నా ధత్తే శూన్యమివేన్ద్రియైః. 12
శోకోద్వేగాఽరతిభయైః యాం దృష్ట్వా నాభిభూయతే,
యాతి యాం ప్రాప్య విస్రమ్భం దృష్ట్వా హృష్యత్యతీవయామ్.
అపూర్వామివ యాం యాతి నిత్యం హర్షాతివేగతః,
గత్వా గత్వాపి బహుశో యాం తృప్తిం నైవ గచ్ఛతి. 14
సా స్త్రీ వృష్యతమా తస్య; నానాభావా హి మానవాః,
అతుల్యగోత్రాం వృష్యాం చ ప్రహృష్టాం నిరుపద్రవామ్. 15
శుద్ధస్నాతాం వ్రజేన్నారీం అపత్యార్థీ నిరామయః,

వ్యా. లోకము పలుదెరంగులైన యభిప్రాయములు కల్గియుండుటంజేసి, పూర్వజన్మసంచితమగు కర్మసంబంధమువలనను, పైని వివరింపబడిన స్త్రీలయొక్క రూపాదిగుణములు (తత్తత్కర్మానుగుణముగ) ఆయాపురుషుల జేరి వృద్ధినొందును. కావున నేస్త్రీ వయస్సుచేతను రూపవిశేషముచేతను వాక్చాతుర్యముచేతను హావభావాదిశృంగారచేష్టలచేతను పూర్వజన్మకృతకర్మవాసనావశముననైనను ఈజన్మమున జేయబడిన వశీకరణకర్మవిశేషములవలననైనను ఏమనుజుని మనస్సున శీఘ్రముగ ప్రవేశించి (నచ్చి)యుండునో; ఆస్త్రీ యాపురుషునకు వృష్యతమ యైయుండును. మరియు,—ఏస్త్రీ యేపురుషునకు

మనస్సు కుల్లాసమును గల్గించునదియు, వానికి సమముగ మదనావేశము కల్గినదియు, సమానమగు మనోఽభిప్రాయము కల్గినదియు, వశ్యురాలై యనుకూలముగ నుండునదియు, ప్రియవచనాములచే ప్రీతిబుట్టించునదియు, చక్షురాదీంద్రియములకెల్ల శ్రేష్ఠములగు తనగుణవిశేషములచేత పాశమున గట్టినవిధముగ వశముగ జేసికొనునదియు నగునో; ఏస్త్రీని జూచినప్పుడు భయంబును ఉద్వేగంబును శోకంబును విరక్తియు పురుషునకు కల్గకుండునో, ఏస్త్రీని విడనాడినపుడు పురుషుడు జగత్తున స్త్రీజాతియే లేదని తలచి విరక్తుడగునో, ఏస్త్రీ తనచెంత లేనిసమయమున తనకు చక్షురాదీంద్రియములు బొత్తుగ లేనట్లు తలంచి శరీరమాత్రమును ధరించి యుండునో, ఏస్త్రీ కనబడినపుడు జంకుకొంకును లేక మనస్సున మిక్కిలి యుల్లాసము నొందునో, ఏస్త్రీని పొందినపుడు కామోద్రేక మతిశయించి పలుమరు పొందినను తనివిదీరక అప్పటప్పటికిని క్రొత్తక్రొత్తగనే భావించుచుండునో, అట్టిస్త్రీ యాపురుషునకు వృష్యతమముగ నుండును.

అట్టి వృష్యతమముగ నుండి సమానగోత్రము కాక భిన్నగోత్రము కల్గినదియు, ప్రహృష్టాంతరంగయు, ఉపద్రవములు లేనిదియు ఋతుస్నానము జేసినదియు నగుస్త్రీని రోగములు లేనిపురుషుడు సంతానముగోరి సంభోగము జేయనగును.

### సంతానము లేనందున గల్గుదోషము.

మూ అచ్ఛాయశ్చైకశాఖశ్చ నిష్ఫలశ్చ యథా ద్రుమః. 16
అనిష్టగన్ధశ్చైకశ్చ నిరపత్యస్తథా నరః,
చిత్రదీపస్సరశ్శుష్కం అధాతుర్ధాతుసన్నిభః. 17
నిష్ప్రజస్తృణపూలీతి మన్తవ్యః పురుషాకృతిః,
అప్రతిష్ఠశ్చ నగ్నశ్చ శూన్యశ్చైకేన్ద్రియశ్చ నా. 18
మన్తవ్యో నిష్క్రియశ్చైవ యస్యాఽపత్యం న విద్యతే,

వ్యా. లోకమున సంతతి లేనిమనుజుడు ఒక్కటే కొమ్మ కల్గి నీడయు పండ్లును ఇష్టగంధము కల పువ్వులును లేని వృక్షము బోలె ప్రయోజనము లేక యుండును. మరియు పుత్రహీనుడు చిత్రమున వ్రాయబడిన దీపమును, నీరుఎండినసరస్సును, బంగరు లేక కేవలము లక్కతో బంగరుగాజువలె చేయబడిన లక్కగాజులను బోలె ప్రయోజనశూన్యుడై గడ్డిచేత పురుషాకారముగ చేయబడిన బొమ్మవలె క్రియారహితుడని తలంపబడును. మరియు సంతతి లేనిపురుషుడు ప్రతిష్ఠలేనివాడును, వస్త్రహీనుడును, దిక్కులేనివాడును, ఒకటే యింద్రియము కలవాడును, క్రియాశూన్యుడును నగువానివలె నిష్ప్రయోజనుడగును.

### పుత్రవంతునిప్రాశస్త్యము.

మూ. బహుమూర్తిర్బ్బహుసుఖో బహువ్యూహో బహుక్రియః. 19
బహుచక్షుర్బ్బహుజ్ఞానో బహ్వాత్మా చ బహుప్రజః,
మఙ్గళ్యోఽయం ప్రశస్యోఽయం ధన్యోఽయం వీర్యవానయమ్.
బహుశాఖోఽయమితి చ స్తూయతే నా బహుప్రజః,

వ్యా. విశేషసంతానముకలపురుషుడు అనేకరూపములు కలవాడుగను, పలుదెరంగులైన సుఖములు కలవాడుగను, బంధుసమూహము కలవాడుగను, అనేకవ్యాపారములు కలవాడుగను, అనేకనేత్రములు కలవాడుగను, అనేకవిజ్ఞానములు కలవాడుగను, అనేకాత్మలు కలవాడుగను, లోకమున నెంచబడును. మఱియు బహుసంతానము కలపురుషుని కల్యాణవంతుడనియు, కొనియాడదగినవాడనియు, ధన్యుడనియు, వీర్యవంతుడనియు, అనేకశాఖలు కలవాడనియు, లోకులు స్తుతియించెదరు.

### సంతతిగల్గుటచే నగుగుణములు.

మూ. ప్రీతిర్బ్బలం సుఖం వృత్తిః విస్తారో విపులం (విభవం) కులమ్. 21
యశో లోకాః సుఖోదర్కాః తుష్టిశ్చాపత్యసంశ్రితాః,
తస్మాదపత్యమన్విచ్ఛన్ గుణాంశ్చాపత్యసంశ్రితాన్. 22
వాజీకరణనిత్యస్స్యాత్ ఇచ్ఛన్ కామసుఖాని చ,
ఉపభోగసుఖాన్ సిద్ధాన్ వీర్యాఽపత్యవివర్ధనాన్. 23
వాజీకరణసంయోగాన్ ప్రవక్ష్యామ్యత ఉత్తరం,

వ్యా. ప్రీతియు, బలంబును, సుఖంబును, జీవనంబును, వ్యాప్తియు, వంశవృద్ధియు, యశంబును, ఉత్తరకాలమున గల్గనున్నసుఖముతో గూడిన యుత్తమలోకంబులును, సంతోషంబును పుత్రుని యాశ్రయించి యుండును. కావున నట్టిగుణముల కాశ్రయమైన సంతతిని, తత్సంబంధములగు (పైజెప్పబడిన)గుణములను, కామోపభోగసుఖములను కోరుపురుషుడు నిత్యంబును వాజీకరణమును సేవింపవలెను. అట్టి కామోపభోగసుఖకరంబులును, సిద్ధఫలంబులును, శుక్రరూపమైన వీర్యమును సంతతిని వృద్ధినొందించునవియునగు వాజీకరణసంయోగవిధానములు ఈక్రింద వివరింపబడును.

### వృష్యబృంహణగుడికాయోగము.

మూ. శరమూలేక్షుమూలాని కాణ్డేక్షుః సేక్షుబాలికా. 24
శతావరీ పయస్యా చ విదారీ కణ్టకారికా,

జీవ న్తీ జీవకో మేదా వీరా చర్షభకో బలాః. 25
ఋద్ధిర్గోక్షురకం రాస్నా సాత్మగుప్తా పునర్నవా,
ఏషాం త్రిపలికాన్ భాగాన్ మాషాణామాఢకం నవమ్. 26
విపాచయేజ్జలద్రోణే చతుర్భాగం చ శేషయేత్,
తత్ర పేష్యాణి మధుకం ద్రాక్షాఫల్గూని పిప్పలీ. 27
ఆత్మగుప్తా మధూకాని ఖర్జూరాణి శతావరీ,
విదార్యామలకేక్షూణాం రసస్య చ పృథక్ పృథక్. 28
సర్పిషశ్చాఢకం దద్యాత్ క్షీరద్రోణం చ తద్భిషక్,
సాధయేద్ఘృతశేషం చ, సుపూతం యోజయేత్ పునః. 29
శర్కరాయాస్తుగాక్షీర్యాః చూర్ణైః ప్రస్థోన్మితైః పృథక్,
పలైశ్చతుర్భిర్భాగధ్యాః పలేన మరిచస్య చ. 30
త్వగేలాకేసరాణాం చ చూర్ణైరర్ధపలోన్మితైః,
మధునః కుడవాభ్యాం చ ద్వాభ్యాం తత్కారయేత్ భిషక్. 31
పలికాగులికాః స్త్యానాః (కృత్వా) తాః యథాగ్ని ప్రయోజయేత్,
ఏష వృష్యః పరం యోగో బృంహణో బలవర్ధనః. 32
అనేనాఽశ్వ ఇవోదీర్ణో బలీ లిఙ్గం సమర్పయేత్, (లిఙ్గమర్పయతే స్త్రియామ్) (ఇతి బృంహణీగుడికా.)

వ్యా. కాకిరెల్లువేళ్లు, చెఱకువేళ్లు, చెడ్డచెఱకువేళ్లు, కాకిచెఱకువేళ్లు, పిల్లిపీచర, తెల్లపాలగుమ్ముడు, నేలగుమ్ముడు, వాకుడు, పాలతూర, జీవకము, మేద, క్షీరకాకోలి, ఋషభకము, చిట్టాముట్టి, ఋద్ధి, పల్లేరు, సన్నరాష్ట్రము, దూలగొండివిత్తులు, నేలగులిమిడి, వీనిని ప్రత్యేకము మూడేసి పలములవంతునను ఒక ఆఢకము (అరువదినాల్గుపలములు) క్రొత్తమినుములను (వీనినన్నిటినొకటిగ) జేర్చి యందు ఒకద్రోణపరిమితము (256 పలములు) నీళ్లుపోసి నాల్గవపాలు మిగులునట్లు కాచి వడగట్టి యుంచునది. పిదప అతిమధురము, ద్రాక్షపండు, కుక్కమేడి, పిప్పళ్లు, దూలగొండివిత్తులు, ఇప్పపువ్వులు, ఖర్జూరము, పిల్లిపీచర, వీనిని పైజెప్పబడిన కషాయమున కల్కద్రవ్యములుగ జేర్చి, అందు నేలగుమ్ముడురసము, ఉసిరికకాయలరసము, చెఱకురసము, ఈరసములను నేతిని ప్రత్యేకము ఒక్కొకఆఢకము (64 పలములు) వంతునను, ఒకద్రోణము (256 పల

ములు) ఆవుపాలను జేర్చి నెయ్యిమాత్రము మిగులునట్లు కాచి వడబోసి యందు ఒక ప్రస్థము (16 పలములు) పంచదారను, ఒకప్రస్థము వెదురుప్పును, నాల్గుపలములు పిప్పళ్లను, ఒకపలము మిరియాలను, దాల్చినిచెక్క ఏలకులు నాగకేసములు, వీనిని ప్రత్యేక మర్ధపలమువంతునను, రెండుకుడవములు (8 పలములు) తేనెను, పైజెప్పినరీతిగ సిద్ధమైన ఘృతమున) జేర్చి పదిలముగ నుంచునది.

అయ్యది ఘనీభవించినపిదప ఒకపలప్రమాణముగ గుళికజేసి వారివారి జాఠరాగ్ని (జీర్ణశక్తి) బలానుసారముగ సేవింపనగును. ఇయ్యది మిగుల శ్రేష్ఠమైన వృష్యయోగము. దీనిని సేవించుటవలన శరీరమును బలమును వృద్ధినందించును. కామోద్రేకము అధికమై గుఱ్ఱమునుబోలె సంభోగశక్తి యపారముగ గల్గును.

## వాజీకరణఘృతము.

మూ. మాషాణామాత్మగుప్తాయాః బీజానామాఢకం నవమ్. 33
జీవకర్షభకౌ వీరాం మేధాంవృద్ధిం శతావరీం,
మధుకం చాశ్వగన్ధాం చ సాధయేత్కుడవోన్మితామ్. 34
రసే తస్మిన్ ఘృతప్రస్థం గవ్యం దశగుణం పయః,
విదారీణాం రసప్రస్థం ప్రస్థమిక్షురసస్య చ. 35
దత్వా మృద్వగ్నినా సాధ్యం సిద్ధం సర్పిర్నిధాపయేత్,
శర్కరాయాస్తుగాక్షీర్యాః క్షౌద్రస్య చ పృథక్ పృథక్. 36
భాగాంశ్చతుష్పలాంస్తత్ర పిప్పల్యాశ్చావపేత్ పలం,
పలం పూర్వమతో లీఢ్వా తతోఽన్నముపయోజయేత్. 37
య ఇచ్ఛేదక్షయం శుక్రం శేఫసశ్చోత్తమం బలమ్,
(ఇతి వాజీకరణం ఘృతమ్.)

వ్యా. క్రొత్తవియగు మినుములును దూలగొండివిత్తులును ప్రత్యేక మొక్కొక ఆఢము (64 పలములు), జీవకము, ఋషభకము, క్షీరకాకోళి, మేద, వృద్ధి, పిల్లిపీచర, అతిమధురము, పెన్నేరుగడ్డ, ఇవి ప్రత్యేక మొక్కొకకుడవము, ఇత్తెరంగున పీసినన్నింటిని చేర్చి ఈసముదాయమునకు నాల్గుభాగములు నీళ్లుబోసి నాల్గవపాలు మిగులునట్లు కషాయముకాచి, యాకషాయమున నొకప్రస్థము నెయ్యిని, పదిప్రస్థములు ఆవుపాలును, ప్రత్యేకమొక్కొకప్రస్థము నేలగుమ్ముడురసమును చెఱకురసమును కలిపి సన్నని మంటచే ఘృతపాకవిధిగ (ఘృతముమాత్రము మిగుల) పక్వము చేయునది. సిద్ధమైన యాఘృతమున

పంచదార, వెదురుప్పు, తేనె ఈమూటిని ప్రత్యేకము నాలుగేసి పలములవంతునను, పిప్పళ్లచూర్ణము నొకపలమును కలిపి, పదిలముగ నుంచుకొని, ప్రతిదినంబును పూటకొక పలముపంతున (అగ్నిబలమున కనుగుణముగ) తొలుత సేవించి పిమ్మట (ఔషధము జీర్ణమైనపిదప) అన్నమును భుజింపవలెను. ఇయ్యది వాజీకరణఘృతము. ఈఘృతమును సేవించినచో శుక్రము మిక్కుటముగ వృద్ధినంది మేఢ్రమునకు బలము కల్గి దృఢముగ నుండును.

## వాజీకరణపిండరసములు.

మూ. శర్కరా మాషవిదలాః తుగాక్షీరీ పయో ఘృతమ్. 38
గోధూమచూర్ణషష్ఠాని సర్పిష్యుత్కారికాం పచేత్,
తాం నాతిపక్వాం మృదితాం కౌక్కుటే మధురే రసే. 39
సుగన్ధే ప్రక్షిపేత్ ఉష్ణే యథా సాన్ద్రీభవేద్రసః,
ఏష పిణ్డరసో వృష్యః పౌష్టికో బలవర్ధనః. 40
అనేనాశ్వ ఇవోదీర్ణో బలీ లిఙ్గం సమర్పయేత్,
శిఖితిత్తిరిహంసానాం ఏవం పిణ్డరసో మతః. 41
బలవర్ణస్వరకరః పుమాంస్తేన వృషాయతే,
(ఇతి వాజీకరణపిణ్డరసాః)

వ్యా. చక్కెర, ఉద్దిపప్పు, వెదురుప్పు, ఆవుపాలు, నెయ్యి, గోదుమపిండి ఈ యారిటిని ఒకటిగ జేర్చి నేతితో భక్ష్యములుగ వండవలెను. అయ్యవి మిక్కిలి కఠినంబులును మిక్కిలి మృదువులును గాకుండునట్లు పక్వముచేయవలెను. ఆభక్ష్యములను మర్దనముచేసి యాపిండమును మధురద్రవ్యములతోడను సుగంధద్రవ్యములతోడను కోడిమాంసరసమును పక్వముజేసి యయ్యది వేడిగనుండునప్పుడు (పైజెప్పినభక్ష్యములపిండమును) మాంసరసము ముద్దయగునంతపరిమాణము కలుపవలెను. ఇయ్యది పిండరసమని చెప్పబడును. దీనిని అగ్నిబలానుసారముగ సేవించినచో శరీరపుష్టియు, బలంబును వృద్ధిజెంది, కామోద్రేక మధికమై గుఱ్ఱమువలె స్త్రీలతో గూడును. ఇత్తెరంగుననే నెమలియొక్కయు, తీతువుపిట్టయొక్కయు హంసయొక్కయు మాంసరసములను సిద్ధముచేసి యుపయోగించినను పైజెప్పినగుణములు కల్గును.

## వృష్యమాహిషరసము.

మూ ఘృతం మాషాన్ సబస్తాణ్డాన్ సాధయేన్మాహిషే రసే. 42
భర్జయేత్తం రసం పూతం ఫలామ్లం నవసర్పిషి,

ఈషత్సలవణం యుక్తం ధాన్యజీరకనాగరైః 43
ఏష వృష్యశ్చ బల్యశ్చ బృంహణశ్చ రసోత్తమః,
(ఇతి వృష్యమాహిషరసః.)

వ్యా. కారెనుబోతుయొక్క మాంసరసమున మేషాండములను మినుములను జేర్చి నేతిని కూడ కలిపి పక్వముచేసి యారసమును వడగట్టి యొకపాత్రమున క్రొత్తనేతిని బోసి, అందు వడగట్టబడిన మాంసరసమును బోసి యందు మాదీఫలములు నిమ్మపండ్లు దానిమ్మ మున్నగువానితో నొకదానిపులుపురసమును కూడ కలిపి సైంధవలవణమును దని యాలు జీలకర శుంఠి వీనిని పొడిజేసి కలిపి పక్వముచేయునది. ఈమాంసరసమును సేవిం చినచో బలంబును శరీరంబును మిక్కిలి వృద్ధినొంది కామోద్దీపన మధికమగును. ఇది యుత్తమమైన వృష్యరసము.

మరికొన్ని వృష్యరసములు.

మూ. చటకాం స్తిత్తిరరసే తిత్తిరాన్ కౌక్కుటే రసే. 44
కుక్కుటాన్ బార్హిణరసే హంసే బార్హిణమేవ చ,
నవసర్పిషి సంతప్తాన్ ఫలామ్లాన్ కారయేద్రసాన్. 45
మధురాన్వాయథాసాత్మ్యం గన్ధాఢ్యాన్ బలవర్ధనాన్,
(ఇత్యన్యే వృష్యరసాః.)

వ్యా. ఊరపిచ్చుకలమాంసమును తీతువుపిట్టమాంసరసమున జేర్చి నిమ్మపండ్లు మొదలగు పులుపురసమునైనను మధురద్రవ్యములనైనను వారివారి యలవాటుననుసరించి కలిపి సుగంధద్రవ్యములను జేర్చి క్రొత్తనేతిలో పక్వముజేసి సేవించునది. ఇత్తెరంగుననే తీతువుపిట్టమాంసమును కోడిమాంసరసమునందును, కోడిమాంసమును నెమలిమాంసరసము నందును, నెమలిమాంసమును హంసలమాంసరసమునందును కలిపి, పైజెప్పినరీతిగనే పులుపు రసమునైనను మధురద్రవ్యమునైనను కలిపి సుగంధద్రవ్యమును కలిపి క్రొత్తనేతిలో పక్వముజేయునది. ఈమాంసరసములలో నెద్దాని సేవించినను బలము వృద్ధినొంది వృష్య మగును.

వృష్యమాంసయోగము.

మూ. తృప్తిం చటకమాంసానాం గత్వా యోఽనుపిబేత్పయః. 46
న తస్య లిఙ్గశైథిల్యం స్యాన్న శుక్రక్షయో నిశి,
(ఇతి వృష్యమాంసమ్.)

వ్యా. ఊరపిచ్చుకలమాంసమును రాత్రివేళ తృప్తిగ భుజించి వెంటనే య
పాలను త్రాగువానికి శుక్రము క్షీణించక లింగము దృఢముగ నుండును.

### వృష్యమాషయోగము.

మూ. మాషయూషేణ యో భుక్త్వా ఘృతాఢ్యం షష్టికౌదనమ్.
పయః పిబతి రాత్రిం స కృత్స్నాం జాగర్తి వేగవాన్,
(ఇతి వృష్యమాషయోగ

వ్యా. అరువదినాళ్లసంబావుబియ్యపుఅన్నమును మినుపకట్టుతో కలిపి, అధిక
నెయ్యి చేర్చి తృప్తిగ భుజించి, పాలుద్రాగినయెడ నారాత్రి యంతయు, కామవేగ
కల్గి నిదుర లేక యుండగలడు.

### వృష్యకుక్కుటమాంసయోగము.

మూ. న నా స్వపితి రాత్రీషు నిత్యస్తబ్ధేన (నిస్తబ్ధేన చ) శేఫసా.
తృప్తః కుక్కుటమాంసానాం భృష్టానాం నక్రరేతసి,
(ఇతి వృష్యః కుక్కుటమాంసప్రయో

వ్యా. కోడిమాంసమును మొసలిశుక్రమున జేర్చి యుడికించి తృప్తిగ తినిన
నామనుజుడు లింగము స్తంభించి రాత్రులయందు నిదురలేక యుండగలడు.

### వృష్యములగు అండరసములు.

మూ. నిస్రావ్యమత్స్యాణ్డరసం భృష్టం సర్పిషి భక్షయేత్.
హంసబర్హిణదక్షాణామేవమణ్డాని భక్షయేత్.
(ఇతి వృష్యోఽణ్డరస

వ్యా. మత్స్యముల గుడ్లరసమును వెలికిం దీసి నేతితో వేయించి సేవించిన
హంసగ్రుడ్లను నెమలిగ్రుడ్లను కోడిగ్రుడ్లను నేతితో పక్వముజేసి యైనను తినిన
పైజెప్పిన రీతిగ శుక్రము వృద్ధియగును. (ఇచ్చట మత్స్యాండరస మొకటియు, 'హం
బర్హిణ-దక్ష' అనునవి మూడునుకలిసి వేరొకయోగంబును నగును. కావున సంగ్రహం
'పంచదశీ' అనుసంఖ్య సంగతము)

### వాజీకరణమునకుముందు శోధనావశ్యకత.

భవతశ్చాత్ర:—

మూ. స్రోతస్సు శుద్ధేష్వమలే శరీరే
వృష్యం యదా నా (యదాయం) మితమత్తి కాలే,
వృషాయతే తేన పరం మనుష్యః
తద్బృంహణం చైవ బలప్రదం చ.

తస్మాత్పురా శోధనమేవ కార్యం
బలానురూపం నహి వృష్యయోగాః,
సిద్ధ్యన్తి దేహే మలినే ప్రయుక్తాః
క్లిష్టే యథా వాససి రాగయోగాః.　　51

వ్యా. తొలుత విరేచనాది శోధనకర్మలచే నాయా స్రోతస్సులును శరీరంబును శుద్ధముగ జేసికొని పైజెప్పిన వృష్యయోగములను యుక్తమైనకాలమున సాత్మ్యాదుల కనుగుణముగ అగ్నిబలమునకు దగిన మితమైన పరిమాణమును గల్పించి మనుజుడు సేవించినచో దానివలన శరీరము బలిష్ఠమై యింద్రియపాటవము గల్గి స్త్రీలతో సంభోగించు శక్తి మిక్కుటమైయుండును.

శోధనముల నాచరింపక శరీరము మలినముగ నుండునపుడు వృష్యయోగముల సేవించినచో నయ్యవి మలినమైన ప్రాతవస్త్రమున నుపయోగింపబడిన రంగులు చక్కగ పట్టనిరీతిగ మలినశరీరమున ఫలవంతములు కానేరవు; కావున మనుజుడు తొలుత శోధన విధులచే శరీరమును శుద్ధముగ జేసికొని పిమ్మట వృష్యయోగములను బలానుసారముగ నుపయోగించినచో యథోక్తఫలమును గల్గించునని భావము.

వాజీకరణప్రథమపాదవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. వాజీకరణసామర్థ్యం క్షేత్రం స్త్రీ యస్య చైవ యా,
యే దోషా నిరపత్యానాం గుణాః పుత్రవతాం చ యే.　　52
దశ పఞ్చ చ సంయోగాః వీర్యాఽపత్యవివర్ధనాః,
ఉక్తాస్తే శరమూలీయే పాదే పుష్టిబలప్రదాః.　　53

వ్యా. వాజీకరణప్రభావంబును, వాజీకరణార్హక్షేత్రంబును, వృష్యకరస్త్రీలక్షణంబులును, సంతతి లేనందున గల్గు దోషంబులును, పుత్రవంతులగుణంబులును, శుక్రమును సంతానమును బలమును వృద్ధినందించు పదునైదువృష్యయోగములును, ఈవిషయములన్నియు శరమూలీయమను వాజీకరణప్రథమపాదమున వివరింపబడినవి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే,
చికిత్సాస్థానే ద్వితీయేఽధ్యాయే
సంయోగశరమూలీయో నామ ప్రథమః పాదః.

ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహిత యగు నాయుర్వేదతంత్రమునందలి ద్వితీయాధ్యాయమున సంయోగశరమూలీయమను నది వాజీకరణప్రథమపాదము సంపూర్ణము.

---

## ద్వితీయాధ్యాయము—ద్వితీయపాదము.

అవతరణిక:—సంయోగశరమూలీయపాదమును జెప్పినపిదప వృష్యసామ్యవ
బట్టి ఆసిక్తక్షీరికమను రెండవవాజీకరణపాదము వివరింపబడును.

మూ. అథాత ఆసిక్తక్షీరికం వాజీకరణపాదం వ్యాఖ్యాస్యామః.
ఇతి హ స్మాహ భగవానాత్రేయః.

వ్యా. సంయోగశరమూలీయమను వాజీకరణపాదమును జెప్పినపిదప ఆసిక్త
కము (ఆసిక్తక్షీరశబ్దము ప్రారంభమునగల) వాజీకరణపాదము భగవానుడగు నాత్రే
డుపదేశించినదానికన్న న్యూనాతిరేకము గాకుండునట్లు వివరింపబడునని యర్థ
("ఆసిక్తక్షీరమితి పదం, అస్మిన్నస్తి=ఇతి, ఆసిక్తక్షీరికం" (స్వార్థమున కప్రత్యయవ
ఃనువిగ్రహముచేత నిష్పన్నము.)

### 1. సంతానకరషష్టికాదిగుటికలు.

మూ. ఆసిక్తక్షీరమాపూర్ణం అశుష్కం శుద్ధషష్టికం,
ఉదూఖలే సమాపోథ్య పీడయేత్ క్షీరమర్దితమ్
(క్షుణ్ణం విమర్దితం క్షీరే పీడయేత్ సుసమాహితః,)
గృహీత్వా తం రసం పూతం గవ్యేన పయసా సహ,
బీజానామాత్మగుప్తాయాః ధాన్యమాషరసేన చ.
బలాయాశ్శూర్పపర్ణ్యోశ్చ జీవన్త్యా జీవకస్య చ,
(ఋషభస్య చ కాకోలీమధుకానాం రసేన చ)
ఋద్ధ్యర్షభకకాకోలీ శ్వదంష్ట్రా మధుకస్య చ.
శతావర్యా విదార్యాశ్చ ద్రాక్షాఖర్జూరయోరపి,
సంయుక్తం మాత్రయా వైద్యః సాధయేత్తత్ర చావపేత్.
తుగాక్షీర్యాస్సమాషాణాం శాలీనాం షష్టికస్య చ,
గోధూమానాం చ చూర్ణాని యైస్స సాన్ద్రీభవేద్రసః.
సాన్ద్రీభూతం చ కుర్యాత్తు ప్రభూతమధుశర్కరం,
గుళికా బదరైస్తుల్యాః తాశ్చ సర్పిషి భర్జయేత్.
తాః యథాగ్ని ప్రయుఞ్జానః క్షీరమాంసరసాశనః,
పశ్యత్యపత్యం విపులం వృద్ధోఽప్యాత్మజమక్షయమ్.
(ఇత్యపత్యకరీ షష్టికాదిగుటికా

వ్యా. పాలను బోసి పెంచబడి చక్కగ పండి యెండక పచ్చిగనుండు శుద్ధ షష్టిక (అరువదినాళ్లకు ఫలించు ఎఱ్ఱనివరి) ధాన్యమును రోటిలో బోసి పాలుబోసి మెత్తగ దంచి యావుపాలు బోసి నూరి దానిరసమును పిండి గ్రహించి వడగట్టియుంచునది. పిదప ఆవుపాలు, దూలగొండివిత్తులరసము, దనియాలరసము, ఉద్దులరసము, చిట్టాముట్టిరసము, అడవిమినుములరసము, అడవిపెసలరసము, పాలకూరరసము, జీవకము యొక్కరసము, ఋద్ధియొక్క రసము, ఋషభకరసము, కాకోలీరసము, పల్లేరురసము, అతిమధురరసము, పిల్లిపీచరరసము, నేలగుమ్ముడురసము, ద్రాక్షరసము, ఖర్జూరపుపండ్ల రసము వీనిని ప్రత్యేకము సమభాగమువంతున పైజెప్పబడిన శుద్ధషష్టికధాన్యరసమున జేర్చి పక్వముజేయునది. అందు వెదురుప్పు, మినుములు, ఎఱ్ఱవరిబియ్యము, గోధుమలు వీని నన్నింటిని సమభాగములుగ జేర్చి మెత్తనిపిండి చేసి, యాచూర్ణమును పైజెప్పిన రససముదాయము చిక్కనగునంతపరిమితము చేర్చి ఘనీభవించి ముద్దయగునట్లు పాకము చేయునది. అట్టిపాకసమయమున నాయౌషధసముదాయము మిక్కిలి తీపిగల్గునంతపరిమితితో చక్కెరను తేనెను చేర్చి పక్వముచేయనగును. మరియు నాయౌషధమును రేగుపండంతేసి యుండలు చేసి యాయుండలను నేతిలో వేయించి యగ్నిబలానుసారముగ సేవించుచు ఆవుపాలను మాంసరసమును ఆహారముచేసినయెడ వానికి సంతానము తప్పక కల్గును. వృద్ధులు సేవించినచో వీర్యము ప్రబలముగ వృద్ధినందును. ఇది షష్టికాదిగుటికలను వృష్యయోగము.

(ఇచ్చట ద్రవముల నన్నిటిని సమభాగముగను, ఆవాపచూర్ణమును రసము ఘనీభవించునంతపరిమితముగను, తీపి చక్కగనుండునంతపరిమాణము తేనెను చక్కెరను కలుపవలెను.)

## 2. వృష్యపూపలికాదియోగములు.

మూ. చటకానాం సహంసానాం దక్షాణాం శిఖినాం తథా,
శిశుమారస్య నక్రస్య భిషక్ శుక్రాణి సంహరేత్. 10
గవ్యం సర్పిర్వరాహస్య కులిఙ్గస్య వసామపి,
షష్టికానాం చ చూర్ణాని చూర్ణం గోధూమకస్య చ. 11
ఏభిః పూపలికాః కార్యాః శష్కుల్యో వర్తికా స్తథా,
పూపాః ధానాశ్చ వివిధాః భక్ష్యాశ్చాన్యే పృథగ్విధాః. 12

ఏషాం ప్రయోగాద్భక్ష్యాణాం స్తబ్ధేనాపూర్ణ రేతసా,
శేఫసా వాజివద్యాతి యావదిచ్ఛం స్త్రియో నరః. 13

(ఇతి వృష్యపూపలికాదియోగః.)

వ్యా. ఊరపిచ్చుకలు, హంసలు, కోళ్లు, నెమళ్లు, శిశుమారము (ముసలి), నక్రము (ఏనుగునుబట్టి యీడ్చుకొనిపోవుశక్తికల జలజంతు (మొసలి) విశేషము), ఈజంతువులశుక్రమును (వీనిగ్రుడ్లలోనుండుద్రవమును), ఆవునేతిని, అడవిపందిమాంసరసమును, ఊరపిచ్చుకమాంసరసమును, వీనినన్నిటి నొకటిగ జేర్చి యుంచుకొని అందు అరువదినాళ్లసంబావులబియ్యపుపిండిని, గోధుమపిండిని కలిపి, ఆపిండితో పూరీలు చక్కిలములు బూరెలు మొదలగు ననేకవిధములైన భక్ష్యముల జేసి సేవించినయెడ, శైథిల్యము లేక శుక్రము పూర్ణమై మేఢ్రము శిథిలముగాక దృఢమై, తనకిచ్చవచ్చినంత కాలము గుఱ్ఱమువలె సంభోగించుశక్తి కల్గియుండును. (ఇచ్చట ఊరపిచ్చుక మున్నగుజంతువుల శుక్రము లభించుట దుస్తరముకావున వానిగ్రుడ్లను గ్రహించునది).

## 3. పుత్రోత్పాదకస్వరసము.

మూ. ఆత్మగుప్తాఫలం మాషాః ఖర్జూరాణి శతావరీ,
శృఙ్గాటకాని మృద్వీకాం సాధయేత్ప్రసృతోన్మితమ్. 14
క్షీరప్రస్థం జలప్రస్థమేతత్ ప్రస్థావశేషితం,
శుద్ధేన వాససా పూతం యోజయేత్ ప్రసృతైస్త్రిభిః. 15
శర్కరాయాస్తుగాక్షీర్యాః సర్పిషోఽభినవస్య చ,
తత్ పాయయేత సక్షౌద్రం షష్టికాన్నం చ భోజయేత్. 16
జరాపరీతోఽప్యబలః యోగేనానేన విన్దతి,
నరోఽపత్యం సువిపులం యువేవ చ స హృష్యతి. 17

(ఇత్యపత్యకరస్స్వరసః.)

వ్యా. దూలగొండివిత్తులు, మినుములు, ఖర్జూరపుకాయలు, పిల్లిపీచర, నమ్మదుంపలు, ద్రాక్షపండు, వీనిని ప్రత్యేకము రెండేసిపలములవంతున జేర్చి, అందు ఒకప్రస్థము (16 పలములు) ఆవుపాలను, ఒకప్రస్థము నీళ్లను కలిపి యొకప్రస్థపరిమితము మిగులునట్లు కాచి, శుభ్రమైన గుడ్డచే వడియగట్టి, యాస్వరసమున పంచదారను వెదురుప్పును వెన్నకాచిననేతిని ప్రత్యేకము రెండేసిపలములవంతున జేర్చి కలిపి తేనెను కూడ చేర్చి

ప్రతిదినంబును సేవించి అరువదినాళ్లసంబావుబియ్యపు అన్నమును భుజించినయెడ ముసలి వాడును బలహీనుడును కూడ యౌవనవంతునివలె విస్తారముగ సంతతినొంది మనస్సంతోషమును కామోద్దీపనమును బొందును.

## 4. వృష్యక్షీరయోగము.

మూ. ఖర్జూరీమస్తకం మాషాణ్ పయస్యాం చ శతావరీమ్. 18
ఖర్జూరాణి మధూకాని మృద్వీకామజడాఫలం,
పలోన్మితాని మతిమాణ్ (సర్వాణి) సాధయేత్సలిలాఢకే,
తేన పాదావశేషేణ క్షీరప్రస్థం విపాచయేత్. 19
క్షీరశేషేణ తేనాద్యాత్ ఘృతాఢ్యం షష్టికౌదనం,
సశర్కరేణ సంయోగః ఏష వృష్యః పరం స్మృతః. 20
(ఇతి వృష్యక్షీరమ్.)

వ్యా. ఖర్జూరపుచెట్టుకొననుండు మోవు, ఉద్దులు, పాలకూర, పిల్లిపీచర, ఖర్జూరపుకాయలు, ఇప్పపువ్వులు, ద్రాక్షపండు, దూలగొండి విత్తులు, వీనినన్నిటిని ప్రత్యేకము ఒక్కొకపలమువంతున గూర్చి అందొక ఆఢకపరిమితము జలమును బోసి నాల్గవవంతు మిగులునట్లు కాచి యాకషాయమున నొకప్రస్థము ఆవుపాలు బోసి, పాలు మాత్రము మిగులునట్లు (క్షీరపాకవిధిప్రకారము) పక్వముజేసి,యాక్షీరమును అరువదినాళ్లసంబావు బియ్యపు అన్నముతో కలిపి నెయ్యిని చక్కెరను విశేషముగ జేర్చి భుజించునది. ఇయ్యది మిక్కిలి వృష్యమైనయోగము.

## 5. వృష్యఘృతము.

మూ. జీవకర్షభకౌ మేదాం జీవన్తీం శ్రావణీద్వయం,
ఖర్జూరం మధుకం ద్రాక్షాం పిప్పలీం విశ్వభేషజమ్. 21
శృఙ్గాటకం విదారీం చ నవం సర్పిః పయో జలం,
సిద్ధం ఘృతావశేషం తత్ శర్కరాక్షౌద్రపాదికమ్. 22
షష్టికాన్నేన సంయుక్తం ఉపయోజ్యం యథాబలమ్,
వృష్యం బల్యం చ వర్ణ్యం చ కణ్ఠ్యం బృంహణముత్తమమ్ 23
(ఇతి వృష్యఘృతమ్.)

వ్యా. జీవకము, ఋషభకము, మేద, పాలకూర, బోడతరము, తెల్లబోడతరము, ఖర్జూరపుకాయలు, అతిమధురము, ద్రాక్షపండు, పిప్పళ్లు, శుంఠి, నమ్మదుంపలు, నేల

గుమ్మడు వీని నన్నిటిని సమభాగములుగ జేర్చి కల్కము జేసి, ఈసముదాయకల్కమునకు నాల్గుపాళ్లు నెయ్యి బోసి, నేతికి నాల్గింతలు పాలును, అంతియ నీళ్లను కలిపి నెయ్యి మాత్రము మిగులునట్లు (ఘృతపాకవిధిప్రకారము) పక్వము జేసి, యాఘృతమునకు నాల్గవ వంతు చక్కెరను తేనెను కలిపి, యాఘృతమును అరువదినాళ్లసంబావుబియ్యపుటన్నమున గలిపి, యగ్నిబలానుసారముగ నుపయోగించునెడ, శరీరబలంబును వర్ణంబును కంఠస్వరంబును చక్కబడి, శరీరము పుష్టిజెంది సంభోగశక్తి యధికమగును. ఇది యుత్తమమైన వృష్యఘృతము.

## 6. వృష్యమగుదధిసరప్రయోగము.

మూ. దధ్నస్సరం శరచ్చన్ద్రసన్నిభం దోషవర్జితం,
శర్కరాక్షౌద్రమరిచైః తుగాక్షీర్యా చ బుద్ధిమాన్. 24
యుక్త్యా యుక్తం ససూక్ష్మైలం నవే కుమ్భే (కుణ్డే) శుచౌ పటే,
మార్జితం ప్రక్షిపేచ్ఛీతే ఘృతాఢ్యే షష్టికౌదనే. 25
(పిబేన్మాత్రాం రసాలాయాః తం భుక్త్వా షష్టికౌదనం,)
తమద్యాదుపరిష్టాచ్చ రసాలాం మాత్రయా పిబేత్,
వర్ణస్వరబలోపేతః పుమాంస్తేన వృషాయతే. 26
(ఇతి దధిసరప్రయోగః.)

వ్యా. శరత్కాలచంద్రునిబోలె స్వచ్ఛమై దోషరహితమైన పెరుగుపైనుండు మీగడతో చక్కెర, తేనె, మిరియాలు, వెదురుప్పు వీనినన్నిటిని ఉప్పుకారము మున్నగు రసములు మీరక యుక్తియుక్తముగ నుండునట్లు జేర్చి, అందు పిన్నయేలకులను గూడ జేర్చి, శుభ్రమైన క్రొత్తకుండమూతికి పరిశుద్ధమగు బట్టను గట్టి పైజెప్పిన మీగడను పిసికి మర్దనము జేసి వడగట్టి యా తేటను చల్లగనుండు అరువదినాళ్లసంబావుబియ్యపుటన్నమున బోసి కలిపి యాయన్నమును భుజించి, వెంటనే పైజెప్పినరసాలను (పెరుగురసమును) తగిన మాత్రతో త్రాగవలెను. ఇటులు సేవించినచో మంచివర్ణము కల్గును. కంఠస్వరము మంచిది యగును. శరీరబలము వృద్ధినందును. మరియు నీయోగమువలన పురుషునికి సంభోగశక్తి యధికముగ నగును.

రసాలాలక్షణము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"సచాతుర్జాతకాజాజి సగుడార్ద్రకనాగరమ్, రసాలా స్యాచ్ఛిఖరిణీ సుఘృష్టం ససరం దధి" (మీగడతో గూడిన పెరుగున చాతుర్జాతము (దాల్చినచెక్క, ఏలకులు, లవంగపత్రి, నాగకేసరము

లు)ను, జీలకరను, బెల్లమును, అల్లమును, శుంఠినిచేర్చి మర్ధనముచేసిన నాపెరుగు రసము రసాల యనియు శిఖరిణి యనియు, చెప్పబడును). ఈలక్షణము ననుసరించి పైజెప్పిన రీతిగ సంస్కరించి యుపయోగించునది.

7 వృష్యమగుషష్టికౌదనప్రయోగము.

మూ. చన్ద్రాంశుకల్పం పయసా ఘృతాఢ్యం షష్టికౌదనం,
శర్కరామధుసంయుక్తం ప్రయుఞ్జానో వృషాయతే. 27

(ఇతి వృష్యషష్టికౌదనప్రయోగః)

వ్యా. చంద్రకాంతినిబోలె స్వచ్ఛమైన అరువదినాళ్లసంబావుబియ్యపు అన్నమున విశేషముగ నేతిని కలిపి పాలును జేర్చి చక్కెరను తేనెను కలిపి ప్రతిదినంబును భుజించి నచో శుక్రము వృద్ధియై సంభోగశక్తి యినుమడించును.

8. వృష్యములగుభక్ష్యయోగములు.

మూ. తప్తే సర్పిషి నక్రాణ్డం తామ్రచూడాణ్డమిశ్రితం,
యుక్తం షష్టికచూర్ణేన సర్పిషాభినవేన చ 28
పక్త్వా పూపలికాః ఖాదేత్ వారుణీమణ్డపో నరః,
య ఇచ్ఛేదశ్వవద్గన్తుం ప్రసేక్తుం గజవచ్చ యః. 29

(ఇతి వృష్యపూపలికాః.)

వ్యా. ఏమనుజుడు గుఱ్ఱమువలె యథేచ్ఛగ స్త్రీలతో రమించి యేనుగువలె నధికముగ శుక్రమును విసర్జింప దలంచునో ఆమనుజుడు అరువదినాళ్లసంబావుబియ్యపు పిండిలో క్రొత్తనేతిని మొసలిగ్రుడ్లరసమును కోడిగ్రుడ్లరసమును కలిపి మర్దనముచేసి చక్కగకాగుచున్న నేతిలో కాల్చబడినభక్ష్యములను సేవించి వారుణియను మద్యము యొక్క తేటను త్రాగవలెను. (పైజెప్పబడిన భక్ష్యముల సేవించి వారుణీమండమును త్రాగినవాడు ఏనుగువలె శుక్రము వృద్ధినంది,గుఱ్ఱమువలె సంభోగశక్తి యధికమైయుండు నని భావము).

పైజెప్పినవృష్యయోగములసామాన్యఫలము, వృష్యకరవిహారములు.

భవతశ్చాత్ర:—

మూ. ఏతైః ప్రయోగైర్విధివద్వపుష్మాన్
స్నేహోపపన్నో (వీర్యోపపన్నో) బలవర్ణయుక్తః,
హర్షాన్వితో వాజివదష్టవర్షో
భవేత్సమర్థశ్చ వరాఙ్గనాసు. 30

యదృచ్ఛ కిఞ్చిన్మనసః ప్రియం స్యాత్
రమ్యా వనాన్తాః పులినాని శైలాః,
ఇష్టాః స్త్రియో భూషణగన్ధమాల్యం
ప్రియా వయస్యాశ్చ తదత్ర యోగ్య(జ్యం.) 31

వ్యా. ఈపాదమున పైజెప్పబడినవృష్యయోగములను విధ్యుక్తప్రకారము ప్రయోగించినమానవుడు శరీరపాటవంబును, కాంతియు, స్త్రీలయెడ పరమప్రీతియు, శరీరబలంబును, వర్ణంబును, కామోద్రేకంబును మిక్కుటముగ గల్గి, ఎనిమిదిసంవత్సరములు వయస్సుకల గుఱ్ఱమువలె స్త్రీలతో సంభోగముచేయు సామర్థ్యము కల్గియుండును. మరియు: మనస్సుకింపైన వస్తుజాలంబును రమ్యములగు వనప్రదేశంబులును, ఇసుకదిబ్బలును, పర్వత ప్రదేశంబులును, మనస్సున కిష్టముగనుండు స్త్రీలును, కటకమకుటాది భూషణంబులు, సుగంధద్రవ్యంబులును, పరిమళముకల పుష్పమాలికలును, మనస్సుకు ప్రియులై (యంతరంగులగు) స్నేహితులును, ఇవియన్నియు వాజీకరణయోగ్యము లైయుండును.

ద్వితీయపాదోక్తవిషయసంగ్రహము.

తత్ర శ్లోకః—

మూ. ఆసిక్తక్షీరికే పాదే యే యోగాః పరికీర్తితాః,
అపత్యకామైస్తే ప్రయోజ్యాః పౌరుషార్థిభిః. 32

వ్యా. ఆసిక్తక్షీరికమను నీవృష్య రెండవపాదమున షష్టికాదిగుటికమున్నగు నెనిమిదియోగములు వివరింపబడినవి. ఈయోగములు సంతతిని శుక్రవృద్ధిని గోరుపురుషులచే నుపయోగింపందగును.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతే
చికిత్సితస్థానే వాజీకరణాధ్యాయే ఆసిక్తక్షీరికో నామ
వాజీకరణపాదో ద్వితీయః.

ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహిత యను నాయుర్వేదతంత్రమునందలి చికిత్సాస్థానమున ద్వితీయాధ్యాయమునందు ఆసిక్తక్షీరికమను వాజీకరణద్వితీయపాదము సంపూర్ణము.

---

## ద్వితీయాధ్యాయము—తృతీయపాదము.

మూ. అథాతో మాషపర్ణభృతీయం వాజీకరణపాదం వ్యాఖ్యాస్యామః.
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. 2

వ్యా. ఆసిక్తక్షీరికమను వాజీకరణపాదమును జెప్పినపిదప మాషపర్ణభృతీయ (మాషపర్ణభృతశబ్దముప్రారంభమునగల)మను వాజీకరణపాదమును భగవానుడగునాత్రేయ మహర్షి యుపదేశించినదానికన్న న్యూనాతిరేకము లేసట్లు వివరించెదనని యర్థము.

1-3 గోక్షీరవాజీకరణయోగములు.

మూ. మాషపర్ణభృతాం ధేనుం గృష్టిం పుష్టాం చతుస్తనీం,
సమానవర్ణవత్సాం చ జీవద్వత్సాం చ బుద్ధిమాన్. 3
రోహిణీమథ వా కృష్ణాం ఊర్ధ్వశృఙ్గీమదారుణాం,
ఇక్ష్వాదామర్జునాదాం వా సాన్ద్రక్షీరాం చ ధారయేత్. 4
కేవలం తు పయస్తస్యాః శృతం వాఽశృతమేవ వా,
శర్కరాక్షౌద్రసర్పిర్భిః యుక్తం తద్వృష్యముత్తమమ్. 5

వ్యా. మంచిశరీరపుష్టియు, నాల్గుస్తనంబులును, తల్లికిసమానమైనరంగుకల్గి జీవించి యుండుదూడయు కల్గి, మొదటియీతనీని నల్లనిరంగైనను ఎఱ్ఱనిరంగైనను కలిగినదియు, నిలువుకొమ్ములుకల్గి సాధువైన యావును మినుప ఆకునైనను చెఱకుదంటునైన మద్దియాకు నైనను ఆహారముగ బెట్టి సాకి కాపాడి, ఆయాహారముచే పుష్టినొంది చిక్కనిపాలుకల ఆయావును పాలు పితికి, ఆపాలను పచ్చిగనైనను, కాచియైనను, చక్కెరను తేనెను నేతిని కల్పియైనను ఉపయోగించినచో నయ్యది యుత్తమమైన వృష్యమగును.

ఇచ్చట పైజెప్పిన గుణములు కల్గిన యావుయొక్క పాలను కేవలము పాలను మాత్రమే పచ్చిగ నుపయోగించునది యొకయోగము. ఆపాలనే కాచి యుపయోగించు నది రెండవయోగము, ఆపాలలోనే చక్కెరను తేనెను నేతిని కలిపి యుపయోగించునది మూడవయోగము. ఇత్తెరంగున నీక్షీరయోగములు మూడు వృష్యయోగములని యెరుం గునది.

4-8 వృష్యక్షీరయోగములు.

మూ. శుక్రలైర్జీవనీయైశ్చ బృంహణైర్బలవర్ధనైః,
క్షీరసంజననైశ్చైవ పయస్సిద్ధం పృథక్ పృథక్. 6

యుక్తం గోధూమచూర్ణేన సఘృతక్షౌద్రశర్కరం,
పర్యాయేణ ప్రయోక్తవ్యం ఇచ్ఛతా శుక్రమక్షయమ్. 7

వ్యా. శుక్రలం (శుక్రమును కల్గించు)బగుగణమున జెప్పబడిన ద్రవ్యములగూర్చియైనను, జీవనీయగణద్రవ్యముల గూర్చియైనను, బృంహణీయగణమున జెప్పబడిన ద్రవ్యముల గూర్చియైనను, బలవర్ధక (బల్య)గణమున జెప్పబడిన ద్రవ్యముల గూర్చియైనను, క్షీరసంజనన (స్తన్యజనన) వర్గమున జెప్పబడినద్రవ్యముల గూర్చియైనను, ఆవుపాలను వేరువేరుగ క్షీరపాకవిధిప్రకారము పక్వముజేసి, అందు గోధుమచూర్ణమును (పిండిని) నేతిని తేనెను చక్కెరనుజేర్చి యీయైదుయోగములను వేరువేరుగ (ఒక్కొకదానిని) ప్రయోగించినచో మిక్కుటముగ శుక్రము వృద్ధినందును.

ఇచ్చట సూత్రస్థానమున:—"జీవకర్షభకౌ...జీవనీయానిభవన్తి" (సూత్రస్థాన. అ. ౪. సూ. ౨౪); జీవకర్షభక...శుక్రజననానిభవన్తి" (సూత్ర. అ. ౪. సూ. ౪౨); "క్షీరిణీ...బృంహణీయానిభవన్తి" (సూత్ర. అ. ౪. సూ, ౨౫); "ఐన్ద్రీఋషభి... బల్యాని భవన్తి" (సూత్ర. అ. ౪. సూ. ౩౦); "వీరణశాలి...స్తన్యజననానిభవన్తి" (సూత్ర. అ. ౪. సూ. ౩౯); అని చెప్పబడిన శుక్రజననాదిగణముల నైదిటి నెరుంగునది. ఆయైదుగణములలో నాయాగణమునకు వేరువేరుగ జెప్పబడిన పదేసిద్రవ్యములను పాలలో జేర్చి వేరువేరుగ క్షీరపాకవిధిచే పక్వము చేయనగును. దానంజేసి ఈవృష్య క్షీరయోగములు ఐదని యెరుంగునది.

### 9. వృష్యక్షీరయోగము.

మూ. మేదాం పయస్యాం జీవన్తీం విదారీం కణ్టకారికాం,
శ్వదంష్ట్రాం క్షీరికాం మాషాన్ గోధూమాన్ శాలిషష్టికాన్. 8
పయస్యర్ధోదకే పక్త్వా (సిద్ధాన్) కార్షికానాఢకోన్మితే,
వివర్జయేత్పయశ్శేషం తత్పూతం క్షౌద్రసర్పిషా. 9
యుక్తం సశర్కరం పీత్వా వృద్ధస్సప్తతికోఽపి వా,
విపులం లభతేఽపత్యం యువేవ చ సహృష్యతి. 10

వ్యా. మేద, క్షీరకాకోలి, పాలకూర, నేలగుమ్మడు, వాకుడు, మినుములు, పల్లేరు, పాలపండ్లు, గోధుమలు, వరిబియ్యము, అరువదినాళ్లసంబావులబియ్యము, వీనిని ప్రత్యేకమొక్కొక కర్షమువంతున భాగములుగ జేర్చి, సగము నీళ్లను సగము పాలునుకలిసి యొక ఆఢకపరిమితద్రవమున పైజెప్పబడిన ద్రవ్యముల సముదాయమును కల్కము జేసి కలిపి,

పాలు మాత్రము మిగులునట్లు కాచి, అందు పిప్పిని(కల్కమును) దూరంబుచ్చి పాలను మాత్రము వడగట్టి, అందు తేనెను నేతిని చక్కెరను కలిపి త్రాగినచో, డెబ్బదివత్సరములు వయసుచెల్లినముసలివాడును మిక్కుటమైన శుక్రవృద్ధి కల్గి యౌవనవంతునివలె కామోద్రేకము కల్గియుండును.

## 10. అపత్యకరక్షీరయోగము.

మూ. మణ్డలైర్జాతరూపస్య తస్యా ఏవ పయశ్శృతం,
అపత్యజననం సిద్ధం సఘృతక్షౌద్రశర్కరమ్. 11

వ్యా. పైని మూడవశ్లోకమున జెప్పినరీతిగ మినుపాకు ఆహారము మున్నగు లక్షణములం గూడిన ఆవుపాలలో పలుచని బంగరురేకులనుచేర్చి కాచి, అందు నేతిని తేనెను చక్కెరను కలిపి త్రాగినచో శుక్రము వృద్ధినంది సంతానము కల్గును.

## 11. శుక్రస్తంభకక్షీరయోగము.

మూ. త్రింశత్ సుపిష్టాః పిప్పల్యః ప్రకుఞ్చే తైలసర్పిషోః,
భృష్టాస్సశర్కరాక్షౌద్రాః క్షీరధారానదోహితాః. 12
పీత్వా యథాబలం చోర్ధ్వం షష్టికం క్షీరసర్పిషా,
భుక్త్వా న రాత్రిమస్తబ్ధం లిఙ్గం పశ్యతి నాతురః. 13

వ్యా. ముప్పదిపిప్పళ్లను నూనె నెయ్యి ఈరెంటను కలిసి యొకపలమున కలిపి పక్వముగ వేయించి అందు చక్కెరను తేనెను కలిపి, ఈసముదాయమున ఆవుపాలను ధారగ పిండి యీపాలను అగ్నిబలానుసారముగ త్రాగి పిమ్మట అరుపదినాళ్లసంబావు బియ్యపు అన్నమును పాలను నేతిని కలిపి భుజించినయెడ నారాత్రియంతయు శుక్రము స్రవించక స్తంభించియుండును. (ఇచ్చట పిప్పళ్లు త్రాగుటకు యుక్తముగ నుండునంత పరిమితమగు పాలను పితకవలెనని యెరుంగునది).

## 12. వృష్యపాయసయోగము.

మూ. శ్వదంష్ట్రాయాః విదార్యాశ్చ రసే క్షీరచతుర్గుణే,
ఘృతాఢ్యస్సాధితో వృష్యః మాషషష్టికపాయసః 14
(ఇతి వృష్యపాయసయోగః).

వ్యా. పల్లేరురసమును నేలగుమ్ముడురసమును జేర్చి, ఆరసమునకు నాల్గింతపాలు కలిపి, అందు ఉద్దిపప్పును అరువదినాళ్లసంబావు బియ్యమును కలిపి, అధికముగ నెయ్యి కలిపి పాయసము చేసి యుపయోగించినచో నయ్యది వృష్యమగును.

## 13. వృష్యములగుపూరీలయోగము.

మూ. ఫలానాం జీవనీయానాం స్నిగ్ధానాం రుచికారిణాం,
కుడవశ్చూర్ణితానాం స్యాత్ స్వయంగుప్తాఫలస్య చ. 15
కుడవశ్చైవ మాషాణాం ద్వౌ ద్వౌ చ తిలముద్గయోః,
గోధూమశాలిచూర్ణానాం కుడవః కుడవో భవేత్. 16
సర్పిషః కుడవశ్చైకః తత్సర్వం క్షీరమర్దితం,
(సర్పిషః కుడవశ్చైవ క్షీరేణ మృదితం చ తత్),
పక్త్వా పూపలికాః ఖాదేత్ బహ్వ్యస్స్యుర్యస్య యోషితః. 17
(ఇతి వృష్యపూపలికాః.)

వ్యా. జీవనీయగణమున జెప్పబడిన జీవకము ఋషభకము మున్నగు పదిచెట్ల యొక్కయు, స్నేహోపగమగణమున జెప్పబడిన ద్రాక్ష అతిమధురము మున్నగుపదిచెట్ల యొక్కయు, హృద్యగణమున జెప్పబడిన (రుచికరములగు) మామిడి, కొండమామిడి మున్నగు పదిచెట్లయొక్కయు పండ్లను అన్నియు చేరి యొకకుడవము అగునట్లు చేర్చి యీముప్పదిదినుసులపండ్లచూర్ణ మొకకుడవము; దూలగొండివిత్తులచూర్ణ మొకకుడవము, ఉద్దులు ఒకకుడవము, నువ్వులు పెసలు ఈమూటియొక్క చూర్ణము ప్రత్యేకము రెండేసికుడవములు, గోధుమలయొక్కయు బియ్యముయొక్కయు పిండి ప్రత్యేక మొక్కొక కుడవము, నెయ్యి ఒకకుడవము, ఈభాగముల ప్రకారము పైజెప్పినవాని నన్నిటి నొకటిగ జేర్చి పాలు బోసి చక్కగ మర్దించి యాపిండిచేత పూరీలు నేతిలో కాల్చి, యుపయోగించినచో శుక్రము వృద్ధినొంది, యనేకస్త్రీలతో క్రీడించుశక్తి పూర్తిగ కలుగును.

(జీవనీయ-స్నేహోపగమ-హృద్య (రుచికర) గణములు మూడును సూత్రస్థానమునందలి నాల్గవయధ్యాయమున నిట్లు చెప్పబడియున్నవి:—"జీవకర్షభకౌ......దశేమాని జీవనీయాని భవన్తి" (సూత్రస్థాన-అ. ౪. సూ. ౨౪); "మృద్వీకా, మధుకమధుపర్ణీ...దశేమాని స్నేహోపగమాని భవన్తి" (సూత్ర. అ. ౪. సూ. ౪౪); "ఆమ్రామ్రాతక,...దశేమాని హృద్యాని భవన్తి" (సూత్ర. అ. ౪. సూత్రము. ౩౩); ఈగణములలో నొక్కొకగణమున జెప్పబడిన పదేసి చెట్లయొక్క పండ్లను (అన్నిటిమొత్తము ముప్పదిని) అన్నిటిని జేర్చి యొకకుడవము చూర్ణమును జేర్చునది).

### 14 వృష్యశతావరీఘృతము.

మూ. ఘృతం శతావరీగర్భం క్షీరే దశగుణే పచేత్,
శర్కరాపిప్పలీక్షౌద్రయుక్తం తద్వృష్యముత్తమమ్. 18
(ఇతి వృష్యం శతావరీఘృతమ్.)

వ్యా. ఒకకుడవపరిమితమగు ఘృతమున దానికి నాల్గవవంతు పిల్లిపీచర కల్కమును ఘృతమునకు పదింతలు పాలను, చక్కెర పిప్పళ్లు తేనె వీనిని నాల్గవవంతును జేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముజేసి యాఘృతమును సేవించినచో నయ్యది వృష్యమగును.

### 15. వృష్యమగుమధుకచూర్ణయోగము.

మూ. కర్షం మధుకచూర్ణస్య ఘృతక్షౌద్రసమాంశకం, (సమన్వితమ్.)
ప్రయుక్తే యః పయశ్చాను (పయోఽనుపానం యో
లిహ్యాత్) నిత్యవేగస్స నా భవేత్. 19
(ఇతి వృష్యమధుకప్రయోగః.)

వ్యా. ఒకకర్షపరిమితమగు అతిమధురచూర్ణమున నేతిని తేనెను సమభాగముగ కలిపి తిని ఆవుపాలను వెంటనే త్రాగినయెడ ఎల్లప్పుడు సంభోగశక్తి కల్గియుండును. (''మాషపర్ణభృతాం''అని యుపక్రమించి యింతవనుక జెప్పబడిన వాజీకరణయోగములు పదునైదు).

### కొన్ని వృష్యకారణములగు నాహారాచారవిహారాదులు.

మూ. ఘృతక్షీరాశనో నిర్భీః నిర్వ్యాధిర్నిత్యగో యువా,
సఙ్కల్పప్రవణో నిత్యం నరః స్త్రీషు వృషాయతే 20

వ్యా. నేతిని పాలను విశేషముగజేర్చి భుజించుచు, భయంబును వ్యాధియు లేక యౌవనవంతుడై సంభోగమునకు సంబంధించిన విషయముల సంకల్పముచేసి మనసున దలపోయుచు నున్నపురుషుడు స్త్రీలతో నెల్లపుడును రమింపగల్గును.

మూ. కృతైకకృత్యాః సిద్ధార్థాః యే చాన్యోఽన్యానువర్తినః,
కలాసు కుశలాః తుల్యాః సత్త్వేన వయసా చ యే. 21
కులమాహాత్మ్యదాక్షిణ్యశీలశౌచసమన్వితాః,
యే కామనిత్యాః యే హృష్టాః యే విశోకాః గతవ్యథాః. 22

యే తుల్యశీలాః యే భక్తా యే ప్రియా యే ప్రియంవదాః,
తైర్నరస్సహ విస్రబ్ధః సువయస్సై ర్వృషాయతే. 23

వ్యా. ఒకపనియందు పురుషు లిద్దరును కలిసి నెరవేర్చినవారును, తాము బూనిన కార్యమును నెరవేర్చినవారును, (కార్యసిద్ధి యగుటంజేసి మనస్సున వ్యాపారాంతరచింత లేకుండుటచే నిదియు వృష్యకారణమగును). మనసు ఏకమై పరస్పర మనువర్తించి యుండువారును, నృత్యగీతాదివిద్యలయందు సమర్థులును, బలముచేతను వయసుచేతను సమానులును, ఉత్తమము లగుకులంబును ప్రభావంబును దాక్షిణ్యంబును సత్స్వభావంబును శౌచంబును కలవారును, ఎల్లపుడును స్త్రీభోగేచ్ఛ కలవారును, మనఃఖేదము లేక సంతుష్టచిత్తులును, మనసున వ్యాకులము లేనివారును సమానమైన స్వభావము కలవారును భక్తియు ప్రీతియు గల్గి ప్రియముగ మాటలాడువారును నగు మంచిస్నేహితులతో నంతరంగము కలిసి యుల్లాసముగ సల్లాపము జేయు చేరియుండువారును కామోద్రేకము గల్గి యధికమైన సంభోగశక్తి కల్గియుండును.

## కామోద్దీపనములు.

మూ. అభ్యఙ్గోత్సాదనస్నానగన్ధమాల్యవిభూషణైః,
గృహశయ్యాసనసుఖైః వాసోభిరహతైః ప్రియైః. 24
విహఙ్గానాం రుతైరిష్టైః స్త్రీణాం చాభరణస్వనైః,
సంవాహనైర్వరస్త్రీణాం ఇష్టానాం చ వృషాయతే. 25

వ్యా. అభ్యంగనము, ఉత్సాదనము (నలుగుపెట్టికొనుట), స్నానము, సుగంధద్రవ్యములు, పుష్పమాలికలు, ఆభరణములు, రమ్యములగుగృహములు, మంచములు పరపులు మున్నగుశయ్యలు, సుఖకరములైన యాసనములు మనసుకు రమ్యములై స్వచ్ఛములైన వస్త్రములు, వీనులకింపైన చిలుకలు కోవిలలు గోరువంకలు మున్నగు పక్షులధ్వనులు, స్త్రీలయొక్క ఆభరణముల ధ్వనులు యౌవనవతులును రూపవతులును నగుస్త్రీలచేత శరీరమును పిసికించుకొనుట ఇవి యన్నియు వీర్యమును బలపరచి కామోద్దీపనమును కల్గించును.

## గ్రీష్మాదిఋతువులలో కామోద్దీపనములు.

మూ. మత్తద్విరేఫాచరితాః సపద్మాః సలిలాశయాః,
జాత్యుత్పలసుగన్ధీని శీతగర్భగృహాణి చ. 26
నద్యః ఫేనోత్తరీయాశ్చ గిరయో నీలసానవః,

ఉన్నతిర్నీలమేఘానాం; రమ్యాచన్ద్రోదయా నిశాః. 27
వాయవస్సుఖసంస్పర్శాః కుముదాకరగన్ధినః;
రతిభోగక్షమా రాత్ర్యః (నార్యః) సఙ్కోచాగురువల్లభాః. 28

వ్యా. మకరందపానముచే మత్తెక్కిన తుమ్మెదలచే నొప్పుచున్న కమలములు గల కొలంకులు, జాజిపువ్వులచేతను నల్లకలువలచేతను పరిమళించుచున్న చల్లని గర్భగృహము లును (ఇవి గ్రీష్మఋతువున సేవింపదగిన కామోద్దీపనములు). ఉత్తరీయముబోలె పైన గ్రమ్మియుండు నురుగుసముదయముకలనదులు నల్లనిచరులుకల పర్వతములును, నల్లని మేఘములయొక్క సముదయంబును (ఇవి వర్షఋతుయోగ్యమైన కామోద్దీపనములు), చంద్రోదయముచే రమ్యములగు రాత్రులు, కలువలతో గూడిన సరసులనుండి పరిమళయుక్తంబై స్పర్శమునకు సుఖముగ వీచు మందమారుతంబులును; (ఇవి శరత్కాలయోగ్య కామోద్దీపనములు); రతిసుఖము ననుభవింప ననువై కుంకుమపువ్వును అగరుచందనమును ఉపయోగింప నర్హములగు రాత్రులు (లేక కామినులు)ను; ఇవి హేమంతశిశిరముల యందు యోగ్యములగు కామోద్దీపనములు), ఇవి యన్నియు వాజీకరణము లగును. (ఇచ్చట పైజెప్పినవన్నియు ఋతుభేదముచే మూలమున వివరింపకున్నను ఆయాఋతు చర్యావిధానమునుబట్టి గ్రీష్మాదిఋతువుల ననుసరించి విభజింపబడినవని యెరుంగునది).

వసంతఋతువున కామోద్దీపనములు.

మూ. సుఖాస్సహాయాః పరపుష్టఘుష్టాః ఫుల్లాపవనాన్తాః విశదాన్నపానాః,
గాన్ధర్వశబ్దాశ్చ సుగన్ధయోగాః సత్త్వం విశాలం నిరుపద్రవం చ.
సిద్ధార్థతా చాఽభినవశ్చ కామః స్త్రీ చాయుధం సర్వమిహాత్మజస్య,
వయో నవం జాతమదశ్చకాలః హర్షస్య యోనిఃపరమానరాణామ్.

వ్యా. మనస్సుకనుకూలులగు చెలికాండ్రును, కోకిలారావములతో గూడి వికసించిన పుష్పములచే నిబిడితములగు నుద్యానవనప్రదేశంబులును, మధురప్రాయములగు నన్న పానంబులును, సంగీతధ్వనివిశేషంబులును, పరిమళయుక్తములగు సుగంధద్రవ్యంబులును, శోకాద్యుపద్రవములు లేక నిరంకుశముగ వ్యాపించునట్టి మనస్సును, మనసున నేవిధమైన కొరంతయు లేక కామాసక్తి కల్గియుండుట, రూపయౌవనాలంకారాదిగుణయుక్తమైనస్త్రీ, ఇవి యన్నియు మన్మథునకు ఆయుధములై కామోద్దీపనము లగును. మరియు నూతనముగ జనించు యౌవనంబును, వసంతకాలంబును, మనుజులకు సామాన్యముగ కామోద్దీపనమునకు ముఖ్యకారణము లగును. (ఈరెండుశ్లోకముల జెప్పబడిన కామో

ద్దీపనములు సామాన్యముగ ఋతుసాధారణముగ యోగ్యములైనను ప్రధానముగ వసంత ఋతువు నుద్దేశించి కామోద్దీపనములుగ జెప్పబడినవి యని యెరుంగునది).

వాజీకరణ తృతీయపాదవిషయసంగ్రహము.

తత్ర శ్లోకః—

మూ. ప్రహర్షయోనయో యోగాః వ్యాఖ్యాతా దశ పఞ్చ చ, మాష
పర్ణభృతీయేఽస్మిన్ పాదే శుక్రబలప్రదాః (పుష్టిబలప్రదాః). 31

వ్యా. ఇత్తెరంగున కామోద్రేకము కల్గుటకు కారణంబులును శుక్రమునకును శరీరమునకును బలమును గల్గించునవియు నగు వాజీకరణయోగములు పదునైదును మాష పర్ణభృతీయమను నీతృతీయవాజీకరణపాదమున వివరింపబడినవి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, చికిత్సాస్థానే
ద్వితీయాధ్యాయే మాషపర్ణభృతీయో నామ
వాజీకరణపాదస్తృతీయః.

ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి చికిత్సాస్థానము రెండవయధ్యాయమున మాషపర్ణభృతీయ మను వాజీకరణపాదము మూడవది సమాప్తము.

---

## ద్వితీయాధ్యాయము—చతుర్థపాదము.

మూ. అథాతః పుమాన్ జాతబలాదికం వాజీకరణపాదం
వ్యాఖ్యాస్యామః. 1
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. 2

వ్యా. మాషపర్ణభృతీయమను వాజీకరణపాదమును జెప్పినపిదప పుమాన్ జాత బలాదికమను వాజీకరణపాదమును ఆత్రేయు లుపదేశించినదానికన్న న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించెదనని భావము.

("పుమాన్, జాతబలాదయః శబ్దాః అస్మిన్ (పాదే) విద్యన్తే-ఇతిపుమాన్ జాత బలాదికః"అనువిగ్రహము చేత పుమాన్, జాతబల ఇవి మున్నగుశబ్దములు ప్రారంభమునగల పాదము పుమాన్ జాతబలాదికమని పాదసంజ్ఞయగును. 'పుమాన్ జాతబలాది'అనుశబ్దము నకు పైన స్వార్థమున కప్రత్యయము వచ్చి 'పుమాన్ జాతబలాదిక' యని యగును).

## వాజీకరణోపయోగావశ్యకత.

మూ. పుమాన్ యథా జాతబలో యావదిచ్ఛం స్త్రియో వ్రజేత్,
యథా చాఽపత్యవాన్ సద్యః భవేత్తదుపదేక్ష్యతే. 3
న హి జాతబలాస్సర్వే నరాశ్చాపత్యభాగినః,
బృహచ్ఛరీరా బలినః సన్తి నారీషు దుర్బలాః. 4
సన్తి చాల్పాశ్రయాః (చాల్పబలాః) స్త్రీషు బలవన్తో బహుప్రజాః,
ప్రకృత్యా చాఽబలాస్సన్తి సన్తి చామయదుర్బలాః. 5
నరాః చటకవత్కేచిత్ వ్రజన్తి బహుశః స్త్రియం,
గజవచ్చ ప్రసిఞ్చన్తి కేచిన్న బహుగామినః. 6
కాలయోగబలాః కేచిత్ కేచిదభ్యసనధ్రువాః,
కేచిత్ప్రయత్నైః యజ్యన్తే (వాహ్యన్తే) వృషాః కేచిత్ స్వభావతః.
తస్మాత్ప్రయోగాన్ వక్ష్యామో దుర్బలానాం బలప్రదాన్,
సుఖోపభోగాన్ బలినాం భూయశ్చ బలవర్ధనాన్. 8
పూర్వం శుద్ధశరీరాణాం నిరూహైస్సానువాసనైః (నిరూహాన్ సానువాసనాన్),
బలాపేక్షీ ప్రయుఞ్జీత శుక్రాపత్యవివర్ధనాన్. 9
ఘృతతైలరసక్షీరశర్కరామధుసంయుతః,
వస్తయః సంవిధాతవ్యాః క్షీరమాంసరసాశినామ్. 10

వ్యా. పురుషుడు ఎట్లు అధికమైన బలము కలవాడై తనకిచ్ఛవచ్చినంతకాలము స్త్రీలతో రమించగలడో, వెంటనే యెట్లు సంతానము కలవాడగునో ఆపద్ధతు క్రింద వివరింపబడును.

మరియు:—లోకమున పురుషులందరును పూర్తిగ దృఢమైన బలముకలవారుగ నుండబోరు. అందరును సంతానము కల్గియు నుండబోరు. లోకమున గొప్పశరీరంబును ప్రశస్తమైన బలంబును కల్గియుండియు, స్త్రీలవిషయకమైన సంభోగకృత్యమున దుర్బలులైయుందురు. కొందరు స్వల్పబలము కలవారయ్యును స్త్రీసంభోగవిషయమునం దపారశక్తి కల్గి యధికసంతానమును బడసి యుందురు. మరియు కొందరు స్వభావముచేతనే బలహీనులైయుందురు. కొందరు వ్యాధిబాధలచే బలహీనులుగనుందురు. కొందరు పురు

షులు (స్వభావము చేతనే) పిచ్చుకవలె ననేకపర్యాయములు స్త్రీలతో రమించుశక్తి కల్గి యేనుగువలె శుక్రమునధికముగ విసర్జింపగల్గియుందురు. కొందరు (బలవర్ధకమగు) హోమంతాదికాలబలమునం జేసి బలయుక్తులగుదురు. కొందరు నిరంతరముగ స్త్రీసంభోగాభ్యాస వశమునం జేసి సంభోగశక్తి కల్గియుందురు. కొందరు శుక్రవృద్ధికరములగు నౌషధాది ప్రయోగమువలన సంభోగసమర్థులగుదురు. కొందరు స్వభావము చేతనే మత్తవృషభముం బోలె యెల్లపుడును సంభోగశక్తి కల్గియుందురు. కావున పైజెప్పినవానిలో నేకారణముచే నైనను శుక్రము బలవత్తరము గాక సంభోగశక్తి లేనివారికి, అట్టిసంభోగవిషయమైన బలమును పూర్తిగ గలుగంజేయు ప్రయోగముల నీక్రింద వివరించెదము. మరియు నాయోగములు స్వభావముచేనైనను వ్యాధిమున్నగు నితరకారణములచేనైన శుక్ర బలము క్షీణించి సంభోగశక్తి యుడిగినవారికి అట్టి శుక్రమును సంభోగశక్తిని వృద్ధినందించునవియు, బలవంతులుగ నున్నవారికి మరింత బలమును వృద్ధిజేసి సుఖోపభోగముల ననుభవింపననువుగను నుండును.

మరియు బలము నపేక్షించు పురుషుడు తొలుత నిరూహానువాసనాదిశోధనకర్మలచే శరీరమును శుద్ధముగ జేసికొని పిమ్మట శుక్రమును సంతానమును వృద్ధినందించు యోగముల బ్రయోగింపనగును. మరియు ఘృతము, తైలము, మాంసరసము, క్షీరము, చక్కెర, తేనె అనునీద్రవ్యములచే సిద్ధముచేయబడిన వస్తువులను క్షీరము మాంసము మాంసరసము వీనిని ఆహారముచేయుచును ప్రయోగింపవలెను.

### 1-2. శుక్రవర్ధన(వృష్య)మాంసగుటికలు.

మూ. పిష్ట్వా వరాహమాంసాని దత్వా మరిచసైన్ధవే,
కోలవద్గుటికాః కృత్వా తప్తే సర్పిషి వర్తయేత్ (భర్జయేత్),
వర్తన (భర్జన) స్తమ్భితాస్తాశ్చ ప్రక్షేప్యాః కౌక్కుటే రసే,
ఘృతాఢ్యే గన్ధపిశునే దధిదాడిమసారికే. 12
యథా న భిద్యాత్ గులికాః తథా తం సాధయేద్రసం,
తం పిబన్ భక్షయంస్తాశ్చ లభతే శుక్రమక్షయమ్ 13
మాంసానామేవమన్యేషాం మేధ్యానాం కారయేద్భిషక్,
గులికాస్సరసాస్తాసాం ప్రయోగశ్శుక్రవర్ధనః. 14
(ఇతి వృష్యమాంసగుటికాః.)

వ్యా. పందిమాంసమును మెత్తగ పిష్టమువలె నూరి అందు మితముగ మిరియాల పొడిని సైంధవలవణమును కలిపి రేగుపండేసి యుండలు చేసి యాయుండలను చక్కగ కాగిననేతిలో గట్టిపడునట్లు కాల్చి పేల్చి, పిదప వానిని కోడిమాంసరసమున (సూపున) వేసి, అందు నెయ్యి అధికముగ పోసి సుగంధద్రవ్యములను పెరుగుమీదిమీగడను దానిమ్మవిత్తులరసమును బోసి, అందుండు మాంసపు ఉండలు చిట్లి పగులక యుండునట్లు పక్వము చేసి యుంచుకొనునది. పిమ్మట (పైజెప్పినరీతిగ నిరూహానువాసనవస్తులచే శుద్ధ శరీరుడగుపురుషుడు) అందలిమాంసపు ఉండలను (అగ్నిబలానుసారముగ) తిని యామాంస రసమునే త్రాగినచో శుక్ర మొకప్పుడును క్షీణించక వృద్ధినందును.

మరియు నిత్తెరంగుననే మేధ్యములగు (కండగల) తక్కిన జంతువుల మాంసముల గూడ గుళికల జేసి కోడిమాంసరసమున పక్వము జేసి యాగుళికలను మాంసరసమును ఉపయోగించినచో శుక్రము వృద్ధినందును. (ఇచ్చట వరాహమాంసయోగము ఒక టియు, ఇతరమాంసయోగ మొకటియు జేరి రెండుయోగము లగును).

3. వృష్యమగుమాహిషమాంసరసము.

మూ. మాషానఙ్కురితాఞ్ఛుద్ధాన్ వితుషాన్ సాజడాఫలాన్,
ఘృతాఢ్యే మాహిషరసే దధిదాడిమసారికే. 15
ప్రక్షిపేన్మాత్రయా యుక్తాన్ ధాన్యజీరకనాగరైః,
భుక్తః పీతశ్చ స రసః కురుతే శుక్రమక్షయమ్. 16
(ఇతి వృష్యో మాహిషరసః.)

వ్యా. పొట్టు లేక శుభ్రమైన మొలకలెత్తిన మినుపబేడలను దూలగొండివిత్తుల పప్పులను మెత్తగ చూర్ణముచేసి నెయ్యి పెరుగు దానిమ్మపండ్లరసమును గూర్చిన ఎను బోతు మాంసరసమున బోసి పక్వముచేసి, అందు దనియాలు జీలకర శుంఠి వీనిని మిత ముగ తిరుగబోతబెట్టి, అందు ఘనముగనుండుభాగమును భుజించి, ద్రవ (మాంసరస) మును (పైయోగమున జెప్పినరీతిగ) త్రాగినచో నవిచ్ఛిన్నముగ శుక్రము వృద్ధినందును.

4. వృష్యమగుమత్స్యయోగము.

మూ. ఆర్ద్రాణి మత్స్యమాంసాని శఫరీర్వా సుభర్జితాః,
తప్తే సర్పిషి యః ఖాదేత్ స గచ్ఛేత్ స్త్రీషు న క్షయమ్. 17

వ్యా. పచ్చివిగ నుండు మత్స్యములయొక్క మాంసములను, లేక శఫరియను మత్స్యవిశేషముల నైనను నేతిని చక్కగ కాచి అందు వైచి పక్వము చేసి సంస్కరించి తినినయెడ శుక్లము క్షీణించక స్త్రీలతో రమింపగలడు.

(ఇచ్చట మత్స్యమాంసాని అనుపదముచేత రోహిత) ఎఱ్ఱనిరంగుకలమత్స్యవిశేషంబులును, శఫరీ అనుపదముచేత పిత్తమును వృద్ధిచేయు శఫరీనామకమత్స్యములును గ్రహింపనగును).

5. రోహితమత్స్యయోగము.

మూ. ఘృతభృష్టాన్ రసేచ్ఛాగే రోహితాన్ ఫలసారికే,
అనుపీతరసాన్ స్నిగ్ధాన్ అపత్యార్థీ ప్రయోజయేత్. 18
(ఇతి వృష్యమత్స్యమాంసాని.)

వ్యా. రోహితకములను మత్స్యములయొక్క మాంసమును, నేతిలో వేయించి మేకపోతుమాంసరసమున జేర్చి, యందు దానిమ్మపండ్లు, ఉసిరికపండ్లు మున్నగువానిరసమును యథోచితముగ జేర్చి, నేతితో తిరుగబోత మొదలగు సంస్కారముల జేసి సంతానమును కోరుమనుజుడు ఆమాంసమును తిని దానితో పక్వమైన యామాంసరసమును త్రాగవలెను. (ఈప్రయోగముచేత శుక్రము వృద్ధిజెంది సంతానము కల్గునని భావము).

6-7. రెండువిధములైన పూర్ణముబూరెలయోగములు.

మూ. కుట్టకం (కుట్టితం) మత్స్యమాంసానాం హిఙ్గుసైన్ధవధాన్యకైః,
యుక్తం గోధూమచూర్ణేన ఘృతే పూపలికాః పచేత్. 19
మాహిషేచరసే మత్స్యాన్ స్నిగ్ధామ్లలవణాన్ పచేత్,
రసే చానుగతే మాంసం పోథయేత్తత్ర చావపేత్. 20
మరిచం జీరకం ధాన్యమల్పం హిఙ్గు నవం ఘృతం,
మాషపూపలికానాం తత్ గర్భార్థముపకల్పయేత్. 21
ఏతౌ పూపలికాయోగౌ బృంహణౌ బలవర్ధనౌ,
హర్షసౌభాగ్యదౌ పుత్ర్యౌ పరం శుక్రాభివర్ధనౌ. 22
(ఇతి వృష్యౌ పూపలికాయోగౌ.)

వ్యా. మత్స్యమాంసములను మెత్తగ కొంచి అందు ఇంగువను సైంధవలవణమును దనియాలను మితముగ జేర్చి ఈమాంసపిష్టమును గోధుమపిండిలో పూర్ణముగ జేర్చి (పూర్ణముబూరెలను) నేతిలో కాల్పవగును.

మరియు మత్స్యములను ఎనుబోతుమాంసరసమున జేర్చి యందు నెయ్యిని దానిమ్మపండ్లపులుపును సైంధవలవణమును (మితముగ) జేర్చి మాంసరసమంతయు చేప

లతో నిమిడి యిగురునట్లు వండి పిమ్మట నాచేపలను మెత్తగ దంచి, అందు మిరియాలు జీలకర దనియాలు కొద్దిగ ఇంగువ వీని నన్నిటిని క్రొత్తగ వెన్నకాచిన నేతిలో జేర్చి వేయించి (పైజెప్పిన పక్వమత్స్యమాంసమున) తిరగబోత బెట్టునది. పిమ్మట మినుప పిండిని కలుపుకొని యాపిండిలో పైజెప్పిన మత్స్యమాంసమును (పూర్ణముగ) పొదిగి నేతిలో పక్వముగ కాల్చునది. (ఈరెండువిధములైనభక్ష్యములను పూర్ణముఖూరెలని లోకమున వాడెదరు).

పైజెప్పిన రెండువిధములైన భక్ష్యయోగములును శరీరమును బలియజేయును. బలమును వృద్ధినంపెంచును. కామోద్రేకమును గల్గించి సంభోగశక్తిని శుక్రమును వృద్ధి నందించి పుత్రోత్పత్తికరము లై యుండును.

## 8. వృష్యమాషాదిపూపలికములు.

మూ. మాషాత్మగుప్తా గోధూమశాలిషష్టికపైష్టికం,
శర్కరాయా విదార్యాశ్చ చూర్ణమిక్షురకస్య చ. 23
సంయోజ్య మసృణే క్షీరే ఘృతే పూపలికాః పచేత్,
పయోఽనుపానాస్తాశ్శీఘ్రం కుర్వన్తి వృషతాం పరమ్. 24
(ఇతి వృష్యామాషాదిపూపలికాః.)

వ్యా. మినుములు, దూలగొండివిత్తులు, గోధుమలు, ఎఱ్ఱవరిబియ్యము, అరువది నాళ్లసంబావుల బియ్యము, చక్కెర, నేలగుమ్మడి, నీరుగొబ్బివిత్తులు, వీని నన్నిటిని చూర్ణముచేసి మీగడతో కూడ చిక్కగనుండు ఆవుపాలతో కలిపి ముద్దగ చేర్చి కలుపుకొని యాపిండిచేత ఆవునేతిలో పూరీలు కాల్చి ప్రతిదినము అగ్నిబలానుసారముగ తిని, వెంటనే ఆవుపాలను త్రాగినయెడ మిక్కిలి శుక్రము వృద్ధినందును. (ఇచ్చట భాగములను ప్రత్యేకముగ జెప్పలేదు కావున సామాన్యపరిభాషచే పైజెప్పిన ద్రవ్యముల నన్నిటిని సమభాగములుగ జేర్చుకొననగును).

## 9. వృష్యయోగము.

మూ. శర్కరాయాస్తులైకా స్యాత్ ఏకా గవ్యస్య సర్పిషః,
ప్రస్థో విదార్యాశ్చూర్ణస్య, పిప్పల్ల్యాః ప్రస్థ ఏవ చ. 25
అర్ధాఢకం తుగాక్షీర్యాః, క్షౌద్రస్యాఽభినవస్య చ,
తత్సర్వం మూర్ఛితం తిష్ఠేత్ మార్తికే ఘృతభాజనే. 26

మాత్రామగ్నిసమం తస్య ప్రాతః ప్రాతః ప్రయోజయేత్,
ఏష వృష్యః పరం యోగో బల్యో బృంహణ ఏవ చ. 27
(ఇతి వృష్య యోగః.)

వ్యా. చక్కెర నూరుపలములు, నూరుపలములు ఆవునెయ్యి, నేలగుమ్మిడిగడ్డ ఒకప్రస్థము (పదునారుపలములు), పిప్పళ్లు ఒకప్రస్థము, వెదురుప్పు అర్ధాఢకము (ముప్పదిరెండుపలములు), మంచి క్రొత్తతేనె అర్ధాఢకము వీనినన్నిటిని ఒకటిగ కలిపి నేతితో మాగినకుండలో నునిచి ధాన్యపుటమున బెట్టి అయ్యది చక్కగ మాగి యేకరసముగ కలిసిన పిదప అగ్నిబలమునకు దగిన మాత్రను (పరిమాణమును)గల్పించి ప్రతిదినంబును ప్రాతఃకాలమున సేవించినచో నపారబలంబును పుష్టియు కల్గి శుక్రము వృద్ధియగును. ఇయ్యది ప్రశస్తమైన వృష్యయోగము.

### 10. అపత్యకరశతావర్యాదిఘృతము.

మూ. శతావర్యా విదార్యాశ్చ తథా మాషాత్మగుప్తయోః,
శ్వదంష్ట్రాయాశ్చ నిష్క్వాథాన్ జలేషు చ పృథక్పృథక్. 28
సాధయిత్వా ఘృతప్రస్థం పయస్యష్టగుణే పునః,
శర్కరామధుయుక్తం తత్ అపత్యార్థీ ప్రయోజయేత్. 29
(ఇత్యపత్యకరం ఘృతం.)

వ్యా. పిల్లిపీచరగడ్డలు, నేలగుమ్మిడిగడ్డలు, ఉద్దులు, దూలగొండివిత్తులు, పల్లేరువిత్తులు ఈదినుసులను ప్రత్యేక మొక్కొక ప్రస్థమువంతున చేర్చి, ఒక్కొకదానికి నాల్గింతలు (నాల్గేసి ప్రస్థముల)వంతున నీళ్లు బోసి వేరువేరుగ నాల్గవవంతు మిగులునట్లు కషాయములు కాచి వేరువేరుగ నుంచునది. పిదప ఒకప్రస్థమాత్రము ఆవునేతిని పైజెప్పిన కషాయములలో వేరువేరుగ కలుపుచు వేరువేరుగ (ఘృతపాకవిధిప్రకారము) పక్వముచేసి యాఘృతమున నెనిమిదింతలు ఆవుపాలు కలిపి పక్వముగ కాచునది. ఇత్తెరంగున పక్వమైన యాఘృతమున చక్కెరను తేనెను (నాల్గవపాలు) కలిపి యగ్నిబలానుసారముగ సేవించినచో సంతానము కల్గును. శుక్రము వృద్ధినందును. (ఇచ్చట ప్రక్షేపన్యాయము ననుసరించి తేనెను చక్కెరను ఘృతమునకు నాల్గవవంతు చేర్పనగును.)

### 11. వృష్యగుటికాయోగము.

మూ. ఘృతపాత్రం శతగుణే విదారీస్వరసే పచేత్,
సిద్ధం పునశ్శతగుణే గవ్యే పయసి సాధయేత్. 30

శర్కరాయాస్తుగాక్షీర్యాః క్షౌద్రస్యేక్షురసస్య చ,
పిప్పల్యాః సాజడాయాశ్చ భాగైః పాదాంశికై ర్యుతమ్ 31
గుళికాః కారయేద్వైద్యః యథాస్థూలముదుమ్బరం,
తాసాం ప్రయోగాత్పురుషః కులిఙ్గ ఇవ హృష్యతి 32
(ఇతి వృష్యగుటికాః.)

వ్యా. ఒకపాత్ర=ఆఢక (అరువదినాల్గుపలముల) పరిమితమగు ఆవునేతిలో నేల గుమ్మడి స్వరసమును నూరు ఆఢకములు చేర్చి తొలుత (ఘృతముమాత్రము మిగులునట్లు) పక్వముచేసి పిమ్మట నాఘృతముననే నూరు ఆఢకములు ఆవుపాలు బోసి మరల ఘృతశేష ముగ పక్వముచేయునది. మరియు నాఘృతమున చక్కెర, వెదురుప్పు, తేనె, చెరకు రసము, పిప్పళ్లచూర్ణము, దూలగొండివిత్తులచూర్ణము వీనిని ఒక్కొకదానిని ఘృతమునకు నాల్గవవంతు (పదునారుపలములవంతు)న కలుపుకుని చక్కగ కలియబెట్టి పెద్దమేడిపం డంత యుండలు చేసి యగ్నిబలానుసారముగ సేవించినయెడ పిచ్చుకవలె సంభోగేచ్ఛ కల్గి శుక్రము వృద్ధిజెందియుండును.

## 12. వృష్యములగు ఉత్కారికములు (పూరీలు).

మూ. సితోపలాపలశతం తదర్ధం నవసర్పిషః,
క్షౌద్రపాదేన సంయుక్తం సాధయేజ్జలపాదికమ్. 33
సాన్ద్రం గోధూమచూర్ణానాం పాదం స్తీర్ణే శిలాతలే,
శుచౌ శ్లక్ష్ణే సముత్కీర్య మర్దనేనోపపాదయేత్. 34
శుద్ధా ఉత్కారికాః కార్యాః చన్ద్రమణ్డలసన్నిభాః,
తాసాం ప్రయోగాద్గజవత్ నారీస్సన్తర్పయేన్నరః 35
(ఇతి వృష్యా ఉత్కారికా)

వ్యా. సితోపలములు (శీనాకల్కండ) నూరుపలములు పొడిచేసి అందు సగ పాలు (ఏబైపలములు) అప్పుడు వెన్నకాచిన నేతిని నాల్గవవంతు (ఇరువదియైదుపల ములు) తేనెను కల్పి నాల్గవవంతు నీళ్లు బోసి పాకముబట్టి యాపాకమున నాల్గవవంతు గోధుమపిండిని కలిపి కలియబెట్టి దానిని పరిశుద్ధమై నునుపుకల్గిన యొకబండ (సన్నికల్లు) పై పలుచగనెఱపి మెత్తగమర్దనముచేసి యాపాకపు పిండిచేత చంద్రమండలమువలె గుండ్రముగ తెల్లగనుండునట్లు పూరీలు దట్టి మరల నేతిలో కాల్చి యుంచుకొనునది. ఆపూరీల నుపయోగించినచో నేనుగువలె స్త్రీలకు సంతోషము కల్గునట్లు రమించగల్గును. ఇది యుత్తమమైన వృష్యయోగము.

—అనుక్తవృష్యవాజీకరణసంగ్రహము.—

మూ. యత్కిఞ్చిన్మధురం స్నిగ్ధం జీవనం బృంహణం గురు,
హర్షణం మనసశ్చైవ సర్వం తద్వృష్యముచ్యతే. 36

వ్యా. మధురంబును, స్నిగ్ధంబును, బలకరంబును, పుష్టికరంబును, గురుగుణము కల్గినదియు, మనస్సునకు సంతోషకరంబును నగువిషయము లన్నియు వృష్యములనబడియె.

—సంభోగమునకుముందు ఆచరింపదగిన నియమములు.—

మూ. ద్రవ్యైరేవంవిధైస్తస్మాత్ భావితః ప్రమదాం వ్రజేత్,
ఆత్మవేగేన చోదీర్ణః స్త్రీగుణైశ్చ ప్రహర్షితః. 37

వ్యా. పైజెప్పినరీతిగ మధురాదిద్రవ్యములు మున్నగునవి వాజీకరణము లగుటంజేసి అట్టిమధురస్నిగ్ధాదిద్రవ్యములసేవించుటచే శరీరమును భావితముగ (వస్తునిష్ఠగుణవిశేషములను శరీరమున సంక్రమింపజేసి), తనకు నైసర్గికమైన వేగము (సంభోగేచ్ఛ)చే ప్రేరితుడై, కామినీనిష్ఠములగు భావభావాది శృంగారచేష్టావిశేషములచేతను సౌందర్యాది గుణవిశేషములచేతను సదలంకారవికల్పకల్పనములచేతను కామోద్దీపనము కలవాడై తనకిష్టమైన యువతితో సంభోగము చేయవలెను.

—సంభోగానంతరము సేవింపదగిననియమములు.—

మూ. గత్వా స్నాత్వా పయః పీత్వా రసం వాఽనుశయీత నా,
తథాఽస్యాప్యాయతే భూయః శుక్రం చ బలమేవ చ. 38

వ్యా. పైజెప్పినరీతిగ స్త్రీతో భోగించినవెంటనే స్నానముచేసి పాలనైనను మాంసరసమునైనను త్రాగి సుఖముగ శయ్యపై పరుండవలెను. అట్లు చేసినచో సంభోగమువలన గల్గిన బడలిక తీరి మరల (వ్యయమైన) శుక్రంబును శరీరబలంబును మునుపటివలెనే వృద్ధినందును.

—శుక్రవికాసమునకు దృష్టాంతము.—

మూ. యథా ముకుళపుష్పస్య సు(స్వ)గన్ధో నోపలభ్యతే,
లభ్యతే తద్వికాసాత్తు తథా శుక్రం హి దేహినామ్. 39

వ్యా. మొగ్గగనుండు పుష్పమునందలి సుగంధము వెలిపడక లీనమైయుండి చక్కగ వికసించిన పిదప వెలిబడి నల్దెడల వ్యాపించువిధముగ శరీరమున లీనముగ నుండు శుక్రము పైజెప్పిన కామోద్దీపన శుక్రవర్ధక వాజీకరణముల సేవించుటవలన మనుజులకు వికాసమునొంది పటిష్ఠమగును.

## అతిబాలవృద్ధులు సంభోగము చేయదగదనుట.

మూ. నర్తే వై షోడశాద్వర్షాత్ సప్తత్యాః పరతో న చ,
ఆయుష్కామో నరః స్త్రీభిః సంయోగం కర్తుమర్హతి. 40
అతిబాలో హ్యసంపూర్ణసర్వధాతుః స్త్రియం వ్రజన్,
ఉపశుష్యేత సహసా తటాకమివ కాజలమ్. 41
శుష్కం రూక్షం యథా కాష్ఠం జన్తుజగ్ధం విజర్జితం,
స్పృష్టమాశు విశీర్యేత తథా వృద్ధః స్త్రియో వ్రజన్. 42

వ్యా. పదునారు సంవత్సరములు నిండనివయసు కలబాలుడును, డెబ్బదివత్సరములవయసు దాటిన వృద్ధుడును స్త్రీసంభోగము చేయరాదు. అటుగాక అట్టి నియమిత కాలము నతిక్రమించి సంభోగము చేసినచో నాయువు క్షీణించును. మరియు అతిబాల్యమున సంభోగము చేసినచో వానికి రసాదిధాతువులు పూర్ణముగ పుష్టినందకయుండుటంజేసి కొంచెముగ నీళ్లుకల సరస్సు ఎండతాకుడుచే నెండిపోవువిధముగ నానాట రసాదిధాతువులు కృశించి బలముచెడును. డెబ్బదివత్సరములవయసు దాటిన ముసలివాడు సంభోగము చేసినచో ఎండి తైలముచచ్చి పురుగులచే పుప్పిదగిలి రంధ్రములు పడియున్న కొయ్య తాకినంతమాత్రమున విరిగి చెడిపోవువిధముగ చెడును. (కావున పైజెప్పినవయోనియమము ననుసరించి భోగింపవలెనని భావము).

(ఇచ్చట తటాకసాదృశ్యముచేత బాలునకు కఫప్రాధాన్యమునంజేసి శుక్రము వృద్ధినొందనున్నను తత్కాలమున శుక్రము అల్పముగ నుండుననియు,వృద్ధునకు శుష్క-రూక్ష-జంతుజగ్ధాదిగుణవిశిష్టకాష్ఠదృష్టాంతముచేత నష్టమైనశుక్రము మరల వృద్ధినొందక పూర్తిగ నశించుననియు తెలిసెడి.)

## కామోద్రేకము గల్గకుండుటకు కారణములు.

మూ. జరయా చిన్తయా శుక్రం వ్యాధిభిః కర్మకర్షణాత్,
క్షయం గచ్ఛత్యనశనాత్ స్త్రీణాం చాతినిషేవణాత్. 43
క్షయాత్ భయాదవిస్రమ్భాత్ శోకాత్ స్త్రీదోషదర్శనాత్,
నారీణామరసజ్ఞత్వాత్ అవిచారాదసేవనాత్. 44
తృప్తస్యాపి స్త్రియో గన్తుం న శక్తిరుపజాయతే,
దేహసత్వబలాపేక్షీ హర్షః శక్తిశ్చ హర్షజా. 45

వ్యా. ముసలితనము, చింత, వ్యాధులు, శరీరమునకు శ్రమమును కల్గించుపనులచే శరీరము కృశించుట, అన్నమును భుజించకుండుట, తనబలమునకు మీరి సంభోగము చేయుట, ఈకారణములచేత శుక్రము నశించును.

మరియు అట్టికారణములచే శుక్రము క్షీణించుటచేతను, భయము, పరస్పరము ప్రీతి లేకపోవుట, దుఃఖము, స్త్రీలయందు దోషము నూహించుట, తావలచినస్త్రీలు రసజ్ఞత లేకుండుట, సంభోగవిషయక సంకల్పమును చేయకుండుట, బొత్తుగ సంభోగము చేయక (చాలకాలము) విరమించుట, ఈకారణములచేతను, మనుజుడు సంతృప్తిజెంది యున్నను వానికి సంభోగశక్తి కల్గక నశించును.

మఱియు మనుజుడు ఆహారసౌష్ఠవాదులచే తృప్తిజెందియున్నను కామోద్రేకము వానిదేహముయొక్కయు మనస్సుయొక్కయు బలము నపేక్షించియుండును. అట్టి హర్షము (కామోద్రేకము)వలన సంభోగశక్తి కల్గును. (కావున పైజెప్పబడినక్షయము భయము మున్నగు కారణములచే మనశ్శరీరబలం బుడుగును. కావున బలముచే నగు హర్షంబును, దాన గల్గు సంభోగశక్తియు సంభవింపనేరదని భావము).

స్త్రీసంపర్కమున శుక్రము వెడలువిధము.

మూ. రస ఇక్షౌ యథా దధ్ని సర్పిః తైలం తిలే యథా,
సర్వత్రానుగతం దేహే శుక్రం సంస్పర్శనే తథా. 46
తత్ స్త్రీపురుషసంయోగే చేష్టాసంకల్పపీడనాత్,
శుక్రం ప్రచ్యవతే స్థానాత్ జలమార్ద్రాత్పటాదివ. 47
హర్షాత్తర్షాత్ సరత్వాచ్చ పైచ్ఛిల్యాద్గౌరవాదపి,
అణుప్రవణభావాచ్చ ద్రుతత్వాన్మారుతస్య చ. 48
అష్టాభ్య ఏభ్యో హేతుభ్యః శుక్రం దేహాత్ప్రసిచ్యతే,

వ్యా. చెఱకునందు చెఱకురసమువలెను, పెరుగునందు నేతివలెను, నువ్వులయందు నూనెవలెను స్పర్శేంద్రియపరిజ్ఞానము కలపురుషునిశరీరమునం దెల్ల వ్యాపించియుండును. (ఇచ్చట 'సంస్పర్శనే' అని చెప్పుటచేత స్పర్శము నెరుంగని వెండ్రుకలు నఖములు మున్నగునవి శరీరసంబద్ధములైనను వానియందు శుక్రవ్యాప్తి లేదని తెలిసెడి).

శరీరమునందెల్ల వ్యాపించియున్న యాశుక్రము స్త్రీపురుషులు పరస్పరముకలయు సమయమున సంభోగరూపమైన చేష్టవలనను స్త్రీరూపవిశేషాదిసంబంధమైన యనురాగాతిశయముచేతను పరస్పరసమ్మర్దముచేతను తడసియుండు గుడ్డనుండి సంపీడనముచే నీళ్లు

స్రవించువిధముగ స్వస్థానమునుండి (శుక్రము) స్రవించును. మరియు కామోద్రేకము వలనను, అనురాగాతిశయమువలనను, స్రవించుస్వభావము కల్గియుండుటచేతను, పిచ్ఛిల గుణము కల్గియుండుటచేతను, గురుత్వము (బరువు) కల్గియుండుటవలనను, అణురూపమై క్రిందికిజారుస్వభావము కల్గియుండుటవలనను, శుక్రమును వెడలించు వాతమునకు వేగ స్వభావము కల్గియుండుటవలనను, శుక్రము దేహమునుండి క్రిందికి జారును. పైజెప్పిన సంకల్పపీడనాది విశిష్టసంభోగచేష్టావిశేషము కామోద్రేకము మున్నగు నెనిమిదికారణ ములచేత శుక్రము శరీరమునుండి స్రవించును.

## ప్రశస్త శుక్రలక్షణము.

మూ. చరతో విశ్వరూపస్య రూపద్రవ్యం యదుచ్యతే. 49
బహలం మధురం స్నిగ్ధం అవిస్రం గురు పిచ్ఛిలం,
శుక్లం బహు చ యచ్ఛుక్రం బలవ త్తదసంశయమ్. 50

వ్యా. నానారూపములగు మానుషపశ్వాదిజాతులయందు సంచరించు స్వభావము కలజీవాత్మయొక్క మూర్తికి (స్థూలశరీరమునకు) కారణభూతద్రవ్యమైనది శుక్రము. అయ్యది చిక్కనై మధురంబును, స్నిగ్ధంబును, దుర్గంధరహితంబును, బరువు కల్గి జిగటగ నుండునదియు, మిక్కిలి తెల్లని రంగుకల్గినదియు నైయుండినచో మిగుల బలవత్తరమని నిస్సంశయముగ జెప్పనగును. (ఇచ్చట శుక్రమనునది యుపలక్షణము కావున ఆర్తవము కూడ శుక్రమువలెనే జీవాత్మకు శరీరప్రాప్తిరూపజన్మాంతరకారణమగునని యెరుంగునది).

## వాజీకరణశబ్దనిరుక్తి.

మూ. యేన నారీషు సామర్థ్యం వాజీవ లభతే నరః,
వ్రజేచ్చాభ్యధికం యేన వాజీకరణమేవ తత్. 51

వ్యా. పురుషుడు దేనిచేత గుఱ్ఱమువలె స్త్రీలతో రమించుసామర్థ్యము కల్గి యుండునో, దేనిచేత పలుమారు స్త్రీలతో రమింపగల్గునో, అవియెల్ల వాజీకరణమని యెరుంగునది.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—శుక్రవృద్ధికరము (శుక్రమును వృద్ధినందించు నది, అయ్యది ఉద్దులు మున్నగునది); శుక్రస్రుతికరము (శుక్రమును స్రవింపచేయు నది, అయ్యది సంకల్పము మున్నగునది), శుక్రస్రుతివృద్ధికరము (శుక్రమును వృద్ధిపరచి స్రవింపజేయునది, అయ్యది క్షీరము మాంసరసము మున్నగునది), అని వృష్యము మూడు విధములు. ఈవివరణము స్థలాంతరమున నిట్లు చెప్పబడినది:—"శుక్రస్రుతికరం కిఞ్చిత్,

వ్యా. ముసలితనము, చింత, వ్యాధులు, శరీరమునకు శ్రమమును కల్గించుపనులచే శరీరము కృశించుట, అన్నమును భుజించకుండుట, తనబలమునకు మీరి సంభోగము చేయుట, ఈకారణములచేత శుక్రము నశించును.

మరియు అట్టికారణములచే శుక్రము క్షీణించుటచేతను, భయము, పరస్పరము ప్రీతి లేకపోవుట, దుఃఖము, స్త్రీలయందు దోషము నూహించుట, తావలచినస్త్రీలు రసజ్ఞత లేకుండుట, సంభోగవిషయక సంకల్పమును చేయకుండుట, బొత్తుగ సంభోగము చేయక (చాలకాలము) విరమించుట, ఈకారణములచేతను, మనుజుడు సంతృప్తిజెంది యున్నను వానికి సంభోగశక్తి కల్గక నశించును.

మఱియు మనుజుడు ఆహారసౌష్ఠవాదులచే తృప్తిజెందియున్నను కామోద్రేకము వానిదేహముయొక్కయు మనస్సుయొక్కయు బలము నపేక్షించియుండును. అట్టి హర్షము (కామోద్రేకము)వలన సంభోగశక్తి కల్గును. (కావున పైజెప్పబడినశోకము భయము మున్నగు కారణములచే మనశ్శరీరబలం బుడుగును. కావున బలముచే నగు హర్షంబును, దాన గల్గు సంభోగశక్తియు సంభవింపనేరదని భావము).

## స్త్రీసంపర్కమున శుక్రము వెడలువిధము.

మూ. రస ఇక్షౌ యథా దధ్ని సర్పిః తైలం తిలే యథా,
సర్వత్రానుగతం దేహే శుక్రం సంస్పర్శనే తథా. 46
తత్ స్త్రీపురుషసంయోగే చేష్టాసంకల్పపీడనాత్,
శుక్రం ప్రచ్యవతే స్థానాత్ జలమార్ద్రాత్పటాదివ. 47
హర్షాత్తర్షాత్ సరత్వాచ్చ పైచ్ఛిల్యాద్గౌరవాదపి,
అణుప్రవణభావాచ్చ ద్రుతత్వాన్మారుతస్య చ. 48
అష్టాభ్య ఏభ్యో హేతుభ్యః శుక్రం దేహాత్ప్రసిచ్యతే,

వ్యా. చెఱకునందు చెఱకురసమువలెను, పెరుగునందు నేతివలెను, నువ్వులయందు నూనెవలెను స్పర్శేంద్రియపరిజ్ఞానము కలపురుషునిశరీరమునం దెల్ల వ్యాపించియుండును. (ఇచ్చట 'సంస్పర్శనే' అని చెప్పుటచేత స్పర్శము నెరుంగని వెండ్రుకలు నఖములు మున్నగునవి శరీరసంబద్ధములైనను వానియందు శుక్రవ్యాప్తి లేదని తెలిసెడి).

శరీరమునందెల్ల వ్యాపించియున్న యాశుక్రము స్త్రీపురుషులు పరస్పరముకలయు సమయమున సంభోగరూపమైన చేష్టవలనను స్త్రీరూపవిశేషాదిసంబంధమైన యనురాగాతిశయముచేతను పరస్పరసమ్మర్దముచేతను తడసియుండు గుడ్డనుండి సంపీడనముచే నీళ్లు

స్రవించువిధముగ స్వస్థానమునుండి (శుక్రము) స్రవించును. మరియు కామోద్రేకమువలనను, అనురాగాతిశయమువలనను, స్రవించుస్వభావము కల్గియుండుటచేతను, పిచ్ఛిలగుణము కల్గియుండుటచేతను, గురుత్వము (బరువు) కల్గియుండుటవలనను, అణురూపమై క్రిందికిజారుస్వభావము కల్గియుండుటవలనను, శుక్రమును వెడలించువాతమునకు వేగస్వభావము కల్గియుండుటవలనను, శుక్రము దేహమునుండి క్రిందికి జారును. పైజెప్పిన సంకల్పపీడనాది విశిష్టసంభోగచేష్టావిశేషము కామోద్రేకము మున్నగు నెనిమిదికారణములచేత శుక్రము శరీరమునుండి స్రవించును.

## ప్రశస్త శుక్రలక్షణము.

మూ. చరతో విశ్వరూపస్య రూపద్రవ్యం యదుచ్యతే. 49
బహలం మధురం స్నిగ్ధం అవిస్రం గురు పిచ్ఛిలం,
శుక్లం బహు చ యచ్ఛుక్రం బలవత్తదసంశయమ్. 50

వ్యా. నానారూపములగు మానుషపశ్వాదిజాతులయందు సంచరించు స్వభావము కలజీవాత్మయొక్క మూర్తికి (స్థూలశరీరమునకు) కారణభూతద్రవ్యమైనది శుక్రము. అయ్యది చిక్కనై మధురంబును, స్నిగ్ధంబును, దుర్గంధరహితంబును, బరువు కల్గి జిగటగనుండునదియు, మిక్కిలి తెల్లని రంగుకల్గినదియు నైయుండినచో మిగుల బలవత్తరమని నిస్సంశయముగ జెప్పనగును. (ఇచ్చట శుక్రమనునది యుపలక్షణము కావున ఆర్తవము కూడ శుక్రమువలెనే జీవాత్మకు శరీరప్రాప్తిరూపజన్మాంతరకారణమగునని యెరుంగునది).

## వాజీకరణశబ్దనిరుక్తి.

మూ. యేన నారీషు సామర్థ్యం వాజీవ లభతే నరః,
వ్రజేచ్చాభ్యధికం యేన వాజీకరణమేవ తత్. 51

వ్యా. పురుషుడు దేనిచేత గుఱ్ఱమువలె స్త్రీలతో రమించుసామర్థ్యము కల్గియుండునో, దేనిచేత పలుమారు స్త్రీలతో రమింపగల్గునో, అవియెల్ల వాజీకరణమని యెరుంగునది.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—శుక్రవృద్ధికరము (శుక్రమును వృద్ధినందించునది, అయ్యది ఉద్దులు మున్నగునది), శుక్రస్రుతికరము (శుక్రమును స్రవింపచేయునది, అయ్యది సంకల్పము మున్నగునది), శుక్రస్రుతివృద్ధికరము (శుక్రమును వృద్ధిపరచి స్రవింపజేయునది, అయ్యది క్షీరము మాంసరసము మున్నగునది), అని వృష్యము మూడు విధములు. ఈవివరణము స్థలాంతరమున నిట్లు చెప్పబడినది:—''శుక్రస్రుతికరం కిఞ్చిత్,

కిఞ్చిచ్ఛుక్రవివర్ధనమ్, ప్రుతివృద్ధికరం కిఞ్చిత్ త్రివిధం వృష్యముచ్యతే." ఈత్రివిధ శుక్రలక్షణమును "యేన నారీషు... మేవ తత్" అనుశ్లోకముచే నీతంత్రకారుడు సంగ్రహముగ జెప్పెను.

వాజీకరణచతుర్థపాదవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. హేతుర్యోగోపదేశస్య యోగాః ద్వాదశ చోత్తమాః,
యత్పూర్వం మైథునాత్ సేవ్యం, సేవ్యం యన్మైథునాదను. 52
యదా న సేవ్యాః ప్రమదాః కృత్స్నశ్శుక్రవినిశ్చయః,
నిరుక్తం చేహ నిర్దిష్టం పుమాన్ జాతబలాదికే. 53

వ్యా. వాజీకరణయోగముల నుపదేశించుటకు ప్రయోజనము, ఉత్తమములగు పండ్రెండు వాజీకరణయోగములు, సంగమకాలమునకు పూర్వము సేవింపదగినవియు, సంభోగానంతరము సేవింపదగిన, స్నానపానాదినియమములును, స్త్రీసంభోగము చేయదగనికాలము (వయస్సు), శుక్రముయొక్క స్వభావగుణాదులు, వాజీకరణశబ్దనిర్వచనము, ఈవిషయము లన్నియు నీపుమాన్ జాతబలాదికమను వాజీకరణపాదమున వివరింపబడినవి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, చికిత్సాస్థానే
ద్వితీయాధ్యాయే పుమాన్‌జాతబలాదికో నామ
వాజీకరణపాదశ్చతుర్థః.

ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహిత యను నాయుర్వేదతంత్రమునందలి ద్వితీయాధ్యాయమున పుమాన్ జాతబలాదికమను వాజీకరణపాదము నాల్గవదియు అధ్యాయంబును సమాప్తము.

---

## తృతీయాధ్యాయము—జ్వరచికిత్సితము.

అవతరణిక:—చికిత్సితప్రారంభమున "భేషజం ద్వివిధం చ తత్. స్వస్థస్యోర్జస్కరం కించిత్ కిఞ్చిదార్తస్య రోగనుత్" (చి-అ. ౧. శ్లో. ౪) అనువాక్యముచే చికిత్స రెండువిధములుగ ఔషధము నిర్దేశింపబడినది. అందు స్వస్థోర్జస్కరౌషధము పైయధ్యాయముల రెండిటియందును సవిస్తరముగ నిరూపింపబడినది. పిమ్మట క్రమప్రాప్త

మైన రోగహరౌషధమును వివరింపం దలంచి, అందు రోగములలో రుద్రకోపసంభవత్వాదికారణములచే జ్వరము ప్రధానమగుటంజేసి తొలుత నీయధ్యాయమున జ్వరచికిత్సితము వివరింపబడును. (జ్వరము రుద్రకోపసంభవమని యీక్రిందనే తంత్రకారునిచే వివరింపబడును). ప్రాధాన్యంబును "దేహేన్ద్రియమనస్తాపీ సర్వరోగాగ్రజో బలీ, జ్వరః ప్రధానో రోగాణాం" అని క్రింద చెప్పబడును.

మూ. అథాతో జ్వరచికిత్సితం వ్యాఖ్యాస్యామః. 1
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. 2

వ్యా. వాజీకరణాధ్యాయమును వివరించినపిదప జ్వరచికిత్సితమను (జ్వరచికిత్సను బోధించునట్టి) అధ్యాయమును భగవత్స్వరూపుడగు నాత్రేయు లుపదేశించినదానికన్న న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించెదనని యర్థము.

జ్వరచికిత్సిత మనుచోట అభిధేయాభిధానముల కభేదము నంగీకరించి జ్వరచికిత్సను బోధించు అధ్యాయము జ్వరచికిత్సితమని యధ్యాయసంజ్ఞ నెరుంగునది. ఇత్తెరంగుననే "రక్తపిత్తచికిత్సితం, గుల్మచికిత్సితం" ఇత్యాదిస్థలములయందెల్ల నధ్యాయసంజ్ఞ నెరుంగునది.

మూ. విజ్వరం జ్వరసన్దేహం పర్యపృచ్ఛత్ పునర్వసుం,
వివిక్తే శాన్తమాసీనం అగ్నివేశః కృతాఞ్జలిః. 3

వ్యా. అగ్నివేశులు రోగనిర్ముక్తుడగు విజనస్థలమున శాంతచిత్తుడై సుఖముగ కూర్చొనియున్న పునర్వసువు (ఆత్రేయుల)ను జ్వరవిషయమై నిదానస్థానమును వినుటచేతా దెలిసికొన్నవానికన్న నితరములగు కొన్ని సందేహవిషయములను కృతాంజలియై యీక్రింద జెప్పబడువిధముగ నడిగెను.

ఇచ్చట 'వివిక్తే శాన్తమాసీనం' అను గురువిశేషణముచే గురువు సమాహితచిత్తుడై యుండుటంబట్టి తనసందేహముల దీర్పదగినసమయమనియు, గురువును శిష్యుడడుగుటకు అట్టిసమయమును గమనించుట సద్ధర్మమనియు దెలిసెడి.

జ్వరమునుద్దేశించి యగ్నివేశులు జేయుప్రశ్నములు.

మూ. దేహేన్ద్రియమనస్తాపీ సర్వరోగాగ్రజో బలీ,
జ్వరః ప్రధానో రోగాణాం ఉక్తో భగవతా పురా. 4
తస్య ప్రాణిసపత్నస్య ధ్రువస్య ప్రలయోదయే,
ప్రకృతిం చ ప్రవృత్తిం చ ప్రభావం కారణాని చ. 5

కిఞ్చిచ్ఛుక్రవివర్ధనమ్, ప్రుతివృద్ధికరం కిఞ్చిత్ త్రివిధం వృష్యముచ్యతే.'' ఈత్రివిధ శుక్రలక్షణమును ''యేన నారీషు... మేవ తత్'' అనుశ్లోకముచే నీతంత్రకారుడు సంగ్రహముగ జెప్పెను.

వాజీకరణచతుర్థపాదవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. హేతుర్యోగోపదేశస్య యోగాః ద్వాదశ చోత్తమాః,
యత్పూర్వం మైథునాత్ సేవ్యం, సేవ్యం యన్మైథునాదను. 52
యదా న సేవ్యాః ప్రమదాః కృత్స్నశ్శుక్రవినిశ్చయః,
నిరుక్తం చేహ నిర్దిష్టం పుమాఞ్ జాతబలాదికే. 53

వ్యా. వాజీకరణయోగముల నుపదేశించుటకు ప్రయోజనము, ఉత్తమములగు పండ్రెండు వాజీకరణయోగములు, సంగమకాలమునకు పూర్వము సేవింపదగినవియు, సంభోగానంతరము సేవింపదగిన, స్నానపానాదినియమములును, స్త్రీసంభోగము చేయ దగనికాలము (వయస్సు), శుక్రముయొక్క స్వభావగుణాదులు, వాజీకరణశబ్దనిర్వచనము, ఈవిషయము లన్నియు నీపుమాఞ్ జాతబలాదికమను వాజీకరణపాదమున వివరింప బడినవి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, చికిత్సాస్థానే
ద్వితీయాధ్యాయే పుమాఞ్జాతబలాదికో నామ
వాజీకరణపాదశ్చతుర్థః.

ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహిత యను నాయుర్వేదతంత్రమునందలి ద్వితీయాధ్యాయమున పుమాఞ్జాతబలాదికమను వాజీకరణపాదము నాల్గవదియు అధ్యాయంబును సమాప్తము.

---

## తృతీయాధ్యాయము—జ్వరచికిత్సితము.

అవతరణిక:—చికిత్సితప్రారంభమున ''భేషజం ద్వివిధం చ తత్. స్వస్థస్యోర్జస్కరం కించిత్ కిఞ్చిదార్తస్య రోగనుత్'' (చి-అ. ౧. శ్లో. ౪) అనువాక్యముచే చికిత్స రెండువిధములుగ ఔషధము నిర్దేశింపబడినది. అందు స్వస్థోర్జస్కరౌషధము పైయధ్యాయముల రెండిటియందును సవిస్తరముగ నిరూపింపబడినది. పిమ్మట క్రమప్రాప్త

మైన రోగహరౌషధమును వివరింపం దలంచి, అందు రోగములలో రుద్రకోపసంభవత్వాదికారణములచే జ్వరము ప్రధానమగుటంజేసి తొలుత నీయధ్యాయమున జ్వరచికిత్సితము వివరింపబడును. (జ్వరము రుద్రకోపసంభవమని యీక్రిందనే తంత్రకారునిచే వివరింపబడును). ప్రాధాన్యంబును "దేహేన్ద్రియమనస్తాపీ సర్వరోగాగ్రజో బలీ, జ్వరః ప్రధానో రోగాణాం" అని క్రింద చెప్పబడును.

మూ. అథాతో జ్వరచికిత్సితం వ్యాఖ్యాస్యామః. 1
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. 2

వ్యా. వాజీకరణాధ్యాయమును వివరించినపిదప జ్వరచికిత్సితమను (జ్వరచికిత్సను బోధించునట్టి) అధ్యాయమును భగవత్స్వరూపుడగు నాత్రేయు లుపదేశించినదానికన్న న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించెదనని యర్థము.

జ్వరచికిత్సిత మనుచోట అభిధేయాభిధానముల కభేదము నంగీకరించి జ్వరచికిత్సను బోధించు అధ్యాయము జ్వరచికిత్సితమని యధ్యాయసంజ్ఞ నెరుంగునది. ఇత్తెరంగుననే "రక్తపిత్తచికిత్సితం, గుల్మచికిత్సితం" ఇత్యాదిస్థలములయందెల్ల నధ్యాయసంజ్ఞ నెరుంగునది.

మూ. విజ్వరం జ్వరసన్దేహం పర్యపృచ్ఛత్ పునర్వసుం,
వివిక్తే శాన్తమాసీనం అగ్నివేశః కృతాఞ్జలిః. 3

వ్యా. అగ్నివేశులు రోగనిర్ముక్తుడగు విజనస్థలమున శాంతచిత్తుడై సుఖముగ కూర్చొనియున్న పునర్వసువు (ఆత్రేయుల)ను జ్వరవిషయమై నిదానస్థానమును వినుటచే తా దెలిసికొన్నవానికన్న నితరములగు కొన్ని సందేహవిషయములను కృతాంజలియై యీక్రింద జెప్పబడువిధముగ నడిగెను.

ఇచ్చట 'వివిక్తే శాన్తమాసీనం'అను గురువిశేషణముచే గురువు సమాహితచిత్తుడై యుండుటంబట్టి తనసందేహముల దీర్పదగినసమయమనియు, గురువును శిష్యుడడుగుటకు అట్టిసమయమును గమనించుట సద్ధర్మమనియు దెలిసెడి.

జ్వరమునుద్దేశించి యగ్నివేశులు జేయుప్రశ్నములు.

మూ. దేహేన్ద్రియమనస్తాపీ సర్వరోగాగ్రజో బలీ,
జ్వరః ప్రధానో రోగాణాం ఉక్తో భగవతా పురా. 4
తస్య ప్రాణిసపత్నస్య ధ్రువస్య ప్రలయోదయే,
ప్రకృతిం చ ప్రవృత్తిం చ ప్రభావం కారణాని చ. 5

పూర్వరూపమధిష్ఠానం బలకాలాత్మలక్షణం,
వ్యాసతో విధిభేదాచ్చ (భేదం చ) పృథగ్భిన్నస్య చాకృతిమ్. 6
లిఙ్గమామస్య జీర్ణస్య సౌషధం చ క్రియాక్రమం,
విముఞ్చతః ప్రశాన్తస్య చిహ్నం యచ్చ పృథక్పృథక్. 7
జ్వరావసృష్టో రక్ష్యశ్చ యావత్కాలం యతో యతః,
ప్రశాన్తః కారణైర్యైశ్చ పునరావర్తతే జ్వరః. 8
యాశ్చాపి పునరావృత్తం క్రియాః ప్రశమయన్తి తం,
జగద్ధితార్థం తత్సర్వం భగవన్! వక్తుమర్హసి. 9

వ్యా. జ్వరము మనుజులశరీరమును చక్షురాదీంద్రియములను మనస్సును తపింపజేయునది. శరీరమునకు సంబంధించిన తక్కినరోగములకంటె తొలుత పుట్టినది. ఈ కారణములచేత జ్వరము తక్కినరోగములకంటె ప్రబలమైనదనియు ప్రధానంబనియు మునుపు మీచే జెప్పబడినది. మృతికరంబగుటం జేసి సకలప్రాణులకు శత్రువును, జన్మాదియందును మరణకాలమునందును తమోరూపముగ నవశ్యము వ్యాపించునదియు నగు పైజెప్పబడిన జ్వరముయొక్క ప్రకృతిని, ప్రవృత్తిని, ప్రభావమును, కారణములను, పూర్వరూపమును, అధిష్ఠానమును, బలమును, కాలమును స్వరూపముయొక్క లక్షణమును వీనినన్నిటిని; విపులముగ విధిభేదము ననుసరించి వేరువేరుగను సెలవిండు. మరియు నట్టి విధిభేదములు కల జ్వరముయొక్క యాకృతిని (స్వరూపలక్షణమును), ఆమజ్వరముయొక్క లక్షణమును, జీర్ణజ్వరముయొక్క లక్షణమును, అట్టి ఆమ-జీర్ణజ్వరముల రెండిటిచికిత్సలను, వాని చికిత్సాక్రమమును, విడచుచున్న (పచ్యమాన) జ్వరముయొక్క లక్షణము, జ్వరము నివర్తించినపిదప కల్గు (జ్వరవిముక్త) లక్షణములను, వీనిని వేరువేరుగ వివరించి చెప్పవలెను.

మరియు జ్వరవిముక్తుడగు మానవుని ఎంతకాలము ఏయేనియమములతో కాపాడవలెను? అట్టినియమమును ఎందుకు ఆశ్రయించవలెను? శమించినజ్వరము ఏకారణములచే మరల వ్యాపించును? అట్టి పునరావృత్తజ్వరమును శమింపజేయు క్రియావిధానము లెవ్వి? భగవత్స్వరూపుడగు నోగురువర్యా! పైజెప్పిన విషయముల నన్నిటిని లోకమునకు హితమును కోరి విపులముగ నానతిండు; (అని అగ్నివేశులు తనకు గురువగు నాత్రేయమహర్షిని కృతాంజలియై యడిగెనని పైవాక్యముతో సంబంధము).

ఇచ్చట 'దేహేన్ద్రియమనస్తాపీ' అను హేతుగర్భితవిశేషణముచేత శరీరమునకును చక్షురాదీంద్రియములకును మనస్సునకును నేకకాలమున సంతాపమును కల్గించునది యగు

టంజేసి జ్వరము ప్రధానమని చెప్పుట సహేతుకమని తెలిసెడి. అర్బుదము మొదలగు కొన్నిరోగములు శరీరమాత్రమునే తపింపజేయును. తిమిరము మున్నగు కొన్నిరోగములు చక్షురాదీంద్రియముల మాత్రమే తపింపజేయును. అతత్త్వాభినివేశము మున్నగునవి మన స్సునుమాత్రము తపింపజేయును. జ్వరము పైవ్యాధులవలెగాక శరీర-ఇంద్రియ మనస్సుల నొక్కుమ్మడి తపింపజేయును కావున తక్కినవ్యాధులకన్న ప్రధానమని భావము. ఈవిష యమునే 'జ్వరేణావిశతా భూతం నహి కించిన్న తప్యతే'' అని స్థలాంతరమున నీక్రింద తంత్రకారు లుపదేశించిరి.

## అగ్నివేశున కాత్రేయులు చెప్పినయుత్తరము.

మూ. తదగ్నివేశస్య వచో నిశమ్య గురురబ్రవీత్,
జ్వరాధికారే యద్వాచ్యం తత్సౌమ్య! నిఖిలం శృణు. 10

వ్యా. పైజెప్పినరీతిగ నగ్నివేశులు ప్రశ్నసేయగ గురువగు నాత్రేయులు—జ్వరాధికారమున నెంత జెప్పవలసి యుండునో ఆవిషయము నంత విశదముగ చెప్పెద వినుమని యీక్రిందివిధముగ జెప్పందొడంగెను.

## జ్వరపర్యాయనామములు.

మూ. జ్వరో వికారో రోగశ్చ వ్యాధిరాతఙ్క ఏవ చ,
ఏకోఽర్థో నామ పర్యాయైః వివిధైరభిధీయతే. 11

వ్యా. జ్వరము, వికారము, రోగము, వ్యాధి, ఆతంకము, అనునట్టి యనేక పర్యాయపదములచేత జ్వరరూపమైన రోగము చెప్పబడును. (ఒకటే యర్థమును భోదించు పదము లనేకములు పర్యాయపదము లనబడును. అట్టి పర్యాయపదములైన జ్వరాదిశబ్ద ములచే జ్వరరూపమైనరోగము వ్యవహరింపబడునని భావము).

## జ్వరమునకు సన్నిహితప్రకృతి(కారణము).

మూ. తస్య ప్రకృతిరుద్దిష్టా దోషాశ్శారీరమానసాః,
దేహినం న హి నిర్దోషం జ్వరస్సముపసేవతే. 12

వ్యా. లోకమున దోషరహితుడగు శరీరధారియైన ప్రాణిని జ్వరము బాధింపదు; కావున జ్వరమునకు శరీరసంబంధములగు వాత-పిత్త-కఫరూపదోషంబులును, రజస్తమో రూపములగు మానసికదోషంబులును ప్రకృతి యగునని సంక్షేపముగ జెప్పబడును. (దేనిని కారణముగ జేసికొని యేకార్యము ప్రవర్తించునో అయ్యది ఆకార్యమునకు ప్రకృతి యనియు స్వభావమనియు చెప్పబడును. శారీరమానసికదోషములను కారణముగ

జేసి జ్వరము ప్రవర్తించును; కావున జ్వరమునకు శారీరమానసికదోషములు ప్రకృతి యని చెప్పబడును) ఇది జ్వరమునకు సన్నిహితకారణమగును.

## స్వభావరూపమైన జ్వరప్రకృతి.

మూ. క్షయస్తమో జ్వరః పాప్మా మృత్యుశ్చోక్తాః యమాత్మకాః,
(మృత్యుశ్చోక్తో యమాత్మజః.)
పఞ్చత్వప్రత్యయాన్నృణాం క్లిశ్యతాం స్వేన కర్మణా. 13
ఇత్యస్య ప్రకృతిః ప్రోక్తా

వ్యా. మరియు జ్వరము శరీరమును క్షీణింపజేయుటంజేసి క్షయమనియు, అజ్ఞానమును పూర్వజన్మజ్ఞానాభావమును కల్గించుటంజేసి తమమనియు, పాపముచే గల్గుటంజేసి పాప్మ యనియు, మరణమునకు హేతువగుటవలన మృత్యువనియు, యమునిబోలె ప్రాణాంతక మగుటంజేసి యమస్వరూపమనియు చెప్పబడును. ఏలయన:—వారివారి కర్మపరిపాకమునంజేసి కష్టపడుచుండు మానవులప్రాణహానికి యముడెట్లు కారణమగునో ఆవిధంబుగనే పైజెప్పిన క్షయాదులకు హేతువైన జ్వరము మృతినొందించును; కావున 'యమాత్మకాః' అని చెప్పబడినది. ఇచ్చట జ్వరమునకుంగల క్షయకర్తృత్వాధర్మబాహుళ్యమునుబట్టి బహువచనము నిర్దేశింపబడినది. (పైజెప్పబడిన క్షయకర్తృత్వాదులు జ్వరమునకు స్వాభావికధర్మములు కావున నియ్యది స్వభావరూపమైన జ్వరప్రకృతి యని యెరుంగునది).

## జ్వరముయొక్క ప్రవృత్తి (ఆద్యుత్పత్తి).

మూ. ప్రవృత్తిస్తు పరిగ్రహాత్,
నిదానే పూర్వముద్దిష్టా రుద్రకోపాచ్చ దారుణాత్. 14

వ్యా. ప్రవృత్తి యన—జ్వరాదిరోగములయొక్క ప్రాథమికావిర్భావము(రోగములతొల్లింటిపుట్టుక), అట్టి ప్రవృత్తి జ్వరమునకు జనపదోధ్వంసనీయమున వివరింపబడిన పరిగ్రహమువలనను నిదానస్థానమున సంగ్రహరూపముగ నిర్దేశింపబడిన క్రూరమగు రుద్రకోపమువలనను సంభవించును.

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—ప్రకృతి యన—దేనిని కారణముగ జేసికొని కార్యరూపముగపరిణమించునో అయ్యది ప్రకృతి. ఇచ్చట జ్వరమునకు వాత-పిత్త-కఫములు కారణములై జ్వరరూపకార్యముగ పరిణమించి జ్వరమున సంబంధించియే యుండును కావున అయ్యవి జ్వరమునకు ప్రకృతి యగును. (ఇదియే సమవాయకార

ణము). అట్టి త్రిదోషములు జ్వరమునకు సన్నిహితకారణము లగును. ఈప్రకృతియే "తస్య ప్రకృతిరుద్దిష్టా...సముపసేవతే" అను శ్లోకమున జెప్పబడినది. ఇది సన్నికృష్ట కారణరూపమైన ప్రకృతి. రెండవది స్వభావరూపమైన ప్రకృతి—ఇయ్యది అగ్నికి ఉష్ణ గుణము స్వాభావికధర్మ మగునట్లు రోగములకు స్వాభావికధర్మ మైయుండును. అయ్యది జ్వరమునకు క్షయాదికర్తృత్వము స్వాభావికధర్మము; కావున స్వభావరూపప్రకృతి యగును.ఇయ్యది "క్షయ స్తమోజ్వరః...ప్రకృతిః ప్రోక్తా"అనువాక్యముచే వివరింపబడి నది. ఈరెండువిధములైన ప్రకృతిశబ్దవాచ్యములును జ్వరమునకు సన్నికృష్టకారణములే యగును. ఇది ప్రకృతివివరణము.

ప్రవృత్తి యన రోగములకు ప్రాథమికోత్పత్తి. జ్వరముయొక్క ప్రాథమికోత్ప త్తికి రుద్రకోపరూపమైన కారణ మొకటి. అయ్యది నిదానస్థానమున 'జ్వరస్తు ఖలు మాహేశ్వరకోపప్రభావః... తేనాభిభూతాః ప్రాగ్దేహికం దేహినః కర్మ కిఞ్చిదపి నస్మ రన్తి, సర్వప్రాణభృతాం జ్వర ఏవ అన్తే ప్రాణానాదత్తే' (నిదాన అ. ౧. సూత్ర. 3౮) అనువాక్యముచే సంగ్రహముగ నిర్దేశింపబడినది. ఆరుద్రకోపప్రభావమే యీక్రింద "ద్వితీయే హి యుగే" అని యుపక్రమించి వివరింపబడును. ఇది జ్వరముయొక్క ప్రాథమికోత్పత్తి కొక కారణము. రెండవకారణము ధర్మపరిగ్రహము. ఈకారణము "తస్య మూల మధర్మః" అని యుపక్రమించి "భ్రశ్యతి చ కృతయుగే కేషాంచిదత్యా దానాత్ సామ్పన్నికానాం శరీరగౌరవమాసీత్...సత్త్వానాం గౌరవాత్ శ్రమః, శ్రమాదాలస్యం, ఆలస్యాత్ సంచయః, సంచయాత్పరిగ్రహః, పరిగ్రహాల్లోభః ప్రాదు ర్భూతః కృతే." (విమాన అ. 3. సూత్ర. ౨౯) ఇత్యాది వాక్యములచే సవిస్తరముగ వివరింపబడినది. (జ్వరముయొక్క ప్రాథమికోత్పత్తికి రుద్రకోపంబును అధర్మాచరణంబును కారణము లగునని ముఖ్యభావము) పైజెప్పినకారణములు రెండును జ్వరమునకు ఆద్యు త్పత్తికారణములు కావున నవి విప్రకృష్టకారణములనియు చెప్పబడును.

## జ్వరమునకు రుద్రకోపోత్పత్తివివరణము.

మూ. ద్వితీయే హి యుగే శర్వమక్రోధవ్రతమాస్థితం,
దివ్యం సహస్రం వర్షాణాం అసురా అభిదుద్రువుః. 15
తపోవిఘ్నాశనాః కర్తుం తపోవిఘ్నం మహాత్మనః,
పశ్యన్ సమర్థశ్చోపేక్షాం చక్రే దక్షః ప్రజాపతిః. 16
పునర్మాహేశ్వరం భాగం ధ్రువం దక్షః ప్రజాపతిః,
యజ్ఞేన కల్పయామాస ప్రోచ్యమానస్సురైరపి. 17

ఋచః పశుపతేర్యాశ్చ శైవ్య ఆహుతయశ్చ యాః,
యజ్ఞసిద్ధిప్రదాః తాభిర్హీనం చైవ స ఇష్టవాన్. 18
అథో త్రీర్ణవ్రతో దేవో బుద్ధ్వా దక్షవ్యతిక్రమం,
రుద్రో రౌద్రం పురస్కృత్య భావమాత్మవిదాత్మనః. 19
స్పృష్ట్వా (స్మృష్ట్వా) లలాటే చక్షుర్వై దగ్ధ్వా తానసురాన్ ప్రభుః,
బాలం క్రోధాగ్నిసన్తప్తం అసృజత్ సత్రనాశనమ్. 20
తతో యజ్ఞస్య విధ్వస్తో వ్యథితాశ్చ దివౌకసః,
దాహవ్యథాపరీతాశ్చ భ్రాన్తా భూతగణా దిశః. 21
అథేశ్వరం దేవగణాః సహ సప్తర్షిభిర్విభుం,
తమృగ్భిరస్తువన్ యావత్ శైవే భావే శివః స్థితః. 22
శివం శివాయ భూతానాం స్థితం జ్ఞాత్వా కృతాఞ్జలిః,
భియా భస్మప్రహరణః త్రిశిరాః నవలోచనః. 23
జ్వాలామాలాకులో రౌద్రో హ్రస్వజఙ్ఘోదరః క్రమాత్,
క్రోధాగ్నిరుక్తవాన్ దేవం అహం కిం కరవాణి తే. 24
తమువాచేశ్వరః క్రోధం జ్వరో లోకే భవిష్యసి,
జన్మాదౌ నిధనే చ త్వం అపచారాన్తరేషు చ. 25

వ్యా. (జ్వరముయొక్క ఆద్యుత్పత్తికి పరిగ్రహంబును (అధర్మాచరణంబును) రుద్రకోపంబును కారణములని చెప్పి; అందు అధర్మాచరణమువలన జ్వరము సంభవించిన క్రమము విమానస్థానమున విపులముగ జెప్పబడినది. రుద్రకోపముచే జ్వరము కల్గినవిషయము నిదానమున సంక్షేపముగ జెప్పబడినది; అట్టిరుద్రకోపోత్పత్తివిషయము విస్తరించి యిచ్చట జెప్పబడును).

పూర్వకాలమున యుగములలో రెండవదియగు త్రేతాయుగమున పరమేశ్వరుడు క్రోధమును వదలి యాచరింపదగిన యొకవ్రతమును బూని అనేక(వేయి)దివ్యసంవత్సరములు తపము నాచరింప బూనియుండ, మహనీయుల తపస్సును విఘ్నమొనరించుటయే జీవనముగాగల రాక్షసులు కొందరు మహాత్ముడగు పరమేశ్వరుడు చేయువ్రతమునకు విఘ్నమాచరింప బూని వారిచెంతకు జేరిరి. అట్టియెడ దక్షప్రజాపతి యారాక్షసుల వారింపజాలియుండియు నుపేక్షించి వారింపకుండె. ఇంతియకాక దక్షప్రజాపతి

తానొక గొప్పయాగముజేయుచు అందు ఈశ్వరునకు యాగమునం దవశ్యముగ నియ్యవలసిన హవిర్భాగమును ఇయ్యక దేవతలు నివారించుచున్నను సరకుసేయక యాగము సేయుచుండెను. యజ్ఞసిద్ధికరములగు నీశ్వరసంబంధమైన ఋక్కుల నుచ్చరింపక, ఈశ్వరదేవతాకములగు నాహుతుల హోమముసేయకవదలి యాగమును జేయుచుండెను. పదంపడి యీశ్వరుండును తాబూనినవ్రతము పూర్తిజేసికొని దక్షుడు తనపై జూపిన ధిక్కారమును అనాదరమును, తెలిసికొని తనరౌద్రభావమును పురస్కరించుకొని తననుదుటనుండు ఆగ్నేయమైన మూడవకంటిని కోపోద్దీపితుడై స్పృశింప నందుండి దివ్యంబగునాగ్నేయ తేజంబు వెలువడి యారక్కసులమూక నుక్కడంచి, యాక్రోధానలమునుండి యొక్క బాలుని దక్షయాగమును ధ్వంసముచేయుటకై సృజించెను. ఆక్రోధాగ్నిసంభూతుడగు బాలుండు యజ్ఞమును ధ్వంసముచేయుతరి యాగమున హవిర్భాగముల నందికొనవచ్చిన దేవతలందరును భయభ్రాంతులై నలుదెసలకు పరువిడసాగిరి. భూతగణములెల్ల అగ్నిజ్వాలాపరీతులై దిక్కుతెలియక పరిభ్రమించిరి.

పిదప దేవతలందరును సప్తర్షిగణసమేతులై యీశ్వరస్తుతిరూపములగు (రుద్రము మున్నగు) వేదమంత్రములచేత నాపరమశివుడు లోకమునకు మంగళప్రదు డగునందాక స్తుతియింపసాగిరి. పిదప పరమకారుణికుండగు నాపరమశివుడు దేవతలస్తోత్రములచే నెంతయు ప్రసన్నుడై లోకమునకు మంగళకరమగు శాంతస్వభావము నందెను.

అంత భస్మము నాయుధంబుగను, మూడుతలలును, తొమ్మిది కన్నులును, జ్వాలాకారంబును, కురుచలగుకాళ్లును, ఉదరంబును కల యారుద్రకోపాగ్నిసంభూతపురుషుడు ఆపరమశివుని లోకహితార్థమై శాంతచిత్తునిగ నెరింగి, కేలు మోడ్చి నే సేయదగినపని యేమని యడిగెను. అప్పుడు పరమశివుడును ఆక్రోధాగ్నిరూపమైన దివ్యపురుషునింగాంచి "నీవు లోకమున ప్రాణులజన్మప్రారంభమునను; అవసానకాలముసందును, జ్వరమునకు కారణములైన అధర్మాచరణము మున్నగు కారణములును మిథ్యాహారవిహారాదుల సేవించుటయు సంభవించినపుడు, ఆట్టికారణముల నవకాశముగ జేసికొని జ్వరరూపమును దాల్చి ప్రాణుల పీడించునది" యని యానతిచ్చెను.

(ఇత్తెరంగున ప్రశ్నక్రమమున 'ప్రకృతిం చ ప్రవృత్తిం చ' అను ప్రశ్నముల రెంటికి పైగ్రంథముచే సవిస్తరముగ నుత్తరము చెప్పబడినది).

## జ్వరప్రభావము.

మూ. సన్తాపస్సాఽరుచిస్తృష్ణా సాఙ్గమర్దో హృది వ్యథా,
జ్వరప్రభావో జన్మాదౌ నిధనే చ మహత్తమః. 26
ప్రకృతిశ్చ ప్రవృత్తిశ్చ ప్రభావశ్చ ప్రదర్శితః,

వ్యా. సంతాపము, అరుచి, డప్పి, ఒడలినొప్పులు, హృదయమున బాధ, జన్మాదియందును, అవసానకాలమునను కల్గు ప్రబలమైనయజ్ఞానము, ఇవి యన్నియు జ్వరముయొక్క ప్రభావము. ఇత్తెరంగున జ్వరముయొక్క ప్రకృతియు, ప్రవృత్తియు, ప్రభావంబును ప్రశ్నక్రమానుసారముగ వివరించి చూపబడినవి. (ప్రభావమన:—గుర్తింపనలవికాని శక్తివిశేషము. జ్వరసిద్ధమైనశక్తి (కారణముచే గుర్తింపనలవికానిశక్తి) సంతాపాదిరూపమైనది (అదియే ప్రభావము). మరియు జన్మాదియందును అవసానమందును అజ్ఞానరూపముగ నుండుశక్తియు జ్వరప్రభావమగును. వాతకఫజ్వరమున నుష్ణము వ్యాపించకయే సంతాపము కల్గుటయు జ్వరప్రభావకృతమగును.)

## జ్వరకారణములు.

మూ. నిదానే కారణాన్యష్టౌ పూర్వోక్తాని వి (పూర్వముక్తాని) భాగశః.

వ్యా. వాతికాదిభేదములచే నెనిమిదివిధములైన జ్వరములు సంప్రాప్తించుటకు కారణములు ఎనిమిదివిధములుగ వేరువేర విభజించి యింతకుమున్న నిదానస్థానమున నే వివరముగ జెప్పబడినవి.

వివరణము:—"నిదానస్థానమున రూక్షలఘుశీత... వాయుః ప్రకోపమాపద్యతే" (ని. అ. 1. సూ. ౨౧) అనువాక్యముచేత రూక్షలఘుశీతాహారాదులచేత వాతము ప్రకోపమునొంది వాతజ్వరమును కల్గించుననియు; "ఉష్ణామ్లలవణక్షార... పిత్తం ప్రకోపమాపద్యతే" (ని. అ. సూత్ర. ౨౪) అనువాక్యముచేత ఉష్ణ-అమ్ల-లవణ-క్షారాహారాదులచే పిత్తము ప్రకుపితమై పైత్తికజ్వరమును కల్గించుననియు; "స్నిగ్ధ-గురు-మధుర... శ్లేష్మాప్రకోపమాపద్యతే" (ని. అ. ౧. సూ. ౨౭) అనువాక్యముచేత స్నిగ్ధమధురాద్యాహారాదులచేత కఫము ప్రకుపితమై శ్లైష్మికజ్వరమును కల్గించుననియు; "యథోక్తానాం చ హేతూనాం మిశ్రీభావాత్ యథా నిదానం ద్వంద్వానాం అన్యతమః, సర్వే వా త్రయో దోషాః ప్రకోపమాపద్యన్తే" (ని. అ. ౧. సూ. 3౦.) అను వాక్యముచేత పైని వాతాదులప్రకోపమునకు వేర్వేరుగ జెప్పిన కారణములలో రెండేసి కారణముల సంసర్గమునంజేసి రెండేసి దోషములు ప్రకుపితములై సంసర్గజములైన వాతపిత్త-వాతకఫ-పిత్తకఫజ్వరములను వరుసగ కల్గించుననియు, మూడుదోషముల ప్రకోపింపజేయుకారణముల సేవించుటచే త్రిదోషములును సమకాలమున ప్రకుపితములై సన్నిపాతజ్వరమును కల్గించుననియు; "అభిఘాతాభిషఙ్గాభిచారాభిశాపేభ్యః ఆగన్తుర్హి వ్యథాపూర్వః అష్టమోభవతి" (ని. అ. ౧. సూ. 3౨) అనువాక్యముచేత అభిఘాతాదులచే నాగంతుజ్వరము సంభవించుననియు, నెనిమిదివిధములైన జ్వరములకును కారణములు ఎనిమిదివిధ

ముల వేరువేర విభజించి చెప్పబడినవి. అట్టి రూక్షాదికారణము లెనిమిదియు నిచ్చట 'నిదానే కారణాన్యష్టౌ పూర్వోక్తాని విభాగశః'' అనువాక్యముచే మరల ననువాద రూపముగ జెప్పబడినవి.

ఇచ్చట కొందరు—''అథ ఖల్వష్టాభ్యః కారణేభ్యః జ్వరస్సఞ్జాయతే మనుష్యాణాం—వాతాత్, పిత్తాత్, కఫాత్, వాతపిత్తాభ్యాం, వాతశ్లేష్మభ్యాం, పిత్తశ్లేష్మభ్యాం, వాతపిత్తశ్లేష్మభ్యః, ఆగన్తోరష్టమాత్ కారణాత్.'' (ని. అ. ౧ సూ. ౧౯) అని చెప్పబడిన వాతాదు లెనిమిదియు నిచ్చట ''కారణాన్యష్టౌ పూర్వోక్తాని'' అనువాక్యముచే మరల జ్వరకారణములుగ ననువదింపబడునని చెప్పెదరు. మరియు పైవివరింపబడిన రూక్షాదులు అట్టి వాతాదిదోషప్రకోపకారణములగును కాని జ్వరమునకు కారణములు కానోపవనియు చెప్పెదరు. సిద్ధాంతమున జ్వరాదిరోగములకన్నిటికిని కారణములు సన్నికృష్టము లనియు, విప్రకృష్టము లనియు రెండుతెరంగుల నుండును. సన్నిహితము లగునవి సన్నికృష్టము, కొంచెము వ్యవధానము కల్గినకారణములు విప్రకృష్టములు. అందు వాతాదిదోషములు ప్రకుపితములై సంప్రాప్తియందు కూడ చేరియుండి వాతాదిదోషములు జ్వరాదిరోగముల గల్గించునుగాన నవి సన్నికృష్టకారణము లగును. అట్టి సన్నిహితకారణములైన దోషముల ప్రకోపింపజేయు రూక్షాదులు స్వయముగ జ్వరమునకు కారణములు కాకున్నను దోషప్రకోపమూలమున జ్వరకారణము లగును. కావున నవి విప్రకృష్ట (వ్యవహిత) కారణములగును. ఈతంత్రకారుడు జ్వరరూపముగ సంప్రాప్తియందు కలిసి యుండు సన్నిహితకారణములగు వాతాదులు ''తస్య ప్రకృతి రుద్దిష్టా దోషాః శారీరమానసాః'' అని చెప్పిన ప్రకారము ప్రకృతిశబ్దవాచ్యము లనియు, వానిని ప్రకోపింపజేయు వ్యవహితకారణములైన రూక్షాదులు ఇచ్చట ''కారణాన్యష్టౌ'' అను వాక్యమున గ్రహింపదగుననియు నభిప్రాయపడి వేరువేరుగ జెప్పెననుట సమంజసముగ నుండును.

## జ్వరపూర్వరూపము.

మూ. ఆలస్యం నయనే సాస్రే జృమ్భణం గౌరవం క్లమః,
జ్వలనాతపవాయ్వమ్బుభక్తిద్వేషావనిశ్చితౌ. 28
అవిపాకాస్యవైరస్యే హానిశ్చ బలవర్ణయోః,
శీలవైకృతమల్పం చ జ్వరలక్షణమగ్రజమ్. 29

వ్యా. ఆలస్యము (పనులయందు ప్రాలుమాలిక), కన్నుల నీరుగ్రమ్ముట, ఆవలింతలును ఒడలి విరుపులును కల్గుట, శరీరము బరువుగ నుండుట, బడలిక, నిప్పునెగ ఎండ

గాలి నీళ్లు వీనియందు ఒకప్పుడు శ్రద్ధయు,ఒకప్పుడు ద్వేషంబును నిల్కడ లేక మారిమారి కల్గుట, ఆహారము జీర్ణము గాకుండుట, నోట రుచి దెలియకయుండుట, బలంబును శరీర వర్ణంబును హీనమగుట, స్వభావము వికృతి జెంది కొంచెము మారియుండుట, ఇవియన్నియు జ్వరమునకు మునుమున్ను గల్గు పూర్వరూపములు. (ఈపూర్వరూపములు నిదానస్థానమున జెప్పబడియున్నను మరల నిచ్చట ప్రకరణానుసారముగ వానిలో ప్రాయికముగ సంభవించు ఆలస్యము మున్నగునవి మాత్రము నిర్దేశింపబడినవి).

జ్వరముయొక్క యధిష్ఠానంబును, బలకాలంబును.

మూ. కేవలం సమనస్కం చ జ్వరాధిష్ఠానముచ్యతే,
శరీరం; బలకాలస్తు నిదానే సమ్ప్రదర్శితః. 30

వ్యా. బాహ్యేంద్రియములతో కూడిన కేవలశరీరము జ్వరమునకు అధిష్ఠానము (జ్వరము వ్యాపించుటకు స్థానము). ఇది శారీరజ్వరమున కధిష్ఠానము. మనస్సుతో కూడిన శరీరము మానసికజ్వరమున కధిష్ఠానము అగును. జ్వరము వ్యాపించుటకును బలవత్తరమగుటకును కాలవిశేషము వాతాదిదోషభేదముచే వేరువేరుగ నిదానస్థానమున ఆయా జ్వరలక్షణములయందు చెప్పబడినది.

వాతికాదిజ్వరములకు బలకాలనియమము నిదానమున నిట్లు చెప్పబడినది:— "జరణాన్తే, దివసాన్తే, నిశాన్తే, ఘర్మాన్తే, జ్వరాభ్యాగమః, అభివృద్ధిర్వా జ్వరస్య విశేషేణ" (ని. అ. ౧. సూ. ౨౩) అని వాతజ్వరమునకు;

"భుక్తస్య విదాహకాలే, మధ్యన్దినే, అర్ధరాత్రే శరది వా, విశేషేణ" (ని. అ. ౧. సూ. ౨౬) అని పిత్తజ్వరమునకును;

"భుక్తమాత్రే, పూర్వాహ్ణే, పూర్వరాత్రే, వసన్తకాలే వా విశేషేణ" (ని. అ. ౧. సూ. ౨౯) అని కఫజ్వరమునకును బలకాలనిర్ణయము చెప్పబడినది. అదియే యిచ్చట ననువాదరూపముగ నుదహరింపబడినది. ఇత్తెరంగున జ్వరమున కధిష్ఠానంబును బలకాలంబును ప్రశ్నానుసారముగ చెప్పబడినవి.

జ్వరముయొక్క ఆత్మ(స్వరూప)లక్షణము.

మూ. జ్వరప్రత్యాత్మికం లిఙ్గం సన్తాపో దేహమానసః,
జ్వరేణావిశతా భూతం న హి కిఞ్చిన్న తప్యతే. 31

వ్యా. దేహమునందును మనస్సునందును కల్గు సంతాపము జ్వరమునకు ఆత్మలక్షణము (స్వరూపలక్షణము) అగును. లోకమునం దేప్రాణియైనను జ్వరము ఆవహించు

నపుడు మనశ్శరీరములయందు సంతాపము కల్గకుండుట లేదు (అవశ్యముగ సంతాపము కల్గియే యుండురనుట). కావున జ్వరమునకు దానివ్యాప్తి కధిష్ఠానమగు మనశ్శరీరముల యందు కల్గు సంతాపము జ్వరమునకు స్వరూపలక్షణమని భావము.

వివరణము:—ఆత్మలింగమన—అగ్నికి ఉష్ణరూపమైన గుణము సర్వకాలసర్వావస్థలయందును హాని లేక నిరంతరముగ సహజసిద్ధమై యుండునో అయ్యది (ఉష్ణము) అగ్నికి ఆత్మలక్షణమగును. అత్తెరంగున నే జ్వరము వ్యాపించునపుడు మనశ్శరీరములయందు తప్పక సంతాపము కల్గును. అట్టిసంతాపము లేక జ్వరము వ్యాపించుటలేదు, కావున జ్వరమునకు సహజసిద్ధమై యొకప్పుడు నెడబాయకుండు సంతాపము ఆత్మ(స్వరూప) లక్షణమగును. మరియు జ్వరమునకు కేవలము సంతాపమాత్రము స్వరూపలక్షణము. "సన్తాపసారుచీ" అనువాక్యమున జెప్పినరీతిగ అరుచి తృష్ణ మున్నగువానితో కూడిన సంతాపము జ్వరమునకు ప్రభావము. ఆలక్షణమునకును స్వరూపలక్షణమునకును ఇదియే భేదము. ఇచ్చట భూతశబ్దముచేత సకలప్రాణిసామాన్యముగ గ్రహింపబడును; కావున ఏనుగులు మున్నగుప్రాణులకు సంభవించు పాకలాదిరూపమైన జ్వరమునందును అంతర్దాహవేదనారూపసంతాపము తప్పక కల్గునని యెరుంగునది.

### జ్వరముయొక్క విధి(ప్రకార) భేదములవివరణము.

మూ. ద్వివిధో విధిభేదేన జ్వరశ్శారీరమానసః,
పునశ్చ ద్వివిధో దృష్టః సౌమ్యశ్చాగ్నేయ ఏవ వా. 32
అన్తర్వేగో బహిర్వేగః ద్వివిధః పునరుచ్యతే,
ప్రాకృతో వైకృతశ్చైవ సాధ్యశ్చాఽసాధ్య ఏవ చ. 33
పునః పఞ్చవిధో దృష్టః దోషకాలబలాబలాత్,
సన్తతస్సతతోఽన్యేద్యుః తృతీయకచతుర్థకౌ. 34
పునరాశ్రయభేదేన ధాతూనాం సప్తధా మతః,
భిన్నః కారణభేదేన పునరష్టవిధో జ్వరః. 35

వ్యా. జ్వరము శారీరము (లోలుత శరీరమున పుట్టునది), మానసము (మనస్సున పుట్టునది),అని విధిభేదముచే రెండుతెరంగుల నుండును. మరల (శీతగుణముకలకారణముచే కల్గుటంజేసి) సౌమ్యము (సోమదేవతాకము) అనియు, ఉష్ణగుణముకలకారణముచే కల్గుటంజేసి) ఆగ్నేయము (అగ్నిదేవతాకము) అనియు విధిభేదముచే రెండు తెరంగు లగును. మరల నంతర్వేగమనియు, బహిర్వేగమనియు రెండుతెరంగులు. మరల

ప్రాకృతము, వైకృతమునవియు; సాధ్యము, అసాధ్యమునవియు రెండేసి భేదములు క
యుండును. మరియు ప్రకుపితములగు వాతాదిదోషములకు సంబంధించిన ఆయాజ
కాలముయొక్క బలాఽబలములబట్టి సంతతము, సతతము, అన్యేద్యుష్కము, తృతీ
కము, చతుర్థకమునని యైదు భేదములు కల్గియుండును. మరియు రసరక్తాదిధాతువులరు
ములగు నాశ్రయముల భేదమునుబట్టి జ్వరము ఏడువిధముల నుండును. మరియు వా
పిత్త-కఫ-వాతపిత్త-వాతకఫ-పిత్తకఫ - త్రిదోష-ఆగంతువులను నెనిమిదికారణముల
ముచే నెనిమిదివిధము లగును. (ఇత్తెరంగున విధి(ప్రకార)భేదముచే జ్వరభేదవ
నెరుంగునది. ఈ భేదములవివరణమంతయు క్రింద స్ఫుటముగ జెప్పబడును).

## శారీర-మానసజ్వరస్వరూపలక్షణములు.

మూ. శారీరో జాయతే పూర్వం దేహే, మనసి మానసః,
వైచిత్త్యమరతిర్గ్లానిః మనసస్తాపలక్షణమ్.
ఇన్ద్రియాణాం చ వైకృత్యం జ్ఞేయం సన్తాపలక్షణమ్.
(దేహసన్తాపలక్షణమ్.)

వ్యా. శారీరజ్వరము (సంతాపరూపముగ) తొలుత శరీరమున వ్యాపించు
(కావున నియ్యది శారీరము (శరీరమునపుట్టునది)అని యన్వర్థముగ జెప్పబడును). మా
మనుజ్వరము తొలుత మనస్సున పుట్టును. ఇచ్చట 'పూర్వంజాయతే' అని చెప్పుట
శారీరజ్వరము శరీరసంబంధదోషప్రాబల్యమునం జేసి తొలుత శరీరమునపుట్టి పిమ్మట మన
నందును వ్యాపించుననియు, మానసజ్వరము మనస్సంబంధమైన దోషప్రాబల్యవ
తొలుత మనస్సుననే పుట్టి పిమ్మట శరీరమునందును వ్యాపించుననియు నర్థమగును. ఈ
యముచే జ్వరముల కన్నింటికిని మనసును శరీరంబును కలిసి యధిష్ఠానమగునని నిష
ష్టార్థ మేర్పడును. అయినను శారీరదోషప్రాబల్యముచే జనించిన శారీరజ్వరమునకు శ
దోషశామకచికిత్సను ప్రధానముగ జేయవలెననియు, మానసజ్వరమునకు మానసది
శామకచికిత్సను ప్రధానముగ జేయవలెననియు చికిత్సావిధానమును బోధించుట
శారీరమానసవిభాగము చెప్పబడియెనని యెరుంగునది).

మరియు:—వైచిత్త్యము (చిత్తము యథాస్థితి నుండక మారియుండుట), అ
(దేనియందును ఆసక్తి లేకుండుట), గ్లాని (మైకము), ఇవి మనస్సుకు సంబంధించిన
మనబడును. (ఇవియే మానసజ్వరమునకు స్వరూపలక్షణము). ఈలక్షణములు జ్వరప్రా
మున తొలుత కల్గినచో నయ్యది మానసికమని యెరుంగనగును) చక్షురాదీంద్రియ

వానివానివిషయముల గ్రహింపనేరకుండుట శరీరమునకు సంబంధించిన తాపమగును. (జ్వరప్రారంభముననే తొలుత ఇంద్రియవికృతి కల్గి వ్యాపించిన, నయ్యది శారీరమని యెఱుంగునది. ఇది శారీరజ్వరమునకు స్వరూపలక్షణము).

ఈలక్షణములచేత శరీరమును ఇంద్రియములను మనస్సును బాధించునది జ్వరమని నిశ్చితమగును. కావుననే జ్వరప్రాశస్త్యమును చెప్పునపుడు "దేహేన్ద్రియమనస్తాపీ" అని చెప్పినది సంగతమగును. ఇత్తెరంగున "పృథగ్భిన్నస్య చాకృతిమ్" అను ప్రశ్నమున కుత్తరము చెప్పబడెను.

### సౌమ్య-ఆగ్నేయజ్వరవివరణము.

మూ. వాతపిత్తాత్మకః శీతముష్ణం వాతకఫాత్మకః,
ఇచ్ఛత్యుభయమేతత్తు జ్వరో వ్యామిశ్రలక్షణః. 37

వ్యా. వాతపిత్తముల రెంటెని కారణములుగ జేసి జనించిన సంసర్గజ్వరము (ఉష్ణస్వభావముగలవాతపిత్తములచే జనించుటంజేసి ఆగ్నేయమగును కావున అట్టిజ్వరము కలమనుజుడు) చలువకోరును. (ఇచ్చట కేవలవాతముచే జనించినజ్వరంబును, కఫముచే జనించినజ్వరంబును శీతప్రాయమగు కారణముచే జనించుటంజేసి సౌమ్యములే యగును; కావున అట్టిజ్వరములచే పీడింపబడినవారు వేడినే కోరుదురని యెఱుంగునది.)

మరియు వాతకఫముల సంసర్గముచే జనించినజ్వరము శీతస్వభావకారణజన్యమగుటంజేసి సౌమ్యమగును. దానంజేసి అట్టిజ్వరముచే పీడింపబడినమనుజుడు ఉష్ణమును కోరును. అట్టివాతపిత్త-వాతకఫ-జ్వరములకన్న నితరమైన పిత్తకఫములచేజనించిన సంసర్గజ్వరము ఉష్ణశీతగుణములు రెండును కల్గియుండుటంజేసి సౌమ్యాగ్నేయసంసృష్టమగును కావున అట్టిజ్వరముకలవాడు శీతోష్ణముల రెంటెని కోరుచుండును. సన్నిపాతజ్వరము కలవాడును అట్టిసంసర్గమునంజేసి శీతోష్ణముల రెంటెని కోరుచుండును.

వివరణము:—వాతము శీతగుణప్రధానము; కఫము శీతగుణప్రాయము. కావున నట్టివాతముచే ప్రారంభమైన జ్వరంబును, కఫముచే ప్రారంభమైన జ్వరంబును సౌమ్యము. కావున అట్టివాత-కఫజ్వరములు వ్యాపించిన నపుడు మనుజుడు నిదానమునకు విరుద్ధమైన ఉష్ణమునం దభిలాష కల్గియుండును. పిత్తము ఉష్ణగుణము కల్గినది. అట్టిపిత్తమును కారణముగ జేసి ప్రారంభమైన పైత్తికజ్వరము ఆగ్నేయము. అట్టిజ్వరముచే బాధితుడు నిదానవిరుద్ధమగు శీతమునం దభిలాష కల్గియుండును. సౌమ్య-ఆగ్నేయగుణములగు వాత-పిత్తముల రెండిటిసంసర్గమున నారంభింపబడిన ద్వంద్వజ్వరమునందును జీవితమునందేయభిలాష కల్గియుండును. వాతము శీతగుణము కల్గియున్నను పిత్తసంబంధమహిమంజేసి పిత్తమును

బోలె నుష్ణకార్యకారియే యగును. కావున అట్టి వాతపిత్తజ్వరము కలవాడును శీతాభిలాష కల్గియుండునని "వాతపిత్తాత్మకశ్శీత" మని చెప్పబడినది. మరియు వాతకఫములు రెండును శీతగుణములు కావున నారెంటెని కారణముగఁజేసి ప్రారంభమైన జ్వరము కలవాడు ఉష్ణమునం దభిలాష కల్గియుండును. ఈవిషయము "ఉష్ణం వాతకఫాత్మకః" అని చెప్పబడినది.

మరియు పైఁజెప్పిన వాతపిత్త-వాతకఫజ్వరములకన్న మూఁడవదియైన కఫపిత్తసంసర్గమున జనించిన జ్వరమునందును, సన్నిపాతజ్వరమునందును సౌమ్యాగ్నేయముల రెండిటి లక్షణములు మిశ్రములుగ నుండును కావున శీతోష్ణగుణముల రెంటియందును అభిలాష కల్గియుండును. వాతము ఏవస్తువుతోఁ జేరిన నావస్తునిష్ఠగుణములు తనకు కల్గి యావస్తువు చేయుపనినే తానును చేయును. కావున పిత్తముతోఁ జేరినపుడు పిత్తముతో సమానగుణమై పిత్తకృత్యముల జేయును. కఫముతోఁ జేరినపుడును ఇత్తెరంగునె యూహించునది. ఇదియే వాతమునకు యోగవాహిత్వగుణము. ఇదియే క్రిందటి శ్లోకమున వివరింపబడును. (పైవివరణముచేత పిత్తజ్వరంబును, వాతపిత్తజ్వరంబును, ఆగ్నేయములనియు; కఫజ్వరంబును, వాతకఫజ్వరంబును సౌమ్యములనియు, పిత్తకఫ-సన్నిపాతజ్వరములు భయాత్మకములనియు నిర్ణయ మేర్పడును).

వాతమునకు యోగవాహిత్వనిరూపణము.

మూ. యోగవాహః పరం వాయుః సంయోగాదుభయార్థకృత్,
దాహకృత్తేజసా యుక్తః శీతకృత్ సోమసంశ్రయాత్. 38

వ్యా. వాతము యోగవాహము, (వేరొండు వస్తువుతో సంబంధము కల్గినప్పుడు ఆవస్తువునకు సంబంధించిన శీత-ఉష్ణాదిగుణములు కల్గియుండు స్వభావముకలది) ఈవిషయము "యోగేన (యోగిగుణం) వహతి, ఇతి యోగవాహః" అనువ్యుత్పత్తిచే సిద్ధమగును. కావున వస్త్వంతరసంబంధమువలన రెండువిధములగు ప్రయోజనములను (ఉష్ణద్రవ్యముతోఁ గూడినపుడు ఉష్ణకార్యమును, శీతగుణద్రవ్యముతోఁ గూడినపుడు శీతకార్యమును) జేయును. కావున అట్టివాతము తేజస్సుతో (ఉష్ణగుణద్రవ్యముతో) కూడినపుడు తాపమును, శీతగుణద్రవ్యముతోఁ గూడినపుడు శీతకృత్యమును జేయును. లోకమునందును బాహ్యవాతముగూడ అగ్ని ఆతపము మున్నగు నుష్ణద్రవ్యసంబంధము కల్గినపుడు వేడిగనుండును. జలముమున్నగు శీతసంబంధము కల్గినపుడు చల్లనిస్పర్శము కల్గియుండును. ఇట్టి లోకానుభవమును సూచించుటకై 'పిత్తేన' అనిచెప్పక 'తేజసా' అని తంత్రకారులు

చెప్పిరి. మరియుఁ శీతగుణము నైజముగఁగలవాతకఫముల రెంటిచే గల్గుటం జేసి వాతకఫజ్వరమున వాతపిత్తజ్వరమున ఉష్ణాభిలాష యధికముగ నుండునని యెరుంగునది.

## అంతర్వేగజ్వరలక్షణములు.

మూ॥ అన్తర్దాహోఽధికస్తృష్ణా ప్రలాపః శ్వసనం భ్రమః,
సన్ధ్యస్థిశూలమస్వేదః దోషవర్చోవినిగ్రహః,
అన్తర్వేగస్య లిఙ్గాని జ్వరస్యైతాని లక్షయేత్. 40

వ్యా॥ (శరీరమునందలి యంతర్భాగములయందుండు హృదయాద్యవయవముల యందు వేగమును జూపునట్టి జ్వరము అంతర్వేగము) అంతర్వేగజ్వరమున అంతరవయవములయందు తాపం బధికమగును. దప్పి మిక్కిలి తీవ్రమగును. అసంబద్ధముగ మాటలాడును. శ్వాస మధికమగును. మతిభ్రమము కల్గును. కీళ్లయందును అస్థులయందును నొప్పి కల్గును. శరీరముపై చెమట యించుకేనియుఁ బొడమదు. వాతాదిదోషంబులును మలంబును సరళముగ వెడలక బద్ధగించును. ఈలక్షణములబట్టి యంతర్వేగజ్వరమని గమనించునది.

## బహిర్వేగజ్వరలక్షణములు.

మూ॥ సన్తాపోఽభ్యధికో బాహ్యః తృష్ణాదీనాం చ మార్దవం,
బహిర్వేగస్య లిఙ్గాని సుఖసాధ్యత్వమేవ చ. 41

వ్యా॥ (శరీరమున త్వగింద్రియముపై వ్యాపించుజ్వరము బహిర్వేగము) ఈజ్వరమునం దధికముగ నొడలి పైభాగమున (చర్మమున) వేడియు సంతాపంబును కల్గును. పైజెప్పిన దప్పి శ్వాసము ప్రలాపము మొదలగునవి తీవ్రముగాక స్వల్పముగ నుండును. ఈలక్షణములబట్టి బహిర్వేగజ్వరమని యెఱుంగునది. మఱియుఁ నిది సుఖసాధ్యముగ నుండును.

## ప్రాకృత-వైకృతజ్వరవివరణము.

ప్రాకృతస్సుఖసాధ్యస్తు వసన్తశరదుద్భవః,
ఉష్ణముష్ణేన సంవృద్ధం పిత్తం శరది కుప్యతి. 42
చితశ్శీతే కఫశ్చైవం వసన్తే సముదీర్యతే,
వర్షాస్వమ్లవిపాకాభిః అద్భిరోషధిభిస్తథా. 43
సఞ్చితం పిత్తముద్రిక్తం (ముత్క్లిష్టం) శరద్యాదిత్యతేజసా,
జ్వరం సఞ్జనయత్యాశు తస్య చానుబలః కఫః. 44

ప్రకృత్యైవ విసర్గస్య తత్ర నాఽనశనాద్భయం,
అద్భిరోషధిభిశ్చైవ మధురాభిశ్చితః కఫః. 45
హేమన్తే సూర్యసన్తప్తస్సవసన్తే ప్రకుప్యతి,
వసన్తే శ్లేష్మణా తస్మాత్ జ్వరస్సముపజాయతే. 46
ఆదానమధ్యే తస్యాపి వాతపిత్తం భవేదను,

వ్యా. వసంతఋతువునందును శరదృతువునందును పుట్టిన సుఖసాధ్యజ్వరము ప్రాకృతమనబడును. ఎట్లనగా: ఉష్ణగుణమగు పిత్తము ఉష్ణకాలముచేత వృద్ధినొంది శరత్కాలమున ప్రకోపమునొందును. శీతకాలమున చయావస్థ నొందినకఫము వసంతకాలమున ప్రకోపమునొందును. మరియు వర్షాకాలమునందు అమ్లవిపాకముగల జలముచేతను ఓషధులచేతను చయావస్థ నొందిన పిత్తము శరత్కాలమునందు సూర్యుని తేజస్సుచేత ప్రకోపమునొంది వెంటనే జ్వరమును కల్గించును. అట్టిపిత్తమునకు కఫము సహాయబలకారిగ నుండును. విసర్గకాలస్వభావముచేత నాసమయమున లంఘనము చేయించుటవలన భయ మించుకేనియు నుండదు.

(విసర్గకాలము సౌమ్యంబును స్నిగ్ధగుణంబును నగును. కావున పురుషు లట్టికాలమున బలిష్ఠులుగ నుందురు. కఫపిత్తములు రెండును లంఘనార్హములు. ఈకారణములవలన విసర్గకాలమున కఫపిత్తములచేగల్గిన జ్వరమున లంఘనము చేసినను భయము లేదని భావము.)

మరియు హేమంతఋతువున మధురవిపాకములగు జలముచేతను ఓషధులచేతను చయావస్థ నొందినకఫము వసంతకాలమున సూర్యతాపముచే తపింపబడి ప్రకోపమునొందును. దానంజేసి అట్టికఫముచే వసంతకాలమున జ్వరము సంభవించును. అట్టియాదానమధ్యకాలమున నాజ్వరకరమగు కఫమునకు వాతపిత్తములు అనుబంధములుగ నుండును. (పైజెప్పినరీతిగ శరత్కాలమున పిత్తప్రకోపముచేతను కఫసంబంధముచేతను గల్గినజ్వరంబును, వసంతకాలమున కఫప్రకోపముచేతను పిత్తసంబంధముచేతను గల్గిన జ్వరంబును ప్రాకృతజ్వరము లనబడును. ఇయ్యది సుఖసాధ్యము.)

## ప్రాకృతజ్వరచికిత్సావిధి.

మూ. ఆదావన్తే చ మధ్యే చ బుద్ధ్వా దోషబలాఽబలమ్. 47
శరద్వసన్తయోర్విద్వాన్ జ్వరస్య ప్రతికారయేత్,

వ్యా. పైజెప్పినరీతిగ శరద్వసంతకాలముల యాదియందును మధ్యమందును అంతమందును వాతాదిదోషములయొక్క బలాబలములను జక్కగ గమనించి జ్వరమునకు

తత్తదుచితముగ చికిత్స జేయనగును. (అట్టిచికిత్సావిధానమునకే పైజెప్పినప్రాకృతజ్వర వివరణము నిరూపింపబడినదియని భావము.)

### ప్రాకృతజ్వరనిర్వచనము.

మూ. కాలప్రకృతిముద్దిశ్య నిర్దిష్టః ప్రాకృతో జ్వరః. 48
ప్రాయేణాఽనిలజో దుఃఖః కాలేష్వన్యేషు వైకృతః,
హేతవో వివిధాస్తస్య నిదానే సంప్రకాశితాః 49

వ్యా. కాలముయొక్క ప్రకృతిని (స్వభావమును) ఉద్దేశించి (కాలస్వభావముతో సమానగుణమైన దోషసంబంధమును కారణముగ జేసి) ప్రాకృతజ్వరము నిర్దేశింపబడినది. (కాలముయొక్క శీత-ఉష్ణస్వభావమునకు సమానమైనదోషముచే గల్గిన జ్వరము ప్రాకృతమని ప్రాకృతశబ్దనిర్వచనము. అట్టిదోషకాలసంబంధముచే జనించి సుఖసాధ్యమైనజ్వరము ప్రాకృతమని నిష్కృష్టలక్షణము).

మరియు వాతజజ్వరము ప్రాయికముగ కృచ్ఛ్రసాధ్యము; కావున వాతమునకు సమానప్రకృతికాలమగు వర్షాకాలమున బుట్టినను వాతికజ్వరంబును, పైజెప్పిన వసంతశరత్కాలములకన్న నితరములగు కాలముల బుట్టిన కఫజ-పైత్తికజ్వరంబులును వైకృతములనబడును. అట్టి వైకృతజ్వరము సంభవించుటకు కారణములు నిదానస్థానమున విపులముగ జెప్పబడినవి.

ఇచ్చట నీవిషయసంగ్రహము నెరుంగునది;—ప్రాకృతజ్వరమన ఋతుధర్మముచే సంభవించు శీతోష్ణములకు సమానమగుగుణముకల దోషముచే గల్గినజ్వరము ప్రాకృతము. అందు వర్షర్తునందు వాతంబును, శరదృతువున పిత్తంబును, వసంతఋతువున కఫంబును ప్రకోపమునొందుట సహజము. అట్టి వర్షాశరద్వసంతములయందు వాత-పిత్త-కఫములు మూడును వరుసగ వర్షాశరద్వసంతములతో సమానగుణములు కల్గియుండును. కావున వర్షాకాలమున వాతప్రకోపమున గల్గుజ్వరంబును, శరత్కాలమున పిత్తప్రకోపమున గల్గినజ్వరంబును, వసంతకాలమున కఫప్రకోపమున గల్గుజ్వరంబును ప్రాకృతజ్వరము లనబడును. అటుగాక గ్రీష్మ-శిశిర-హేమంతఋతువులలో కల్గిన జ్వరంబును, వర్షా-శరత్-వసంతఋతువులయందు పైజెప్పిన దోషనియమమునకు వ్యత్యయముగ (ఋతుప్రకృతికి విరుద్ధములగు దోషములచే) సంభవించిన జ్వరంబును వైకృతములు. అందు ప్రాకృతజ్వరము ఋతుధర్మముతో సమానములగు దోషములచే గల్గుటంజేసి సుఖసాధ్యంబును, వైకృతజ్వరము ఋతువిరుద్ధధర్మములగు దోషములచేగల్గుటంజేసి కృచ్ఛ్రసాధ్యంబును నగును. అందును వాతజ్వరము ప్రాకృతమైనను విరుద్ధోపక్రమం బగుటంజేసి కృచ్ఛ్ర

సాధ్యము. ఈవిషయమంతయు వాగ్భటాచార్యులచే నిట్లు చెప్పబడినది:—"వర్షాశరద్వసన్తేషు వాతాద్యైః ప్రాకృతః క్రమాత్, వైకృతోఽన్యః సదుస్సాధ్యః ప్రాయశ్చ ప్రాకృతోఽనిలాత్."

ఋతువుతో సమానగుణము గల దోషముచే గల్గినజ్వరము సుఖసాధ్యమని తంత్రాంతరమున "జ్వరే తుల్యర్తుదోషత్వం ప్రమేహేతుల్యదూష్యతా, రక్తగుల్మే పురాణత్వం సుఖసాధ్యస్య లక్షణమ్" అనువాక్యముచే జెప్పబడినది. ఈతంత్రకారుడు ప్రాకృతలక్షణమును జెప్పునపుడే "ప్రాకృతస్సుఖసాధ్యస్తు వసన్తశరదుద్భవః" అని చెప్పెను. వసంతశరత్కాలముల బుట్టిన సుఖసాధ్యజ్వరము ప్రాకృతమని యర్థము. జ్వరము ఆమాశయమున బుట్టుటవలన నామాశయదోషహరణమునకై లంఘనచికిత్స ముఖ్యముగ జేయుట హితకరము. "జ్వరే లంఘనమేవాదౌ ఉపదిష్టమృతే జ్వరాత్, క్షయాఽనిల భయక్రోధ...ద్భవాత్" అనువాక్యముచేత వాతజ్వరమునమాత్రము లంఘనము నిషేధింపబడినది. కావున వాతికజ్వరము విరుద్ధోపక్రమము. దానంజేసి వాతజ్వరము స్వభావముచేతనే కృచ్ఛ్రసాధ్యమని యందరకును సిద్ధాంతము.

సుఖసాధ్యజ్వరవివరణము.

మూ. బలవత్స్వల్పదోషేషు జ్వరస్సాధ్యోఽనుపద్రవః,

వ్యా. జ్వరమునకు కారణములైన వాతాదిదోషములు బలిష్ఠములుగాక అల్పబలములై శరీరబలము చక్కగ నుండువారికి సంభవించిన జ్వరము ఉపద్రవములు లేకుండినయెడ నయ్యది సుఖసాధ్యమగును. (ఔషధముచే సుఖముగ సాధింపదగి యుండును.)

ఉపద్రవమన—ఒకరోగము జనించినపిదప దానిని అనుబంధరూపముగ నాశ్రయించిన స్వల్పరోగమైనను ప్రబలరోగమైనను అయ్యది యుపద్రవ మనబడును. "ఉప(పశ్చాత్)ద్రవతి (అనుసృత్య వర్తతే) ఇతి ఉపద్రవః" అనువ్యుత్పత్తిచేత నన్వర్థముగ జెప్పబడును.

ఈవిషయమును తంత్రకారులు స్థలాంతరమున నిట్లుపదేశించిరి:—"ఉపద్రవస్తు ఖలు రోగోత్తరకాలజో రోగాశ్రయో రోగ ఏవ స్థూలోఽణుర్వా, రోగాత్పశ్చాత్ జాయత ఇత్యుపద్రవః" (చికిత్స. అ. ౨౧.) జ్వరోపద్రవంబులును తంత్రాంతరమున నిట్లు చెప్పబడినవి:—"హిక్కాశ్వాసకాసతృష్ణాచ్ఛర్ద్యతీసారమూర్ఛాఙ్గభేదారోచకాః, కృచ్ఛ్రవిట్కతా చేతి దశోపద్రవాః జ్వరముపద్రవన్తి" ఎక్కిళ్లు, శ్వాసము, దగ్గు, దప్పి, వాంతి, అతిసారము, మూర్ఛ, ఒడలినొప్పులు, అరుచి, మలబద్ధకము ఇవి పదియు జ్వరమున గల్గునుపద్రవములు.

## అసాధ్యజ్వరవివరణము.

మూ. హేతుభిర్బహుభిర్జాతః బలిభిర్బహులక్షణః. 50
జ్వరః ప్రాణాన్తకృద్యశ్చ శీఘ్రమిన్ద్రియనాశనః,

వ్యా. పలు తెరంగులైన మిథ్యాహారవిహారాదికారణములచే మిక్కిలి యుత్కృష్టముగ ప్రకోపమునొంది, రసాదిధాతువులలో ననేకముల నాశ్రయించిన వాతాదిదోషములచే నారంభింపబడి, ఆయాజ్వరమునకు జెప్పిన లక్షణము లన్నియు పూర్తిగ కల్గి, చక్షురాదీంద్రియముల పదింటిని మనస్సును వానివాని కృత్యములయందు ప్రవర్తింపనీయక జ్వరము కల్గినంతమాత్రముననే శీఘ్రముగ నశింపజేయుచుండుజ్వరము మిక్కిలి క్రూరమై రోగిని చంపజూచును.

ఇచ్చట బలిష్ఠములగు అనేక కారణములచే జనించినరోగమున ననేకలక్షణములే కల్గియుండును. అట్టియెడ 'బహులక్షణః' అని మరల నేల జెప్పవలెనన ? పురుషుని యగ్నిబలాదివిశేషములంజేసి దోషహేతువు లనేకములుగ నున్నను బహులక్షణమగు వ్యాధిని కల్గింపనేరవు. కావున 'బహులక్షణః' అని ప్రత్యేకముగ జెప్పబడినవి.

## వేరొక యసాధ్యత్వలక్షణము.

మూ. సప్తాహాద్వా దశాహాద్వా ద్వాదశాహాత్తథైవ చ. 51
సప్రలాపభ్రమశ్వాసస్తీక్ష్ణో హన్యాత్ జ్వరో నరమ్,

వ్యా. మరియు ప్రలాపము భ్రమము శ్వాసము ఇవి మిక్కిలి తీక్ష్ణములుగ కల్గియుండు జ్వరము (వాత మధికముగ ప్రకోపము నొందినదైనచో) నేడుదినములకు చంపును. అట్టి ప్రలాపాదివిశిష్టజ్వరము (పైత్తికమైనచో) పదిదినములకు లోపల చంపును. అట్టిలక్షణములు కలజ్వరము (కఫజమైనచో) పండ్రెండుదినములకు చంపును. (ఇచ్చట వాత-పిత్త - కఫముల శీఘ్రకారిత్వమున తరతమభేదము ననుసరించి సప్తాహాది కాలనియమమును తంత్రకారు లుపదేశించిరి. కొందరు ప్రలాపవిశిష్టజ్వరము ఏడుదినములకును, భ్రమవిశిష్టజ్వరము పదిదినములకును, శ్వాసవిశిష్టజ్వరము పండ్రెండుదినములకును చంపునని యథాసంఖ్యము ననుసరించి వ్యాఖ్యానము చేసెదరు).

## మరియొక యసాధ్యత్వలక్షణము.

మూ. జ్వరః క్షీణస్య శూనస్య గమ్భీరో దైర్ఘరాత్రికః. 52
అసాధ్యో బలవాన్ యశ్చ కేశసీమన్తకృజ్జ్వరః,

వ్యా. శరీరము క్షీణించి వాపు కల్గినవానికి సంభవించిన జ్వరంబును వాతాదిదోష లక్షణములు పైకి స్ఫుటముగ గానరాక లోపలనే యణఁగి యంతస్తాపమును కల్గించు జ్వరంబును, చాలకాలముగ వ్యాపించి బాధించు జ్వరంబును, బలిష్ఠమై వెండ్రుకలలో పాపట దీసినవిధముగ రేఖల గల్గించు జ్వరంబును అసాధ్యములగును. (విధిభేదమున "సాధ్యశ్చాసాధ్య ఏవ చ" అని నిర్దేశించిన ద్వివిధభేదవివరణము).

{ దోషకాలబలాఽబలములచే నైదువిధములగు సంతతాదిజ్వరముల వివరణము, అందు సంతత జ్వరవివరణము. }

మూ. స్రోతోభిర్విసృతా దోషాః గురవో రసవాహిభిః. 53
సర్వదేహానుగా స్తబ్ధాః జ్వరం కుర్వన్తి సన్తతం,
దశాహం ద్వాదశాహం వా సప్తాహం వా సుదుస్సహః. 54
స శీఘ్రం శీఘ్రకారిత్వాత్ ప్రశమం యాతి హన్తి వా,
కాలదూష్యప్రకృతిభిః దోషస్తుల్యో హి సన్తతమ్. 55
నిష్ప్రత్యనీకః కురుతే తస్మాత్ జ్ఞేయః సుదుస్సహః,
యథా ధాతూన్ తథా మూత్రం పురీషం చానిలాదయః. 56
యుగపచ్చానుపద్యన్తే నియమాత్ సన్తతే జ్వరే,
సశుద్ధ్యా వాఽప్యశుద్ధ్యా వా రసాదీనామశేషతః. 57
సప్తాహాదిషు కాలేషు ప్రశమం యాంతి హన్తి వా,
యదా తు నాతిశుధ్యన్తి న వా శుధ్యన్తి సర్వశః 58
ద్వాదశైతే సముద్దిష్టాః సన్తతస్యాశ్రయా స్తథా,
విసర్గం ద్వాదశే కృత్వా దివసేఽవ్యక్తలక్షణమ్. 59
దుర్లభోపశమః కాలం దీర్ఘమప్యనువర్తతే,

వ్యా. వాతాదిదోషములు మూడును మిక్కిలి వృద్ధినొంది శరీరమునందలి రసవాహినులగు స్రోతస్సులయందు తొలుత వ్యాపించి వానిమూలముగ శరీరమునం దంతట వ్యాపించి స్తంభించి సంతతజ్వరమును కల్గించును. అట్టిసంతతజ్వరము పదిదినములైనను పండ్రెండుదినములైనను ఏడుదినములైన ఎడలేక చాల క్రూరముగ వ్యాపించి యుండి అయ్యది శీఘ్రకారి (శీఘ్రముగ పనిచేయు స్వభావముకలది యగుటచేత) శీఘ్రముగ (పైజెప్పిన దశాహాది నియతకాలము కడచినవెంటనే) శాంతినొందును, లేక చంపును. (ఈసంతతజ్వరము పైజెప్పినరీతిగ త్రిదోషప్రకోపమున జనించును కావున సన్నిపాతభేద

ములలో చేరినది. అందు పిత్తము తక్కినవాతకఫములకన్న మిక్కుటముగ వృద్ధినంది యుండునెడ పదిదినములవరకును తీవ్రముగ నెడలేక వ్యాపించి, పిమ్మట వెంటనే శాంతి నొందును; లేక చంపును. కఫమధికముగ వృద్ధినందినచో పండ్రెండుదినములును, వాతము వృద్ధినందినచో నేడుదినములును ఎడలేక వ్యాపించి వెంటనే శాంతినొందును. లేక రోగిని చంపును. ఇత్తెరంగగుట శాంతినొందుటకైనను చంపుటకైనను దశాహాదికాలనియమము పిత్త-కఫ-వాతవృద్ధికారణమని వరుసగ నెరుంగునది. ఈవిషయము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"పిత్త-కఫానిలవృద్ధ్యా దశదివసద్వాదశాహసప్తాహాత్, హన్తి విముఞ్చతి వాశు త్రిదోషజో ధాతుమలపాకాత్" "దశద్వాదశసప్తాహైః పిత్త శ్లేష్మానిలాధికః, దగ్ధ్వోష్మణా (దేహోష్మణా)ధాతుమలాన్ హన్తి ముఞ్చతి వా జ్వరః" ఈవాక్యముచేత దేహమునందు వ్యాపించిన జ్వరముయొక్క తీవ్రతచే ధాతువులు పక్వములైనపుడు పైజెప్పిన కాలనియతిప్రకారము చంపుననియు, మలములు పరిపక్వములైనపుడు విడచుననియు 'ధాతుమలాన్' అనుపదముచే దెలిసెడి.)

మరియు వర్షాదికాలంబునకును, రసాదిదూష్యములకును, శ్లేష్మప్రకృతి మున్నగు శరీరప్రకృతికిని సమానమగుదోషము మిక్కిలి బలవత్తరమై అడ్డులేక సంతతజ్వరమును కల్గించును; కావున నాజ్వరము (బలవత్తరదోషముచే కల్గుటంజేసి) మిక్కిలి యోరువ శక్యము గాకుండును. శీఘ్రకారియు నగును.

మరియు సంతతజ్వరమున వాతపిత్తకఫములు మూడును ఎత్తెరంగున (గురుత్వస్తబ్ధత్వాదిగుణయుక్తములుగ) రసాదిధాతువుల నేకకాలమున వ్యాపించునో, అత్తెరంగుననే మూత్రమునను పురీషమునను ఏకకాలమున వ్యాపించి యుండును. (వాతాదిదోషములు మూడును ప్రకోపమునొంది రసరక్తాది సప్తధాతువులయందును మూత్రపురీషముల యందును ఏకకాలముననే వ్యాపించి యుండునని భావము; సంతతజ్వరమునకు వాతాది దోషములు మూడును, రసరక్తాదిధాతువు లేడును, మూత్రపురీషంబులును జేరి యీ పండ్రెండును ఆశ్రయములని ఫలితార్థము).

అట్టియెడ పైజెప్పిన దశదివసాదికాలమునకు పైజెప్పిన సంతతజ్వరమున కాశ్రయములైన దోషదూష్యమలములు పండ్రెండును దోషహితములై ఇంచుకేనియు దుష్టములుగాక పరిశుద్ధములుగ నుండునెడ, అట్టి దశదివసాదికాలనియతిప్రకారము శాంతి నొందును. అటుగాక యవి పండ్రెండును కొంచెమైనను విశుద్ధములు గాకుండునేని అట్టి నియత దశదివసాదికాలమున తప్పక రోగిని చంపును.

మరియు ఒకవేళ దశదివసాదిని యతకాలమున ఆశ్రయములు పండ్రెండును పూర్తిగ శుద్ధినొందక కొంచెము దుష్టములుగ నున్నను అపండ్రెండు ఆశ్రయములలో

కొన్ని మాత్రము విశుద్ధినొంది కొన్ని విశుద్ధములు కాకున్నను, సంతతజ్వరములక్షణములు పైకి కానరాక లీనముగ నణగియుండి (నివర్తించినట్లులు కానబడి) చికిత్సచే నివర్తింపక క్రూరమై చాలకాలమువరకును అనుసరించి వ్యాపించియుండును. (జ్వరముయొక్క లక్షణములు పైకి స్ఫుటముగ కానరాక దశదివసాది నియతకాలమున నివర్తించినవిధముగ కనబడి యేకాదశాదిదినములనుండి దీర్ఘకాలంబును వ్యాపించి బాధించుచుండుననియు, దానంజేసి చికిత్సచే దుస్సాధముగ నుండుననియు భావము; ఇట్లు చెప్పుటచేత అట్టి నియతకాలమున నివర్తించినవిధముగ జ్వరము లీనముగ నుండునుగాని పూర్తిగ నివర్తించుట లేదని 'అవ్యక్తలక్షణం' అనుపదముచే తెలిసెడి).

ఇచ్చట నీవిమర్శనము నెరుంగునది:—సంతతజ్వరము పైజెప్పినరీతిగ దోషదూష్యమలముల పండ్రెండింటి నాశ్రయించి జనించి దశదివసాది కాలనియతిప్రకారము శాంతి-క్రూరత్వము కల్గియుండును. కావున వాతికాదిజ్వరములకన్న భిన్నమైనదని స్ఫుటముగ నేర్పడును. తంత్రాంతరమున—"తథా సన్తత ఏవాన్యః స్వల్పదుర్బలకారణః, ఏకదోషో ద్విదోషో వా స్వల్పోపద్రవలక్షణః. అతుల్యదూష్యప్రకృతిః" అని చెప్పిన సంతతజ్వరము దీనికన్న విలక్షణమైనదని విజ్ఞు లూహించెదరు గాత!

సంతతజ్వరచికిత్సాక్రమము.

మూ. ఇతి బుద్ధ్వా జ్వరం వైద్యః ఉపక్రామేత్తు సన్తతమ్ 60
క్రియాక్రమవిధా యుక్తః ప్రాయః ప్రాగపతర్పణైః,

వ్యా. సంతతజ్వరము నుద్దేశించి పైజెప్పిన దోషదూష్యకాలాదివిభాగముల జక్కగ నెరింగి వైద్యుడు చికిత్సాకాలమున యుక్తియుక్తముగ తొలుత లంకణము మున్నగు నపతర్పణాదిక్రియాక్రమము ననుసరించి యుచితచికిత్స జేయ నుపక్రమింపవలెను.

సతతకజ్వరనిరూపణము.

మూ. రక్తధాత్వాశ్రయః ప్రాయః దోషస్సతతకం జ్వరమ్. 61
సప్రత్యనీకః కురుతే కాలవృద్ధిక్షయాత్మకం,
అహోరాత్రే సతతకో ద్వౌ కాలావనువర్తతే. 62

వ్యా. వాతాదిదోషములలో నొకటి యేదైనను ప్రాయికముగ రక్తధాతువు నాశ్రయించి సతతకమను జ్వరమును కల్గించును. అట్టిదోషము దానికి విరుద్ధమగు కాలాదులగుణములతో గూడి జ్వరమును కల్గించును. మరియు నాజ్వరము జ్వరవృద్ధికుచితమైన

కాలమున వృద్ధినొందియు, క్షీణించుటకనుగుణమైనకాలమున క్షీణించుచు నుండును. ఇత్తెరంగున సతతకజ్వరము అహోరాత్రికాలములందు రెండుకాలములయందును వర్తించి వ్యాపించును. (ఇచ్చట "ప్రాయః రక్తధాత్వాశ్రయః" అని చెప్పుటచేత నొకసమయమున మాంసాదిధాతువుల నాశ్రయించియు దోషము ఈజ్వరమును కల్గించునని తెలిసెడి.)

## అన్యేద్యుష్కజ్వరవివరణము.

మూ. కాలప్రకృతిదూష్యాణాం ప్రాప్యైవాఽన్యతమాద్బలమ్,
అన్యేద్యుష్కం జ్వరం దోషః రుద్ధ్వా మేదోవహాస్సిరాః. 63
స ప్రత్యనీకో జనయత్యేకకాలమహర్నిశి,

వ్యా. వర్షాదికాలము, కఫాదిప్రకృతి, రసాదిదూష్యములు వీనిలో నొకదాని వలన దోషము బలమునొంది, శరీరమునందలి మేదస్సును వహించు సిరల నడ్డగించి మేదస్సును దుష్టముగజేసి) అన్యేద్యుష్కమను జ్వరమును కల్గించును. అట్టిదోషము తనకు విరుద్ధగుణమైన కాలాదులతో గూడి జ్వరమును కల్గించును. ఈజ్వరము ఒకయహోరాత్రమున నొకకాలమున వ్యాపించును.

ఇచ్చట మేదోవహనాడులను దోషము అడ్డగించిన మాత్రమున నయ్యది (మేదస్సు) స్వస్థానమున నే యుండి స్వమార్గమున నే సంచరించుచున్నను దుష్టమగును. ఈవిషయము విమానస్థానమున నిట్లు చెప్పబడినది:—"తేషాం స్రోతసాం రోధాత్ స్థానస్థా ఏవ మార్గగాశ్చ ధాతవః ప్రకోపమాపద్యతే" (విమాన. అ. 5).

## తృతీయక-చతుర్థకజ్వరములవివరణము.

మూ. దోషోఽస్థిమజ్జగః కుర్యాత్ తృతీయకచతుర్థకౌ. 64
గతిః ద్వ్యేకాన్తరాన్యేద్యుః దోషస్యోక్తాన్యథాపరైః,
అన్యేద్యుష్కం జ్వరం కుర్యాత్ అపి సంశ్రిత్య శోణితమ్. 65
మాంసస్రోతాంస్యనుగతో జనయేత్తు తృతీయకం,
సంశ్రితో మేదసో మార్గం దోషశ్చాపి చతుర్థకమ్. 66
అన్యేద్యుష్కః ప్రతిదినం దినం హిత్వా తృతీయకః,
దినద్వయం యో విశ్రమ్య ప్రత్యేతి స చతుర్థకః. 67

వ్యా. దోషము అస్థిమజ్జల రెండిటి నాశ్రయించి తృతీయక చతుర్థకజ్వరముల కల్గించును. ఈజ్వరములయందు దోషమునకు గమనము రెండుదినములైనను ఒకదినమై

నను అవకాశము కల్గియైనను లేక ప్రతిదినమున నైనను వ్యాప్తి కల్గియుండునని కొందరాచార్యులు చెప్పెదరు. మరియు దోషము రక్తము నాశ్రయించి అన్యేద్యుష్క-జ్వరమును కల్గించుననియు కొందరిమతము.

మాంసముయొక్క స్రోతస్సుల నాశ్రయించి తృతీయకజ్వరమును కల్గించును. దోషము మేదోమార్గము నాశ్రయించి చతుర్థకజ్వరమును కల్గించును. మరియు అన్యేద్యుష్క-జ్వరము ప్రతిదినంబును విడచి వ్యాపించును. తృతీయకజ్వరము జ్వరము వ్యాపించిన మరునాడు జ్వరవ్యాప్తి లేకుండి, యామరుసటిదినమున (మూడవనాడు) మరల వ్యాపించును. చతుర్థకజ్వరము వ్యాపించినదినముననే వ్యాప్తి తగ్గి పిమ్మట రెండుదినములు వ్యాప్తిలేకయే యణగి యుండి నాల్గవనాడు మరల వ్యాపించుచుండును.

తృతీయక-చతుర్థకజ్వరముల కాలనియమమును, కారణములు.

మూ. అధిశేతే యథా భూమిం బీజం కాలే చ రోహతి,
అధిశేతే తథా ధాతుం దోషః కాలే చ కుప్యతి. 68
స వృద్ధిం బలకాలం చ ప్రాప్య దోషస్తృతీయకం,
చతుర్థకం చ కురుతే ప్రత్యనీకబలక్షయాత్. 69

వ్యా. లోకమున భూమిలో నుండువిత్తనము కాలాదిసంపత్తి లేనికాలమున భూమియందే యణగి యుండి అంకురించు కాలాదిసంబంధము కల్గినప్పుడు ఎట్లు మొలకలెత్తి వ్యాపించునో, అత్తెరంగుననే వాతాదిదోషములును సతతకాదిజ్వరములకు ఆశ్రయమగు రక్తాదిధాతువులయందే అణగి యుండి, ఆయాదోషమునకు బలకరమైన ఆయా కాలమున వృద్ధినంది, తృతీయకచతుర్థకజ్వరములను ఆయానియతకాలమున తనకు విరుద్ధమైన గుణముకలకాలాదులకు బలము క్షీణించినపుడు (తానే బలమునొంది) మరల జ్వరమును వ్యాపింపజేయుచుండును. ఈకారణముచేతనే తృతీయకాదిజ్వరమునకు కాలవ్యవధి యేర్పడునని భావము. (ఈజ్వరములవిషయమైన కాలాదివ్యవధానము దూష్యసంబంధము మున్నగువిషయములలో గల్గు మతాంతరములు మున్నగునవి యెల్ల మాచే విరచితమగు అష్టాంగహృదయనిదానవ్యాఖ్యానమున "ఆసన్నవివృతాస్యత్వాత్ ...... విపర్యయాత్" (అష్టాంగ. అ. ౨. శ్లో. ౬౭—౬౮) అనుశ్లోకములవ్యాఖ్యానమునను, మాధవనిదానమునందలి జ్వరనిదానవ్యాఖ్యానమునను విపులముగ చర్చింపబడినవి. విస్తరభీతిచే నిట నావివరణమును విరమించితి.)

తృతీయకాదిజ్వరములయందు దోషములు జ్వరవేగమునుజూపువిధము.

మూ. కృత్వా వేగం గతబలాః స్వే స్వే స్థానే వ్యవస్థితాః,
పునర్వివృద్ధాః స్వే కాలే జ్వరయన్తి నరం మలాః. 70

వ్యా. పైజెప్పినరీతిగ దోషములు తృతీయకాదిజ్వరములయందు తమవేగమును పూర్తిగ జూపి బలమును వదలి వానివానికి స్థానములైన రక్తాదిధాతువులయందే అణగి యుండును. మరల తమకు వృద్ధికరమగు కాలమున వృద్ధినంది మనుజునకు జ్వరమును వ్యాపింపజేయును.

## దోషోద్రేకముచే తృతీయక-చతుర్థకజ్వరములకు గల్గు ప్రభావవిశేషము.

మూ. కఫపిత్తాత్త్రికగ్రాహీ పృష్ఠాద్వాతకఫాత్మకః,
వాతపిత్తాచ్ఛిరోగ్రాహీ త్రివిధస్స్యాత్తృతీయకః. 71
చతుర్థకో దర్శయతి ప్రభావం ద్వివిధం జ్వరః,
జఙ్ఘాభ్యాం శ్లైష్మికః పూర్వం శిరస్తోఽనిలసమ్భవః. 72

వ్యా. తృతీయకజ్వరము సన్నిపాతముచే జనించును. అందు కఫపిత్తములు ప్రబలములుగ నుండినచో త్రిక (వెన్నెముకకు క్రింది సంధిభాగమున) స్థానమున తొలుత వేదనాదిరూపముగ వ్యాపించి యారంభమగును. వాతకఫము లధికములుగ నున్నచో తొలుత వీపున నారంభించి శరీరమునందెల్ల వ్యాపించును. వాతపిత్తములు అధికములుగ నుండునెడ తొలుత శిరంబున బుట్టి శరీరమునందెల్ల వ్యాపించును. ఇత్తెరంగున తృతీయకజ్వరము మూడువిధముల ప్రభావము కల్గియుండును.

చతుర్థకజ్వరమున కఫం బధికముగనుండు సన్నిపాతమున జనించినచో పిక్కల యందు తొలుత నారంభించి శరీరమునందెల్ల వ్యాపించును. వాతాధికసన్నిపాతమున జనించినచో తొలుత శిరస్సున వ్యాపించి, పిదప శరీరమున వ్యాపించును. ఇత్తెరంగున చతుర్థకజ్వరము రెండువిధములైన ప్రభావమును జూపును.

## చతుర్థకవిపర్యయజ్వరము, దానిభేదములును.

మూ. విషమజ్వర ఏవాన్యః చతుర్థకవిపర్యయః,
త్రివిధో ధాతురేకైకః ద్విధాతుస్థః కరోతి యమ్. 73

వ్యా. వాతాది మూడుదోషములలో నొకటొకటి అస్థిమజ్జలను రెండుధాతువుల నాశ్రయించి చతుర్థకవిపర్యయమను వేరొక విషమజ్వరమును కల్గించును. (ఈచతుర్థకవిపర్యయజ్వరంబును సన్నిపాతమున జనించినను త్రిదోషములలో వాతము ప్రబలముగ నుండి యస్థిమజ్జల రెంటియందును వ్యాపించి జ్వరమును కల్గించినచో వాతికమనియు, పిత్తమధికముగనుండి జనించినయెడ పైత్తికమనియు, కఫమధికముగనుండి కల్గిన

యెడ శ్లైష్మికమనియు చెప్పబడును. ఇట్టి భేదములచే చతుర్థకవిపర్యయము మూడు తెరంగుల నుండునని భావము.)

మరియు చతుర్థక విపర్యయలక్షణము తంత్రాంతరమున నిట్లు కానంబడియెడు:—"అస్థిమజ్జోభయగతే చతుర్థకవిపర్యయః, త్ర్యహాత్ ద్వ్యహం జ్వరయతి హ్యాదావన్తే చ ముఞ్చతి." దోషము అస్థిమజ్జల రెంటియందును చేరి చతుర్థకవిపర్యయమను విషమజ్వరము కల్గును. ఈజ్వరము రెండుదినములువ్యాపించి మరుసటిదినమున లేకుండి మరల రెండుదినములు వ్యాపించును. ఇత్తెరంగున జ్వరము వ్యాపించునాటికి ముందుదినమునను జ్వరము నివర్తించిననాటికి మరుసటిదినంబునను జ్వరము లేకుండి నడుమ రెండుదినములు ఎడలేక వ్యాపించుచుండును. జ్వరము విడచినది మొదలు రెండుదినములు వ్యాప్తి లేకుండి నాల్గవనాడు మరలవ్యాపించునది చతుర్థకము. దానికి వ్యతిరేకముగ నడుమ రెండుదినములు వ్యాపించి అందుకు ముందుదినంబును, ఆదినమునకు నాల్గవదినంబును జ్వరము లేకుండుటం జేసి చతుర్థకవిపర్యయమని యన్వర్థముగ జెప్పబడినది.

సాన్నిపాతికజ్వరములయందు వాతికాదిభేదములు గలుగు కారణము.

మూ. ప్రాయశస్సన్నిపాతేన దృష్టః పఞ్చవిధో జ్వరః,
సన్నిపాతే తు యో భూయాన్ స దోషః పరికీర్తితః. 74

వ్యా. పైజెప్పబడిన సతతక-అన్యేద్యుష్క-తృతీయక-చతుర్థక-చతుర్థకవిపర్యయ జ్వరము లైదును ప్రాయికముగ త్రిదోషముల సన్నిపాతముచేత జనించును. మరియు నా త్రిదోషములలో నేది యుత్కటముగ నుండునో అట్టిదోషమును ప్రధానముగ జేసి పైజెప్పినజ్వరములయందును వాతికాదిభేదములచే వ్యవహరింపబడును. (ఇచ్చట "ప్రాయశః" అనుటచేత సతతకాదిజ్వరములు ద్విదోషాదులచే గూడ జనించునని తెలిసెడి.)

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—కొన్నిజ్వరములు ప్రారంభించునపుడు తొలుత శిరస్సున ప్రారంభమగును, కొన్ని వీపునను, మరికొన్ని పిక్కలయందును తొలుత ప్రారంభించును. ఇవి విషమారంభము. కొన్నిజ్వరములు ఒకసమయమున చలియు ఇంకొకసమయమున తాపంబు కల్గియుండును. ఇది పనులచే విషమమగును. ఒకజ్వరము పూర్వాహ్ణమునందును, వేరొకటి మధ్యాహ్నకాలమునను, ఇంకొకటి సాయంకాలమునను, లేక అర్ధరాత్రియందును వ్యాపించును. పైజెప్పినరీతిగ వ్యాపించి జ్వరము విడచి మరల మాటిమాటికిని అనుబంధముగ ఆయాకాలమున వ్యాపించుచుండును. ఈలక్షణములు కలజ్వరము

లన్నియు విషమజ్వరములని యెరుంగునది. ఈవిషయమునే వాగ్భటాచార్యు లిట్లు చెప్పెను:—"విషమో విషమారంభక్రియాకాలోఽనుషంగవాక్." విషమములగు నారంభంబును కాలంబును క్రియలును కల్గి ముక్తానుబంధముగ నుండుజ్వరము విషమజ్వరమని విషమజ్వరలక్షణము.

ఈలక్షణమునుబట్టి పైజెప్పబడిన సతతకాదిజ్వరము లైదును విషమజ్వరముతో చేరునని కొందరు చెప్పిరి. సంతతజ్వరమునందును జ్వరప్రారంభదినమునకు ఎనిమిది పదునొకండు పదుమూడు దినములలో మరల వ్యాప్తికలదని ముక్తానుబంధిత్వరూపలక్షణము కల్గియుండును కావున నదియు విషమజ్వరాంతర్భూతమనియే కొందరు చెప్పిరి. ఖరనాదుడు సంతతాదిజ్వరముల నైదిటిని చెప్పి "జ్వరాః పఞ్చ మయోక్తా యే పూర్వం సన్తతకాదయః, చత్వారస్సన్తతం హిత్వా జ్ఞేయాస్తే విషమజ్వరాః." అనువాక్యముచేత సంతతజ్వరమును విడచి తక్కిన సతతక-అన్యేద్యుష్క-తృతీయక-చతుర్థకజ్వరములు నాల్గును విషమజ్వరములని చెప్పెను. ఇత్తెరంగున విషమజ్వరభేదములలో నాయాయాచార్యులమతభేదములు కానంబడుచున్నవి. ఈతంత్రకారుడు మాత్రము సంతతజ్వరము దక్క తక్కిన సతతకాదిజ్వరములు నాల్గును, చతుర్థకవిపర్యయజ్వరంబును విషమజ్వరములని చెప్పినట్లు తోచెడి.

ఋత్వాదిబలాఽబలముచే నొకజ్వరము వేరొకటిగ మారుట.

మూ. ఋత్వహోరాత్రదోషాణాం మనసశ్చ బలాఽబలాత్,
కాలమర్థవశాచ్చైవ జ్వరః తం తం ప్రపద్యతే. 75

వ్యా. వసంతాది ఋతువులయొక్కయు, అహోరాత్రములయొక్కయు, వాతాదిదోషములయొక్కయు, మనస్సుయొక్కయు బలాఽబలమునుబట్టి పైజెప్పిన సతతకాదిజ్వరములు ఆయాజ్వరమునకు నియతమగుకాలమును వదలి వేరొండుజ్వరముయొక్క కాలమును పొంది మారియుండును. కర్మవశమున గూడ నిట్టిమార్పు కల్గును. (సతతకజ్వరము పైజెప్పిన ఋత్వాదుల బలాఽబలములచేత తనకు నియతమైనకాలమును వదలి సంతతముగ నైనను అన్యేద్యుష్కముగనైన మారి ఆయాజ్వరములకు నియతమగు కాలమున వ్యాపించును. అన్యేద్యుష్కాదులును సతతకాదిరూపముగ పరిణమించును. అట్టిమార్పునకు ఋతు-అహోరాత్ర-దోష-మనస్సులబలాఽబలమే కారణము. ఇత్తెరంగుననే పైజెప్పినకారణములచే విషమజ్వరములు మారుచుండునని భావము.)

ఇత్తెరంగున దోషకాలాది బలాఽబలములచే సంతతాది పంచవిధజ్వరభేదములు విస్తరముగ వివరింపబడినది. చతుర్థకవిపర్యయము చతుర్థకజ్వరమునకు విపద్ధలక్షణము

కావున చతుర్థకసంజ్ఞచేతనే సంగృహీతమని పంచవిధమనియే యుద్దేశమున చె
బడినది.

{ రసరక్తాద్యాశ్రయభేదముచే సప్తవిధములగు జ్వరములవివరణము, అందు రసగతజ్వరలక్షణము. }

మూ. గురుత్వం దైన్యముద్వేగః సదనం ఛర్ద్యరోచకౌ,
రసస్థితే బహిస్తాపః సాఙ్గమర్దో విజృమ్భణమ్.

వ్యా. దోషములు ప్రకుపితములై రసధాతువున జేరి జ్వరమును కల్గించిన
నాజ్వరమున శరీరము బరువుగ నుండును. మనస్సు చంచలమై దీనముగ నుండు
ఉద్వేగము కల్గును. శరీరము కృశించును. వాంతి యగును. అరోచకము సంభవించు
శరీరమున బాహ్యప్రదేశమున జ్వరసంతాపము కల్గును. శరీరమునందెల్ల నొప్పు
కల్గును. ఒడలివిరుపులును ఆవలింతలును కల్గును. (ఈలక్షణములబట్టి జ్వరము రసధా
వున కల్గినదని యెఱింగి అట్టి రసధాతువునకు హానిని కల్గనీయక యుక్తియుక్తముగ చికి
చేయవలెను. ఇత్తెఱంగుననే రక్తాదిగతజ్వరములయందును చికిత్సావిధానము నెరు
నది.)

రక్తధాతుగతజ్వరము.

మూ. రక్తోష్ణాః పిడకాః తృష్ణా సరక్తం ష్ఠీవనం ముహుః,
దాహరాగభ్రమమదప్రలాపాః రక్తసంస్థితే.

వ్యా. దోషములు ప్రకోపమునొంది రక్తధాతువున జేరి జ్వరమును కల్గించినచొ
రక్తవర్ణంబులును ఉష్ణంబులు నైన పొక్కులు శరీరముపై గల్గును. దప్పి యధికమగు
రక్తమును పలుమారుమియును. శరీరముపై మంటలును రక్తవర్ణంబును కల్గును. ఒడలు
గున ట్లుండును. తిక్కయెత్తిన ట్లుండును. అసంబద్ధముగ వదరును. (ఈలక్షణములను
జ్వరము రక్తధాతువున జనించినది యని యెఱుంగునది.)

మాంసధాతుగతజ్వరము.

మూ. అన్తర్దాహః సతృణ్మోహః సగ్లానిః సృష్టవిట్కతా,
దౌర్గన్ధ్యం గాత్రవిక్షేపః జ్వరే మాంసస్థితే భవేత్.

వ్యా. శరీరము లోభాగమున మిక్కిలి సంతాపము, దప్పి, మూర్ఛ, బడ
మలమూత్రములు అప్పుడప్పుడును పలుమారు వెడలుట, శరీరమున దుర్గంధము, కా
చేతులు మున్నగునవయవములను పలుతెఱంగుల కదలించుట, ఇవి యన్నియు మాంస
జ్వరమున గల్గులక్షణములు.

## మేదోధాతుగతజ్వరము.

మూ. స్వేదస్తీవ్రా పిపాసా చ ప్రలాపో వమ్యభీక్ష్ణశః,
స్వగన్ధస్యాఽసహత్వం చ మేదస్థే గ్లాన్యరోచకౌ. 79

వ్యా. మేదస్సు నాశ్రయించి కల్గినజ్వరమునందు శరీరముపై చెమట యధికముగ బొడమును. తీవ్రమైన దప్పి కల్గును. అసంబద్ధముగ మాటలాడును. పలుమారు వాంతి యగును. తనశరీరమున బుట్టిన దుర్గంధమును తానే సహింపనేరకుండును. బడలికయు అరోచకంబును కల్గును.

## అస్థిధాతుగతజ్వరము.

మూ. విరేకవమనే చోభే సాస్థిభేదం ప్రకూజనం,
విక్షేపణం చ గాత్రాణాం శ్వాసశ్చాఽస్థిగతే జ్వరే. 80

వ్యా. అస్థిగతమైన జ్వరము కల్గినపుడు పలుమారు వమనవిరేచనము లగుచుండును. అస్థులలో విరుగగొట్టినట్లు నొప్పి పుట్టును. మూల్గుచుండును. కరచరణాద్యవయవములను పలుదెరంగుల విదలించుచుండును. శ్వాసమధికముగ కల్గును.

## మజ్జధాతుగతజ్వరము.

మూ. హిక్కా శ్వాసస్తథా కాసః తమసశ్చాతిదర్శనం,
మర్మచ్ఛేదో వమిశ్శైత్యం దాహోఽన్తశ్చైవ మజ్జగే. 81

వ్యా. మజ్జ ధాతువునాశ్రయించి జ్వరము కల్గినప్పుడు ఎక్కిళ్లును శ్వాసంబును కాసంబును కల్గును. చీకటిలో నున్న విధముగ కన్నులు కానరాక మైగ్రమ్మును. మర్మ స్థానములయందు పగులగొట్టినవిధముగ నొప్పి పుట్టును. వాంతి యగును. శరీరముపై చల్లగనుండి శరీరాంతర్భాగమున తాపమధికమగును. (లేక శరీరమున చలిపుట్టును.)

## శుక్రధాతుగతజ్వరము.

మూ. శుక్రస్థానగతశ్శుక్రమోక్షం కృత్వా వినాశ్య చ,
ప్రాణం వాయ్వగ్నిసోమైశ్చ సార్థం గచ్ఛత్యసౌ విభుః. 82

వ్యా. సర్వశరీరమున వ్యాపించియుండు శుక్రధాతువున వాతాదిదోషములు చేరి జ్వరమును కల్గించినయెడ రోగి అట్టిశుక్రమును నిష్కారణముగనే పూర్తిగ వెడలించి నాశమునొందును. శరీరమునందలి వాయు-అగ్ని-సోమభాగములతో గూడ ప్రాణమును విడచి మృతినొందును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:— శుక్రము శరీరమం దంతటను వ్యాపించి యుండును. పాలయందు లీనముగ నెయ్యి వ్యాపించియుండువిధముగను, బెల్లము చెరకు రసమున వ్యాపించియుండురీతిని శుక్రము మనుజులశరీరమునం దెల్ల వ్యాపించి లీనముగ నుండి సంభోగకాలమున హర్షోద్రేకమునం జేసి వెడలును. కావున సర్వధాతుసారభూతమై ప్రాణమునకు ముఖ్యాధారమగును. ఈవిషయము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:— "యథా పయసి సర్పిస్తు గుడశ్చేక్షురసే యథా, శరీరేషు తథా నృణాం శుక్రం విద్యాద్భిషగ్వరః." అట్టి జీవాధారమైన శుక్రధాతువున వాతాదిప్రకోపమున జ్వరము సంభవించినపుడు అయ్యది శరీరమునందలి వాయు-అగ్ని-సోమాంశములతో గూడి పూర్తిగ కారణము లేకయే బైటవెడలును. దానంజేసి దాని నాధారముగ జేసికొని యుండు జీవకళయు బైటవెడలి, మనుజుడు ప్రాణమును గోల్పోయి మృతినెందునని పిండితార్థము.

మరియు వాతాదిదోషములు ఆయాదోషమును ప్రకోపింపజేయు మిథ్యాహార విహారాదికారణములచే ప్రకోపమునొంది జ్వరమున కాశ్రయభూతమగు సప్తధాత్వాత్మక శరీరమున జేరి జ్వరమును కల్గించును; అట్టియెడ రసరక్తాదిధాతువుల వేరువేర నాశ్రయించి జ్వరమును కల్గించునపుడు పైజెప్పినవిధముగ వేరువేరు లక్షణములు కల్గియుండును. అందును వాతికాదిజ్వరములకు ఆయాదోషానుసారముగ జెప్పినలక్షణంబులును, రసాదిధాతువులకు వేరువేర జెప్పినలక్షణంబులును కల్గియుండునని యెరుంగునది.

ఇత్తెరంగున "పునరాశ్రయభేదేన ధాతూనాం సప్తధా మతః" అని యుద్దేశించి చెప్పిన ధాత్వాశ్రయభేదముచే నేడువిధములైన జ్వరంబులును వివరింపబడినవి.

### రసాదిధాత్వాశ్రయజ్వరములలో సాధ్యాసాధ్యలక్షణములు.

మూ. రసరక్తాశ్రయస్సాధ్యః మేదోమాంసగతశ్చ యః,
అస్థిమజ్జగతః కృచ్ఛ్రః శుక్రస్థో నైవ సిధ్యతి. 83

వ్యా. రసధాతువునైనను రక్తధాతువునైనను ఆశ్రయించిన జ్వరము సాధ్యముగ నుండును. మేదస్సును, మాంసమును ఆశ్రయించినదియు సాధ్యముగనే యుండును. అస్థులను మజ్జను ఆశ్రయించినజ్వరము కృచ్ఛ్రసాధ్యము. శుక్రము నాశ్రయించి జనించిన జ్వర మెకప్పుడు సాధ్యము కానేరదు.

### కారణభేదములచే నష్టవిధములగుజ్వరముల వివరణము.

మూ. హేతుభిర్లక్షణైశ్చోక్తః పూర్వమష్టవిధో జ్వరః,
సమాసేనోపదిష్టస్య వ్యాసతశ్శ్రుణు లక్షణమ్. 84

వ్యా. పూర్వము (నిదానస్థానమున) జ్వరములు వాత-పిత్త-కఫ-ద్వంద్వ-సన్నిపాత-ఆగన్తు భేదములచే నెనిమిదివిధములుగ జెప్పి, అట్టి వాతాదిజ్వరములకు కారణములును, వానిలక్షణములును వేరువేరుగ జెప్పబడినవి. అందు నిదానస్థానమున విస్తరముగ వివరించి చెప్పిన వాతాదిజ్వరములను మాత్రము విడచి, సంగ్రహరూపముగ నిర్దేశింపబడిన ద్వంద్వ-సన్నిపాత-ఆగన్తుజ్వరములు మాత్రము ఇచ్చట స్వరూపలక్షణాదులతో విస్తరముగ వివరించి చెప్పబడును.

(నిదానస్థానమున "అష్టాభ్యః కారణేభ్యః జ్వరస్సఞ్జాయతే......అష్టమాత్కారణాత్" నిదాన - అ. ౧. సూ. ౧౯) అని వాతాదికారణభేదములచే జ్వరము ఎనిమిది విధములని చెప్పి, "తస్య నిదానపూర్వరూప-లిఙ్గ-ఉపశయ-విశేషాననువ్యాఖ్యాస్యామః" (నిదాన- అ. ౧. సూ. ౨౦) అని యుపక్రమించి ఏకదోషజములగు వాత-పిత్త-కఫ-జ్వరములు మూడు నిదానాదుల వివరణపూర్వకముగ విస్తరించి వేరువేర చెప్పబడినవి. తక్కిన ద్వాంద్విక జ్వరములు మూడును, సన్నిపాతజ్వరంబును "తత్ర యథోక్తానాం జ్వరలిఙ్గానాం మిశ్రీభావవిశేషదర్శనాత్ ద్వాంద్విక మన్యతమం జ్వరం, సాన్నిపాతికం చ విద్యాత్." అనువాక్యముచేత సంగ్రహరూపముగ నిర్దేశింపబడినవి. "అభిఘాతాభిషఙ్గా......వ్యథాపూర్వోऽష్టమో భవతి" (నిదా. అ. ౧. సూ. ౩౧) అనువాక్యముచేత నాగంతుజ్వరంబును సంక్షేపముగ నిర్దేశింపబడినవి. కావున అందు విస్తరముగ జెప్పబడిన ఏకదోషజ్వరముల మరలవివరించుట యనవసరమని మాని, సంగ్రహరూపముగ జెప్పబడిన వాతపిత్తాదిద్వాంద్విక-సాన్నిపాతిక-అభిఘాతజజ్వరములు మాత్రము వాని యవాంతరభేదములచే సవిస్తరముగ నిట వివరింపబడునని భావము.

## ద్వాంద్వికజ్వరముల వివరణము—అందు వాతపిత్తజ్వరము.

మూ. శిరోరుక్ పర్వణాం భేదః దాహో రోమ్ణాం ప్రహర్షణం,
కణ్ఠాస్యశోషో వమథుః తృష్ణా మూర్ఛా భ్రమోऽరుచిః. 85
స్వప్ననాశోऽతివాక్ జృమ్భా వాతపిత్తజ్వరాకృతిః,

వ్యా. తలనొప్పి, వ్రేళ్లు కొంకరపట్టి లాగుట, శరీరముపై మంట, రోమములు జలదరించుట (గగుర్పాటు), కుత్తుకయు నోరును ద్రవములేక యెండుట, వాంతి యగుట, దప్పి, మూర్ఛ, భ్రమము (తిరుగుచున్నచక్రమున నున్నవానివలె నొడలుతిరుగుట, లేక మతిభ్రమచే నొకవస్తువును వేరొండువస్తువుగ తలచుట), అరోచకము, నిద్రపట్టకుండుట, అధికముగ తనకిచ్చవచ్చినట్లు మాటలాడుట, ఒడలివిరుపులు (ఆవలింతలు), ఈలక్షణములన్నియు వాతపిత్తములు రెండును ప్రకోపించి కల్గిన ద్వంద్వజ్వరమున కల్గును.

## వాతకఫజ్వరము.

మూ. శీతకో గౌరవం తన్ద్రా స్తైమిత్యం పర్వణాం చ రుక్. 86
శిరోగ్రహః ప్రతిశ్యాయః కాసః స్వేదాఽప్రవర్తనం,
సన్తాపో మధ్యవేగశ్చ వాతశ్లేష్మజ్వరాకృతిః. 87

వ్యా. చలి, శరీరము మొద్దుబారియుండుట, శరీరము మంచున నుండునప్పటివలె మొద్దుబారియుండుట, కీళ్లయందు నొప్పులు, తలనొప్పి, పడిసెము, దగ్గు, ఒడలిపై చెమటబట్టకుండుట, జ్వరసంతాపము తీవ్రముగాక మధ్యవేగముగ నుండుట ఇవియన్నియు వాతకఫములచే గల్గినజ్వరమున కల్గులక్షణములు.

## శ్లేష్మపిత్తజ్వరము.

మూ. ముహుర్దాహో ముహుశ్శీతం స్వేదస్తమ్భో ముహుర్ముహుః,
మోహః కాసోఽరుచిస్తృష్ణా శ్లేష్మపిత్తప్రవర్తనమ్. 88
లిప్తతిక్తాస్యతా తన్ద్రా శ్లేష్మపిత్తజ్వరాకృతిః,

వ్యా. జ్వరసంతాపంబును చలియు మాటిమాటికి మార్చిమార్చి వ్యాపించుట మాటిమాటికిని చెమట వెడలుచును చెమట వెడలక స్తంభించుచు నుండుట మూర్ఛగ్రమ్ముట, దగ్గు, అరోచకము, దప్పి, కఫంబును పిత్తపసరును నోట వెడలుట, నోరు జిగటగను చేదుగ నుండుట, మైకము గ్రమ్ముట, ఇవి యన్నియు కఫపిత్తప్రకోపమున గల్గిన జ్వరలక్షణములు.

## సన్నిపాత జ్వరవివరణము.

మూ. ఇత్యేతే ద్వన్ద్వజాః ప్రోక్తాః; సన్నిపాతజ ఉచ్యతే. 89
సన్నిపాతజ్వరస్యోర్ధ్వం త్రయోదశవిధస్య హి,
ప్రాక్సూత్రితస్య వక్ష్యామి లక్షణం వై పృథక్ పృథక్. 90

వ్యా. ఇత్తెరంగున ద్వంద్వజ (త్రిదోషములలో రెండేసి దోషముల సంసర్గముచే బుట్టిన) జ్వరభేదములు మూడును వివరింపబడినవి; పిమ్మట సన్నిపాతమున (త్రిదోష ప్రకోపమున) బుట్టిన సన్నిపాతజ్వరము వివరింపబడును. అందును సన్నిపాతభేదములలో ద్వ్యుల్బణ-ఏకోల్బణభేదములను తొలుత వేరువేరుగ వానిలక్షణములతో జెప్పి, పిమ్మట త్రిదోషములు సమముగ ప్రకోపమునొందుటచే సంభవించు సన్నిపాతజ్వరమును చెప్పెదను. ఇత్తెరంగున సూత్రప్రాయముగ "భిన్నః కారణభేదేన పునరష్టవిధో జ్వరః" అని

నిర్దేశింపబడి అవాంతరభేదములచే పదుమూడువిధముల నుండు సన్నిపాతజ్వరముయొక్క లక్షణములు వేరువేర వివరింపబడును.

("భిన్నః కారణభేదేన పునరష్టవిధో జ్వరః" అని కారణభేదములచే జ్వరము ఎనిమిదివిధము లగునని సూత్రాత్మకముగ నిర్దేశింపబడినది. దానిని వివరణముగ తొలుత వాతాదిజ్వరములు మూడును, పిదప సంసర్గజజ్వరములు మూడును వివరింపబడినవి. పిమ్మట నేడవది యగు సన్నిపాత జ్వరముయొక్క వివరణము క్రమప్రాప్తము. సన్నిపాత జ్వరము ద్వ్యుల్బణ ఏకోల్బణాదిభేదములచే పదుమూడువిధముల నుండును. అందు ద్వ్యుల్బణ-ఏకోల్బణాదిభేదముల పండ్రెంటిని తొలుత నిరూపించి పిదప సమప్రకుపిత త్రిదోషజనితసన్నిపాత జ్వరమును వివరించెదనని ఫలితార్థము.)

**{ ద్వ్యుల్బణ ఏకోల్బణ సన్నిపాతజ్వరభేదములు పండ్రెండు అందు ద్వ్యుల్బణములవివరణము. }**

మూ. భ్రమః పిపాసా దాహశ్చ గౌరవం శిరసోఽతిరుక్,
వాతపిత్తోల్బణే విద్యాత్ లిఙ్గం మన్దకఫే జ్వరే. 91

వ్యా. (త్రిదోషములును ప్రకుపితములై సన్నిపాతజ్వరమును కల్గించును. అట్టి త్రిదోషముల నొకదోష ముత్కటముగ ప్రకోపమునొంది తక్కినదోషములు రెండును దానికన్న కొంచెము తక్కువగ ప్రకోపించి యున్నచో నయ్యది యేకోల్బణసన్నిపాత మనియు, రెండుదోషములును సమములుగ ప్రకోపమునొంది యొకదోషము మాత్రము ఆరెంటికంటె కొంచెము తక్కువగ ప్రకోపమునొంది యున్నయెడ నయ్యది ద్వ్యుల్బణ సన్నిపాతమనియు చెప్పబడును. అట్టి ప్రకోపతారతమ్యమునకు వాని ప్రకోపమునకు కారణములైన మిథ్యాహారవిహారాదుల తారతమ్యమే కారణమగును. అట్టిదోషసంసర్గ తారతమ్యముచే గల్గిన సన్నిపాతము పండ్రెండువిధములుగ నుండును.)

అంత వాతపిత్తములు రెండును అధికముగ ప్రకోపమునొంది కఫము వానిరెంటి కన్న తక్కువగ ప్రకోపమునొంది కల్గిన సన్నిపాతమున భ్రమము తిరుగుచుండు చక్రముపై నున్నవానివలె నొడలు తిరుగుచుండును, దప్పియు తాపంబును కల్గును. శరీరము బరువుగ నుండును. తలనొప్పి తీవ్రముగ నుండును.

మూ. శైత్యం కాసోఽరుచిస్తన్ద్రా పిపాసా దాహరుగ్వ్యథా,
వాతశ్లేష్మోల్బణే వ్యాధౌ లింగం పిత్తావరే విదుః. 92

వ్యా. వాతశ్లేష్మములు రెండు నధికమై పిత్తము తక్కువగ నుండుజ్వరమున చలి, దగ్గు, అరోచకము, కునికిపాటు (మైకము), అధికమైనదప్పి, సంతాపము, ఒడలినొప్పులు, వేదన ఈలక్షణములు కల్గును.

మూ. ఛర్దిః శైత్యం ముహుర్దాహః తృష్ణా మోహోఽస్థివేదనా,
మన్దవాతే వ్యవస్యన్తి లిఙ్గం పిత్తకఫోల్బణే. 93

వ్యా. పిత్తకఫములు రెండును అధికముగను వాతము తక్కువగను నుండుజ్వరమున వాంతియగును. చలియు, జ్వరమును పలుమారు మార్చిమార్చి వచ్చుచుండును. దప్పి యధికమగును. మూర్ఛ గ్రమ్మును. అస్థులయందు నొప్పిపుట్టును.

ఏకోల్బణసన్నిపాతజ్వరభేదము.

మూ. సన్ధ్యస్థిశిరసశ్శూలప్రలాపో గౌరవం భ్రమః,
వాతోల్బణే స్యాద్ద్వ్యనుగే తృష్ణే కంఠాస్యశుష్కతా. 94

వ్యా. వాత మధికమై పిత్తకఫములు రెండును తక్కువగ నుండుజ్వరమున శిరస్సునందును, అస్థిసంధులయందును పోటు బుట్టును. సంబంధము లేక మాటలాడును. శరీరము బరువుగనుండును. ఒడలు తిరుగునట్లుండును.

మూ. రక్తవిణ్మూత్రతా దాహః స్వేదస్తృట్ బలసంక్షయః,
మూర్ఛా చేతి త్రిదోషే స్యాత్ లింగం పిత్తే గరీయసి. 95

వ్యా. పిత్తము మిక్కుటముగ ప్రకోపించి దానికన్న తక్కువగ వాతకఫములుండి కల్గిన సన్నిపాతజ్వరమున మలమూత్రములు రక్తవర్ణముగ వెడలుట, తాపము, చెమట బట్టుట, దప్పి, శరీరబలము నశించుట, మూర్ఛ, ఈలక్షణములు కల్గును.

మూ. ఆలస్యారుచిహృల్లాసదాహావమ్యరతిభ్రమైః,
కఫోల్బణం సన్నిపాతం తంద్రాకాసేన చాదిశేత్. 96

వ్యా. కఫమధికమై వాతపిత్తములు రెండును తగ్గియుండు సన్నిపాతజ్వరమున అలసత, అరుచి, ఓకిరింతలు, సంతాపము, వాంతి, అన్నివిషయములయందు నిచ్ఛలేకుండుట, మైగ్రమ్ముట, కునికిపాటు, కాసము, ఈలక్షణములు కల్గును.

మూ ప్రతిశ్యా ఛర్దిరాలస్యం తన్ద్రారుచ్యగ్నిమార్దవం,
హీనవాతే పిత్తమధ్యే లిఙ్గం శ్లేష్మాధికే మతమ్. 97

వ్యా. వాతము హీనమై, పిత్తము మధ్యమమై, కఫ ముత్కటముగ ప్రకోపించి యుండు సన్నిపాతజ్వరమున పడిసెముపట్టును. వాంతి యగును. పనులయం దుత్సాహము లేకుండును. మైకము గ్రమ్మును. అరుచి పుట్టును. జఠరాగ్ని మిక్కిలి మందగించును.

మూ. హారిద్రమూత్ర నేత్రత్వం దాహ స్తృష్ణా భ్రమోఽరుచిః,
హీనవాతే మధ్యకఫే లిఙ్గం పిత్తాధికే మతమ్. 98

వ్యా. వాతము హీనముగను, కఫము మధ్యమముగను, పిత్తము అధికముగను, ప్రకోపించి కల్గిన సన్నిపాతజ్వరమునందు మూత్రము, కన్నులు పచ్చగ నుండును. అధికసంతాపము, దప్పి, చిత్తభ్రమమును కల్గును. అరోచకము పుట్టును.

మూ. శిరోరుగ్వేపథుః శ్వాసః ప్రలాపశ్ఛర్ద్యరోచకౌ,
హీనపిత్తే మధ్యకఫే లిఙ్గం స్యాన్మారుతాధికే 99

వ్యా. పిత్తము హీనముగను, కఫము మధ్యమముగను వాతమధికముగను ప్రకోపించి యుండు సన్నిపాతజ్వరమున తలనొప్పి, వడకు, శ్వాసము, అసంబద్ధప్రలాపము, వాంతి, అరోచకము ఈలక్షణములు కల్గును.

మూ. శీతకో గౌరవం తన్ద్రా ప్రలాపోఽస్థిశిరోఽతిరుక్,
హీనపిత్తే వాతమధ్యే లిఙ్గం శ్లేష్మాధికే విదుః. 100

వ్యా. పిత్తము హీనముగను, వాతము మధ్యమముగను, శ్లేష్మం బధికంబుగను ప్రకోపమునొందిన సన్నిపాతజ్వరమునందు చలిపుట్టును, శరీరము బరువుగ నుండును. మైకము గ్రమ్మును, అసంబద్ధముగ మాటలాడును. అస్థులయందును, శిరస్సునందును, అధికముగ నొప్పి బుట్టును.

మూ. శ్వాసః కాసః ప్రతిశ్యాయో ముఖశోషోఽతిపార్శ్వరుక్,
కఫహీనే పిత్తమధ్యే లిఙ్గం వాతాధికే మతమ్. 101

వ్యా. కఫము హీనముగను, పిత్తము మధ్యమముగను, వాతము అధికముగను, ప్రకోపమునొందిన సన్నిపాతజ్వరమున శ్వాసము, కాసము, పీనసము పుట్టును. నోరు తడిలేక యెండును. ఇరుప్రక్కలయందు తీవ్రమైన నొప్పి పుట్టును.

మూ. వర్చో (పర్వ) భేదోఽగ్నిదౌర్బల్యం తృష్ణా దాహోఽరుచిర్భ్రమః,
కఫహీనే వాతమధ్యే లిఙ్గం పిత్తాధికే విదుః. 102

వ్యా. కఫము హీనముగను, వాతము మధ్యమముగను, పిత్తము అధికముగను ప్రకోపించిన సన్నిపాతజ్వరమునందు మలము ద్రవము లేక ఉండలుండలుగ వెడలును.

జఠరాగ్ని బలహీనమగును. దప్పియు, అరుచియు, భ్రమంబును కల్గును. (ఇత్తెరంగున ద్వ్యుల్బణ-ఏకోల్బణ) సన్నిపాత జ్వరభేదములు పన్ద్రెండు (12)ను వివరింపబడినవి.

త్రిదోషసన్నిపాతజ్వర సామాన్యలక్షణములు.

మూ. సన్నిపాతజ్వరస్యోర్ధ్వమతో వక్ష్యామి లక్షణం,
క్షణే దాహః క్షణే శీత మస్థిసన్ధి శిరోరుజా. 103
సాస్రావే కలుషే రక్తే నిర్భుగ్నే చాపి దర్శనే,
సస్వనౌ సరుజౌ కర్ణౌ కణ్ఠశ్శూకైరివావృతః. 104
తన్ద్రా మోహః ప్రలాపశ్చ కాసః శ్వాసోఽరుచిర్భ్రమః,
పరిదగ్ధా ఖరస్పర్శా జిహ్వా స్రస్తాఙ్గతా పరమ్. 105
ష్ఠీవనం రక్తపిత్తస్య కఫేనోన్మిశ్రితస్య చ,
శిరసో లోఠనం తృష్ణా నిద్రానాశో హృది వ్యథా. 106
స్వేదమూత్రపురీషాణాం చిరాద్దర్శనమల్పశః,
కృశత్వం నాతిగాత్రాణాం ప్రతతం కణ్ఠకూజనమ్. 107
కోఠానాం శ్యావరక్తానాం మణ్డలానాం చ దర్శనమ్,
మూకత్వం స్రోతసాం పాకః గురుత్వముదరస్య చ. 108
చిరాత్పాకశ్చ దోషాణాం సన్నిపాతజ్వరాకృతిః,

వ్యా. ఇత్తెరంగున ఏకోల్బణద్వ్యుల్బణసన్నిపాతభేదముల చెప్పినపిదప త్రిదోషముల సమముగ ప్రకోపమునొందుటచే కల్గిన సన్నిపాతజ్వరలక్షణము ఈక్రింద చెప్పబడును.

అట్టి సన్నిపాతజ్వరమున క్షణకాలము జ్వరతాపంబును, క్షణకాలము చలియు, కల్గుచు మాటిమాటి కొకటి మార్చి యింకొకటి గల్గుచుండును. ఎముకలయందును, కీళ్లయందును, శిరస్సునందును నొప్పి కల్గును. కన్నులు కలకపారి యెఱ్ఱనై చోటచోట నీళ్లు కారుచు చూపు వక్రముగ నుండును. చెవులయందు అపూర్వమైన ధ్వని గల్గి పోటు బుట్టును. కుత్తుకయందు ముండ్లు గ్రుచినట్లు నసనసలాడుచుండును. కునికిపాటును, చిత్తభ్రమయును, కల్గి తనకిచ్చవచ్చినట్లు అసంబద్ధముగ మాటలాడును. దగ్గు, శ్వాసము, అరుచియు, కల్గును. చక్రముపై నుండువానివలె నొడలు తిరిగినట్లుండును. కాలినవిధముగ నల్లనై చెమ్మలేక పశ్వాదులనాలుకవలె తాకినచో గరగరలాడుచుండును. అవయవము లన్నియు సడలి బిగిచెడి జారినట్లుండును. కఫముతో కూడిన రక్తమునైనను,

పిత్తపసరుసైనను, నోట సుమియుచుండును. పరుండియున్నను శిరస్సును పలు తెరంగుల త్రిప్పుచుండును. నీళ్లు త్రాగుచున్నను దప్పి యణగక అంతకంతకు వృద్ధినందుచుండును. ఇంచుకేనియు నిదుర పట్టదు. రొమ్ములో చెప్పనలవికాని నొప్పి పుట్టును. చెమటయు, మూత్రపురీషంబులును, బైట వెడలవు. ఒకవేళ వెడలినచో చాలకాలమునకు కొంచెము కొంచెముగ వెడలును. శరీరమంతయు కొంచెము కృశించును. కంఠములో బిగ్గరగ మూల్గులు పుట్టును. కొంచెము నల్లనై రక్తవర్ణములైన దద్దురులు శరీరముపై పుట్టును. అట్టిరంగుగలపొక్కులు కల్గును. మాట హీనస్వరమై మిక్కిలి మెల్లగ మాట్లాడును. లేక మాటలే యుడుగును. నాసారంధ్రములు, చెవులు, నోరు, కన్నులు మున్నగుస్రోతస్సులు పుండగును. కడుపు మిక్కిలి స్థూలమై బరువుగ నుండును. దోషములు చిరకాలమునకు పరిపాకమునొందును. ఈలక్షణము లన్నియుఁ కల్గినదే సన్నిపాతజ్వరమని యెరుంగునది.

ఈజ్వరమున దోషము లన్నియు పూర్ణముగ శరీరమున నిండియుండుటవలన మిక్కుటముగ కార్శ్యము కల్గనేరదుకావున "కృశత్వం నాతిగాత్రాణాం" అని చెప్ప బడినది. మరియు కోఠలక్షణము భాలుకితంత్రమున ఇట్లున్నది:—"వరటీనష్టసంకాశః కణ్డూమాన్ లోహితో స్రకఫపిత్తాత్, క్షణికోత్పాదవినాశః కోఠ ఇతి నిగద్యతే తద్‌జ్ఞైః" రక్తకఫపిత్తములవలన కణుజుటీగకుట్టిన దద్దురువంటి యాకారము గల్గి, ఎఱ్ఱనై దురదకల్గి క్షణకాలమున పుట్టి మరల నశించుస్వభావముగల పొక్కులు కోఠమని యర్థము.

## సన్నిపాతజ్వరాఽసాధ్యలక్షణములు.

మూ. దోషే విబద్ధే నష్టేఽగ్నౌ సర్వసంపూర్ణలక్షణః. 109
సన్నిపాతజ్వరోఽసాధ్యః కృచ్ఛ్రసాధ్యస్తతోఽన్యథా,

వ్యా. వాతము బద్ధగించి మలమూత్రములు బయట వెడలక జఠరాగ్ని బొత్తుగ నశించి పైజెప్పబడిన సన్నిపాతజ్వరలక్షణము లన్నియు బలిష్టములై కానవచ్చినచో నట్టిసన్నిపాతజ్వరము సాధ్యము కానేరదు. అటుగాక పైజెప్పిన దానికి వ్యతిరేకముగ వాతము సంచరించి మలమూత్రములు నియమితకాలమున సరళముగ వెడలుచు జాత రాగ్ని నశించక పైజెప్పిన లక్షణములలో కొన్నిమాత్రము కల్గినచో నయ్యది కృచ్ఛ్రసాధ్య మగును. (మిక్కిలి పూనికతో యుక్తముగ చికిత్స జేసినయెడ నొకవేళ సాధింప దగియుండునని భావము.)

పైజెప్పినరీతిగ సన్నిపాతజ్వరము అసాధ్యముగను లేక కృచ్ఛ్రసాధ్యముగను అగునుగాని నొకప్పుడును సుఖసాధ్యము కానేరదని యేర్పడును. ఈవిషయమున "సన్ని

పాతో దుశ్చికిత్స్యనాం" అని సూత్రస్థానమున ఈతంత్రకారు లుపదేశించి యున్నారు. మరియు భాలుకితంత్రమున గూడ నిట్లుచెప్పబడినది:—"మృత్యునా సహ యోద్ధవ్యం సన్నిపాతం చికిత్సతా" సన్నిపాతమునకు చికిత్సజేయువైద్యుడు మృత్యువుతో పోట్లాడగలడు. అని యర్థము.

సంసర్గ-సన్నిపాతజ్వర వివరణోపసంహారము.

మూ. నిదానే త్రివిధా ప్రోక్తా యా పృథగ్జజ్వరాకృతిః. 110
సంసర్గసన్నిపాతానాం తయా (తథా) చోక్తం స్వలక్షణం,

వ్యా. నిదానస్థానమున సంసర్గసన్నిపాతలక్షణములు పాతాదిజ్వరములకు వేరువేరుగ జెప్పబడిన లక్షణములలో రెండేసి దోషముల లక్షణములు మిశ్రములుగ నున్నచో సంసర్గజజ్వరములనియు, మూడుదోషముల లక్షణములును మిశ్రములై యున్నచో సన్నిపాతజ్వరమనియు సంసర్గ - సన్నిపాతలక్షణములు "తత్ర యథోక్తానాం......సన్నిపాతం వా విద్యాత్" అనువాక్యముచేత సంగ్రహముగ నిర్దేశింపబడినవి. ఆలక్షణములే యిచ్చట ప్రకరణవశముగ మరల వివరింపబడినవి. (ఇత్తెరంగున త్రయోదశసన్నిపాతభేదములును వివరింపబడినవి.)

అష్టమముగ నిర్దేశింపబడిన యాగంతుజ్వరవివరణము
అందు ఆగంతుజ్వరభేదములు.

మూ. ఆగన్తురష్టమో యస్తు స నిర్దిష్టశ్చతుర్విధః 111
అభిఘాతాఽభిషఙ్గాభ్యాం అభిచారాఽభిశాపతః,

వ్యా. ("నిదానస్థానమున" "అభిఘాతాఽభిషఙ్గాభిచారాఽభిశాపేభ్యః ఆగన్తుర్హి వ్యథాపూర్వోఽష్టమో భవతి" (నిదాన-అ. ౧. సూ. 3౨) అని సంక్షిప్తముగ నాగంతుజ్వరము నాల్గువిధములుగ నిర్దేశింపబడినది. అట్టి నిర్దేశము ననువదించి యానాల్గిటిలక్షణములును ఈక్రింద వివరింపబడును.) అయ్యాది అభిఘాతము (కఱ్ఱలు మున్నగువానిచే దెబ్బలు తగులుట), కామక్రోధాదు లావహించుట యభిషంగము, అథర్వవేదవిధానము ననుసరించి చేయబడిన ప్రయోగాదులు అభిచారము, గురుసిద్ధాదులు కోపముచే నొసంగిన శాపము అభిశాపము. ఈనాల్గుకారణములచే జనించుటంజేసి యాగంతుజ్వరము నాల్గువిధముల నుండును.

అభిఘాతజ్వరనిదానము.

మూ. శస్త్రలోష్టకశాకాష్ఠముష్ట్యరత్నితలద్విజైః. 112
తద్విధైశ్చ హతే గాత్రే జ్వరస్స్యాదభిఘాతజః,

వ్యా. ఆయుధములు, రాళ్లు, జాటి (గుఱ్ఱము మొదలగువానిని తోలుటకైన సాధనము), కఱ్ఱలు, ముష్టి (పిడికిలి), చెయ్యి, అరచెయ్యి, దంతములు మున్నగువానిచే శరీరముపై దెబ్బలు తగులుటవలన కల్గినజ్వరము అభిఘాతజ మనబడును. (శరీరమునకు మనస్సునకు సంబంధించని బాహ్యకారణములచే జనించినది యభిఘాతజము.)

### అభిఘాతజ్వరలక్షణము.

మూ. తత్రాభిఘాతజే వాయుః ప్రాయో రక్తం ప్రదూషయన్. 113
సవ్యథాశోఫవైవర్ణ్యం కరోతి సరుజం జ్వరం,

వ్యా. అట్టి యభిఘాతముచే గల్గినజ్వరమున ప్రాయికముగ వాతము ప్రకోపించి రక్తమును చెరచి నొప్పి పోటు మున్నగుబాధను శోఫమును వివర్ణత్వమును కల్గించుచు నొప్పితో కూడ జ్వరమును కల్గించును.

### అభిషఙ్గజ్వరలక్షణము.

మూ. కామశోకభయక్రోధైః అభిషక్తస్య యో జ్వరః. 114
సోఽభిషఙ్గాత్ జ్వరో జ్ఞేయః యశ్చ భూతాభిషఙ్గజః,

వ్యా. కామము (స్త్రీవిషయకమైన యభిలాష), శోకము (ప్రీతిపాత్రమగుబంధుమిత్రాదులకైనను ధనాదులకైనను హానికల్గుటచే సంభవించు మనోవికారము), భయము, క్రోధము వీనితో సంబంధముకలవానికి సంభవించినజ్వరంబును దేవాదిభూతవిశేషముల సంబంధముచే కల్గినజ్వరంబును అభిషఙ్గజజ్వర మగును.

### కామాదిజనితాభిషంగజ్వరములయందు దోషసంబంధవివరణము.

మూ. కామశోకభయాద్వాయుః, క్రోధాత్పిత్తం త్రయో మలాః. 115
భూతాభిషఙ్గాత్ కుప్యన్తి భూతసామాన్యలక్షణాః,
భూతాధికారే వ్యాఖ్యాతం తదష్టవిధలక్షణమ్. 116

వ్యా. పైజెప్పినకారణములలో కామ-శోక-భయములను కారణములచే కల్గిన యభిషంగజ్వరముల మూటియందును వాతము ప్రకోపము నొందును. క్రోధమువలన కల్గినజ్వరమున పిత్తము ప్రకోపము నొందును. భూతావేశమున గల్గినజ్వరమున ఆయాభూతమునకు సామాన్యములైన లక్షణములు కల్గును. భూతాధికారప్రకరణమున దేవాదిభేదములచే నెనిమిదివిధములైన భూతము లావేశించినపుడు కల్గులక్షణములు వేరువేరుగ వివరింపబడినవి. అట్టి భూతములలో నేది యావహించి జ్వరము కల్గునో ఆభూతమునకు జెప్పినలక్షణములును త్రిదోషలక్షణంబులును కల్గునని భావము.

(ఉన్మాదచికిత్సితమున భూతోన్మాదమును వివరించునపుడు దేవ-ఋషి-పితృ-గంధర్వ-యక్ష-రాక్షస-బ్రహ్మరాక్షస-పిశాచములన్గ్రహముల నెనిమిది భేదములుగ జె అవి మనుజు నావహించునపుడు కల్గులక్షణములు "సౌమ్యదృష్టిం గమ్భీరమధృష్టం. పిశాచోన్మత్తం విద్యాత్" (చి. అ. ౯. సూ. ౨౦—౨౭) అనుగ్రంథముచే వే వేరుగ వివరింపబడినవి. అట్టి దేవాదిగ్రహములలో నేగ్రహ మావహించి జ్వరముకల్గి ఆజ్వరమున నాగ్రహమునకు జెప్పినలక్షణములతోగూడ వాతాదిత్రిదోషలక్షణంబులు కల్గునని "త్రయో మలాః భూతాభిషంగాత్కుప్యన్తి భూతసామాన్యలక్షణాః." అ వాక్యముచే జెప్పబడినది.)

మతాంతరమున నభిషఙ్గజ్వరకారణములు.

మూ. విషవృక్షానిలస్పర్శాత్ తథాన్యైర్విషసమ్భవైః,
అభిషక్తస్య చాప్యాహుః జ్వరమేకేఽభిషఙ్గజమ్. I
చికిత్సయా విషఘ్న్యైవ సశమం లభతే నరః,

వ్యా. విషవృక్షములయొక్కయు విషపుగాలియొక్కయు స్పర్శమువలనను, ఇ ములగు విషవస్తువులసంబంధమువలనను కల్గినజ్వరముకూడ అభిషంగజజ్వరమగుననికొం చెప్పెదరు. అట్టి జ్వరము విషహరములగు చికిత్సలచేతనే శమించును.

అభిచారాఽభిశాపజ్వరములు, వానిలక్షణములు.

మూ. అభిచారాఽభిశాపాభ్యాం సిద్ధానాం యః ప్రవర్తతే. 1
సన్నిపాతజ్వరో ఘోరః స విజ్ఞేయస్సుదుస్సహః,
సన్నిపాతజ్వరస్యోక్తం లిఙ్గం యత్తస్య తత్ స్మృతమ్. 1

వ్యా. మంత్ర-ఔషధ-తపస్సులచేతను శమదమాదిగుణవిశేషములచేతను సిద్ధుల నున్నమహనీయులచే నొసగబడిన యభిచార (హింసార్థముగ నథర్వవేదమున చెప్పబడి హోమాదివిధులచే నైనజ్వరము ఆభిచారికజ్వరము. అట్టి మహనీయులచే నొసగబ శాపమువలన గల్గినజ్వరము అభిశాపజజ్వరము. ఈకారణములచే గల్గినజ్వరమున త్రిదో ములును ప్రకోపమునొంది సన్నిపాతజ్వరమునకు జెప్పినలక్షణములు కల్గి మిక్కి క్రూరమై యోరువరానిదగును.

అభిచార-అభిచాపజ్వరముల గుర్తించువిధము.

మూ. చిత్తేన్ద్రియశరీరాణాం అర్తయోఽన్యాశ్చ నైకశః,
ప్రయోగం త్వభిచారస్య దృష్ట్వా శాపస్య చైవ హి. - 1

స్వయం శ్రుత్వాఽనుమానేన లక్ష్యతే (లక్షయేత్) ప్రశమేన వా,
వైవిధ్యాదభిచారస్య శాపస్య చ తదాత్మకే. 121
యథా కర్మప్రయోగేణ లక్షణం స్యాత్ పృథగ్విధం,

వ్యా. మరియు పైరెండుజ్వరములయందును మనస్సునకును, చక్షురాదీంద్రియములకును, శరీరమునకును పలుదెరంగులైన బాధలు కల్గును. మరియు అభిచారముయొక్కయు శాపముయొక్కయు ప్రయోగమును తాను స్వయముగ చూచియైనను ప్రామాణికుల వాక్యముల వినియైనను, విరుద్ధచికిత్సాదులచే శాంతిబొందుటచే ననుమానించి యూహించియైనను గమనించవలెను. అట్టి యభిచార-అభిశాపములు పలుదెరంగులైయుండును కావున వానివలన గల్గినజ్వరములయందు ఆయాప్రయోగమునకు దగిన ప్రత్యేకములగు కార్యములును లక్షణములును వేరువేరుగ నుండును. (కావున అట్టి లక్షణాదులబట్టి ప్రయోగశాపవిశేషముల స్వరూపమును నిర్ణయింపవలెనని భావము.)

## కామాదిజ్వరముల ప్రత్యేకలక్షణములు.

మూ. ధ్యాననిశ్శ్వాసబహుళం లిఙ్గం కామజ్వరే స్మృతమ్. 122
శోకజే బాష్పబహుళం; త్రాసప్రాయం భయజ్వరే,
క్రోధజే బహుసంరమ్భం; భూతావేశే త్వమానుషమ్. 123
మూర్ఛామోహమదగ్లానిభూయిష్ఠం విషసమ్భవే,
కేషాఞ్చిదేషాం లిఙ్గానాం సన్తాపో జాయతే పురః. 124
పశ్చాత్తుల్యం తు కేషాఞ్చిత్ ఏషు కామజ్వరాదిషు,
కామాదిజానాం ఉద్దిష్టం జ్వరాణాం యద్విశేషణమ్. 125
కామాదిజానాం రోగాణాం అన్యేషామపి తత్ స్మృతం,

వ్యా. కామముచే గల్గిన జ్వరమునందు తనకు దేనివిషయమై కామము కల్గెనో దానిసే నిరంతరముగ మనస్సున తలచుచు తలపోయుచుండును. అధికముగ నిట్టూర్పు నిగుడించును. శోకముచే గల్గినజ్వరమునం దధికముగ కన్నీళ్లు కార్చుచుండును. భయముచే గల్గినజ్వరమున కంపము మున్నగు భయలక్షణములు మెండుగనుండును. కోపముచే గల్గినజ్వరమునం దౌద్ధత్య మధికముగ నుండును. భూతావేశముచే గల్గినజ్వరమున మనుష్యుల కలవికానికార్యముల జేయుచుండును. విషానుషంగజ్వరమున మూర్ఛయు, మైకంబును, మత్తును, బడలికయు విశేషముగ నుండును. మరియు పైజెప్పిన కామాది

జ్వరములకు జెప్పిన లక్షణములలో కొన్నిటికి మునుపు జ్వరసంతాపము కల్గును. పిమ్మట తక్కిన లక్షణములు కల్గును.

మరియు పైజెప్పిన కామాదిజ్వరములకు జెప్పిన ఆయాలక్షణములు అట్టికామాదులచే గల్గిన తక్కినరోగములయందును విశేషముగ గన్పట్టును.

(ఇచ్చట కామాదిజ్వరములకు వేరువేరుగ జెప్పిన వాతాదిదోషముల లక్షణములే కాక యిచ్చట వేరువేరుగ జెప్పబడిన విశేషలక్షణములు ప్రధానముగ నుండునని యెరుంగునది)

కామాదిజ్వరముల బలభేదము.

మూ. మనస్యభిహతే పూర్వం కామాద్యైర్న తథా బలమ్. 126
జ్వరం ప్రాప్నోతి వాతాద్యైః దేహో యావన్న దుష్యతి,
దేహే చాభిహతే పూర్వం వాతాద్యైర్న తథా బలమ్. 127
జ్వరః ప్రాప్నోతి కామాద్యైః మనో యావన్న దూష్యతి,

వ్యా. పైజెప్పబడిన కామాదిజ్వరముల మనస్సంబంధములగు కామక్రోధాదులచే మనస్సునం దభిఘాతము తొలుత కల్గినయెడ శారీరదోషములగు వాతాదులచే శరీరము దుష్టము కాకమునుపు జ్వరము బలవత్తరము కానోపదు. వాతాదిశారీరదోషములచే తొలుత శరీరమునందు వ్యాప్తి కల్గినచో కామాదులచే మనసునం దభిఘాతము కల్గునంత వరకును జ్వరము బలవత్తరము కానోపదు. (ఈశ్లోకములు కొన్ని పాతప్రతులలో కానరావు).

అభిఘాతజ-దోషజ జ్వరములకు పరస్పరభేదము.

మూ. తే పూర్వం కేవలాః పశ్చాన్నిజైః వ్యామిశ్రలక్షణాః. 128
హేత్వౌషధవిశిష్టాశ్చ భవన్త్యాగన్తవో జ్వరాః,

వ్యా. అట్టి యాగంతుజ్వరములయందు తొలుత కామాది (అభిఘాత) కారణములచే గల్గుజ్వరములకు వేరువేర జెప్పినలక్షణములు మాత్రము కల్గియుండి పిదప వాతాదిసంబంధమునంజేసి యట్టి వాతాదిదోషలక్షణములతో గూడియుండును. మరియు నాగంతుజ్వరములు దోషజజ్వరములకన్న నితరములైన యభిఘాతాదికారణములచే జనించుటచేతను, వానికి చికిత్సలు పరిషేకము మంత్రములు మున్నగునవి వేరుగ నుండుట చేతను దోషజములకన్న నభిఘాతజములు భిన్నములని యెరుంగునది. (ఇత్తెరంగున "వ్యాసతో విధిభేదాచ్చ పృథగ్భిన్నస్య చాకృతిమ్" అని అధ్యాయప్రారంభమున చెప్పిన

ప్రశ్నమునకు విధిభేదవివరణమున 'ద్వివిధో విధిభేదేన......అష్టవిధో జ్వరః'' అని నిర్దేశింపబడిన జ్వరము లెనిమిదియు వివరింపబడినవి).

### సర్వజ్వరసంప్రాప్తి.

మూ. సంసృష్టాస్సన్నిపతితాః పృథగ్వా కుపితా మలాః. 129
రసాఖ్యం ధాతుమన్వేత్య పక్తిం స్థానాత్ (పక్తిస్థానాత్) నిరస్య చ,
స్వేన తేనోష్మణా చైవ కృత్వా దేహోష్మణో బలమ్. 130
స్రోతాంసి రుద్ధ్వా సమ్ప్రాప్తాః కేవలం దేహముల్బణాః,
సన్తాపమధికం దేహే జనయన్తి నరస్తదా. 131
భవత్యత్యుష్ణసర్వాఙ్గో జ్వరితస్తేన చోచ్యతే,

వ్యా. వాతాదిదోషములు రెండేసి కలిసియైనను మూడునొక్కటిగ జేరియైనను ఒక్కొకదోషము వేరువేరుగ నైన వానివానికిజెప్పిన ప్రకోపకారణములగు మిథ్యాహార విహారాదులచే ప్రకోపమునొంది, రసధాతువున జేరి, గ్రహణిస్థానమున నున్నపాచకాగ్నిని స్వస్థానమునుండి బైటవెడలించి, అట్టివాతాదిదోషములకు సహజమగు (దోషాగ్ని సంబంధమైన వేడిచేతను, పాచకాగ్నికి జేరిన వేడిచేతను, శరీరమున స్వాభావికమైన వేడికి మిక్కిలిబలము కల్గించి (వృద్ధినందించి), శరీరమునందలి మూత్రపురీషస్వేదాదులు వెడలు స్రోతోమార్గముల నడ్డగించి, శరీరమునంతెల్ల నుత్కటముగ వ్యాపించి, శరీరమునందు మిక్కుటమగు సంతాపమును (వేడిని) కల్గించును. దానంజేసి జ్వరపీడితుడు సర్వాంగములయందును మిక్కిలి యధికమైన వేడి కల్గియుండును. (ఇది సర్వజ్వరసాధారణమైన సంప్రాప్తిస్వరూపము).

ఇచ్చట పక్తిశబ్దముచేత ఆహారమును పాకమునొందించు జాఠర పాచకాగ్ని గ్రహింపబడును.

### జ్వరమున చెమటబట్టకుండుటకు కారణము.

మూ. స్రోతసాం సన్నిరుద్ధత్వాత్ స్వేదం నానాఽధిగచ్ఛతి. 132
స్వస్థానాత్ ప్రచ్యుతే చాగ్నౌ ప్రాయశస్తరుణే జ్వరే,

వ్యా. పైజెప్పినరీతిగ వాతాదిదోషములు శరీరమునందలి స్రోతోరంధ్రముల నన్నిటి నడ్డగించి యుండుటంబట్టియు జాఠరాగ్ని స్వస్థానమునుండి చలించియుండుట చేతను ప్రాయికముగ జ్వరము వ్యాపించినపుడు తరుణజ్వరమున మనుజునకు చెమటబట్టకుండును. (పాచకాగ్నియు బైటవెడలుటంజేసియు ఆహారము జీర్ణము కాకుండును.)

పైజెప్పబడిన జ్వరసంప్రాప్తి అధ్యాయప్రారంభమున సూత్రాత్మకము నిర్దేశించ కున్నను క్రమప్రాప్త సామజ్వరనిరూపణమున అరుచి అవిపాకము మున్నగు లక్షణముల జెప్పుటకై సంప్రాప్తి చెప్పబడినదని యెరుంగునది. (ఇచ్చట "ప్రాయశః" అని చెప్పుట చేత కొన్ని జ్వరములయందు విశేషముగ చెమట వెడలుననియు నెరుంగునది.)

## ఆమజ్వరలక్షణము.

మూ. అరుచిశ్చాఽవిపాకశ్చ గురుత్వముదరస్య చ. 133
హృదయస్యాఽవిశుద్ధిశ్చ తన్ద్రా చాలస్యమేవ చ,
జ్వరోఽవిసర్గీ బలవాన్ దోషాణామప్రవర్తనమ్. 134
లాలాప్రసేకో హృల్లాసః క్షున్నాశో విరసం (విశదం) ముఖం,
స్తబ్ధసుప్తగురుత్వం చ గాత్రాణాం బహుమూత్రతా. 135
న విట్ జీర్ణా న చ గ్లానిః జ్వరస్యామస్య లక్షణం,

వ్యా. (అధ్యాయప్రారంభమునందలి నిర్దేశక్రమమున "వ్యాసతో విధిభేదాచ్చ...లిఙ్గమామస్య జీర్ణస్య" అని విధిభేదానంతరము నిర్దేశింపబడిన ఆమజ్వరలక్షణము నిరూపింపబడును)—అరుచి, అవిపాకము (ఆహారము జీర్ణము గాకుండుట), ఉదరము బరువుగ నుండుట, హృదయమున పసరు మున్నగుదోషము జేరి శుద్ధముగా కుండుట, కునికిపాటు, అలసట, జ్వరమువిడుదల లేక నిరంతరముగ ననుసరించి బలిష్ఠమై యుండుట, మలసంబంధములగుదోషములు వెడలకుండుట, నోట జొల్లు కారుట, ఓకరింతలు వచ్చుట, ఆకలి లేకుండుట, నోటికి మధురాదిరసములు తెలియకయైనను లేక ఒకరసము వేరొకటిగనైన నుండుట, అవయవములు స్తంభించి స్పర్శము తెలియక బరువుగనుండుట, మూత్రము అధికముగ పలుమారు వెడలుట, పురీషము, పక్వము గాకుండుట, శరీరమున మాంసము శుష్కించకుండుట, ఇవి యన్నియు ఆమజ్వరలక్షణములు. (శరీరమునందలి రసాదిధాతుగత మలములును వాతాదిదోషంబులును పక్వములు కాకుండునంతవరకును జ్వరము ఆమమనబడును. అయ్యవి పక్వములైనపిదప పక్వ (నిరామ) జ్వరమనియు జెప్పబడును.)

## పచ్యమానజ్వరలక్షణము.

మూ. జ్వరవేగోఽధికస్తృష్ణా ప్రలాపః శ్వసనం భ్రమః. 136
మలప్రవృత్తిరుత్క్లేశః పచ్యమానస్య లక్షణం,

వ్యా. దోషములును మలములును పరిపాకావస్థ నొందుచుండుజ్వరము పచ్యమానజ్వర మనబడును. అట్టి పరిపాకావస్థనుండు జ్వరమున జ్వరవేగం బధికముగ నుండును. దప్పియు, అసంబద్ధప్రలాపంబును, శ్వాసంబును, కలుగును. ఒడలు తిరుగునట్లుండును. మలమూత్రస్వేదాదులు వెడలును. ఓకరింత లధికమగును. (ఇవి పచ్యమాన జ్వరలక్షణములు).

## నిరామ (జీర్ణ) జ్వరలక్షణము.

మూ. క్షుత్ క్షామతా లఘుత్వం చ గాత్రాణాం జ్వరమార్దవమ్. 137
దోషప్రవృత్తిరష్టాహో నిరామజ్వరలక్షణం,

వ్యా. దోషములును మలములును పక్వమై నిరామావస్థ నుండుజ్వరమున ఆకలి కల్గి శరీరము బడలి అవయవములు తేలికగా నుండును. తలనొప్పి మున్నగుబాధలుడిగి జ్వరము తీవ్రతనుడిగి స్వల్పముగ నుండును. మలమూత్రాదులు సకాలమున సరళముగ వెడలును. ఇది నిరామజ్వరలక్షణము. మరియు క్షుదాదిలక్షణములు కల్గకున్నను జ్వర ప్రారంభదినమునుండి యెనిమిది దినములు కడచిన జ్వరంబును నిరామజ్వరమనియే చెప్పబడును. క్షుదాదిలక్షణయుక్తమై యెనిమిది దినములు కడచినజ్వరంబును నిరామమే యగును. (ఇత్తెరంగున నిరామజ్వరలక్షణములు మూడు తెరంగుల నుండును.)

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—ఆకలి మున్నగు నిరామలక్షణములు ఎనిమిదినములకుముందే కల్గియున్నచో నది నిరామజ్వరమగును. కావున నట్టిసమయమున శమనరూపచికిత్స జేయ నర్హముగనుండును. ఏడుదినములును కడచినజ్వరము ఎనిమిదవ దినము మొదలుజేసి ఆకలిమున్నగు నిరామలక్షణములు కనబడక ఆమలక్షణములు అనువర్తించి యున్నను అదియే నిరామమే యగును. కావున అట్టియవస్థయందును చికిత్స జేయనగును. అందును అష్టాహప్రభృతికాలమున ఆకలిమున్నగులక్షణములు లేనియెడ దోషములు పక్వములగుటకై పాచనరూపకషాయమును త్రాగించవలెను. నిరామావస్థనున్నచో శమనరూపకషాయమును త్రాగించవలెను. ఈయభిప్రాయముచేతనే "పాచనం శమనీయం వా కషాయం పాయయేత్తు తమ్" అని అష్టాహప్రభృతికాలమున కూడ పాచనశమనరూపచికిత్సలు వికల్పముగ విధింపబడినది. ఈవివరణమునే ఖరనాదు డిట్లు చెప్పెను:—"న చ నిస్సృత్తతైవైకా నిరామజ్వరలక్షణమ్, చిరాదపి హి పచ్యన్తే సన్నిపాతజ్వరే మలాః, సప్తరాత్రాతివృత్తిం చ క్షామతాది చ లక్షణమ్, తస్మాదేతద్ద్వయం(బుద్ధ్వా) దృష్ట్వా నిరామం జ్వరమాదిశేత్."

సుశ్రుతాచార్యుడును ఎనిమిదిదినములకు ముందును నిరామలక్షణములు కానవచ్చినయెడ చికిత్స జేయదగునని యిట్లు చెప్పెను:— "అర్వాగపి చ దేయం స్యాత్

భేషజం దోషపాకతః'' మరియు నేడుదినములు గడచి నిరామలక్షణములును గానవచ్చి నచో నిశ్శంకముగ చికిత్స జేయవచ్చును. (ఇత్తెరంగున "లిఙ్గమామస్య జీర్ణస్య" అని నిర్దేశింపబడిన ఆమ-జీర్ణ జ్వరలక్షణములు చెప్పబడినవి.)

ఆమ (నవ) జ్వరమున వివర్జింపవలసినవిషయములు.

మూ. నవజ్వరే దివాస్వప్నస్నానాభ్యఙ్గాఽన్నమైథునమ్. 138
క్రోధప్రవాతవ్యాయామకషాయాంశ్చ వివర్జయేత్,

వ్యా. పైజెప్పబడిన ఆమ (నవ) జ్వరమున (జ్వరము ఆమావస్థ నుండునపుడు) పగటినిద్రయు, స్నానంబును, అభ్యంగనంబును, గురువగునాహారమును చేయుటయు, స్త్రీసంగమంబును, క్రోధంబును, ప్రబలమైనగాలిని సేవించుటయు, శరీరపరిశ్రమమును జేయుటయు, కషాయంబును వీనినన్నిటిని వదలవలెను.

"సౌషధం చ క్రియాక్రమమ్" అని నిర్దేశింపబడినక్రమము ననుసరించి ఆమ జ్వరచికిత్సాది విధానము పైగ్రంథముచే చెప్పబడును. అందు నిర్దేశక్రమమున తొలుత ఔషధము నిర్దేశింపబడినను 'సౌషధ' మనునది 'క్రియాక్రమ'మునకు విశేషణమగుట వలన నప్రధానమని తలంచి ప్రధానముగ నిర్దేశింపబడిన క్రియాక్రమము చెప్పబడును. అందును హితము కానిదానిని విసర్జించుట ప్రధానంబని త్యజించవలసిన దివాస్వప్నాదులు తొలుత చెప్పబడినవి.

ఇచ్చట అన్నశబ్దముచేత గుర్వన్నమని యర్థము. కావుననే హారీతమున నిట్లు చెప్పబడినది:—"నవజ్వరే వ్యవాయాదిప్రత్యేకం దోషకోపనమ్, గుర్వన్నభోజనాచ్చాపి విష్టమ్భో దోషకోపనమ్."

తరుణజ్వరమున లంఘనచికిత్సావిధి.

మూ. జ్వరే లఙ్ఘనమేవాదావుపదిష్టం, ఋతే జ్వరాత్. 139
క్షయాఽనిలభయక్రోధకామశోకభ్రమోద్భవాత్,

వ్యా. క్షయము (ధాతుక్షయము, లేక రాజయక్ష్మము)న కల్గినజ్వరమును, వాతము భయము క్రోధము కామము శోకము భ్రమము అను నీకారణములచే గల్గిన జ్వరంబును దక్క తక్కినజ్వరములయందు ఆమావస్థయందు తొలుత లంకణమునే చేయించవలెను.

జ్వరమున లంఘనముచే గల్గుప్రయోజనము.

మూ. లఙ్ఘనేన క్షయం నీతే దోషే సన్ధుక్షితేఽనలే. 140

విజ్వరత్వం లఘుత్వం చ క్షుచ్చైవాస్యోపజాయతే,
(లాఘవం చ శరీరస్య క్షుచ్చైవాస్యోపజాయతే)
ప్రాణాఽవిరోధినా చైనం లఙ్ఘనేనోపపాదయేత్. 141
బలాధిష్ఠానమారోగ్యం యదర్థోఽయం క్రియాక్రమః,

వ్యా. లంఘనముచే దోషములు క్షీణించి మందగించియుండు జాఠరాగ్ని రగులుకొని యున్నపుడు జ్వరము తగ్గి శరీరము చుల్కనై యాకలి పుట్టును. మరియు జ్వరపీడితునకు లంకణము చేయించునపుడు దానివలన శరీరమునందలి బలము తగ్గకయుండవలెను. చికిత్స ఆరోగ్యమునుద్దేశించి చేయబడును. అట్టిశరీరారోగ్యము బలము నాధారముగ జేసికొని యుండును. (కావున శరీరబలమును తగ్గనీయక జ్వరితునకు లంఘనరూపముగు చికిత్స జేయవలెననుట.)

తరుణజ్వరమున లంఘనాదిపాచనములు.

మూ. లఙ్ఘనం స్వేదనం కాలః యవాగ్వస్తిక్తకో రసః. 142
పాచనాన్యవిపక్వానాం దోషాణాం తరుణే జ్వరే,

వ్యా. లంకణముచేయించుట, చెమట బుట్టించుట, అష్టాహ కాలనియమము (ఎనిమిదిదినముల కాలము నిరీక్షించి యుండుట), యవాగువులు, చేదురసము, ఇవి యన్నియును తరుణజ్వరమున పక్వములుగాక యామావస్థ నుండుదోషములను పాకము జేయును.

ఆయాజ్వరములకు దగిన ఉష్ణ-శృతశీతజలపాననియమము.

మూ. తృష్యతే సలిలం చోష్ణం దద్యాద్వాతకఫాత్మజే (కే). 143
మద్యోత్థే పైత్తికే చాథ శీతలం తిక్తకైశ్శృతం,
దీపనం పాచనం చైవ జ్వరఘ్నముభయం హి తత్. 144
స్రోతసాం శోధనం బల్యం రుచిస్వేదకరం శివం,

వ్యా. వాతజ్వరమునందును, కఫజ్వరమునందును, వాతకఫజ్వరమునందును దప్పి కలిగినయెడ వేడిగనుండుజలమును త్రాగించవలెను. మద్యపానమున గల్గినజ్వరమునందును, పిత్తప్రకోపమున గల్గినజ్వరమునందును దప్పికి క్రింద చెప్పబడు ముస్తాపర్పటాదుల జేర్చి కాచబడినజలమును చల్లగ చల్లార్చి త్రాగించవలెను. పైజెప్పిన ఉష్ణజలంబును ముస్తాపర్పటాదుల జేర్చి కాచి చల్లార్చిన శీతజలంబును అగ్నిని దీపింపజేయును. ఆహారమును పచింపజేయును. జ్వరమును హరించును. స్రోతోరంధ్రముల శుద్ధములుగ జేయును.

బలమును కల్గించును. రుచిని బుట్టించి చెమట పుట్టించును. కావున పైజెప్పినజ్వరముల యందు దప్పి కల్గినప్పుడు అట్టిజలమును త్రాగించుట చాల మంచిది.

ఇచ్చట కఫపిత్తజ్వరమునకును త్రిదోష (సన్నిపాత) జ్వరమునకును పానీయము విశేషవిధిగ చెప్పియుండలేదు. అయినను విమానస్థానమున "కిన్ను ఖలు జ్వరితేభ్యః పానీయముష్ణం ప్రయచ్ఛన్తి" (విమాన. అ. ౧౩) అని యుపక్రమించి-జ్వరితస్య... పాచనార్థం పానీయముష్ణం ప్రయచ్ఛన్తి భిషజః" అని సామాన్యముగ విధింపబడిన ఉష్ణజలపానీయము నుపయోగించవలెనని యెరుంగునది.

జ్వర-పిపాసాహరముస్తాదిషడఙ్గపానీయము.

మూ. ముస్తపర్పటకోశీరచన్దనోదీచ్యనాగరైః. 145
శృతశీతం జలం దద్యాత్ పిపాసాజ్వరశాన్తయే,

వ్యా. తుంగగడ్డలు, పర్పాటకము, వట్టివేరు, శ్రీగంధము, ఏలకులు, శుంఠి ఈయారిటిని సమభాగములుగ జేర్చి (పానీయసాధనపరిభాషానుసారముగ) కాచి చల్లార్చిన జలమును దప్పికి త్రాగించినయెడ దప్పియు జ్వరంబును శమించును.

పానీయజలసంస్కారపరిభాష నిట్లెరుంగునది:—"యదప్సు శృతశీతాసు షడఙ్గాది ప్రయుజ్యతే, కర్షమాత్రం తతో దత్వా సాధయేత్ప్రస్థికోఽమ్భసి, అర్ధశృతం ప్రయోక్తవ్యం పానే పేయాదిసంవిధౌ." పానార్థమైన శృతశీతజలసంస్కారమున షడంగాది ద్రవ్యము నుపయోగించునపుడు అట్టి షడంగాదిద్రవ్యములను ఒకప్రస్థజలమున కర్షమాత్రమును జేర్చి అర్ధభాగము మిగుల కాచి వడగట్టి చల్లార్చి త్రాగించునది. ఈపరిభాష వృద్ధాచారసమ్మతమైనది.

జ్వరమున వమనౌషధ ప్రయోగార్హకాలము.

మూ. కఫప్రధానానుత్క్లిష్టాన్ దోషానామాశయస్థితాన్. 146
బుద్ధ్వా జ్వరకరాన్ కాలే వమ్యానాం వమనైర్హరేత్,

వ్యా. కఫమును ప్రధానముగ గల్గినవియు, ఓకళింతలు మున్నగువానితో గూడి గమనోన్ముఖములుగ నుండునవియునై ఆమాశయమున నుండు దోషములను పైజెప్పిన లక్షణములచే జ్వరకరములుగ చక్కగ నెరింగి యుక్తమైనకాలమున వమనకర్మకు నిషేధింపబడిన గర్భిణులు మున్నగువారు గాక తక్కిన వమనార్హులకు వారివారిప్రకృత్యాదులకు దగిన ఆయావమనద్రవ్యముల జేర్చిన యౌషధముచే వమనము జేయింపనగును. (ఇచ్చట "ఉత్క్లిష్టాన్" అని చెప్పినందువలన దోషములు స్వయముగనే గమనోన్ముఖ

ములుగ నున్నపుడే వమనము విధింపబడినది కావున ఈవమనవిధికిముందు దోషోత్క్లే-
శనమునకై జెప్పబడిన స్నేహస్వేదవిధు లనవసరములని యెరుంగునది.)

జ్వరమున అవస్థాభేదమునుబట్టి వమననిషేధము.

మూ. అనుపస్థితదోషాణాం వమనం తరుణే జ్వరే. 147
హృద్రోగం శ్వాసమానాహం మోహం చ జనయేద్భృశమ్,
(కాసం చ కురుతే భృశమ్)
సర్వదేహానుగాస్సామాః ధాతుస్థా అసునిర్హారాః. (దుఃఖనిర్హారాః)
దోషాః ఫలానామామానాం (ఫలేభ్య ఆమేభ్యః)స్వరసా ఇవ సాత్యయాః,

వ్యా. పైజెప్పబడిన "కఫప్రధానాన్ ......స్థితాన్" అనువాక్యముచేత దోషములు అనుప్రధానములై యామాశయమునసేజేరి గమనోన్ముఖంబులై యున్నపుడు వమనముచే వెడలింపనగునని చెప్పబడినది. అటుగాక దోషములు గమనోన్ముఖములు గాకున్నపుడు తరుణజ్వరమున వమనము జేయించుటకై యౌషధమును ప్రయోగించినయెడ హృద్రోగంబును శ్వాసంబును కడుపుబ్బరంబును మూర్ఛయుం గల్గును. ఏలయన— సామములైన దోషములు శరీరమునందెల్ల రసాదిధాతువులలో వ్యాపించి యున్నపుడు, పక్వములు గాకుండుఫలములనుండి స్వరసమును దీయుటకు కష్టముగనుండువిధముగ సర్వశరీరమున వ్యాపించి యామావస్థ నున్న దోషంబుల వెడలించుట కష్టసాధ్యముగ నుండును. (కావున అట్టియవస్థయందు వమనౌషధమును ప్రయోగింప దగదని భావము.)

జ్వరమున యవాగూప్రయోగము, దాన గల్గుగుణములు.

మూ. వమితం లఙ్ఘితం కాలే యవాగూభిరుపాచరేత్. 149
యథా స్వౌషధసిద్ధాభిః మణ్డపూర్వాభిరాదితః,
యావజ్జ్వరమృదూభావాత్ షడహం వా విచక్షణః. 150
తస్యాఽగ్నిర్దీప్యతే తాభిః సమిద్భిరివ పావకః,
తాశ్చ భేషజసంయోగాత్ లఘుత్వాచ్చాఽగ్నిదీపనాః. 151
వాతమూత్రపురీషాణాం దోషాణాం చాఽనులోమనాః,
స్వేదనాయ ద్రవోష్ణత్వాత్ ద్రవత్వాత్తృట్ప్రశాన్తయే. 152
ఆహారభావాత్ ప్రాణాయసరత్వాల్లాఘవాయ చ,
జ్వరఘ్నో జ్వరసాత్మ్యత్వాత్ తస్మాత్ పేయాభిరాదితః. 153

జ్వరానుపచరేద్ధీమాన్ ఋతే మద్యసముత్థితాత్,
మదాత్యయే మద్యనిత్యే గ్రీష్మే పిత్తకఫాధికే. 154
ఊర్ధ్వగే రక్తపిత్తే చ యవాగూర్న హితా జ్వరే,

వ్యా. జ్వరపీడితునకు పైజెప్పినవిధి ననుసరించి (తత్తదవస్థానుసారముగ) వమనమును లంకణమును లేక రెంటిని చేయించినపిదప నేయేజ్వరమున నేయే యౌషధము పాచనమగునో అట్టియౌషధముల జేర్చి పక్వముచేయబడిన యవాగువులను ఆహారమునకు యుక్తమైనకాలమున నాహారమునకు బదులుగ నుపయోగింపనగును. అప్పుడును తొలుత మండము నుపయోగించి పిమ్మట యవాగువుల నుపయోగింపనగును. మరియు నట్టియవాగువులను జ్వరము తీవ్రత తగ్గి మృదుత్వము నొందువరకు నుపయోగింపనగును. ఒకవేళ మృదుత్వమును జెందకున్నను ఆరుదినములవరకును తప్పక యవాగు నుపయోగింపవలెను. అట్టి యవాగువు నుపయోగించుటవలన జ్వరితునకు జఠరాగ్ని చిదుగుల నుంచుటచే నగ్ని వృద్ధినొందువిధముగ కొంచెము కొంచెముగ వృద్ధినందును.

మరియు యవాగువులు ఔషధముల జెర్చుటవలనను స్వయముగ తేలికగా జీర్ణమగుస్వభావము కల్గియుండుటవలనను జాఠరాగ్నిని దీపింపజేయును. వాతమూత్రపురీషములను దోషములను అనులోమముగ నుండునట్లు చేయును. ద్రవంబును ఉష్ణగుణంబు నగుటవలన శరీరమున చెమట పుట్టించును. ద్రవముగ నుండుటచే దప్పినణచును. ఆహారరూపం బగుటచే శరీరమునకు బలము కల్గించును. సరగుణము (వ్యాపించు స్వభావము) కల్గియుండుటచే తేలికగ జీర్ణమగును. జ్వరమునకు సాత్మ్యమగుటచే జ్వరహారమగును. ఇట్టిగుణములు కల్గియుండుటంజేసి తరుణజ్వరమున యవాగువు చాల హితముగ నుండును. కాని మద్యపానముచే గల్గిన జ్వరమునందు మాత్రము హితము కాదు కావున నుపయోగింపంజనదు.

మరియు మదాత్యయమునందును, మద్యమును నిత్యము పానముచేయుంనలవాటు కల్గినవారికిని, గ్రీష్మకాలమునందును, పిత్తకఫాధికజ్వరమునందును, ఊర్ధ్వగతరక్తపిత్తమునందును సంభవించిన జ్వరమునందు యవాగు నుపయోగింపం జనదు.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—జ్వరమున తొలుత వమనము చేయించినను దోషము చక్కగ నివర్తించక యుండునెడ నాటిదినము లంకణమును జేయించవలసియుండును. అట్టి సందర్భమున వమన-లంఘనముల రెంటిని చేసినపిదప యవాగువు నుపయోగింప దగియుండును. కావున "వమితం లఙ్ఘితం" అనుచోట వమనమునైనను లంఘనమునైనను రెంటినైనను జేసినపిదప నాహారకాలమున యవాగువు నుపయోగించుట

...తమని యర్థము. 'కాలే' అనుదానికి అన్నకాలమున నని యర్థము. ఈయర్థము ...శ్రుతమున "అన్నకాలే హితా పేయా యథాస్వం పాచనైః కృతా" అని చెప్ప ...డినది.

## జ్వరమున తర్పణవిధి.

...యా. తత్ర తర్పణమేవాగ్రే ప్రయోజ్యం (ప్రదేయం) లాజసక్తుభిః. 155
జ్వరాపహైః ఫలరసైః యుక్తం సమధుశర్కరం,

వ్యా. పైఁజెప్పఁబడిన మదాత్యయాదులచే గల్గిన జ్వరమునందు తొలుత వరి ...పేలాలసత్తుపిండియందు జ్వరహరములగు ద్రాక్షపండు దానిమ్మపండు మున్నగు ఫలముల ...సమును కలిపి అందు తేనెను చక్కెరను జేర్చి తృప్తిని (ఆప్యాయతను) కల్గించు ...మిత్త ముపయోగించవలెను. జ్వరహరములగుఫలములు తంత్రాంతరమున నిట్లు చెప్పఁబడి ...వి:—"ద్రాక్షాదాడిమఖర్జూర ప్రియాలైః సపరూషకైః, తర్పణార్థేషు కర్తవ్యం ...ర్పణం జ్వరనాశనమ్." ద్రాక్షపండు దానిమ్మపండ్లు, ఖర్జూరపుపండు, మొరళిపండ్లు, ...ట్టీతపండ్లు, ఈపండ్లను తర్పణముచేయవలసిన జ్వరములయం దుపయోగించినచో జ్వర ...రములుగ నుండునని యర్థము.

...యా. తతస్సాత్మ్యబలాపేక్షీ భోజయేజ్జీర్ణతర్పణమ్.　　　　　156
తనునా ముద్గయూషేణ జాఙ్గలానాం రసేన వా,

వ్యా. పైఁజెప్పినరీతిగ తర్పణరూపమైన లఘ్వాహారము జీర్ణమైనపిదప పలుచనైన ...ద్గయూషమునైనను జాంగలజంతువుల మాంసరసమునైనను కలిపి రోగియొక్క బల ...మును సాత్మ్యమును గమనించి తత్తదనుసారముగ భుజింపఁజేయనగును. (జ్వరమున రోగి ...లహీనస్థితి నున్నతరి వానికి జఠరాగ్నియు బలము నుడిగియుండును కావున నట్టిబలహీను ...కు తేలికయైన ముద్గయూషమును (పెసలకట్టును) కూర్చి యాహారమిడవలెను. ...గి కొంచెము బలము కల్గియుండునెడ జాఠరాగ్నియు నట్టిద యైయుండును కావున ...త్తరి కొంచెము గురుపదార్థమగు జాంగలమాంసరసమును జేర్చి యాహారమిడవలెను. ...రియు రోగి కలవాటు పైఁజెప్పిన రెంటిలో దేనియం దుండునో అద్దానిని కూర్చి ...యాహారమిడవలెను. ఈవిషయమునే "సాత్మ్య-బలాపేక్షీ భోజయేత్" అని తంత్ర ...రు లుపదేశించిరి).

## జ్వరితునకు అన్నకాలమున దంతధావనవిధి.

...యా. అన్నకాలేషు చాప్యస్మై విధేయం దన్తధావనమ్.　　　　　157
యోఽస్య వక్త్రరసస్తస్మాత్ విపరీతం ప్రియం చ యత్,

తదస్య ముఖవైశద్యం ప్రకాంక్షాం చాఽన్నపానయోః. 158
ధత్తే రసవిశేషాణాం అభిజ్ఞత్వం కరోతి యత్,
విశోధ్య ద్రుమశాఖాగ్రైః ఆస్యం ప్రక్షాళ్య చాసకృత్. 159
మస్త్విక్షురసమద్యాద్యైః యథాహారమవాప్నుయాత్,

వ్యా. మరియు రోగికి ఆహారము నిచ్చువేళకు మునుపు దంతధావనము చేయించవలెను. అయ్యది రోగినోట తత్కాలమున చేదుతీపి మున్నగు రసములతో (జ్వరస్వభావమునం జేసి) ఏరసముకల్గియుండునో దానికి విరుద్ధగుణము కల్గినరసముతో గూడినదియు, రోగికిష్టమైనదియు, నోటియందలి మలినము శుభ్రపరచి యన్నపానములయం దభిలాష పుట్టించునదియు, నోటికి మధురాదిరసముల స్వాభావికమైనరుచిని తెలుపునదియు నగు అత్తి చంద్ర మున్నగు దంతధావనసాధనములగు చెట్లపుడకలలో దేనినైన నొకదానిచే దంతధావనము చేయించవలెను. పిమ్మట సుఖోష్ణమైన నీళ్లచే నోటిని శుభ్రముగ పలుమారు కడిగి పుక్కిలించి యుమియవలెను. పిదప మీగడ, చెఱకురసము, మద్యము మున్నగువానిలో నొకదానిని నోటికి రుచిపుట్టి యాహారమునం దభిలాష కల్గుటకై తినవలెను.

## జ్వరమున కషాయవిధానము.

మూ. పాచనం శమనీయం వా కషాయం పాయయేద్భిషక్. 160
జ్వరితం షడహేఽతీతే లఘ్వన్నప్రతిభోజితం,

వ్యా. జ్వరము ప్రారంభించినదినము మొదలుజేసి యారవదినము కడచినపిదప ఏడవదినమున తేలికయైన సుఖముగ జీర్ణముకాగలయన్నమును మిక్కిలి తక్కువయైన పరిమాణముతో నాహారముచేసిన రోగికి పాచనంబును, (ఆమావస్థనుండుదోషముల పచింపజేయు), లేక శమనీయంబును (పక్వములైన దోషముల శమింపజేయు) నగు కషాయరసమును ఎనిమిదవదినమున త్రాగింపవలెను.

ఇచ్చట నీనిర్ణయము నెరుంగునది:—దోషములు పక్వములైనను కాకున్నను ఏడుదినములవరకును తరుణజ్వర మనబడును. ఈనియమము "దోషప్రవృత్తి రష్టాహో నిరామజ్వరలక్షణమ్" అనుచోట వ్యాఖ్యానమున చెప్పబడినది. అట్టి తరుణజ్వరమున దోషములు పక్వములగుటకై లంఘనము స్వేదనము మున్నగునవి విధింపబడినవి. వమన లంఘనవిధులకు పిమ్మట నాహారార్థముగ యవాగూప్రయోగము విధింపబడినది. వీని నన్నిటిని తరుణజ్వరమున విధ్యుక్తప్రకారము తత్తదవస్థావిశేషములంబట్టి యథోచితముగ

నుపచరించినచో నారుదినములకు పిమ్మట దోషములు పక్వములైనయెడ నేడవదినమున లఘ్వాహారము నిచ్చించి యెనిమిదవదినమున పక్వములైనదోషములు శమించుటకై శమన ద్రవ్యములచే సిద్ధమైన కషాయమును త్రాగింపవలెను. ఆట్టికాలమున దోషములు పక్వముగాకుండునెడ పాచనౌషధములచే సిద్ధమైన కషాయమును త్రాగింపవలెను. ఈ యభిప్రాయమునే తంత్రకారులు "పాచనం శమనీయం వా" అని రెండుపక్షములుగ నుపదేశించిరి.

## కషాయరసనిషేధము.

మూ. స్తభ్యన్తే న విపచ్యన్తే (న చ్యవన్తే చ) కుర్వన్తి విషమజ్వరమ్.
దోషా బద్ధాః కషాయేణ స్తమ్భిత్వాత్తరుణే జ్వరే
న తు కల్పనముద్దిశ్య కషాయః ప్రతిషిధ్యతే. 162
యః కషాయ(యః)కషాయస్స్యాత్ స వర్జ్యస్తరుణే జ్వరే,

వ్యా. కషాయరసము దోషముల చలించనీయక స్తంభింపజేయు స్వభావము కల్గినది. (ఈవిషయము "కషాయః స్తమ్భనశ్శీతః" (సూత్ర. అ-౨౬. శ్లో. ౮౧) అను వాక్యముచే నుపదేశింపబడినది). కావున తరుణజ్వరమునందట్టి స్తంభనస్వభావముకల కషాయరసము నుపయోగించినచో ప్రకోపము నొందిన దోషములు స్తంభింపబడి ఆయా స్థానములయందే నిరోధింపబడి (చలింపక) నిలచి పాకమునొందక యుండును. విషమ జ్వరమును కల్గించును. కావున తరుణజ్వరమున కషాయరసము నుపయోగింపంజనదు. (ఈవిషయమును హారీతమున నిట్లుపదేశించిరి:—"న కషాయం ప్రశంసన్తి నరాణాం తరుణే జ్వరే, కషాయేణాకులీభూతాః దోషాః జేతుం సుదుస్సహాః").

మరియు పైజెప్పిన కషాయనిషేధము కల్పనాభేదముచే స్వరస-కల్క-శృత-శీత-ఫాంటములని చెప్పబడిన సాంకేతితమగు కషాయము నుద్దేశించి చెప్పినది కాదు. 'రసా లవణవర్జితాః' అని లవణరస మొక్కటి దక్క తక్కిన మధురాదిరసములైదిటిచే వేరు వేర చేయబడిన మధుర-అమ్ల-తిక్త-కటు-కషాయభేదముచే వేరువేర నేర్పడిన మధుర కషాయ-అమ్లకషాయాదిభేదములచే నైదువిధములైన కషాయములలో కషాయకషాయము (కషాయరసద్రవ్యములచే చేయబడిన స్వరసాదికషాయము) తరుణజ్వరమున నిషేధింపబడినది.

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—కషాయము షడ్రసములు లవణమొక్కటి దక్క తక్కిన యైదురసములు గలద్రవ్యములచే వేరువేరుగ కల్పనచేయుటవలన మధురకషాయము, అమ్లకషాయము, కటుకషాయము, తిక్తకషాయము, కషాయకషాయము

నని కషాయము ఆయారసమునుబట్టి యైదువిధముల నుండును. ఈవిషయము సూత్రస్థాన మున "కషాయయోనయః పఞ్చ—మధురకషాయః, అమ్లకషాయః, కటుకషాయః, తిక్తకషాయః, కషాయకషాయశ్చేతి తన్త్రే సంజ్ఞా" (సూత్ర. అ. ४ సూ. ౧) అనువాక్యముచే చెప్పబడినది. అట్టి పంచవిధకషాయములు ఒక్కొకటియు స్వరసము, కల్కము, శృతము, శీతము, ఫాంటము, కషాయము ననియు కల్పనాభేదముచే నైదేసి భేదములు కల్గియుండును. ఈవిషయము "పఞ్చవిధం కషాయకల్పనమ్, ఇతి, తద్యథా:—స్వరసః, కల్కః, శృతః, శీతః, ఫాణ్టః, కషాయశ్చేతి" (సూత్ర. అ ४ సూ. ౮) వీనివివరణ మంతయు విశదముగ నచ్చటనే చెప్పబడినది.

ఇచ్చట ప్రకృతమున తరుణజ్వరమున కషాయనిషేధవచనమున కషాయశబ్దముచే సామాన్యకషాయమును గ్రహింపనగునా? లేక కల్పనాభేదమున జేరినకషాయము నిషిద్ధమా? అని సందేహము. అందు కల్పనావిశేషమున జేరినకషాయము నిషిద్ధమన్నచో షడంగపానీయము విహితమైనను అనిధానశాస్త్రమునకు విరోధించును కావున మధురాదిభేదములలో జేరిన కషాయకషాయము (కషాయరసద్రవ్యములచే సిద్ధమైన కషాయము) నిషేధింపబడినదికాని కషాయకల్పనాభేదములలో జేరిన కషాయము నిషిద్ధము కాదు. అందును మధురాదికషాయములు పూర్వపూర్వము గురుత్వము కల్గియుండునది. "తేషాం యథాపూర్వం బలాధిక్యమ్" అను వాక్యముచే నుపదేశింపబడినది. "భేషజం హ్యామదోషస్య భూయో జ్వలయతి జ్వరమ్" అను సుశ్రుతవాక్యముచే తరుణజ్వరమున భేషజరూపమైన కషాయము నిషిద్ధము. ఈవాక్యములబట్టి కషాయరసముకలద్రవ్యములచే సిద్ధమైనస్వరసకల్కాదులు నిషిద్ధములు. తిక్తరససిద్ధమగు షడంగపానీయము తరుణజ్వరమున విధింపబడినది విరుద్ధము కానేరదు.

## జ్వరమున యూషరసవిధానము.

మూ. యూషైః రసైరనమ్లైర్వా జాఙ్గలైర్వా రసైర్హితైః. 163
దశాహం యావదశ్నీయాత్ లఘ్వన్నం జ్వరశాన్తయే,

వ్యా. దానిమ్మరసము మున్నగు నమ్లరసముల జేర్చి యైనను చేర్చక యైనను సిద్ధముచేయబడిన యూషము (కట్టు)లతో నైనను, జాంగలజంతువులమాంసరసములతో నైనను చేర్పబడిన లఘుగుణముకల యన్నమును పదియవదినమువరకును మితమైన ప్రమాణముతో జ్వరము శమించుటకై తినవలెను. (ఇచ్చట జాఠరాగ్ని బలిష్ఠముగ నున్నపుడును, కఫము ప్రబలముగ నున్నపుడును యూషరసమును జేర్చి భుజింపవలె ననియు, వాతము ప్రబలముగ నున్నపుడును, బలహీనముగ నున్నపుడును మాంసరసమును

జేర్చి భుజింపవలెననియు అవస్థాభేదమునుబట్టి విధింపబడినది. రోగియొక్క సాత్మ్యమును జాఠరాగ్నిబలమునుబట్టి అమ్ల-అనమ్లభేదము చెప్పబడినది. మరియు "లఘ్వన్నం" అను చోట యెఱ్ఱవరిబియ్యము మున్నగునవి తేలికగ జీర్ణమగునుకావున వానిచే సిద్ధమైన యన్నమును మాత్రచే లఘువుగా భుజింపనగునని భావము. ఆరవదినమువరకును "షడహం వా విచక్షణః" యవాగువు ఆహారముగ విధింపబడినది కావున సప్తమదినము మొదలు పదియవదినమువరకును లఘ్వన్నభోజనము విహితమని యెరుంగునది.

జ్వరమున ఘృతపానకాలము.

మూ. అత ఊర్ధ్వం కఫే మన్దే వాతపిత్తోత్తరే జ్వరే. 164
పరిపక్వేషు దోషేషు సర్పిష్పానం యథాఽమృతం,

వ్యా. పదిదినములకు పిమ్మట కఫము మందముగను వాతపిత్తము లధికముగ నుండు జ్వరమున దోషములు పూర్తిగ పక్వములై యున్నపుడు ఘృతపానము అమృతమును బోలె మిక్కిలి హితముగ నుండును. (సకల జ్వరములయందు కాలమహిమంజేసి పది దినములకు పిమ్మట ప్రాయికముగ కఫము మందముగను వాతపిత్తములు అధికముగను ఉండును. కావున అట్టియవస్థయందు దోషములు పక్వములైయుండునెడ ఘృతపానము అమృతతుల్యమని యిచ్చట విధింపబడినది.)

జ్వరమునం దవస్థావిశేషమునుబట్టి ఘృతపాననిషేధము.

మూ. నిర్దశాహమపి జ్ఞాత్వా కఫోత్తరమలఙ్ఘితమ్. 165
న సర్పిః పాయయేద్వైద్యః కషాయైస్తముపాచరేత్,
(శమనైస్తముపాచరేత్.)

యావల్లఘుత్వాదశనం దద్యాన్మాంసరసేన చ. 166
బలం హ్యలం నిగ్రహాయ దోషాణాం బలకృచ్చ తత్,
(బలం హ్యలం దోషహరం పరం తచ్చ బలప్రదం)

వ్యా. జ్వరమున పదిదినములు కడచినపిమ్మట కూడ కఫము బలవత్తరమై లంఘిత లక్షణములు కానరాకున్నయెడ పైజెప్పిన ఘృతపానము చేయదగదు. అట్టియెడ శమన కషాయములచే రోగికి జ్వరము తీవ్రత యుడుగువరకు నుపచరించవలెను. మాంసరసమును గూర్చి యాహారము నిడవలెను. అట్టిసమయమున శరీరబలము దోషముల హరింప సమర్థ మగును. మాంసరసము శరీరబలమును కల్గించును (కావున శరీరబలకరమగు మాంసరస ముతో నాహారమిడినయెడ శరీరమునకు బలము కల్గి, దానివలన దోషములు హరించునని భావము.)

## జ్వరమున క్షీరపానయుక్తకాలము.

మూ. దాహతృష్ణాపరీతస్య వాతపిత్తోత్తరం జ్వరమ్. 167
బద్ధప్రచ్యుతదోషం వా నిరామం పయసా జయేత్,

వ్యా. తాపంబును దప్పియు కల్గినవానికి వాతపిత్తము లధికముగను మలము బద్ధకముగనైనను, లేక కొంచెముగ వెడలుచునైన నుండిన నిరామజ్వరమునందు ఆవుపాలు త్రాగించవలెను. (పురీషము బద్ధగించియుండునెడ పాలు ఆట్టి బద్ధకమును విడదీయును. మలము బద్ధకముగ కొంచెముగ వెడలుచున్నను సరళముగ వెడలించును. కావున అట్టి యవస్థయందు క్షీరపానము మిగుల హితకరము. కావుననే క్షీరగుణముల వివరించుతరి యాతంత్రకారు లిట్లు చెప్పిరి:—'అతీసారే జ్వరే దాహే...పురీషే గ్రథితే పథ్యం వాత-పిత్తవికారిణామ్" (సూత్ర. అ. ౧) అగ్ని దీపనాదిగుణములు కల్గియుండుటం జేసియు మిక్కిలి హితకరమని యెరుంగునది.)

## జ్వరితునకు వమనవిరేచనవిధి.

మూ. క్రియాభిరాభిః ప్రశమం న ప్రయాతి యదా జ్వరః. 168
అక్షీణబలమాంసాగ్నేః శమయేత్తం విరేచనైః,

వ్యా. పైజెప్పిన క్రియాక్రమము జేసినను జ్వరము బలిష్ఠమై శమింపకున్నాడు జ్వరితునకు బలంబును మాంసపుష్టియు జఠరాగ్నిబలంబును క్షీణించకుండునెడ నట్టి జ్వరితునకు వమనవిరేచనములచే నాజ్వరమును శమింపజేయనగును.

వమనవిరేచనములు క్రూరము లగుటంజేసి పైజెప్పిన క్రియాక్రమముచే జ్వరము శమించకుండునెడ అట్టియవస్థయందు వమనవిరేచనముల ప్రయోగింపవలెగాని తొలుతనే ప్రయోగింపబడదని తంత్రకారుల యభిప్రాయము. మరియు నిచ్చట విరేచనశబ్దముచే వమనవిరేచనములు రెండును గ్రహింపబడును. ఈవిషయమును కల్పస్థానమున నిట్లుపదేశించిరి:—"ఉభయం వా శరీరమలవిరేచనాత్ విరేచనసంజ్ఞాం లభతే" (కల్ప. అ. ౧. సూ. ౪.) వమనవిరేచనములు రెండును శరీరమునందలి దోషములను మలములను వెడలించునవి కావున విరేచనశబ్దవాచ్యము లగునని యర్థము.

## జ్వరముచే క్షీణించినవానికి విరేచననిషేధము, అట్టివానికి నిరూహవస్తివిధానము.

మూ. జ్వరక్షీణస్య న హితం వమనం న విరేచనమ్. 169
కామం తు పయసా తస్య నిరూహైర్వా హరేన్మలాన్,

నిరూహో బలమగ్నిం చ విజ్వరత్వం ముదం రుచిమ్. 170
పరిపక్వేషు దోషేషు ప్రయుక్తః శీఘ్రమావహేత్,

వ్యా. జ్వరముచే క్షీణించినవానికి వమనంబును విరేచనంబును హితములు కానోపవు. వానికి పాలను త్రాగించి యైనను నిరూహవస్తిప్రయోగముచే నైనను మలములను వెడలింపనగును. నిరూహవస్తి శరీరమును అగ్నిని వృద్ధినొందించును; జ్వరము నివర్తింపజేయును; సంతసమును రుచిని పుట్టించును. కావున దోషములు పూర్తిగ పక్వములైనపుడు అట్టి నిరూహవస్తిని ప్రయోగించినచో శీఘ్రముగ పైజెప్పినగుణముల గల్గించును అని భావము.

ఇచ్చట జ్వరముచే బలము మాంసము అగ్నియు క్షీణించక యుండువానికి వమన విరేచనముల చేయించవలెనని "అక్షీణబలమాంసాగ్నిః శమయేత్తం విరేచనైః" అను వాక్యముచే విధింపబడినది. జ్వరముచే క్షీణించియున్నవానికి విరేచనములు తగవనియు, క్షీరపానంబును నిరూహవస్తియు విధింపబడినవి. అందు క్షీరపానగుణములు మున్ను చెప్పబడినది కావున నిచ్చట నిరూహగుణములు వేరుగ చెప్పబడినవి.

విరేచన-వస్తిప్రయోగములకు విషయభేదముచే ప్రయోగవిధి.

మూ. పిత్తం వా కఫపిత్తం వా పిత్తాశయగతం హరేత్. 171
స్రంసనం త్రీన్ మలాన్ వస్తిః హరేత్ పక్వాశయస్థితం,

వ్యా. పిత్తాశయమున జేరిన పిత్తము నైనను కఫపిత్తములనైనను విరేచనము వెడలింపజేయును. పక్వాశయమున జేరిన వాతపిత్తకఫముల మూడిటిని వస్తి హరించును. (ఆమాశయగత కఫమును వమనము హరించునని "కఫప్రధానాన్" అని యుపక్రమించి స్థలాంతరమున జెప్పబడినది. ఇత్తెరంగున స్థానభేదముచేతను దోషభేదముచేతను విరేచన-వస్తికర్మ విధానము చెప్పబడినది).

పురాణజ్వరమున ననువాసనవస్తిప్రయోగము.

మూ. జ్వరే పురాణే సంక్షీణే కఫపిత్తే దృఢాగ్నయే. 172
రూక్షబద్ధపురీషాయ ప్రదద్యాదనువాసనం,

వ్యా. (పండ్రెండుదినములు కడచినజ్వరము పురాణజ్వరము.) పురాణజ్వరమున కఫపిత్తములు క్షీణించి జాఠరాగ్ని దృఢముగ నున్నపుడు పురీషము రూక్షముగను బద్ధముగను ఉన్నయెడ అనువాసనవస్తిని ప్రయోగింపదగును.

## జీర్ణజ్వరమున నస్యప్రయోగవిషయము.

మూ. గౌరవే శిరసశ్శూలే విబద్ధేష్విన్ద్రియేషు చ. 173
జీర్ణజ్వరే రుచికరం కుర్యాన్మూర్ధవిరేచనం,

వ్యా. జీర్ణజ్వరమున తల బరువుగను నొప్పి కల్గియు, చక్షురాదీంద్రియములు తమతమ వ్యాపారములయందు చక్కగ ప్రవర్తింపక బద్ధగించియు నున్నయెడ హితమైన శిరోవిరేచనమును (నస్యమును) ప్రయోగింపవలెను.

## జీర్ణజ్వరమున నభ్యంగాదివిధానము.

మూ. అభ్యఙ్గాంశ్చ ప్రదేహాంశ్చ పరిషేకాఽవగాహనే. 174
విభజ్య శీతోష్ణకృతం కుర్యాజ్జీర్ణే జ్వరే భిషక్,
తైరాశు ప్రశమం యాతి బహిర్మార్గగతో జ్వరః. 175
లభన్తే సుఖమఙ్గాని బలం వర్ణశ్చ వర్ధతే,

వ్యా. జీర్ణజ్వరమునందు జ్వరము శీతకృతమా ? లేక ఉష్ణకృతమా ? అనువిషయమును చక్కగ గమనించి, తత్తదనుగుణముగ విభజించి యభ్యంగనములను, ప్రదేహములను (నలుగుపిండితో నలుగుపెట్టికొనడమును), పరిషేకములను (నీళ్లచే శరీరమును తడుపుట), అవగాహస్నానమును జ్వరితునకు చేయించవలెను. (శీతకృతమైన జ్వరమునందుష్ణాభిప్రాయము కల్గును. ఉష్ణకృతమైనజ్వరమునందు శీతస్పర్శాదులయందభిలాష కల్గును. ఈవిషయము "వాతపిత్తాత్మకశ్శీతం ఉష్ణం వాతకఫాత్మకః, ఇచ్ఛత్యుభయమేతత్తు జ్వరో వ్యామిశ్రలక్షణః" అనుశ్లోకమున సౌమ్యాగ్నేయభేదవివరణమున బెప్పబడినది. అట్టియెడ శీతకృతమైన ఉష్ణాభిప్రాయము కల్గియుండును కావున తదనుగుణముగ శీతగుణాదులు కల అభ్యంగప్రదేహముల జేయవలెననియు, ఉష్ణకృతజ్వరమున శీతాభిప్రాయము కల్గియుండును కావున శీతస్పర్శాదివిశిష్టములగు నభ్యంగప్రదేహాదుల జేయవలెననియు నుద్దేశించి 'విభజ్య శీతోష్ణకృతం' అని చెప్పబడినది.)

అట్టి యభ్యంగాదులవలన బహిర్మార్గమున జేరిన జ్వరము శమించును. అవయవములకు సుఖము కల్గును. శరీరబలంబును వర్ణంబును వృద్ధినందును. (నస్యప్రయోగమువరకు జెప్పిన క్రియాక్రమము అంతఃపరిమార్జనరూపము. పైజెప్పబడిన అభ్యంగప్రదేహాదులు బహిఃపరిమార్జనము).

## జీర్ణజ్వరమున ధూపన-అఞ్జనప్రయోగము.

మూ. ధూపనాఽఞ్జనయోగైశ్చ యాన్తి జీర్ణజ్వరాశ్శమమ్. 176
త్వఙ్మాత్రశేషా యేషాం చ భవత్యాగన్తురన్వయః,

వ్యా. ఆంగతుకారణమున జనించి రక్తాదిధాతువుల వదలి త్వక్కును (చర్మమును) మాత్రము శేషించియుండు జీర్ణజ్వరములు ధూపనము (పొగబట్టుట), అంజనము, ఈ రెండు ప్రయోగములచేత శమించును.

మూ. ఇతి క్రియాక్రమస్సిద్ధో జ్వరఘ్నస్సమ్ప్రకాశితః. 177
యేషాం త్వేష క్రమస్తాని ద్రవ్యాణ్యూర్ధ్వమతః శ్రుణు,

వ్యా. ఇత్తెరంగున జ్వరహారంబును సిద్ధంబును (ఫలవంతమును) నగు క్రియాక్రమము (చికిత్సాప్రణాళిక) చక్కఁగ వివరించి చెప్పబడినది. పైఁజెప్పిన క్రియాక్రమమునకు యవాగువు యూషమున్నగు వాని కుపయోగింపదగిన ద్రవ్యముల నీక్రింద వివరించెద వినుము.

మూ. రక్తశాల్యాదయః శస్తాః పురాణాష్షష్టికైస్సహ. 178
(రక్తశాల్యాదయశ్శస్తాః శాలయష్షష్టికైస్సహా)
యవాగ్వోదనలాజార్థే జ్వరితానాం జ్వరాపహాః,

వ్యా. జ్వరపీడితులకు పైఁజెప్పిన క్రమమున యవాగువు, అన్నము, పేలాలు, ఈమూఁవిధములగు నాహారముల సిద్ధము జేయుటకై ఎఱ్ఱవరిధాన్యంబును అరువదినాళ్ల సంబావులు మున్నగునవియు ప్రాతవిగనుండునవి జ్వరహారంబులై చాల ప్రశస్తములుగ నుండును. (సూత్రస్థానమున "శూకధాన్యం శమీధాన్యం సమాతీతం ప్రశస్యతే" (సూ. అ. ౨౭) అని చెప్పియుండుటచే ప్రాతవియే ప్రశస్తములని తెలియుచున్నవి. అయినను పొరబాటుచేనైనను క్రొత్తవి యుపయోగింప దగదని నిర్ణయించుటకై యిచ్చట "పురాణాః" అని మరల నియమింపబడినది.)

జ్వరమునం దుపయోగింపదగిన పది యవాగువులు.

మూ. లాజపేయాం సుఖజరాం పిప్పలీనాగరైః శృతామ్. 179
పిబేజ్జ్వరీ జ్వరహరాం క్షుద్వానల్పాగ్నిరాదితః,
అమ్లాఽభిలాషీ తామేవ దాడిమామ్లాం సనాగరామ్ 180
సృష్టవిట్ పైత్తికో వాథ శీతాం మధుయుతాం పిబేత్,
పేయాం వా రక్తశాలీనాం పార్శ్వవస్తిశిరోరుజి. 181
శ్వదంష్ట్రాకణ్టకారిభ్యాం సిద్ధాం జ్వరహరాం పిబేత్,
జ్వరాతిసారీ పేయాం వా పిబేత్సామ్లాం శృతాం నరః. 182

పృశ్నిపర్ణీబలాబిల్వనాగరోత్పలధాన్యకైః,
శృతాం విదారిగన్ధాద్యైః దీపనీం స్వేదనీం నరః. 183
కాసీ శ్వాసీ చ హిక్కీ చ యవాగూం జ్వరితః పిబేత్,
విబద్ధవర్చస్సయవాం పిప్పల్యామలకైః శృతామ్. 184
సర్పిష్మతీం పిబేత్పేయాం జ్వరీ దోషానులోమనీం,
కోష్ఠే విబద్ధే సరుజి పిబేత్పేయాం శృతాం జ్వరీ. 185
మృద్వీకాపిప్పలీమూలచవ్యామలకనాగరైః,
పిబేత్సబిల్వాం పేయాం వా జ్వరే సపరికర్తికే. 186
బలావృక్షామ్లకోలామ్లకలశీధావనీశృతాం,
అస్వేదనిద్రః తృష్ణార్తః పిబేత్పేయాం సశర్కరామ్. 187
నాగరామలకైస్సిద్ధాం ఘృతభృష్టాం జ్వరాపహాం,

వ్యా. 1. పేలాలను, పిప్పళ్లను, శుంఠిని చేర్చి కాచబడిన పేయయను జావను జ్వరపీడితుడు ఆకలి కల్గి అగ్ని మందగించి యున్నచో త్రాగవలెను.

2. జ్వరితుడు పురీషము వెడలుచుండి పులుపునం దభిలాష కల్గియున్నచో పైజెప్పిన లాజపేయయను జావను దానిమ్మపండ్లరసమును శుంఠిని కూడ చేర్చి పక్వము చేసి త్రాగించవలెను.

3. పిత్తము అధికముగనున్నచో ఆట్టి లాజపేయనే చల్లార్చి యందు తేనె చేర్చి త్రాగవలెను.

4. జ్వరితునకు ఇరుప్రక్కలయందును వస్తియందును శిరస్సునందును పోటు కల్గియుండునెడ ఎఱ్ఱవరిబియ్యము ములకవ్రేళ్లను వాకుడువ్రేళ్లను చేర్చి సిద్ధముచేయబడిన పేయ (జావ)ను త్రాగవలెను.

5. జ్వరముచే నతిసారము కల్గిన జ్వరితునకు కోలపొన్న, చిట్టాముట్టి, బిల్వపట్ట, శుంఠి, నల్లకలువలు, దనియాలు వీనిని చేర్చి దానిమ్మరసము కలిపి కాచబడిన పేయను త్రాగించవలెను.

6. జ్వరితునకు కాసశ్వాసములు, ఎక్కిళ్లు కల్గియున్నయెడ విదారిగంధాది హ్రస్వపంచమూలములను (ముయ్యాకుపొన్న, కోలపొన్న, ములక, వాకుడు, పల్లేరు వీనివ్రేళ్లు) చేర్చి కాచబడిన యవాగువును త్రాగించవలెను. ఈయవాగువు అగ్నిని దీపింపజేసి చెమట పట్టించును.

7. జ్వరితుడు మలబద్ధము కల్గియుండునెడ యవలు, పిప్పళ్లు, ఉసిరికకాయలు, వీనిని చేర్చి కాచబడిన యవాగువును నెయ్యి చేర్చి త్రాగవలెను. ఇయ్యది దోషములను అనులోమముగ వెడలించును.

8. కోష్ఠము బద్ధకమై నొప్పికల్గియుండు జ్వరితునకు ద్రాక్షపండు, పిప్పలీమూలము (మోడి), చవ్యము, ఉసిరికకాయలు, శుంఠి, వీనిని చేర్చి కాచబడిన పేయను త్రాగించవలెను.

9. జ్వరమునందు పక్వాశయములో కత్తిరింపబడినవిధముగ బాధకల్గియున్నయెడ బిల్వపట్ట, చిట్టాముట్టి, వృక్షామ్లము (చింతపండు), రేగుపండు, పులుపు, కోలపొన్న, వాపుడు, వీనిని చేర్చి కాచబడిన పేయను త్రాగించవలెను.

10. జ్వరితునకు చెమటయు నిద్రయు బట్టక దప్పిచే బాధపడుచున్నపుడు శుంఠి, ఉసిరికకాయలు, వీనిని చేర్చి కాచబడిన పేయను చక్కెరచేర్చి నేతితో తిరుగబోతపెట్టి త్రాగవలెను. (ఇత్తెరంగున పదివిధములుగ జెప్పబడిన యవాగూ భేదములను జ్వరమునందు యుక్తియుక్తముగ నాహారమునకై యుపయోగింపనగును.)

యవాగూపరికల్పనవిధానము:—మండమనియు, పేయయనియు, విలేపియనియు యవాగువు మూడువిధములు. అందు మెతుకులు లేకుండ కాచబడినగంజి మండము. కొంచెము మెతుకు లుండునట్లు కాచబడినది పేయ. మెతుకు లధికముగ నుండునట్లు కాచబడినది యవాగువు. పలుచగ మెతుకులుండునట్లు కాచబడినది విలేపి. ఈవివరణము తంత్రాంతరమున నిట్లున్నది:—"యవాగూ స్త్రివిధా మండః పేయా చాపి విలేప్యపి, సిక్థకైః రహితో మణ్డః పేయా సిక్థసమన్వితా. యవాగూర్బహుసిక్థా స్యాత్ విలేపీ విరళద్రవా." మరియు నీనాల్గువిధములగు యవాగ్వాదులును క్వాథము చేర్చి పక్వము చేయుటచేతను, కల్కము చేర్చి పక్వముచేయుటచేతను వేరువేర రెండేసిభేదములు కల్గియుండును. ఈవిషయము:—"ద్వివిధం క్వాథకల్కాభ్యాం యవాగ్వాదేస్తు సాధనమ్." అని తంత్రాంతరమున జెప్పబడినది.

మరియు క్వాథకల్కములచే యవాగూసాధన మిట్లు తంత్రాంతరమున చెప్పబడినది:—"క్వాథ్యద్రవ్యాఞ్జలిం క్షుణ్ణం శ్రపయిత్వా జలాఢకే, పాదశేషేణ తేనాథ యవాగూరుపకల్పయేత్. కర్షార్థం వా కణా శుణ్ఠ్యోః కల్కద్రవ్యస్య వా పలమ్, వినీయం పాచయేద్యుక్త్యా వారిప్రస్థేన చాఽపరామ్." ఒక అంజలి (నాల్గుపలముల) పరిమితమగు క్వాథ్యద్రవ్యమున నొక ఆఢకము (అరువదినాల్గుపలముల) పరిమితమైన జలము పోసి నాల్గవపాలు మిగులకాచి యాక్వాథముచేత యవాగువును పక్వముచేయు

నది. ఇది క్వాథసిద్ధయవాగూవిధానము. మరియు ఒకప్రస్థపరిమిత జలమున పిప్పలిని శుంఠిని అర్ధకర్షమును కల్కముగ జేర్చి, ఇతర కల్కద్రవ్యమును ఒకపలమును జేర్చి కల్కసాధ్యయవాగువును కాచవలెను. (ఇచ్చట శుంఠియు పిప్పలియు కల్కముగ జేర్చవలెననియు ఇతరకల్కద్రవ్యముల నొకపలము జేర్చవలెననియు నెరుంగునది.)

జ్వరమున యూషముల కుపయోగింపదగిన పప్పుదినుసులు.

మూ. ముద్గాన్ మసూరాంశ్చణకాన్ కులుత్థాన్ సమకుష్ఠకాన్. 188
యూషార్థే సూపసాత్మ్యానాం జ్వరితానాం ప్రదాపయేత్,

వ్యా. పెసలు, చిరుసెనగలు, సెనగలు, ఉలవలు, అడవిపెసలు, ఈపప్పులను పప్పు అలవాటుగ నుండువారికి కట్టుల (పెసరగంజి మున్నగునవి) జేయుటకై యుపయోగింపనగును. (ఇవియే యూషము లనబడును. జ్వరపీడితులై పప్పునుపయోగించు అలవాటుకలవారి కివి చాల ప్రశస్తములు.) యూషకల్పనమును యవాగువులకు జెప్పిన పరిభాషవిధిప్రకారము నెరుంగునది.

జ్వరమున హితకరములగు శాకములు.

మూ. పటోలపత్రం సఫలం కులకం పాపచేలికమ్. 189
కర్కోటకం కటిల్లం చ విద్యాచ్ఛాకం జ్వరే హితం,

వ్యా. పొట్ల ఆకు, పొట్లకాయ, చేదుపొట్ల, చిరుబొద్ది, ఆకాకరకాయ, ఎఱ్ఱగలిజేరు, ఇవి యన్నియు కూరలజేయుట జ్వరమున మిక్కిలి హితముగ నుండును.

జ్వరమున మాంసరసోపయోగము.

మూ. లావాన్ కపిఞ్జలానేణాన్ చకోరాన్ ఉపచక్రకాన్. 190
కురఙ్గాన్ కాలపుచ్ఛాంశ్చ హారిణాన్ పృషతాన్ శశాన్,
ప్రదద్యాన్మాంససాత్మ్యాయ జ్వరితాయ జ్వరాఽపహాన్. 191
ఈషదమ్లాననమ్లాన్వా రసాన్ కాలే విచక్షణః,
కుక్కుటాంశ్చ మయూరాంశ్చ తిత్తిరిక్రౌఞ్చవర్తకాన్. 192
గురూష్ణత్వాన్న శంసన్తి జ్వరే కేచిచ్చికిత్సకాః,
లఙ్ఘనేనాఽనిలబలం జ్వరే యద్యధికం భవేత్. 193
భిషఙ్మాత్రావికల్పజ్ఞో దద్యాత్తానపి కాలవిత్,

వ్యా. లావుకపిట్టలు, కపింజలము, ఇఱ్ఱి, చకోరపక్షి, చక్రవాకము, లేడి, కాలపుచ్ఛము (నల్లని తోకకల జింక), ఎఱ్ఱనిజింక, పొడలదుప్పి, కుందేలు, కోడి నెమిలి,

తీతుకపిట్ట, క్రౌంచపక్షి, వెలిచెపిట్ట, వీనిమాంసరసములను కొంచెముగ పులుపు చేర్చియైనను చేర్చకయైనను మాంస మలవాటున నున్నజ్వరితున కుపయోగింపవలెను. మరియు వీనిమాంసరసములు గురుత్వంబును ఉష్ణవీర్యంబును కల్గినవి యగుటంజేసి జ్వరమునందు వాని నుపయోగించుట ప్రశస్తము కాదని కొందరు చికిత్సకులు చెప్పిరి. మరియు లంఘనముచే జ్వరమున వాతను ప్రబలముగ నున్నచో మాత్రావిభాగమును కాలోచితముగ గల్పింప జ్ఞానముకలవైద్యుడు అగ్నిబలానుసారముగ తగుపరిమాణము కల్పించి కాలానుగుణముగ నుపయోగింపనగును.

## జ్వరితున కుష్ణజలానుపానము.

మూ. ఘర్మాంబు చాఽనుపానార్థం తృషితాయ ప్రదాపయేత్. 194
మద్యం వా మద్యసాత్మ్యాయ యథాదోషం యథాబలం,

వ్యా. ఆహారమును భుజించునపుడు జ్వరితునకు దప్పి కల్గినచో అనుపానమునకై కొంచెము వేడిగ నున్నజలము నియ్యవలెను. మద్యపాన మలవాటుకలవానికి మద్యమును రోగియొక్క బలమును దోషమును చక్కగ గమనించి తదనుగుణముగ పానమునకై యుపయోగింపనగును. (ఈవిషయమునే తంత్రాంతరమున నిట్లు చెప్పిరి:—"జ్వరే పిబేదనుష్ణాంబు మద్యసాత్మ్యస్తు యో భవేత్, తస్మై దోషబలం దృష్ట్వా యుక్త్యా మద్యం విధీయతే.")

## తరుణజ్వరమున వర్జింపవలసిన యాహారాదులు.

మూ. గుర్వూష్ణస్నిగ్ధమధురాన్ కషాయాంశ్చ నవజ్వరే. 195
ఆహారాన్ దోషపక్త్యర్థం ప్రాయశః పరివర్జయేత్,
అన్నపానక్రమస్సిద్ధో జ్వరఘ్నస్సంప్రకాశితః. 196

వ్యా. గురుత్వంబును ఉష్ణంబును కల్గినవియు, స్నిగ్ధంబులును, మధురంబులును నగు కషాయములను ఆహారములను తరుణజ్వరమున నుపయోగింపం జనదు. అట్టి నవజ్వరమున దోషములు ఆమావస్థ నుండును కావున గుర్వూష్ణాది కషాయాహారములు ఆమదోషముల మరింత దుష్టములుగ జేయును. కావున అట్టిదోషములు పక్వములగుటకై వానిని వర్జించవలెనని భావము. ఇత్తెరంగున జ్వరహరమగు నన్నపానక్రమము విశదముగ జెప్పబడినది.

## జ్వరహారకషాయయోగములు.

మూ. అత ఊర్ధ్వం ప్రవక్ష్యన్తే కషాయాః జ్వరనాశనాః,
పాక్యం శీతకషాయం వా ముస్తపర్పటకం పిబేత్. 197

సనాగరం పర్పటకం పిబేద్వా సదురాలభం,
కిరాతతిక్తకం ముస్తం గుడూచీం విశ్వభేషజమ్. 198
పాఠాముశీరం సోదీచ్యం పిబేద్వా జ్వరశాంతయే,
జ్వరఘ్నాః దీపనాశ్చైతే కషాయాః దోషపాచనాః. 199
తృష్ణాఽరుచిప్రశమనాః ముఖవైరస్యనాశనాః,

వ్యా. ఇంతదనుక ఫలపంతమగు నన్నపానక్రమము చెప్పబడినది. పిమ్మట నీక్రింద జ్వరహరములగు కషాయములు వివరింపబడును.—

తుంగగడ్డలను పర్పాటకమును చేర్చి క్వాథమునైనను శీతకషాయమునైనను విధ్యుక్తప్రకారము సిద్ధముచేసి జ్వరమునందు త్రాగవలెను. అదేవిధముగ శుంఠిని పర్పాటకమును చేర్చియైనను; దూలగొండిని చేర్చియైనను: నేలవేమును, తుంగగడ్డలను, తిప్పతీగెను, శుంఠిని చేర్చియైనను, చిరుబొద్దిని, వట్టివేరును, కురువేరును చేర్చియైనను పైజెప్పినరీతిగ క్వాథమునైనను శీతకషాయమునైనను సిద్ధముచేసి త్రాగినచో జ్వరమును హరించును. పైజెప్పినకషాయయోగము లైదును జ్వరమును హరించును. అగ్నిని దీపింపజేయును. ఆనుములుగ నుండుదోషముల పక్వముజేయును. దప్పిని అరుచిని పోగొట్టి నోటికి కల్గిన వైరస్యమును (మధురాదిరసముల నెరుంగకుండుటను) హరించును.

ఇచ్చట నేలవేము మున్నగునవి యేడును గల కషాయయోగము ఒకటిగజేసి కఫపిత్తజ్వరమున నుపయోగింప దగునని జతూకర్ణతంత్రమున నిట్లు చెప్పబడినది:— "భూనిమ్బఘనగుడూచీ శుణ్ఠ్యుదీచ్యోశీరాహ్వయ పాఠాః."

మరియు క్వాథకల్పనమున జలాదిపరిమాణమును పరిభాషానుసారముగ నిర్ణయించునది. పరిభాష యొద్దియనః—"పానీయం షోడశగుణం క్షుణ్ణే ద్రవ్యపలం క్షిపేత్, మృత్పాత్రే క్వాథయేత్ గ్రాహ్యమష్టమాంశావశేషితమ్. కర్షాదౌ తు పలం యావత్ దద్యాత్ షోడశికం జలమ్, తతస్తు కుడపం యావత్ తోయమష్టగుణం క్షిపేత్. చతుర్గుణమతశ్చోర్ధ్వం యావత్ ప్రస్థాదికం జలమ్, తజ్జలం పాయయేద్ధీమాన్ కోష్ణం మృద్వగ్నిసాధితమ్." కషాయమునకు జేర్పవలసిన ద్రవ్యమొకపలమును చక్కగ నలియకొట్టి మంటికుండలో వైచి యాద్రవ్యమునకు పదునారింతలు నీళ్లు పోసి యెనిమిదవపాలు మిగులునట్లు మృద్వగ్నిచే కాచునచో నయ్యది క్వాథమనబడును. మరియు కర్షప్రమాణము మొదలు పలప్రమాణమువరకును క్వాథ్యద్రవ్యమును జేర్చునెడ నా ద్రవ్యమునకు పదునారింతలు నీళ్లు చేర్పనగును. పలము మొదలుజేసి కుడవమువరకుంగల

పరిమితముగ క్వాథ్యద్రవ్యమును జేర్చునెడ నెనిమిదింతల నీళ్లు పోయనగును. కుడవము మొదలు ప్రస్థమునకు లోనగు పరిమితిగల క్వాథ్యమును జేర్చునెడ దానికి నాల్గింతల నీళ్లు చేర్పనగును. ఇత్తెరంగున క్వాథ్యమును జలమును జేర్చి సూక్ష్మాగ్నిచే పక్వము జేసి యాకషాయమును సుఖోష్ణముగ నుండునపుడు త్రాగవలెను. అని యర్థము.

శీతకషాయకల్పనాపరిభాష సూత్రస్థానమున నిట్లు చెప్పబడినది:—"ద్రవ్యాదాపోథితాత్తోయే ప్రతప్తే నిశి సంస్థితాత్, యః కషాయోఽభినిర్యాతి స శీతః సముదాహృతః" (సూత్ర. అ. ౪) కషాయమున జేర్పదగిన ద్రవ్యమును నలియగొట్టి సలసల కాగిన వేడినీళ్లలో వేసి రాత్రియంతయు ఊరినచో దానినుండి వెడలురసము శీతకషాయ మనబడును. మరియుఁ ద్రవ్యజలపరిమాణము తంత్రాంతరమున నిట్లున్నది:—"షడ్భిః పలైశ్చతుర్భిర్వా సలిలాత్ శీతఫాణ్టయోః, ఆప్లుతం భేషజపలం రసాఖ్యాయాం పలద్వయమ్." ఒకపలముపరిమాణముకల కషాయద్రవ్యమును నలియకొట్టి అందు ఆరు పలములనీళ్లు బోసిన శీతకషాయమగును. నాల్గుపలముల నీళ్లు ఫాంటమున జేర్పనగునని భావము. ఈవిషయమే పరిభాషయం దిట్లు చెప్పబడినది:—"క్షుణ్ణం ద్రవ్యపలం సమ్యక్ షడ్భిః నీరపలైః ప్లుతమ్, నిశోషితం హిమ స్సస్యాత్ తథా శీతకషాయకః. తస్య మానం మతం పానే పలద్వయమితం బుధైః" ఈశీతకషాయము రెండుపలములు త్రాగనగునని పానపరిమాణము చెప్పబడినది.

మరియు కషాయపానపరిమాణ మిట్లు చెప్పబడినది:—"మాత్రోత్తమా పలేన స్యాత్ త్రిభిరక్షైస్తు మధ్యమా, జఘన్యా తు పలార్థేన స్నేహక్వాథౌషధేషు చ." కషాయమును త్రాగుటకు ఒకపల ముత్తమమాత్ర యనియు, ముక్కాలుపలము మధ్యమమాత్ర యనియు, కాలుపలము అధమమాత్ర యనియుఁ నర్థము. మరియు క్వాథ్యద్రవ్యముల మృదుకాఠిన్యాదిభేదములను బట్టి జలపరిమాణము పరిభాషయందు విపులముగ జెప్పబడినది. విస్తరభీతిచే నిట వివరింపబడదయ్యె. పైజెప్పిన కషాయకల్పనాపద్ధతిని విశేషవిధిలేని కషాయయోగసామాన్యముగ నెరుంగునది.

## సంతతాది విషమజ్వరపంచకమునకు కషాయపంచకము.

మూ. కలిఙ్గకాః పటోలస్య పత్రం కటుకరోహిణీ. 200
పటోలః సారివా ముస్తం పాఠా కటుకరోహిణీ,
నిమ్బః పటోలః త్రిఫలా మృద్వీకా ముస్తవత్సకౌ. 201
కిరాతతిక్తమమృతా చందనం విశ్వభేషజం,
గుడూచ్యామలకం ముస్తం అర్ధశ్లోకసమాపనాః. 202

కషాయాశ్శమయన్త్యాశు పఞ్చపఞ్చవిధాన్ జ్వరాన్,
సన్తతం సతతాన్యేద్యు స్తృతీయకచతుర్థకాన్. 203

వ్యా. 1. పటిపుచ్చకాయ, చేదుపొట్ల ఆకు, కటుకరోహిణి ఈమూడిటి కషాయము సంతతజ్వరమును శీఘ్రముగ శమింపజేయును.

2. చేదుపొట్ల, సుగంధపాలవేరు, తుంగగడ్డలు, చిరుబొద్ది, కటుకరోహిణి, ఈయైదిటిని చేర్చి సిద్ధముచేయబడిన కషాయము సతతకజ్వరమును శమింపజేయును.

3. వేపపట్ట, చేదుపొట్ల, త్రిఫలములు (కరక-తాడి-ఉసిరికలు), ద్రాక్షపండు, తుంగగడ్డలు, కొడిసెపాల, ఈయారిటి చేర్చి కాచబడినకషాయము అన్యేద్యుష్కజ్వరమును హరించును.

4. నేలవేము, తిప్పతీగె, శ్రీచందనము, శుంఠి, ఈనాల్గిటిని చేర్చి కాచబడిన కషాయము తృతీయకజ్వరమును హరించును.

5. తిప్పతీగె, ఉసిరికపరుగు, తుంగగడ్డలు ఈమూడిటిని చేర్చి కాచబడిన కషాయము చతుర్థకజ్వరమును హరించును.

పైజెప్పినరీతిగ నైదు అర్ధశ్లోకములతో జెప్పబడిన ఐదుకషాయయోగములును వరుసగ సంతత-సతతక-అన్యేద్యుష్క-తృతీయక-చతుర్థకములను విషమజ్వరముల నైదిటి యథాసంఖ్యముగ నతిశీఘ్రములో హరించునని యర్థము.

ఇచ్చట కొందరు వ్యాఖ్యాతలు కషాయయోగముల కైదిటికిని సంతతాదివిషమ జ్వరములకైదిటికిని యథాసంఖ్యము నంగీకరింపక యీకషాయయోగములైదును సంతతాదిజ్వరములలో నెద్దానికైన యోగికములుగనే యుండునని చెప్పెదరు. యథాసంఖ్యము నవలంబించి సంతతాదిజ్వరములకు వేరువేర నాయాకషాయయోగముల చెప్పుటయే యుక్తమని శివదాససేనవ్యాఖ్యానము.

జ్వరమునకు వత్సకాదికషాయము.

మూ. వత్సకారగ్వధౌపాఠాం షడ్గ్రన్థాం కటురోహిణీమ్,
మూర్వాం సాతివిషాం నిమ్బం పటోలం ధన్వయాసకమ్. 204
వచాం ముస్తముశీరం చ మధుకం త్రిఫలాం బలామ్,
పాక్యం శీతకషాయం వా పిబేత్ జ్వరహరమ్ నరః. 205

వ్యా. కొడిసెపాలగింజలు, రేలగిజరు, చిరుబొద్ది, నల్లజీలకర, కటుకరోహిణి, చాగ, అతివస, వేపపట్ట, చేదుపొట్ల, దూలకోవిల, వస, తుంగగడ్డలు, వట్టివేళ్లు, అతి

మధురము, త్రిఫలములు, చిట్టాముట్టి వీనినన్నిటిని చేర్చి కషాయము కాచి యైనను లేక శీతకషాయము చేసియైనను త్రాగినచో జ్వరము హరించును. (ఇచ్చట పైజెప్పిన మూడు పాదములలోని ద్రవ్యములను మూడుగ విభజించి మూడు కషాయయోగములుగ కొందరు చెప్పెదరు. అట్టివిభాగమును జ్వరముయొక్క స్వభావమునుబట్టి యుక్తియుక్తముగ చికిత్సకు లుపయోగించునది).

## జ్వరమునకు మధూకాదిశీతకషాయము.

మూ. మధూకము_స్తమృద్వీకాకాశ్మర్యాణి పరూషకం,
త్రాయమాణాముశీరం చ త్రిఫలాం కటురోహిణీమ్. 206
పీత్వా నిశిస్థితం జన్తుః జ్వరాచ్ఛీఘ్రం విముచ్యతే,

వ్యా. ఇప్ప, తుంగగడ్డలు, ద్రాక్షపండు, పెగ్గుమ్మడు, చిట్టీత, కానుగ, పట్టివేళ్లు, త్రిఫలములు, కటుకరోహిణి, వీనినన్నిటిని రోట దంచి శీతకషాయపరిభాషానుసారముగ జలము పోసి రాత్రియంతయు నానబెట్టి ఉదయమున జ్వరితున కిచ్చినచో శీఘ్రముగ జ్వరము నివర్తించును. (ఇచ్చట 'నిశి స్థితమ్' అనగా శీతకషాయవిధిప్రకారము సిద్ధము చేయబడినదని యర్థము.)

## జ్వరమునందు లోమానులోమనకషాయములు.

మూ. జాత్యామలకము_స్తాని తద్వద్ధన్వయవాసకమ్. 207
విబద్ధదోషో జ్వరితః కషాయం సగుడం పిబేత్,

వ్యా. జాజిపత్రి, ఉసిరికకాయలబెరడు, తుంగగడ్డలు, తీటకసింద, వీనిని చేర్చి కషాయము కాచి అందు బెల్లమును చేర్చి దోషములు బద్ధగించి యుండు జ్వరము కలవాడు త్రాగవలెను. (ఇచ్చట బెల్లము ప్రక్షేపద్రవ్యముగ జెప్పబడినది కావున క్వాథ్యద్రవ్యమునకన్న నాల్గవపాలు కషాయమున జేర్పనగును. స్థలాంతరమునను ప్రక్షేప ద్రవ్యములకెల్ల నిదే పరిమితి యని యెరుంగునది).

## అనులోమన త్రిఫలాదికషాయము.

మూ. త్రిఫలాం త్రాయమాణాం చ మృద్వీకాం కటురోహిణీమ్. 208
పి_త్తశ్లేష్మహర_స్త్వేషః కషాయో హ్యానులోమికః,
త్రివృతాశర్కరాయు_క్తః పి_త్తశ్లేష్మజ్వరాపహః. 209

వ్యా. త్రిఫలములు, కానుగ, ద్రాక్షపండ్లు, కటుకరోహిణి, వీనిని చేర్చి కాచబడిన కషాయము పి_త్తశ్లేష్మములను హరించును. దోషముల ననులోమముగ జేయును.

పైజెప్పిన కషాయయోగమున తెగడను కూడ చేర్చి కాచి యందు చక్కెరను చేర్చి త్రాగిన పిత్తశ్లేష్మజ్వరమును హరించును.

—సన్నిపాతజ్వరహర బృహత్యాదియోగము.—

మూ. బృహత్యౌ వత్సకం ముస్తం దేవదారు మహౌషధం,
కోలవల్లీ చ యోగోఽయం సన్నిపాతజ్వరాపహః. 210

వ్యా. వాకుడు, ములక, కొడిసెపాల, తుంగగడ్డలు, దేవదారు, శుంఠి, కోలవల్లి (చవ్యము), ఇవి బృహత్యాదియోగము. ఇయ్యది సన్నిపాతజ్వరమును హరించును.

—సన్నిపాతజ్వరహర శట్యాదివర్గము.—

మూ. శటీ పుష్కరమూలం చ వ్యాఘ్రీ శృఙ్గీ దురాలభా,
గుడూచీ నాగరం పాఠా కిరాతం కటురోహిణీ. 211
ఏష శట్యాదికో వర్గః సన్నిపాతజ్వరాపహః,
కాసహృద్గ్రహపార్శ్వార్తి శ్వాసతన్ద్రాసు శస్యతే. 212

వ్యా. కచోరములు, పుష్కరమూలము, వాకుడు, కర్కాటకశృంగి, దూలకోవెల, తిప్పతీగే, శుంఠి, చిరుబొద్ది, నేలవేము, కటుకరోహిణి, ఇవి యన్నియు చేరి శట్యాదివర్గమనబడును. ఇయ్యది సన్నిపాతజ్వరమును హరించును. కాసము, హృద్రోగమును, ప్రక్కనొప్పిని, శ్వాసమును, మైకమును పోగొట్టును. (ఈవర్గద్రవ్యములను కషాయముచేసి యుపయోగింపనగును.)

—సన్నిపాతజ్వరహరబృహత్యాదిగణము.—

మూ బృహత్యౌ పౌష్కరం భార్గీ శటీ శృఙ్గీ దురాలభా,
వత్సకస్య చ బీజాని పటోలం కటురోహిణీ. 213
బృహత్యాదిర్గణః ప్రోక్తః సన్నిపాతజ్వరాపహః,
కాసాదిషు చ సర్వేషు దద్యాత్సోపద్రవేషు చ. 214

వ్యా. వాకుడు, ములక, పుష్కరమూలము, బొరంగి, కచోరములు, కర్కాటకశృంగి, దూలకోవెల, కొడిసెపాలవిత్తులు, చేదుపొట్ల, కటుకరోహిణి, ఇవి యన్నియు చేరి బృహత్యాదిగణమనబడును. ఇయ్యది సన్నిపాతజ్వరమును హరించును. సన్నిపాతజ్వరమునందు కాసము మున్నగు నుపద్రవములు కల్గినప్పుడును కషాయముగ పక్వము జేసి యుపయోగింపనగును,

### అనుక్తజ్వరహారకకషాయయవాగువులసంగ్రహము.

మూ. కషాయాశ్చ యవాగ్వశ్చ పిపాసాజ్వరనాశనాః,
　　నిర్దిష్టా భేషజాధ్యాయే భిషక్తానపి యోజయేత్. 215

వ్యా. పైజెప్పబడిన కషాయములే గాక భేషజచతుష్కమున నిర్దేశింపబడిన జ్వరహారంబులును పిపాసాహారంబులును నగు వర్గములయందలి ద్రవ్యములను చేర్చి సిద్ధములు చేయబడిన కషాయములను, అట్టి జ్వరహర-పిపాసాహారయవాగువులను కూడ తత్తద్దోషాద్యనుసారముగ నుపయోగింపనగును.

ఇచ్చట 'భేషజాధ్యాయే' అనుచోట "భేషజాని అధీయన్తే అస్మిన్ ఇతి భేషజాధ్యాయః" అనువ్యుత్పత్తిచేత ఔషధముల వివరించు ప్రకరణమని యర్థము. అయ్యది భేషజచతుష్కమౌనుకావున 'భేషజాధ్యాయే' అనుపదమునకు భేషజచతుష్కమునందు అనునర్థము లభించును. అందును షడ్విరేచనశతాశ్రితీయాధ్యాయమున—"శారిబా శర్కరా పాఠా మఞ్జిష్ఠా ద్రాక్షా పీలుపరూషకాఽభయామలకవిభీతకానీతి దశేమాని జ్వరహరాణి భవన్తి." (సూత్ర, అ. ౪. సూ. ౬౨.) అని జ్వరహారకకషాయద్రవ్యవర్గంబును; "నాగర ధన్వయాసక ముస్త పర్పటక చన్దన కిరాతతిక్త గుడూచీ హ్రీబేర ధాన్యక పటోలానీతి దశేమాని తృష్ణానిగ్రహణాని భవన్తి." (సూత్ర. అ. ౪. సూ. ౧౨.) అని తృష్ణాహారకకషాయవర్గంబును చెప్పబడినది.

మరియు నపామార్గతండులీయాధ్యాయమున "గవ్యమాంసరసైస్సామ్లా విషమజ్వరనాశినీ" (సూ. అ. ౨-సూ. ౩౧.) అని జ్వరహారయవాగువులును, "మృద్వీకా శారిబా లాజా పిప్పలీ మధునాగరైః, పిపాసాఘ్నీ విషఘ్నీ చ సోమరాజీ విపాచితా" (సూత్ర. అ. ౨. సూ. ౨౪) అని పిపాసాహారయవాగువులును చెప్పబడినవి. అట్టిజ్వర-తృష్ణాహారకషాయవర్గముల నిర్దేశింపబడిన ద్రవ్యములచే సిద్ధములగు కషాయములను, యవాగువులను కూడ తత్తదుచితముగ జ్వరములయందు చికిత్సార్థై యుపయోగింపనగునని "కషాయాశ్చ......తానపి యోజయేత్" అను పైశ్లోకముచే నతిదేశింపబడినది.

### జీర్ణజ్వరమున ఘృతపానవిధి.

మూ. జ్వరాః కషాయైర్వమనైః లఙ్ఘనైః లఘుభోజనైః,
　　రూక్షస్య యే న శామ్యన్తి సర్పిస్తేషాం భిషగ్జితమ్. 216
　　రూక్షం తేజో జ్వరకరం తేజసా రూక్షితస్య చ,
　　యస్స్యాదనుబలో ధాతుః స్నేహవధ్యః (సాధ్యః) స చాఽనిలః.

వ్యా. క్రియాక్రమమున "అత ఊర్ధ్వం కఫే మన్దే......సర్పిష్పానం యథామృతం" అని(౧౬౭ శ్లోకమున)ఘృతపానము సూచింపబడినది. అట్టిఘృతయోగము లిచ్చట వివరింపబడును. పైని చెప్పబడిన చికిత్సాక్రమానుసారముగ జేయబడిన పాచనాది కషాయముల నుపయోగించుటచేతను వమనప్రయోగములచేతను లంఘనములచేతను యవాగువులు మున్నగు లఘుభోజనములచేతను జ్వరములు శమించక, అట్టి కషాయాది ప్రయోగములంజేసి జ్వరితుడు రూక్షమైనశరీరముకలవాడుగ నున్నయెడ, అట్టి పరిస్థితి నందు జ్వరములకు ఘృతపానము సిద్ధౌషధముగ నుండును.

రూక్షస్వరూపమైన తేజస్సు (వేడి) జ్వరమును కల్గించును. అట్టి జ్వరకరమైన తేజస్సు (శరీరముపై వ్యాపించిన ఆమాశయగతమైన జాఠరాగ్ని వేడియు శరీరమునందు స్వాభావికమైన వేడియు కలిసి) వ్యాపించుటంజేసి రూక్షమైన శరీరము కలవానికి పైజెప్ప బడిన లంఘనాదులచే వృద్ధినొంది రూక్షగుణముకలవాతము శరీరరూక్షతకు సహకారిగ నుండును. కావున అట్టి యవస్థావిశేషమున వాతహరంబును బలకరంబును నగు స్నేహముచే (ఘృతము) వాతమును హరింప దగియుండును. కావున ఘృతము చాల ముఖ్యమైన యౌషధముగ నుండును.

ఇచ్చట "రూక్షం తేజో జ్వరకరం తేజసా రూక్షితస్య చ" అనుచోట తేజశ్శబ్దమునకు ఉష్ణమని యర్థము. అయ్యది స్నిగ్ధగుణమునకు విరుద్ధమైన రూక్ష (స్నేహాభావ) గుణము కలది. అట్టి రూక్షస్వరూపమైన యూష్మము (తేజస్సు) జ్వరకరమగును. అయ్యది జ్వరసంప్రాప్తియందు 'బహిర్నిరస్య కోష్ఠాగ్నిం జ్వరదాస్స్యుః' అని చెప్పబడినప్రకారము ఆమాశయమునుండి వెలువరింపబడిన కాయాగ్నిసంబంధమైన వేడియు శరీరమున స్వాభావికమైన వేడియు కలిసి జ్వరరూపము నొందును. ఈవిషయము "స్వేన తేనోష్మణా చైవ కృత్వా దేహోష్మణో బలం, సన్తాపమధికం దేహే జనయన్తి నరస్తదా. భవత్యత్యుష్ణ సర్వాఙ్గో జ్వరితస్తేన చోచ్యతే" అని జ్వరస్వరూపమున చెప్పబడినది. మరియు "ఊష్మా పిత్తాదృతే నాస్తి జ్వరో నాస్త్యూష్మణా వినా" అను వాగ్భటవచనముచేత జ్వరమునందలి ఊష్మము పిత్తమువలన కల్గినదనియు తెలియుచున్నది. పిత్తము 'సస్నేహముష్ణం చ తీక్ష్ణం చ' అని చెప్పినప్రకారము పిత్తము స్నేహయుక్తమని తెలిసెడి. ఇట్లుండ "రూక్షం తేజోజ్వరకరమ్ తేజసా రూక్షితస్య చ" అని చెప్పినది యెట్లు సంగతమన్నచో:—పిత్తము అవస్థావిశేషముచే సస్నేహంబును, నిస్నేహంబును నగును. అందు ద్రవసంబంధముగల పిత్తము సస్నేహము, నిరామమైనది నిస్నేహము. అట్టి నిస్నేహమైన పిత్తముయొక్క ఊష్మము రూక్షము. జ్వరకాలమున అట్టి రూక్షమైన యూష్మము వ్యాపించుటచే రూక్షశరీరుడైన జ్వరితునకు అనుబంధముగనుండు (రూక్ష

గుణవిశిష్ట) వాతము పైజెప్పబడిన కషాయ-వమన-లంఘనాదులచే మిక్కిలి మరింత వృద్ధినొంది యుండును. అట్టియవస్థయందు వాతము స్నేహ సాధ్యముకావున ఘృత పానము వాతశామకంబును, జ్వరకరంబగు రూక్షరూపమైన యూష్మహరంబును నగునని పైమూలవాక్యమునకు నిష్కృష్టార్థము. ఈవిషయముచే వాగ్భటాచార్యు లిట్లు వివరించిరి;—"రూక్షం హి తేజోజ్వరకృత్ తేజసా రూక్షితస్య చ, వమనస్వేదకాలాంబు కషాయలఘుభోజనైః, యస్స్యాదతిబలో ధాతుః సహచారీ సదాగతిః, తస్య సంశమనం సర్పిః దీప్తస్యేవాంబు వేశ్మనః" (మరియు రూక్షమైన పిత్తముచే గల్గిన జ్వరమును లోకమున రూక్షయనియు కార్యకారణముల కభేదముగ వాడెదరు.)

మరియు ఖరనాదుడును ఇట్లు చెప్పెను:—"కషాయపానాత్ వమనాత్ లఙ్ఘనాల్లఘుభోజనాత్, రూక్షితానాం జ్వరో మోక్షే సర్పిః పానముదీక్షతే రూక్షతేజోఽధికే దేహే" కషాయ-వమన-లంఘన-లఘుభోజనములచే రూక్షశరీరులగు జ్వరితులకు రూక్షతేజస్సు శరీరముపై నధికముగ వ్యాపించియుండునపుడు జ్వరము విడచుటకు సర్పిః పానమును నిరీక్షించుచుండునని భావము.

మరియు పిత్తము సద్రవము నిర్ద్రవమునని రెండు తెరంగులు. ద్రవవిశిష్టమైన పిత్తము సద్రవము లంఘనాదులచే నార్ద్రభాగము నశించినది రూక్షము. అట్టి నిస్స్నేహమై రూక్షమైన పిత్తము ఇచ్చట "రూక్షం తేజోజ్వరకరం" అనుచోట గ్రహింపబడునని కొందరు చెప్పెదరు.

మరియు:—"యస్స్యాదనుబలో ధాతుః" అనుచోట ధాతుశబ్దముచేత అనుబంధరూపమైన కఫమును గ్రహించి అట్టికఫంబును, రూక్షమైన పిత్తంబును, రూక్షగుణంబైన వాతంబును స్నేహసాధ్య మగునని కొందరు చెప్పెదరు. "ఘృతం తుల్యగుణం దోషం సంస్కారాత్తు జయేత్కఫమ్" అని నిదానస్థానమున చెప్పిన ప్రకారము ఘృతము కఫమునకు తుల్యగుణమైనను సంస్కారవిశేషమునంజేసి కఫహరమని తెలియుచున్నది కావున ఇచ్చట కఫము స్నేహసాధ్యమనునది విరుద్ధము కానోపదు. ఈవ్యాఖ్యానముచేత త్రిదోషంబులును సర్పిర్విషయంబు లగునని కొందరు చెప్పెదరు.

పైపక్షాంతరములలో "యస్స్యాదనుబలో ధాతుః స్నేహసాధ్యః స చానిలః" అనుచోట వాతమునే చెప్పుట సమంజసమని తోచెడి.

### జీర్ణజ్వరమున ఘృతయోగములు.

మూ. కషాయాస్సర్వ ఏవైతే సర్పిషా సహ యోజితాః,
ప్రయోజ్యాః జ్వరశాన్త్యర్థం అగ్నిసంధుక్షణాశ్చవాః. 218

వ్యా. పైజెప్పబడిన జ్వరహరములగు నాయాకషాయములగూర్చి ఘృతపాకవిధిగ పక్వముజేయబడిన ఘృతముల నాయాజ్వరములయందు జ్వరశాంతికొరకు ప్రయోగింపనగును. అట్టిఘృతములు జాఠరాగ్నిని రగులంజేయుటచే సుఖకరములుగ నుండును. (ఇచ్చట జ్వరహరములగు నాయాకషాయములలో నేతిని కలిపి యుపయోగింపవలెనని కొందరు అర్థము జేసెదరు).

జీర్ణజ్వరహర పిప్పల్యాదిఘృతము.

మూ. పిప్పల్యశ్చన్దనం ముస్తం ఉశీరం కటురోహిణీ,
కలిఙ్గకాస్తామలకీ సారిబాఽతివిషా స్థిరా. 219
ద్రాక్షామలకబిల్వాని త్రాయమాణా నిదిగ్ధికా,
సిద్ధమేతైర్ఘృతం సద్యో జీర్ణజ్వరమపోహతి. 220
క్షయం కాసం శిరశ్శూలం పార్శ్వశూలం హలీమకం,
అంసాఽభితాపమగ్నిం చ విషమం సంనియచ్ఛతి. 221

వ్యా. పిప్పళ్లు, చందనము, తుంగగడ్డలు, వట్టివేళ్లు, కటుకరోహిణి, కొడిసెపాల విత్తులు, నేలయుసిరిక, సుగంధపాలవేరు, అతివస, ముయ్యాకుపొన్న, ద్రాక్షపండు, ఉసిరికకాయలబెరడు, బిల్వవేరు, కలుగానుగు, వాకుడు, వీనినన్నిటిని సమభాగములుగ జేర్చి (కల్కము జేసి యాకల్కమునకు నాలుగింతలు ఘృతమును (ఆవునేతిని) చేర్చి, ఘృతమునకు నాల్గింతలు శుద్ధజలమును జేర్చి) ఘృతపాకవిధిప్రకారము పక్వముజేసి యాఘృతమును పురాణజ్వరముకలరోగికి (తగుమాత్రతో) నుపయోగించినయెడ శీఘ్రముగ జీర్ణజ్వరము హరించుటయే గాక క్షయము, కాసము, తలనొప్పి, ప్రక్కనొప్పులు, హలీమకము (కామలారోగభేదము), భుజశిరస్సుల(మూపుల)యందు కల్గుతాపము, విషమాగ్ని, వీని నన్నిటిని కూడ శమింపజేయును.

ఇచ్చట ఘృతసాధనవిధానము పరిభాషానుసారముగ నిట్లెరుంగునది:—పిప్పల్యాది ద్రవ్యములను మాత్రము నిర్దేశించి కల్క-ద్రవములవిభాగమును వివరింపకుండుటవలన పైజెప్పబడిన ద్రవ్యములను కల్కముజేసి, "ద్రవకార్యేష్వనుక్తేషు సర్వత్ర సలిలం స్మృతమ్" (కల్పస్థానము. అ. ౧౨) అనువిశేషపరిభాషానుసారముగ ద్రవమునకై విశేషమును చెప్పకుండుటవలన జలమును జేర్చుకొనవలెను. అందును కల్క-ద్రవ్యములలో భాగభేదముల జెప్పకుండుటవలన "భాగేఽప్యనుక్తే సమమేవ దేయమ్" అను సామాన్య పరిభాషానుసారముగ పిప్పలి మున్నగుద్రవ్యములను సమభాగములుగ గ్రహింపనగును. మరియు "కల్కాచ్చతుర్గుణీకృత్య ఘృతం వా తైలమేవ వా, చతుర్గుణే ద్రవే సాధ్యం"

అను సామాన్యపరిభాషచేత కల్కమునకు నాలుగింతలు ఘృతంబును, ఘృతమునకు నాలుగింతలు జలంబును చేర్చి ఘృతమును సాధింపందగును.

కొందరిట్లు చెప్పెదరు:—ద్రవ్యములను కల్కముగ జేయ నిర్దేశించి ద్రవమును మాత్రము నిర్దేశించక యేయోగమును చెప్పియుండునో అచ్చట జలమును గ్రహింపవలెను. ఎట్లులన:—"త్ర్యూషణా త్రిఫలాకల్కే బిల్వమాత్రే గుడాత్పలే, సర్పిషోఽష్టపలం పక్త్వా మాత్రాం మన్దానలః పిబేత్" (చికి. అ. ౧౫) అని చెప్పబడు ఘృతయోగమున కల్కద్రవ్యమాత్రము నిర్దేశించి ద్రవమును నిర్దేశించి యుండలేదు; కావున నిచ్చట స్నేహచతుర్గుణజలమును జేర్పనగును. మరియును ఏయోగమున ద్రవ్యముల మాత్రము నిర్దేశించి కల్కక్వాథభేదవిభాగముల జెప్పకుండునో అచ్చట నా ద్రవ్యములనే కల్పమును క్వాథమును జేర్చి ఘృతమును పక్వముచేయనగును. ఈవిషయమును సుశ్రుతమునందలి "కల్కక్వాథావనిర్దేశే గణాత్తస్మాత్ప్రయోజయేత్." అను పరిభాష తెలుపుచున్నది. ఈనిర్ణయమునుబట్టి ప్రకృతయోగమున పిప్పలి మున్నగు ద్రవ్యముల మాత్రము నిర్దేశించి కల్క-ద్రవవిభాగముల నిర్దేశించకుండుటంబట్టి పైద్రవ్యములనే కల్కముగను క్వాథముగను జేసి వానిచే ఘృతమును పక్వముచేయనగునని కొందరు వ్యాఖ్యానము చేసెదరు. ఇది సమంజసము కానోపదు. సుశ్రుతమున "గణాత్తస్మాత్" అని చెప్పుటచేత పరిగణనము చేయబడినగణమును గ్రహించి కల్క-కషాయముల నిర్దేశించక యెచ్చట స్నేహపరికల్పనము చెప్పబడునో అచ్చట పైజెప్పిన పరిభాష నుపయోగించును కాని, కేవలద్రవ్యనిర్దేశస్థలముల నుపయోగింపంజనదు. కావుననే "బలాకషాయకల్కాభ్యాం తైలం క్షీరసమం పచేత్." (చికిత్స. అ. ౨౮) అనుచోట "కషాయ-కల్క" అనునిర్దేశము చరితార్థమగును. బలానిర్దేశముచేతనే సామాన్యపరిభాష ననుసరించి కషాయకల్పములని యర్థమగుచుండ కషాయకల్కశబ్దముల నాచార్యు లేల నిర్దేశించెదరు? కావున సామాన్యపరిభాషానుసారముగ ప్రకృతమున పిప్పళ్లు మున్నగువానికల్కమును నాల్గింతలు నీళ్లను చేర్చి ఘృతమును పక్వముజేయవలెనని సిద్ధాంతము.

మరియు—ఇచ్చట పాకార్హమగు ఘృతమునకు పరిమాణము నిర్దేశింపబడలేదు కావున నిచ్ఛానుసారముగ ఘృతపరిమితి కల్పించి దానికి నాల్గింతలు జలమును నాల్గవపాలు కల్కమును జేర్పనగును. ఎచ్చట పాకార్హమగు ఘృతము మున్నగువానికి ప్రస్థాది పరిమాణము నిర్దేశింపబడియుండునో అచ్చట నిర్దిష్టప్రమాణమునే కల్పించి తత్తత్ప్రమాణానుసారముగ ద్రవకల్కముల జేర్పనగును. కాని యైచ్ఛికముగ పరిమితి గల్పింప దగదు. నిర్దిష్టప్రమాణముగ సిద్ధము చేయబడినవియే ఆయావ్యాధుల హరింప

సమర్థములగునని యాచార్యాభిప్రాయము. కొన్ని వ్యాధులయందు దీర్ఘకాలము ఔషధము సేవించునెడ నిర్దిష్టప్రస్థాది పరిమాణము చాలకున్నచో మరల రెండుమూడుసార్లు ప్రమాణానుసారముగ నౌషధమును సిద్ధముచేసికొననగును కాని ఒకేయోగమున వలసినంతపరిమాణమును హెచ్చించినచో నౌషధము వీర్యవంతము కానోపదు. ఇచ్చట జెప్పబడిన పరిభాషానుసారమైన వివరణము నితరస్థలములయందును ఘృతాదిపాకవిధానముల నెరుంగునది.

## జీర్ణజ్వరమునకు వాసాదిఘృతము.

మూ. వాసాం గుడూచీం త్రిఫలాం త్రాయమాణాం యవాసకాం,
పక్త్వా, తేన కషాయేణ పయసా ద్విగుణేన చ. 222
పిప్పలీముస్తమృద్వీకా చన్దనోత్పలనాగరైః.
కల్కీకృతైశ్చ విపచేత్ ఘృతం జీర్ణజ్వరాపహమ్. 223

వ్యా. అడ్డసరము, తిప్పతీగె, త్రిఫలములు, కలుగానుగు, పెద్దదూలగొండివిత్తులు, వీనినన్నిటిని సమభాగములుగ జేర్చి కషాయము కాచి యాకషాయము ఘృతమునకు రెండింతలును, రెండింతలు ఆవుపాలును, పిప్పళ్లు, తుంగగడ్డలు, ద్రాక్షపండు, చందనము, నల్లకలువలు, శుంఠి, ఈద్రవ్యముల కల్కముజేసి యాకల్కమును (ఘృతమునకు నాల్గవపాలు) ఘృతమున జేర్చి విధ్యుక్తప్రకారము పక్వముచేసి యాఘృతమును (అగ్నిబలాద్యనుసారముగ) సేవించినచో జీర్ణ(పురాణ)జ్వరమును హరించును.

ఇచ్చట "స్నేహాత్తోయం చతుర్గుణం" అను సామాన్యపరిభాషచే ద్రవము ఘృతమునకు నాల్గింతలు జేర్పవలెనని తెలియుచున్నది. కావున కషాయంబును క్షీరంబును చేసి (ప్రత్యేకము రెండేసి భాగములవంతున) ఘృతమునకు నాల్గింతలు జేర్పవలెనని యర్థము లభించుచున్నను ఉత్తమాధమమధ్యమాధికారులగు శిష్యుల సుఖబోధముకొరకై "పయసా ద్విగుణేన చ" అని చెప్పబడినదని కొందరియభిప్రాయము.

ఇచ్చట నీవిమర్శనము నెరుంగునది:—"ద్రవాన్తరేణ యోగే తు క్షీరం స్నేహసమం విదుః." అను విశేషపరిభాషచేత వాసాది క్వాథముతో జేర్చి చెప్పబడినక్షీరము స్నేహసమభాగముగ జేర్పవలసి యుండును. అట్టియెడ కషాయము ఘృతమునకు మూడింతలును, పాలు స్నేహమునకు సమంబును జేర్చినచో ద్రవము ఘృతము నాల్గింత లగునని కల్పింపవలసియుండును. క్షీరమునకు అట్టి స్నేహసమత్వము గాకుండ ద్వైగుణ్యము విశేషవిధిగ తంత్రకారు లుపదేశించిరి. కాని "పయసా ద్విగుణేన చ." అను ద్వైగుణ్యము స్పష్టార్థము కానేరదు.

మరియు స్నేహపాకవిధియందు ఒకద్రవంబైనను రెండైనను మూడుద్రవము లైనను ఒకేయోగమున జెప్పబడి యున్నచో అట్టి ద్రవములు కలిసి ఘృతమునకు నాల్గు భాగములుగ నుండవలెను. నాల్గుద్రవములు జేరునప్పుడు ఒక్కొకటియు స్నేహమునకు సమభాగముగ నుండునెడ నాల్గును కలిసి స్నేహచతుర్గుణము కాగలదు. ఐదుసంఖ్యకు పైగా ద్రవముల జేర్పవలసినప్పుడు ఒక్కొకటియు స్నేహసమభాగముగ నుండవలెను. ఈవిషయము—"ద్రవాణి యత్ర స్నేహేషు పఞ్చాదీని భవన్తి హి, తత్ర స్నేహసమాన్యాహుః యథాపూర్వం చతుర్గుణమ్" అను పరిభాషచే దెలిసెడి.

## జ్వరహరబలాదిఘృతము.

మూ. బలాం శ్వదంష్ట్రాం బృహతీం కలశీం ధావనీం స్థిరాం,
నిమ్బం పర్పటకం ముస్తం త్రాయమాణాం దురాలభామ్. 224
కృత్వా కషాయం పేష్యార్థే దద్యాత్తామలకీం శటీం,
ద్రాక్షాం పుష్కరమూలం చ మేదామామలకాని చ. 225
ఘృతం పయశ్చ తత్సిద్ధం సర్పిర్జ్వరహరం పరం,
క్షయకాసశిరశ్శూలపార్శ్వశూలాంస తాపనుత్. 226

వ్యా. చిట్టాముట్టి, పల్లేరు, పెద్దములక, నక్కతోకపొన్న, కోలపొన్న, ముయ్యాకుపొన్న, వేపపట్ట, పర్పాటకము, తుంగగడ్డలు, కానుగు, దూలగొండివిత్తులు, వీనినన్నిటిని చేర్చి కషాయము కాచి యాకషాయమును; నేలయుసిరిక, కచూరములు, ద్రాక్షపండు, పుష్కరమూలము, మేద, ఉసిరికవరుగులు, వీనియన్నిటికల్కమును; ఆవుపాలను ఘృతమును జేర్చి ఘృతపాకవిధిగ పక్వముజేసి యాఘృతమును త్రాగినచో నయ్యది మిక్కిలి జ్వరహరమగును. మరియు క్షయమును, కాసమును, తలనొప్పిని, ప్రక్కనొప్పిని, మూపుల తాపమును హరించును.

(ఈయోగమునందును కషాయక్షీరములు ప్రత్యేకముగ ఘృతమునకన్న రెండేసి భాగములును, పాదాంశము కల్కమును జేర్చి పరిభాషానుసారముగ సిద్ధముచేయునది.) ఇత్తెరంగున క్రియాక్రమసూచిత ఘృతపానవివరణము చెప్పబడినది.

## జ్వరితులకు సంశోధనప్రయోగము.

మూ. జ్వరిభ్యో బహుదోషేభ్యః ఊర్ధ్వం చాఽధశ్చ బుద్ధిమాన్,
దద్యాత్సంశోధనం కాలే కల్పే యదుపదేక్ష్యతే. 227

వ్యా. (క్రిగ్రూక్రమమున "శమయేత్తం విరేచనైః" అని సూచింపబడి సంశమన మీాక్రింద వివరింపబడును) మిక్కిలి బలిష్ఠములగు దోషములు కల జ్వరపీడితులకు కల్ప స్థానమున జెప్పంబడు వమనవిరేచనములచే యుక్తమైనకాలమున నూర్ధ్వాధోభాగముల దోషముల నెడలించి శోధనమును జేయించవలెను.

ఇచ్చట "బహుదోషేభ్యః" అని చెప్పుటవలన స్వల్పదోషముకలజ్వరితునకు సంశో ధనము నిషిద్ధమని తెలిసెడి. "కాలే" అన వమనవిరేచనయోగ్యజ్వరావస్థయందు అని యర్థము. ఊర్ధ్వగతదోషమున వమనరూపసంశోధనంబును, అధోగతదోషములకు విరేచన రూపసంశోధనంబును ప్రయోగింపవలెనని "ఊర్ధ్వం చాధశ్చ" అనుపదములచే జెప్ప బడినది.

జ్వరితున కుపయోగింపదగిన వమనయోగములు.

మూ. మదనం పిప్పలీభిర్వా కలిఙ్గైర్మధుకేన వా,

యుక్తముష్ణామ్బునా పేయం వమనం జ్వరశాన్తయే. 228

క్షౌద్రామ్బునా రసేనేక్షోః అథ వా లవణామ్బునా,

జ్వరే ప్రచ్ఛర్దనం శస్తం మద్యైర్వా తర్పణేన వా. 229

వా. మ్రంగకాయచూర్ణమును పిప్పళ్లచూర్ణముతో కలిపి వేడినీళ్లతో జేర్చి త్రాగినచో వమనమై జ్వరము శమించును. (ఇది కఫమధికముగ నున్నపు డుపయోగింప దగిన వమనౌషధము). లేక మ్రంగకాయచూర్ణమును కొడిసెపాలవిత్తులచూర్ణమును (ఈరెంటిని) వేడినీళ్లతోకలిపి త్రాగినచో వమనమగును. (ఇది పిత్తకఫమున నుపయోగింప నగును). లేక మ్రంగకాయలచూర్ణమును అతిమధురచూర్ణముతో గూర్చి వేడినీళ్లతో గలిపి త్రాగించవలెను. (ఇది తాపాధికమున నుపయోగింపదగును). లేక పైజెప్పిన వమ నౌషధమును తేనెతో కలియుటచే మధురమైన నీళ్లతోనైనను, చెఱకురసముతోనైనను, సైంధవలవణము జేర్చి యుప్పగనుండు జలముతోనైనను గూర్చి యుపయోగింపనగును. లేక మద్యములతోనైన ననుతర్పణ (తృప్తికర) యోగములతో జేర్చియైన నుపయో గింపనగును.

ఇచ్చట నీవమనవిరేచనౌషధము నుపయోగించునపుడు రోగియొక్క బలమును గమనించి తగుమైన మాత్రను గల్పించి రోగిబలమునకు హాని కల్గనీయక కాపాడును. యుక్తియుక్తముగ నుపయోగింపవలెను. ఈవిషయమును వాగ్భటాచార్యు లిట్లుపదే శించిరి:—"న శామ్యత్యేవమపి చేజ్జ్వరః కుర్వీత శోధనం.........బలినః పాలయన్ బలమ్."

## జ్వరహరవిరేచనయోగములు.

మూ. మృద్వీకామలకానాం వా రసం ప్రస్కన్దనం పిబేత్,
రసమామలకానాం వా ఘృతభృష్టం జ్వరాపహమ్. 230
లిహ్యాద్వా త్రైవృతం చూర్ణం సంయుక్తం మధుసర్పిషా,
పిబేద్వా క్షౌద్రమావాప్య సఘృతం త్రిఫలారసమ్. 231
ఆరగ్వధం వా పయసా మృద్వీకానాం రసేన వా,
త్రివృతాం త్రాయమాణాం వా పయసా జ్వరితః పిబేత్. 232
జ్వరాద్విముచ్యతే పీత్వా మృద్వీకాభిస్సహాఽభయాం,
పయోఽనుపానముష్ణం వా పీత్వా ద్రాక్షారసం నరః 233

వ్యా. ద్రాక్షపండును ఉసిరికవరుగులను జేర్చి రసము (కషాయము) జేసి విరేచనమునకై జ్వరితుడు త్రాగవలెను. లేక ఉసిరికకాయల రసమును నేతితో కలిపి పక్వము జేసి (సంస్కరించి) యైన నుపయోగింపనగును. తెగడచూర్ణమున తేనెను ఘృతమును జేర్చియైనను, త్రిఫలములరసమును తేనెను నేతిని కలిపియైన నుపయోగింపనగును. రేలకాయలలోని గుజ్జును పాలతోనైనను ద్రాక్షపండ్లస్వరసముతోనైనను కలిపి త్రాగనగును. తేగడచూర్ణమునైనను కానుగచూర్ణమునైనను పాలతో గలిపి త్రాగనగును. మరియు కరకకాయలచూర్ణమును ద్రాక్షపండ్లరసముతో కలిపి త్రాగినచో జ్వరము శమించును. లేక ద్రాక్షపండ్లరసమును త్రాగి వేడిపాలను వెంటనే త్రాగినచో సుఖముగ విరేచనములై జ్వరము శమించును. (ఇత్తెరంగున క్రమసూచిత సంశోధనము వివరింపబడియె.)

## జ్వరితునకు క్షీరపానవిధి: అందు పంచమూలసిద్ధక్షీరము.

మూ. కాసాచ్ఛ్వాసాచ్ఛిరశ్శూలాత్పార్శ్వశూలాచ్చిరజ్వరాత్,
ముచ్యతే జ్వరితః పీత్వా పఞ్చమూలీశృతం పయః. 234

వ్యా. ("జ్వరక్షీణస్య......కామంతు పయసా తస్య" అని నిర్దేశింపబడిన క్షీరపాన మిచ్చుట వివరింపబడును) పంచమూలములను చేర్చి (క్షీరపాకవిధిప్రకారము) పక్వముచేయబడిన క్షీరమును త్రాగినచో కాసము (దగ్గు), శ్వాసము, తలపోటు, ప్రక్కశూల, పురాణజ్వరము ఇవి యన్నియు నివర్తించును.

క్షీరపాకవిధానమున పరిభాష యిట్లున్నది:—"ద్రవ్యాదష్టగుణం క్షీరం క్షీరాత్తోయం చతుర్గుణమ్, క్షీరాఽవశేషః కర్తవ్యః క్షీరపాకే త్వయం విధిః." క్షీరమున జేర్పవలసినదిగ జెప్పబడిన ద్రవ్యసముదాయమునకు ఎనిమిదిభాగముల పరిమితికల

పాలతో, పాలకు నాల్గుభాగములు నీళ్లను కలిపి పాలు మాత్రము మిగులునట్లు చుండ కాచవలె నని యర్థము. ఈపరిభాష ననుసరించి ప్రకృతమున పంచమూలసముదాయ ద్రవ్యము ఒకభాగంబును, దానికి నెనిమిదిభాగములు ఆవుపాలును, పాలకు నాల్గుభాగములు జలంబును చేర్చి పాలు మాత్రము మిగులునట్లు నీరు చుండ కాచి ఔషధద్రవ్యమును దూరంబుచ్చి పాలను త్రాగవలెను.

మరియు "క్షీరమష్టాగుణం ద్రవ్యాత్ క్షీరాన్నీరం చతుర్గుణమ్." అను వాక్యము ననుసరించి క్షీరము చక్కగ పాకమునొందుటకై నాల్గుభాగములు నీళ్ల చేర్పవలెనని చెప్పబడినది. స్థలాంతరముల యందు నెల్లెడల క్షీరపాకవిధి నీపరిభాషానుసారముగ ద్రవ్యక్షీర-జలపరిమాణముల నెరుంగునది.

ఏరండమూలాదిసిద్ధక్షీరపానము.

మూ. ఏరణ్డమూలోత్క్వథితం జ్వరాత్సపరికర్తికాత్,
పయో విముచ్యతే పీత్వా తద్వద్బిల్వశలాటుభిః. 235

వ్యా. చిట్టాముదపువేళ్లనైనను, మారేడుకాయలనైనను పాలతో జేర్చి పైజెప్పిన రీతిగ పాలకు నాల్గింతలు నీళ్లు బోసి క్షీరపాకవిధిప్రకారము కాచబడిన క్షీరమును త్రాగినచో పరికర్తిక (గుదస్థానమున కత్తెరతో కత్తిరించినవిధముగ బాధ)తో గూడిన జ్వరము నివర్తించును.

త్రికంటకాదిసిద్ధక్షీరపానము.

మూ. త్రికణ్టకబలావ్యాఘ్రీగుడనాగరసాధితమ్,
వర్చోమూత్రవిబన్ధఘ్నం శోఫజ్వరహరం పయః 236

వ్యా. త్రికంటకములు (పెద్దములక, చిన్నములక, దూలగొండి), చిట్టాముట్టి, వాకుడు, బెల్లము, శుంఠి, వీని నన్నిటిని చేర్చి పైజెప్పినవిధముగ పక్వముచేయబడిన క్షీరమును త్రాగినచో మలమూత్రబంధమును శోఫను జ్వరమును హరించును.

పిపాసాజ్వరహర-నాగరాదిసిద్ధక్షీరపానము.

మూ. సనాగరం సమృద్వీకం సఘృతక్షౌద్రశర్కరం,
శృతం పయస్సఖర్జూరం పిపాసాజ్వరనాశనమ్. 237

వ్యా. శుంఠి, ద్రాక్షపండు, నెయ్యి, తేనె, చక్కెర, ఖర్జూరపుకాయలు, వీని నన్నిటిని సమభాగములుగ జేర్చి పాలను పైజెప్పినరీతిగ పక్వముజేసి త్రాగిన దప్పితో

కూడిన జ్వరమును హరించును. (ఇచ్చట తేనెను పక్వముచేయదగదు. కావున క్షీరము పక్వమైనపిదప శుంఠి మున్నగువానితో సరియైనభాగము క్షీరమున జేర్పవలెనని యెరుంగునది.)

## జ్వరహరక్షీరపానవిధి.

మూ. చతుర్గుణేనామ్భసా వా శృతం జ్వరహరం పయః,
　　ధారోష్ణం వా పయస్సద్యో వాతపిత్తజ్వరం హరేత్. 　　238

వ్యా. ఆవుపాలలో నాలుగుభాగములు నీళ్లు బోసి పాలు మాత్రము మిగులచుండ కాచి త్రాగినచో జ్వరమును హరించును. ధారోష్ణమగు (అప్పుడే పిండి వేడిగ నురుగుతో కూడిన) పాలను త్రాగినను వాతపిత్తజ్వరమును అప్పుడే శమింపజేయును.

## జీర్ణజ్వరము లన్నింటియందును క్షీరపానవిధానము.

మూ. జీర్ణజ్వరాణాం సర్వేషాం పయః ప్రశమనం పరమ్,
　　పేయం తదుష్ణం శీతం వా యథాస్వం భేషజైశ్శృతమ్. 　　239

వ్యా. జీర్ణజ్వరముల కన్నింటికిని క్షీరము ప్రధానముగ శామకమగును. కావున నాయాజ్వరములయందు ఆయాదోషముల హరించునౌషధముల చేర్చి క్షీరపాకవిధి ప్రకారము పక్వముచేయబడిన పాలను వేడిగనైనను చల్లగనైనను త్రాగుట చాల మంచిది. (ఇచ్చట వాతము ప్రబలముగ నున్నపుడు వేడిపాలను, పిత్తము బలిష్ఠముగ నున్నపుడు చల్లనిపాలను త్రాగవలెనని యెరుంగునది). ఇది క్షీరపానవివరణము.

## జ్వరహరములగు వస్తివిధానవివరణము.

మూ. ప్రయోజయేత్ జ్వరహరాన్నిరూహాన్ సానువాసనాన్,
　　పక్వాశయగతే దోషే వక్ష్యన్తే యే చ సిద్ధిషు. 　　240

వ్యా. ('నిరూహైర్వా హరేన్మలాన్'అని సూచితమైన వస్తిప్రయోగ మిచ్చట వివరింపబడును) దోషము పక్వాశయమున జేరియున్నపుడు సిద్ధిస్థానమున జెప్పబడు నిరూహానువాసనవస్తులలో జ్వరహరములగు ద్రవ్యములచే కల్పింపబడినవానిని (నిరూహం అనువాసనవస్తులను) ప్రయోగింపవలెను. (ఇచ్చట వస్తికల్పనము ప్రయోగక్రమము మున్నగునవియెల్ల సిద్ధిస్థానమునందలి రెండుమూడధ్యాయముల విపులముగ జెప్పబడినది కావున దాని నెరుంగునది.)

పటోలాదినిరూహవస్తి ప్రయోగము: దాన గల్గుగుణము.

మూ. పటోలారిష్టపత్రాణి సోశీరశ్చతురఙ్గులః,
హ్రీబేరం రోహిణీ తిక్తా శ్వదంష్ట్రా మదనాని చ. 241
స్థిరా బలా చ తత్సర్వం పయస్యర్ధోదకే శృతం,
క్షీరావశేషం నిర్యూహం సంయుక్తం మధుసర్పిషా. 242
కల్కైర్మదనముస్తానాం పిప్పల్యా మధుకస్య చ,
వత్సకస్య చ సంయుక్తం వస్తిం దద్యాజ్జ్వరాపహమ్. 343
శుద్ధే మార్గే హృతే దోషే విప్రసన్నేషు ధాతుషు,
గతాఙ్గశూలో లఘ్వఙ్గః సద్యో భవతి విజ్వరః 244

వ్యా. చేదుపొట్లాకు, వేపాకు, వట్టివేళ్లు, రేలకాయలోనిగిజరు, కురువేరు, కటుకరోహిణి, నేలవేము, పల్లెరు, మ్రంగకాయ, ముయ్యాకుపొన్న, చిట్టాముట్టి, వీనినన్నిటి నొకటిగ జేర్చి ఈద్రవ్యములను పాలకు సమభాగము నీళ్లను కలిపి పాలతో జేర్చి పాలు మాత్రము మిగులునట్లు కాచి వడగట్టి అందు కొంచెము తేనెను నెయ్యిని కలిపి, మ్రంగకాయ, తుంగగడ్డలు, పిప్పళ్లు, అతిమధురము, కొడిసెపాలగింజలు, వీని నన్నింటిని కల్కముచేసి పైజెప్పినక్షీరమున కలిపి వస్తిప్రయోగమును విధ్యుక్తప్రకారము చేయునది. ఇయ్యది జ్వరమును హరించును. మరియు నీవస్తిప్రయోగమువలన కోష్ఠ మార్గము శుద్ధమై దోషములు హరించి శరీరమునందలి ధాతువులు నిర్మలములై అవయవ ములయందలి నొప్పులు శమించి శరీరము తేలికయైయుండును. వెంటనే జ్వరము నివర్తిం చును. (ఈనిరూహవస్తివిధానమున క్వాథ-కల్క-స్నేహాదిపరిమాణవ్యవస్థను సిద్ధిస్థానమున జూచి నిర్ణయించునది.)

ఆరగ్వధాదికషాయవస్తిప్రయోగము.

మూ. ఆరగ్వధముశీరం చ మదనస్య ఫలం తథా,
చతస్రః పర్ణినీశ్చైవ నిర్యూహముపకల్పయేత్. 245
ప్రియఙ్గుర్మదనం ముస్తం శతాహ్వా మధుయష్టికా,
కల్కస్సర్పిర్గుడః క్షౌద్రం జ్వరఘ్నో వస్తిరుత్తమః 246

వ్యా. రేలపట్ట, వట్టివేళ్లు, మ్రంగకాయ, ముద్గపర్ణి (పిల్లపెసర), మాషపర్ణి (కారుమినుము), శాలి (సాల) పర్ణి (ముయ్యాకుపొన్న), పృశ్నిపర్ణి (కోలపొన్న), (అనునీనాల్గును చేరి పర్ణీచతుష్టయము) వీని నన్నిటిని సమభాగములుగ జేర్చి యుదకము

పోసి కషాయము కాచి ఆకషాయములో ప్రేంకణము, మ్రంగకాయ, తుంగగడ్డలు, పెద్దసదాపవిత్తులు, అనునీద్రవ్యములకల్కమును కలిపి బెల్లమును నేతిని తేనెను కొంచెముగ జేర్చి, వస్తిప్రయోగము చేసినచో జ్వరమును హరించును. జ్వరహరవస్తువులలో నిది యుత్తమమైనది.

## గుడూచ్యాదికషాయనిరూహవస్తి.

మూ. గుడూచీం త్రాయమాణాం చ చన్దనం మధుకం వృషం,
స్థిరాం బలాం పృశ్నిపర్ణీం మదనం చేతి సాధయేత్. 247
రసం జాఙ్గలమాంసస్య రసేన సహితం భిషక్,
పిప్పలీఫలముస్తానాం కల్కేన మధుకస్య చ. 248
ఈషత్సలవణం యుక్త్వా నిరూహం మధుసర్పిషా,
జ్వరప్రశమనం దద్యాత్ బలస్వేదరుచిప్రదమ్. 249

వ్యా. తిప్పతీగె, కానుగుపట్ట, శ్రీచందనము, అతిమధురము అడ్డసరము, ముయ్యాకుపొన్న, చిట్టాముట్టి, కోలపొన్న, మ్రంగకాయ, వీనినన్నిటిని చేర్చి కషాయము కాచి, అందు జాంగలజంతువులమాంసరసమును జేర్చి; అందు పిప్పళ్లు, మ్రంగకాయ, తుంగగడ్డలు, అతిమధురము వీనికల్కమును చేర్చి, సైంధవలవణమును తేనెను నేతిని కొంచెము కొంచెముగ యుక్తియుక్తముగ జేర్చి నిరూహవస్తి నుపయోగించునది. దీనివలన జ్వరము శమించి శరీరముపై చెమటబట్టి నోట రుచి కల్గును. (పైజెప్పిన పటోలాది-ఆరగ్వధాది-గుడూచ్యాది యోగములు మూడును నిరూహవస్తి కుపయోగ్యములు.)

## అనువాసన (స్నేహ) వస్తులు.

మూ. జీవన్తీం మధుకం మేదాం పిప్పలీం మదనం వచాం,
ఋద్ధిం రాస్నాం బలాం విశ్వాం (బిల్వాం) శతపుష్పాం శతావరీం,
పిష్ట్వా క్షీరం జలం సర్పిః తైలం చ విపచేద్భిషక్,
అనువాసనికం స్నేహమేతం విద్యాత్ జ్వరాపహమ్. 251

వ్యా. మనుబాల, అతిమధురము, మేద, పిప్పలి, మ్రంగకాయ, వస, ఋద్ధి, సన్నరాష్ట్రము, చిట్టాముట్టి, శుంఠి, (బిల్వవేరు), సదాపవిత్తులు, పిల్లిపీచర (చల్లపిల్లిగెడ్డలు), వీనినన్నిటిని స్నేహమునకు నాల్గవపాలుండునట్లు చేర్చి నీళ్లతో నూరి కల్కము చేసి, నువ్వులనూనె యొకభాగమును నెయ్యి నాల్గుభాగములును, వీనిరెంటి నొకటిగ గూర్చి, ఈరెంటికి సమభాగము పాలును మూడింతలు నీళ్లను బోసి పైకల్కమును జేర్చి

పక్వము జేసి యనువాసనవస్తిని చేయునది. ఇది స్నేహరూపమైన యనువాసనవస్తి. దీని యుపయోగమున జ్వరము హరించును. (ఇచ్చట యమక (నూనె నెయ్యి) స్నేహమునకు సమభాగము పాలును మూడింతలు నీళ్లను జేర్చినయెడ ద్రవము నాల్గింత లగునని యెఱుంగునది.)

పటోలాదిస్నేహవస్తి.

మూ. పటోలపిచుమర్దాభ్యాం గుడూచ్యా మధుకేన చ,
మదనైశ్చ శృతస్స్నేహః జ్వరఘ్నో ఽనువాసనమ్. 252

వ్యా. చేదుపొట్ల, వేపపట్ట, తిప్పతీగె, అతిమధురము, మ్రంగకాయ, వీని కషాయకల్కములచే పైజెప్పినరీతిగ సిద్ధము చేయబడిన యమకస్నేహము జ్వరహరమైన యనువాసనవస్తి చేయనగును.

జ్వరహరస్నేహ (అనువాసన) వస్తి.

మూ. చన్దనాఽగురుకాశ్మర్యపటోలమధుకోత్పలైః,
సిద్ధస్స్నేహో జ్వరహరః స్నేహవస్తిః ప్రశస్యతే. 253

వ్యా. చందనము, అగరు, నేలగుమ్ముడు, చేదుపొట్ల, అతిమధురము, నల్లకలువలు, వీనికషాయ-కల్కములచే పైజెప్పినవిధముగ సిద్ధముచేయబడిన యమకస్నేహము అనువాసనవస్తికి మిగుల ప్రశస్తము. జ్వరహరమైనది. (పైజెప్పబడిన జీవన్తీ-పటోల-చన్దనాది యోగములు మూడును స్నేహరూపమైన అనువాసనవస్తి కుపయోగార్హములు. ఇత్తెఱంగున "నిరూహైర్వా హరేన్మలాన్" "జ్వరే పురాణే... ప్రదద్యాదనువాసనమ్" అని నిర్దేశింపబడిన నిరూహానువాసనవస్తి వివరింపబడియె.)

జ్వరమున శిరోవిరేచనద్రవ్యములు.

మూ. యదుక్తం భేషజాధ్యాయే విమానే రోగభేషజే,
శిరోవిరేచనం కుర్యాత్ యుక్తిజ్ఞస్తజ్జ్వరాపహమ్. 254
యచ్చ నావనికం తైలం యాశ్చ ప్రాధ్మానవర్తయః,
మాత్రాశితీయే నిర్దిష్టాః ప్రయోజ్యాస్తాః జ్వరేష్వపి. 255

వ్యా. భేషజచతుష్కములో నపామార్గ తండులీయమున "అపామార్గస్య బీజాని......దద్యాచ్ఛీర్షవిరేచనే" అని చెప్పబడిన శిరోవిరేచనద్రవ్యముల చేతను; రోగభిషగ్జితీయాధ్యాయమున "శిరోవిరేచనద్రవ్యాణి పునః— అపామార్గపిప్పలీ... శిరోవిరేచనార్థముపదిశ్యన్తే" (విమాన. అ. ౮ సూ. ౧౫౧) అని యుపదేశింపబడిన

శిరోవిరేచనద్రవ్యములచేతను; యుక్తియుక్తముగ శిరోవిరేచనమును యుక్తమైనకాలమున జేసినచో జ్వరమును హరించును.

మరియు స్వస్థవృత్తచతుష్కమునందలి మాత్రాశితీయాధ్యాయమున నస్యమునకై "చన్దనాగురుణీ పత్రం......దద్యాదేషోఽణుతైలస్య నావనీయస్య సంవిధః" (సూత్ర. అ. ౫ శ్లో. ౬౦-౬౪) అని చెప్పబడిన అణుతైలమును; "హరేణుకాం ప్రియఙ్గుం చ పృథ్వీకాం...పిబేత్ప్రాయోగికాం సుఖామ్"(సూత్ర.అ. ౫-౧౯-౨౩)ఇత్యాది గ్రంథమున నిర్దేశించి చెప్పబడిన ధూమవర్తులును నస్యకర్మ కుపయోగింపందగును. (పైజెప్పబడిన నస్యద్రవ్యములలో నాయాదోషహరంబులును జ్వరహరంబులును నగుద్రవ్యముల గమనించి విధ్యుక్తప్రకారము శిరోవిరేచనమునకై యుపయోగింపవలెనని యెరుంగునది.

(ఇత్తెరంగున "గౌరవే శిరసశ్శూలే...కుర్యాన్మూర్ధవిరేచనమ్." (చి. ౭౩ శ్లో.) అని నిర్దేశింపబడిన శిరోవిరేచనద్రవ్యములు వివరింపబడినవి)

## అభ్యంగ-ప్రదేహాదివివరణము.

మూ. అభ్యఙ్గాంశ్చ ప్రదేహాంశ్చ పరిషేకాంశ్చ కారయేత్,
యథాభిలాషం శీతోష్ణం విభజ్య ద్వివిధం జ్వరమ్. 256

వ్యా. (ఇంతదనుక అంతఃపరిమార్జనరూపచికిత్స జెప్పబడినది. ఇక బహిఃపరిమార్జనరూపములగు అభ్యంగాదులు ఈక్రింద జెప్పంబడును. ఇయ్యది క్రియాక్రమనిర్దేశమున "అభ్యంగాంశ్చ...తైరాశు ప్రశమం యాతి బహిర్మార్గగతో జ్వరః" (౧౭౪-౧౭౫) అను శ్లోకముచే నిర్దేశింపబడినది. దానివివరణ మిచ్చట చెప్పబడును).

జ్వరితునకు అభిలషితమైన శీతోష్ణముల గమనించి అభ్యంగనములను, ప్రదేహ (అంగమర్దనమునకైన నలుగుపిండి మున్నగునవి) ములను, పరిషేకములను (స్నానము మున్నగు జలసేచనము) ఆగ్నేయసౌమ్యభేదములచే రెండువిధములైన జ్వరమును విభజించి రోగియభిలాషానుసారముగ జేయనగును.

జ్వరము సౌమ్యము, ఆగ్నేయము, నని రెండుతెరంగుల చెప్పబడినది. అందు సౌమ్యజ్వరమున రోగికి ఉష్ణాభిలాషయు, ఆగ్నేయమున శీతాభిలాషయు కల్గును. అట్టి యభిలాషనుబట్టి సౌమ్యాగ్నేయభేదముల విభజించి, ఉష్ణాభిలాషులకు నుష్ణములగు నభ్యంగాదులను, శీతాభిప్రాయులకు శీతములగు నభ్యంగాదులను జేయవలెనని భావము. ఈవిషయము "వాతపిత్తాత్మకశ్శీతం......వ్యామిశ్రలక్షణః" (౩౭ శ్లో.) అను శ్లోకమున జెప్పబడినది.

—● జ్వరితున కభ్యంగనమునకు సహస్రధౌతఘృత-చందనాదితైలనిర్దేశము. ●—

మూ. సహస్రధౌతం సర్పిర్వా తైలం వా చన్దనాదికమ్,
దాహజ్వరప్రశమనం దద్యాదభ్యఞ్జనం భిషక్. 257

వ్యా. సహస్రధౌత అనేకపర్యాయములు నీళ్లు మున్నగుద్రవముల జేర్చి చిలికి శుద్ధముచేయబడిన ఘృతముసైనను, చందనాదితైలముసైనను దాహజ్వరపరీతునకు అభ్యంగనమునకై యుపయోగించినచో నట్టితాపజ్వరము శమించును.

—● శీతాభిప్రాయులకు అభ్యంగనాదులకు చందనాదితైలము. ●—

మూ. అథ చన్దనాద్యం తైలముపదేక్ష్యామః—చన్దన భద్రశ్రీకాలాను సార్యకాలీయకపద్మా పద్మకోశీరసారిబామధుక ప్రపౌణ్డరీకనాగ పుష్పోదీచ్యవన్యపద్మోత్పలనలినకుముద సౌగన్ధికపుణ్డరీకశతపత్రబిస మృణాళశాలూకశైవాల కశేరుకానన్తా కుశకాశేక్షుదర్భశర నలశాలిమూలజమ్బువేతసవానీరగున్ద్రాకకుభా సనాశ్వకర్ణస్యన్దన వాతపోథశా(సా)లతాలధవ తినిశఖదిరకదర కదమ్బకాశ్మర్య ఫలసర్జప్లక్షవటకపీతనోదుమ్బరాశ్వత్థ న్యగ్రోధధాతకీ దూర్వో త్కట శృఙ్గాటకమఞ్జిష్ఠాజ్యోతిష్మతీ పుష్కరబీజక్రౌఞ్చాదన బదరీకోవిదారకదలీసంవర్తకారిష్ట శతపర్వాశీత(శ్వేత)కుమ్భికా శతావరీశ్రీవర్ణిశ్రావణీ మహాశ్రావణీరోహిణీ శీతపాక్యోదనపాకీ కాలాబలాపయస్యా విదారీజీవకర్షభకమేదామహామేదా మధురస ర్శ్యప్రోక్తాతృణ శూన్యమోచరసాటరూషక వకుళకుటజపటోల నిమ్బశాల్మలీనారికేళఖర్జూరమృద్వీకా ప్రియాలప్రియఙ్గుధన్వనాత్మ గుప్తామధు(ధూ)కానాం, అన్యేషాం చ శీతవీర్యాణాం యథా లాభమౌషధానాం కషాయం కారయేత్.

తేన కషాయేణ ద్విగుణితపయసా తేషామేవ చ కల్కేన కషా యార్ధమాత్రం మృద్వగ్నినా సాధయేత్తైలం, ఏతత్తైలమభ్య ఙ్గాత్ సద్యో దాహజ్వరమపనయతి. 258

(ఇతి చన్దనాద్యం తైలమ్).

వ్యా. జ్వరమునం దభ్యంగోపయోగ్యమగు చందనాదితైలయోగ మిక్రింద వివరింపబడును:—రక్తచందనము, శ్వేతచందనము, రాతిపువ్వు, కాలీయకము, మ్రానిపసుపు, పద్మకాష్ఠము, పద్మకము, వట్టివేరు, సుగంధపాల, అతిమధురము, ప్రపౌండరీకము (పుండరీకమను సుగంధద్రవ్యము), నాగకేసరములు, కురువేరు, అడవితామర, నల్లకలువలు, తామరపువ్వు, తెల్లకలువలు, సౌగంధికము (కొంచెము ఎఱుపును సుగంధంబును కల కలువలు), తెల్లతామర, శతపత్రము (నూరు రేకులుకలతామరపువ్వు), తామరకాడలోని తంతువులు, తామరకాడలు, తామరదుంపలు, నీటిపాచితీగెలు, నిమ్మదుంపలు, దూలగొండివేళ్లు, కుశదర్భవేళ్లు, రెల్లుదర్భవేళ్లు, చెఱకువేళ్లు, దర్భవేళ్లు, కాకిరెల్లువేళ్లు, కిక్కిసగెడ్డివేళ్లు, వరిపైరువేళ్లు, నేరేడుపట్ట, పేమువేళ్లు, వాసనగలప్రబ్బలివేళ్లు, వాసనలేని ప్రబ్బలివేళ్లు, భద్రముస్తలు, తెల్లమద్ది (ఏరుమద్ది), వేగిచెట్టుపట్ట, మద్దిపట్ట, నెమ్మిచెట్టుపట్ట, మోదుగచెట్టుపట్ట, పెద్దమద్దిచెట్టుపట్ట, తాటివేళ్లు, నారింజపట్ట, తినిశము, అశోకపట్ట, చంద్రచేవ, వెలిచంద్రచేవ, కడిమి, పెగ్గుమ్ముడుకాయలు, మడ్డిపాలు, జువ్విపట్ట, మఱ్ఱిపట్ట, దిరిసనపుపట్ట, మేడిచెట్టుపట్ట, రావిపట్ట, మఱ్ఱియూడలపట్ట, ఆరెచెట్టుపట్ట, గఱికవేళ్లు, దాల్చినిచెక్క, సింగాడిదుంపలు, మంజిష్ఠి, మాల్కంగుని, తామరగింజలు, క్రొంచాదనము, రేగుపట్ట, ఎఱ్ఱకాంచనము, అరటిగడ్డ, తానికాయలు, కొండవేపచెట్టుపట్ట, వస, తెల్లపాదిరిచెక్క, చల్లపిల్లిగెడ్డలు, టేకుమ్రానిచెక్క, పిన్నబోదతరము, పెద్దబోదతరము, కటుకరోహిణి, శీపపాళి (కామంచిపూరి), నల్లగోరింట, కాకోళి, చిట్టాముట్టి, క్షీరకాకోళి, పాలగుమ్ముడుగడ్డ, జీవకము, ఋషభకము, మేద, మహామేద, చాగపట్ట, నల్లదూలకోవెల, మొగిలిపువ్వులు, బూరుగబంక, అడ్డసరపాకు, పొగడపూలు, కొడిసెపాలగింజలు, చేదుపొట్లి, వేపపట్ట, బూరుగుబంక, టెంకాయనీళ్లు, ఖర్జూరపుకాయలు, ద్రాక్షపండు, చారపప్పు, ప్రేంకణము, తడచెట్టుచెక్క, పెద్దదూలగొండివిత్తులు, ఇప్పపువ్వులు, ఈద్రవ్యము లన్నింటినైనను, వీనికి సమానగుణంబులును శీతవీర్యంబులు నగు నితరవస్తువులనైనను, పైజెప్పబడిన ద్రవ్యములతో దొరకినంతవరకైనను జేర్చి కషాయము కాచియుంచునది.

పిమ్మట నాకషాయమునకు సగపాలు నూనెను, నూనెకు రెట్టింతలు ఆవుపాలును కలిపి కషాయద్రవ్యములకల్కమును తైలమునకు నాల్గవవంతు కలిపి పొయిమీద బెట్టి సూక్ష్మాగ్నిచే తైలపాకవిధిప్రకారము పక్వముచేయునది. ఈతైలముచే నభ్యంగనము చేయించినచో వెంటనే జీర్ణజ్వరమును, తాపంబును, హరించును. ఇది చందనాది తైలము.

ఇచ్చట కషాయమును పాలును వేరువేర తైలమునకు రెండేసిభాగములు చేర్చి నచో తైలమునకు నాల్గింతలు ద్రవమగును. కల్కపరిమాణము చెప్పనందున 'కల్కశ్చ స్నేహపాదికః' అను సామాన్యపరిభాషచేత తైలమునకు నాల్గవవంతు చేర్చునది.

జ్వరితునకు ప్రదేహ-పరిషేక-అవగాహనములు.

మూ. ఏతైరేవ చౌషధైః సుశ్లక్ష్ణపిష్టైః సుశీతైః ప్రదేహం కారయేత్.
ఏతైరేవ చ శృతశీతం సలిలమవగాహపరిషేకార్థం ప్రయుఞ్జీత.

వ్యా. పైని చందనాదితైలమున జెప్పబడిన చందనాది కషాయద్రవ్యములను మిక్కిలి మెత్తగ కాక కొంచెము నూకగ నుండునట్లు నూరి పిండిచేసి యాపిండిని చల్లగ జేసి శరీరముపై పూసికొని నలుగుపెట్టికొననగును. (ఇదియే ప్రదేహము). మరియు నాద్రవ్యములనే జేర్చి కాచబడిన నీళ్లను చల్లగచేసి శరీరముపై చల్లికొనుటకు శిరస్నానమునకు నుపయోగింపందగు.

జ్వరతాపహరమధ్వాదిసేకాఽవగాహములు.

మూ. మధ్వారనాళక్షీరదధిఘృతసలిలసేకాఽవగాహాశ్చ సద్యో దాహ జ్వరమపనయన్తి శీతస్పర్శత్వాత్. 260

వ్యా. మరియు మద్యము, గంజి, పాలు, పెరుగు, నెయ్యి, నీళ్లు, ఇవియన్నియు చల్లనైన స్పర్శము కల్గియుండును; కావున వీనిని శరీరముపై తడుపుటకును, స్నానము చేయుటకును, ఉపయోగించినచో నుష్ణము (వాతపిత్తములు)చే గల్గి శీతస్పర్శాదుల గోరుటచే శీతాభిప్రాయమనుజ్వరమును వెంటనే శమింపజేయును.

జ్వరతాపహరములగు విహారాదులు.

మూ. భవన్తి చాత్ర:—
పౌష్కరేషు సుశీతేషు పద్మోత్పలదళేషు చ,
కదళీనాం చ పత్రేషు క్షౌమేషు విమలేషు చ. 261
చన్దనోదకశీతేషు శీతే ధారాగృహేఽపి వా,
హిమామ్బుసిక్తే సదనే దాహార్తస్సంవిశేత్సుఖమ్. 262
(సుప్యాద్దాహార్దితస్సుఖమ్.)

వ్యా. మిక్కిలి చల్లగనుండు ఎఱ్ఱతామర తెల్లదామర నల్లకలువల పువ్వుల రేకులనైనను, అరటియాకులనైనను, నిర్మలములై చందనోదకముచే చల్లగనుండు పట్టు

బట్టలనైనను, ఉదకధారలచే (కొళాయిలచే) చల్లనైన గృహమునందును, లేక చల్లని నీళ్లచే దడుపబడిన గృహమునందైనను పరచి, దానిపై తాపజ్వరపీడితుడు సుఖముగ పరుండవలెను.

జ్వరతాపహరశీతస్పర్శములు.

మూ. హేమశఙ్ఖప్రవాళానాం మణీనాం మౌక్తికస్య చ,
చన్దనోదకశీతానాం సంస్పర్శానురసాన్ స్పృశేత్. 263

వ్యా. బంగరు, శంఖము, పగడములు, చంద్రకాంతాదిమణులు, ముత్యములు వీనిని శ్రీగంధపునీళ్లచే (పలుమారు అప్పుడప్పుడును) తడుపుచును మిక్కిలి చల్లనైన వానిని పలుమారు రొమ్ముపై నుంచుచు స్పృశించుచుండవలెను.

ఇచ్చట పైజెప్పిన హేమశంఖాదులను చాలకాలము శరీరముపై నుంచినచో శరీరతాపమునంజేసి యవియు వేడెక్కును కావున అప్పుడును చందనోదకముచే చల్లగ జేయుచు స్పృశింపవలెను. ఈవిషయమును ''స్పృశేత్'' అనుపదముచే నాచార్యులు సూచించిరి.

జ్వరతాపహరవ్యజనములు.

మూ. స్రగ్భిర్నీలోత్పలైః పద్మైః వ్యజనైర్వివిధైరపి,
శీతవాతావహైర్వీజ్యేత్ చన్దనోదకవర్షిభిః. 264

వ్యా. మరియు పుష్పమాలికలచేతను, నల్లకలువలచేతను, చందనోదకమును చిలకరించుచు చల్లనిగాలిని వెడలించు పలువిధంగులైన వీవనలచేతను జ్వరతాపము శమించుటకై జ్వరితునకు విసరుచుండవలెను. (అట్లు విసరుటచే చందనోదకముయొక్క చల్లని తుంపురులు శరీరమున సోకి జ్వరతాపము శమించును.)

తాపహర-అవగాహనములు.

మూ. నద్యస్తటాకాః పద్మిన్యో హ్రదాశ్చ విమలోదకాః,
అవగాహే హితా దాహతృష్ణాగ్లానిజ్వరాపహాః. 265

వ్యా. నదులు, తటాకములు, తామరకొలనులు, నిర్మలమైనజలము కలబావులు, ఇవి యన్నియు తాపజ్వరపీడితునకు స్నానముచేయుటకు చాల హితకరములు. వానియందవగాహనము చేయుటవలన దప్పియు, బడలికయు, తాపజ్వరంబును శమించును.

## తాపహరశీతోపచారములు.

మూ. ప్రియాః ప్రదక్షిణాచారాః ప్రమదాః చన్దనోక్షితాః,
సాన్త్వయేయుః పరైః కామైః మణిమౌక్తికభూషితాః. 266
శీతాని చాన్నపానాని శీతాన్యుపవనాని చ,
వాయవశ్చన్ద్రపాదాశ్చ శీతా దాహజ్వరాపహాః. 267

వ్యా. రోగికి మిక్కిలి ప్రీతిపాత్రములై వానియందు దాక్షిణ్యముతో గూడిన యాచారవ్యవహారములు గల్గిన యౌవనవతులగు స్త్రీలు శరీరముపై చందనమును బూసికొని, మణులచేతను ముత్యములచేతను శరీరము నలంకరించుకొని మనసు కుల్లాసకరములగు ప్రియవచనములచేతను స్పర్శముచేతను రోగిని అనునయింపవలెను.

మరియు శీతవీర్యములును శీతస్పర్శములును నగు నన్నపానంబులును, చల్లదనము కల్గిన యుద్యానవనంబులును, చల్లని గాలియు, చల్లని చంద్రకిరణంబులును తాపజ్వరమును హరించును. (ఇచ్చట చంద్రకిరణములు స్వభావముచేతనే చల్లగ నున్నను వేసవికాలమున సూర్యతాపమునంజేసి యొకసమయమున వేడిగనుండును కావున అట్టి కిరణముల స్పర్శము కూడదని తెలియుటకై "శీతాః" అను విశేషణము చెప్పబడినది.) ఇత్తెరంగున వాతపిత్తముచే గల్గి శీతాభిప్రాయమైన తాపజ్వరమున చికిత్సావిధానము చెప్పబడినది.

## ఉష్ణాభిప్రాయిశీతజ్వరమునం దభ్యంగనాములకు అగుర్వాదితైలము.

మూ. అథ ఉష్ణాభిప్రాయిణాం జ్వరితానామభ్యఙ్గాదీనుపక్రమానుపదేక్ష్యామః — అగురు కుష్ఠ తగరపత్ర నలదశైలేయధ్యామకహరేణుకా స్థౌణేయక క్షేమకైలావరాఙ్గదలపూరతమాలపత్ర పూతీకరోహిష సరళసల్లకీదేవదార్వగ్నిమన్థ బిల్వస్యోనాకకాశ్మర్యపాటలాపునర్నవావృశ్చీరకణ్టకారిబృహతీ సాలపర్ణీపృశ్నిపర్ణీమాషపర్ణీ ముద్గపర్ణీ గోక్షురకైరణ్డ శోభాఞ్జన వరుణార్కచిరిబిల్వతిల్వకశటీపుష్కరమూలగణ్డీరోరుబూకపత్తూరాక్షీబాశ్మన్తకశిగ్రుమాతులుఙ్గ పీలుకమూలకపర్ణీతిలపర్ణీ పీలుపర్ణీ మేషశృఙ్గీ హింస్రాదన్తశఠైరావతక భల్లాతకాస్ఫోత కాణ్డీరాత్మజైకేషీకా కరఞ్జధాన్యకాజమోదపృథ్వీకాసుముఖసురసకుఠేరక కాలమా

లకపర్ణాసక్షవకఫణిజ్జక భూస్తృణ శృఙ్గబేరపిప్పలీ సర్షపాఽశ్వగన్ధా రాస్నా రుహారోహా వచా బలాఽతిబలా గుడూచీ శతపుష్పా శీత వల్లీ నాకులీ గన్ధనాకులీ శ్వేతా జ్యోతిష్మతీ చిత్రకాఽధ్యణ్డాఽమ్ల చాఙ్గేరీ తిలబదరకులుత్థమాషాణాం ఏవంవిధానాం అన్యేషాం చోష్ణవీర్యాణాం యథాలాభమాపథానాంకషాయంకారయేత్.

తేన కషాయేణ తేషామేవ చ కల్కేన సురా సౌవీరకతుషోదక మైరేయ మేదకదధిమణ్డాఽఽరనాళకట్వరప్రతివినీతేన తైలపాత్రం విపాచయేత్.

తేన సుఖోష్ణేన తైలేన ఉష్ణాభిప్రాయిణం జ్వరితమభ్యఞ్జ్యాత్. తథా శీతజ్వరశ్శామ్యతి.

ఏతైరేవ చౌషధైః శ్లక్ష్ణపిష్టైః సుఖోష్ణైః ప్రదేహం కారయేత్. ఏతైరేవ చ శృతం సుఖోష్ణం సలిలం అవగాహనార్థం పరిషేకార్థం చ ప్రయుఞ్జీత శీతజ్వరప్రశమార్థమ్. 268

(ఇత్యగుర్వాద్యం తైలమ్.)

వ్యా. ఉష్ణస్పర్శాదులయం దభిలాషకల జ్వరితులకు దగిన యభ్యంగాదులక్రమము నీక్రింద నుపదేశించెదను:—కృష్ణాగరు, చెంగల్వకోష్ఠు, గ్రంథితగరము, లవంగపత్రి, ఆవురుగడ్డి, రాతిపువ్వు, నిమ్మగెడ్డ, రేణుకలు, స్థౌణేయకము (పచ్చాకు, లేక మాచిపత్రి,) కచోరములు, ఏలకులు, లవంగపట్ట, లవంగపుచెక్క, లవంగపత్రి, గుగ్గిలము, కానుగాకు, కామంచికసవు, రోహిషమనుగంధద్రవ్యము, సరళమనుచెట్టుచెక్క, అందుగుచెట్టుబంక, దేవదారుచేవ, కూరసెల్లివేళ్లు, మూరేడువేళ్లు, పెద్దమానుచెక్క, నేలగుమ్మడివేళ్లు, పాదిరిచెట్టువేళ్లు, గలిజేరువేళ్లు, చిన్నములకవేళ్లు, వాకుడువేళ్లు, పెద్దములకవేళ్లు, నేలపొన్న, కోలపొన్న, అడవిమినుపవేళ్లు, పిన్నపెసరవేళ్లు, ఏనుగుపల్లేరు, ఆముదపుచెట్టువేరు, మునగపట్ట, ఉలిమిరి, జిల్లేడుపట్ట, కానుగవేరు, లొద్దుగుపట్ట, గంధకచోరములు, పుష్కరమూలము, ఏరువంగవేరు, చిట్టాముదపుచెట్టువేళ్లు, పొన్నగంటి, కారుమునగపట్ట, పాషాణభేది (కొండపిండిబొద్దిచెట్టు), ఎఱ్ఱమునగపట్ట, మాదీఫలములయొక్కచెక్కలు, వరగోగువిత్తులు, మూలకపర్ణి (గుగ్గిలము), తిలపర్ణి (రక్తచందనము), పీలుపర్ణి (దొండచెట్టు), దుష్టపుతీగె, జటామాంసి, నిమ్మకాయలు, నారింజకాయలు, జీడిగింజలు, అడవిమల్లె, కాండీర (కాకర), ఆత్మజ(పుత్రజీవి, దానివిత్తులు), వికేషిక (తెగడ), కానగు,

దనియాలు, ఓమము, జీలకర, సుముఖ (తులసి,) సురస (తెల్లతులసి), గగ్గెర, నల్లగగ్గెర, తెల్లగగ్గెర, క్షవకము (తులసిలోభేదము). ఫణిజ్జక (మరువము), భూస్తృణము (చిప్ప కసవు), అల్లము, పిప్పళ్లు, ఆవాలు, పెన్నేరుగడ్డ, సన్నరాష్ట్రము, చెట్టుబదనిక, మాంస రోహిణి, వస, చిట్టాముట్టి, పేరాముట్టి, తిప్పతీగె, సదాపవిత్తులు, శీతవల్లి (స్వనామ ఖ్యాతము), చవ్యము, గంధనాకులి (దుంపరాష్ట్రము), దింటెన, మాల్కాంగుని, చిత్ర మూలము, అధ్యండ (దూలకోవిలవిత్తులు), పులిచింతాకు, నువ్వులు, రేగు, ఉలవలు, మినుములు, ఈయౌషధములను వీనికి సమానముగ నుష్ణవీర్యములైన యితరద్రవ్యములను దొరికినంతవరకును చేర్చి పరిభాషానుసారముగ కషాయము కాచునది.

ఆకషాయమును ఆయౌషధములకల్కమును ఒక ఆఢకపరిమితమగు నూనెలో జేర్చి, మద్యము, సౌవీరకమను కాంజికము, తుషోదకము, మైరేయమను మద్యవిశేషము, మేదకము, పెరుగుమీగడ, తేట,గంజి, పెరుగును పిండి తీయబడిననీళ్లు, అను నీయెనిమిది ద్రవములను ప్రత్యేకము తైలమునకు సమభాగముగ జేర్చి తైలపాకవిధిప్రకారము పక్వము చేయునది.

అట్టితైలము సుఖోష్ణముగ నున్నపుడు దానిచే ఉష్ణాభిప్రాయముకల శీతజ్వరము (వాతకఫములచే గల్గినజ్వరము) కల జ్వరితునకు అభ్యంగనము చేయించినచో, ఉష్ణాభి ప్రాయమైన యాశీతజ్వరము నివర్తించును.

మరియు పైజెప్పబడిన అగురు మున్నగు కషాయద్రవ్యములనే మిక్కిలి మెత్తగ నూరి యాపిష్టముచే నలుగుపెట్టికొని, ఆయౌషధముల జేర్చి కాచబడి సుఖోష్ణముగ నుండు వేడినీళ్లను పరిషేక-అవగాహనముల నుపయోగించినయెడ పైజెప్పబడిన శీత జ్వరము నివర్తించును.

ఈతైలయోగమున 'తైలపాత్రం' అని తైలప్రమాణమును మాత్రము చెప్పి కల్కమునకు పరిమితి చెప్పకుండుటచే "కల్కశ్చ స్నేహపాదికః" అను సామాన్యపరి భాషచే తైలమునకు నాల్గవవంతు కల్కమును జేర్పనగును. మరియు "పంచప్రభృతి యత్ర స్యుః ద్రవాణి స్నేహసంవిధౌ, తత్ర స్నేహసమాన్యాహుః" అను విశేషపరిభాష చేత నిచ్చట కషాయసురాసౌవీరాదిద్రవ్యములు నాల్గుకన్న సంఖ్య అధికముగ నుండుటం బట్టి యొక్కొకద్రవంబును స్నేహమునకు సమభాగములుగ జేర్పవలెను. ఒకపాత్రము (అరువదినాల్గుపలములు) తైలమును, దానికి నాల్గవవంతు (పదునాల్గుపలములు) కల్క మును, కషాయము మున్నగుద్రవము లొక్కొకటి స్నేహసమముగ (అరువదినాల్గుపల ములవంతున)ను జేర్చి తైలపాకవిధిగ పక్వము జేయవలెనని ఫలితార్థము.

మరియు "తుషామ్బుసన్ధితం జ్ఞేయం ఆమైర్విదళితైః యవైః, యవైస్తు నిస్తుషైః పక్వైః సౌవీరం సన్ధితం భవేత్." అనువచనముచే తుషామ్బుసౌవీరవిధానము చెప్పబడినది. (పచ్చియవలను పగులఁగొట్టి పొట్టుతో కూడ నొకపాత్రమున వైచి నీళ్లు బోసి మూసి యొకటి రెండు దినము లూరఁబెట్టిన నయ్యది తుషోదకమనియు, ఆయవలను పొట్టు లేక జేసి పక్వముజేసి పైఁజెప్పినప్రకార ముంచిన నయ్యది సౌవీరకమనియు చెప్పబడును.) మరియు—"మైరేయం ధాతకీపుష్పగుడధాన్యామ్బుసంయుతం" అని మైరేయలక్షణము తంత్రాంతరమున జెప్పబడినది. ఆరెపువ్వు, బెల్లము, ధాన్యామ్లము, వీని జేర్చి సంధానము చేయబడిన మద్యవిశేషము మైరేయమని యర్థము. మద్యముచేయుటకు పలు తెరంగులైన ద్రవ్యముల జేర్చి చేయబడిన పిష్టము మేదకము.

మరియు—"శ్లక్ష్ణపిష్టఘనో లేపః చన్దనస్యాఽపి దాహకృత్, త్వగ్గతస్యోష్మణో రోధాత్, శీతకృత్త్వన్యథాఽగురోః" (చికిత్సితం. అ. ౩౦ శ్లో. ౩౨౮) అని చికిత్సితమున నీతంత్రకారు లుపదేశించిరి. చందనము శీతవీర్యమైనను దానిని మెత్తగ నూరి దట్టముగ లేపనము చేసినయెడ చర్మమూలముగ బైటవెడలు ఉష్ణమును అడ్డగించును కావున, అట్టిచందనలేపనంబును అంతస్తాపమునే కల్గించును. అగరు మిక్కిలి యుష్ణవీర్యమైనను దానిని పైజెప్పినదానికి వ్యతిరేకముగ ముక్కముక్కలుగ నూరి పలుచగ లేపనముచేసి నచో శీతమును కల్గించును. ఇది కల్పనావిశేషమున గల్గు ఫలవిశేషము. ఈపద్ధతి ననుసరించి ప్రకృతయోగమున జెప్పబడిన అగురు మున్నగునోషధులను మెత్తగ నూరి పైని లేపనము చేసినచో శీతకారణముచే జనించిన యుష్ణాభిప్రాయజ్వరమున శరీరముపై వ్యాపించినయుష్ణము అంతర్భాగమున జేరి శీతరూపమైన జ్వరకారణమును హరించునని "శ్లక్ష్ణపిష్టైస్సుఖోష్ణైః ప్రదేహం కారయేత్" అని యుపదేశింపబడినది. ఇత్తెరంగుననే చందనాదితైలమున "ఏతైరేవ చౌషధైః అశ్లక్ష్ణపిష్టైః సుశీతైః ప్రదేహం కారయేత్." అనుస్థలమునందు నెఱుంగునది.

### శీతజ్వరమునందు స్వేద-ధూపములు.

మూ. భవన్తి చాత్ర:—

త్రయోదశవిధః స్వేదః స్వేదాధ్యాయే నిదర్శితః,
మాత్రాకాలవిదా యుక్తః స చ శీతజ్వరాపహః. 269
సా కుటీ తచ్చ శయనం తచ్చాఽవచ్ఛాదనం జ్వరం,
శీతం ప్రశమయన్త్యాశు ధూపాశ్చాఽగురుజా ఘనాః. 270

వ్యా. సూత్రస్థానమునందు స్వేదాధ్యాయమున "సంకరః ప్రస్తరో...... ఇత్యేతే స్వేదయన్తి త్రయోదశ" (సూత్ర. అ. ౧౪. శ్లో. ३౯) అని చెప్పబడిన పదుమూడు స్వేదములను మాత్రాకాలములను చక్కగ నెరింగి యుక్తియుక్తముగ చేసినచో పైజెప్పబడిన (వాతకఫముల చే గల్గిన) శీతజ్వరమును హరించును. మరియు స్నేహవిధిలో జెప్పబడిన కుటియు శయనంబును ఆచ్ఛాదనంబును, అగరుచే చేయబడిన ధూపంబులును ఘనంబులగు ప్రదేహంబులును శీతజ్వరమును వెంటనే పూర్తిగ హరించును. (ఇచ్చట జేంతాకస్వేదవిధానమున జెప్పిన కుటీప్రవేశంబును దానికుపకరణములుగ జెప్పబడిన శయన-ఆచ్ఛాదనంబులును వేరువేరుగ శీతజ్వరహరము లగునని వేరుగ జెప్పుటచే తెలిసెడి.)

### శీతజ్వరహరోపచారములు, అన్నపానములు.

మూ. చారూపచితగాత్ర్యశ్చ తరుణ్యో యౌవనోష్మణా,
ఆశ్లేషాచ్ఛమయన్త్యాశు ప్రమదాశ్శిశిరజ్వరమ్. 271
స్వేదనాన్యన్నపానాని వాతశ్లేష్మహరాణి చ,
శీతజ్వరం జయన్త్యాశు సంసర్గబలయోజనాత్. 272

వ్యా. మిగుల రమ్యమైన రూపముకలవారును యౌవనవతులును నగుస్త్రీలు శిశిరజ్వరపీడితుని ఆలింగనము చేసికొనినచో శీతజ్వరము ఆస్త్రీయొక్క యౌవనమునకు సంబంధించిన ఉష్ణముచే నివర్తించును.

మరియు చెమటబుట్టించు (ఉష్ణవీర్యములగు) అన్నపానములును, వాతకఫనాశకము లగు నన్నపానంబులును వాతకఫసంసర్గబలముచే సంభవించిన శీతజ్వరమును శీఘ్రముగ హరించును. ఇచ్చట "సంసర్గబలయోజనాత్" అన్నచోట సంసర్గపదముచే వాతకఫసంసర్గము గ్రహింపబడును.

### వాతిక-శ్రమజాదిజ్వరములయందు శమనవిధి.

మూ. వాతజే శ్రమజే చైవ పురాణే క్షతజే జ్వరే,
లఙ్ఘనం న హితం విద్యాత్ శమనైస్తానుపాచరేత్. 273

వ్యా. వాతప్రకోపమున జనించిన జ్వరమునందును, శ్రమచే గల్గిన జ్వరమునందును, పురాణజ్వరమునందును, ఉరఃక్షతముచే గల్గిన జ్వరమునందును రోగికి లంకణము వేయదగదు. అట్టిజ్వరితులకు కషాయములు ఘృతములు మున్నగు శమనచికిత్సలచే నుపచారము చేయదగును.

ఆమజ్వరమున లంఘనవిధానమునకు యుక్తి.

మూ. మిథ్యాహారవిహారాభ్యాం దోషా హ్యామాశయాశ్రయాః, బహిర్నిరస్య కోష్ఠాగ్నిం జ్వరదాస్స్యూ రసానుగాః.

మూ. విత్తిపాశ్యామాశయోష్మాణం యస్మాద్దత్వా రసం నృణాం,
జ్వరం కుర్వన్తి దోషాస్తు హీయతేఽగ్నిబలం తతః. 274
యథా ప్రజ్వలితో వహ్నిః స్థాల్యామిన్ధనవానపి,
న పచత్యోదనం సమ్యక్ అనిలప్రేరితో బహిః. 275
పక్తిస్థానాత్తథా దోషైః ఊష్మా క్షిప్తో బహిర్నృణాం,
నపచత్యభ్యవహృతం కృచ్ఛ్రాత్పచతి వా లఘు. 276
అతోఽగ్నిబలరక్షార్థం లఙ్ఘనాదిక్రమో హితః,
సప్తాహేన హి పచ్యన్తే సప్త (ర్వ) ధాతుగతా మలాః. 277
నిరామశ్చాత్యతః ప్రోక్తః జ్వరః ప్రాయోఽష్టమేఽహని,

వ్యా. వాతాదిదోషములు మిథ్యాహారాదులచే ప్రకుపితములై యామాశయమున జేరి యందలి జాఠరాగ్నిని స్వస్థానమునుండి బైట వెడలించి జ్వరమును కల్గించును; కావున అట్టి సమయమున మనుజునకు జాఠరాగ్నిబలము తగ్గును. అట్టియెడ ప్రొయిలో నిప్పువేసి కట్టెలను సమృద్ధిగ నునిచి యొకపాత్రలో బియ్యము బోసి ప్రొయిపై నునిచిన యెడ గాలి తీవ్రముగ వీచి ప్రొయిలో మంటను బైటవెడలించినచో సెగ పూర్తిగ తగలక స్థాలిలో నుండుబియ్యము పచనమునొందనేరదు; లేక కొంచెముగ పక్వమగును. అత్తెరంగుననే పాకస్థానమునుండి పాచకాగ్నిజ్వాల ప్రకుపితములైన దోషములచే వెడలింపబడి భుజింపబడిన యాహారమును పచింపచేయజాలదు. లేక మిక్కిలి కష్టముచే కొద్దిగ పచింపజేయును. కావున జాఠరాగ్నిబలమును కాపాడుటకై పైజెప్పబడిన లంఘనాదిక్రమము మిక్కిలి హితకరమగును. అట్లు పక్వముకాక యామావస్థనుండు సప్తధాతుగతములైన మలములు లంఘనాదిక్రమము నాచరించుటచే నేడుదినములకు పాకమునొందును; దానంజేసి ప్రాయికముగ నెనిమిదవదినమున జ్వరము నిరామ మగునని చెప్పబడును.

వాతికజ్వరమునందును ప్రారంభమున అతిగురుస్నిగ్ధభోజననిషేధము.

మూ. ఉదీర్ణదోషస్త్వల్పాగ్నిరశ్నన్ గురు విశేషతః. 278
ముచ్యతే సహసా ప్రాణైః చిరం క్లిశ్యతి వా నరః,
ఏతస్మాత్కారణాద్విద్వాన్ వాతికేఽప్యాదితో జ్వరే. 279
నాఽతిగుర్వతి వా స్నిగ్ధం భోజయేత్సహసా నరం,

వ్యా॥ వాతాదిదోషములు ప్రకుపితములై జాఠరాగ్ని మిగుల స్వల్పముగ నుండు రోగి గురుపదార్థముల భుజించినను, అధికముగ భుజించినను వెంటనే ప్రాణముల గోలు పోవును. లేక చాలకాలము ఆజ్వరముచే మానవుడు కష్టపడును. ఈకారణముచేత వాత జ్వరమునందును (లంఘనాదిచికిత్స యనర్హమైనను) ప్రారంభమున మిక్కిలి గురుత్వ మును కల్గించునదియు మిక్కిలి స్నిగ్ధంబునుకాని యాహారమును స్వల్పముగ భుజింప జేయనగును. కాని మిక్కిలి గురుస్నిగ్ధములగు నాహారములను తొందరపడి పెట్టందగు.

వాతికజ్వరప్రారంభమున నభ్యంగాదివిధానము.

మూ॥ జ్వరే మారుతజే త్వాదా అనపేక్ష్యాపి హి క్రమమ్. 280
కుర్యాన్నిరనుబన్ధానాం అభ్యఙ్గాదీనుపక్రమాన్,
పాయయిత్వా కషాయం చ భోజయేద్రసభోజనమ్. 281
జీర్ణజ్వరహరం కుర్యాత్ సర్వశశ్చాప్యుపక్రమం,

వ్యా॥ మరియు కేవల వాతముచే గల్గిన జ్వరమునందు పిత్తకఫదోషములయను బంధములేనివారికి ప్రారంభముననే లంఘనాదిక్రమమున పేక్షింపక అభ్యంగప్రలేపాదుల చేయింపనగును. కషాయమును త్రాగించి మాంసరసముతో గూడిన యాహారమును భుజింప జేయ్యవలెను. మరియు జీర్ణజ్వరహరములగు పిప్పల్యాదిఘృతము మున్నగు చికిత్సా క్రమముల నెల్ల నాచరింపవలెను.

కఫాధికజ్వరమునం దవస్థావిశేషమున లంఘనాదిక్రమవిధి.

మూ॥ శ్లేష్మలానామవాతానాం జ్వరోఽనుష్ణః కఫాధికః. 282
పరిపాకం నసప్తాహే నాఽపి యాతి మృదూష్మణాం,
తం క్రమేణ యథోక్తేన లఙ్ఘనాఽల్పాశనాదినా. 283
ఆదశాహాముపక్రమ్య కషాయాద్యైరుపాచరేత్,

వ్యా॥ వాతసంబంధము లేక కేవలము శ్లేష్మము మాత్రము ప్రకోపమునొంది జఠరాగ్ని మందగించి యున్నవారికి కఫప్రధానముగ జనించిన అనుష్ణకఫాధిక జ్వరమున పైజెప్పిన నిర్ణయప్రకారము ఏడుదినములకును దోషములు పరిపాకము నొందనేరవు. అట్టిజ్వరమున పైజెప్పబడిన చికిత్సాక్రమము ననుసరించి లంఘన-అల్పాశనాదిక్రమముగ పదిదినములవరకును చికిత్సజేసి పిదప కషాయాదులచే చికిత్సజేయవలెను.

### వాతికాదిజ్వరముల కవస్థావిశేషమున లంఘనవిధి.

మూ. సామా యే యే చ కఫజాః కఫపిత్తజ్వరాశ్చ యే. 284
లఙ్ఘనం లఙ్ఘనీయోక్తం తేషు కార్యం ప్రతి ప్రతి,

వ్యా. సామములైన వాత-పిత్త-కఫములచే వేరువేరుగ జనించిన జ్వరములకును, కఫము నిరామముగ నున్నను దాన జనించిన జ్వరమునకును, కఫముతో కూడిన పిత్తమున జనించిన జ్వరమునకును, లంఘనబృంహణీయాధ్యాయమున జెప్పబడిన లంఘనమున జేయనగును.

ఇచ్చట "సామాః యే" అనుపదముచేత ఆమావస్థనున్న వాతజన్యజ్వరంబును లంఘనార్హమని చెప్పబడును. కావుననే స్థలాంతరమున "సామే వాతేఽపి లఙ్ఘనమ్" అని చెప్పబడినది "యే చ కఫజాః"అని ప్రత్యేకముగ చెప్పియుండుటవలన కఫజజ్వరము ఆమావస్థ నున్నను నిరామావస్థ నున్నను లంఘనార్హమని యెరుంగునది. "కఫపిత్తజ్వరాశ్చ" అనుచోట కఫముతో కూడిన పిత్తజ్వరమున లంఘనము చేయదగునుగాని నిరామావస్థనున్న కేవలపిత్తమున జనించిన జ్వరమున లంఘనము చేయదగదని యెరుంగునది. ఆమపిత్తమున ఆమము పక్వమగుటకై లంఘనము చేయదగును. ఈవిషయము "సామే పిత్తేఽపి లఙ్ఘనమ్, కుర్యాదేవామపక్త్యర్థమ్" అనువాక్యములచే స్థలాంతరమున జెప్పబడినది. "లంఘనీయోక్తం" అనుచోట లంఘనాధ్యాయమున జెప్పబడిన పదివిధములైన లంఘనములలో ఈయధ్యాయమున జ్వరావస్థావిశేషమున నిషేధింపబడిన వమనాదులను, సర్వథా నిషిద్ధమైన వ్యాయామమును వదలి తక్కిన లంఘనభేదము లన్నియు చేయదగునని యర్థము.

### ఏకదోషజజ్వరములసామాన్యచికిత్స.

మూ. వమనైశ్చ విరేకైశ్చ వస్తిభిశ్చ యథాక్రమమ్. 285
జ్వరానుపచరేద్ధీమాన్ కఫపిత్తానిలోద్భవాన్,

వ్యా. కఫ-పిత్త-వాతములచే వేరువేర జనించిన జ్వరములయందు వరుసగ వమన-విరేచన-వస్తికర్మలచే చికిత్స జేయవలెను. కఫజజ్వరమున వమనములచేతను, పైత్తికజ్వరమున విరేచనములచేతను, వాతికజ్వరమున వస్తికర్మచేతను చికిత్సజేయవలెనని భావము.

### సంసృష్ట-సన్నిపాతజ్వరచికిత్స.

మూ. సంసృష్టాన్ సన్నిపతితాన్ బుద్ధ్వా తరతమైస్సమైః. 286
జ్వరాన్ దోషక్రమాపేక్షీ యథోక్తైరౌషధైర్జయేత్,

వర్ధనేనైకదోషస్య క్షపణేనోచ్ఛ్రితస్య వా. 287
కఫస్థానానుపూర్వ్యా వా సన్నిపాతజ్వరం జయేత్,

వ్యా. దోషద్వయసంసర్గముచే గల్గిన జ్వరములయందును, మూడుదోషముల ప్రకోపముచే గల్గిన సన్నిపాతజ్వరమునందును అట్టి జ్వరములకు కారణములైన దోషముల రెండుదోషన్యూనాధికభావములను, మూడుదోషములలో వృద్ధ-వృద్ధతర-వృద్ధతమ భేదములను, లేక వానిసమత్వమును (రెండు దోషములయొక్కయు మూడుదోషముల యొక్కయు సమస్థితిని) చక్కగ గమనించి, అట్టి దోషక్రమము ననుసరించి ఆయా దోషహరములగు ఔషధములచేత చికిత్స జేయనగును. అందును కొన్నిదోషములు మిక్కిలి వృద్ధినొందియు కొన్ని క్షీణించియు నుండు సన్నిపాతజ్వరమున వృద్ధినొందినదోషమును క్షీణింపజేయుచును, క్షీణించిన దోషమును వృద్ధినొందింపజేసియు చికిత్సచేయవలెను. న్యూనాతిరేకములు లేక సమములుగ దోషములు ప్రకోపమునొంది యున్నపుడు తొలుత కఫమునకును పిదప పిత్తమునకును, పిమ్మట వాతమునకు చికిత్స చేయవలెను. లేక తొలుత కఫస్థానమున జేరిన దోషమునకును, పిదప పిత్తస్థానమున నున్నదోషమునకును, అటుపిమ్మట వాతస్థానమున నున్నదోషమునకును వరుసగ చికిత్సజేయుచు సన్నిపాతజ్వరమును శమింపజేయనగును. (ఇచ్చట సన్నిపాతజ్వరచికిత్సాక్రమము అష్టాంగహృదయ చికిత్సాస్థానమున ౧౪౬ శ్లోకవ్యాఖ్యానమున మాచే విపులముగ విమర్శింపబడినదానిని గమనించునది.)

సన్నిపాతజ్వరమునం దుపద్రవరూపమైన శోఫ, దానిచికిత్స.

మూ. సన్నిపాతజ్వరస్యాన్తే కర్ణమూలే సుదారుణః. 288
శోథస్సంజాయతే తేన కశ్చిదేవ ప్రముచ్యతే,
రక్తావసేచనైశ్శీఘ్రం సర్పిష్పానైశ్చ తం జయేత్. 289
ప్రదేహైః కఫపిత్తఘ్నైః నావనైః కవలగ్రహైః,

వ్యా. సన్నిపాతజ్వరమునందు కడపట (శమించినపిదప) చెవులమొదటిప్రదేశమున మిక్కిలి క్రూరమైన వాపుజనించును. అయ్యది మిగుల క్రూరమగుటంజేసి యొకానొకడు మాత్రము దానిబారినుండి విడువబడును.(ప్రాయికముగ రోగిని చంపును, కావున కృచ్ఛ్రసాధ్యమని భావము.)

అట్టివాపు జనించిన వెంటనే రక్తమోక్షణముచేతను, ఘృతపానముచేతను, కఫపిత్తహరములైన ప్రదేహములు (పట్టువేయుట) చేతను, నస్యప్రయోగములచేతను, కబలగ్రహములచేతను చికిత్సచేసి శమింపజేయవలెను. (ఈశోథము జాగుజేసినచో

మిక్కిలి క్రూరరూపము దాల్చి దుస్సాధ్యమగును. కావున త్వరితముగ పైజెప్పిన చికిత్స జేయవలెనని "శీఘ్రం" అని యుపదేశించబడెను. మరియు నీశోథమే త్రిశోథీయాధ్యాయమున "జ్వరాన్తే దుర్జయోఽన్తాయ శోఫస్తస్యోపజాయతే" అని చెప్పబడినది.)

రక్తగతజ్వరచికిత్స.

మూ. శీతోష్ణస్నిగ్ధరూక్షాద్యైః జ్వరో యస్య న శామ్యతి. 290
శాఖానుసారీ రక్తస్య సోఽవసేకాత్ ప్రశామ్యతి,
(శాఖానుసారీ తస్యాశు ముఞ్చేద్బాహ్వోస్సిరాం క్రమాత్)

వ్యా. వాత-పిత్త-శ్లేష్మ-సంసర్గ-సన్నిపాతజ్వరముల శమింపజేయుటకై చెప్పబడిన శీత-ఉష్ణ-స్నిగ్ధ-రూక్షాది చికిత్సలం జేసినను జ్వరము శమింపకుండిన నయ్యది రక్తము నాశ్రయించిన జ్వరమని తెలియునది. అట్టి రక్తగతజ్వరమున రెండుచేతులలో నుండు సిరలను క్రమముగ శీఘ్రముగ వేధించి రక్తమును వెడలించవలెను. (ఇచ్చట తొలుత కుడిచేతిసిరను పిమ్మట నెడమచేతి సిరను వేధించి రక్తము స్రవింపజేయవలెనని 'క్రమాత్' అనుపదముచే సూచింపబడినది.)

అనుబంధరూపమైన జ్వరమునకు చికిత్స.

మూ. వీసర్పేణాభిఘాతేన యశ్చ విస్ఫోటకైర్జ్వరః. 291
తత్రాదౌ సర్పిషః పానం కఫపిత్తోత్తరో న చేత్,

వ్యా. విసర్పముచేనైనను అభిఘాతముచేనైనను విస్ఫోటకములచేనైనను (వాని కనుబంధముగ) జనించిన జ్వరమునందు అయ్యది కఫపిత్తాధికము కాకుండునెడ తొలుత ఘృతపానము చేయుట చాల మంచిది.

అనుసరించి యుండు జీర్ణజ్వరమునకు చికిత్స.

మూ. దౌర్బల్యాద్దేహధాతూనాం జ్వరో జీర్ణోఽనువర్తతే. 292
బల్యైస్సంబృంహణైస్తస్మాదాహారైస్తముపాచరేత్,

వ్యా. దేహమునందలి రసరక్తాదిధాతువులు మిక్కిలి బలహీనములై యుండుట వలన జీర్ణమైనజ్వరము మరల ననువర్తించి యుండును. అట్టిజ్వరమునందు బలకరంబులును ధాతుపుష్టికరంబులును నగు నాహారములచే నట్టివానికి చికిత్స జేయవలెను.

విషమజ్వర సాధారణచికిత్స.

మూ. కర్మ సాధారణం జహ్యాత్ తృతీయకచతుర్థకౌ. 293
(కుర్యాత్తృతీయకచతుర్థకే.)

ఆగన్తురనుబన్ధో హి ప్రాయశో విషమజ్వరే,
వాతప్రధానం సర్పిర్భిః వస్తిభిస్సానువాసనైః. 294
స్నిగ్ధోష్ణైరన్నపానైశ్చ శమయేద్విషమజ్వరం,
విరేచనేన పయసా సర్పిషా సంస్కృతేన చ. 295
విషమం తిక్తశీతైశ్చ జ్వరం పిత్తోత్తరం జయేత్,
వమనం పాచనం రూక్షం అన్నపానం విలఙ్ఘనమ్. 296
కషాయోష్ణం చ విషమే జ్వరే శస్తం కఫోత్తరే,

వ్యా. తృతీయకచతుర్థకముఁను విషమజ్వరములయందు ప్రాయికముగ భూతసంబంధరూపమైన యాగంతువు అనుబంధముగ జేరి యుండును. కావున ఆట్టి విషమజ్వరములయందు భూతానుబంధమునకు సాధారణమైన బలిమున్నగు దైవవ్యపాశ్రయరూపమైనచికిత్సను, దోషహరములగు యుక్తివ్యపాశ్రయములైన ఆయాదోషహరవస్తువులచే సిద్ధములగు కషాయపానాదిరూప చికిత్సలును చేయదగును.

మరియు నట్టి విషమజ్వరమున వాతము ప్రధానముగ నుండునెడ వాతహరసిద్ధఘృతములను, నిరూహానువాసనవస్తులను, స్నిగ్ధోష్ణములగు నన్నపానములను ప్రయోగించి శమింపజేయనగును. పిత్తం బధికముగనుండు విషమజ్వరమున విరేచనముచేతను తిక్తరసంబులును శీతవీర్యంబులునగు ద్రవ్యములచే సంస్కరింపబడిన క్షీరముచేతను శమింపజేయనగును. కఫం బధికముగనుండు విషమజ్వరమును వమనము పాచనము రూక్షములగు నన్నపానములు లంఘనము కషాయరసంబును ఉష్ణవీర్యంబునైన యౌషధంబును హరించును.

విషమజ్వరమున చికిత్సాక్రమము, అందు పానాది నియమములు.

మూ. యోగాః పరాః ప్రవక్ష్యన్తే విషమజ్వరనాశనాః. 297
ప్రయోక్తవ్యా మతిమతా దోషాదీన్ ప్రవిభజ్య తే,
సురా సమణ్డా పానార్థే భక్ష్యార్థే చరణాయుధాః. 298
తిత్తిరిశ్చ మయూరశ్చ ప్రయోజ్యా విషమజ్వరే,
పిబేద్వా షట్పలం సర్పిః అభయాం వా ప్రయోజయేత్. 299
త్రిఫలాయాః కషాయం వా గుడూచ్యా రసమేవ వా,
నీలినీమజగన్ధాం వా త్రివృతాం కటురోహిణీమ్. 300

పిబేజ్జ్వరాగమే యుక్త్యా స్నేహస్వేదోపపాదితః,
సర్పిషో మహతీం మాత్రాం పీత్వా వా ఛర్దయేత్పునః. 301
ఉపయుజ్యాఽన్నపానం వా ప్రభూతం పునరుల్లిఖేత్,
పాన్నం మద్యం ప్రభూతం వా పీత్వా స్వప్యాత్ జ్వరాగమే.

వ్యా. పిమ్మట విషమజ్వరహరములగు యోగము లీక్రింద వివరింపబడును:— చికిత్సావిధానజ్ఞుఁ డగువైద్యుఁడు అట్టియోగములను దోషము శీతోష్ణాదికాలము జాంగలాదిదేశము వాతాదిప్రకృతి రోగియొక్క బలము మున్నగువాని పరిస్థితిని చక్కగ గమనించి తత్తదనుకూలములగు యోగముల విభజించి ఆయాయోగముల నుపయోగించునది.

విషమజ్వరపీడితు డగు రోగికి సురయనుమద్యము యొక్క తేటను పానమునను, కోళ్లు తీతువుపిట్ట నెమలి అనునీజంతువులమాంసమును తినుటకును, ఉపయోగింపవలెను. మరియు గుల్మచికిత్సితమున జెప్పంబడు షట్పలఘృతమునైనను, కరకకాయలచే సిద్ధమైన ఘృతమునైన నుపయోగింపనగును.

మరియు జ్వరము పైకి వ్యాపించు వరుసదినమున తొలుత స్నేహస్వేదవిధుల జేసి పిదప త్రిఫలాకషాయమునైనను, తిప్పతీగెరసమునైనను, నటదింటెన ఓమము తెగడ కటుకరోహిణి వీనికషాయమునైనను యుక్తియుక్తముగ విరేచనమునకై యుపయోగింపనగును. (ఇచ్చట పైజెప్పినప్రకారము జ్వరము పచ్చువరుసదినమున విరేచనము చేయించినచో ఔషధప్రభావమునంజేసి విషమజ్వరము నివర్తించునని యెరుంగునది.) లేక ఒకయహోరాత్రమునకు జీర్ణమగునంతటి పరిమాణముకల నేతిని త్రాగి వాంతిచేయవలెను. లేక అన్నమునైనను పానీయమునైన మిక్కిలి యధికముగ నుపయోగించి వాంతి చేసికొనవలెను. లేక మిక్కుటముగ నన్నమును తిని మద్యమును త్రాగి జ్వరము వ్యాపించు సమయమునకు సరిగ నిద్రపోయినను జ్వరము రాకుండును.

విషమజ్వరహరవస్తి మున్నగు చికిత్సలు.

మూ. ఆస్థాపనం యాపనం వా కారయేద్విషమజ్వరే,
పయసా పృషదంశస్య శకృద్వా తదహః పిబేత్. 303
(శకృద్వేగాగమే పిబేత్.)
వృషస్య దధిమణ్డేన సురయా సహ సైన్ధవం,
పిప్పల్యాస్త్రిఫలాయాశ్చ దధ్నస్తక్రస్య సర్పిషః. 304

పఞ్చగవ్యస్య పయసః ప్రయోగో విషమజ్వరే,
రసోనస్య సతైలస్య ప్రాగ్భక్తముపసేవనమ్. 305
మేధ్యానాముష్ణవీర్యాణాం ఆమిషాణాం చ భక్షణం,

వ్యా. మరియు విషమజ్వరమునందు ఆస్థాపనవస్తినైనను, కల్పస్థానమున "ముస్తోశీరబలారగ్వధ," అని యుపక్రమించి చెప్పబడిన యాపనవస్తినైనను చేయవలెను. లేక పిల్లియొక్క మలము అవుపాలలో కలిపి యైనను, ఎద్దుయొక్క పేడను పెరుగుమీది తేటతో నైనను మద్యముతో నైనను కలిపి, అందు కొద్దిగ సైంధవలవణముజేర్చి యైనను త్రాగించవలెను. మరియు పిప్పలిచూర్ణము నైనను, త్రిఫలచూర్ణమునైనను, పెరుగు మజ్జిగ నెయ్యి వీనిలో నొకదానితో కలిపియైనను త్రాగవలెను పంచగవ్యము (పెరుగు పాలు నెయ్యి పేడ మూత్రము ఈయైదును జేరిన కూటమి)నైనను, పాలనైనను ఉపయోగింపనగును. మరియు వెల్లుల్లిపాయలను నూనెతో కలిపి నూరి అన్నమును భుజించుటకు మునుమున్న సేవించవలెను. మేదస్సును వృద్ధినొందించునవియు ఉష్ణవీర్యంబులును నగు మాంసములను తినుట విషమజ్వరమున హితకరమగును.

ఇచ్చట యాపనవస్తియనః—"ముస్తోశీరబలారగ్వధరాస్నా మఞ్జిష్ఠా కటురోహిణీ......సుఖోష్ణవస్తిః శుక్రమాంసాగ్నిజననః......విషమజ్వర......వ్యాధిహరః సద్యోబలజననో రసాయనశ్చేతి" (చరక-సిద్ధి. అ. ౧౧.) అని సిద్ధిస్థానమున చెప్పబడుదాని నెరుంగునది.

## విషమజ్వరహరనస్యము.

మూ. హిఙ్గుతుల్యా తు వైయాఘ్రీ వసా నస్యం ససైన్ధవా. 306
పురాణసర్పిస్సింహస్య వసా తద్వత్ ససైన్ధవా,

వ్యా. పెద్దపులిక్రొవ్వు (మూలగ)ను ఇంగువను సమభాగములుగ కలిపి కొంచెము సైంధవలవణమును చేర్చి విషమజ్వరమున నస్యము చేయవలెను. అత్తెరంగుననే సింహము యొక్క మూలగను ప్రాతనేతితో కలిపి సైంధవలవణమును జేర్చి నస్యము చేయవలెను.

## విషమజ్వరహరఅంజనము (కలికము).

మూ. సైన్ధవం పిప్పలీనాం చ తణ్డులాస్సమనశ్శిలాః. 307
నేత్రాఞ్జనం తైలపిష్టం శస్యతే విషమజ్వరే,

వ్యా. సైంధవలవణము, పిప్పలిబియ్యము, మణిశిల, వీనిని నువ్వులనూనెతో కలిపి నూరి కన్నుల కంజనము బెట్టుట విషమజ్వరమున చాల మంచిది.

### విషమజ్వరహరధూపములు.

మూ. పలఙ్కషా నిమ్బపత్రం వచా కుష్ఠం హరీతకీ. 308
సర్షపాస్సయవాః సర్పిః ధూపనం జ్వరనాశనమ్,
యే ధూమాః ధూపనం యచ్చ నావనం చాఞ్జనం చ యత్. 309
మనోవికారే నిర్దిష్టం కార్యం తద్విషమజ్వరే,

వ్యా. పల్లేరు, వేపాకు, వస, చెంగలువకోష్ఠు, కరకకాయ, ఆవాలు, యవలు, వీని నన్నిటిని నలియగొట్టి నేతిని కలిపి ధూపము వేసినచో విషమజ్వరమును హరించును. మరియు మనోవికారములగు నున్మాదాపస్మారముల చికిత్సలలో నిర్దేశింపబడిన ధూమములును, ధూపద్రవ్యములును, నస్యములును, అంజనంబులును, ఇవి యన్నియు విషమజ్వరములయందును ప్రయోగింపనగును.

### విషమజ్వరహరమణ్యాదిధారణము.

మూ. మణీనామోషధీనాం చ మఙ్గళ్యానాం విషస్య చ. 310
ధారణాదగదానాం చ సేవనాన్న భవేజ్జ్వరః,

వ్యా. మరియు మంగళకరములగు మణులను, మూలికావిశేషములను, విషములను ధరించుటవలనను, యుక్తమైన యౌషధముల సేవించుటవలనను, విషమజ్వరములు రాకుండును.

### విషమజ్వరమున దైవవ్యపాశ్రయచికిత్స, అందు శివపూజ.

మూ. సోమం సానుచరం దేవం సమాతృగణమీశ్వరమ్. 311
పూజయన్ ప్రయతశ్శీఘ్రం ముచ్యతే విషమజ్వరాత్,

వ్యా. (ఇంతదనుక యుక్తివ్యపాశ్రయరూపమగు దోషహరౌషధకషాయాది రూపమైన చికిత్సావిధానము చెప్పబడినది. ఇక దేవపూజాదిరూపమైన దైవవ్యపాశ్రయ రూప చికిత్సావిధాన మీక్రింద చెప్పంబడును.)

పార్వతీదేవితోడను నందీశాది అనుచరవర్గముతోడను మాతృకాది దేవీబృందము తోడను కూడిన పరమశివుని నిర్మలమైన మనస్సుతో విధ్యుక్తప్రకారము పూజించిన యెడ విషమజ్వరము శీఘ్రముగ నివర్తించును.

### సర్వజ్వరహరవిష్ణ్వాదిదేవపూజ.

మూ. విష్ణుం సహస్రమూర్ధానం చరాచరపతిం విభుమ్. 312
స్తువన్నామసహస్రేణ జ్వరాన్ సర్వానపోహతి,

బ్రహ్మాణమశ్వినావిన్ద్రం హుతభక్షం హిమాచలమ్. 313
గఙ్గాం మరుద్గణాంశ్చేష్ట్వా పూజయన్ జయతి జ్వరాన్,

వ్యా. "సహస్రశీర్షా పురుషః" ఇత్యాది పురుషసూక్త వేదవాక్యములచే జెప్పఁబడిన ప్రకారము అనేకశిరస్సులును పాదాదులును కల్గి సృష్టికి లోనగు చరాచరజంతుజాలముల కెల్ల నధిపతియు వ్యాపకుఁడు నైన విష్ణుదేవుని పూజించి విష్ణుసహస్రనామములను పారాయణము చేయుచు నాజగదేకకారణుని స్తుతియించినచో జ్వరము లన్నియు నివర్తించును. మరియు బ్రహ్మ, అశ్వినీదేవతలు, ఇంద్రుఁడు, అగ్నిదేవుఁడు, హిమాచలము, గంగాదేవి, ఇతరములగు దేవగణములు, వీనినుద్దేశించి యాగముల జేయుచు పూజించిన యెడ జ్వరము లన్నియు శీఘ్రముగ నివర్తించును.

## జ్వరహారములగు కొన్ని సత్కర్మములు.

మూ. భక్త్యా మాతుః పితుశ్చైవ గురూణాం పూజనేన చ. 314
బ్రహ్మచర్యేణ తపసా సత్యేన నియమేన చ,
జపహోమప్రదానేన వేదానాం శ్రవణేన చ. 315
జ్వరాద్విముచ్యతే శీఘ్రం సాధూనాం దర్శనేన చ,

వ్యా. తల్లిదండ్రులయందలిభక్తి కల్గియుండుట, గురువుల పూజించుట, బ్రహ్మచర్యవ్రతమును బూనుట, తపోనిష్ఠ నుండుట, సత్యవ్రతము బూనుట, మనస్సుకును వాక్కునకును శరీరమునకును సంబంధించిన నియమము నవలంబించుట, జపమును హోమమును దానములను చేయుట, ఋక్కు-యజుస్సు-సామ-అథర్వవేదములను నియమముతో వినుట, సాధువులైన భాగవతుల దర్శించుట, ఈకృత్యములచేత శీఘ్రముగ జ్వరవిముక్తుఁడగును.

## రసాదిధాతుగతజ్వరములకు చికిత్స.

జ్వరే రసస్థే వమనం ఉపవాసం చ కారయేత్. 316
సేకప్రదేహౌ రక్తస్థే తథా సంశమనాని చ,
విరేచనం సోపవాసం మాంసమేదస్థితే హితమ్. 317
అస్థిమజ్జగతే దేయా నిరూహాః సానువాసనాః,

వ్యా. జ్వరము రసధాతువున జేరినయెడ వమనంబును, ఉపవాసంబును (లంకణము) చేయదగును. రక్తధాతుగతజ్వరమున రక్తమోచనంబును ప్రలేపంబును సంశమన చికిత్సయు చేయనగును. మాంసగతజ్వరమునందును మేదోగతజ్వరమునందును విరేచనం

బును లంకణంబును హితకరము. అస్థిగత-మజ్జగతజ్వరములయందు నిరూహానువాసనవస్తులు చేయదగును. (ఇత్తెరంగున రసాదిధాతుగతజ్వరముల చికిత్సల నెరుంగునది).

ఆగంతుజ్వరచికిత్స, అందు శాపాదిజజ్వరములయందు సామాన్యచికిత్స.

మూ. శాపాఽభిచారాద్భూతానాం అభిషఙ్గాచ్చ యో జ్వరః. 318
దైవవ్యపాశ్రయం తత్ర సర్వమౌషధమిష్యతే,

వ్యా. దేవర్షులు మున్నగు మహనీయులవలన కల్గిన శాపముచే నైనను ఆభిచారిక ప్రయోగాదులచే నైనను భూతములయావాహనము చేతనైనను సంభవించిన జ్వరమునందు దైవవ్యపాశ్రయరూపమైన బలిదానములు మణిమంత్రములు మున్నగు నౌషధములన్నియు చేయదగును.

అభిఘాతజ-అభిచారికజ్వరములచికిత్స.

మూ. అభిఘాతజ్వరో నశ్యేత్ పానాభ్యఙ్గేన సర్పిషః. 319
రక్తావసేకైర్మద్యైశ్చ (మేధ్యైశ్చ) సాత్మ్యైర్మాంసరసౌదనైః,
సానాహోమద్యసాత్మ్యానాం మదిరారసభోజనైః. 320

వ్యా. అభిఘాతముచే గల్గినయాగంతుజ్వరము ఘృతపానాఽభ్యంగనముల చేతను, రక్తమోచనముచేతను, మద్యములచేతను, సాత్మ్యములగు (అలవాటైయున్న) మాంసరసములతో గూడిన భోజనము చేతను శమించును. ఆభిచారిక ప్రయోగాదులచే గల్గినజ్వరము మద్యపానమలవాటైయున్నవారికి మదిరాసవముల గూడిన భోజనముల చేతను శమించును.

క్షత-వ్రణములచే గల్గిన జ్వరచికిత్స.

మూ. క్షతానాం వ్రణితానాం చ క్షతవ్రణచికిత్సయా,

వ్యా. గాయములు తగిలినవారికిని వ్రణములు కల్గినవారికిని ఉపద్రవరూపముగ గల్గినజ్వరము అట్టిగాయములకును వ్రణములకును జెప్పిన చికిత్సచేతనే శమించును. (ఇచ్చట క్షత-వ్రణముల కుపద్రవరూపముగ సంభవించినజ్వరము ప్రధానమైన క్షత వ్రణములు వానికి చెప్పినచికిత్సల జేయుటచే శమించిన ఉపద్రవరూపమైనజ్వరము తనంతనే శమించునని యెరుంగునది).

కామ-శోక-భయజజ్వరములచికిత్స.

మూ. ఆశ్వాసనేనేష్టలాభేన వాయోః ప్రశమనేన చ. 321
హర్షణైశ్చ శమం యాన్తి కామ శోక-భయజ్వరాః,

వ్యా. కామముచేతను శోకముచేతను భయముచేతను సంభవించిన జ్వరముల యందు ఊరడించుటయు రోగికిష్టమైనవిషయమును లభింపజేయుటయు వాతమును శమింపజేయుటయు రోగికి సంతోషమును కల్గించుపనులజేయుటయు తగిన చికిత్స యగును. (కామాదిజ్వరములయందు వాత మనుబంధముగ నుండునుకావున వాతశమన చికిత్స చెప్పబడినది).

క్రోధజజ్వరచికిత్స.

మూ. కామ్యైరర్థైర్మనోజ్ఞైశ్చ పిత్తఘ్నైశ్చాప్యుపక్రమైః. 322
సద్వాక్యైశ్చ శమం యాతి జ్వరః క్రోధసముత్థితః,

వ్యా. క్రోధముచే సంభవించిన జ్వరము కోరిక కనుగుణమైనవియు మనసు కింపైనవియు నగువస్తువులు లభించుటచేతను, పిత్తహరములగు చికిత్సలచేతను మంచి మాటలచేతను శాంతినొందును. (క్రోధము మనః ప్రజ్వలనరూపవికారము. దాన సంభ వించినజ్వరము పిత్తప్రధానముగ నుండును. కావున పిత్తశామకచికిత్సలచే శాంతినొందు నని చెప్పబడినది).

కామాదిజ్వరములకు హేతువిపరీతరూపచికిత్స.

మూ. కామాత్ క్రోధజ్వరో నాశం క్రోధాత్ కామసముద్భవః. 323
యాతి తాభ్యాముభాభ్యాం చ భయశోకసముత్థితః,

వ్యా. కామమునకు క్రోధమునకు పరస్పరవిరోధము కావున కామమువలన క్రోధజ్వరంబును, క్రోధమువలన కామజ్వరంబును శమించును. అట్టి కామక్రోధముల రెంటికిని భయశోకములు రెండును విరుద్ధధర్మములు; కావున కామక్రోధములవలన భయశోకజ్వరములు శమించును.

జ్వరవేగకాలచింతనచే గల్గుజ్వరమునకు చికిత్స.

మూ. జ్వరస్య వేగం కాలం చ చిన్తయన్ జ్వర్యతే తు యః. 324
తస్యేష్టైస్తు విచిత్రైశ్చ విషయైర్నాశయేజ్జ్వరం,

వ్యా. జ్వరముయొక్క వేగమును జ్వరము వ్యాపించుకాలమును మనస్సున తలం చుటచేత తప్పక యాజ్వరము చికిత్సజేయుచున్నను విడువక వ్యాపించును. అట్టిజ్వరము రోగియొక్క మనసు కింపైనవియు మనసుకచ్చెరువు పుట్టించునవియు నగువిషయముల జెప్పుచు వానికి మనస్సు జ్వరవిషయమున వ్యాపింపనీయక మరపు పుట్టించినచో నా జ్వరము వ్యాపించకుండును.

(ఇచ్చట కామాదిజ్వరములు మనోవికారమున గల్గుజ్వరములు. కావున ప్రజ్ఞాపరాధమున గల్గినవియని యెరుంగునది). ఇత్తెరంగున "సౌషధంచ క్రియాక్రమమ్" అను ప్రశ్నమున కుత్తరముగ జ్వరమునకు సంబంధించిన క్రియాక్రమంబును ఔషధంబులును వివరణముగ జెప్పబడినది.

జ్వరము విడచునప్పుడు కల్గు(జ్వరవిముక్తి)లక్షణములు.

మూ. జ్వరప్రమోక్షే పురుషః కూజన్ వమతి చేష్టతే. 325
శ్వసన్ వివర్ణః స్విన్నాఙ్గః వేపతే లీయతే ముహుః,
ప్రలపత్యుష్ణసర్వాఙ్గః శీతాఙ్గశ్చ భవత్యపి 326
విసంజ్ఞో జ్వరవేగార్తః సక్రోధ ఇవ వీక్ష్యతే (వీక్షతే),
సదోషశబ్దం చ శకృత్ ద్రవం స్రవతి వేగవత్. 327
లిఙ్గాన్యేతాని జానీయాత్ జ్వరమోక్షే విచక్షణః,
బహుదోషస్య బలవాన్ (బలినః) ప్రాయేణాఽభినవో జ్వరః. 328
సత్ (స) క్రియాదోషపక్త్యా చేత్ విముఞ్చతి సుదారుణం,

వ్యా. జ్వరము పూర్తిగ వేగముజూపి విడచునప్పుడు పురుషుడు మిక్కుటముగ మూల్గును. వాంతిచేసికొనుచు అవయవముల పలుదెరంగుల కదలించును. నిట్టూర్పు నిగుడించుచు వివర్ణుడై చెమటబట్టిన సర్వాంగములు కల్గి వణకుచు పలుమారు మూర్ఛనొందును. అసంబద్ధముగ తనకిచ్చవచ్చినట్లు వదరును. శరీరమంతయు మిక్కిలి వేడి కల్గియైనను చల్లబడి యైన నుండును. శరీరముపై ప్రజ్ఞదప్పియుండును. జ్వరవేగముచే పీడితుడై మిక్కిలి కోపముకలవానివలె క్రూరముగ జూచును. పురీషము దోషముతో కూడి శబ్దముచేయుచు మిక్కిలి వేగముతో బైటవెడలును. ఇవియన్నియు జ్వరము విడచునప్పుడు కల్గు లక్షణములు.

మరియు పైజెప్పినలక్షణము లన్నియు ననేకదోషములతోగూడి మిక్కిలి బలవత్తరమైన (సన్నిపాత)జ్వరము విడచినప్పుడును, నూతనముగ గల్గిన (తరుణ)జ్వరము క్రియాక్రమము ననుసరించి చికిత్సజేయుటవలన దోషములు పరిపక్వములై జ్వరము మిక్కిలి క్రూరముగ విడచునప్పుడును ప్రాయికముగ సంభవించును. (సామాన్యముగ జ్వరము విడచునప్పుడు ఈక్రూరలక్షణము లన్నియును గల్గవనుట).

జ్వరముక్తిసాధారణలక్షణములు.

మూ. కృత్వా దోషవశాద్వేగం క్రమాదుపరమన్తి యే. 329
తేషామదారుణో మోక్షః జ్వరాణాం చిరకారిణాం,

వ్యా. మరియు వాతాదిదోషములు ప్రకోపమునంజేసి జ్వరవేగమును పూర్తిగ జూపి అట్టిదోషములు క్రమముగ నానాట బలహీనము లైనపుడు విడచునట్టి పురాణ జ్వరములు పైజెప్పిన దారుణమైన జ్వరమోక్షలక్షణముల జూపక స్వల్పలక్షణముల మాత్రము జూపును.

(జ్వరముక్తిలక్షణములు క్రూరములనియు సౌమ్యములనియు రెండుతెగలుగ నుండును. అందు క్రూరముక్తిలక్షణములు "జ్వరప్రమోక్షే పురుషః... విముఞ్చతి సుదారుణమ్" అని చెప్పబడినది. ఈక్రూరలక్షణము సన్నిపాతజ్వరము విడచునప్పుడును ప్రబలచికిత్సావశమునంజేసి బలవంతముగ దోషములు పక్వములై తరుణజ్వరము విడచునప్పుడును కల్గును.

పైజెప్పిన లక్షణములలో స్వేదము మున్నగు కొన్నిలక్షణములు మాత్ర మున్న యెడ నయ్యది మృదులక్షణములు. ఇయ్యవి జ్వరవేగమును పూర్తిగ జూపి దోషములు పరిపక్వములై జ్వరము విడచునప్పుడు కానంబడును. ఇత్తెరంగున "విముఞ్చతః... లిఙ్గం యచ్చ" అను ప్రశ్నమున కుత్తరము చెప్పబడియె).

జ్వరవిముక్తలక్షణములు.

మూ. విగతక్లమసన్తాపం అవ్యథం విమలేన్ద్రియమ్. 330
యుక్తం ప్రకృతిసత్త్వేన విద్యాత్పురుషమజ్వరం,

వ్యా. బడలికయు సంతాపంబును లేకుండుట శరీరమునం దేవిధమైన బాధయు లేకుండుట, చక్షురాదీంద్రియములు నిర్మలములై తమతమ వ్యాపారములయందు ప్రవర్తించుట, మనసు కేవిధమైన వ్యాకులంబును లేక స్వభావస్థితి నుండుట, ఇట్టి లక్షణములు కలపురుషుడు జ్వరవిముక్తుడని యెరుంగునది.

మరియు జ్వరవిముక్తలక్షణములు తంత్రాంతరముల నిట్లున్నవి:—"స్వేదో లఘుత్వంశిరసః కణ్డూః పాకో ముఖస్య చ; క్షవథుశ్చాఽన్నలిప్సా చ జ్వరముక్తస్య లక్షణమ్" శరీరమునందెల్ల చెమట బట్టుట, అవయవము లన్నియు బరువు లేక తేలికగ నుండుట, తలపై దురద కల్గుట, నోరు పుండగుట, తుమ్ము లడ్డులేక ధారాళముగ వెడలుట, ఆకలి కల్గి యన్నము తినుటయం దభిలాష బొడముట, ఇవి యన్నియు జ్వరముక్తలక్షణములని భావము. (ఇత్తెరంగున "ప్రశాన్తస్య చిహ్నం యచ్చ పృథక్పృథక్" అను ప్రశ్నమున కుత్తరము చెప్పబడినది).

—జ్వరవిముక్తుడు విసర్జింపవలసినవిషయములు.—

మూ. సజ్వరో జ్వరముక్తశ్చ విదాహీని గురూణి చ. 331
అసాత్మ్యాన్యన్నపానాని విరుద్ధాని చ వర్జయేత్,
వ్యవాయమతిచేష్టాశ్చ స్నానమత్యశనాని చ. 332
తథా జ్వరశ్శమం యాతి ప్రశాన్తో జాయతే న చ,
వ్యాయామం చ వ్యవాయం చ స్నానం చఙ్క్రమణాని చ
జ్వరముక్తో న సేవేత యావన్న బలవాన్ భవేత్,

వ్యా. విదాహకరములును, గురుత్వమును కల్గించునవియు, జ్వరమునకు రోగికిని సాత్మ్యములు కానివియు నగు నన్నపానంబులును, పరస్పరసంయోగాదులచే విరుద్ధములగు క్షీరమత్స్యాదులును, మైథునంబును, అధికమగు ఆంగికాదిచేష్టలును, (వ్యాయామము) స్నానంబును, అధికభోజనమును వీని నన్నిటిని జ్వరముతో బాధపడుచున్నవాడును, జ్వరముచే విడువబడినవాడును బొత్తుగ మానవలెను. వీనిని మానుటవలన జ్వరపీడితునకు జ్వరము శాంతినొందును. జ్వరవిముక్తునకు జ్వరము మరల రాకుండును.

మరియు వ్యాయామమును, మైథునమును, స్నానమును, విశేషముగ సంచారమును, వీని నన్నిటిని జ్వరవిముక్తుడు తనకు బలము చక్కగ గల్గునంతవరకును ఆచరింపదగదు.

ఇచ్చట "స్నానమూర్జాబలప్రదమ్" అను ప్రమాణాంతరముచేత స్నానము బలకరమైనను ప్రభావమునంజేసి జ్వరవిముక్తునకు మరల జ్వరమునుకల్గించునని యుద్దేశించి నిషేధింపబడినది. ఈవిషయము స్థలాంతరమున నిట్లున్నది:—"స్నానమాశు జ్వరం కుర్యాత్ జ్వరముక్తస్య దేహినః; తస్మాన్ముక్తజ్వరస్స్నానం విషవత్పరివర్జయేత్."

(ఇత్తెరంగున "జ్వరాఽవసృష్టో రక్ష్యశ్చ యావత్కాలం యతో యతః" అను ప్రశ్నమున కుత్తర మొసంగబడెను. ప్రశ్నమున—జ్వరావసృష్టః యతః రక్ష్యః? జ్వరవిముక్తుడు ఏయేవిషయములనుండి కాపాడదగినవాడు (ఏయేవిషయములను విడచియుండవలెనని ప్రశ్నము), యతః రక్ష్యః? అట్టి నిషిద్ధవిషయముల నెందుకు విడువవలెను. (దాన గల్గుఫలమేమి? యని రెండవప్రశ్నము), అట్టి నిషిద్ధవిషయముల నెంతకాలము విడువ వలెనని యావత్ కాలం? అని మూడవప్రశ్నము. అందు "సజ్వరో జ్వర.........శనాని చ" అని మొదటిప్రశ్నమున కుత్తరముగ వర్జ్యములు నిర్దేశింపబడినవి. "తథా జ్వరశ్శమం యాతి ప్రశాన్తో జాయతే న చ" అని రెండవప్రశ్న

మున కుత్తరముగ నిషిద్ధముల విడుచుటచే గల్గుఫలము నిర్దేశింపబడినది. "వ్యాయామం చ వ్యవా......యావన్న బలవాన్ భవేత్" అని మూడవప్రశ్నమున కుత్తరముగ వ్యాయామాదుల వర్జింపదగినకాలనియమము నిర్దేశింపబడినది.)

శమించినజ్వరము మరల వచ్చుటకు కారణములు. దాన గల్గు నుపద్రవములు.

మూ. అసంజాతబలో యస్తు జ్వరముక్తో నిషేవతే. 334
వర్జ్యమేతన్నరస్తస్య పునరావర్తతే జ్వరః,
దుర్హ్రతేషు చ దోషేషు యస్య వా వినివర్తతే. 335
స్వల్పేనాప్యపచారేణ తస్య వ్యావర్తతే పునః,
చిరకాలపరిక్లిష్టం దుర్బలం హీనచేతసమ్. 336
అచిరేణైవ కాలేన స హన్తి పునరాగతః,
అథ వాపి పరిపాకం ధాతుష్వేవ క్రమాన్మలాః. 337
యాన్తి జ్వరమకుర్వన్తః తే తథాఽప్యపకుర్వతే,
దీనతాం శ్వయథుం గ్లానిం పాణ్డుతాం నాన్నకామతామ్. 338
కణ్డూరుత్కోఠపిటకాః కుర్వన్త్యగ్నిం చ తే మృదుమ్,
ఏవమన్యేఽపి చ గదాః వ్యావర్తన్తే పునర్గతాః. 339
అనిర్ఘాతేన దోషాణాం అల్పైరప్యహితైర్నృణాం,

వ్యా. జ్వరము నివర్తించినవెంటనే శరీరమునకు బలము కల్గక మునుపే పైని నిషేధింపబడిన వ్యవాయాదులను చేసినను నివర్తించినజ్వరము మరల వచ్చును. మరియు దోషములను చక్కగ హరింపజేయక జ్వరమును మాత్రము హరింపజేసిన నట్టిజ్వరము నివర్తించియు స్వల్పముగ నపథ్యము చేసినను జ్వరము మరల వ్యాపించును. ఇంతకు మునుపే చాలకాలము జ్వరముచే బాధింపబడి మిగుల క్లేశమునొంది శరీరబలము నశించి మనస్సు హీనబలముగ నున్నవానికి మరల జ్వరము వెంటనే వచ్చునెడ వాని నతిశీఘ్రముగ చంపును.

లేక పైజెప్పినరీతిగ జ్వరమును మరల కల్గించకున్నను మలములు ధాతువులయందే లీనములై పరిపాకము క్రమముగ జెందుచున్నను, స్వల్పాపచారము జేసిన రోగికి అపకారమునే చేయును. దీనత్వమును, వాపును, గ్లానిని, పాండురోగమును, అన్నద్వేషమును, దురదను, దేహముపైని దద్దురులును, పిటికలను, అగ్నిమాంద్యమును కల్గించును.

ఇత్తెరంగుననే తక్కినరోగములయందును దోషములు పూర్తిగ హరించక రోగములు మాత్రము నివర్తించినపుడు స్వల్పమాత్రమైన యపథ్యమును సేవించినను మరల తిరగబడి వ్యాపించి బాధింప దొడంగును. (ఇత్తెరంగున "ప్రశాంతః కారణైర్యైశ్చ పునరావర్తతే జ్వరః" అను ప్రశ్నమున కుత్తరము చెప్పబడియె.

## పునరావర్తకజ్వరచికిత్స.

మూ. నివృత్తేఽపి(నిర్వృత్తేఽపి)జ్వరే తస్మాత్ యథావస్థం యథాబలమ్.
యథాప్రాణం హరేద్దోషం ప్రయోగైర్వా శమం నయేత్,
మృదుభిశ్శోధనైశ్శుద్ధిః యాపనావస్తయో హితాః. 341
హితాశ్చ లఘవో యూషాః జాఙ్గలామిషజా రసాః,
అభ్యఙ్గోద్వర్తనస్నానధూపనాన్యఞ్జనాని చ. 342
హితాని పునరావృత్తే జ్వరే తిక్తఘృతాని చ,

వ్యా. శమించినజ్వరము పైజెప్పినకారణములచే మరల వ్యాపించిన జ్వరమునందు దానియవస్థావిశేషములను, జ్వరముయొక్కయు రోగియొక్కయు బలాబలములను, చక్కగ గమనించి అట్టి యవస్థాదివిశేషములకు దగినట్టులు దోషముల హరింపజేయ వలెను. లేక చికిత్సాప్రయోగములచే శమింపజేయనగును. అట్టి జ్వరమున మృదువులైన శోధనౌషధములచే నవస్థాద్యనుగుణముగ శోధనము జేయుటయు, యాపనావస్తుల బ్రయోగించుటయు, మిక్కిలి తేలికలైన (శీఘ్రముగ జీర్ణము కాగల) యూషములను, జాంగలజంతువుల మాంసరసములను నాహారమునకై యుపయోగించుటయు, అభ్యంగనంబును, ఉద్వర్తనంబును, స్నానంబును ధూపమువేయుటయు, అంజనంబులును, చాల హితకరములు. తిక్తరసౌషధములచే సిద్ధమైన తిక్తక-పంచతిక్తకఘృతము మున్నగునవియు హితకరములు.

## కొన్ని కారణవిశేషములచే గల్గిన పునరావర్తకజ్వరచికిత్స.

మూ. గుర్వభిష్యన్ద్యసాత్మ్యానాం భోజనాత్పునరాగతే. 343
లఙ్ఘనోష్ణోపచారాదిః క్రమః కార్యశ్చ పూర్వవత్,
కిరాతతిక్తకం తిక్తా ముస్తం పర్పటకోఽమృతా. 344
ఘ్నన్తి పీతాని చాభ్యాసాత్ పునరావర్తకం జ్వరం,

వ్యా. మరియు గురుపదార్థములను అభిష్యందిపదార్థములను అసాత్మ్యములగు పదార్థములను భుజించుటచేత మరల వచ్చిన జ్వరమునందు లంఘనము ఉష్ణోపచారములు

మున్నగు చికిత్సాక్రమము ననుసరించి యుపచరింపనగును. మరియు నేలవేము, వేము, తుంగగడ్డలు, పర్పాటకము, తిప్పతీగె, పీనికషాయమును అప్పుడప్పుడును త్రాగుచున్న యెడ పునరావర్తకజ్వరమును హరించును. (అభిష్యన్ది యన:—పిచ్ఛిలంబును గురుత్వంబును కల్గియుండుటచేత రసవహాంబులగు సిరల నడ్డగించి గురుత్వమును కల్గించునది యభిష్యంది నాబడును.) ఇత్తెరంగున "యాంశ్చాపి పునరావృత్తం క్రియాః ప్రశమయన్తి తమ్." అను ప్రశ్నమున కుత్తరమొసగబడెను.

అనుక్తజ్వరచికిత్సాసంగ్రహము.

మూ. తస్యాం తస్యామవస్థాయాం జ్వరితానాం విచక్షణః. 345
జ్వరక్రియాక్రమాపేక్షీ కుర్యాత్తత్తచ్చికిత్సితం,

వ్యా. జ్వరముల నుద్దేశించి చెప్పబడిన సామ-నిరామాద్యవస్థావిశేషముల జక్కగ గమనించి, ఆయాయవస్థానుసారముగ నచ్చటచ్చట జెప్పబడిన చికిత్సాక్రమము ననుసరించి ఆయాచికిత్సలను జ్వరితులకు జేయనగును. (పై వివరింపబడిన చికిత్సలే కాక జ్వరముయొక్క అవస్థావిశేషాదుల గమనించి దేశకాలబలాదుల విమర్శించి క్రియాక్రమానుసారముగ తత్తదుచితచికిత్సల గల్పించి జ్వరితులకు చికిత్స జేయవలెనని భావము.)

జ్వరచికిత్సావశ్యకత.

మూ. రోగరాట్ సర్వభూతానాం అన్తకృద్దారుణో జ్వరః. 346
తస్మాద్విశేషతస్తస్య యతేత ప్రశమే భిషక్,

వ్యా. జ్వరము రోగముల కన్నిటికిని రాజై సర్వప్రాణులను హింసించుశక్తి కల్గినది కావున మిక్కిలి క్రూరమైనది. కావున నట్టి క్రూరమైన జ్వరమునకు చికిత్స జేయువిషయమున వైద్యుడు మిగుల శ్రద్ధవహించి చికిత్స జేయుట ప్రధానకృత్యము.

అధ్యాయవిషయసంగ్రహము.

మూ. యథాక్రమం యథాప్రశ్నం ఉక్తం జ్వరచికిత్సితమ్. 347
ఆత్రేయేణాగ్నివేశాయ భూతానాం హితమిచ్ఛతా,

వ్యా. జ్వరచికిత్సనుగురించి యగ్నివేశు లడిగినప్రశ్నములవరుస ననుసరించి ప్రశ్నక్రమానుసారముగ జ్వరచికిత్సితమును సకలభూతములకును హితముగోరు నాత్రేయమహర్షి యగ్నివేశుల కుపదేశించెను.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, చికిత్సాస్థానే
జ్వరచికిత్సితం నామ తృతీయోఽధ్యాయః.

ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకమహర్షిచే సంస్కరింపబడినదియు నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి చికిత్సాస్థానమున జ్వరచికిత్సితమనునది తృతీయాధ్యాయము సమాప్తము.

---

## చతుర్థాధ్యాయము.

అవతరణిక:—రక్తపిత్తము జ్వరసంతాపమువలన కల్గునని "జ్వరసన్తాపాద్రక్తపిత్తముదీర్యతే." అనువాక్యముచే జెప్పబడినది. కావున జ్వరచికిత్సను జెప్పినపిదప రక్తపిత్తచికిత్స చెప్పబడును:—

మూ. అథాతో రక్తపిత్తచికిత్సితం వ్యాఖ్యాస్యామః. 1
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. 2

వ్యా. జ్వరచికిత్సితమును జెప్పినపిదప రక్తపిత్తచికిత్సితమును భగవత్స్వరూపుడగు నాత్రేయు డుపదేశించినదానికన్న న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించి చెప్పెదనని యర్థము. (రక్తపిత్తచికిత్సితాభిధాయకాధ్యాయము జ్వరచికిత్సితము అని అధ్యాయసంజ్ఞ. అభిధానాభిధేయముల కభేదము నవలంబించి రక్తపిత్తచికిత్సాబోధకాధ్యాయము రక్తపిత్తచికిత్సితమని చెప్పబడును).

రక్తపిత్తమునుగూర్చి శిష్యకృతప్రశ్నము.

మూ. విహరన్తం జితాత్మానం పఞ్చగఙ్గే పునర్వసుం,
ప్రణమ్యోవాచ నిర్మోహం అగ్నివేశోఽగ్నివర్చసమ్. 3
భగవన్! రక్తపిత్తస్య హేతురుక్తః సలక్షణః,
వక్తవ్యం యత్పరం తస్య వక్తుమర్హసి తత్ గురో! 4

వ్యా. పంచగంగమను మహాపుణ్యక్షేత్రమున సంచరించువాడును, ఇంద్రియముల స్వవశమున నుంచుకొనినవాడును, మోహనిర్ముక్తుడును, అగ్నితో సమానమైన వర్చస్సు కలవాడును నగు పునర్వసువును, అగ్నివేశు లీక్రింద చెప్పబడువిధముగ ప్రశ్నము జేసెను:—

ఓమహాత్మా! గురువర్యా! రక్తపిత్తరోగము నుద్దేశించి యుత్పత్తికారణములును, దానిలక్షణంబులును విస్తరముగ జెప్పబడినవి. ఇక రక్తపిత్తమునుగూర్చి చెప్పవలసిన పరిశిష్టాంశమును (చికిత్సను) ఆనతీయవలెను. (అని యగ్నివేశులు ప్రశ్నముజేసెను).

## గురువాసంగినయుత్తరము; రక్తపిత్తహేతువులు.

మూ. గురురువాచ:—

మహాగదం మహావేగమగ్నివత్ శీఘ్రకారి చ,
హేతులక్షణవిచ్ఛీఘ్రం రక్తపిత్తముపాచరేత్. 5
తస్యోష్ణం తీక్ష్ణమమ్లం చ కటూని లవణాని చ,
ఘర్మశ్చాన్నవిదాహశ్చ హేతుః పూర్వం నిదర్శితః. 6

వ్యా. రక్తపిత్తము రోగములలో చాల గొప్పదియు, మిక్కిలి వేగము కల్గినదియు, అగ్నివలె మిక్కిలి శీఘ్రముగ పనిచేయునదియు నగును. కావున అట్టి రక్తపిత్తముయొక్క కారణములను లక్షణములను చక్కగ తెలిసినవైద్యవరుడు శీఘ్రముగనే చికిత్స జేయవలెను. (ఇయ్యది మిగుల శీఘ్రకారియై క్రూరముగ నుండును కావున హేతులక్షణములచే శీఘ్రముగ గమనించి "క్రియాకాలం న హాపయేత్" అని చెప్పినప్రకారము వెంటనే చికిత్స జేయవలెనని భావము).

అట్టి రక్తపిత్తమునకు ఉష్ణంబును, తీక్ష్ణంబును, అమ్లంబును, కటురసంబును, లవణరసంబులును నగు నన్నపానంబులును, ఆతపంబును, విదాహకరములగు నన్నపానంబులును కారణములగును. ఈకారణములే నిదానస్థానమున "యదా జన్తుః యవకోద్దాలక...లోహితం చ స్వప్రమాణమతివర్తతే" అను గ్రంథముచే విపులముగ వివరింపబడినవి. మరియు హేతులక్షణములు రక్తపిత్తనిదానమున విపులముగ జెప్పబడినను చికిత్సాప్రకరణవశమునంజేసి శీఘ్రోపస్థితికై మరల ననువదింపబడినది. "అన్నవిదాశ్చ" అన—విదాహకరములగువస్తువుల సంబంధముచేనైనను, ప్రకుపితమైన పిత్తముచే నన్నవహస్రోతస్సు దుష్టమగుటవలనను విదగ్ధమగునన్నము రక్తపిత్తకారణమని యర్థము. ఈవిషయము స్థలాంతరమున నిట్లు చెప్పబడినది:—"స్రోతస్యన్నవహే పిత్తం పక్త్వా వా యస్య తిష్ఠతి, విదాహి భుక్తమన్యద్వా తస్యాప్యన్నం విదహ్యతే."

## రక్తపిత్తసంప్రాప్తి.

మూ. తైర్హేతుభిస్సముత్క్లిష్టం పిత్తం రక్తం ప్రపద్యతే,
తద్యోనిత్వాత్ ప్రపన్నం చ వర్ధతే తత్ ప్రదూషయేత్. 7
తస్యోష్మణా ద్రవో ధాతుః ధాతోర్ధాతోః ప్రసిచ్యతే,
స్విద్యత స్తేన సంవృద్ధిం భూయ స్తదధిగచ్ఛతి. 8

వ్యా. పైజెప్పబడిన ఉష్ణతీక్ష్ణాదిసేవనము మున్నగుకారణములచేత పిత్తము ప్రకుపితమై రక్తమును (రక్తమునకు స్థానమైన ప్లీహ, యకృత్తుల) జేరును. అట్టి పిత్తమునకు రక్తమును కారణముగజేసి కల్గునదికావున రక్తస్థానమున జేరిన (ద్రవరూపమైన) పిత్తము (రక్తసంబంధమువలన) వృద్ధినొంది యారక్తమును చెరచును. అట్టి పిత్తముయొక్క ఊష్మముచేత (ఆవిరిరూపమైన ద్రవముచేత) మాంసాదిధాతువులయొక్క ద్రవాంశము అధికముగ స్రవించును. పిత్తోష్మముచేత స్రవించుచున్న మాంసాదిధాతుద్రవాంశముచేత పైజెప్పినరీతిగ పిత్తముతో గూడిన రక్తము మరింత మిక్కిలి వృద్ధినందును.

ఇచ్చట "పిత్తం స్వేదో రసో లసీకా రుధిరమామాశయశ్చ పిత్తస్థానాని, తత్రాప్యామాశయో విశేషేణ పిత్తస్థానమ్" (సూ. ౨౦. అ.) అనువాక్యముచేత పిత్తమునకు రక్తము స్థానమని తెలియుచున్నది; అయినను సంప్రాప్తిమహిమంజేసి పిత్తము ప్రధానస్థానమైన యామాశయమును వదలి రక్తమున జేరునని తెలియుటకై మరల నిచట "రక్తం ప్రపద్యతే"అని చెప్పబడినది. మరియు "అసృజః పిత్తమ్" అనువాక్యప్రకారము రక్తమువలన పిత్తద్రవము పుట్టునని తెలియుచున్నది. కావున నిచట "తద్యోనిత్వాత్" అని చెప్పబడినది. అట్టి రక్తపిత్తములు రెండును కలిసినప్పుడు పిత్త ముత్కటముగ వృద్ధినొందుట సాజము.

## రక్తపిత్తమని పేరుకల్గుటకు కారణము.

మూ. సంయోగాద్దూషణాత్తత్తు సామాన్యాద్గన్ధవర్ణయోః,
రక్తస్య పిత్తమాఖ్యాతం రక్తపిత్తం మనీషిభిః. 9

వ్యా. పిత్తము పైజెప్పినరీతిగ రక్తముతో కలియుటవలనను, రక్తమును చెరచుటంజేసియు, గంధవర్ణములచే రక్తముతో సమానముగ నుండుటచేతను పిత్తము రక్తపిత్తమని చెప్పబడును.

## రక్తపిత్తోత్పత్తిస్థానము.

మూ. ప్లీహానం చ యకృచ్చైవ తదధిష్ఠాయ వర్తతే,
స్రోతాంసి రక్తవాహీని తన్మూలాని హి దేహినామ్. 10

వ్యా. రక్తమును శరీరమున వ్యాపింపజేయు స్రోతస్సులు యకృత్ప్లీహముల నాధారముగ జేసికొని యుండును; (కావున రక్తమునకు యకృత్తును ప్లీహములును ముఖ్యస్థానములుగ నుండును). కావున అట్టి రక్తసంయోగముచే జనించు రక్తపిత్తంబును యకృత్ప్లీహములనే యాధారముగ జేసికొని శరీరమునం దూర్ధ్వమార్గముగను అథో

మార్గముగను వ్యాపించి బైటవెడలును. (ఈవిషయమునే వాగ్భటాచార్యులు "ప్రథ వత్యసృజస్థ్సానాత్ ప్లీహతో యకృతశ్చ తత్" అని స్పష్టముగ జెప్పిరి. మరియు "తద ధిష్ఠాయ వర్ధతే" అనుపాఠాంతరమున యకృత్ప్లీహములయందలి రక్తముతో గలిసి మిక్కిలి వృద్ధినొందునని యర్థము.)

శ్లైష్మికాదిరక్తపిత్తలక్షణములు.

సూ. సాన్ద్రం సపాణ్డు సస్నేహం పిచ్ఛిలం చ కఫాన్వితం,
శ్యావారుణం సఫేనం చ తను రూక్షం చ వాతికమ్. 11
రక్తపిత్తం కషాయాభం కృష్ణం గోమూత్రసన్నిభం,
మేచకాగారధూమాభం అఞ్జనాభం చ పైత్తికమ్. 12
సంసృష్టలిఙ్గం సంసర్గాత్ త్రిలిఙ్గం సాన్నిపాతికం,

వ్యా. కఫప్రకోపమున గల్గిన రక్తపిత్తమున చిక్కనై పాండువర్ణంబును, జిడ్డు కల్గినదియు, జిగురుగ నుండునదియు నగు రక్తము వెడలును. వాతప్రకోపమున జనించిన రక్తపిత్తమున శ్యావ - అరుణవర్ణంబును, నురుగుతో గూడినదియు, పలుచనైనదియు, రూక్షంబును (జిడ్డులేనిదియు) నగురక్తము వెడలును. కేవల పిత్తప్రకోపమున జనించిన రక్తపిత్తమున కాషాయవర్ణంబైనను (పాదిరిపువ్వువలె తెలుపును ఎరుపును కలిసిన మిశ్రవర్ణము), నల్లని రంగైనను, గోమూత్రమువంటి రంగైనను, మేచక (ఆకుపచ్చయు నలుపును కలిసిన) వర్ణంబైనను, కరదూపపురంగైనను, కాటుకరంగైనను కల్గిన రక్తము వెడలును. రెండేసిదోషముల సంసర్గమున గల్గిన రక్తపిత్తమున నాదోషములకు వేరువేర జెప్పిన లక్షణములు మిశ్రములుగ నుండును. త్రిదోషముల సన్నిపాతముచే గల్గిన రక్తపిత్తమున త్రిదోషలక్షణములును మిశ్రములుగ నుండును.

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—రక్తపిత్తసంప్రాప్తియందు "తైస్తైర్హేతుభిస్సముత్క్లిష్టం పిత్తం రక్తం ప్రపద్యతే......భూయస్తదభిగచ్ఛతి" అనుగ్రంథముచేత ఉష్ణతీక్ష్ణాదిసేవనచే ప్రకోపమునొందిన పిత్తము రక్తముతో గూడి దానిని చెరిచి రక్తపిత్తరూపము నొందునని చెప్పబడినది. ఈసంప్రాప్తిస్వరూపమునుబట్టి యీవ్యాధియందు పిత్తమే ప్రధానముగ నుండునని తెలిసెడి. ఇట్లుండ రక్తపిత్తమున వాతికశ్లైష్మికభేదము లెట్లు సంభవించునని ప్రశ్న చేసినచో రక్తపిత్తసామాన్యముగ పిత్తము ప్రధానమై యున్నను, కఫము స్వకారణములచే నుత్కటముగ వృద్ధినొంది ప్రకుపితమై పైజెప్పినరీతిగ సాంద్ర-పాండుత్వాదిస్వలక్షణముల జూపినచో నయ్యది కఫజమనియు,

అత్తెరంగుననే వాతము ప్రకుపితమై శ్యావారుణాది స్వలక్షణముల జూపినచో నయ్యది వాతికమనియు, పిత్తము మాత్రము ప్రకుపితమై కషాయాది స్వలక్షణముల జూపినయెడ పైత్తికరక్తపిత్తమనియు వ్యవహరింపబడును. ఇత్తెరంగుననే జ్వరసామాన్యముగ పిత్తము ప్రధానముగనున్నను, గుల్మసామాన్యముగ వాతము ప్రధానముగ నున్నను శ్లైష్మికవాతికాదిభేదములును ఆయాదోషముల యౌత్కట్యమునుబట్టి వ్యవహరింపబడునని యెఱుంగునది.

దోషభేదముచే రక్తపిత్తసాధ్యాఽసాధ్యభేదములు.

మూ. ఏకదోషానుగం సాధ్యం ద్విదోషం యాప్యముచ్యతే.	13
యత్త్రిదోషమసాధ్యం తత్ మన్దాగ్నిరతివేగవత్,
వ్యాధిభిః క్షీణదేహస్య వృద్ధస్యాఽనశ్నతశ్చ యత్.	14

వ్యా. పైజెప్పబడిన రక్తపిత్తభేదములలో నేకదోషలక్షణయుక్తమైనది సాధ్యము. రెండుదోషములయొక్క లక్షణములతో గూడినది యాప్యము. త్రిదోషలక్షణములతో గూడినది యసాధ్యము. మరియు నితరవ్యాధులచే శరీరము క్షీణించి వానికి సంభవించినదియు, వృద్ధునకు సంభవించినదియు, ఆహారమును భుజించినవానికి సంభవించినదియు జఠరాగ్ని మందగించినవానికి మిక్కిలి వేగముతో కూడిన రక్తపిత్తంబును అసాధ్యము.

రక్తపిత్తగతిభేదములు, దానింబట్టి సాధ్యాసాధ్యత్వము.

మూ. గతిరూర్ధ్వమధశ్చైవ రక్తపిత్తస్య దర్శితా,
ఊర్ధ్వా సప్తవిధద్వారా ద్విద్వారా త్వధరా గతిః.	15
సప్తద్వారాణి శిరసి ద్వే చాధః; సాధ్యమూర్ధ్వగం,
యాప్యం త్వధోగం మార్గౌ తు ద్వావసాధ్యం ప్రపద్యతే.	16

వ్యా. రక్తపిత్తము వెడలుమార్గము ఊర్ధ్వ - అధోభేదములచే రెండుతెరంగులగును. అందూర్ధ్వమార్గము ఏడువిధములైనద్వారములు కల్గియుండును. అధోగతిరూపమైనది రెండుద్వారములు కల్గియుండును. అందు ఊర్ధ్వగతికి సంబంధించిన రంధ్రము లేడును శిరస్సున జేరియుండును. (ముక్కులు కన్నులు చెవులును రెండేసియు, నోరును చేరి యేడురంధ్రములును శిరస్సున నుండునవి. అట్టి రంధ్రముల మార్గముగ జేసికొని రక్తపిత్తము వెడలుటంజేసి యయ్యవి రక్తపిత్తమార్గము లనియు; ఆమార్గముల వెడలు రక్తపిత్తము ఊర్ధ్వగతమనియు చెప్పబడును). రక్తపిత్తమువెడలు అధోమార్గము రెండు ద్వారములు కల్గియుండును. (శరీరమునందధోభాగమున నుండు గుద - మేఢ్రరంధ్ర

ముల నాశ్రయించినమార్గము అధోగతి యని చెప్పబడును. అట్టి యధోభాగమున గల రంధ్రముల రెంటినుండి వెడలు రక్తపిత్తము అధోగత రక్తపిత్త మనబడును).

అందు ఊర్ధ్వగతరక్తపిత్తము సాధ్యము. అధోగతరక్తపిత్తము యాప్యము. అట్టి యూర్ధ్వాధోమార్గముల రెంటియందును (సమకాలమున) వెడలు రక్తపిత్తము అసాధ్యము.

వేరొకగతిభేదము, దానియసాధ్యత్వము.

మూ. యదా తు సర్వచ్ఛిద్రేభ్యః రోమకూపేభ్య ఏవ చ,
వర్తతే తామసంఖ్యేయాం గతిం తస్యాహురాన్తికీమ్. 17

వ్యా. మరియు పైజెప్పినరీతిగ శరీరమునందలి యూర్ధ్వాధోభాగముల రెంటియందలి తొమ్మిదిద్వారములనుండియు శరీరమునందలి రోమరంధ్రముల నన్నిటినుండియు రక్తపిత్తము ఎప్పుడు వెడలునో అట్టి మార్గము సంఖ్యాతీతముగ నుండును. అట్టి సంఖ్యాతీతములగు రంధ్రముల నాశ్రయించి వెడలు రక్తపిత్తము మిక్కిలి అసాధ్యమై ప్రాణాంతకర మగును.

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—రక్తపిత్తము గతిభేదముచే మూడువిధములు. అందు శరీరమునందలి కంఠమునకు పైభాగముననుండు నోరు నాసారంధ్రములు కన్నులు చెవులు అనునీ యేడురంధ్రముల మార్గముగ జేసి వెడలునది యూర్ధ్వగతరక్తపిత్తము. శరీరమునం దధోభాగమున నుండు గుద-మేఢ్రరంధ్రముల మార్గముగ జేసికొని వెడలు రక్తపిత్తము అధోగతము. (స్త్రీలకు యోనిరంధ్రము కూడ మార్గమగును). అట్టి యూర్ధ్వాధోమార్గములగు తొమ్మిది రంధ్రములనుండి వెడలునది యుభయగతరక్తపిత్తము. ఈ యుభయగతరక్తపిత్తమును ఈతంత్రకారుడు ప్రత్యేకముగ జెప్పకున్నను "మార్గౌ తు ద్వావసాధ్యం ప్రపద్యతే" అని చెప్పుటచేత అర్థవశమున లభించును. మరియు నీమూడు మార్గములు కాక యూర్ధ్వాధోరంధ్రముల తొమ్మిదినుండియు రోమరంధ్రము లన్నిటినుండియు నేకకాలమున రక్తపిత్తము స్రవించునెడ నీగతిభేదము సంఖ్యాతీతమగుననియు, నియ్యది మిక్కిలి యసాధ్యమనియు నాల్గవమార్గ మొక్కటి "యదా తు సర్వ...... గతిం తస్యాహురాన్తికమ్" అనువాక్యముచే జెప్పబడినది. ఈతంత్రకారునియాశయము ఊర్ధ్వాధోరంధ్రముల నేకకాలమున వెడలునది యుభయగతమనియు, అట్టి నవరంధ్రములనుండియు రోమకూపములనుండియు నేకకాలమున (సర్వశరీరమునుండియు) వెడలినచో నిది యొక గతిభేదమని తోచుచున్నది.

వాగ్భటాచార్యులును రక్తపిత్తభేదము నిట్లు సెప్పిరి:—"ఊర్ధ్వం నాసాక్షి కర్ణాస్యైః మేఢ్రయోనిగుదైరధః, కుపితం రోమకూపైశ్చ సమస్తైస్తత్ప్రవర్తతే." ఈ వాక్యముచేత నూర్ధ్వాధోరంధ్రములనుండియు రోమకూపములనుండియు వెడలునది యుభయగతరక్తపిత్తమని వీరియభిప్రాయముగ దోచెడిని.

కొన్ని యసాధ్యరక్తపిత్తలక్షణములు.

మూ. యచ్చోభయాభ్యాం మార్గాభ్యాం అతిమాత్రం ప్రవర్తతే,
తుల్యం కుణపగన్ధేన రక్తం కృష్ణమతీవ చ. 18
సంసృష్టం కఫవాతాభ్యాం కణ్ఠే సజ్జతి చాపి యత్,
యచ్చాప్యుపద్రవైస్సర్వైః యథోక్తైస్సమభిద్రుతమ్. 19
హారిద్రనీలహారితతామ్రైర్వర్ణైరుపద్రుతం,
క్షీణస్య కాసమానస్య యచ్చ తచ్చ న సిధ్యతి. 20

వ్యా. ఊర్ధ్వమార్గమునుండియైనను అధోమార్గమునుండియైనను అధికముగ వెడలు రక్తపిత్తంబును, శవమునుబోలె దుర్గంధము కల్గినదియు, మిక్కిలి నల్లనైనదియు, కఫవాతము లనుబంధముగ గల్గినదియు, బైట వెడలక కుత్తుకయందే చేరియుండునదియు, నిదానమున జెప్పిన దౌర్బల్యము అరోచకము మున్నగునుపద్రవములతో కూడినదియు, పసుపు నీలవర్ణము పచ్చనిరంగు తామ్రవర్ణము అనునీరంగులలో నేదైన నొకవర్ణము కల్గినదియు నగు రక్తపిత్తంబును అసాధ్యము. మరి శరీరము కృశించి దగ్గుకల్గినవానికిం గల రక్తపిత్తంబును అసాధ్యమగును.

("మార్గౌ తు ద్వావసాధ్యం ప్రవర్తతే" అను వాక్యముచేత ఊర్ధ్వాధోమార్గముల రెంటిని ఏకకాలమున నాశ్రయించి వెడలు రక్తపిత్తము అసాధ్యమని చెప్పబడినది; కావున నిచ్చట "యచ్చోభయాభ్యాం మార్గాభ్యాం అతిమాత్రం ప్రవర్తతే"అనువాక్యమునకు ఊర్ధ్వాధోమార్గముల వేరువేరుగ నధికముగ వెడలు రక్తపిత్తము యాప్యమని యర్థము).

మరియు రక్తపిత్తోపద్రవములు నిదానస్థానమున నిట్లు చెప్పబడినవి:—"ఉపద్రవాస్తు ఖలు దౌర్బల్యారోచకాఽవిపాకశ్వాసకాసజ్వరాతీసారశోఫశోషపాణ్డురోగాః స్వరభేదశ్చ" అట్టి ద్రవములతో కూడిన రక్తపిత్తము అసాధ్యమని "యచ్చాప్యుపద్రవైస్సర్వైః...ముపద్రుతమ్." అనువాక్యముచే చెప్పబడినది.

## రక్తపిత్తయాప్యలక్షణములు.

మూ. యద్ద్విదోషానుగం యద్వా శాన్తం శాన్తం ప్రకుప్యతి,
మార్గాన్మార్గం చరేద్యద్వా యాప్యం పిత్తమసృక్చ యత్. 21

వ్యా. అనుబంధరూపముగనుండు రెండు దోషములసంబంధమున కల్గిన రక్తపిత్తంబును, శాంతినొంది మరల మరల ప్రకోపించుచుండు రక్తపిత్తంబును, ఊర్ధ్వగతరక్తపిత్తము దానికి నిర్ణీతములగు నాసారంధ్రాదిమార్గములలో నొకరంధ్రమునుండి వేరొండు రంధ్రమునకు సంచరించుచు వెడలు రక్తపిత్తంబును, యాప్యమగును. ("ద్విదోషం యాప్యముచ్యతే" అనుచోట అనుబంధ్య (ప్రధాన) రూపములగు రెండుదోషములచే గల్గిన రక్తపిత్తము యాప్యమని యర్థము. ఇచ్చట "యద్ద్విదోషానుగం" అనువాక్యమునకు అనుబంధ(అప్రధాన)రూపములగు రెండుదోషములసంబంధమున గల్గినది యాప్యమని యర్థము కావున పునరుక్తము కాదని యెరుంగునది. మరియు, "మార్గాన్మార్గం చరేద్యద్వా" అనుచోట ఊర్ధ్వగతరక్తపిత్తమార్గములలో నొకమార్గమునుండి వేరొకమార్గమున సంచరించు రక్తపిత్తము యాప్యమని యర్థము. ఊర్ధ్వాధోమార్గములలో నొకదానినుండి యింకొకదానియందు సంచరించునని యర్థము చెప్పినచో నధోగతరక్తపిత్తము స్వభావముచేతనే యాప్యము కావున మరల చెప్ప నవసరముండదు కావున యసంగతమగును).

## సాధ్యరక్తపిత్తలక్షణములు.

మూ. ఏకమార్గం బలవతో నాతివేగం నవోత్థితం,
రక్తపిత్తం సుఖే కాలే సాధ్యం స్యాన్నిరుపద్రవమ్ 22

వ్యా. మిక్కిలి బలముకలవానికి సుఖమైన (హేమంతశిశిర)కాలమున మిక్కిలి వేగము లేక ఒకమార్గమును ఊర్ధ్వమార్గమును) మాత్ర మనుసరించి నూతనముగ బుట్టి దౌర్బల్యము మున్నగు నుపద్రవములు లేక సంభవించిన రక్తపిత్తము సాధ్యమగును.

ఇచ్చట అధోగతరక్తపిత్తము గుదమేఢ్రములలో నేమార్గమునైన నొకమార్గము ననుసరించి వెడలినను "యాప్యం త్వధోగం" అను వచనముచేత అధోగతసామాన్యముగ యాప్యత్వము నుపదేశింపబడినది కావున యాప్యమేయగును. "ఏకమార్గం" అనుపదముచేత సాధ్యకోటితో చేరిన యూర్ధ్వగత రక్తపిత్తము దానికి సంబంధించిన ముఖనాసాది మార్గములలో నొకమార్గమును మాత్ర మనుసరించి వెడలు రక్తపిత్తము సాధ్యమని చెప్పబడినది.

మరియు, రక్తపిత్తముయొక్క సాధ్య - యాప్య - అసాధ్యత్వభేదములు వాతాది దోషముల బట్టియు, ఊర్ధ్వాదిమార్గములబట్టియు, వ్యాధికిం గలలక్షణములబట్టియు మూడువిధములుగ నుండును. అయ్యవి "ఏకదోషానుగం సాధ్యం" అని యుపక్రమించి పైశ్లోకమువరకును గల గ్రంథముచే విస్తరముగ వివరింపబడినవి.

మరియు పైజెప్పిన లక్షణములలో సాధ్యలక్షణంబులును యాప్యలక్షణంబులును మిశ్రములుగ గల్గియున్న రక్తపిత్తము యాప్యమే యగును. యాప్యలక్షణంబులును అసాధ్యలక్షణంబులును మిశ్రములుగ నున్న రక్తపిత్తము అసాధ్యమే యగును. ఎట్టు లనః— ఏకదోషప్రకోపముచే నధోమార్గమున వెడలు రక్తపిత్తము ఏకదోషమున గల్గినది గాన సాధ్యలక్షణంబును, అధోమార్గమున వెడలుటంజేసి యాప్యలక్షణంబును కలిసి యుండును. ఈలక్షణములు "సాధ్యమూర్ధ్వగతం" "యాప్యం త్వధోగం" అని పైని చెప్పబడినది. ఇట్టి సాధ్యయాప్యలక్షణములుగల రక్తపిత్తము సాధ్యమా? లేక యాప్య మగునా? యని సందిగ్ధమున నయ్యది యాప్యమగునే కాని సాధ్యము కానేరదని నిర్ణయించునది. ఇత్తెరంగుననే త్రిదోషప్రకోపముచే నధోమార్గముగ వెడలు రక్తపిత్తము అధోమార్గగత మగుటచే యాప్యంబును, సాన్నిపాతిక మగుటచే నసాధ్యంబును కావలసి యుండును. ఈలక్షణములు "యాప్యం త్వధోగం" "యత్త్రిదోషమసాధ్యం తత్" అని యుపదేశింపబడినవి. ఇట్టి మిశ్రలక్షణములయందు రక్తపిత్తము అసాధ్యమగునే గాని యాప్యము కానేరదు. ఈవిషయము "నాసాధ్యస్సాధ్యతాం యాతి సాధ్యో యాతి త్వసాధ్యతాం" "సాధ్యా యాప్యత్వమాయాన్తి యాప్యాశ్చాసాధ్యతాం తథా" అని నిదానమున జెప్పబడినది.

—— అధోగత-ఊర్ధ్వగతరక్తపిత్తములకు వేరువేరు నిదానము దోషసంబంధంబును. ——

మూ. స్నిగ్ధోష్ణముష్ణరూక్షం చ రక్తపిత్తస్య కారణం,
అధోగస్యోత్తరం ప్రాయః పూర్వం స్యాదూర్ధ్వగస్య తు  23
ఊర్ధ్వగం కఫసంసృష్టం అధోగం మారుతానుగం,
ద్విమార్గం కఫవాతాభ్యాం ఉభాభ్యామనుబధ్యతే.  24

వ్యా. స్నిగ్ధగుణంబును ఉష్ణవీర్యంబును గలవస్తువులు ఊర్ధ్వగతరక్తపిత్తమునకు ప్రాయికముగ కారణము లగును. ఉష్ణవీర్యంబును రూక్షగుణంబును కలద్రవ్యములు అధోగతరక్తపిత్తమునకు ప్రాయికముగ కారణములగును.

మరియు ఊర్ధ్వగతరక్తపిత్తము ప్రాయికముగ కఫముతో కలిసియుండును. అధోగతరక్తపిత్తము ప్రాయికముగ వాతముతో కలిసియుండును. ఊర్ధ్వాధోమార్గముల రెండిట గల్గిన రక్తపిత్తము కఫవాతముల రెంటి ననుసరించి ప్రాయికముగ నుండును.

ఇచ్చట "ప్రాయః" అనుటచేత నొకసమయమున అధోగతరక్తపిత్తమునకు స్నిగ్ధోష్ణంబులును, ఊర్ధ్వగతరక్తపిత్తమున రుష్ణరూక్షంబులును నిదానము లగుననియు నెరుంగునది.

రక్తపిత్తప్రారంభమున స్తంభననిషేధము.

మూ. అక్షీణబలమాంసస్య రక్తపిత్తం యదశ్నతః,
తద్దోషదుష్టముత్క్లిష్టం నాదౌ స్తమ్భనమర్హతి. 25

వ్యా. శరీరమునందలి బలంబును మాంసంబును క్షీణించకయు తృప్తిగ భుజించుచున్నవానికి దోషప్రకోపమున దుష్టమైనరక్తపిత్తము బైటవెడల సిద్ధముగ నున్నచో నట్టి సంతర్పణజనితరక్తపిత్తమును తొలుతనే స్తంభనౌషధముచే వెడలనీయక నిరోధించుట యుచితము కాదు.

రక్తపిత్తప్రారంభదశయందు స్తంభనము చేసినిచో గల్గునుపద్రవములు.

మూ. గలగ్రహం పూతినస్యం మూర్ఛాయమరుచిం జ్వరం,
గుల్మం ప్లీహానమానాహం కిలాసం కృచ్ఛ్రమూత్రతామ్. 26
కుష్ఠాన్యర్శాంసి వీసర్పం వర్ణనాశం భగన్దరం,
బుద్ధీన్ద్రియోపరోధం చ కుర్యాత్ స్తమ్భితమాదితః. 27
తస్మాదుపేక్ష్యం బలినోబలదోషవిచారిణా(బలదోషౌ ప్రపశ్యతా).
రక్తపిత్తం ప్రథమతః ప్రవృద్ధం (ప్రవృత్తం) సిద్ధిమిచ్ఛతా. 28

వ్యా. రక్తపిత్తము సంతర్పణమున జనించి బైటవెడల నున్నపుడు పైజెప్పిననియమము నుల్లంఘించి స్తంభనౌషధముచే బైట వెడలనీయక నిరోధించినచో గలగ్రహము (కుత్తుకపట్టినట్లుండు వ్యాధివిశేషము), పూతినస్యము (ముక్కున దుర్గంధము), మూర్ఛ, అరోచకము, జ్వరము, గుల్మము, ప్లీహారోగము, ఆనాహము (కడుపుబ్బరము), కిలాసము (శ్వేతకుష్ఠభేదము, సిబ్బెము) మూత్రకృచ్ఛ్రము, ఇతరకుష్ఠములు అర్శోరోగము(మూలవ్యాధి), విసర్పము, వర్ణనాశము (శరీరవర్ణము చెడుట), భగందరము, ఈరోగములు కల్గును. మరియు బుద్ధియొక్కయు ఇంద్రియములయొక్కయు శక్తి తగ్గును. కావున రోగనివృత్తిరూపమైనకార్యసిద్ధిని కోరు వైద్యవరుడు రోగి బలశాలిగ నున్నపుడు వానికి రక్తపిత్తము జనించి బైటవెడల నున్నప్రారంభదశయందు రోగిబలమును దోషసంబంధ

ముసు చక్కగ గమనించి రక్తపిత్తము వృద్ధినొంది ప్రాథమికావస్థనున్నపుడు స్తంభనముచే దానిని వెడలనీయక నిరోధింపక ధారాళముగ వెడలనీయవలెను.

ఇచ్చట "బలదోషవిచారిణా" అనుటచేత రోగియొక్క శరీరబలమును దోష ప్రాబల్యమును చక్కగ గమనించి అవి రెండును హీనబలము లైనపుడు స్తంభనమును చేయవలెనని సూచింపబడినది.

రక్తపిత్తమున లంఘన-తర్పణయోగ్యనిర్ణయము.

మూ. ప్రాయేణ హి సముత్క్లిష్టం ఆమదోషాచ్ఛరీరిణాం,
వృద్ధిం ప్రయాతి పిత్తాసృక్ తస్మాత్తల్లఙ్ఘ్యమాదితః. 29
మార్గౌ దోషానుబన్ధం చ నిదానం ప్రసమీక్ష్య చ,
లఙ్ఘనం రక్తపిత్తాదౌ తర్పణం వా ప్రయోజయేత్. 30

వ్యా. మానవులకు జనించిన రక్తపిత్తము ప్రాయికముగ ఆమదోషమువలన వృద్ధినంది బైటవెడల నారంభించును. కావున నట్టి ప్రారంభావస్థయందు లంఘనరూపమైన చికిత్స జేయుట యుక్తము. మరియు ఊర్ధ్వాధోరూపములగు మార్గములను, వాతాది దోషసంబంధమును, స్నిగ్ధోష్ణాది నిదానభేదములను చక్కగ గమనించి రక్తపిత్తప్రారంభమున లంఘనమునైనను, భోజనరూపమైన తర్పణమునైనను తత్తదుచితముగ నుపయోగింపనగును.

ఇచ్చట రక్తపిత్తము ఊర్ధ్వమార్గము నాశ్రయించి పిత్తము ఆమమై కఫదోష సంబంధము కల్గి స్నిగ్ధోష్ణపదార్థసేవనముచే జనించినయెడ నయ్యది లంఘనయోగ్యమనియు; దీనికి వ్యతిరేకముగ అధోమార్గము నాశ్రయించి పిత్తము పక్వమై వాతసంబంధము కల్గి ఉష్ణరూక్షపదార్థములచే జనించిన రక్తపిత్తమున సంతర్పణ(భోజన)ము యోగ్యమనియు నెరుంగునది. ఈవిషయము "మార్గౌ దోషానుబన్ధం చ......లఙ్ఘనం రక్తపిత్తాదౌ తర్పణం వా ప్రయోజయేత్." అనువాక్యముచే నిర్దేశింపబడినది. మరియు "తర్పయతీతి-తర్పణమ్" అనువ్యుత్పత్తిచేత తర్పణమన అశనము అనునర్థము గ్రహింపనగును.

రక్తపిత్తమున దప్పికి హ్రీబేరాదికషాయము.

మూ. హ్రీబేరచన్దనోశీరముస్తాపర్పటకైశ్శృతం,
కేవలం శృతశీతం వా దద్యాత్తోయం పిపాసవే. 31

వ్యా. కురువేరు, చందనము, వట్టివేరు, తుంగగడ్డలు, పర్పాటకము, వీనిని గూర్చి కాచబడిన కషాయమునైనను, ఈద్రవ్యముల జేర్పకయే కాచబడిన జలమును మాత్రము

నైనను చల్లగనుండునట్లు చల్లార్చి రక్తపిత్తరోగికి దప్పియైనపుడు త్రాగుట కియ్యవలెను.

ఇచ్చట "యచ్చతుర్వింశతిపలం జలం ద్రవ్యపలాన్వితమ్, కషాయః పానసంజ్ఞో ఉయమష్టమాంశావశేషతః." అను పరిభాష ననుసరించి కురువేరు మున్నగు వస్తుసముదాయమునకు ఇరువదినాల్గుభాగములు జలము చేర్చి యెనిమిదవపాలు మిగులునట్లు కషాయము కాచి త్రాగ నుపయోగింపవలెను.

### రక్తపిత్తమున గతిభేదముచే తర్పణ-పేయోపయోగము.

మూ. ఊర్ధ్వగే తర్పణం పూర్వం పేయాం పూర్వమధోగతే,
కాలసాత్మ్యాఽనుబన్ధజ్ఞో దద్యాత్ప్రకృతికల్పవిత్. 32

వ్యా. కాలము, సాత్మ్యము, దోషానుబంధము, ప్రకృతి (ద్రవ్యముల గురులాఘవాది స్వభావము), ఔషధకల్పనాపద్ధతి, వీనిని చక్కగ నెరింగిన వైద్యవరుడు ఊర్ధ్వగతరక్తపిత్తరోగమునందు పైజెప్పిన కాల-సాత్మ్యాద్యనుసారముగ తర్పణమును కల్పించి తొలుత నుపయోగింపనగును. అధోగతరక్తపిత్తమున నత్తెరంగుననే పేయను సిద్ధముచేసి తొలుత నుపయోగింపవలెను.

### రక్తపిత్తమున తర్పణోపయోగము.

మూ. జలం ఖర్జూరమృద్వీకామధూకైస్సపరూషకైః,
శృతశీతం ప్రయోక్తవ్యం తర్పణార్థే సశర్కరమ్. 33
తర్పణం సఘృతక్షౌద్రం లాజాచూర్ణైః ప్రదాపయేత్,
ఊర్ధ్వగం రక్తపిత్తం తత్ పీతం కాలే వ్యపోహతి. 34
మన్దాగ్నేరమ్లసాత్మ్యాయ తత్సామ్లమపి కల్పయేత్,
దాడిమామలకైర్విద్వాన్ అమ్లార్థం చానుదాపయేత్. 35

వ్యా. ఖర్జూరము, ద్రాక్షపండు, అతిమధురము, ఉట్టిసపండు వీనిని జలమున జేర్చి కాచబడినకషాయమును చల్లార్చి యందు చక్కెరను మితముగ జేర్చి రక్తపిత్తమున తర్పణమునకై (తృప్తినందించుటకు) యుపయోగింపనగును. మరియు పేలాలపిండియందు నేతిని తేనెను చేర్చి తర్పణమున కుపయోగింపనగును. పైజెప్పిన రెండుతర్పణయోగములను ఊర్ధ్వగతరక్తపిత్తమున యుక్తకాలమున నుపయోగించినచో రక్తపిత్తము శమించును,

మరియు అగ్ని మందగించినవానికిని పులుపు ఆలవాటై యున్నవానికిని దానిమ్మ పండ్లరసమునైనను ఉసిరికకాయలరసమునైనను చేర్చి యుపయోగింపనగును. లేక పై జెప్పిన తర్పణౌషధము నుపయోగించినవెంటనే యథోచితముగ నుపయోగింపవలెను.

### రక్తపిత్తమున భోజనోపయోగ్యధాన్యములు.

మూ. శాలిషష్టికనీవారకోరదూషప్రశాన్తికాః,
శ్యామాకశ్చ ప్రియఙ్గుశ్చ భోజనం రక్తపిత్తినామ్.　　36

వ్యా. రాజనములు, ఆరువదినాళ్లసంబావులు, నీవారము (నివ్వరివడ్లు), ఆరుకలు, శాంతికములు (జలమధ్యమున ఫలించు ధాన్యవిశేషము), చామలు, కొఱ్ఱలు, ఇవి యన్నియు రక్తరోగికి భోజనమునకై యుపయోగింపనగును. (ఆరుకలు ఉద్దిపప్పు మున్నగువానితో జేరినపుడు రక్తపిత్తమును కల్గించును. ఇతరవస్తుసంసర్గములేని ఆరుకలు కషాయమధురరసంబులును లఘుగుణంబును కల్గియుండుటంజేసి రక్తపిత్తమును హరించునని యెఱుంగునది.)

### రక్తపిత్తమున యోగ్యములగు సూపయూషములు.

మూ. ముద్గా మసూరాశ్చణకాః సమకుష్ఠాఢకీఫలాః,
ప్రశస్తాస్సూపయూషార్థే కల్పితా రక్తపిత్తినామ్.　　37

వ్యా. పెసలు, చిరుసెనగలు, సెనగలు, అడవిపెసలు, కందులు, ఈపప్పులు పప్పుగ వండి రక్తపిత్తమున నుపయోగించుటకును, యూషము (కట్టుగ) కాచి యుపయోగించుటకును చాల ప్రశస్తములు.

### రక్తపిత్తయోగ్యశాకములు.

మూ. పటోలనిమ్బవేత్రాగ్రప్లక్షవేతసపల్లవాః,
కిరాతతిక్తకం శాకం గణ్డీరస్సకటిల్లకః.　　38
కోవిదారస్య పుష్పాణి కాశ్మర్యస్యాథ శాల్మలేః,
అన్నపానవిధౌ శాకం యచ్చాన్యద్రక్తపిత్తనుత్.　　39
శాకార్థం శాకసాత్మ్యానాం తచ్ఛస్తం రక్తపిత్తినాం,
స్విన్నం వా సర్పిషా భృష్టం యూషవద్వా విపాచితమ్.　　40

వ్యా. పొట్ల, వేప, వెదురుమోవు, జువ్వి, ప్రబ్బలి, వీనియొక్క చిగుళ్లను; నేలవేముకూరయు, ఏరువంగకాయలును, కాకరకాయలును, దేవకాంచనపుష్పములును,

పెగ్గుమ్మడుపువ్వులును, బూరుగపువ్వులును, ఇవిగాక అన్నపానవిధియందు చెప్పబడిన శాకములలో రక్తపిత్తహరముగ నుండుశాకంబును వీనిని యుడికించి నేతిలో వేయించి యైన లేక కట్టువలె ద్రవరూపముగ వండి యైనను కూరలతో భుజించు అలవాటుకల రక్తపిత్తరోగులకు కూరలకై యుపయోగించుట చాల ప్రశస్తము.

రక్తపిత్తమున నుపయోగింపదగిన మాంసములు.

మూ. పారావతాన్ కపోతాంశ్చ లావాన్ రక్తాక్షవర్తకాన్,
శశాన్ కపింజలానేణాన్ హరిణాన్ కాలపుచ్ఛకాన్. 41
రక్తపిత్తే హితాన్ విద్యాత్ రసాంస్తేషాం ప్రయోజయేత్,

వ్యా. గువ్వపిట్ట, పావురము, లావుకపిట్ట, రక్తాక్షియను పక్షివిశేషము, వెలిచెపిట్ట, కుందేలు, కపింజలము (పిచ్చుక), నల్లనిజింక, చారలజింక, కాలపుచ్ఛము (నల్లనితోకకలయిఱ్ఱి), ఇవి యన్నియు రక్తపిత్తమున హితకరములు. కావున వానిమాంసరసముల నుపయోగింప నగును.

పైజెప్పిన మాంసములసంస్కారవిశేషము.

మూ. ఈషదమ్లాననమ్లాన్వా ఘృతభృష్టాన్ సశర్కరాన్. 42
కఫానుగే యూషశాకం దద్యాద్వాతానుగే రసం,

వ్యా. పైజెప్పబడిన పారావతము మున్నగుజంతువులమాంసమును కొంచెము పులుపు చేర్చియైనను బొత్తుగ జేర్పకయైనను నేతితో వేయించి యూషముగ నైనను కూరగ నైనను పక్వముజేసి కొద్దిగ పంచదార చేర్చి కఫసంబంధముకల రక్తపిత్తమున నుపయోగించునది. వాతసంబంధము కల రక్తపిత్తమున పైజెప్పినజంతువులమాంసరసమును కొంచెము పులుపు చేర్చి యైనను చేర్పకయైనను పక్వముజేసి పంచదార కలిపి యాహారముతో జేర్చి యుపయోగించునది.

రక్తపిత్తమున నుపయోగింపదగిన యవాగువులు, వానికల్పనాప్రకారము.

మూ. రక్తపిత్తే యవాగూనామతః కల్పః ప్రచక్ష్యతే. 43
పద్మోత్పలానాం కిఞ్జల్కాః పృశ్నిపర్ణీప్రియఙ్గుకాః,
జలే సాధ్యాః రసే తస్మిన్ పేయా స్యాద్రక్తపిత్తినామ్. 44

వ్యా. పిమ్మట రక్తపిత్తరోగి కుపయోగింప యవాగువుల కల్పనాప్రకారము ఈక్రింద వివరింపబడును:— తామరపువ్వులయొక్కయు కలువలయొక్కయు కేసర

ములను కోలపొన్నను ప్రేంకణమును జలమున జేర్చి కాచి యాజలమున పేయాకల్ప ప్రకారముగ గంజి కాచి యుపయోగింపనగును.

రక్తపిత్తమున కొన్ని యవాగువులు, రసములు.

మూ. చన్దనోశీరలోధ్రాణాం రసే తద్వత్సనాగరే,
కిరాతతిక్తకోశీరముస్తానాం తద్వదేవ చ. 45
ధాతకీధన్వయాసామ్బుబిల్వానాం వా రసే శ్రుతా,
మసూరపృశ్నిపర్ణ్యోర్వా, స్థిరాముద్గరసేఽథవా. 46
రసే హరేణుకానాం వా సఘృతే సబలారసే,
సిద్ధాః పారావతాదీనాం రసే వా స్యుః పృథక్పృథక్. 47
ఇత్యుక్తాః రక్తపిత్తఘ్న్యః శీతాస్సమధుశర్కరాః,
యవాగ్వః కల్పనా చైషా కార్యా మాంసరసేష్వపి. 48

వ్యా. మంచిగంధము, వట్టివేళ్లు, లొద్దుగు వీనిని జలమున జేర్చి కాచబడిన కషాయమున శుంఠిని చేర్చి యారసమునైనను; నేలవేము, వట్టివేళ్లు, తుంగగడ్డలు వీనిని జేర్చి కాచబడిన కషాయమునందైనను; ఆరెపువ్వు, దూలగొండి, బిల్వము వీని కషాయమునందైనను; చిరుసెనగలు, కోలపొన్న వీనిని చేర్చి కాచబడిన జలమునందైనను; నేల పొన్న, పెసలు వీనిని జేర్చి కాచబడిన జలమునందైనను; రేణుకలు, చిట్టాముట్టి ఈ రెంటిని చేర్చి కాచబడిన నెయ్యి చేర్చిన యూద్రవమునందైనను; పైజెప్పబడిన పారావతము మున్నగు జంతువులమాంసరసమునందైనను యవాగువులను వేరువేరుగ విధ్యుక్త ప్రకారము సిద్ధముచేసి రక్తపిత్తమున నాహారమునకై యుపయోగింపనగును.

మరియు పైజెప్పిన యవాగువులను తత్తదనుకూలముగ వేరువేర సిద్ధముచేసి చల్లగ నున్నపిదప నందు తేనెను చక్కెరను యథోచితముగ జేర్చి యుపయోగించునది. మరియు పైజెప్పిన యవాగుకల్పనావిధిప్రకారము మాంసరసములయందును సిద్ధముచేసి యుక్తియుక్తముగ నుపయోగించునది.

రక్తపిత్తమునం దవస్థాభేదముచే మాంసోపయోగక్రమము.

మూ. శశస్సవాస్తుకశ్శస్తో విబద్ధే రక్తపిత్తినాం,
వాతోల్బణే తిత్తిరిస్స్యాత్ ఉదుమ్బరరసే శ్రుతః. 49
మయూరః ప్లక్షనిర్యూహే న్యగ్రోధస్య చ కుక్కుటః,
రసే బిల్వే (బిసో) త్పలాదీనాం వర్తకక్రకరా హితా. 50

వ్యా. రక్తపిత్తరోగము కలవారికి మలము వెడలక బద్ధగించి యున్నచో కుందేటి మాంసమును చక్రవర్తికూరతో కలిపి పక్వము జేసి యుపయోగింపవలెను. వాతమధికముగ నున్నపుడు తీతుకపిట్టమాంసమును అత్తిపట్టకషాయమును చేర్చి పక్వము జేసి యుపయోగింపవలెను. మరియు నెమలిమాంసమును జువ్విపట్టకషాయముననుం, కోడిమాంసమును అత్తి రావిపట్టకషాయముననుం, తీతుకపిట్టమాంసమును కొక్కెరమాంసమును బిల్వము నల్లకలువలు మొదలగువానిరసముననుం పక్వము జేసి రక్తపిత్తరోగికి ఆహారమునకై యుపయోగింపనగును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—కుందేటిమాంసము కషాయరసము కల్గియుండుటచే రక్తపిత్తహరంబును, చక్రవర్తికూరను చేర్చి పక్వముచేయు నెడ సంయోగవిశేషప్రభావమునం జేసి మలబద్ధకమును హరించునదియు నగును. మరియు తీతుకపిట్ట నెమలి మున్నగువానిమాంసములు ఉష్ణవీర్యము లగుటచే వాతహరంబులైనను రక్తపిత్తమున హితములు కానోపవు; అయినను వానిని అత్తి మున్నగువానితో జేర్చి పక్వము జేసినపుడు సంస్కారవిశేషమునం జేసి రక్తపిత్తహరములని యుపదేశింపబడినవి. అయ్యవి ఉష్ణవీర్యముచే వాతహరంబులును సంస్కారవిశేషముచే రక్తపిత్తహరంబు లగునని సిద్ధాంతము. ఇత్తెరంగుననే స్థలాంతరములయందు కొన్ని ద్రవ్యములు సంయోగప్రభావముచేతను సంస్కారవిశేషమునం జేసియు వానికి నైజమైన కార్యమునకన్న విరుద్ధమగు కార్యాంతరమును జేయునని యెరుంగునది. పురీషము బద్ధమైనపుడు కుందేటిమాంసమును చక్రవర్తికూరయందు పక్వము జేసి యుపయోగించవలెనని స్థలాంతరమున గూడ నిట్లు చెప్పబడినది:—"విపచేత్తు వాస్తుకరసే శశం విబద్ధే పురీషస్య"

**రక్తపిత్తరోగికి దప్పి కల్గినచో పానార్హమైనజలము.**

మూ. తృష్యతే తిక్తకైస్సిద్ధం తృష్ణాఘ్నం వా ఫలోదకం,
సిద్ధం విదారిగన్ధాద్యైః అథ వా శృతశీతలమ్. 51

వ్యా. రక్తపిత్తరోగికి దప్పి యధికముగ కల్గిన నప్పుడు తృష్ణాఘ్నగణమున జెప్పబడిన తిక్తరసప్రధానములైన ద్రవ్యముల జేర్చి కాచబడిన నీళ్లనైనను, ద్రాక్ష మొదలగుపండ్లను జేర్చి కాచబడిన నీళ్లనైనను, లేక పండ్లరసమునైనను, విదారిగంధాదిగణమున జెప్పిన నేలపొన్న మొదలగు ద్రవ్యముల జేర్చి కాచబడిన జలమునైనను చల్లగ జేసి త్రాగింపనగును.

**రక్తపిత్తమున జలపాననియమము.**

మూ. జ్ఞాత్వా దోషావనుబలౌ బలమాహారమేవ చ,
జలం పిపాసవే దద్యాత్ విసర్గాదల్పశోఽపి వా. 52

వ్యా. రక్తపిత్తమున పిత్తము ప్రధానముగ నుండును కావున వానికి సహకారులై యనుబంధములుగ నుండు వాతకఫములను, రోగియొక్క జాఠరాగ్నిబలమును రోగిశరీర బలమును ఆహారమును వీనియొక్క పరిస్థితిని చక్కగ గమనించి పైజెప్పినరీతిగ పానార్హమైన జలమును తృప్తిగ దప్పి నివర్తించునంతపరిమితముగ నైనను, లేక కొంచెము కొంచెముగ నైనను రోగికిత్రాగించవలెను. (రోగి శరీరము బలిష్ఠమై జఠరాగ్ని బలవత్తరముగ నున్నయెడ జలమును తృప్తిగ దప్పి యణగునంత త్రాగించవలెననియు, బలము తక్కువగ నున్నపుడు కొంచెము కొంచెముగ త్రాగించవలె ననియు "విసర్గాదల్పశోఽపి వా" అని సూచింపబడినది.)

### రక్తపిత్తమున నిదానవర్జనము.

మూ. నిదానం రక్తపిత్తస్య యత్కించిత్సంప్రకాశితం,
జీవితారోగ్యకామైస్తన్న సేవ్యం రక్తపిత్తిభిః. 5౩

వ్యా. రక్తపిత్తరోగము కలవారు జీవితమును ఆరోగ్యమును కోరినచో రక్తపిత్తమునకు కారణములుగ జెప్పినవాని నన్నింటిని బొత్తుగ మానవలెను.

### రక్తపిత్తమున సంశోధనచికిత్స.

మూ. ఇత్యన్నపానం నిర్దిష్టం క్రమశో రక్తపిత్తనుత్,
వక్ష్యతే బహుదోషాణాం కార్యం బలవతాం చ యత్. 54
అక్షీణబలమాంసస్య యస్య సన్తర్పణోత్థితం,
బహుదోషం బలవతో రక్తపిత్తం శరీరిణః. 55
కాలే సంశోధనార్హస్య తద్ధరేన్నిరుపద్రవం,
విరేచనేనోర్ధ్వభాగం అధోగం వమనేన చ. 56

వ్యా. ఇత్తెరంగున రక్తపిత్తరోగికి హితకరములును రక్తపిత్తహరంబులు నగునన్నపానములు క్రమముగ నుపదేశింపబడినవి. ఇక ప్రబలమైన దోషముల కలవారును స్వాభావికమైన శరీరబలము కలవారు నగు రక్తపిత్తరోగులకు చేయవలసిన క్రియాక్రమము ఈక్రింద వివరింపబడును:—

శరీరమునందలి మాంసము కృశించక పుష్టిగ నుండి శరీరబలము పూర్తిగ నున్నవానికి కాలకృతబలము కల్గియుండునపుడును సంతర్పణముచే బలవత్తరమైనదోషము కల రక్తపిత్తము జనించినచో వాడు సంశోధనచికిత్సకు అర్హుడైయున్నచో నుపద్రవముల కెడమీయక వానికి వమనవిరేచనరూపసంశోధనముచే దోషమును హరింపజేయవలెను

అందు ఊర్ధ్వగతరక్తపిత్తమున విరేచనముచేతను, అధోగతరక్తపిత్తమున వమనముచేతను దోషమును వెడలింపజేయనగును. (ఇచ్చట "ప్రతిమార్గం చ హరణం రక్తపిత్తే విధీయతే" అని నిదానస్థానమున జెప్పినప్రకారము పైని వమనవిరేచనచికిత్స విధింపబడినది.)

ఊర్ధ్వగతరక్తపిత్తమున నుపయోగింపదగిన విరేచనౌషధములు.

మూ. త్రివృతామభయాం ప్రాజ్ఞః ఫలాన్యారగ్వధస్య వా,
త్రాయమాణాం గవాక్షీం వా మూలమామలకాని వా. 57
విరేచనం ప్రయుఞ్జీత ప్రభూతమధుశర్కరం,
రసః ప్రశస్యతే తేషాం రక్తపిత్తే విశేషతః. 58

వ్యా. తెగడ, కరకకాయలు, రేలకాయలోనుండు జిగురు, కానుగు, పిన్నపాపర (బుడమ)వేళ్లు, ఉసిరికకాయలు, ఈద్రవ్యములను చూర్ణకల్కాదిరూపముగ నౌషధము చేసి అందు తేనెను పంచదారను విశేషముగ జేర్చి (ఊర్ధ్వగత) రక్తపిత్తరోగమున విరేచనమునకై యుపయోగింపనగును. అందును పైజెప్పిన ద్రవ్యములరసము (కషాయము) రక్తపిత్తరోగమున విశేషముగ నుపయోగించుట చాల ప్రశస్తము.

అధోగతరక్తపిత్తమున నుపయోగింపదగిన వమనౌషధములు.

మూ. వమనం మదనోన్మిశ్రః మన్థస్సక్షౌద్రశర్కరః,
సశర్కరం వా సలిలం ఇక్షూణాం రస ఏవ వా. 59
వత్సకస్య ఫలం ముస్తం మదనం మధుకం మధు,
అధోవహే రక్తపిత్తే వమనం పరముచ్యతే. 60

వ్యా. మ్రంగకాయలను చేర్చి చేయబడిన మంథమున తేనెను పంచదారను కలిపియైనను మ్రంగకాయలను నీళ్లలో కలిపి చక్కెర జేర్చియైనను, చెరకురసమున మ్రంగకాయను చేర్చియైనను, కొడిసెపాలవిత్తులు తుంగగడ్డలు మ్రంగకాయ అతిమధురము వీని కల్కమున తేనెను కలిపియైనను అధోగతరక్తపిత్తమున వమనములకై యుపయోగించుట చాల శ్రేష్ఠమైనది.

రక్తపిత్తమున శుద్ధకోష్ఠునకు జేయదగిన యాహారక్రమము.

మూ. ఊర్ధ్వగే శుద్ధకోష్ఠస్య తర్పణాది క్రమో హితః,
అధోగతే యవాగ్వాదిః న చేత్స్యాన్మారుతో బలీ. 61

వ్యా. ఊర్ధ్వగతరక్తపిత్తమున విరేచనముచే శుద్ధమైన కోష్ఠముకలవానికి తర్పణాదిక్రమము నాచరించుట చాల హితకరము. అధోగతరక్తపిత్తమున వమనముచే శుద్ధమైన కోష్ఠముకలవానికి వాతం బుత్కటముగ లేక సమముగ నున్నచో పేయాది క్రమము ననుసరించి యుపచరించుట చాల ప్రశస్తము.

రక్తపిత్తమున సంశమనము చేయవలసినవిషయములు.

మూ. బలమాంసపరిక్షీణం శోకభారాధ్వకర్శితం,
జ్వలనాదిత్యసన్తప్తం అన్యైర్వా క్షీణమామయైః. 62
గర్భిణీం స్థవిరం బాలం రూక్షాల్పప్రమితాశనం,
అవమ్యమవిరేచ్యం వా యం పశ్యేద్రక్తపిత్తినమ్. 63
శోషేణ సానుబన్ధం వా తస్య సంశమనీ క్రియా,
శస్యతే రక్తపిత్తస్య పరం సాథ ప్రవక్ష్యతే. 64

వ్యా. శరీరమున బలంబును మాంసంబును క్షీణించినవాడును, శోకముచేతను భారమును మోయుటచేతను త్రోవనడచుటచేతను శరీరము కృశించినవాడును, నిప్పుసెగచే నైనను ఎండతాకుడుచే నైనను తాపమునొందినవాడును, ఇతరరోగములచే క్షీణించినవాడును, గర్భిణీస్త్రీయును, ముసలివాడును, బాలుడును, రూక్షాహారమును తినువాడును, అల్పాహారము చేయువాడును, కొద్దిగ భుజించువాడును, వమనవిరేచనముల జేయననర్హుడును, రాజయక్ష్మ పీడితుడును నగువారికి రక్తపిత్తము సంభవించినచో ఆరక్తపిత్తమునకు శోధనరూపచికిత్సను మాని సంశమనరూపచికిత్సను జేయనగును. ఆట్టి సంశమనౌషధ మీక్రింద వివరింపబడును.

రక్తపిత్తమున అటరూషాదిక్వాథము.

మూ. అటరూషకమృద్వీకాపథ్యాక్వాథస్సశర్కరః,
మధుమిశ్రః శ్వాసకాసరక్తపిత్తనిబర్హణః. 65

వ్యా. అడ్డసరము, ద్రాక్షపండు, కరకకాయలు, వీనిని చేర్చి కషాయము కాచి అందు పంచదారను తేనెను కలిపి త్రాగినచో శ్వాసకాసంబులును రక్తపిత్తంబును హరించును.

ఇచ్చట క్వాథపరికల్పనమున "పానీయం షోడశగుణం క్షుణ్ణే ద్రవ్యపలేక్షిపేత్, మృత్పాత్రే క్వాథయేద్గ్రాహ్యం అష్టమాంశావశేషితమ్." అను సామాన్యపరిభాషచేత అడ్డసరము మున్నగు ద్రవ్యములను పలపరిమితమును చక్కగ దంచి పదునారుభాగముల

నీళ్లు పోసి మంటిపాత్రమున నునిచి యెనిమిదవపాలు మిగుల చుండకాచి వడగట్టి యుపయోగించునది. విశేషవిధి లేనిచోట ఈపరిభాష ననుసరించియే కషాయకల్పనము చేయదగును.

అటరూషక్వాథసేవనమున ప్రకారాంతరము.

మూ. అటరూషకనిర్యూహే ప్రియఙ్గుం మృత్తికాఞ్జనే,
వినీయ లోధ్రం క్షౌద్రం చ రక్తపిత్తహరం పిబేత్. 66
పద్మకం పద్మకిఞ్జల్కం దూర్వాం వాస్తుకముత్పలం,
నాగపుష్పం చ లోధ్రం చ తేనైవ విధినా పిబేత్. 67

వ్యా. అడ్డసరమును పైజెప్పినరీతి కషాయము కాచి, అందు ప్రేంకణము, నల్ల (తువరి)మన్ను, రసాంజనము, లొద్దుగు, ఈద్రవ్యములచూర్ణమును తేనెను కలిపి త్రాగిన రక్తపిత్తము శమించును. మరియు ఆకషాయముననే పద్మకము, తామరపువ్వుకేసరములు, గఱిక, చక్రవర్తియాకు, కలువపువ్వులరేకులు, నాగకేసరములు, లొద్దుగుపువ్వులు, వీని చూర్ణమును కలిపి పైజెప్పినరీతిగ త్రాగినచో రక్తపిత్తము శమించును.

ఇచ్చట "కర్షం చూర్ణస్య కల్కస్య గుడికానాం చ సర్వశః, మాత్రా క్షౌద్రఘృతాదీనాం క్వాథస్నేహేషు శస్యతే." అనుపరిభాష ననుసరించి ప్రేంకణము మున్నగు ద్రవ్యములసముదాయచూర్ణమును కర్షపరిమితంబును తేనె కర్షపరిమితంబును కషాయమున జేర్చి త్రాగవలెనని యెరుంగునది.

రక్తపిత్తమున ప్రపౌండరీకాదిప్రయోగము.

మూ. ప్రపౌణ్డరీకం మధుకం మధు చాఽశ్వశకృద్రసే,
యవాసభృఙ్గరజసోః మూలం వా గోశకృద్రసే. 68
వినీయ రక్తపిత్తఘ్నం పేయం స్యాత్తణ్డులామ్బునా,
యుక్తం వా మధుసర్పిర్భ్యాం లిహ్యాత్ గోఽశ్వశకృద్రసమ్. 69

వ్యా. పుండరీకమును గ్రంథ్యమును, అతిమధురమును, తేనెను ఈమూటిని చూర్ణము చేసి గుఱ్ఱపుపేడరసమున కలిపి యీసముదాయమును బియ్యపుకడుగునీటిలో జేర్చియైనను; దూలగొండివేరును గుంటకలగరవేరును చూర్ణముజేసి ఆవుపేడయొక్కయు గుఱ్ఱపుపేడయొక్కయు రసమున కలిపి బియ్యపుకడుగునీటిలో జేర్చియైనను త్రాగినచో రక్తపిత్తము శమించును. మరియు ఆవుపేడయొక్కయు గుఱ్ఱపుపేడయొక్కయు రసమున తేనెను నేతిని కలిపి సేవించినచో రక్తపిత్తము శమించును.

### రక్తపిత్తశామకఖదిరాదిపుష్పచూర్ణము.

మూ. ఖదిరస్య ప్రియఙ్గూణాం కోవిదారస్య శాల్మలేః,
పుష్పచూర్ణాని మధునా లిహ్యాత్ నా రక్తపిత్తికః. 70

వ్యా. చంద్రపువ్వులు, ప్రేంకణపుపువ్వులు, ఎఱ్ఱకాంచనపుపువ్వులు, బూరుగపువ్వులు, వీని నన్నిటిని సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి తేనెతో కలిపి సేవించిన రక్తపిత్తము శమించును.

### శృంగాటకాదిచూర్ణయోగము.

మూ. శృఙ్గాటకానాం లాజానాం ముస్తఖర్జూరయోరపి,
లిహ్యాచ్చూర్ణాని మధునా పద్మానాం కేసరస్య చ. 71

వ్యా. సింగాడిదుంపలు, వరిపేలాలు, తుంగగడ్డలు, ఖర్జూరపుకాయలు, పద్మకేసరములు, వీనిని చూర్ణముచేసి తేనెతో కలిపి సేవించిన రక్తపిత్తము శమించును.

### గ్రథితరక్తపిత్తచికిత్స.

మూ. ధన్వజానామసృక్ లిహ్యాత్ మధునా మృగపక్షిణాం,
సక్షౌద్రం గ్రథితే రక్తే లిహ్యాత్పారావతం శకృత్. 72

వ్యా. రక్తపిత్తమున రక్తము గడ్డకట్టినయెడ జాంగలదేశమునందలి మృగములయొక్కయు పక్షులయొక్కయు రక్తమునైనను, పావురములమలమునైన తేనెతో కలిపి సేవించవలెను.

### రక్తపిత్తమున ఉశీరాదిచూర్ణయోగములు.

మూ. ఉశీర కాలీయక-లోధ్ర-పద్మక-ప్రియఙ్గుకా-కట్ఫల-శఙ్ఖ - గైరికాః,
పృథక్పృథక్ చన్దనతుల్యభాగికాః సశర్కరాః తణ్డులధావనాప్లుతాః
రక్తం సపిత్తం సకఫం, పిపాసాం, దాహం చ పీతాశ్శమయన్తి
సద్యః; కిరాతతిక్తం, క్రముకం, సముస్తం, ప్రపౌణ్డరీకం, కమ
లోత్పలే చ. 74

హ్రీబేరమూలాని, పటోలపత్రం, దురాలభా, పర్పటకో, మృణాళం, ధనఞ్జయోదుమ్బరవేతసత్వక్ న్యగ్రోధశాలేయ యవాస
కత్వక్. 75

తుగాలతా వేతసతణ్డులీయం ససారిబం మోచరసః సమఙ్గా,
పృథక్పృథక్ చన్దనయోజితాని తేనైవ కల్పేన హితాని తత్ర.

వ్యా. వట్టివేళ్లు, కాలీయకము (నల్లనిగంధద్రవ్యవిశేషము), లొద్దుగు, పద్మకమనుగంధద్రవ్యము, ప్రేంకణము, కాయఫలము, శంఖచూర్ణము; గైరికము(కావిరాయి) అనుధాతువిశేషము, వీనినొక్కొకదానిని చందనముతో సమభాగముగచేర్చి చూర్ణముచేసి యాచూర్ణమును బియ్యపుకడుగునీళ్లలో కలిపి, అందు చూర్ణమునకు సమభాగము పంచదార కలిపి త్రాగినచో కఫముతోకూడిన రక్తపిత్తంబును, దప్పియు, తాపంబును, శమించును. (ఇచ్చట 'పృథక్ పృథక్' అని ద్విరుక్తముగ చెప్పుటవలన పైజెప్పబడిన ఉశీరాది ద్రవ్యముల నెనిమిదింటి వేరువేరుగ చందనమున సమభాగముగ జేర్చి యెనిమిదియోగములుగ గల్పింపవలెనని తెలిసెడి. అన్నియోగములయందును ప్రధానముగ చందనమును జేర్పనగును. మరియు:—"మాక్షికం హిఙ్గు, సిన్ధూత్థలవణాద్యాస్తు శాణికాః, సితోపలా గుడక్షౌద్రాః సమా, ఏషా ప్రకల్పనా." అను నగ్నివేశమతపరిభాష ననుసరించి చక్కెరను చూర్ణమునకు సమభాగముగ గూర్పనగును).

మరియు నేలవేము, క్రముకము (ఎఱ్ఱలొద్దుగు), తుంగగడ్డలు, పుండరీకమను గ్రంథ్యము, తామరపువ్వులు, కలువపువ్వులు, కురువేరు, చేమపొట్లాకు, దూలగొండి, పర్పాటకము, తామరకాడలు, మద్దిచెక్క, అత్తిపట్ట, ప్రబ్బలిపట్ట మఱ్ఱిపట్ట, సదాపపట్ట, పెద్దదూలగొండివేరుపట్ట, వెమరుప్పు, నాగకేసరములు, ప్రబ్బలిపేరు, చిఱ్ఱిపళ్లు, సుగంధపాలపట్ట, మోచరసము (బూరుగబంక), మంజిష్ఠి, వీనిని ప్రత్యేకప్రత్యేకముగ చందనమునకు సమభాగముగ జేర్చి వేరు వేరు యోగములుగ గల్పించి పైజెప్పిన కల్పనాప్రకారము చూర్ణమునకు సమభాగము పంచదార కలిపి బియ్యపుకడుగునీటితో కలిపి త్రాగుట రక్తపిత్తమునకు మిక్కిలి హితకరము.

### పైజెప్పినయోగములవిశేషవిధి.

మూ. నిశిస్థితా వా స్వరసీకృతా వా కల్కీ(పాణ్డీ)కృతా వా మృదితాః శృతా వా, ఏతే సమస్తాః గణశః పృథగ్వా రక్తం సపిత్తం శమయన్తి యోగాః. (శమయన్త్యుదీర్ణమ్.) 77

వ్యా. (పైజెప్పబడిన ద్రవ్యములు ఉశీరాదిద్రవ్యము లెనమండును చేరి యొకగణము. "కిరాతతిక్త......యవాసకత్వక్" అని చెప్పిన ద్రవ్యములు వేరొండు గణము. "తుగాలతా......చన్దనయోజితాని" అని చెప్పినది మూడవ గణము.) అట్టి

గణములమూటిలో నొక్కొక గణమును వేరువేరుగనైనను, ఒక్కొకద్రవ్యమునైనను చందనమునకు సమభాగముగ గూర్చి శీతకషాయకల్పనాప్రకారము ద్రవ్యముల నలియ గొట్టి నీళ్లలో వేసి రాత్రికాలమున పూర్తిగ నానబెట్టి యైనను, నీళ్లు బోసి నూరి స్వరస కల్పనవిధిగ చేసియైనను, కల్కముగ చేసియైనను, దంచి నీళ్లు బోసి కషాయముగ (క్వాథ ముగ) కాచియైనను త్రాగించినచో రక్తపిత్తమును హరించును.

ఇచ్చట పైయోగములయందు "పృథక్పృథక్ చన్దనతుల్యభాగికాః" అని యొక్కొక ద్రవ్యమును చందనమునకు సమభాగము జేర్పవలెనని యుపదేశింపబడినది. ఈన్యాయము ననుసరించి గణములుగ జేర్చునపుడును, ఆయాగణసముదాయద్రవ్యము లకు అన్నిటికి సమభాగముగ చందనమును జేర్పవలెనని సంప్రదాయసిద్ధార్థము నెరుం గునది.

## రక్తపిత్తమున ముద్గాదిసాధితశీతకషాయప్రయోగము.

మూ. ముద్గాస్సలాజాః సయవాస్సకృష్ణాః సోశీరముస్తాః సహ చన్దనేన,
బలాజలే పర్యుషితాః కషాయాః రక్తంసపిత్తం శమయన్త్యుదీర్ణమ్.

వ్యా. చిట్టాముట్టిని దంచి జలమున నైచి శీతకషాయవిధిప్రకారము సిద్ధముచేసిన యాజలమున పెసలు, పేలాలు, యవలు, పిప్పళ్లు, వట్టివేళ్లు, తుంగగడ్డలు, చందనము వీని నన్నిటిని నలియగొట్టి చేర్చి రాత్రియంతయు నానబెట్టి త్రాగిన మిక్కిలి తీవ్రమైన రక్తపిత్తమును శమింపజేయును. (ఇచ్చట "పర్యుషితాః కషాయాః" అని బహువచననిర్దే శముచేత ముద్గాదిద్రవ్యముల వేరువేర నొక్కొకదానిని బలాకషాయమున జేర్చి యుప యోగింపవలెనని తంత్రకారాభిప్రాయముగ తోచెడి.)

## వైడూర్యాదిభావితశీతజలపానీయము.

మూ. వైడూర్యముక్తామణిగైరికాణాం
మృచ్ఛఙ్ఖహేమామలకోదకానాం,
మధూదకస్యేక్షురసస్య చైవ
పానాచ్ఛమం గచ్ఛతి రక్తపిత్తమ్.   79

వ్యా. వైడూర్యపుమణి, మంచిముత్యములు, గైరికము (కావిరాయి), నల్లని యిసుక, శంఖము, బంగరు, ఉసిరికకాయలు వీనిని జలమున నునిచి నానబెట్టి యాశీత జలము నయినను, తేనెతో కూడిన జలమునైనను, చెరకురసమునయినను త్రాగినచో రక్త పిత్తము శమించును.

ఉశీరాదిసాధితశీతజలపానవిధి.

మూ. ఉశీరపద్మోత్పలచన్దనానాం పక్వస్య లోష్టస్య చ యః ప్రసాదః,
సశర్కరః క్షౌద్రయుతస్సుశీతః రక్తాతియోగప్రశమాయ దేయః

వ్యా. వట్టివేళ్లు, తామరపువ్వులు, నల్లకలువలు, చందనము ఈద్రవ్యములను జేర్చి నానబెట్టబడిన చల్లని తేటనీళ్లయందైనను, మట్టిపెళ్లను నిప్పులో నెఱ్ఱగ కాల్చి చల్లని నీళ్లలో నునిచి యానీళ్లు చల్లనై యున్నపుడు పైని తేటనీళ్లను గ్రహించి యందైనను చక్కెరను తేనెను కలిపి త్రాగినచో అధికముగ రక్తము వెడలు రక్తపిత్తము శమించును.

రక్తపిత్తశామకప్రియంగ్వాదిశీతకషాయము.

మూ. ప్రియఙ్గుకా చన్దనలోధ్రసారిబా
మధూకముస్తాభయధాతకీజలం,
సమృత్ప్రసాదం సహ యష్టికా (షష్టికా)మ్బునా
సశర్కరం రక్తనిబర్హణం పరమ్. 8

వ్యా. ప్రేంకణము, చందనము, లొద్దుగు, సుగంధపాల, అతిమధురము, తుంగ గడ్డలు, కరకకాయలు, ఆరెపువ్వు, వీనిని చేర్చి సిద్ధముచేయబడిన శీతకషాయమున మట్టి నీటితేటను అతిమధురజలమును పంచదారను చేర్చి త్రాగినచో రక్తపిత్తము శమించును.

కషాయప్రయోగానంతరకృత్యము.

మూ. కషాయయోగైర్వివిధైర్యథోక్తైః దీప్తేఽనలే శ్లేష్మణి నిర్జితే చ,
యద్రక్తపిత్తంప్రశమంనయాతి తత్రానిలస్స్యాదనుతత్రకార్యమ్

వ్యా. పైజెప్పబడిన పలుదెరంగులైన కషాయయోగముల ప్రయోగించుటచే జఠరాగ్నిదీప్తి కల్గి కఫము హరించియున్నను రక్తపిత్తము మాత్రము శమించకున్నచో నట్టియెడ వాతము బలిష్ఠముగ నున్నదని యెరింగి యప్పుడు వాతశామకచికిత్సను క్రింద చెప్పబడువిధముగ చేయనగును.

వాతాధికరక్తపిత్తచికిత్స.

మూ. ఛాగం పయః స్యాత్పరమం ప్రయోగే
గవ్యం శృతం పఞ్చగుణే జలే వా,

సశర్కరం మాక్షికసంప్రయుక్తం
విదారిగన్ధాదిగణైశ్శృతం వా. 83
ద్రాక్షాశృతం నాగరకైశ్శృతం వా
బలాశృతం గోక్షురకైశ్శృతం వా,
సజీరకం సర్షభకం ససర్పిః
పయః ప్రయోజ్యం సితయా శృతం వా. 84

వ్యా. మేకపాలను ఐదుభాగములు నీళ్లు చేర్చి కాచియైనను, ఆవుపాలలో నైదింతలు నీళ్లనైనను ముయ్యాకుపొన్న మొదలగు పంచమూలముల కషాయమునైనను చేర్చి కాచియైనను సిద్ధముచేసి అందు చక్కెరను తేనెను కలిపి త్రాగించవలెను. లేక ఆవుపాలలో ద్రాక్షపండును వైచి కాచియైనను, శుంఠిని చేర్చి కాచియైనను, చిట్టాముట్టిని చేర్చి కాచియైనను, పల్లేరువేళ్లను చేర్చి కాచియైనను సిద్ధముచేసి త్రాగవలెను. లేక ఆవుపాలలో జీలకరనైనను ఋషభకమునైనను చేర్చి కాచి అందు నేతిని చక్కెరను కలిపి త్రాగవలెను.

మూత్రమార్గమున వెడలు రక్తపిత్తమున చికిత్స.

మూ. శతావరీగోక్షురకైశ్శృతం వా శృతం పయోవాప్యథ పర్ణినీభిః,
రక్తం నిహన్త్యాశు విశేషతస్తు యన్మూత్రమార్గాత్సరుజం ప్రయాతి.

వ్యా. చల్లపిల్లి గడ్డలును, పల్లేరును చేర్చి కాచబడిన ఆవుపాలనైన, నేలపొన్న కోలపొన్న అడవిపెసర అడవిమినుము అను పర్ణీచతుష్టయమును చేర్చి కాచబడిన ఆవుపాలనైనను త్రాగినచో రక్తపిత్తము వెంటనే శమించును. మరియు నీయోగములు రెండును మూత్రమార్గమునుండి బాధతోగూడి వెడలు రక్తమును విశేషముగ శమింపజేయును.

గుదమార్గమున వెడలు రక్తపిత్తచికిత్స.

మూ. విశేషతో విట్ప్రథసమ్ప్రవృత్తే పయో మతం మోచరసేన సిద్ధం,
వటావరోహైర్వటశుఙ్గకైర్వా హ్రీబేరనీలోత్పలనాగరైర్వా.

వ్యా. రక్తపిత్తము గుదమార్గమునుండి వెడలుసెడ మోచరసమును (బూరుగబంకను) చేర్చి, కాచబడిన ఆవుపాలను త్రాగుట చాలమంచిది. లేక మఱ్ఱియూడలనైనను మఱ్ఱిచిగుళ్లనైనను కురువేరు నల్లకలువలు శుంఠి ఈమూటినైనను చేర్చి కాచబడిన యావుపాలను త్రాగించవలెను.

రక్తపిత్తమునందాహారాదులు.

మూ. కషాయయోగాన్ పయసా పురా వా
పీత్వాను చాద్యాత్ పయసైవ శాలీన్,
కషాయయోగైరథ వా విపక్వం
ఏతైః పిబేత్ సర్పిరతిప్రవే చ. 87

వ్యా. పైని రక్తపిత్తహరములుగ జెప్పబడిన కషాయయోగములను సిద్ధముచేసి యాకషాయములను పాలతో కలిపియైనను త్రాగి పిమ్మట వరిబియ్యపు అన్నమును పాలతోనే కలిపి భుజింపవలెను. లేక పైజెప్పిన కషాయయోగములచే సిద్ధమైన ఆయాకషాయములగూర్చి (ఘృతపాకవిధి ప్రకారము) వేరువేరుగ పక్వముజేయబడినఘృతములనైన త్రాగినవో నధికముగ వెడలు రక్తపిత్తము నివర్తించును.

రక్తపిత్తహరవాశాఘృతము.

మూ. వాసాం సశాఖాం సపలాశమూలాం
కృత్వా కషాయం కుసుమాని చాస్యాః,
ప్రదాయ కల్కం విపచేత్ ఘృతం తత్
సక్షౌద్రమాశ్వేవ నిహన్తి రక్తమ్. 88

వ్యా. అడ్డసరము సమూలముగ వేరు ఆకులు కాయలు పువ్వులతో కూడ పచ్చిగ గ్రహించి కషాయము కాచి యాకషాయమునకు నాల్గవవంతు ఆవునేతిని, నేతికి నాల్గవవంతు అడ్డసరపు పువ్వుల కల్కమును జేర్చి ఘృతపాకపరిభాషాప్రకారము సిద్ధముచేయబడిన ఘృతమునకు నాల్గవవంతు తేనెను చేర్చి సేవించినచో రక్తపిత్తము అతిశీఘ్రముగ నివర్తించును.

ఇచ్చట స్నేహపాకవిధి ననుసరించి పుష్పకల్కమును జేర్చి కాచబడు నీఘృతమున ఘృతమునకు నాల్గింతలు కషాయమును జేర్పనగును. ఈవిషయమున "పుష్పకల్కస్తు యస్స్నేహః తత్ర తోయం చతుర్గుణమ్." అని పరిభాష యున్నది. మరియు "జలస్నేహౌషధానాం చ ప్రమాణం యత్ర నేరితమ్, తత్ర స్యాదౌషధాత్ స్నేహః స్నేహాత్తోయం చతుర్గుణమ్." అను సామాన్యపరిభాషచేత కల్కమునకు నాల్గింతలు ఘృతమును ఘృతమునకు నాల్గింతలు కషాయంబును జేర్పవలెనని తెలిసెడి. మరియు "స్నేహపాదః స్మృతః కల్కః కల్కవన్మధుశర్కరే" అనుపరిభాషాప్రకారము ఇచ్చట "సక్షౌద్రమ్" అనుచోట కల్కమువలెనే ఘృతమునకు నాల్గవవంతు తేనెను కలుపనగునని యెరుంగునది.

### రక్తపిత్తహరఘృతములు.

మూ. పలాశవృన్తస్వరసేన సిద్ధం
తస్యైవ కల్కేన మధుద్రవేణ,
లిహ్యాత్ ఘృతం వత్సకకల్కసిద్ధం
తద్వాత్సమఙ్గోత్పలలోధ్రసిద్ధమ్. 89
స్యాత్త్రాయమాణా విధిరేష ఏవ
సోదుమ్బరే చైవ పటోలపత్రే,
సర్పింషి పిత్తజ్వరనాశనాని
సర్వాణి శస్తాని చ రక్తపిత్తే. 90

వ్యా. మోదుగపువ్వులకాడలను జలములో నునిచి పాదావశేషముగ కషాయము కాచి అందు కషాయమునకు నాల్గవవంతు నేతిని, నేతికి నాల్గవవంతు మోదుగపువ్వుల కాడలకల్కమును జేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసి కల్కమునకు సమభాగము తేనె చేర్చి త్రాగినచో రక్తపిత్తము శమించును. మరియు నిత్తెరంగునసే కొడిసెపాలను గాని, మంజిష్ఠిని, నల్లకలువలను, లొద్దుగునుకాని, కలుగ్రానుగునుగాని, అత్తియాకులను చేదుపొట్లాకులనుగాని కషాయకల్కములుగ జేసి పక్వముచేయబడిన ఘృతములను రక్త పిత్తమునందు ప్రయోగింపందగును.

మరియు పిత్తజ్వరనాశకములుగ జెప్పబడిన ఘృతయోగము లన్నియు రక్తపిత్త మున సేవింపందగును. (ఇచ్చట జీర్ణజ్వరహరములుగ జెప్పబడిన ఘృతయోగము లన్నియు పిత్తజ్వరనాశకములు కావున అట్టి ఘృతయోగములు "పిత్తజ్వరనాశనాని" అని యతి దేశింపబడినవి.)

### రక్తపిత్తహర అభ్యంగయోగాదులు.

మూ. అభ్యఙ్గయోగాః పరిషేచనాని
సేకావగాహాః శయనాని వేశ్మ,
శీతో విధిః వస్తివిధానమగ్ర్యం
పిత్తజ్వరే యత్ప్రశమాయ దిష్టమ్. 91
తద్రక్తపిత్తే నిఖిలేన కార్యం
కాలం చ మాత్రాం చ పురా సమీక్ష్య,
సర్పిర్గుడా యే చ హితాః క్షతేభ్యః
తే రక్తపిత్తం శమయన్తి సద్యః. 92

వ్యా. పిత్తజ్వరహారములుగను తాపహారములుగను చెప్పబడిన అభ్యంగయోగంబులును, పరిషేకంబులును, స్నానంబులును, అవగాహనంబులును, పరుండుటకై చెప్పబడిన శయనములును, నివసించుటకు నియమింపబడిన గృహములును, శీతోపచారంబులును, శ్రేష్ఠముగ జెప్పబడిన వస్తికర్మంబును అవి యన్నియు రక్తపిత్తమున పూర్తిగ నుపయోగింపం దగును. అట్టివిధానమున శీతోష్ణరూపమగు కాలపరిస్థితిని తొలుత చక్కగ గమనించి రోగియొక్క బలాద్యనుసారముగ తగిన ప్రమాణమును గల్పించి తత్తదుచితముగ నుపయోగింప దగును.

మరియు నురఃక్షతరోగులకు హితములుగ నుపదేశింపబడిన ఘృతములును గుడములును కూడ రక్తపిత్తమును శీఘ్రముగ శమింపగల్గును. (కావున నవియు నుపయోగింప దగియుండును.)

## కఫానుగతరక్తపిత్తమున క్షారప్రయోగములు.

మూ. కఫానుబన్ధే రుధిరే సపిత్తే
కణ్ఠాగతే స్యాత్ గ్రథితే ప్రయోగః,
యుక్తస్య యుక్త్యా మధుసర్పిషోశ్చ
క్షారస్య చైవోత్పలనాళజస్య. 93
మృణాళపద్మోత్పలకేసరాణాం
తథా పలాశస్య తథా ప్రియఙ్గోః,
తథా మధూకస్య తథాఽసనస్య
క్షారాః ప్రయోజ్యాః విధినైవ తేన. 94

వ్యా. రక్తపిత్తము కఫముతో గూడి కంఠమున జేరి కుత్తుకయందు గ్రంథివలె కట్టుకొని యుండునెడ నల్లకలువలకాడలను క్షారపాకవిధిప్రకారము క్షారము సిద్ధముజేసి యాక్షారోదకమున తేనెను నేతిని చేర్చి రోగముయొక్క పరిస్థితికి దగినపరిమాణముతో త్రాగిన చాల మేలుచేయును. మరియు తామరకాడలు, తామరపువ్వులు, కలువపువ్వులు, వానికేసరములు, మోదుగాకులు, ప్రేంకణము, ఇప్ప, వేగిస వీనిని వేరువేరుగ క్షారములు చేసి పైజెప్పినవిధముగ ప్రయోగింప నగును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—క్షారసామాన్య ముష్ణగుణప్రధానమైన పైజెప్పబడిన ఉత్పలనాళాదిక్షారములు స్వాభావిక శీతగుణముచే రక్తపిత్తహారంబును, క్షారరూపసంస్కారవిశేషమునం జేసి రక్తపిత్తమున కనుబంధముగ కంఠమున ఘనీభ

వించిన కఫమును కలుగజేయునదియు నగునని క్షారప్రయోగమిచ్చుట నుపదేశింపబడినది. అందును పైజెప్పబడిన ఉత్పలనాళాదిక్షారములనే దక్క తక్కిన క్షారముల నుపయోగింపం జనదని పైనియమముచే నేర్పడును.

క్షారకల్పనాపరిభాష యిట్లు చెప్పబడినది:—"క్షారవృక్షస్య కాష్ఠాని శుష్కాణ్యగ్నౌ ప్రదీపయేత్. నీత్వా తద్భస్మ మృత్పాత్రే క్షిప్త్వా నీరే చతుర్గుణే, విమర్ద్య విధారయేద్రాత్రౌ ప్రాతరచ్ఛజలం పిబేత్" క్షారము చేయదలచిన చెట్టుయొక్క కట్టెలు ఆకులు మున్నగువానిని చక్కగ నెండించి కాల్చి బూడిదచేసి యాబూడిదెను మెత్తగ నూరి నాలుగింతల నీళ్లలో కలిపి యొకకుండలో బోసి రాత్రియంతయు నూరబెట్టి మరునాడుదయమునం దాతేటనీటిని గ్రహించి యుపయోగింపవలెనని యర్థము. ఈ కల్పనావిధిప్రకారము పైజెప్పిన క్షారోదకమును సిద్ధముచేసి అందు తేనెను నేతిని చేర్చి యుపయోగింపవలెనని యెరుంగునది.

## రక్తపిత్తహరశతావర్యాదిఘృతము.

మూ. శతావరీదాడిమతిన్త్రిడీకం
కాకోలిమేదే మధుకం విదారీం,
పిష్ట్వా చ మూలం ఫలపూరకస్య
ఘృతం పచేత్ క్షీరచతుర్గుణం జ్ఞః. 95
కాసజ్వరానాహవిబన్ధశూలం
తద్రక్తపిత్తం చ ఘృతం నిహన్యాత్,
యత్పఞ్చమూలైరథ పఞ్చభిర్వా
సిద్ధం ఘృతం తచ్చ తదర్థకారి. 96

(ఇతి శతావర్యాదిఘృతమ్.)

వ్యా. పిల్లిపీచరగడ్డలు, దానిమ్మ, చింతవేళ్లు, కాకోళి, మేద, అతిమధురము, నేలగుమ్మడిగడ్డ, వీని నన్నిటిని చేర్చి కషాయము కాచి అందు మాదీఫలపుచెట్టువేళ్లను చేర్చి నూరి కల్కముచేసి, కల్కమునకు నాల్గింతలు ఘృతమును జేర్చి ఘృతమునకు నాల్గింతలు ఆవుపాలు కలిపి ఘృతపాకవిధిప్రకారము పక్వముజేసి యుపయోగించినచో కాసము, జ్వరము, కడుపుబ్బరము, మలబద్ధకము, శూలనొప్పి, రక్తపిత్తము, ఈవ్యాధులను హరించును.

ఇత్తెరంగుననే ఐదువిధములుగ జెప్పబడిన పంచమూలగణము లైదిటిచే వేరు వేరుగ సిద్ధముచేయబడిన ఘృతముల నుపయోగించినను శతావర్యాదిఘృతమును బోలె కాసజ్వరాదులను రక్తపిత్తమును హరించును.

నాసారంధ్రమున వెడలు రక్తపిత్తహర నస్యప్రయోగములు.

మూ. కషాయయోగాయ ఇహోపదిష్టాః
తే చావపీడే భిషజా ప్రయోజ్యాః
ఘ్రాణాత్ప్రవృత్తం రుధిరం సపిత్తం
యదా భవేన్నిస్స్రుతదుష్టదోషమ్. 97
రక్తే ప్రదుష్టే హ్యనపీడబద్ధే
దుష్టప్రతిశ్యాయశిరోవికారాః,
రక్తం సపూయం కుణపశ్చ గన్ధః (కుణపైస్సగన్ధం)
స్యాత్ ఘ్రాణనాశః కృమయశ్చ దుష్టాః. 98

వ్యా. ముక్కులనుండి రక్తపిత్తము వెడలుచున్నయెడ అట్టి రక్తపిత్తమున కనుబంధములైన వాతకఫదోషములచే దుష్టమైన యారక్తమంతయు బైట స్రవించి నిర్దుష్టముగ వెడలునప్పుడు "ఉశీరకాలీయక" అని యుపక్రమించి చెప్పబడిన కషాయయోగములయందలి ద్రవ్యములను అవపీడమను నస్యమును చేయవలెను. అటుగాక రక్తము దోషముల దుష్టమై యున్నపుడు నస్యము నుపయోగించి రక్తమును వెడలనీయక నిరోధించినయెడ దోషయుక్తమైన పీనసమును పలుదెరంగులైన శిరోరోగంబులును కల్గును. ముక్కులనుండియు దుర్గంధయుక్తమైన రక్తంబును చీమును వెడలును ముక్కున పీనుగ కంపు వెడలును. గంధము నాఘ్రాణించు శక్తి నశించును. ముక్కున దుష్టములైన పురుగులు పుట్టును. (కావున అట్టి దుష్టరక్తము పూర్తిగ వెడలిన పిదప పైజెప్పిన రీతిగ ఉశీరాది (వట్టివేళ్లు మున్నగు) కషాయగణద్రవ్యములను అవపీడమను నస్యముగ నుపయోగింపవలెనని భావము.)

అవపీడమన:—ద్రవ్యముల మెత్తగ నలియకొట్టి దానిస్వరసమును నాసారంధ్రములనుండి ప్రయోగింపబడిన నస్యము. ఈయర్థము "అవపీడ్య దీయతే-ఇత్యవపీడమ్" అను వ్యుత్పత్తిచేత సిద్ధించును. ఇది పరిభాషయందు "కల్కైర్వైరపీడస్తు" అని చెప్పబడినది.

మరి కొన్ని నస్యములు.

మూ. నీలోత్పలం గైరికశఙ్ఖయుక్తం సచన్దనం స్యాత్తు సితాజలేన,
నస్యం తథామ్రాస్థిరసః సమజ్ఞా సధాతకీ మోచరసస్సలోధ్రః. 99
ద్రాక్షారసస్యేక్షురసస్య నస్యం క్షీరస్య దూర్వాస్వరసస్య చైవ,
యవాసమూలాని పలాణ్డుమూలంనస్యం, తథాదాడిమపుష్పతోయమ్.

ప్రియాలతైలంమధుకంపయశ్చ సిద్ధంఘృతంమాహిషమాజికంవా,
ఆమ్రాస్థిపూర్వైఃపయసాచనస్యంసశారిబైస్స్యాత్కమలోత్పలైశ్చ.

వ్యా. నల్లకలువలు, గైరికము (కావిరాయి), శంఖచూర్ణము, ఈద్రవ్యములను కల్కముజేసి పంచదార నీళ్లు కలిపి నస్యముచేయవలెను. మరియు మామిడిపప్పులరసము, మంజిష్ఠి, ఆరెపువ్వులు, బూరుగబంక, లొద్దుగుపట్ట, వీనిని కల్కముచేర్చి ద్రాక్షపండ్ల రసముసైనను, చెరకురసముసైన ద్రవముగజేర్చి నస్యముచేయదగును. మరియు పిన్నదూల గొండి వేళ్లను ఎఱ్ఱగడ్డలను చేర్చి కల్కముచేసి పాలను గఱికరసస్వరసమును ద్రవముగ జేర్చి యైనను నస్యము చేయదగును. అతిమధురమును కల్కముచేసి అందు దానిమ్మ పువ్వులరసమును చారపప్పులనూనెను పాలను, లేక ఎనపనేతినైనను మేకనేతినైనను కలిపి నస్యముచేయునది. పైజెప్పిన నల్లకలువలు మొదలు ఆమ్రాస్థివరకు చెప్పిన ద్రవ్యములను కల్కముచేసి ఆవుపాలను ద్రవముగ జేర్చి నస్యముచేయనగును. సుగంధపాలవేరును తామరపువ్వులను కలువపువ్వులను కల్కముచేసి పాలను ద్రవముగ జేర్చి నస్యము చేయవలెను. (ఈనస్యయోగము లన్నియు నాసారంధ్రములనుండి రక్తపిత్తము వెడలు నప్పుడు పైజెప్పినరీతిగ నిర్దుష్టముగ నుండుతరి నస్యముగ ప్రయోగింపవలెనని యెరుంగునది.)

## రక్తపిత్తహరప్రలేపములు.

మూ. భద్రశ్రియం లోహితచన్దనం చ ప్రపౌణ్డరీకం కమలోత్పలే చ,
ఉశీరవానీరజలం మృణాళం సహస్రవీర్యా మధుకం పయస్యా. 102
శాలీక్షుమూలానియవాసగున్ద్రామూలంనలానాంకుశకాశయోశ్చ,
కుచన్దనం శైవలమప్యనన్తా కాలానుసార్యా తృణమూలమృద్ధిః. 103
మూలాని పుష్పాణి చ వారిజానాం ప్రలేపనం పుష్కరిణీమృదశ్చ,
ఉదుమ్బరాశ్వత్థమధూకలోధ్రాః కషాయవృక్షాశ్శిశిరాశ్చ సర్వే.

వ్యా. శ్వేతచందనము, రక్తచందనము, పుండరీకమను గంధద్రవ్యము, తామర పువ్వులు, కలువపువ్వులు, వట్టివేళ్లు, నీరుప్రబ్బలి, తామరకాడలు, పిల్లిపీచరగడ్డలు, అతి మధురము, క్షీరకాకోళి, వరిపైరువేళ్లు, చెరకువేళ్లు, దూలగొండివేళ్లు, ప్రేంకణపువేళ్లు, కిక్కసగడ్డివేళ్లు, కుశదర్భవేళ్లు, రెల్లుదర్భవేళ్లు, పీతచందనము, పాచితీగెలు, సుగంధపాల వేళ్లు, రాతిపువ్వు, తృణపంచమూలములు, బుద్ధి, ఇవి యన్నియును, నీళ్లలో పుట్టునట్టి తామర కలువ అల్లి మున్నగువానిదుంపలును పుష్పములును, తామరపువ్వులు కల తటా

కమునందలి మంటిబురుదయు, జువ్వి, రావి, ఇప్ప, లొద్దుగు, మున్నగు కషాయ(వగరు) రసముకల వృక్షంబులును, ఇవి గాక యితరములగు శీతవీర్యములైనవియు రక్తపిత్తమునందు ప్రలేపము (పట్టు) చేయుటకు చాల ప్రశస్తములు.

## రక్తపిత్తహరప్రదేహపరిషేకాదులు.

మూ. ప్రదేహకల్పే పరిషేచనే చ తథావగాహే ఘృతతైలసిద్ధౌ,
రక్తస్య పిత్తస్యచశాన్తిమిచ్ఛన్భద్రశ్రియాదీనిభిషక్ప్రయుఞ్జ్యాత్.

వ్యా. మరియు ప్రలేపనమునకై పైజెప్పబడిన శ్వేతచందనము మున్నగు ద్రవ్యములు ప్రదేహమునః (దట్టముగ పట్టువేయుట) కును, పరిషేచనమున (తడుపుట) కును, అవగాహ (స్నాన) మునకును, ఘృతములను తైలములను సిద్ధముచేయుటకును రక్తపిత్తము శమించుటకై యుపయోగింపనగును.

## రక్తపిత్తతాపహరశీతగృహాదులు.

మూ. ధారాగృహంభూమిగృహం సుశీతం వనం చ రమ్యంజలవాతశీతం,
వైడూర్యముక్తామణిభాజనానాం స్పర్శాశ్చ దాహే శిశిరామ్బుశీతాః.
పత్త్రాణి పుష్పాణి చ వారిజానాం క్షౌమం చ శీతం కదళీదళాని,
ప్రచ్ఛాదనార్థం శయనాసనానాం పద్మోత్పలానాం చ దళాః ప్రశస్తాః.

వ్యా. ధారాగృహము (ఉదకధారలతో కూడినయిల్లు), చల్లగనుండు భూమిగృహము (భూమిలో కందకముల నేర్పరుపబడినయిల్లు), జలముచేతను గాలి వీచుటచేతను చల్లనైనవనంబును రక్తపిత్తరోగికి తాపము కల్గినప్పుడు నివసించుటకు చాల ప్రశస్తము. మరియు పన్నీరు మంచునీళ్లు మున్నగువానిచే తడుపబడి చల్లనైన వైడూర్యమణులను, ముత్యములను అట్టినీళ్లచే నిండిన వెండి మున్నగుపాత్రంబులును, స్పృశించుట పైజెప్పినరీతిగ తాపముతో గూడిన రక్తపిత్తమున మిగుల ప్రశస్తము.

మరియు తామరపువ్వులును ఆకులును చల్లనైయుండు పట్టుబట్టలును అరటియాకులును తామరపువ్వులయొక్కయు కలువలయొక్కయు రేకులును రక్తపిత్తరోగికుపయోగించు శయనాసనములపై గప్పుటకు చాల ప్రశస్తములు.

## రక్తపిత్తతాపహరస్పర్శములు.

మూ. ప్రియఙ్గుకాచన్దనరూషితానాంస్పర్శాఃప్రియాణాంచవరాఙ్గనానాం,
దాహే ప్రశస్తాస్సజలాస్సుశీతాః పద్మోత్పలానాంచకలాపవాతాః

వ్యా. మరియు నట్టితాపమునందు ప్రేంకణమును చందనమును బూసికొనిన యౌవనవతులగు ప్రియురాండ్ర నాలింగనము చేసికొనుట చాల మంచిది. తామర పువ్వులను కలువలను పీవనలుగ కట్టి నీళ్లతో దడిపి చల్లనిగాలి తగుల విసరుట చాల ప్రశస్తము.

## రక్తపిత్తహరశీతోపచారములు.

మూ. సరిద్ధ్రదానాం హిమవద్దరీణాం చన్ద్రోదయానాం కమలాకరాణాం,
మనోనుకూలాశ్శిశిరాశ్చ సర్వాః కథాస్సృగ్తం శమయన్తి పిత్తమ్.

వ్యా. నదులు, మడుగులు, మంచుతో గూడిన గుహలు, వెన్నెల, వీనికి సంబంధించినవియు, మనస్సుకింపై చల్లదనమును కల్గించునవియు నగు కథలును రక్తపిత్తమును శమింపజేయును.

## అధ్యాయవిషయసంగ్రహము.

మూ. హేతుం వృద్ధిం సంజ్ఞాం స్థానం లిఙ్గం పృథక్ప్రదుష్టస్య,
మార్గౌ సాధ్యమసాధ్యం కార్యం కార్యక్రమం చైవ. 110
పానాన్నమిష్టమేవ చ వర్జ్యం సంశోధనం చ శమనం చ,
గురురుక్తవాన్ యథావత్ చికిత్సితే రక్తపిత్తస్య. 111

వ్యా. రక్తపిత్తముయొక్క కారణములు, అది వృద్ధినొందువిధము, దాని కన్వర్థసంజ్ఞ, స్థానము, వాతాదిదోషానుబంధముచే గల్గు వేరువేరు లక్షణములు. ఊర్ధ్వాధోభేదములచే నది వెడలుమార్గములు, సాధ్యాసాధ్యలక్షణములు, దానిచికిత్స, చికిత్సాక్రమము, రక్తపిత్తమున నుపయోగార్హములైన యన్నపానములు, ఈరోగమున విసర్జింపవలసినవిషయములు, సంశోధనము, సంశమనము, అనుసీవిషయముల నన్నిటిని రక్తపిత్తచికిత్సితమను నీయధ్యాయమున గురువగు నాత్రేయు లుపదేశించినవిధముగ నగ్నివేశులు వివరించి చెప్పెను.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, చికిత్సితస్థానే
రక్తపిత్తచికిత్సితం నామ చతుర్థోఽధ్యాయః.

ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగుచరకసంహితయను నాయుర్వేదతంత్రమున చికిత్సాస్థానమున రక్తపిత్త చికిత్సితమనునది చతుర్థాధ్యాయము సంపూర్ణము.

---

### రక్తగుల్మము జనించుకారణములు.

మూ. ఋతావనాహారతయా భయేన విరూక్షణై ర్వేగవినిగ్రహైశ్చ,
సంస్తమ్భనోల్లేఖనయోనిదోషైః గుల్మస్త్రియం రక్తభవోఽభ్యుపైతి.

వ్యా. స్త్రీ ఋతుమతి యైన (ప్రతిమాసమునందు ఆర్తవము వెడలు) కాలమున ఆహారమును భుజించకుండుట, భయపడుట, రూక్షములగు పదార్థములభుజించుట, మూత్రపురీషాదివేగముల నిరోధించుట, స్తమ్భనంబులును (శైత్యకషాయత్వాదులు కల్గి వాతమును వృద్ధినందించునవి) ఉల్లేఖనంబులును (దేహమునందలి ధాత్వాదుల శోషింపజేయునవి) నగుపదార్థముల సేవించుట, యోనిదోషము, ఈకారణముల చేత స్త్రీకి రక్తగుల్మము సంభవించును. (ఇచ్చట స్త్రీశబ్దముచేత ప్రతిమాసమున ఋతుమతి యగుటకు యుక్తమైన యౌవనావస్థనుండు స్త్రీమాత్రము గ్రహింపబడును. కావున బాలవృద్ధ స్త్రీల కీరక్తగుల్మము సంభవింపదని యెరుంగునది.)

### రక్తగుల్మస్వరూపలక్షణములు.

మూ. యస్స్పన్దతే పిణ్డిత ఏవ నాఙ్గైః చిరాత్సశూలస్సమగర్భలిఙ్గః,
స రౌధిరః స్త్రీభవ ఏవ గుల్మో మాసే వ్యతీతే దశమే చికిత్స్యః.

వ్యా. పైజెప్పినరీతిగ సంభవించిన రక్తపిత్తము ఋతురక్తనిరోధనముచే స్త్రీలకే కల్గును. అయ్యది గర్భమునకు సమానములగు స్తనపీనత్వ-చూచుకనైల్యాది గర్భచిహ్నములతోఁగూడి పిండాకారముగ గుండ్రనై గర్భమునుబోలె నవయవవిన్యాసము లేకయే గర్భాశయమున నొప్పితో కూడి చిరకాలమునకు చలించుచుండును. అట్టిగుల్మము స్త్రీలకు దక్క పురుషులకు కల్గదు. (ఈరక్తగుల్మము వ్యాధిస్వభావముచే పదిమాసములు గడచిన పిదప చికిత్సచేయ దగియుండును. పదినెలలకు లోఁగా చికిత్సజేయునెడ అధికముగ రక్తము స్రవించి గర్భాశయమునం దభిఘాతము కల్గి యుపద్రవములు కల్గును. కావున "మాసే వ్యతీతే" యని చికిత్సాకాలము నియమింపబడినది. ఇచ్చట కొందరు— ఈరక్తగుల్మము గర్భమునకు సమానములగు లక్షణముల గల్గియుండును. కావున ప్రసవకాలమున కనియతమైన పదియవమాసము కడచినపిదప రక్తగుల్మమే యని నిర్ధారణ మేర్పడు కావున దశమమాసానంతరము చికిత్స విధింపబడినదని చెప్పెదరు. గర్భమున కన్న భిన్నములగు పిండాకారముగ నుండుట అవయవములు లేక చిరకాలమునకు శూల నొప్పితో కూడి చలించుట మున్నగు లక్షణములబట్టి పదిమాసములకు ముందుగనే వ్యాధిని నిర్ణయింప వీలగును. కావున వ్యాధినిర్ణయమునకై కాలనియమమనుట సమంజ

సము కానోపదు. వ్యాధిప్రభావమే చికిత్సాకాలనియమమునకు కారణము. ఈవిషయమే "రక్తగుల్మే పురాణత్వం సుఖసాధ్యస్య లక్షణమ్" అని స్థలాంతరమున చెప్పబడినది. మరియు నీరక్తగుల్మవిషయమున చర్చనీయాంశములు మాచేత రచింపబడిన మాధవనిదానాంధ్ర వ్యాఖ్యానమున విస్తరముగ చూడనగును.)

గుల్మరోగచికిత్సావిషయకప్రతిజ్ఞ.

మూ. క్రియాక్రమమతస్సిద్ధం గుల్మినాం గుల్మనాశనం,
ప్రవక్ష్యామ్యత ఊర్ధ్వం చ యోగాన్ గుల్మనిబర్హణాన్. 20

వ్యా. గుల్మలక్షణముల జెప్పిన పిదప గుల్మరోగులకు గుల్మముల హరింపదగిన స్నేహ స్వేదాది చికిత్సాక్రమమును తొలుత జెప్పి పిదప గుల్మహరములగు నౌషధయోగములు వివరింపబడును.

వాతికగుల్మరోగికి చికిత్సాక్రమము, అందు స్నేహవిధి.

మూ. రూక్షవ్యాయామజం గుల్మం వాతికం తీవ్రవేదనం,
బద్ధవిణ్మారుతం స్నేహైః ఆదితస్సముపాచరేత్. 21

వ్యా. రూక్షపదార్థముల సేవించుటచేతను వ్యాయామము నధికముగ చేయుటచేతను కల్గిన వాతగుల్మమున తీవ్రమైన వేదనయు వాతపురీషములబంధంబును కల్గియున్నపుడు అట్టి గుల్మరోగిని తొలుత నెయ్యి వసమజ్జ తైలము అనునీనాల్గువిధములైన స్నేహములచే నుపచరించవలెను.

వాతికగుల్మమున స్వేదనము.

మూ. భోజనాభ్యఞ్జనైః పానైః, నిరూహైస్సానువాసనైః,
స్నిగ్ధస్య భిషజా స్వేదః కర్తవ్యో గుల్మశాన్తయే. 22

వ్యా. భోజనము, అభ్యంజనము, పానము, నిరూహవస్తి, అనువాసనవస్తి, అనునీయైదువిధానముల నుపయోగించినపిదప స్నిగ్ధమైన శరీరము కలవానిగ నెరెంగి గుల్మము శమించుటకై స్వేదవిధిప్రకారము రోగికి చెమట పుట్టింపనగును.

స్నేహ-స్వేదములచే గల్గుగుణములు.

మూ. స్రోతసాం మార్దవం కృత్వా జిత్వా మారుతముల్బణం,
భిత్వా విబన్ధం స్నిగ్ధస్య స్వేదో గుల్మమపోహతి. 23

వ్యా. పైజెప్పినరీతిగ భోజన-అభ్యంజనాదిమూలమున స్రోతోమార్గములు మృదుత్వమునొంది ఉత్కటముగ నుండు వాతము శమించి వాతపురీషబంధములు సడలి

స్నిగ్ధుడగును. అట్టి స్నిగ్ధుడగు రోగికి స్వేదవిధిప్రకారము చెమట పుట్టించినయెడ గుల్మమును హరించును.

ఊర్ధ్వాదిస్థానభేదముచే చికిత్సావిధానము.

మూ. స్నేహపానం హితం గుల్మే విశేషేణోర్ధ్వనాభిజే,
పక్వాశయగతే వస్తిరుభయం జఠరాశ్రయే. 24

వ్యా. గుల్మరోగసామాన్యముగ స్నేహపానము హితకరము. అందును నాభికూర్ధ్వభాగమున జనించిన గుల్మమున స్నేహపానము చేయుట చాల ముఖ్యము. పక్వాశయమున (నాభికి క్రిందిభాగమున)జనించిన గుల్మమునందు వస్తిని ప్రయోగింపవలెను. జఠరమున (నాభిస్థానమున) జనించిన గుల్మమునందు స్నేహపానంబును వస్తియు ప్రయోగింపనగును.

వాతికగుల్మమునం దన్నపానములు.

మూ. దీప్తేఽగ్నౌ వాతికే గుల్మే విబన్ధేఽనిలవర్చసోః,
బృంహణాన్యన్నపానాని స్నిగ్ధోష్ణాని ప్రయోజయేత్. 25

వ్యా. వాతగుల్మమున జాఠరాగ్ని చక్కగ జ్వలించి వాతంబును పురీషంబును బంధింపబడి యున్నచో బృంహణంబులును స్నిగ్ధంబులును ఉష్ణంబులునైన యన్నపానములను ప్రయోగింపనగును.

వాతికగుల్మమునందు స్నేహపానము, వస్తిప్రయోగము.

మూ. పునఃపునః స్నేహపానం నిరూహాస్సానువాసనాః,
ప్రయోజ్యాః వాతగుల్మేషు కఫపిత్తానురక్షిణా. 26

వ్యా. వాతము ప్రధానములుగ గల గుల్మము లన్నిటియందును స్నేహపానమును నిరూహ-అనువాసనవస్తులను వాతము శమించుటకై పలుమారు ప్రయోగింపనగును. అట్టియెడ కఫపిత్తముల వృద్ధినందనీయక యథోచితముగ నారెంటిని చేయనగును. (వాతశామకమైనది కఫపిత్తముల వృద్ధినందించును కావున వానికి అనుగుణముగ స్నేహపానవస్తుల జేయవలెనని భావము. ఈవిషయమునే "గుల్మినామనిలశాన్తిరుపాయైః" అని నిదానమున తంత్రకారులే యుపదేశించిరి.)

వాతశామకచికిత్సచే కఫ-పిత్త-రక్తములు వృద్ధినొందిన, వానిచికిత్స.

మూ. కఫో వాతే జితప్రాయే పిత్తం శోణితమేవ వా,
యది కుప్యతి వా తస్య క్రియమాణే చికిత్సితే. 27

యథోల్బణస్య దోషస్య తత్ర కార్యం భిషగ్జితం,
ఆదావన్తే చ మధ్యే చ మారుతం పరిరక్షతా. 28

వ్యా. గుల్మరోగమున వాతహరచికిత్స జేయుతరి వాతము శమించి యుండునపుడు ఒకవేళ కఫంబైనను పిత్తంబైనను రక్తమైనను (వాతహరచికిత్సచేత) ప్రకోపము నొందినయెడ వానిలో నీకారణముచే నేదోషము ప్రకోపమునొందునో అట్టిహేతువునకు దగిన చికిత్స జేయుట యుక్తము. మఱియు నట్టి కఫాదులకు చికిత్స జేయునపుడును అంతకు ముందు శమించినవాతము మరల వృద్ధినందకుండునట్లు ఆదియందును అంతమునందును మధ్యమునందును వాతమును కాపాడుచు మిక్కిలి మెలకువతో చికిత్స చేయవలెను.

వాతగుల్మమున కఫము వృద్ధినొందినపుడు వమనవిధి.

మూ. వాతగుల్మే కఫో వృద్ధో హత్వాగ్నిమరుచిం యది,
హృల్లాసం గౌరవం తన్ద్రాం జనయేదుల్లిఖేత్తు తమ్. 29

వ్యా. వాతమున జనించిన గుల్మమునందు కఫము వృద్ధినందినయెడ జఠరాగ్నిని చెఱిచి అరుచిని హృల్లాసమును (ఓకళింతలను) శరీరభారమును కునికిపాటును కల్గించును. అట్టియెడ కఫమును బైటవెడలించుటకై వమనము చేయించవలెను. (గుల్మమున వమనము నిషిద్ధము; అయినను అవస్థావిశేషమునుబట్టి వమనము విశేషముగ విధింపబడినదని యెరుంగునది.)

వాతకఫోల్బణగుల్మమునకు చికిత్స.

మూ. శూలానాహవిబన్ధేషు గుల్మే వాతకఫోల్బణే,
వర్తయో గుటికాశ్చూర్ణం కఫవాతహరం హితమ్. 30

వ్యా. వాతకఫములు రెండును వృద్ధినొందిన గుల్మమునందు శూలయు కడుపుబ్బరంబును వాతపురీషబంధంబును కల్గును. అట్టియెడ కఫవాతహరములగు ఫలవర్తులును, గుటికలును, చూర్ణంబును హితముగ నుండును.

వాతగుల్మమున పిత్తంబధికమైనయెడ విరేచనవిధి.

మూ. పిత్తం వా యది సంవృద్ధం సన్తాపం వాతగుల్మినః,
కుర్యాత్, విరేచ్యస్స భవేత్ సస్నేహైరానులోమికైః. 31

వ్యా. వాతగుల్మరోగికి పిత్తము వృద్ధినొంది యుండునెడ సంతాపంబును కల్గిం

చును; అట్టియెడ వాతమును అనులోమముగ సంచరింపజేయునవియు స్నేహయుక్తంబులును నగువానిచే విరేచనమును చేయింపనగును.

—● గుల్మరోగమున రక్తమోక్షణము. ●—

మూ. గుల్మో యద్యనిలాదీనాం కృతే సమ్యక్ భిషగ్జితే,
న ప్రశామ్యతి రక్తస్య సోఽవసేకాత్ ప్రశామ్యతి. 32

వ్యా. పైజెప్పబడిన చికిత్సాక్రమము ననుసరించి వాతాదిదోషములకు చికిత్సను యుక్తియుక్తముగ విధ్యుక్తప్రకారము చేసినను వాతికాది గుల్మములు శమించకుండు నెడ గుల్మము జనించుస్థానమున రక్తస్రావమును గొట్టము మొదలగువానిచే చేయవలెను. అట్లుచేసినచో గుల్మము శమించును. (గుల్మము రక్తమునాధారముగ జేసికొనియుండును కావున గుల్మప్రదేశమునందలి దుష్టరక్తమును గొట్టము మొదలగువానిచే వెడలించినచో గుల్మము శమించునని భావము.)

—● పిత్తగుల్మమున నిమిత్తభేదముచే చికిత్సాభేదము. ●—

మూ. స్నిగ్ధోష్ణేనోదితే గుల్మే పైత్తికే స్రంసనం హితం,
రూక్షోష్ణేన తు సమ్భూతే సర్పిః ప్రశమనం పరమ్. 33

వ్యా. స్నిగ్ధోష్ణాహారాదులచే జనించిన పిత్తగుల్మమున స్రంసనౌషధమును (మలాదుల పక్వముచేసి యధోమార్గమున వెడలించునది) మిగుల హితము. రూక్షోష్ణములగు నాహారాదులచే సంభవించిన పిత్తగుల్మమున ఘృతమును పానముచేయుట మిగుల ప్రశస్తమగు శమనచికిత్స యగును.

—● పక్వాశయస్థపిత్తగుల్మమున విరేచనవిధి. ●—

మూ. పిత్తం వా పిత్తగుల్మం వా జ్ఞాత్వా పక్వాశయస్థితం,
కాలవిన్నిర్హరేత్సద్యః సతిక్తైః క్షీరవస్తిభిః. 34
పయసా వా సుఖోష్ణేన సతిక్తేన విరేచయేత్,
భిషగగ్నిబలాపేక్షీ సర్పిషా తైల్వకేన వా. 35

వ్యా. పిత్తమైనను పిత్తగుల్మమైనను పక్వాశయమున చేరి యున్నచో కాలపరిస్థితిని చక్కగ తెలిసిన వైద్యవరుడు తిక్తరసములతో గూడిన క్షీరవస్తులచేత వెంటనే హరింపజేయవలెను. లేక తిక్తరసద్రవ్యముల జేర్చి కాచబడినపాలను సుఖోష్ణముగ జేసి త్రాగించి విరేచనము చేయించవలెను. రోగియొక్క జాఠరాగ్నిబలము ననుసరించి తిల్వకఘృతము నుపయోగించి విరేచనము చేయించవలెను. (ఇచ్చట ఉదరరోగచికిత్సయందు చెప్పబడు తిల్వకఘృతయోగము నెరుంగునది).

పాకావస్థనున్న గుల్మమున రక్తమోక్షణము.

మూ. తృష్ణాజ్వరపరీదాహశూలస్వేదాగ్నిమార్దవే,
గుల్మినామరుచౌ చాపి రక్తమేవావసేచయేత్. 36
ఛిన్నమూలా విదహ్యన్తే న, గుల్మా యాన్తి చ క్షయం,
రక్తం హి వ్యమ్లతాం యాతి, తచ్చ నాస్తి, న చాతిరుక్. 37

వ్యా. గుల్మము విదగ్ధమగునెడ (పాకావస్థనొందునపుడు) దప్పి, జ్వరము, మంట, నొప్పి, చెమటయును కల్గి యగ్ని మందగించును. అరుచి పుట్టును. అట్టియెడ రక్తమోచనమునే చేయనగును రక్తమోచనము చేసినచో గుల్మములకు ఆశ్రయమైన రక్తము వెడలుటంజేసి పాకావస్థనొందక గుల్మములు నశించును. విదాహావస్థ నొందునది రక్తము. అట్టిరక్తమును వెడలించినచో చెడురక్తము లేక నశించును, దాన గల్గు బాధయు నశించును. అట్టిరక్తము సాధారముగ జేసికొని యుండు గుల్మములును వేరు తెగ గొట్టబడినచెట్లవలె సమూలముగ హరించునని భావము.

రక్తమోచనానంతరమున చేయవలసిన యుపచారములు.

మూ. హృతదోషం పరిమ్లానం జాఙ్గలైస్తర్పితం రసైః,
సమాశ్వస్తం సశేషార్తిం సర్పిరభ్యాసయేత్పునః. 38

వ్యా. పైజెప్పిన రక్తమోక్షణముచే దుష్టరక్తము వెడలి శరీరము బడలియున్న వానికి జాంగలజంతువుల మాంసరసముచే నాప్యాయన నందించి వానికి కొంచెము బడలిక తీరి బాధమాత్రము సశేషముగ నున్నయెడ మరల వానికి ఘృతమును పలుమారు అప్పుడప్పుడు అభ్యాసముగ నుపయోగింపవలెను.

రక్తమోక్షణము చేయనిచో గుల్మము పక్వమగుననుట.

మూ. రక్తపిత్తాతివృద్ధత్వాత్ క్రియామనుపలభ్య చ,
యది గుల్మో విదహ్యేత శస్త్రం తత్ర భిషగ్జితమ్. 39

వ్యా. పాకావస్థప్రారంభముననే పైజెప్పినరీతిగ రక్తమోక్షణరూప చికిత్సను చేయనిచో రక్తంబును పిత్తంబును మిక్కిలి వృద్ధినొంది గుల్మగ్రంథి పక్వమగును. అట్టియెడ శస్త్రచికిత్సనే చేయవలసి యుండును.

పక్వముకాని గుల్మలక్షణము.

మూ. గురుః కఠినసంస్థానః గూఢమాంసాన్తరాశ్రయః,
అవివర్ణః స్థిరశ్చైవ హ్యపక్వో గుల్మ ఉచ్యతే. 40

వ్యా. బరువును కఠినమైన యాకారము కల్గి శరీరమునందలి మాంసమున గూఢమై శరీరాంతర్భాగమునందలి యాశయముల నాశ్రయించి వివర్ణము లేక చలనము లేక స్థిరముగ నుండుగుల్మము పక్వముకానిది యని యెరుంగునది.

## పచ్యమానగుల్మలక్షణములు.

మూ. దాహశూలార్తిసంక్షోభస్వప్ననాశారతిజ్వరైః,
విదహ్యమానం జానీయాత్ గుల్మం తముపనాహయేత్. 41

వ్యా. గుల్మము, మంట, నొప్పి, పోటును కల్గి చలించుచుండి, నిదురబట్టక ఏ పనులయందును ఇచ్ఛలేక జ్వరము వ్యాపించి యున్నచో గుల్మము పాకావస్థనొందు చున్నదని యెరుంగునది. అట్టి గుల్మమును శీఘ్రముగ పక్వమగుటకై యుష్ణద్రవ్యములను లేపనము (పట్టు) వేసి చెమట బుట్టునట్లు (ఉపనాహస్వేదమును) చేయవలెను.

## పక్వగుల్మలక్షణములు.

మూ. విదాహలక్షణే గుల్మే బహిస్తుఙ్గే సమున్నతే,
శ్యావే సరక్తపర్యన్తే సంస్పర్శే వస్తిసన్నిభే. 42
నిపీడితోన్నతే స్తబ్ధే సుప్తే తత్పార్శ్వపీడనాత్,
తత్రైవ పిణ్డితే శూలే సమ్పక్వం గుల్మమాదిశేత్. 43

వ్యా. గుల్మగ్రంథి పక్వమైనపుడు ఎత్తు కల్గి వెలుపలికి నున్నతముగ కనబడును. నడుమ శ్యామవర్ణంబును చుట్టు రక్తవర్ణంబును కల్గి చేత తాకినయెడ గాలిచే నిండి యుబికియున్నతోలుతిత్తివలె పైకుబికి యుండును. చేతితో నదిమినప్పుడు (గుంటబడినను వెంటనే) పైకుబుకును. దానిపార్శ్వమున పిసికినచో వర్తులముగ (గుండ్రనై) నుండి బాధ లేక పిండాకారముగ దానిచోటనే యుండును. ఈలక్షణములు కల్గిన గుల్మము పక్వమైనదని యెరుంగునది.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—గుల్మము కేవలము దోషసముదాయమునే ఆశ్రయించి యుండును కాని రక్తమాంసాదిధాతువుల నాశ్రయించుట లేదు. అట్టియెడ దీనికి పాకావస్థ యెట్లు కల్గును? కల్గుట కవకాశము లేదు. ఈవిషయమునే సుశ్రుతాచార్యు లిట్లుపదేశించిరి:—"స యస్మాదాత్మనిచయం గచ్ఛత్యప్స్వివ బుద్బుదః, అన్తస్సరసి యస్మాచ్చ న పాకముపయాత్యతః." ఈగుల్మము నీటిలో నీటిబుడగ పుట్టియందే యెట్లుతేలుచుండునో, అట్లేరంగుననే వాతాదిదోషవై గుణ్యమున గుల్మముజనించి

వానినే యాశ్రయించి యుండును కావున నిది యితరవ్రణములవలె రక్తమాంసాది దూష్యసంబంధము లేకుండుటవలన పక్వము కానేరదని యర్థము. ఇట్లుండ ఇచ్చట గుల్మమునకు పాకావస్థ నిరూపించుట యెట్లు సంగతము అన్నచో పైనిరూపింపబడిన గుల్మము రసరక్తాది దూష్యముల నొకవేళ నాశ్రయించి జనించినయెడ నయ్యది పాకావస్థ నొందును. దూష్యసంబంధము లేక దోషములనే యాశ్రయించి జనించిన గుల్మము పాకము నొందుటయే లేదని యీతంత్రకారులయభిప్రాయము. గుల్మము దూష్యసంబంధమున గల్గినచో నయ్యది విద్రధియని నామాంతరముచే జెప్పబడును. ఈభావమునే సూచించుచు సుశ్రుతాచార్యులును గుల్మవిద్రదిభేదముల నిట్లు వివరించిరి:— "న విబన్ధోఽస్తి గుల్మస్య విద్రధిస్సనిబన్ధనః, గుల్మస్తిష్ఠతి దోషే స్వే విద్రధిర్మాంసశోణితే. విద్రధిః పచ్యతే తస్మాత్ గుల్మః క్వాపి న పచ్యతే" కేవలము దోషములనే యాశ్రయించి గ్రంథిరూపముగ నుండునది గుల్మము. ఇది పక్వము కాదు. రక్తమాంసముల నాశ్రయించి యుండు గ్రంథి విద్రధి ఇయ్యది పక్వమగును. అని ఫలితార్థము. మరియు నీవిషయము స్థలాంతరమున మాచే వివరింపబడినది.

### పక్వగుల్మమున శస్త్రచికిత్సావిధానము.

మూ. తత్ర ధాన్వన్తరీయాణామధికారః క్రియావిధౌ,
వైద్యానాం కృతయోగ్యానాం వ్యధశోధనరోపణే.                    44

వ్యా. పై జెప్పినరీతిగ గుల్మము పక్వమై యున్నపుడు కేవలము శస్త్రచికిత్సనే చేయవలెను. కావున ధన్వంతర్యవతారమునొందిన సుశ్రుతాచార్యప్రోక్త శల్యతంత్రమును చక్కగ జదివి వ్యధన-శోధన-రోపణములయం దారితేరి అట్టి శస్త్రచికిత్సయందు అభ్యాసవశముచే నైపుణము నొందిన వైద్యులకు అధికారము కల్గియుండును. (ఛేదనభేదనాది శస్త్రకర్మలయందు సమర్థులగువైద్యులు వ్రణచికిత్సావిధానము నవలంబించి పక్వగుల్మములకు చికిత్సజేయ నర్హులుకాని కేవలము కాయచికిత్సానిపుణులు చికిత్స చేయజాలరని యభిప్రాయము.)

### స్థలభేదముచే పక్వగుల్మలక్షణములు.

మూ. అన్తర్భాగస్య చాప్యేతత్ పచ్యమానస్య లక్షణం,
హృత్క్రోడశూనతాన్తస్థే (హృత్క్రోడశూలమన్తస్థే)
బహిస్థేన్ పార్శ్వనిర్గతిః.                    45

వ్యా. అట్టి గుల్మము శరీరాంతర్భాగమున (కోష్ఠమధ్యమున) పక్వమైనచో

హృదయమునను రొమ్మునను వాపు (నొప్పి) కల్గును. బాహ్యభాగమున పక్వమైనయెడ ప్రక్కలయందు పైకి కనబడును.

పక్వగుల్మమునం దాహారాది నియమములు.

మూ. పక్వస్రోతాంసి సంక్లేద్య వ్రజత్యూర్ధ్వమధోఽపి వా,
స్వయం ప్రవృత్తం తం దోషం ఉపేక్షేత హితాశనైః (శినః). 46
దశాహం ద్వాదశాహం వా రక్షన్ భిషగుపద్రవాన్,
అత ఊర్ధ్వం హితం పానం సర్పిషస్సవిశోధనమ్. 47
శుద్ధస్య తిక్తం సక్షౌద్రం ప్రయోగే సర్పిరిష్యతే,

వ్యా. పైజెప్పినరీతిగ లోపలనే పక్వమైన గుల్మమున స్రోతోమార్గములలో ద్రవమును కల్గించి యూర్ధ్వమార్గముననైనను అధోమార్గముననైనను దోషము బైట వెడలును. అత్తెరంగున దోషము తనంతనే వెడలునప్పుడు పదిదినములైనను పండ్రెండు దినములైనను రోగికి జ్వరము మున్నగు నుపద్రవముల గల్గనీయక యుపచరించుచు క్రిందజెప్పబడు హితాహారముల జేయుచు చికిత్స జేయక యుపేక్షించి యుండవలెను. పిమ్మట శోధనద్రవ్యములతో గూడినఘృతమును పానముచేయించవలెను. శుద్ధకోష్ఠము కల్గినవానికి తిక్తరసద్రవ్యముల జేర్చి సిద్ధముచేయబడిన ఘృతము నుపయోగింపనగును. (ఇంతదనుక 33 వ శ్లోకముమొదలు చెప్పబడినది పిత్తగుల్మచికిత్సాక్రమము.)

కఫజగుల్మమున చికిత్సాక్రమము, అందు లంకణము.

మూ. శీతలైర్గురుభిస్స్నిగ్ధైః గుల్మే జాతే కఫాత్మకే. 48
అవమ్యస్యాల్పకాయాగ్నేః కుర్యాల్లఙ్ఘనమాదితః,

వ్యా. శీతవీర్యంబులును గురుస్నిగ్ధగుణంబులు నగు నాహారాదులచే జనించిన కఫగుల్మమునందు వమనము చేయింప నర్హుడు కాక కాయాగ్ని మందముగ నున్న గుల్మరోగికి తొలుత లంకణము చేయనగును.

కఫజగుల్మమున వమనవిధి.

మూ. మన్దోఽగ్నిః వేదనామన్దా గురుస్తిమితకోష్ఠతా. 49
సోత్క్లేశా చారుచిర్యస్య స గుల్మీ వమనోపగః,

వ్యా. కఫజగుల్మరోగము కలవానికి అగ్నిమాంద్యము, స్వల్పముగ వేదన, కోష్ఠము బరువుగను స్తిమితముగ నుండుట, వాంతి యగునట్లుండుట, అరుచి, ఈగుణములు కల్గియుండునెడ, అట్టివానికి వమనము చేయింపనగును.

## లంఘన-వమనానంతరోపచారములు.

మూ. ఉష్ణైరేవోపచర్యశ్చ కృతే వమనలఙ్ఘనే. 50
యోజ్యశ్చాహారసంసర్గః భేషజైః కటుతిక్తకైః,

వ్యా. పైజెప్పినరీతిగ తొలుత లంకణము చేసి, వమనార్హునకు వమనము చేసిన పిదప ఉష్ణములగు నుపచారములనే వానికి చేయనగును. ఆహారపదార్థములలో కటుతిక్త రసములు గలయౌషధద్రవ్యముల జేర్చి సంస్కరించి యుపయోగింపవలెను.

## కఫజగుల్మమున స్వేదనము.

మూ. సానాహం సవిబన్ధం చ గుల్మం కఠినమున్నతమ్. 51
దృష్ట్వాదౌ స్వేదయేద్యుక్త్యా స్విన్నం చ విలయేద్భిషక్,

వ్యా. కడుపుబ్బి మలము బద్ధగించి గుల్మము కఠినముగను ఉన్నతముగను ఉన్నచో యుక్తియుక్తముగ చెమట పుట్టించి గుల్మమును కరగింపజేయవలెను.

## ఘృతపానము.

మూ. లఙ్ఘనోల్లేఖనే స్వేదే కృతేఽగ్నౌ సంప్రధుక్షితే. 52
కఫగుల్మే పిబేత్కాలే సక్షారకటుకం ఘృతమ్,

వ్యా. పైజెప్పినవిధముగ లంకణమును, వమనమును స్వేదవిధిని ఆయాకర్మమున కర్హులగు కఫగుల్మరోగులకు విధ్యుక్తప్రకారము చేసినపిదప దానివలన జఠరాగ్ని దీప్తి కల్గినప్పుడు క్షారములతోడను కటురసద్రవ్యములతోడను సిద్ధముచేయబడిన ఘృతమును ఉచితకాలమున త్రాగింపవలెను.

## కఫగుల్మమున శోధనవిధి వస్తిప్రయోగము.

మూ. స్థానాదపసృతం జ్ఞాత్వా కఫగుల్మం విరేచనైః. 53
సస్నేహైర్వస్తిభిర్వాపి శోధయేద్దాశమూలకైః,

వ్యా. పైజెప్పిన క్రియావిధానముచే కఫగుల్మము స్వస్థానమునుండి చలించినట్లు కనబడినచో స్నేహమూలతోను దశమూలకషాయములతోను కూడిన వస్తువుల ప్రయోగించి శోధనము చేయవలెను. (దశమూల వస్తివిధానము వస్తివిధ్యధ్యాయమున చూడదగినది.)

కఫజగుల్మమున గుటికాదిప్రయోగయుక్తసమయము.

మూ. మన్దేఽగ్నావనిలే మూఢే జ్ఞాత్వా సస్నేహమాశయమ్. 54
గుడికాచూర్ణనిర్యూహాః ప్రయోజ్యాః కఫగుల్మినాం,

వ్యా. కఫగుల్మము కలవారికి అగ్ని మందగించి వాతము వ్యాపించి గుల్మస్థానమైన యాశయము స్నిగ్ధముగ నున్నచో దానిని గమనించి క్రిందచెప్పబడు గుటికలను చూర్ణములను కషాయములను ప్రయోగింపవలెను.

కఫగుల్మమున క్షార-అరిష్ట-అగ్నికర్మయుక్తసమయము.

మూ. కృతమూలం మహావాస్తుం కఠినం స్తిమితం గురుమ్. 55
జయేత్కఫకృతం గుల్మం క్షారారిష్టాగ్నికర్మభిః,

వ్యా. కఫగుల్మము అంతర్ధాతువులయందు దృఢముగ పాదుకుని కోష్ఠమునందు బలముగ వ్యాపించి కఠినమై మొద్దుబారి బరువుగ నున్నచో క్రిందజెప్పబడు క్షారములను అరిష్టములను అగ్నికర్మను విధ్యుక్తప్రకారముగ ప్రయోగించి శమింపజేయవలెను. (క్షారప్రయోగవిధానము శల్యతంత్రమునకు సంబంధించినది కావున నచ్చట విస్తరముగ జెప్పబడినది. ఇచ్చట సూచనామాత్రముగ నుండును. గ్రహణ్యధ్యాయమున గూడ జెప్పబడును. అగ్నికర్మ మాత్రము ఇచ్చట సంక్షేపముగ జెప్పబడును.)

క్షారప్రయోగవిధి, దాని గల్గుగుణము.

మూ. దోషప్రకృతిగుల్మర్తు యోగం బుధ్వా కఫోల్బణే. 56
బలదోషప్రమాణజ్ఞః క్షారం గుల్మే ప్రయోజయేత్,
ఏకాన్తరం ద్వ్యన్తరం వా త్ర్యహం విశ్రమ్య వా పునః. 57
శరీరబలదోషాణాం వృద్ధిక్షపణకోవిదః,
శ్లేష్మాణం మధురం స్నిగ్ధం మాంసక్షీరఘృతాశినః. 58
ఛిత్త్వా ఛిత్త్వాశయాత్ క్షారః క్షరత్వాత్ క్షారయత్యధః,

వ్యా. కఫరూపమైన దోషమును, శరీరప్రకృతిని, గుల్మముయొక్క పరిస్థితిని, హేమంత శిశిరరూపమైన ఋతువును (శీతకాలమును), ఔషధయోగమును, వీని నన్నిటిని చక్కగ తెలిసికొని వైద్యవరుడు కఫప్రకోపమున జనించిన గుల్మమున క్షారమును ఉపయోగించవలెను. మరియు శరీరబలము మున్నగువాని పరిస్థితినిబట్టి తత్తదనుగుణముగ ఒకదినముసైన రెండుదినములసైనను లేక మూడుదినములసైనను నడుమ విశ్రాంతినిచ్చి

శరీరబలమును వృద్ధినొందించుటకును దోషముల హరింపజేయుటకును పలుమారు క్షార మును ఇయ్యనగును.

మరియు పైజెప్పినవిధముగ క్షారము నుపయోగించునపుడు మధురంబును స్నిగ్ధం బును నగునాహారమును మాంసమును నేతిని అపుపాలను విశేషముగ భుజించుచున్నయెడ శరీరబలము తగ్గక కఫమును ఛేదించి కఫాశయము గుల్మస్థానమునుండి క్షారము వెలు పలకు ద్రోయును. దోషమును ద్రవింపజేసి వెలికిం దోయుస్వభావము కల్గియుండుట చేతనే నీయది క్షారమని యన్వర్థముగ జెప్పబడును.

ఇచ్చట "దోషప్రకృతిగుల్మర్తుయోగం బుధ్వా" అనుచోట కఫగుల్మమునందు కఫరూపదోషమును కఫప్రకృతిని కఠినరూపమైనగుల్మమును కఫహరమైనయౌషధయోగ మును చక్కాగ గమనించి అట్టి పరిస్థితి నుండు గుల్మమున శీతస్వభావమైన హేమంత శిశిరఋతువులలో నొకసమయమున క్షారమును ప్రయోగింపవలెనని భావము నెరుంగునది.

మరియు "వృద్ధిక్షపణకోవిదః" అనుటవలన క్షారము మిగుల తీవ్రమైన యౌషధ మగుటచే నొకసమయమున శరీరబలమునకు హానిచేయజూచును. కావున శరీరబలమునకు హాని లేదనియుం దోషము హరించుచున్నదనియు చక్కాగ గమనించి, మధురస్నిగ్ధాద్యా హారములచే బలమును వృద్ధినందింపుచు క్షారము నుపయోగింపవలెనని భావము.

కఫగుల్మమున అరిష్టప్రయోగము.

మూ. మన్దేఽగ్నావరుచౌ సాత్మ్యే మద్యే సస్నేహమశ్నతామ్.　　59
ప్రయోజ్యాః మార్గశుద్ధ్యర్థం అరిష్టాః కఫగుల్మినాం,

వ్యా. కఫజగుల్మరోగము కలవారికి జఠరాగ్ని మందగించి యరుచి కల్గియున్న యెడ మద్యపానము అలవాటుగ నున్నవారికిని స్నిగ్ధమైన యాహారమును భుజించువారి కిని స్రోతోమార్గము శుద్ధ మగుటకై యరిష్టములను ప్రయోగింపవలెను.

రూఢమూలమగు కఫగుల్మమునం దగ్నికర్మవిధి.

మూ. లఙ్ఘనోల్లేఖనైస్స్వేదైః సర్పిః పానైర్విరేచనైః.　　60
వస్తిభిః గుడికాచూర్ణక్షారారిష్టగణైరపి,
శ్లైష్మికః కృతమూలత్వాత్ యస్య గుల్మో న శామ్యతి.　　61
తస్య బాహో హృతే రక్తే శరలోహాదిభిర్హితః,
ఔష్ణ్యాత్ తైక్ష్ణ్యాచ్చ శమయే దగ్నిర్గుల్మే కఫానిలౌ.　　62
తయోశ్శమాచ్చ సంఘాతః గుల్మస్య వినివర్తతే,

వ్యా. రాజయక్ష్మరోగమున చెప్పబడిన షట్పలఘృతమునైన పానముచేసినచో గుల్మములు శమించును. ఆఘృతయోగమున పంచమూలములను యవక్షారమును ప్రత్యేక మొక్కొక పలమువంతున (అన్నియు చేరి యారుపలములు) ప్రస్థపరిమితమగు ఘృతమున జేర్చి, అందు సమభాగము పాలనైనను, ప్రసన్నమను మద్యవిశేషమునైనను (మద్యముపైతేట), సురామద్యమునైనను, దానిమ్మపండ్లరసమునైనను, పెరుగుమీది తేటనీటినైనను, పాలకు బదులుగ ఘృతమునకు సమభాగము గూర్చి పక్వముజేసి యాషట్పల ఘృతమును పానముచేయనగును. (షట్పలఘృతయోగమును వాగ్భటాచార్యులు యక్ష్మ చికిత్సితమున నిట్లుచెప్పిరి:—"పంచకోలయవక్షార షట్పలేన పచేత్ ఘృతమ్, ప్రస్థోన్మితం తుల్యపయః స్రోతసాం తద్విశోధనమ్. గుల్మజ్వరోదరప్లీహగ్రహణీపాణ్డుపీనసాన్, శ్వాసకాసాగ్నిసదనశ్వయథూర్ధ్వానిలాన్ జయేత్" పంచకోలములన (పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శుంఠి) ఈయైదును యవక్షారమును ప్రత్యేక మొక్కపలము వంతున ఆరుపలము లగును. కావున నీఘృతము షట్పలఘృతమని చెప్పబడెను. ఈయోగముననే పాలకు బదులు పైజెప్పబడిన ప్రసన్నము మున్నగు ద్రవములలో దేనినైనను చేర్చి పక్వముచేయుట యిచ్చట విశేషవిధి.)

ఈతంత్రకారులును షట్పలఘృతయోగమును రాజయక్ష్మచికిత్సితమున నిట్లు చెప్పిరి:—"పిప్పలీపిప్పలీమూలచవ్యచిత్రకనాగరైః, సయావశూకైస్సక్షీరైః స్రోతసాం శోధనం ఘృతమ్" (చికిత్స-అ. ౮, శ్లోక. ౧౬౮) ఇచ్చట కల్కద్రవ్యములకును ఘృతమునకును పరిమితి మాత్రము చెప్పియుండలేదు.

### వాతగుల్మహరహింగుసౌవర్చలాదిఘృతము.

మూ. హిఙ్గుసౌవర్చలాఽజాజీబిడదాడిమదీప్యకైః,
పుష్కరవ్యోషధాన్యాకవేతసక్షారచిత్రకైః. 69
శటీవచాఽజగన్ధైలా సురసైశ్చ విపాచితమ్.
శూలానాహహరం సర్పిః దధ్నా చాఽనిలగుల్మనుత్. 70
(ఇతి హిఙ్గుసౌవర్చలాద్యం ఘృతమ్.)

వ్యా. ఇంగువ, సౌవర్చలలవణము, జీలకర, బిడాలవణము, దానిమ్మకాయ బెరడు, ఓమము, మెట్టదామర, త్రికటుకములు (శుంఠి పిప్పలి మిరియాలు), దనియాలు, అమ్ల వేతసము, యవక్షారము, చిత్రమూలము, కచోరములు, వస, వాయింట, ఏలకులు, తులసి, వీని నన్నిటిని సమభాగములుగ కల్కముచేసి కల్కసముదాయమునకు నాల్గింతలు

ఘృతమున జేర్చి అందు ఘృతమునకు నాల్గింతలు పెరుగు చేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసి సేవించినచో వాతగుల్మమును హరించును. శూలను కడుపుబ్బరమును శమింప జేయును.

ఇచ్చట నీవిమర్శనము నెరుంగునది:—పైజెప్పిన యోగమున చరకవ్యాఖ్యానమున "దధిచతుర్గుణం ద్రవత్వాత్" అని చక్రపాణి చెప్పియుండుటంబట్టి తదనుసారముగ ఘృతమునకు పెరుగు నాల్గింత లుండవలెనని పైని వివరించితిమి. అష్టాంగహృదయ వ్యాఖ్యాత యీయోగముననే "హింగుసౌవర్చలవ్యోష.........దధిసంయుతైః." (అష్టాఙ్గ. చి. అ. ౧౪. శ్లో. ౧౦.) అనుచోట "ద్రవ్యేభ్యస్సమం ఘృతమ్, ఘృతసమం దధి, ఘృతాచ్చతుర్గుణం జలమితి అత్ర పాకక్రమః." అని సర్వాంగసుందరవ్యాఖ్యలో చెప్పియున్నారు. ఈవ్యాఖ్యప్రకారము ఘృతమునకు సమము దధియు, ఘృతచతుర్గుణము జలంబును చేర్చవలెనని తెలిసెడి. మరియు "స్వరసక్షీరమాంసాద్యైః పాకో యత్రేరితః క్వచిత్, జలం చతుర్గుణం తత్ర వీర్యాధానార్థమావపేత్." అను విశేషపరిభాషయు సర్వాంగసుందరవ్యాఖ్యనే అనువదించుచున్నది. ఏది యెట్లున్నను ఔషధగుణము ఘృతమున సంక్రమించుటకై చతుర్గుణజలమును చేర్చుట సమంజసమని తోచెడి.

మరియు "దుగ్ధే దధ్ని రసే తక్రే కల్కో దేయోఽష్టమాంశికః, కల్కస్య సమ్యక్పాకార్థం తోయమత్ర చతుర్గుణమ్." అనుపరిభాషావచనముచేత పెరుగు చేర్చి సిద్ధముచేయబడు ఈఘృతయోగమున ఘృతమునకు ఎనిమిదవపాలు కల్కమును జేర్చి కల్కము చక్కగ పక్వమగుటకై ఘృతమునకు నాల్గింతలు జలమును చేర్చవలెనని తెలిసెడిని. ఈయోగమునకు సజాతీయములగు ఘృతతైలయోగములయందెల్ల నీకల్పనాపద్ధతి నెరుంగునది.

### హపుషాదిఘృతము.

మూ. హపుషావ్యోషపృథ్వీకా చవ్యాచిత్రకసైన్ధవైః,
సాఽజాజీపిప్పలీమూలదీప్యకైర్విపచేద్ఘృతమ్. 71
సకోలమూలకరసం సక్షీరదధిదాడిమం,
తత్పరం వాతగుల్మఘ్నం శూలాఽఽనాహవిమోక్షణమ్. 72
యోన్యర్శోగ్రహణీదోషశ్వాసకాసాఽరుచిజ్వరాన్,
వస్తిహృత్పార్శ్వశూలం చ ఘృతమేతద్వ్యపోహతి. 73
(ఇతి హపుషాద్యం ఘృతమ్.)

వ్యా. కఫజగుల్మము రూఢమూలమై బలిష్ఠముగ నుండుటవలన పైని "శీతలైః గురుభిస్స్నిగ్ధైః......లఙ్ఘనమాదితః" (౪౮.) అని యుపక్రమించి యింతదనుక చికిత్సాక్రమమున జెప్పబడిన లంఘనము ఉల్లేఖనము (వమనము), స్వేదవిధి, ఘృత పానము, విరేచనము, వస్తిప్రయోగము, గుడికలు, చూర్ణములు, క్షారములు, అరిష్టములు, అనుసీచికిత్సావిధానములచేతను కూడ శమించకుండినయెడ అట్టి గుల్మమును తొలుత దుష్టరక్తమును వెడలించి శరలోహము మున్నగువానిచేత గుల్మస్థలమున రక్షబెట్టవలెను. (అట్టి లోహశలాకను నిప్పున కాల్చి గుల్మముండుస్థలమున విధ్యుక్తప్రకారము కాల్చ వలెను.)

ఆత్తెరంగున కాల్చినచో నగ్ని ఉష్ణతీక్ష్ణస్వభావములు కల్గియుండుటవలన శీత ప్రధానములైన కఫవాతములను శమింపజేయును. కఫవాతములు రెండును శమించుట వలన దాన గల్గిన గుల్మసంఘాతము తనంతనే శమించును.

### క్షారాగ్నికర్మలవిషయము.

మూ. దాహే ధాన్వన్తరీయాణాం అత్రాపి భిషజాం బలమ్. 63
క్షారప్రయోగే భిషజాం క్షారతన్త్రవిదాం బలం,

వ్యా. అగ్నికర్మ చేయుటకును శల్యతంత్రవేత్తలును ధన్వంతరమతావలంబులు నగువైద్యులకే యధికారము, క్షారప్రయోగంబును ప్రత్యేకవిధానమగుటవలన క్షార విధానమును దెలుపునట్టి తంత్రమునందు ప్రతిభాశాలులగు వైద్యులే చేయనగును, (కావున శస్త్రకర్మను బోలె క్షారాగ్నికర్మలును ప్రత్యేక తంత్రజ్ఞేయము లగుటంజేసి కాయచికిత్సాప్రధానమగు నీతంత్రమున వివరింపబడవని యభిప్రాయము). ఇత్తెరంగున వాతిక-పైత్తిక-శ్లైష్మికగుల్మముల మూటికిని చికిత్సాక్రమము ప్రతిజ్ఞానుసారముగ వివరింప బడెను.)

### ద్వంద్వజ-సాన్నిపాతికగుల్మచికిత్సాతిదేశము.

మూ. వ్యామిశ్రదోషే వ్యామిశ్ర ఏష ఏవ విధిక్రమః. 64

వ్యా. మరియు దోషద్వయ సంసర్గమున జనించిన వాతపిత్త-వాతకఫ-పిత్తకఫ గుల్మములయందును లక్షణద్వయసంసర్గముచే గమనించి పైని వేరువేరుగ నాయా దోషములకు చెప్పిన చికిత్సాద్వయమును మేళనము చేసి చికిత్స చేయనగును. త్రిదోష ప్రకోపమున జనించిన సాన్నిపాతిక గుల్మమునకును చికిత్సాసంసర్గరూపముగ చికిత్స చేయనగును.

## గుల్మహరసిద్ధయోగములు, అందు వాతగుల్మమునకు త్ర్యూషణాదిఘృతము.

మూ. సిద్ధానతః ప్రవక్ష్యామి యోగాన్ గుల్మనిబర్హణాన్,
త్ర్యూషణత్రిఫలాధాన్యవిడఙ్గచవ్యచిత్రకైః. 65
కల్కీకృతైర్ఘృతం సిద్ధం సక్షీరం వాతగుల్మనుత్,
(ఇతి త్ర్యూషణాదిఘృతమ్.)

వ్యా. చికిత్సాక్రమమును జెప్పినపిదప ప్రతిజ్ఞానుసారముగ ఘృతములు మున్నగు సిద్ధయోగములు చెప్పబడును:— త్రికటుకములు, (శుంఠి-పిప్పలి-మిరియాలు), త్రిఫలములు (కరక-తాని-ఉసిరికకాయలు), వాయువిడంగములు, చెవ్యము, చిత్రమూలము, ఈయౌషధములను సమభాగములుగ చేర్చి కల్కముచేసి కల్కమునకు నాల్గింతలు ఘృతమును, ఘృతమునకు నాల్గింతలు ఆవుపాలును చేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముజేసి సేవించినచో వాతగుల్మమును హరించును.

ఇచ్చట క్షీరమొక్కటియే ద్రవము నిర్దేశింపబడినది. కావున— "స్నేహపాకవిధౌ యత్ర క్షీరమేకస్తు కథ్యతే, తోయాదీనామనిర్దేశే క్షీరమేవ చతుర్గుణమ్." అను విశేషపరిభాషచేత ఘృతమునకు నాల్గింతలు క్షీరమును జేర్పనగును. ఇట్టిస్థలములయం దెల్ల నీపరిభాషనే యనుసరించునది.

## రెండవ త్ర్యూషణాదిఘృతము.

మూ. ఏత ఏవ చ కల్కాస్స్యుః కషాయః పఞ్చమూలికః. 66
ద్విపఞ్చమూలికో వాపి తత్ ఘృతం గుల్మనుత్పరమ్,
(ఇతి త్ర్యూషణాదిఘృతమపరమ్.)

వ్యా. పైజెప్పబడిన త్రికటుకములు మున్నగు ద్రవ్యముల కల్కముగ జేర్చి పంచమూలకషాయమునైనను ద్విపంచమూలకషాయమునైనను ద్రవముగ జేర్చి పక్వము చేయబడినఘృతము గుల్మముల హరించుటకు మిగుల నుత్తమముగ నుండును. (ఇచ్చట "స్నేహాత్తోయం చతుర్గుణం" అనుసామాన్యపరిభాషచేత ఘృతమునకు నాల్గింతలు పంచమూలకషాయమును, నాల్గవపాలు త్రికటుకాది కల్కమును జేర్చి పక్వము చేయునది.)

## వాతగుల్మహరషట్పలఘృతము.

మూ. షట్పలం వా పిబేత్సర్పిః యదుక్తం రాజయక్ష్మణి. 67
ప్రసన్నయా వా క్షీరార్థం (క్షీరోత్థం) సురయా దాడిమేన వా,
దధ్నస్సరేణ వా కార్యం ఘృతం మారుతగుల్మనుత్. 68

వ్యా. విత్తుబోడతరము, త్రికటుకములు, పెద్దయేలకులు, చవ్యము, చిత్రమూలము, సైంధవలవణము, జీలకర, పిప్పళ్లమూలము (మోడి), ఓమము వీని నన్నిటిని సమభాగముగ జేర్చి కల్కము జేసి దీనికి నాల్గింతలు ఘృతమును (ఆవునేతిని) జేర్చి, అందు రేగుపండ్లరసమును, ముల్లంగిరసమును, ఆవుపెరుగును, ఆవుపాలను, పుల్లదానిమ్మపండ్లరసమును ఈద్రవముల నొక్కొకటి ఘృతమునకు సమభాగముగ నుండునట్లు చేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేయవలెను. ఈఘృతము వాతగుల్మమును హరించుటకు మిగుల ప్రశస్తము. మరియు శూలలను కడుపుబ్బరమును పోగొట్టును. యోనిదోషములను అర్శోరోగమును, గ్రహణిరోగమును, శ్వాస-కాసములను, అరుచిని, జ్వరమును, వస్తి (మూత్రపుతిత్తి)యందును హృదయమునందును పార్శ్వములయందును కల్గు శూలలను హరించును.

ఇచ్చట "ద్రవాణి యత్ర స్నేహేషు పఞ్చాదీని భవన్తి హి, తత్ర స్నేహసమాన్యాహుః యథాపూర్వం చతుర్గుణమ్." అనుపరిభాష ననుసరించి రేగుపండ్లరసమున్నగు నైదుద్రవములు చేరుటవలన నొక్కొక ద్రవమును ఘృతమునకు సమభాగముగ నుండునట్లు చేర్పనగును. "సక్షీరదాడిమమ్" అనుచోట ద్రవమధ్యమున పఠింపబడిన దాడిమశబ్దముచేత దానిమ్మరసమునే గ్రహించు టుచితము. తంత్రాంతరమున నీవిషయము ఇట్లు స్పష్టముగ జెప్పబడినది:—"పృథ్వీకాజీరకవ్యోష హాపుషాజాజిసైన్ధవైః, సచవ్య పిప్పలీమూలైః వహ్నిదీప్యకసంయుతైః. మూలదాడిమకోలానాం రసే, దధ్ని పయస్యపి, సిద్ధం ఘృతం జయేద్గుల్మం వహ్నిసన్దీపనం పరమ్."

## వాతగుల్మహరపిప్పల్యాదిఘృతము.

మూ. పిప్పల్యాః పిచురధ్యర్థో దాడిమాద్ద్విపలం, పలం,
ధాన్యాత్, పఞ్చఘృతాత్, శుణ్ఠ్యాః కర్షః, క్షీరం చతుర్గుణమ్. 74
సిద్ధమేతైః ఘృతం సద్యః వాతగుల్మం వ్యపోహతి,
యోనిశూలం శిరశ్శూలం అర్శాంసి విషమజ్వరమ్. 75
(ఇతి పిప్పల్యాద్యం ఘృతం.)

వ్యా. పిప్పళ్లు ఒకటిన్నరకర్షము, దానిమ్మబెరడు రెండుపలములు, దనియాలు ఒకపలము, ఆవునెయ్యి ఐదుపలములు, శుంఠి ఒకకర్షము, ఆవుపాలు ఘృతమునకు నాల్గింతలు (ఇరువదిపలములు), వీని నన్నిటి నొకటిగ గూర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వము జేయునది. ఈఘృతము నుపయోగించినచో వాతగుల్మమును శీఘ్రముగ శమింపజేయును.

మరియు దీనివలన యోనిశూలంబును, తలపోటును; అర్శస్సులు (గుదాంకురములు)ను, విషమజ్వరంబును హరించును.

ఇచ్చట పిప్పళ్లు మున్నగు కల్కద్రవ్యములు అన్నియు చేరి మూడున్నరపరకపల మగును. ఘృతము ఐదుపలములు కావున కల్కము సామాన్యపరిభాషోక్తమునకన్న నెక్కువ యగును. అయినను విశేషవిధానముచే దోషావహము కాదని యెరుంగునది. ఈవిషయము గ్రంథాంతరమున నిట్లు ఆదేశింపబడినది:—"నిర్దేశః శ్రూయతే నూనం ద్రవ్యాణాం యత్ర యాదృశః, తస్మిన్ స సంవిదాతవ్యః శబ్దాభావే ప్రసిద్ధితః." ఏయోగమునందు ద్రవ్యములపరిమాణము మున్నగువిషయములయం దెట్లు నిర్దేశింపబడి యుండునో అచ్చట నదేవిధముగ పరిమాణమును గ్రహింపదగును. అట్టివిశేషవిధినిర్దేశము లేనిచోట సామాన్యవిధినిర్దేశప్రకారము ద్రవ్యపరిమాణమును గ్రహింపనగునని యర్థము. ఈయభిప్రాయమునే పరిభాషయందును ఇట్లు చెప్పబడినది:—"జలస్నేహౌషధానాం చ ప్రమాణం యత్ర నేరితమ్, తత్ర స్యాదౌషధాత్ స్నేహః స్నేహాత్తోయం చతుర్గుణమ్" ఇచ్చట 'ప్రమాణం యత్ర నేరితమ్' అని చెప్పుటచేత కల్కాదులకు పరిమాణము కంఠతః చెప్పనిచోటనే యీపరిభాష ననుసరించి ద్రవ్యాదిప్రమాణమును కల్పింపవలెనని స్ఫుటముగ నేర్పడును.

### గుల్మహరచూర్ణ-వస్తి-కషాయయోగాతిదేశము.

మూ. ఘృతానామౌషధగణాః య ఏతే పరికీర్తితాః,
తే చూర్ణయోగాః వర్త్యస్తాః కషాయాస్తే చ గుల్మినామ్.    76

వ్యా. ఈప్రకరణమున ఘృతయోగములకు చెప్పబడిన త్ర్యూషణాది ద్రవ్యగణములను చూర్ణయోగములకును, ఫలవర్తియోగములకును, కషాయయోగములకు జేర్చి చూర్ణాదుల సిద్ధముచేసి గుల్మరోగుల కుపయోగింపనగును.

### గుల్మహరచూర్ణానుపానములు, ఫలవర్తివిధానము.

మూ. కోలదాడిమఘర్మామ్బుసురామణ్డామ్లకాఞ్జికైః,
శూలానాహహరీ పేయా బీజపూరరసేన వా.    77
చూర్ణాని మాతులుఙ్గస్య భావితాని రసేన వా,
కుర్యాద్వర్తీస్సుగుటికాః గుల్మానాహార్తిశాన్తయే.    78

వ్యా. పైజెప్పబడిన రీతిగ చేయబడిన చూర్ణయోగములను రేగుపండ్లరసము, దానిమ్మపండ్లరసము, వేడినీళ్లు, సురయను మద్యముపైతేట, పుల్లనిగంజి (పుల్లనీళ్లు), మాదీ

ఫలములరసము, అనుసీద్రవములలో నొకదాని ననుపానముగ జేసి సేవించిన గుల్మమును శూలను కడుపుబ్బరమును హరించును.

మరియు ఆచూర్ణములను మాదీఫలరసమున భావనచేసి ఫలవర్తులుగను గుటికలుగను సిద్ధముచేసి విధ్యుక్తప్రకారముగ నుపయోగించినచో గుల్మమును కడుపుబ్బరమును పోటును శమింమను. ఇచ్చట కషాయములకు మాత్రము విశేషవిధి లేదు కావున కషాయ కల్పసామాన్యవిధిప్రకారము సిద్ధముచేసి యుపయోగింపదగును.

ఫలవర్తివిధి తంత్రాంతరమున నిట్లున్నది:—"ఘృతాభ్యక్తే గుదే క్షిప్తా శ్లక్ష్ణాస్వాఙ్గుష్ఠసన్నిభా, మలప్రవర్తినీ వర్తిః ఫలవర్తిశ్చ సా స్మృతా."

గుల్మహరహింగ్వాదిచూర్ణము, గుటికలును.

మూ. హిఙ్గు త్రికటుకం పాఠాం హపుషామభయాం శటీం,
అజమోదాఽజగన్ధే చ తిన్తిడీకాఽమ్లవేతసౌ. 79
దాడిమం పుష్కరం ధాన్యం అజాజీం చిత్రకం వచాం,
ద్వౌ క్షారౌ లవణే ద్వే చ చవ్యం చైకత్ర చూర్ణయేత్. 80
చూర్ణమేతత్ ప్రయోక్తవ్యం అన్నపానేష్వనత్యయం,
ప్రాగ్భక్తమథవా పేయం మద్యేనోష్ణోదకేన వా. 81
పార్శ్వహృద్వస్తిశూలేషు గుల్మే వాతకఫాత్మకే,
ఆనాహే మూత్రకృచ్ఛ్రే చ శూలే చ గుదయోనిజే. 82
గ్రహణ్యర్శోవికారేషు ప్లీహ్ని పాణ్డ్వామయేఽరుచౌ,
ఉరోవిబన్ధే హిక్కాయాం కాసే శ్వాసే గలగ్రహే. 83
భావితం మాతులుఙ్గస్య చూర్ణమేతద్రసేన వా,
బహుశో గుళికాః కార్యాః కార్ముకాస్స్యుః తతోఽధికమ్. 84
(ఇతి హిఙ్గ్వాదిచూర్ణం గుటికా చ.)

వ్యా. ఇంగువ, త్రికటుకములు (శొంఠి-పిప్పలి-మిరియాలు), చిరుబొద్ది, బోడతరము, కరకకాయలు, కచూరములు, ఓమము, కుక్కవాయింట, చింతపండు, అమ్లవేతసము (పుల్లప్రబ్బలి), దానిమ్మ, మెట్టదామర, దనియాలు, జీలకర, చిత్రమూలము, వస, సర్జక్షారము, యవక్షారము, సైంధవలవణము, సౌవర్చలలవణము, చవ్యము వీని నన్నిటిని సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి అన్నపానములతో జేర్చి తొలుత పరగడుపున సేవించవలెను. లేక మద్యముతో నైనను ఉష్ణోదకముతో నైనను అనుపానముగ జేర్చి

భుజించుటకు మునుమున్ను త్రాగవలెను. ఇత్తెరంగున పార్శ్వశూలయందును, హృదయ శూలయందును, వస్తిశూలయందును, వాతకఫగుల్మములయందును, కడుపుబ్బరమునందును, మూత్రకృచ్ఛ్రమునందును, గుదమునందును యోనియందును కల్గు శూలయందును, గ్రహణిరోగమునందును, అర్శోరోగమునందును, ప్లీహావృద్ధియందును, పాండురోగము నందును, అరుచియందును, రొమ్ముపట్టునందును, ఎక్కిళ్లయందును, శ్వాసకాసముల యందును ఉపయోగింపనగును. (అమ్లవేతసమును పుల్లప్రబ్బలి, పుల్లబచ్చలి, చుక్కకూర, అని నామాంతరములచే లోకమున చెప్పెదరు.)

మరియు నీచూర్ణమును మాదీఫలములరసమున పలుమారు భావనచేసి గుటికలు (మాత్రలు)గా చేసి యుపయోగించినచో మిక్కిలి ఫలవంతము లగును. (ఇచ్చట "కార్ముకాః స్యుః, తతోఽధికమ్" అనగ చూర్ణమునకన్న గుటికలు "కార్ముకాః" కార్య సమర్థములు అగునని యర్థము. సర్వాంగసుందరవ్యాఖ్యానమున "కుర్వీత కార్ముకతరాన్" అనుచోట "కార్ముకతరాన్-కార్యకరణసమర్థాన్" అని వ్యాఖ్యానము చేసియున్నది).

వాతగుల్మహరమాతులుంగాదియోగము.

మూ. మాతులుఙ్గరసో హిఙ్గు దాడిమం బిడసైన్ధవే,
సురామణ్డేన పాతవ్యం వాతగుల్మరుజాపహమ్. 85

వ్యా. మాతులుంగరసము, ఇంగువ, దానిమ్మపండు, బిడాలవణము, సైంధవలవ ణము వీనిని సురయను మద్యముయొక్క తేటలో కలిపి త్రాగినయెడ వాతగుల్మమును హరించును.

గుల్మాదులకు శట్యాది చూర్ణము, గుటికలును.

మూ. శటీపుష్కరహిఙ్గ్వమ్లవేతసక్షారచిత్రకాన్,
ధాన్యాకం చ యవానీం చ విడఙ్గం సైన్ధవం వచామ్. 86
సచవ్యపిప్పలీమూలమజగన్ధాం సదాడిమాం,
అజాజీం చాఽజమోదాం చ చూర్ణం కృత్వా ప్రయోజయేత్.
రసేన మాతులుఙ్గస్య మధుశుక్తేన (యుక్తేన) వా పునః,
భావితం గుటికాం కృత్వా సుపిష్టాం కోలసమ్మితామ్. 88
గుల్మం ప్లీహానమానాహం శ్వాసం కాసమరోచకం,
హిక్కాం హృద్రోగమర్శాంసి వివిధాం శిరసో రుజమ్. 89

పాణ్డ్వామయం కఫోత్క్లేశం సర్వజాం చ ప్రవాహికాం,
పార్శ్వహృద్వస్తిశూలం చ గుటికైషా వ్యపోహతి. 90
(ఇతి శట్యాదిచూర్ణం, గుటికా చ.)

వ్యా. కచోరములు, మెట్టదామర, ఇంగువ, అమ్లవేతసము, యవక్షారము, చిత్రమూలము, దనియాలు, కురాసానియోమము, వాయువిడంగములు, సైంధవలవణము, వస, చవ్యము, కోడి, కుక్కవాయింట, దానిమ్మబెరడు, జీలకర, పెద్దఓమము వీని నన్నిటిని సమభాగములుగ జేర్చి చూర్ణము చేసి యుక్తమైన యనుపానముతో నుపయోగించునది.

మరియు పైజెప్పిన చూర్ణమును మాదీఫలరసమునందును తేనెయందును భావన చేసి యారెంటిని కలిపి చక్కగ నూరి రేగుపండంతేసి గుటికలు చేసియైన నుపయోగింపనగును. దీనిని సేవించుటచేత గుల్మము, ప్లీహవృద్ధి, కడుపుబ్బరము, శ్వాసకాసములు, అరోచకము, ఎక్కిళ్లు, హృద్రోగము, అర్శోరోగము, పలుదెరంగులైన శిరోబాధలు, పాండురోగము, నోట కఫము వాంతియగుట, సన్నిహితమున కల్గిన ప్రవాహిక, పార్శ్వశూల, హృదయశూల, వస్తిశూల వీని నన్నింటిని హరింపజేయును.

వాతగుల్మహరనాగరాదియుక్తక్షీరపానము.

మూ. నాగరార్ధపలం పిష్ట్వా ద్వే పలే లుఞ్చితస్య చ,
తిలస్యైకం గుడపలం క్షీరేణోష్ణేన వా పిబేత్. 91
వాతగుల్మముదావర్తం యోనిశూలం చ నాశయేత్,

వ్యా. శుంఠి అరపలము, పొట్టొలిచిన నువ్వులు రెండుపలములు, బెల్లము ఒక పలము ఈమూడిటి నొకటిగ గూర్చి నూరి యుండలుచేసి వేడిఆవుపాలతో కలిపి త్రాగినచో వాతగుల్మమును ఉదావర్తమును యోనిశూలను హరించును. (ఈయోగము వ్యాధియొక్క ప్రభావముచే పైజెప్పిన గుణము కల్గియుండునని యెరుంగునది.)

వాతగుల్మమున నేరండతైలప్రయోగము.

మూ. పిబేదేరణ్డజం తైలం వారుణీమణ్డమిశ్రితమ్. 92
తదేవ తైలం పయసా వాతగుల్మీ పిబేన్నరః,
శ్లేష్మణ్యనుబలే పూర్వం హితం పిత్తానుగే పరమ్. 93

వ్యా. వాతగుల్మము కలవాడు అట్టివాతమునకు కఫము అనుబలముగ (సహకారిగ) నున్నపుడు ఆముదమును వారుణి యను మద్యముయొక్క తేటను కలిపి త్రాగుట

చాల మంచిది. అట్టివాతమునకు పిత్తము సహకారిగ నుండుచో నెడ ఆవుపాలలో నాముద మును కలిపి త్రాగుట యుక్తము.

వాతగుల్మహరలశునక్షీరయోగము.

మూ. సాధయేచ్ఛుద్ధశుష్కస్య లశునస్య చతుష్పలం,
క్షీరోదకేఽష్టగుణితే (క్షీరే జలాష్టగుణితే) క్షీరశేషంచనాపిబేత్.
వాతగుల్మముదావర్తం గృధ్రసీం విషమజ్వరం,
హృద్రోగం విద్రధిం శోథం సాధయత్యాశు తత్పయః. 95
(ఇతి లశునక్షీరమ్.)

వ్యా. పొట్టు విడతీసి చక్కగ నెండింపబడిన వెల్లుల్లి పాయల నాల్గుపలములను జలమును పాలును చేరి యుల్లిపాయలకు ఎనిమిదిభాగములు (ముప్పదిరెండుపలములు)గ నుండునట్లు గూర్చి, పాలు మాత్రము మిగులునట్లు చుండ కాచి యాపాలను త్రాగినచో వాతగుల్మమును, ఉదావర్తమును, గృధ్రసీవాతమును, విషమజ్వరమును, హృద్రోగమును, విద్రధిని శోఫ(నంజు)ను నశింపజేయును.

ఇచ్చట నాల్గుపలములు వెల్లుల్లిపాయలు నీళ్లను పాలును కలిసి ఉల్లిపాయలకు ఎనిమిదింతలు చెప్పబడినది. అందును పాలకును నీళ్లకును పరిమితి ప్రత్యేకముగ జెప్పి యుండలేదు. కావున "భాగేఽప్యనుక్తే సమమేవ దేయమ్" అను సామాన్యపరిభాషచేత నీళ్లను పాలును సమభాగములుగ నుండవలెను. అట్టియెడ పదునారుపలములు పాలును, పదునారుపలములు నీళ్లను కలిపినచో నీరెండును చేరి ఉల్లిపాయలకు ఎనిమిదింతలగును. పైజెప్పినరీతిని నీళ్లను పాలును కలిసి ముప్పదిరెండుపలములుగ గూర్చి అందు నాల్గుపల ములు ఉల్లిపాయల జేర్చి క్షీరపాకము చేయవలెనని ఫలితార్థము.

మరియు తెల్లపాయలును క్షీరంబును నొకటిగ చేరిన విరుద్ధగుణమగుట స్వభావ మయినను ఇచ్చట వ్యాధిమహిమవలన అట్టి విరుద్ధగుణమును జూపకయే వ్యాధినివర్తక మగునని త్రికాలవేత్తలగు మహర్షులు గమనించి యిట్టియోగముల నుపదేశించిరని యెరుంగునది.

గుల్మహరతైలాదిపంచకయోగము.

మూ. తైలం ప్రసన్నాం గోమూత్రమారనాళం యవాగ్రజం,
గుల్మం జఠరమానాహం పీతమేకత్ర సాధయేత్. 96
(ఇతి తైలపఞ్చకమ్.)

వ్యా. తైలము (ఆముదము), మద్యముపై తేట, గోమూత్రము, ఆరనాళము (గంజి), యవక్షారము ఈ యైదిటి నొకటిగ జేర్చి త్రాగినయెడ గుల్మంబును, జఠరంబు (మహోదరము)ను శమించును. కడుపుబ్బరము నివర్తించును. (వాతప్రధానమైనది గుల్మముగాన తైలశబ్దముచేత వాతహరమగు ఏరండతైలమే గ్రహింపనగును.)

ఇచ్చట ఆరనాళవిధానము నిట్లెరుంగునది:—"తులామితం షష్టికతండులం చ ప్రగృహ్య చాన్నం విధివద్విధాయ, ద్రోణేఽమ్బుని క్షిప్త మథ త్రియామాః తత్సప్త రక్షేత్ పిహితం ప్రయత్నాత్ తతస్తు కల్కం సకలం నిరస్యేత్ తత్కాఞ్జికం కథ్యత ఆరనాళమ్." అరువదినాళ్ల సంబావులబియ్యము నూరుపలములను అన్నముగ జేసి యా యన్నమున నొక ద్రోణపరిమితజలమును బోసి కుండలో నునిచి మూతి బిగించి యేడు రాత్రులు గడచునందాక పదిలముగ నునిచి పిమ్మట వెలికిం దీసి వడగట్టి పిప్పిని పారవైచిన యారసము కాంజికమనియు ఆరనాళమనియు చెప్పబడును. (పులిసినగంజియని ముఖ్యభావము.)

గుల్మమున శిలాజతుప్రయోగము.

మూ. పఞ్చమూలీకషాయేణ సక్షా(క్షీ)రేణ శిలాజతు,
పిబేత్తస్య ప్రయోగేణ వాతగుల్మాత్ప్రముచ్యతే. 97
(ఇతి శిలాజతుప్రయోగః.)

వ్యా. శిలాజతువును పంచమూలకషాయము నైనను యవక్షారోదకమునైనను (క్షీరమునైనను) అనుపానముగ జేసి త్రాగినచో వాతగుల్మమును హరించును. (ఇచ్చట "సాలపర్ణీ పృశ్నిపర్ణీ బృహతీద్వయగోక్షురమ్" అనునట్టి హ్రస్వపంచమూలమును గ్రహింపవలెనని చక్రపాణివ్యాఖ్యలో నున్నది.)

వాతగుల్మమున వాట్య(బలామూల)ప్రయోగము.

మూ. వాట్యం యూషేణ పిప్పల్యాః మూలకానాం రసేన చ,
భుక్త్వా స్నిగ్ధముదావర్తాత్ వాతగుల్మాద్విముచ్యతే. 98

వ్యా. పిప్పలిబియ్యముచే సిద్ధముచేయబడిన యూషమునందైనను, ముల్లంగిగడ్డల రసమునందైనను బలామూలమును కలిపి సేవించి స్నిగ్ధమైన యాహారమును భుజించినచో నుదావర్తంబును వాతగుల్మంబును నివర్తించును. (ఇచ్చట వాట్యమన బలామూలము లేక పుష్కరమూలము అని యెరుంగునది.)

గుల్మరోగమున చేయదగిన స్వేదవిధులు.

మూ. శూలానాహవిబన్ధార్తం స్వేదయేద్వాతగుల్మినం,
స్వేదైః స్వేదవిధావుక్తైః నాడీప్రస్తరసఙ్కరైః. 99

వ్యా. వాతగుల్మరోగికి శూలము, కడుపుబ్బరము, మలబంధము అను నీయుపద్రవములు కల్గినయెడ, స్వేదవిధ్యధ్యాయమున జెప్పబడిన స్వేదవిధులతో నాడీస్వేదమును ప్రస్తరస్వేదమును సంకరస్వేదమును చేయవలెను. (ఈపరిగణనముచేత గుల్మరోగికి ఈమూడుస్వేదములు దక్క తక్కిన స్నేహములజేయం జనదని యెరుంగునది.)

గుల్మహారములలో వస్తిప్రాశస్త్యము.

మూ. వస్తికర్మ పరం విద్యాత్ గుల్మఘ్నం తద్ధి మారుతం,
స్వే స్థానే ప్రథమం జిత్వా సద్యో గుల్మమపోహతి.　　100

వ్యా. గుల్మహారములగు చికిత్సలలో వస్తికర్మము చాల ప్రధానమైనది:—వస్తివిధానము వాతమును తొలుత స్వస్థానముననే జయించి వెంటనే గుల్మమును పోనడచును; కావున గుల్మమునకు వస్తికర్మ శ్రేష్ఠమైనది.

గుల్మహారవస్తులు.

మూ. తస్మాదభీక్ష్ణశో గుల్మాః నిరూహైస్సానువాసనైః,
ప్రయుజ్యమానైః శామ్యన్తి వాత-పిత్త-కఫాత్మకాః.　　101
గుల్మఘ్నాః వివిధాః దిష్టాః సిద్ధాః సిద్ధిషు వస్తయః,

వ్యా. పైజెప్పినవిధముగ గుల్మమునందు వస్తికర్మ చాల ప్రశస్తము కావున నిరూహ-అనువాసనవస్తులను విధ్యుక్తప్రకారము పలుమారు ప్రయోగించినచో వాత-పిత్త-కఫాత్మకములగు గుల్మము లన్నియు శమించును. అట్టి గుల్మహారములగు వస్తులు సిద్ధిస్థానమున దృష్టఫలము లైనవి యనేకములు నిర్దేశింపబడినవి.

గుల్మహారతైలములు.

మూ. గుల్మఘ్నాని చ తైలాని వక్ష్యన్తే వాతరోగికే.　　102
తాని మారుతజే గుల్మే పానాభ్యఙ్గాఽనువాసనైః,
ప్రయుక్తాన్యాశు సిధ్యన్తి తైలం హ్యనిలజిత్పరమ్.　　103
నీలినీచూర్ణసంయుక్తం పూర్వోక్తం ఘృతమేవ వా,
సమలాయ ప్రదాతవ్యం శోధనం వాతగుల్మినే.　　104

వ్యా. వాతవ్యాధిచికిత్సితమునందు గుల్మహారతైలములను అనేకము చెప్పబడును. అట్టి తైలములను వాతగుల్మమున క్రింద చెప్పబడు నీలిన్యాదిచూర్ణముతో జేర్చి యుపయోగించినచో తైలము వాతహారములలో నుత్తమమైనది కావున శీఘ్రముగ వాతగుల్మమును హరించును. లేక ముందు చెప్పబడిన త్ర్యూషణాదిఘృతములయందైనను

క్రింద చెప్పబడు నలిన్యాదిచూర్ణమును కలిపి వాతగుల్మమున శోధనమునకై యుప యోగింపనగును. అట్లు ప్రయోగించినచో వాతగుల్మము శీఘ్రముగ శమించును.

నీలిన్యాదిచూర్ణయుక్తఘృతము.

మూ. నీలినీత్రివృతాదన్తీపథ్యాకమ్పిల్లకైస్సహ,
శోధనార్థం ఘృతం దేయం సబిడక్షారనాగరమ్. 105

వ్యా. పెద్దనీలి, తెగడ, దంతి, కరకకాయలు, కంపిల్లకము, బిడాలవణము, యవ క్షారము, శుంఠి, వీనిని చూర్ణముచేసి నేతితో కలిపి ప్రబలమైనదోషము కలగుల్మమున శోధనమునకై యుపయోగింపవలెను.

నీలిన్యాదిఘృతము.

మూ. నీలినీం త్రిఫలాం రాస్నాం బలాం కటుకరోహిణీం,
పచేద్విడఙ్గం వ్యాఘ్రీంచ పలికాని జలాఢకే. 106
తేన పాదావశేషేణ ఘృతప్రస్థం విపాచయేత్,
దధ్నః ప్రస్థేన సంయోజ్య సుధాక్షీరపలేన చ. 107
తతో ఘృతపలం దద్యాత్ యవాగూమణ్డమిశ్రితం,
జీర్ణే సమ్యగ్విరిక్తం చ భోజయేద్రసభోజనం. 103
గుల్మకుష్ఠోదరవ్యఙ్గశోఫపాణ్డ్వామయజ్వరాన్,
శ్విత్రం ప్లీహానమున్మాదం ఘృతమేతద్వ్యపోహతి. 109
(ఇతి నీలిన్యాద్యం ఘృతమ్.)

వ్యా. పెద్దనీలి, త్రిఫలములు, సన్నరాష్ట్రము, చిట్టాముట్టి, కటుకరోహిణి, వాయువిడంగములు, వాకుడు, వీనిని ప్రత్యేక మొక్కొక పలమువంతున జేర్చి యొక ఆఢకప్రమాణ (అరువదినాల్గుపలముల) జలములో వైచి యెనిమిదవపాలు (పదునారు పలములు) మిగులునట్లు కషాయము కాచి, అందు ఆవునెయ్యి ఒకప్రస్థంబును (పదు నారుపలములు), ఆవుపెరుగు ఒకప్రస్థంబును, జెముడుపాలు ఒకపలంబును జేర్చి ఘృత పాకవిధిప్రకారము పక్వముచేసి యుంచునది. (ఇదియే నీలినీఘృతము) ఈఘృతము నొకపలపరిమితిని యవాగుపనుగంజి తేటనీటితో కలిపి త్రాగించునది. ఔషధము చక్కగ జీర్ణమై విరేచనములు సరళముగ నైనపిదప మాంసరసముతో గూడిన యాహారమును భుజింపనగును. దీనివలన గుల్మము, కుష్ఠము, ఉదరము, వ్యంగము (ముఖముపైని కల్గుమంగు), శోఫ (నంజు), పాండురోగము, జ్వరము, శ్విత్రము,

్రహము, ఉన్మాదము, ఈరోగముల నన్నిటిని యీఘృతము నిర్మూలము చేయనోపును. ఇచ్చట కషాయంబును పెరుగును వేరువేరుగ ఘృతమునకు సమానభాగము లగును.)

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—తైలమునైనను ఘృతమునైనను పక్వము కేయవలె నన్నచో కల్కంబును కషాయాదిద్రవంబును ఘృతతైలాదులలో చేర్చి పాకము కేయుట సంప్రదాయసిద్ధము; శాస్త్రసమ్మతంబును. అట్టియెడ కల్కద్రవతైలాదులకు శేషవిధిగ పరిమాణము చెప్పక యున్నచో నాస్థలములయందెల్ల స్నేహద్రవ్యమునకు నాల్గవవంతు కల్కంబును, నాలుగింతలు ద్రవమును చేర్చి పక్వముచేయవలెనని పరిభాషలు నియమించుచున్నవి. అట్టి తైలాదులపాకము మృదు-మధ్య-ఖరభేదములచే మూడువిధముల నుండుననియు, అట్టి పాకభేదము స్నేహమున జేర్పబడు కల్కము యొక్క పరిస్థితినిబట్టి తెలియందగుననియు "స్నేహపాకో భవేత్కల్కే మృదురఙ్గుళిలేపితే, న గృహ్ణాత్యఙ్గుళిం మధ్యః, శీర్యమాణే ఖరస్స్మృతః" ఇత్యాదిపరిభాషావచనములచే జెప్పబడినది. అట్టి త్రివిధపాకములకును వేరువేరుగ నుపయోగంబును జూపబడినది. కల్కమును జేర్పనిచో పైజెప్పిన త్రివిధపాకభేదములను గుర్తింప వలనుపడదు; కావున నెచ్చట స్నేహపాకవిధియందు స్నేహ-కషాయముల రెంటిని మాత్రము నిర్దేశించి కల్కమును జెప్పకున్నచో నచ్చట కషాయమునకు జెప్పిన ద్రవ్యములసముదాయమునే కల్కముగజేసి స్నేహమునకు నాల్గవవంతు జేర్చుకొనవలెను. ఈవిషయము "క్వాథేన కేవలేనైవ పాకో యత్రేరితః క్వచిత్, క్వాథ్య ద్రవ్యస్య కల్కోఽపి తత్ర స్నేహే ప్రయుజ్యతే." అను పరిభాషచే విధింపబడినది. కల్కము వాచనికముగ లేనిస్థలములయందెల్ల నీపద్ధతినే యవలంబించుట వృద్ధవైద్యసమ్మతముగను కన్పట్టుచున్నది.

పైజెప్పబడిన నీలిన్యాదిఘృతయోగమున నీలిని మున్నగు క్వాథ్యద్రవ్యముల మాత్రము నిర్దేశించి, వానిచే సిద్ధమైన క్వాథమును పెరుగును కూడ ద్రవముగ జూపి, కల్కద్రవ్యముల వేరుగ జెప్పకయే యోగము పూర్తిగావింపబడినది; కావున పైజెప్పబడిన పరిభాషను వృద్ధసంప్రదాయమును అనుసరించి క్వాథ్యద్రవ్యములైన నీలిన్యాది ద్రవ్యములనే కల్కముజేసి ప్రస్థపరిమితమైన ఘృతమునకు నాల్గవపాలు (నాల్గుపలములు) కలిపి పక్వముచేయుట సమంజసము.

ఇట్లుండ చక్రపాణిదత్త వ్యాఖ్యానమున పైపద్ధతిని నిరసించి ఘృతాదిసాధనశక్తి విచిత్రముగ నుండును కావున తంత్రకారులు చెప్పినదానికన్న న్యూనాతిరేకముగ గల్పించుట సయుక్తికము కాదనియు, కల్కహీనముగ నున్నను పాకజ్ఞానమును గమనింప వలనుపడవచ్చుననియు చెప్పుచు తంత్రకారులు చెప్పినప్రకారమే కల్కరహితముగ కేవలద్రవములచేతనే యిచ్చట ఘృతపాకము చేయవలెననియు సిద్ధాంతము చేసి

కంఠోక్తిగ చెప్పియున్నారు. ఈవిషయమున సర్వాంగసుందరమను అష్టాంగహృదయ వ్యాఖ్యానమున నేమియు వ్రాసియుండలేదు. విజ్ఞులు దీనిని చక్కగ గమనించెదరు గాక!

వాతగుల్మమున అన్నపానాదివిధి.

మూ. కుక్కుటాశ్చ మయూరాశ్చ తిత్తిరి-క్రౌఞ్చ-వర్తకాః,
శాలయో మదిరా సర్పిః వాతగుల్మభిషగ్జితమ్. 110
హితముష్ణం ద్రవం స్నిగ్ధం భోజనం వాతగుల్మినాం,
సమణ్డవారుణీపానం పక్వం వా ధాన్యకైర్జలమ్. 111
మన్దేఽగ్నౌ వర్ధతే గుల్మః దీప్తే చాగ్నౌ ప్రశామ్యతి,
తస్మాన్నాతిసౌహిత్యం కుర్యాన్నాతివిలఙ్ఘనమ్. 112
సర్వత్ర గుల్మే ప్రథమం స్నేహస్వేదోపపాదితే,
యా క్రియా క్రియతే సిద్ధిం సా యాతి న విరూక్షితే. 113

వ్యా. కోడి, నెమలి, తీతుకపిట్ట, క్రౌఞ్చపక్షి (కొంగజాతిలో చేరిన పక్షి), వర్తకపక్షి (మీనవల్లంకియనుపిట్ట), ఈజంతువులమాంసంబును, రాజనములబియ్యంబును, మదిరయనుమద్యంబును, నెయ్యియు, ఇవి వాతగుల్మరోగికి ఆహారాదుల కుపయోగించుట చాల మంచిది. మరియు ఉష్ణంబును స్నిగ్ధంబును ద్రవంబునైనయాహారమును భుజించుట వాతగుల్మరోగికి చాల హితముగ నుండును. మరియు తేటనైన వారుణీమద్యంబును, దనియాలను చేర్చి కాచబడిన నీళ్లను త్రాగుట చాల మంచిది.

మరియు అగ్ని మందగించి యున్నపుడు గుల్మము వృద్ధినొందును. జాఠరాగ్ని జ్వలించుచున్నపుడు శమించును. కావున గుల్మరోగము కలమనుజుడు మిక్కిలి తృప్తిగ (మిక్కుటముగ)ను భుజింప జనదు. పూర్తిగ లంకణముచేయుటయు యుక్తము కాదు. మరియు గుల్మము లన్నిటియందును తొలుత స్నేహ స్వేదవిధుల నాచరించి దోషములను మృదువుగ జేసికొని పిమ్మట చేయబడిన చికిత్స శీఘ్రముగ ఫలవంతమగును. అటుగాక శరీరము రూక్షముగ నున్నచో నప్పుడు చేయబడిన చికిత్స ఫలవంతము కానోపదు. (మరియు "నాభోజనేన కాయాగ్నిః దీప్యతే నాతిభోజనాత్." (చి. అ. ౧౫) అని చెప్పినప్రకారము అభోజన-అతిభోజనములచేత కాయాగ్నికి భంగము కల్గును కావున గుల్మమునందు ఈరెంటిని వదలి మితాశనము చేసినచో కాయాగ్ని దీపించి సులభసాధ్యమగునని యెరుంగునది.)

### పిత్తగుల్మచికిత్స, అందు వైరేచనికఘృతము.

మూ. భిషగాత్యయికం బుధ్వా పిత్తగుల్మముపాచరేత్,
వైరేచనికసిద్ధేన సర్పిషా తిక్తకేన వా (సర్పిషా పయసాపి వా.) 114

వ్యా. (ఇంతదనుక వాతగుల్మచికిత్స పూర్తిగ చెప్పబడినది. ఇక పిత్తగుల్మమునకు చికిత్స యీక్రింద వివరింపబడును.) పిత్తగుల్మమునందు వైద్యుడు వ్యాధిబలమును చక్కగ గమనించి విరేచనగణమున జెప్పబడిన ద్రవ్యములలో యథాభాగముగ ద్రవ్యముల జేర్చి ఘృతపాకవిధిప్రకారము సిద్ధముచేయబడిన ఘృతముచే నైనను, తిక్తకఘృతముచే నైనను రోగికి చికిత్స చేయవలెను.

### రోహిణ్యాదిఘృతము.

మూ. రోహిణీ కటుకా నిమ్బ మధుక త్రిఫలాత్వచః,
కర్షాంశాః త్రాయమాణా చ, పటోలత్రివృతోః పలే. 115
ద్వే పలే చ మసూరాణాం, సాధ్యమష్టగుణేఽమ్భసి,
శృతాచ్ఛేషం ఘృతసమం, సర్పిషశ్చ చతుష్పలమ్. 116
పిబేత్సంమూర్ఛితం తేన గుల్మశ్శామ్యతి పైత్తికః,
జ్వరస్తృష్ణా చ శూలం చ భ్రమో మూర్ఛాఽరుచిస్తథా. 117
(ఇతి రోహిణ్యాద్యం ఘృతమ్).

వ్యా. కటుకరోహిణి, వేపపట్ట, అతిమధురము, త్రిఫలముల (కరక - తాని-ఉసిరికకాయల) బెరడు, కానుగపట్ట, ఇవి ప్రత్యేక మొక్కొకకర్షము (కాలుపలము), చేదుపొట్ల ఒకపలము, తెగడ ఒకపలము, చిరుసెనగలు రెండుపలములు, ఈద్రవ్యముల నన్నిటిని చేర్చి, ఘృతమునకు ఎనిమిదింతలు (ముప్పదిరెండుపలములు) నీళ్లు పోసి, ఎనిమిదవపాలు (నాల్గుపలములు) మిగులునట్లు కషాయము కాచి, వడగట్టి యుంచుకొని, ఆకషాయమునకు సమభాగముగ నాల్గుపలములు ఆవునెయ్యి చేర్చి కషాయమున బాగుగ కలియునట్లు చేసి యాకషాయసహితమైన ఘృతమును(రెండును చేరి యెనిమిదిపలముల పరిమితమును) త్రాగినచో పిత్తగుల్మము శమించును. మరియు (నుపద్రవరూపములైన) జ్వరంబును, దప్పియు, శూలంబును, భ్రమంబును, మూర్ఛయు, అరుచియు శమించును.

ఇచ్చట గుల్మరోగమునందు ఈయోగమున కషాయము నాల్గుపలములు అందుకు సమానముగ నాల్గుపలములు ఘృతంబును చేరి యెనిమిదిపలములు ఔషధమాత్ర

యగును. ఈవిషయము—"గుల్మినః సర్పదష్టాశ్చ విసర్పోపహతాశ్చ యే, తేషాం మాత్రా పలాన్యష్టౌ వినిర్దిష్టా విశేషతః." అని వేరొకచోట చెప్పబడినది. (తక్కిన వ్యాధులకన్న నీచెప్పబడిన గుల్మాదివ్యాధులయందు ఉత్తమమాత్ర యెనిమిదిపలములని విశేషవిధిగ చెప్పబడినది.)

### త్రాయమాణాది ఘృతము.

మూ. జలే దశగుణే సాధ్యం త్రాయమాణాచతుష్పలం,
పఞ్చభాగస్థితం పూతం కల్కైస్సంయోజ్య కార్షికైః 118
రోహిణీ కటుకా ముస్తా త్రాయమాణా దురాలభా,
కల్కైస్తామలకీవీరాజీవన్తీచన్దనోత్పలైః. 119
రసస్యామలకానాం చ క్షీరస్య చ ఘృతస్య చ,
పలాని పృథగష్టాష్టౌ దత్వా సమ్యగ్విపాచయేత్. 120
పిత్తరక్తభవం గుల్మం వీసర్పం పైత్తికం జ్వరం,
హృద్రోగం కామలాం కుష్ఠం హన్యాదేతత్ ఘృతోత్తమమ్.
(ఇతి త్రాయమాణాద్యం ఘృతమ్.)

వ్యా. నాల్గుపలములు కానుగవ్రేళ్లను పదింతల (నలుబదిపలముల) నీళ్లలో వేసి ఐదవపాలు (ఎనిమిదిపలములు) మిగులునట్లు కషాయము కాచి వడగట్టి యుంచుకొనునది; పిదప కటుకరోహిణి, తుంగగడ్డలు, కానుగవేరు, దూలగొండి, నేలఉసిరిక, కాకోళి, మనుబాల, చందనము, నల్లకలువలు, వీనిని ప్రత్యేకము ఒక్కొక కర్ష (కాలుపలము) పరిమాణమువంతున జేర్చి (పైజెప్పిన కషాయముతో నూరి) కల్కము చేసి అందు, ఉసిరిక కాయలరసము, పాలు, ఆవునెయ్యి వీని నొక్కొకటి యెనిమిదేసి పలములవంతున జేర్చి ఘృతపాకవిధిప్రకారము చక్కగ పక్వము చేసిన నియ్యది త్రాయమాణాదిఘృత మనబర గును. ఈఘృతమును (అగ్నిబలానుసారముగ యుక్తియుక్తముగ) సేవించినచో పిత్త-రక్తములచే కల్గిన గుల్మమును, విసర్పమును, పిత్తజ్వరమును, హృద్రోగమును, కామలా రోగమును, కుష్ఠమును, ఇవియన్నియు పూర్తిగ హరించును.

ఇచ్చట ఆవునెయ్యి యెనిమిదిపలములు, నాల్గుపలములు కానుగవేరును పదింతలు నీళ్లలో ఐదవపాలు మిగుల కాచబడిన కషాయము ఎనిమిదిపలములు, ఉసిరికకాయల రసము ఎనిమిదిపలములు, ఆవుపాలు ఎనిమిదిపలములును చేర్చి, అందు కటుకరోహిణి మున్నగు తొమ్మిదిద్రవ్యములును ఒక్కొక కర్షమువంతున కల్కము చేసి కలిపి ఘృత

పాకవిధిగ పక్వముచేయవలెను. (ద్రవములు మూడును ఘృతమునకు సమానభాగము లగును. కల్కద్రవ్యములు తొమ్మిదియు చేరి ఘృతమునకు నాల్గవవంతుకంటె కొంచె మధికమగును. వాగ్భటాచార్యులు—"కుడవం త్రాయమాణాయాః సాధ్యమష్టగుణేఽమ్భసి, కుడవం తద్రసాత్" అని యీయోగమున క్వాథసాధనమున నష్టగుణజలమును, పాదావశేషమును చెప్పియున్నారు.

## ఆమలక్యాదిఘృతము.

మూ. రసేనాఽఽమలకేక్షూణాం ఘృతపాదం (ప్రస్థం) విపాచయేత్,
పథ్యాపాదం పిబేత్సర్పిః తత్సిద్ధం పిత్తగుల్మనుత్. 122
(ఇత్యామలక్యాద్యం ఘృతమ్.)

వ్యా. ఉసిరికకాయలరసము, చెరకురసము, ఈరెంటికిని నాల్గవవంతు ఆవునెయ్యిని చేర్చి, అందు కరకకాయలబెరడును ఘృతమునకు నాల్గవవంతు నూరి కల్కముచేసి కలిపి, ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసి త్రాగినచో, పిత్తగుల్మమును హరించును. (ఇది ఆమలక్యాదిఘృతము.)

ఇచ్చట కరకకాయలు గురుపదార్థ మగుటచే పాదశబ్దమునకు ఎనిమిదవవంతు అని యర్థముచేసి ఘృతమునకు ఎనిమిదవవంతు కల్కముగ కరకకాయలను జేర్పనగునని కొందరిమతము.

## ద్రాక్షాదిఘృతము.

మూ. ద్రాక్షాం మధూకం ఖర్జూరం విదారీం సశతావరీం,
పరూషకాణి త్రిఫలాం సాధయేత్పలసమ్మితమ్. 123
జలాఢకే పాదశేషే రసమామలకస్య చ,
ఘృతమిక్షురసం క్షీరం అభయాకల్కపాదికమ్. 124
సాధయేత్తద్ఘృతం సిద్ధం శర్కరాక్షౌద్రపాదికం,
ప్రయోగాత్పిత్తగుల్మఘ్నం సర్వపిత్తవికారనుత్. 125
(ఇతి ద్రాక్షాద్యం ఘృతమ్.)

వ్యా. ద్రాక్షపండు, అతిమధురము, ఖర్జూరపుకాయలు, నేలగుమ్మడి, పిలిపీచర గడ్డలు, చిట్టీత, త్రిఫలములు, వీనిని ప్రత్యేక మొక్కొకపలమువంతున నొక ఆఢక (అరువదినాల్గుపరిమిత) జలమున చేర్చి నాల్గవవంతు (పదునారు పలములు) మిగులునట్లు కషాయము సిద్ధముచేసి వడకట్టి యుంచుకొని ఉసిరికకాయల రసమును ఆవునేతిని, చెరకు

రసమును, ఆవుపాలను పైకషాయమునకు ప్రత్యేకము సమభాగములుగ నుండునట్లు కలిపి, ఘృతమునకు నాల్గవపాలు (నాల్గుపలములు) కరకకాయలబెరడు కల్కమును జేర్చి, ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసి, సిద్ధమైన యాఘృతమునకు చక్కెరయు తేనెయు కలిసి నాల్గవవంతుండునట్లు కలిపి సేవించినచో, పిత్తగుల్మమును నానావిధములగు పిత్త రోగములను హరించును. (ఈయోగమున ద్రాక్షాదిద్రవ్యముల జేర్చి పాదశేషముగ కాచబడిన క్వాథము ఆఢకమున నాల్గవవంతు ఒకప్రస్థపరిమిత మగును. తక్కిన ఆమలక రసము ఆవుపాలును ఆవునెయ్యియు నొక్కొకటి పైజెప్పిన కషాయమునకు సమభాగము లుగ నొక్కొక ప్రస్థపరిమితముగ నుండవలెను. కరకకాయలకల్కము సామాన్యపరిభాషా ప్రకారము ఘృతమునకు నాల్గవవంతు (నాల్గుపలములు) ఉండవలెను. ఇట్లు కూర్చి సిద్ధముచేయబడిన ఘృతమున తేనెయు చక్కెరయు కలిసి ఘృతమునకు నాల్గవవంతు (నాల్గుపలములు) యుండునట్లు చేర్చి యుపయోగింపనగును. "ఘృతమిక్షురసం క్షీర" మనుచోట "క్షౌద్రమ్" అను లేనిపాఠము నాశ్రయించి ఘృతమునకు సమభాగముగ తేనె కలిపి పక్వముచేయవలెనని కొందరు నవీనులు వ్యాఖ్య చేసియున్నారు. ఇది వాగ్భ టాదివిరుద్ధపాఠము కావున సమంజసము కానోపదు.)

## వాశాదిఘృతము.

మూ. వృషం సమూలమాపోథ్య పచేదష్టగుణే జలే,
శేషేఽష్టభాగే తస్యైవ పుష్పకల్కం ప్రదాపయేత్. 126
తేన సిద్ధం ఘృతం శీతం సక్షౌద్రం పిత్తగుల్మనుత్,
రక్తపిత్తజ్వరశ్వాసకాసహృద్రోగనాశనమ్. 127

(ఇతి వాసాఘృతమ్.)

వ్యా. అడ్డసరమును సమూలముగ గ్రహించి నలియగొట్టి దాని కెనిమిదివంతులు నీళ్లు పోసి యెనిమిదవవంతు మిగుల కషాయము కాచి, యాకషాయమునకు నాల్గవవంతు ఆవునెయ్యి, నేతికి ఎనిమిదవవంతు అడ్డసరపు పువ్వుల కల్కమును జేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి అయ్యది చల్లారిన పిదప ఘృతమునకు నాల్గవవంతు తేనె కలిపి యుపయోగిం చినయెడ పిత్తగుల్మంబును, రక్తపిత్తంబును, జ్వరంబును, శ్వాసకాసములును, హృద్రోగం బును హరించును.

ఇచ్చట క్వాథ్యద్రవ్యమగు నడ్డసరమును సమూలముగ నలగ ద్రొక్కి యెనిమిది వంతుల నీళ్లలో క్వాథము చేసి యెనిమిదవపాలు మిగుల క్వాథము సిద్ధముచేయునది. "స్నేహాత్తోయం చతుర్గుణమ్" అను సామాన్యపరిభాషచేత కషాయమునకు నాల్గవవంతు

ఆవునేతిని చేర్చవలెను. "స్నేహే స్నేహాష్టమాంశశ్చ పుష్పకల్కః ప్రయుజ్యతే." అను విశేష పరిభాషచేత ఘృతమున కెనిమిదవవంతు అడ్డసరపు పువ్వులకల్కము చేర్చి పాకము చేయవలెను.

మరియు రక్తపిత్తచికిత్సయందును "వాసాం సశాఖాం సపలాశమూలాం...... నిహన్తి రక్తమ్" (చి. అ. ౪. శ్లో. ౮౮.) అను శ్లోకముచే నీయోగమే చెప్పబడినది. అయినను అచ్చట క్వాథజలపరిమాణమును చెప్పలేదు కావున "నిక్షిప్య క్వాథయే త్తోయం క్వాథ్య ద్రవ్యాచ్చతుర్గుణమ్, పాదశిష్టం గృహీత్వాతు స్నేహస్తేనైవ సాధయేత్." అను సామాన్యపరిభాషచేత క్వాథ్యద్రవ్యమునకన్న నాల్గువంతులజలమును చేర్చి, చతుర్థభాగశిష్టముగ క్వాథముచేసి ఘృతమును పక్వముచేయవలెను. ఇచ్చట "పచేదష్టగుణే జలే" అని విశేషనిర్దేశముచేత అష్టగుణ జలమున క్వాథము సిద్ధముచేయవలెను. కావున నీభేదమునకై యిచ్చట నీయోగము మరల చెప్పబడినదని యెరుంగునది. మరియు రక్తపిత్తచికిత్సయందలి వాశాఘృతయోగవ్యాఖ్యానమున చక్రపాణి "ప్రస్థే ఘృతే చతుష్పలం పుష్పకల్కం వదన్తి." అని వ్రాసి వదలియున్నారు. ప్రాజ్ఞులు విమర్శించెదరుగాక.

## పిత్తగుల్మమున త్రాయమాణాక్షీరపానము.

మూ. ద్విపలం త్రాయమాణాయాః జలద్విప్రస్థసాధితమ్,
అష్టభాగస్థితం పూతం కోష్ణం క్షీరసమం పిబేత్. 128
పిబేదుపరి తస్యోష్ణం క్షీరమేవ యథాబలం,
తేన నిర్హృతదోషస్య గుల్మశ్శామ్యతి పైత్తికః. 129

వ్యా. రెండుప్రస్థములు కలుక్రానుగును రెండుప్రస్థముల (ముప్పదిరెండుపలముల) నీళ్లతో చేర్చి యెనిమిదవవంతు (నాల్గుపలములు) మిగుల కాచి వడకట్టి సుఖోష్ణముగనుండు నాకషాయమునకు సమభాగము ఆవుపాలను చేర్చి శరీరకోష్ఠబలానుసారముగ నధికముగ విరేచనములు కాకుండునట్లు త్రాగి, వెంటనే ఆవుపాలను మాత్రము మరల త్రాగినచో దోషములు బైటవెడలి పిత్తగుల్మము శమించును.

## పిత్తగుల్మమున విరేచనమునకు ద్రాక్షాభయరసపానము.

మూ. ద్రాక్షాభయారసం గుల్మే పైత్తికే సగుడం పిబేత్,
లిహ్యాత్కమ్పిల్లకం వాపి విరేకార్థం మధుద్రవమ్. 130

వ్యా. పిత్తగుల్మమునందు ద్రాక్షపండ్లను కరకకాయలబెరడును సమభాగములుగ చేర్చి కషాయము కాచి అందు మితముగ బెల్లమును జేర్చి విరేచనమునకై త్రాగునది.

లేక కంపిల్లకమును తేనెతో ద్రవముచేసి లేహమువలె నుపయోగించినను పిత్తగుల్మము హరించును.

పిత్తగుల్మమున తాపహర-అభ్యంగము.

మూ. దాహప్రశమనోఽభ్యఙ్గః సర్పిషా పిత్తగుల్మనుత్,
చన్దనాద్యేన తైలేన తైలేన మధుకస్య వా. 131

వ్యా. నేతితో నభ్యంగనము చేసికొనినయెడ పిత్తగుల్మమున కల్గిన తాపము శమించును. లేక చందనాది తైలముచేనైనను, అతిమధురమును చేర్చి కాచబడిన తైలముచేనైన నభ్యంగనము చేసినను తాపము శమించును.

పిత్తగుల్మహరవస్తులు.

మూ. యే చ పిత్తజ్వరహరాః (పిత్తజ్వరార్తానాం) సతిక్తాః క్షీరవస్తయః,
హితాస్తే పిత్తగుల్మిభ్యః వక్ష్యన్తే యే చ సిద్ధిషు. 132

వ్యా. పిత్తజ్వరహరములును తిక్తద్రవ్యముల జేర్చి సిద్ధముచేయబడినవియునగు క్షీరవస్తులును, సిద్ధిస్థానమున జెప్పబడిన పిత్తహరములుగ జెప్పబడిన వస్తులును పిత్తగుల్మరోగుల కుపయోగించుట చాల హితకరము.

పిత్తగుల్మమునం దన్న-పానములు.

మూ. శాలయో జాఙ్గలం మాంసం గవ్యాజే పయసీ ఘృతం,
ఖర్జూరామలకం ద్రాక్షాం దాడిమం సపరూషకమ్. 133
ఆహారార్థం ప్రయోక్తవ్యం; పానార్థం సలిలం శృతం,
బలావిదారిగన్ధాద్యైః పిత్తగుల్మచికిత్సితమ్. 134

వ్యా. రాజనములబియ్యము, జాంగలజంతువులమాంసము, ఆవుపాలు, మేకపాలు, ఆవునెయ్యి, మేకనెయ్యి, ఖర్జూరపుపండు, ఉసిరికకాయలు, ద్రాక్షపండు, దానిమ్మపండ్లు, ఈతపండ్లు, వీనిని పిత్తగుల్మరోగికి ఆహారమునకై యుపయోగింపవలెను. బలాదిగణమునందును విదారిగంధాదిగణమునందును చెప్పబడిన ద్రవ్యములను (యథోచితముగ) జేర్చి కాచబడిన నీళ్లను త్రాగుటకై యుపయోగింపవలెను. ఈయన్నపానములు పిత్తగుల్మమునకు చికిత్సితముగ నుండును.

పిత్తగుల్మమున యవాగూపయోగము.

మూ. ఆమాన్వయే పిత్తగుల్మే సామే వా కఫవాతికే,
యవాగూభిః ఖడైర్యూషైః సంధుక్ష్యోఽగ్నిః విలఙ్ఘితే. 135

వ్యా. ఆమముతో గూడిన పిత్తగుల్మమునందును, కఫవాతములచే కల్గిన గుల్మములయందును తొలుత లంకణము వేసి పిదప యవాగువులను ఖడయూషములను ఆహారముగ జేసి జఠరాగ్ని దీపించునట్లు చేయవలెను.

(ఇచ్చట "యవాగూర్బహుసిక్థా స్యాత్" అని యుపక్రమించి చెప్పబడిన మండ-పేయ-విలేపీభేదములచే మూడు తెరంగులగు యవాగూభేదములను విధ్యుక్తప్రకారము అగ్నిదీప్తికై యుపయోగింపవలెను. మరియు ఖడయూషవిధానము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"తక్రః కపిత్థచాఙ్గేరీ మరిచాఽజాజిచిత్రకైః, సుపక్వం ఖడయూషోఽయః... యోగే దీపనపాచనే" మజ్జిగలో వెలగపండును పులిచింతాకును మిరియములను జీలకరను చిత్రమూలమును చేర్చి కాచిన నయ్యది ఖడయూషము. ఇది అగ్నిని దీపింపజేసి యాహారమును జీర్ణముచేయును.) పైజెప్పిన ఆమయుక్తపిత్తగుల్మాదులయందు లంకణమువేసినతోడనే ఘనమైన యాహారమును చేసినచో జఠరాగ్ని బొత్తుగ నశించును. కావున పైజెప్పబడిన యవాగూ-ఖడయూషముల నుపయోగించినచో స్వల్పముగనుండు జాఠరాగ్ని దీపించి యాకలి పుట్టునని యెరుంగునది.

జాఠరాగ్నిరక్షణావశ్యకత.

మూ. శమప్రకోపౌ దోషాణాం సర్వేషామగ్నిసంశ్రితౌ,
తస్మాదగ్నిం సదా రక్షేత్ నిదానాని చ వర్జయేత్.　　136

వ్యా. వాతాదిదోషములయొక్క శమంబును ప్రకోపంబును జాఠరాగ్ని నాశ్రయించి యుండును; కావున జాఠరాగ్నిని వ్యత్యస్తముగ జేయునిదానముల వర్జించి యగ్నిని సర్వకాలంబును మిక్కిలి శ్రద్ధతో న్యూనాతిరేకము కానీయక సమస్థితి నుండునట్లు కాపాడవలెను. ("భిషగాత్యయికం బుద్ధ్వా పిత్తగుల్మ ముపాచరేత్." అని యుపక్రమించి యింతదనుక పిత్తగుల్మచికిత్స పూర్తిగ చెప్పబడినది).

కఫగుల్మమున వమనవిధి.

మూ. వమనం వమనార్హాయ ప్రదద్యాత్ కఫగుల్మినే,

వ్యా. "మన్దోఽగ్నిః వేదనా మన్దా...సగుల్మీ వమనోపగః" (శ్లో. ౪. ౯) అని కఫగుల్మచికిత్సాక్రమమున నిర్దేశింపబడిన ప్రకారము వమనమున కర్హుడగు కఫగుల్మరోగికి స్నేహస్వేదములచే కోష్ఠము మృదువైనపిదప విధ్యుక్తప్రకారము వమనము చేయించవలెను.

పక్వగుల్మమున శస్త్రవిధి.

మూ. స్నిగ్ధస్విన్నశరీరాయ గుల్మే శైథిల్యమాగతే.　　137

పరివేష్ట్య ప్రదీప్తాం'స్తు బల్బజానథవా కుశాన్,
భిషక్కుమ్భే సమావాప్య గుల్మం ఘటముఖే న్యసేత్. 138
సంగృహీతో యదా గుల్మః తదా ఘటమథోద్ధరేత్,
వస్త్రాన్తరం తతః కృత్వా భిన్ద్యా(చ్ఛిన్ద్యా) ద్గుల్మం ప్రమాణవిత్.
విమార్గాఽజపదాఽఽదర్శైః, యథాలాభం ప్రపీడయేత్,
మృద్నీయాద్గుల్మమేవైకం న త్వన్త్ర(నత్వత్ర)హృదయం స్పృశేత్.

వ్యా. స్నేహస్వేదవిధులచే స్నిగ్ధంబును స్విన్నంబు నైనశరీరము కల్గినరోగికి గుల్మము స్వస్థానమునుండి పట్టు వదలి సడలి పక్వమై యున్నపుడు శస్త్రచికిత్సాకుశలుడగు వైద్యవరుడు బోదకసవునైనను దర్భలనైనను చుట్టచుట్టి కాల్చి మండుసమయమున నొక(సన్నమూతికల) కుండలో (ఘటీయంత్రమున) నుంచి (అదుత్త కొంచెము వేడిగ నావిరిగాలి వెడలుచు నున్నపుడు కుండమూతిని గుల్మపుగడ్డపై బోరగిల నుంచునది. అట్టియెడ నాయావిరిగాలిచే నాకుండ గుల్మస్థానమున నంటికొని గుల్మమును లోపలికాకర్షించును. దాని గుర్తించి వెంటనే యాకుండను పైకెత్తి గుల్మము నొక సన్నసిగుడ్డతో చుట్టి పట్టుకొని శస్త్రవిధానజ్ఞుడగు వైద్యుడు విమార్గము, అజపదము, ఆదర్శము, అను మూడుశస్త్రములలో దేనితోనైన గుల్మమును చ్ఛేదించవలెను. అట్టి సమయమున గుల్మమును చేతబట్టి మర్దనము చేయవలెను. అట్టియెడ అంత్రముల(ప్రేవుల)కును హృదయమునకును తాకకుండునట్లు దోషమంతయు వెడలునట్లు గుల్మమును మాత్రము మర్దన చేయుచు మిక్కిలి మెలకువతో శస్త్రమును ప్రయోగింపనగును.

ఇచ్చట కుంభమన ఘటీయంత్రమని యర్థము. ఘటీయంత్రలక్షణమును వాగ్భటాచార్యు లిట్లు చెప్పిరి:—"స్యాద్ద్వాదశాఙ్గులోఽలాబుః నాహే త్వష్టాదశాఙ్గులః, చతుస్త్ర్యఙ్గులవృత్తాస్యః దీప్తోఽన్తశ్లేష్మరక్తనుత్. తద్వద్ఘటీ హితా గుల్మ విలయోన్నమనే చ సా." అలాబు యంత్రమునుబోలె పండ్రెండంగుళములనిడుపును పదునెనిమిది యంగుళముల వెడలుపును కల్గి, నాల్గు-లేక మూడంగుళములు గుండ్రముగ నుండు ముఖద్వారము కలకుండ ఘటీయంత్రమని యర్థము. ఈయంత్రమున తృణాదుల నునిచి మంటచేసి యది చల్లారినపిదప గుల్మముపై బోరగిలనుంచినచో గుల్మమును లోపలికి ఆవిరిచే గుల్మమును ఆకర్షించును. వెంటనే ఆయంత్రమును పైకెత్తినచో కుండలోనాకర్షింపబడిన గుల్మము పైకుబికి యుండును. అప్పుడు గుల్మమును గుడ్డతో పట్టుకొని విమార్గము (కొయ్యతో కత్తివలెచేయబడిన సాధనవిశేషము) చేనైనను, అజపదము (మేకగిట్టవంటివాదరకల శస్త్రవిశేషము)చేనైనను, ఆదర్శము అద్దపుపెంకుచే నైనను గుల్మమును

ప్రేవులకును హృదయమునకును గాయము తగలకుండ మెల్లగ ఛేదించి పిసికి దోషమును వెలిబుచ్చవలెను.

ఈశస్త్రకర్మ "రక్తపిత్తాతివృద్ధత్వాత్......శస్త్రం తత్ర భిషగ్జితమ్." (శ్లో-3౯)అని చెప్పినప్రకారము గుల్మము పక్వమైనపుడు చేయదగును. మరియు "విదాహలక్షణేగుల్మే...సమ్యక్పక్వం గుల్మమాదిశేత్" అని చెప్పినప్రకారము గుల్మము పక్వావస్థను చక్కగ గమనించి శస్త్రవిధి నుపక్రమింపవలెనని యెరుంగునది.

కఫగుల్మమున తిలాది లేపస్వేదము.

మూ. తిలైరణ్డాతసీబీజసర్షపైః పరిలిప్య చ,
శ్లేష్మగుల్మమయః పాత్రైః సుఖోష్ణైః స్వేదయేద్భిషక్. 341

వ్యా. నువ్వులు, చిట్టాముదపుగింజలు, అగసివిత్తులు,ఆవాలు, ఈనాల్గిటిని మెత్తగనూరి గుల్మముపై పట్టువేసి యొకపాత్రను నిప్పున కాచి అయ్యది సుఖోష్ణముగ నున్నపుడు ఆపాత్రచే కాపడముబెట్టి గుల్మమునకు చెమట బుట్టింపవలెను.

కఫగుల్మహర దశమూలీఘృతము.

మూ. సవ్యోషక్షారలవణం దశమూలీశృతం ఘృతం,
కఫగుల్మం జయత్యాశు సహిఙ్గుబిడదాడిమమ్. 342

(ఇతి దశమూలీఘృతమ్.)

వ్యా. దశమూలములను (మారేడు, కూరనెల్లి, దుండిగము, పెగ్గుమ్మడు, కలిగొట్టు, చిట్టాముట్టి, తెల్లగలిజేరు, ఆముదపువేరు, పిల్లిపీచర, అడవిపెసర) సమభాగములుగ గ్రహించి నాల్గింతలు నీళ్లు బోసి నాల్గవపాలు మిగుల కషాయముకాచి అందుకు నాల్గవపాలు ఆవునెయ్యిని చేర్చి; త్రికటుకములు, యవక్షారము, సైంధవలవణము, ఇంగువ, బిడాలవణము, దానిమ్మ, వీనిని సమభాగముల జేర్చి కల్కముచేసి యాకల్కమును ఘృతమునకు నాల్గవవంతు చేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి యాఘృతమును సేవించినచో కఫగుల్మము శీఘ్రముగ నశించును. (ఇచ్చట పరిమాణము చెప్పలేదు కావున సామాన్యపరిభాషానుసారము కల్పనము చెప్పబడినది.)

భల్లాతకఘృతము.

మూ. భల్లాతకానాం ద్విపలం పఞ్చమూలం పలోన్మితం,
సాధ్యం విదారిగన్ధాద్యం, ఆపోథ్య సలిలాఢకే. 143

పాదశేషే రసే తస్మిన్ పిప్పలీం నాగరం వచామ్,
విడఙ్గం సైన్ధవం హిఙ్గు యావశూకం బిడం శటీమ్. 144
చిత్రకం మధుకం రాస్నాం పిష్ట్వా కర్షసమం భిషక్,
ప్రస్థం చ పయసో దత్వా ఘృతప్రస్థం విపాచయేత్. 145
ఏతద్భల్లాతకఘృతం కఫగుల్మహరం పరం,
ప్లీహపాణ్డ్వామయశ్వాసగ్రహణీరోగకాసనుత్. 146
(ఇతి భల్లాతకాద్యం ఘృతమ్.)

వ్యా. శుద్ధిచేయబడిన జీడిగింజలు రెండుపలములు, హ్రస్వపంచమూలములు ఐదునొక్కొకపలము, (ముయ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరు, ఈయైదును విదారిగంధాది(హ్రస్వ)పంచమూలములు) వీని నన్నిటిని నలియగొట్టి అధక పరిమిత(అరువదినాల్గుపలముల)జలమున జేర్చి నాల్గవపాలు మిగుల కషాయము కాచి వడగట్టి, వాయువిడంగములు, సైంధవలవణము, ఇంగువ, యవక్షారము, బిడాలవణము, కచోరములు, చిత్రమూలము, అతిమధురము, సన్నరాష్ట్రము, వీనిని ఒక్కొక కర్షము (కాలుపలము)వంతున చేర్చి కల్కముగ నూరి కలిపి ఒకప్రస్థము ఆవుపాలును, ఒకప్రస్థము (పదునారుపలములు) ఆవునెయ్యి కలిపి ఘృతపాకవిధిప్రకారము పక్వము చేసిన నియ్యది భల్లాతకఘృతమని చెప్పనగును.

దీనిని అగ్నిబలానుసారముగ సేవించినచో కఫగుల్మమును, ప్లీహవృద్ధిని, పాండురోగమును, శ్వాసకాసములను, గ్రహణిరోగమును పూర్తిగ హరించును.

కఫగుల్మహరక్షీరషట్పలఘృతము.

మూ. పిప్పలీపిప్పలీమూలచవ్యచిత్రకనాగరైః,
పలికైస్సయవక్షారైః ఘృతప్రస్థం విపాచయేత్. 147
క్షీరప్రస్థం చ, తత్సర్పిః హన్తి గుల్మం కఫాత్మకం,
గ్రహణీపాణ్డురోగఘ్నం ప్లీహకాసజ్వరాపహమ్. 148
(ఇతి క్షీరషట్పలకఘృతమ్.)

వ్యా. పిప్పళ్లు, పిప్పలీమూలము(మోడి), చవ్యము, చిత్రమూలము, శుంఠి, యవక్షారము, ఈయారుదినుసులును ప్రత్యేక మొక్కొకపలమువంతున జేర్చి మెత్తగ నూరి కల్కముచేసి ఒకప్రస్థపరిమితమగు (పదునారుపలములు) ఆవునేతితో కలిపి ఒక ప్రస్థము ఆవుపాలను కూడ చేర్చి ఘృతపాకవిధిగ పక్వముచేసి సేవించినచో కఫగుల్మ

మును, గ్రహణీరోగమును, పాండురోగమును, ప్లీహవృద్ధిని, కాసమును, జ్వరమును హరించును. (ఇది ఆరుపలములకల్కముతో సిద్ధమగునది కావున షట్పలఘృతమని చెప్పబడును. వాతగుల్మచికిత్సాప్రకరణమున "షట్పలం వా పిబేత్సర్పిః...ప్రసన్నయాక్షీరార్థం సురయాదాడిమేన వా దధ్నస్సరేణ వా కార్యం ఘృతం మారుతగుల్మనుత్." అని చెప్పబడిన షట్పలఘృతయోగమున పాలకు బదులు ప్రసన్న-సురా-దాడిమ-దధిసరములు ద్రవార్థము చెప్పబడినవి. ఇచ్చట కేవలము క్షీరముచేతనే పాకము చెప్పబడినదియని భేదము నెరుంగునది. రాజయక్ష్మమునందలి షట్పలఘృతమునకును దీనికిని భేదము కానరాదు).

ఇచ్చటః—"స్వరస-క్షీర-మాజ్జల్యైః పాకో యత్రేరితః క్వచిత్, జలం చతుర్గుణం తత్ర వీర్యాధానార్థమావపేత్." అను పరిభాష ననుసరించి ఘృతమునకు సమానభాగమైన ఘృతమున నాల్గింతలు జలమును కూడ జేర్చి పక్వముచేయవలెను. సర్వాఙ్గసుందరవ్యాఖ్యానమున "అత్ర చానుక్తమపి జలం స్నేహాచ్చతుర్గుణాం త్రిగుణం వా దేయం." అని చతుర్గుణ-త్రిగుణముల వికల్పముగ జెప్పిరి. "త్రిగుణం జలం దేయ"మని చక్రపాణి వ్యాఖ్యానమున జెప్పిరి. స్థలాంతరమునందును కేవలక్షీరముతోనే స్నేహపాకము చెప్పినయెడ నీకల్పమునే యెరుంగునది.

## మిశ్రకస్నేహము.

మూ. త్రివృతాం త్రిఫలాం దన్తీం దశమూలం పలోన్మితం,
జలే చతుర్గుణే పక్త్వా చతుర్భాగస్థితం రసమ్. 149
సర్పిరేరణ్డజం తైలం క్షీరం చైకత్ర సాధయేత్,
స సిద్ధో మిశ్రకస్స్నేహః సక్షౌద్రః కఫగుల్మనుత్. 150
కఫవాతవిబన్ధేషు కుష్ఠప్లీహోదరేషు చ,
ప్రయోజ్యో మిశ్రకస్నేహః యోనిశూలేషు చాధికమ్. 151
(ఇతి మిశ్రకస్నేహః.)

వ్యా. తెగడ, త్రిఫలములు, (కరక-తాని-ఉసిరికకాయలు), దశమూలములు (మారెడు, దుండిగము, గుమ్మడి, కలిగొట్టు, చెక్కెర, ముయ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరు, ఈపదింటివేళ్లు చేరిన కూటమి దశమూలములు), ఈపదునైదు ద్రవ్యములను ప్రత్యేక మొక్కొకపలము వంతున జేర్చి (పదునైదుపలములను) ఈసముదాయమునకు నాల్గింతల (అరువదిపలముల)నీళ్లు బోసి, నాల్గవవంతు (పదునైదు

పలములు) మిగుల కషాయమును చుండ కాచి, యాకషాయమునకు సమభాగము (పదు నైదుపలములు) ఆవుపాలును, నెయ్యియు ఆముదమునుచేరి ఈరెండుద్రవములకును నాల్గవవంతు (ఏడున్నరపలము) ఉండునట్లు జేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వము చేయునది. ఇయ్యది (రెండుస్నేహములు కలిసి యుండుటంబట్టి) మిశ్రకస్నేహమని చెప్ప బడును. ఈఘృతము సిద్ధమై చల్లారినపిదప నాల్గవవంతు తేనెను చేర్చునది.

ఈమిశ్రకస్నేహమును అగ్నిబలానుసారముగ సేవించినచో కఫగుల్మమును హరించును. మరియు కఫవాతప్రకోపము, మలబద్ధకము, కుష్ఠము, ప్లీహము, ఉదరము, యోనిశూలలు, అనునీవ్యాధులయందు విశేషముగ నీఘృతము నుపయోగింపనగును.

ఇచ్చట క్వాథ్యద్రవ్యములకును క్వాథజలమునకు పరిమాణము చెప్పబడినది. స్నేహములకును క్షీరమునకు పరిమితిని చెప్పియుండలేదు; కావున క్వాథసాహచర్యమునం జేసి దానికి సమభాగము క్షీరంబును, సామాన్యపరిభాషచే రెండుద్రవములకు నాల్గవ వంతు స్నేహద్వయంబును కల్పింపనగును. ఈయోగమున కల్కద్రవ్యములు చెప్పి యుండలేదు. పరిభాషానుసారముగ కల్కమును జేర్పకయే పక్వముచేయవలెనని చక్ర పాణిదత్తమతము నీలిన్యాదిఘృతవ్యాఖ్యతో మాచే వ్రాయబడినది.

వాగ్భటాచార్యులు మిశ్రకస్నేహమును ఇట్లు చెప్పెను:—"పిప్పల్యామలకద్రాక్షా శ్యామాద్యైః పాలికైః పచేత్, ఏరణ్డతైలహవిషోః ప్రస్థౌ పయసి షడ్గుణే. సిద్ధోఽయం మిశ్రకస్నేహః." ఇచ్చట పిప్పలిమున్నగుద్రవ్యముల కల్కముజేసి ఆవునెయ్యి నొకప్రస్థ మును ఆముదమునొకప్రస్థమును గూర్చి, ఈస్నేహమునకు ఆరింతలు ఆవుపాలు చేర్చి పక్వముచేయవలెనని స్పష్టముగ తెలుపబడినది. ఇందు క్వాథ్యములను కషాయమును జెప్పక కల్కద్రవ్యములు మాత్రము చెప్పబడినది. ఇట్టి కల్పనాభేదమునకు త్రికాలవేత్తలగు మునిపుంగవులు స్వతంత్రులుకాన మనము విమర్శింప సాధ్యముకాదని నాయభిప్రాయము.

కఫగుల్మమునందు విరేచనమునకు నీలినీఘృతోపయోగము.

మూ. యదుక్తం వాతగుల్మఘ్నం స్రంసనం నీలినీఘృతం,
ద్విగుణం తద్విరేకార్థం ప్రయోజ్యం కఫగుల్మినామ్. 152

వ్యా. పైని వాతగుల్మహర నీలినీఘృతయోగము "నీలినీ త్రివృతా దన్తీ... తతో ఘృతపలం దద్యాత్" ౧౦౯-౧౧౦ శ్లోక) అని విరేచనమునకు చెప్పబడినది. ఆనీలినీఘృతమును ద్విగుణముగ (రెండుపలములపరిమాణము) కఫగుల్మరోగులకు విరేచ విరేచనార్థ ముపయోగింపనగును.

### కఫగుల్మమున విరేచనమునకు త్రివృచ్చూర్ణోపయోగము.

మూ. సుధాక్షీరద్రవే చూర్ణం త్రివృతాయాః సుభావితం,
కార్షికం మధుసర్పిర్భ్యాం లీఢ్వా సాధు విరిచ్యతే. 153
(లీఢం సాధు విరేచయేత్.)

వ్యా. తెగడచూర్ణమును జెముడుపాలలో చక్కగ భావనజేసి యొకకర్ష మాత్రమును తేనెఘృతమున కల్పి లేహమువలె కలిపి సేవించినచో కఫగుల్మమున చక్కగవిరేచనము లగును.

### గుల్మహారదన్తీహరీతకీ.

మూ. జలద్రోణే విపక్తవ్యాః వింశతిః పఞ్చ చాఽభయాః,
దన్త్యాః పలాని తావన్తి చిత్రకస్య తథైవ చ. 154
అష్టభాగాఽవశేషం తు రసం పూతమధిక్షిపేత్,
దన్తీసమం గుడం పూతం క్షిపేత్తత్రాఽభయాశ్చ తాః. 155
తైలార్ధకుడవం చైవ త్రివృతాయాశ్చతుష్పలం,
చూర్ణితం పలమేకం తు పిప్పలీవిశ్వభేషజమ్. 156
తత్సాధ్యం లేహవత్, శీతే తస్మిఁ తైలసమం మధు,
క్షిపేచ్చూర్ణపలం చైకం త్వగేలాపత్రకేసరాత్. 157
తతో లేహపలం లీఢ్వా జగ్ధ్వా చైకాం హరీతకీం,
సుఖం విరిచ్యతే సద్యః దోషప్రస్థమనామయమ్. 158
గుల్మం శ్వయథుమర్శాంసి పాణ్డురోగమరోచకం,
హృద్రోగం గ్రహణీదోషం కామలాం విషమజ్వరమ్. 159
కుష్ఠం ప్లీహానమానాహం ఏషా హన్త్యుపసేవితా,
నిరత్యయః క్రమశ్చాస్యాః ద్రవో మాంసరసౌదనః. 160
(ఇతి దన్తీహరీతకీ.)

వ్యా. ఒకద్రోణ (నాల్గు ఆఢకములు=౨౫౬ పలముల) పరిమితజలమున ఇరువదియైదుకరకకాయలను, దంతివేళ్లను ఇరువదియైదుపలములను, చిత్రమూలము ఇరువదియైదుపలములనువైచి, ఎనిమిదవపాలు మిగులునట్లు కాచి, యాకషాయమును వడగట్టి, అందు దంతివేళ్లకు సమముగ (ఇరువదియైదుపలములు) బెల్లమును శుద్ధిచేసి వైచి, పైకషా

యమున పక్వముచేయబడిన కరకకాయలను కూడ వైచి, అర్థకుడవము (రెండుపలములు) నూనె, తెగడచూర్ణము నాల్గుపలములు, పిప్పళ్లను శుంఠియుఁజేరి ఒకపలము చూర్ణము, వీనినన్నిటి నొకటిగ చేర్చి లేహపాకవిధిప్రకారము పక్వముచేసి, ఆలేహము చల్లనైన పిమ్మట అందు దాలిచినిచెక్క, ఏలకులు, లవంగపత్రి, నాగకేసరములు, ఈనాల్గును చేరి యొకపలము పరిమాణమును చూర్ణముచేసి కలిపి లేహమును సిద్ధముగ జేయునది.

ఆలేహమున నొకపలమును తిని, అందుండు కరకకాయనొకదానిని నమలి తిన్న యెడ నొకప్రస్థపరిమితమగు దోషము (మలము) బాధలేవియు లేక సుఖముగ విరేచన మగును. దీనివలన గుల్మంబును, వాపును, అర్శస్సులు (గుదాంకురములు)ను, పాండురోగం బును, అరోచకంబును, హృద్రోగంబును, గ్రహణీరోగంబును, కామలయు, విషమజ్వరం బును, కుష్ఠంబును, ప్లీహాభివృద్ధియు, కడుపుబ్బరంబును, ఇవి యన్నియు నీదన్తిహరీతకీ యోగమును సేవించుటచే నిశ్శేషముగ శమించును. మరియు దీనిని సేవించినపుడు మాంస రసోదనక్రమమున నాహారమును చేయనగును. ద్రవరూపమైన యాహారము యుక్తముగ నుండును.

ఇచ్చట "దోషప్రస్థం" అనుచోట ప్రస్థమన పదుమూడున్నరపలముల పరి మితప్రస్థమని యెరుంగునది. ఈవిషయమును భోజుం డిట్లు చెప్పెను:—"వమనే చ విరేకే చ తథా శోణితమోక్షణే, సార్ధత్రయోదశపలం ప్రస్థమాహుర్మనీషిణః." వమన-విరేచన-రక్తమోక్షణవిషయమై చెప్పబడిన ప్రస్థపరిమితిని పదుమూడున్నరపలముగ గ్రహింప నగునని ముఖ్యాభావము.

## కఫగుల్మమున నిరూహవస్తి-చూర్ణ-గుటిక-క్షార-అగ్నికర్మ విధానము.

మూ. సిద్ధాస్సిద్ధిషు వక్ష్యన్తే నిరూహాః కఫగుల్మినామ్,
అరిష్టయోగాస్సిద్ధాశ్చ గ్రహణ్యర్శశ్చికిత్సితే. 161
యచ్చూర్ణం గుటికాయాశ్చ విహితా వాతగుల్మినామ్,
ద్విగుణక్షారహిఙ్గ్వమ్లవేతసాస్తాః కఫే హితాః. 162
య ఏవ గ్రహణీదోషే క్షారాస్తే కఫగుల్మినామ్,
సిద్ధా నిరత్యయాః శస్తాః దాహస్త్వన్తే ప్రశస్యతే. 163

వ్యా. ("స్థానాదపసృతం జ్ఞాత్వా......సస్నేహైర్వస్తిభిర్వాపి శోధయేద్దశ మూలికైః" (౫౮. శ్లో.)అనుశ్లోకముచేత కఫగుల్మచికిత్సాక్రమమున వస్తికర్మ నిర్దేశింప బడినది.) అట్టి వస్తిప్రయోగయోగ్యపరిస్థితియందు కఫగుల్మహరములుగ సిద్ధిస్థానమున జెప్పబడిన వస్తుల నుపయోగించునది.

గ్రహణిరోగచికిత్సయందును అర్శోరోగచికిత్సయందును నిర్దేశింపబడిన అరిష్ట యోగములలో గుల్మహారములగువానిని యుక్తియుక్తముగ నుపయోగింపదగును. మరియు వాతగుల్మచికిత్సయందు "హిఙ్గు త్రికటుకాం పాఠాం" అని యుపక్రమించి చెప్పబడిన చూర్ణంబులును గుటికలును, ఆయోగమున చెప్పబడిన యింగువను క్షారములను అమ్లవేత సమును ఈమూడుద్రవ్యములను మాత్రము ఆయోగమున జెప్పినదానికన్న ద్విగుణము గను తక్కినద్రవ్యములను యథోక్తముగను చేర్చి వాతగుల్మరోగి కుపయోగించునది. (ఈచూర్ణ-గుటికలను చికిత్సా క్రమమున "మన్దేఽగ్నౌ అనిలే మూఢే......గుటికా శ్చూర్ణనిర్యూహాః ప్రయోజ్యాః కఫగుల్మినామ్." అని నిర్దేశింపబడిన పరిస్థితియం దుపయోగింపదగును.)

మరియు "కృతమూలం మహావాస్తుం......జయేత్కఫకృతం గుల్మం క్షారాఽరిష్టాగ్నికర్మభిః" (శ్లో. ౫౯) అని చికిత్సాక్రమమున నిర్దేశింపబడిన పరిస్థితియందు కఫ గుల్మమున క్షారవిధి ననుసరించి చికిత్స చేయనగును. పైజెప్పబడిన చికిత్సాక్రమముచేత కూడ కఫగుల్మము శమింపకుండునెడ "దోషప్రకృతిగుల్మర్తు......శ్లేష్మికః కృతమూల త్వాత్...తస్య దాహో హృతే రక్తే శరలోహాదిభిర్హితః." అని చెప్పబడినరీతిగ అగ్ని కర్మ చేయదగును.

కఫగుల్మమున నుపయోగింపదగిన యాహారములు, వ్యంజనంబులును.

మూ. ప్రపురాణాని ధాన్యాని జాఙ్గలా మృగపక్షిణః,
కౌలత్థో ముద్గయూషశ్చ పిప్పల్యా నాగరస్య చ. 164
శుష్కమూలకయూషశ్చ బిల్వస్య వరుణస్య చ (తరుణస్యచ),
చిరిబిల్వాఙ్కురాణాఞ్చ యవాన్యాశ్చిత్రకస్య చ. 165
బీజపూరకహిఙ్గ్వమ్లవేతసక్షారదాడిమైః,
తక్రేణ తైలసర్పిర్భ్యాం వ్యఞ్జనాన్యుపకల్పయేత్. 166

వ్యా. మిక్కిలి ప్రాతవియగు రాజనములు మున్నగుధాన్యములు అన్నమున కుప యోగింపనగును. జాంగలదేశమునందలి మృగములయొక్కయు పక్షులయొక్కయు మాంసములు, పిప్పళ్లను శుంఠిని చేర్చి సిద్ధముచేయబడిన ఉలవకట్టు, పెసరకట్టు, ఎండిన ముల్లంగిని చేర్చి చేయబడిన కట్టు, లేత మారేడుపిందెలు, ఉలిమిరి, కానుగ, ఈరెంటి చిగుళ్లు, ఓమము, చిత్రమూలము, మాదీఫలరసము, పుల్లప్రబ్బలి, యవక్షారము, దానిమ్మ పండ్లరసము, మజ్జిగ, నూనె, నెయ్యి, వీనిచే సంస్కరింపబడిన వ్యంజనంబులును.

### కఫగుల్మమున పానీయములు.

మూ. పఞ్చమూలీశృతం తోయం పురాణం వారుణీరసం,
కఫగుల్మీ పిబేత్కాలే జీర్ణం మాధ్వీకమేవ వా. 167
యవానీచూర్ణితం తక్రం బిడేన లవణీకృతం,
పిబేత్సన్దీపనం వాతకఫమూత్రానులోమనమ్. 168
(మూత్రవర్చోఽనులోమనమ్.)

వ్యా. పంచమూలముల చేర్చి కాచబడిన జలమును ప్రాతది యగువారుణియను మద్యరసమును, మిక్కిలి ప్రాతదియగు మాధ్వీకమున, మద్యమును దప్పియెత్తినకాలమున (సాత్మ్యాద్యనుసారముగ) త్రాగవలెను.

మరియు మజ్జిగలో ఓమమును చూర్ణము జేసి వైచి ఉప్పుకు బదులు బిడాలవణమును చేర్చి త్రాగినచో అగ్నిని దీపింపజేసి వాతకఫమూత్రపురీషములను అనులోమముగ సంచరింపజేయును.

### అసాధ్యగుల్మము, దానిలక్షణములు.

మూ. సఞ్చితః క్రమశో గుల్మః మహావాస్తుపరిగ్రహః,
కృతమూలస్సిరానద్ధో యదా కూర్మ ఇవోన్నతః 169
దౌర్బల్యాఽరుచిహృల్లాసకాసవమ్యరతిజ్వరైః,
తృష్ణా తన్ద్రాప్రతిశ్యాయైః యుజ్యతే న స సిధ్యతి. 170
గృహీత్వా సజ్వరశ్వాసం వమ్యతీసారపీడితం,
హృన్నాభిహస్తపాదేషు శోఫః కర్షతి గుల్మినమ్. 171

వ్యా. గుల్మమును చికిత్సజేయక యుపేక్షించినచో నానాట క్రమక్రమముగ వృద్ధినొంది ఉదరమంతట పూర్తిగ వ్యాపించి బలిష్ఠముగ నాటుకొని సిరచే వ్యాప్తమై తాబేలువలె నున్నతమై యగుపడునపుడు, బలహీనము, అరుచి, హృల్లాసము, ఓకళింతలు, దగ్గు, వాంతి, పనులందు ఇచ్ఛలేకుండుట, జ్వరము, దప్పి, కునికిపాటు (మైకము), ప్రతిశ్యాయము (జలుబు), అనునీయుపద్రవముల కూడి యుండును. అయ్యది సాధ్యము కానేరదు.

మరియు జ్వరము, శ్వాసము, వాంతి, అతిసారము, ఈలక్షణములతో కూడి యున్నను, హృదయమునందును నాభిస్థానమునను హస్తములయందును పాదములయందును వాపు కల్గియున్నను గుల్మము రోగిని చంపును. ("వమనం వమనార్హస్య" (౧౩౭)

అని యుపక్రమించి ఇంతదనుక చెప్పబడిన చికిత్స, కఫగుల్మమునకు చికిత్సాక్రమమున నిర్దేశింపబడిన క్రమానుసారముగ చెప్పబడినదని యెరుంగునది).

## రక్తగుల్మచికిత్స, అందు విరేచనవిధి.

మూ. రౌధిరస్య తు గుల్మస్య గర్భకాలవ్యతిక్రమే,
స్నిగ్ధస్విన్నశరీరాయై దద్యాత్ స్నేహవిరేచనమ్. 172

వ్యా. స్త్రీలకు సంభవించిన రక్తగుల్మమున ("మాసే వ్యతీతే దశమే చికిత్స్యః." అని చెప్పిన ప్రకారము) గర్భధారణమునకు నియతమైన (ప్రసవకాలమగు) పదిమాసములకాలము గడచినపిమ్మట విధ్యుక్తప్రకారము స్నేహస్వేదవిధులచే స్నిగ్ధస్విన్నశరీరముగల స్త్రీకి స్నేహద్రవ్యములచే విరేచనమున కియ్యవలెను.

## పలాశక్షారతైలము.

మూ. పలాశక్షారపాత్రే ద్వే ద్వే పాత్రే తైలసర్పిషోః,
గుల్మశైథిల్యజననీం పక్త్వా మాత్రాం ప్రయోజయేత్. 173

వ్యా. మోదుగాకులను క్షారము కాల్చి బూడిదె చేసి సిద్ధముచేయబడిన క్షారోదకము రెండుపాత్రములు (రెండుఆఢకములు=నూటయిరువదియెనిమిదిపలములు), తైలంబును ఆవునెయ్యియు ప్రత్యేకము ఆఢకమువంతున (క్షారోదకమునకు సమముగ) రెండు ఆఢకములును చేర్చి స్నేహపాకవిధిప్రకారము పక్వముచేసి యుక్తమైన పరిమాణముతో నుపయోగించిన గుల్మము శిథిలముగ సడలును.

ఇచ్చట క్షారపాకవిధిప్రకారము మోదుగఆకులు మున్నగువానిని కాల్చి బూడిదె చేసి యాబూడిదెకు నాల్గింతల నీళ్లు పోసి నూరి యొకరాత్రియంతయు తేరనిచ్చి యా తేటనీటిని ఉదయమున గ్రహింపనగును. అట్టి క్షారోదకమును స్నేహద్రవ్యమునకు సమముగ జేర్చి పక్వముచేయవలెను.

## రక్తగుల్మమున యోనిశోధనవిధి.

మూ. ప్రభిద్యేత న యద్యేవం దద్యాద్యోనివిశోధనం (విరేచనం),

వ్యా. పైజెప్పిన ప్రకారము చికిత్స జేసినను రక్తగుల్మము పగులకుండునెడ యోనివిశోధనౌషధము నుపయోగింపనగును.

## యోనివిరేచనౌషధములు.

మూ. క్షారేణ యుక్తం పలలం సుధాక్షీరేణ వా పునః. 174
ఆభ్యాం వా భావితాన్ దద్యాత్ యోనౌ కటుకమత్స్యకాన్,

వరాహమత్స్యపిత్తాభ్యాం ల(న)క్తకాన్వా సుభావితాన్. 175
అధోహరై శ్చోర్ధ్వహరైః భావితాన్ వా సమాక్షికైః,
కిణ్వం వా సగుడక్షారం దద్యాద్యోనివిశోధనమ్. 176
రక్తపిత్తహరం క్షారం లేహయేన్మధుసర్పిషా,
లశునం మదిరాం తీక్ష్ణాం మత్స్యాంశ్చాస్యై ప్రయోజయేత్. 177
వస్తిం సక్షీరగోమూత్రం సక్షారం దాశమూలికం,
అదృశ్యమానే రుధిరే దద్యాద్గుల్మప్రభేదనమ్. 178

వ్యా. నువ్వులను వేయించి పొడిచేసి యవక్షారమును చేర్చియైనను, ఆనువ్వుల పొడిని బొంతజెముడుపాలలో కలిపి యైనను, మోదుగక్షారమునందును బొంతజెముడు పాలయందును భావనచేయబడిన కటుమత్స్యములనైనను, పందియొక్కయు చేపయొక్కయు పిత్తములలో భావనచేయబడిన కటుమత్స్యములనైనను, అధోదోషహరములగు విరేచనద్రవ్యములయందైనను ఊర్ధ్వదోషహరవమనద్రవ్యములయందైనను, భావనచేయబడి తేనెతో గూడిన గుడ్డములనైనను యోనివిశోధనమునకై యోనిలో నుంచవలెను. లేక సురాబీజమును బెల్లమును సర్జక్షారమును ఒకటిగ గూర్చి యోనియం దుంచవలెను.

మరియు రక్తపిత్తహరముగ జెప్పబడిన క్షారమును తేనెతోను నేతితోను కలిపి లేహముగ జేసి నాకించవలెను. వెల్లుల్లిపాయలను తీక్ష్ణమైన మద్యమును మత్స్యములను రక్తపిత్తరోగి కియ్యవలెను. అంతటను రక్తము వెడలనిచో దశమూలవస్త్యౌషధములలో పాలను గోమూత్రమును సర్జక్షారమును కలిపి ఉత్తరవస్తిని గుల్మమును భేదించుటకై ప్రయోగించవలెను.

రక్తగుల్మమున నాహారము, పానీయ్యము.

మూ. ప్రవర్తమానే రుధిరే దద్యాన్మాంసరసౌదనం,
ఘృతతైలేన చాభ్యఙ్గం పానార్థం తరుణీం సురామ్. 179

వ్యా. పైజెప్పిన విధానముచే రక్తము బైటవెడలుచున్నయెడ మాంసరసముతో గూడిన యన్నమును బెట్టవలెను. పిమ్మట నేతిచేతను తైలముచేతను అభ్యంగనము చేయించి, త్రాగుటకు వారుణియను మద్యము నియ్యవలెను.

రక్తాతిప్రవృత్తియందు చికిత్స.

మూ. రుధిరేఽతిప్రవృత్తే తు రక్తపిత్తహరీః క్రియాః,
కార్యాః, వాతరుగార్తాయాః సర్వాః వాతహరీః పునః. 180

వ్యా. పైజెప్పిన క్రియాక్రమముచేత రక్తగుల్మము భిన్నమై రక్త మధికముగ వెడలుచున్నయెడ రక్తపిత్తహరములగు చికిత్సలు చేయనగును. వాతమున బాధలు కల్గు నెడ వాతవ్యాధిహరములగు చికిత్సలన్నియు చేయదగును.

### రక్తగుల్మమున రక్తాతియోగోపచారములు.

సూ. ఘృతతైలాఽవసేకాంశ్చ తిత్తిరీంశ్చరణాయుధాన్,
సురాం సమణ్డాం పూర్వం చ పానమమ్లస్య సర్పిషః. 181
ప్రయోజయేదుత్తరం వా జీవనీయేన సర్పిషా,
అతిప్రవృత్తే రుధిరే సతి క్తేనాఽనువాసనమ్. 182

వ్యా. రక్తగుల్మమున రక్తం బధికముగ వెడలునెడ భుజించుటకుముందు ఘృతమును తైలములను అవసేకము (స్నానము)లను తీతుకపిట్టమాంసమును కోడిమాంసమును సురామండమును ఉపయోగింపనగును. అమ్లరసములచే సిద్ధముచేయబడిన ఘృతమును పానముచేయదగును. భుజించిన పిమ్మట వాతరక్తచికిత్సితమున జెప్పబడిన జీవనీయ ఘృతము నుపయోగింపనగును. (లేక జీవనీయఘృతముచే నుత్తరవస్తి చేయవలెను) తిక్తరసద్రవ్యముల గూర్చి సిద్ధముచేయబడిన ఘృతముచే ననువాసనవస్తి చేయనగును.

### ఉక్తవిషయానువాదము, అందు వాతగుల్మచికిత్సాసంగ్రహము.

తత్ర శ్లోకాః.—

సూ. స్నేహస్స్వేదస్సర్పిః వస్తిశ్చూర్ణాని బృంహణం గుటికాః,
వమనవిరేకౌ మోక్షః క్షతజస్య చ వాతగుల్మఘ్నమ్. 183

వ్యా. స్నేహస్వేదవిధులు, ఘృతము, వస్తివిధి, చూర్ణములు, బృంహణ (బలకర) చికిత్స, గుటికలు, వమనవిరేచనయోగములు, రక్తమోక్షణము, అను నీచికిత్సలు వాతగుల్మహరములైనవి పైని వరుసగ జెప్పబడినవి.

### పిత్తగుల్మచికిత్సాసంగ్రహము.

సూ. సర్పిస్సతిక్తసిద్ధం క్షీరం ప్రస్రంసనం నిరూహాశ్చ,
రక్తస్య చాఽవసేచనమాశ్వాసనసంశమనయోగాః. 184
ఉపనాహనం సశస్త్రం పక్వస్యాఽభ్యంతరప్రభిన్నస్య,
సంశోధనసంశమనే పిత్తప్రభవస్య గుల్మస్య. 135

వ్యా. పిత్తముచే గల్గిన గుల్మమునకు జెప్పిన చికిత్సాప్రకరణమున తిక్తకఘృతము, దోషమును వెడలించుఆహారము, నిరూహవస్తులు, రక్తమోక్షణము, రక్తమోక్షణముచే గల్గిన బలహీనమున శమనోపాయములు అట్టియోగములు, ఉపనాహనము, పక్వ

హైనగుల్మమునకు శస్త్రవిధానము, లోపలనే భిన్నమైన గుల్మమునకు సంశోధనము, శమనము, ఇవియన్నియు పైని క్రమముగ వివరింపబడినవి.

### కఫగుల్మచికిత్సాసంగ్రహము.

మూ. స్నేహస్స్వేదో భేదః లఙ్ఘనముల్లేఖనం విరేకశ్చ,
సర్పిర్వస్తిర్గుటికాః చూర్ణమరిష్టాశ్చ సక్షారాః. 186
గుల్మస్యాఽన్తే దాహః కఫజస్యాఽగ్రేఽపనీతరక్తస్య,

వ్యా. కఫజగుల్మచికిత్సాప్రకరణమున స్నేహస్వేదవిధులు, భేదనము, లంఘనము, వమనవిరేచనములు, ఘృతయోగములు, వస్తికర్మ, గుటికలు, చూర్ణములు, అరిష్టములు, క్షారములు, రక్తవిమోక్షణపూర్వకదాహవిధి, ఇవియన్నియు వరుసగ జెప్పబడినవి.

### రక్తగుల్మచికిత్సాక్రమము.

మూ. గుల్మస్య రౌధిరస్య క్రియాక్రమః స్త్రీభవస్యోక్తః. 187
పథ్యాఽన్నపానసేవా హేతూనాం వర్జనం యథాస్వంచ,
నిత్యం చాగ్నిసమాధిః స్నిగ్ధస్య చ సర్వకర్మాణి. 188

వ్యా. రక్తగుల్మమునకు సంబంధించిన క్రియాక్రమంబును రక్తగుల్మచికిత్సితమున పైని చెప్పబడినది. మరియు ఆయాగుల్మములకు సంబంధించిన పథ్యములగు నన్నపానముల సేవించువిధంబును, గుల్మముల గల్గించు హేతువుల పరివర్జనంబును, ఎల్లప్పుడును జాఠరాగ్నిని సంరక్షించుచు స్నిగ్ధశరీరునకు చికిత్సల జేయవలెననియు పైని చెప్పబడినది.

### అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకః.—

మూ. హేతుర్లిఙ్గం సిద్ధిః క్రియాక్రమః సాధ్యతాన, యోగాశ్చ,
గుల్మచికిత్సితసంగ్రహ ఏతావాఞ్ వ్యాహృతోఽగ్నివేశస్య. 189

వ్యా. గుల్మములు జనించుటకు కారణములు, ఆయాగుల్మములకు వేరువేరు లక్షణములు, ఆయాగుల్మముల క్రియాక్రమము, అసాధ్యత్వము, యోగములు, ఇవి యన్నియు నీగుల్మచికిత్సితాధ్యాయమున నగ్నివేశునిచే వివరింపబడినవి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, చికిత్సితస్థానే
గుల్మచికిత్సితం నామ పఞ్చమోఽధ్యాయః.

ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహిత యను నాయుర్వేదతంత్రమున చికిత్సితస్థానమున గుల్మచికిత్సితమనునది పంచమాధ్యాయము సమాప్తము.

---

## షష్ఠాధ్యాయము.

అవతరణిక — దక్షాధ్వరప్రస్తావము ననుసరించి రోగములకు విప్రకృష్టనిదానము నిరూపించుతరి "హవిః ప్రాశాత్ మేహకుష్ఠానాం." (ని. అ. ౮) అనువాక్యముచేత గుల్మనిదానానంతరము ప్రమేహనిదానము చెప్పబడినది. అట్టి నిదానక్రమము ననుసరించి గుల్మచికిత్సితమును చెప్పినపిదప ప్రమేహ చికిత్సితము చెప్పబడును.—

సూ. అథాతః ప్రమేహచికిత్సితం వ్యాఖ్యాస్యామః. 1

ఇతి హ స్మాహ భగవానాత్రేయః. 2

వ్యా. గుల్మచికిత్సితము చెప్పినపిదప క్రమాగతమైన ప్రమేహచికిత్సితమును త్రికాలవేత్తయగు నాత్రేయు లుపదేశించెను. దానికన్న న్యూనాతిరేకము లేకుండునట్లు వివరించెదనని యర్థము.

ఆత్రేయు డగ్నివేశుని కుపదేశించుక్రమము.

మూ. నిర్మోహమానానుశయో నిరాశః పునర్వసుర్జ్ఞానతపోవిశాలః,
కాలేఽగ్నివేశాయ సహేతులిఙ్గానువాచ మేహాన్శమనంచ తేషామ్.

వ్యా. కామ-క్రోధ, లోభ, మోహాదులును, రాగద్వేషాదులును, లేని వాడును, మహత్తరమైన జ్ఞానంబును, తపోబలంబును గల యాత్రేయులు అగ్నివేశునకు ప్రమేహమునకు సంబంధించిన హేతులక్షణములను, శమనోపాయమైన చికిత్సను యుక్తమైన కాలమున నిత్తెరంగున నుపదేశించెను. (ఇచ్చట హేతులక్షణములు, నిదానస్థానముననే వివరింపబడినను శిష్యసుఖస్ఫూర్తికై ఇచ్చట మరల పేర్కొనబడియె.)

ప్రమేహములు జనించుటకు కారణములు.

మూ. ఆస్యాసుఖం స్వప్నసుఖం దధీని గ్రామ్యౌదకానూపరసాః పయాంసి,
నవాన్నపానంగుడవైకృతఞ్చ ప్రమేహహేతుః కఫకృచ్చ సర్వమ్.

వ్యా. సుఖముగ కూర్చునియుండుట, శరీరమునకు సుఖస్పర్శముగ నుండి శయ్యపై పరుండి నిదురించుట, పెరుగును, గ్రామములయందు సంచరించు జంతువులయొక్కయు, ఉదకప్రాంతముననుండు జంతువులయొక్కయు మాంసరసములను, పాలను త్రాగుట; నూతనధాన్యము, (క్రొత్తబియ్యము) వలన సిద్ధమైన యన్నమును భుజించుట, క్రొత్తనీళ్లను త్రాగుట, బెల్లమును చేర్చి చేయబడిన భక్ష్యముల తినుట, ఇవియన్నియు ప్రమేహము జనించుటకు కారణములు. మరియు కఫము వృద్ధినొందించు ఆహారవిహారము లెవ్వియైనను యవియన్నియు, ప్రమేహమును కలిగించును. (ఇచ్చట "ఆస్యాసుఖం, స్వప్నసుఖం."

అని చెప్పుటచేత శరీరమునకు సుఖకరముగ కూర్చుండుటయు, పరుండి నిదురించుటయు, ప్రమేహమునకు కారణములు అగుగాని, శరీరమునకు కష్టమును గలిగించు కఠినాస్తరణములపై కూర్చున్నను, కర్కశములగు శయ్యలపై పరుండినను, అవి శరీరమునకు సుఖకరములు గావు కావున ప్రమేహకారణములు గావని యెరుంగునది.)

కఫాదిప్రమేహములకు వేరువేరుగ సంప్రాప్తి.

మూ. మేదశ్చ మాంసం చ శరీరజం చ క్లేదం కఫో వస్తిగతః ప్రదూష్య,
కరోతి మేహాన్ సముదీర్ణముష్ణైస్తానేవపిత్తంపరిదూష్య చాపి.
క్షీణేషు దోషేష్వవకృష్యవస్తౌ ధాతూన్ ప్రమేహాననిలః కరోతి, [మ్.
దోషోహివస్తింసముపేత్యమూత్రం సందూష్యమేహాఞ్జనయేద్యథాస్వ

వ్యా. కఫము ప్రకోపమునొంది వస్తి(మూత్రాశయము)యందు చేరి శరీరమందలి మేదస్సును మాంసమును ద్రవపదార్థములను జెరచి కఫప్రమేహముల గలిగించును. ఉష్ణవీర్యములయిన పదార్థముల సేవించుటచే పిత్తము ప్రకుపితమై పైజెప్పిన మేదస్సు మొదలగువానిని చెరచి మూత్రాశయమున జేరి, పిత్తప్రమేహముల గలిగించును. పిత్తకఫములు రెండును క్షీణించియున్నపుడు వాతము వస్తియందు జేరి ప్రకోపము నొంది ధాతువులను చెరచి వాతప్రమేహముల కలిగించును. మరియు దోషము ప్రకోపమునొంది వస్తియందు జేరి యందలి మూత్రమును జెరచి ఆయాదోషానుగుణముగ పైజెప్పిన కఫాదిప్రమేహముల గలిగించును.

ప్రమేహముల సాధ్యాసాధ్యవిభాగము.

మూ. సాధ్యాః కఫోత్థాః దశ, పిత్తజాః షట్
యాప్యాః, న సాధ్యాః పవనాచ్చతుష్కాః,
సమక్రియత్వాత్ విషమక్రియత్వాత్
మహాత్యయత్వాచ్చ యథాక్రమం తే. 7

వ్యా. కఫప్రకోపమున గల్గు ప్రమేహములు పదియు, కఫరూపమైన దోషమునకును మేదస్సు మున్నగు దూష్యములకును, సమానమైన కటుతిక్తాద్యౌషధప్రయోగము చేయుటకు తగియుండుటవలన అయ్యవి సాధ్యము లగును.

పిత్తమున జనించినప్రమేహము లారును పిత్తరూపమైన దోషమునకును, దూష్యములకును, పరస్పరవిరుద్ధమైన చికిత్స జేయవలసి యుండుటంజేసి, అయ్యవి యాప్యము లగును.

వాతముచే జనించిన నాల్గు ప్రమేహములును గంభీరములగు మజ్జాదిధాతువులను మిక్కిలి చెరిచి కష్టమును కలిగించునవి కావున అయ్యవి యసాధ్యములు.

## ప్రమేహసామాన్యముగ దోషదూష్యవిభాగము.

మూ. కఫస్సపిత్తః పవనశ్చ దోషాః, మేదోఽస్రశుక్రామ్బువసాలసీకాః,
మజ్జారసౌజఃపిశితంచదూష్యాః(దూష్యం) ప్రమేహిణావింశతి రేవ మేహాః.

వ్యా. కఫము, పిత్తము, వాతము, ఈమూడును ప్రమేహముగల రోగులకు దోషములగును. మేదస్సు, రక్తము, శుక్రము, జలము, వస, లసీక, మజ్జ, రసము, ఓజస్సు, మాంసము, అనునీపదియు దూష్యము లగును. మరియు నట్టిదోషదూష్యములసంబంధమున గల్గు ప్రమేహములు ఇరువదివిధములుగ నుండును.

## దశవిధకఫప్రమేహముల ప్రత్యేకగుణములు.

మూ. జలోపమం చేక్షురసోపమం వా ఘనం ఘనం చోపరి విప్రసన్నమ్,
శుక్లం సశుక్రంశిశిరంశనైర్వా లాలేవవా వాలుకయాయుతం వా.
విద్యాత్ ప్రమేహాన్ కఫజాన్ దశైతాన్

వ్యా. ఉదకమును బోలియైనను, చెరకురసమునకు సమానముగనైనను, మెండుగనైనను, మూత్రము నొకపాత్రలో పట్టి కొంతకాల ముంచినచో, నడుగున ఘనీభవించి పైభాగమున తేటగనైనను, తెల్లనిరంగు కల్గియైనను శుక్రముతో కూడియైనను, చల్లగనైనను, మెల్లమెల్లగనైనను, జొల్లుతో సమానమై తంతిపలెనైనను, ఇసుకవంటి కఫఖండములతో కూడియైనను, మూత్రము వెడలినచో నీపదివిధములైన కఫగుణములు కల ప్రమేహములు పదియు కఫప్రకోపమున జనించినవని యెరుంగునది.

(పైజెప్పిన గుణములు పదియును కఫమునకు సంబంధించినవి కావున వానిలో నొక్కొకగుణము కల్గియైనను, లేక కొన్ని కలిసియైనను జనించిన ప్రమేహములు పదియును కఫమున సంభవించినవి. వీనికొక్కొకటికిని ఆయాగుణభేదమును బట్టి వరుసగ ఉదక-ఇక్షు-సాంద్ర, సాంద్రప్రసాద-శుక్ల-శుక్ర-శీత-సికతా-శనైః - లాలామేహము లని వేరువేరు నామభేదములచే వ్యవహరింపబడును. ఈవిషయము నిదానస్థానమున "తత్ర శరీరక్లేదస్తు...శ్లైష్మికైరేభిర్దశభిర్గుణైరుపసృజ్యతే......శ్వేత-శీత-మూర్త-పిచ్ఛిల అచ్ఛ-స్నిగ్ధ-గురు-ప్రసాద-మధుర-సాన్ద్ర)మన్దైః...తత్సమాఖ్యం గౌణం నామ విశేషం ప్రాప్నోతి." (ని-అ-౬-వాక్యము ౧౦) అనువాక్యముచేతను; "తే ఖల్విమే దశప్రమేహా నామ విశేషేణ భవన్తి తద్యథా—ఉదకమేహశ్చ...లాలామేహశ్చేతి." (ని. అ. ౬.

వా. ౧౧) అనువాక్యముచేతను వివరింపబడినది. మరియు వీనిప్రత్యేకలక్షణంబులును నిదానస్థానమున విస్తృతముగ జెప్పబడినవి కావున నచ్చట చూచునది.)

### షడ్విధపిత్తప్రమేహప్రత్యేకగుణములు.

మూ. క్షారోపమం కాలమథాపి నీలం,
హారిద్రమాఞ్జిష్ఠమథాపిరక్తం ఏతాన్ ప్రమేహాన్ షడుశన్తిపిత్తాత్.

వ్యా. పిత్తప్రకోపమున జనించిన ప్రమేహము లారును వేరువేరుగ క్షారమును బోలిన రసగంధాదులు కల్గియైనను, మసితో సమానముగ నల్లనిరంగు కల్గియైనను, నీల వర్ణము కల్గియైనను, పసుపురంగు కల్గియైనను, మంజిష్ఠినిబోలినరంగు కల్గియైనను, రక్తము వంటి యెరుపురంగు కల్గియైనను వెడలును.

ఇవి పిత్తమునకుంగల క్షారాదిగుణము లారును కల్గియుండుటంజేసి వరుసగ-క్షార-కాల-నీల-హారిద్ర-మంజిష్ఠా-రక్తమేహములని వరుసగ బేర్కొనంబడును. వీనివివరణ మంతయు నిదానస్థానమున "తేషామపి చ పిత్తగుణవిశేషేణ...పూర్వవద్వ్యాక్తా భవన్తి." అని యుపక్రమించి చెప్పబడినది.

### చతుర్విధవాతికప్రమేహములగుణవివరణము.

మూ. మజ్జౌజసా వా వసయాన్వితం వా లసీకయా వా సతతం విబద్ధం,
చతుర్విధంమూత్రయతీహ వాతాత్ శేషేషు ధాతుష్వపకర్షితేషు.

వ్యా. శరీరమునందలి మజ్జతోనైనను, మధురస్వభావముకలయోజస్సుతోనైనను, వస(మాంసస్నేహము)తోనైనను,లసీక (త్వఙ్మాంసముల రెంటికినడుమ నుండుద్రవము)తోనైనను కూడి మూత్రము వెడలినయెడ నీనాల్గును వాతజప్రమేహములు. (ఈనాల్గిటిలో మజ్జతో కూడినది మజ్జామేహమనియు, ఓజస్సుతో కూడినది మధుమేహమనియు, వసతో కూడినది వసామేహమనియు, లసీకతో కూడినది హస్తిమేహమనియు చెప్పబడును. ఈనాల్గు వాతికప్రమేహముల వివరమంతయు నిదానస్థానమున నాల్గవయధ్యాయమున తంత్రకారులచే విస్తరింపబడినది. )

మరియు పైజెప్పిన వసాదిప్రమేహములలో తక్కిన రక్తాదిధాతువులు వాతప్రకోపమునం జేసి శుష్కించినపుడు పై వివరించిన క్రమమున సంభవించును. లసీకా లక్షణమును "యన్మాంసత్వగన్తరే ఉదకం, తల్లసీకాశబ్దం లభతే." అని తంత్రకారులు చెప్పియున్నారు.

## ప్రమేహసామాన్యలక్షణములు.

మూ. వర్ణంరసంస్పర్శమథాపిగన్ధం యథా స్వదోషం భజతే ప్రమేహః,
శ్యావారుణోవాతకృతఃసశూలఃమజ్జాదిసాద్గుణ్యముపైత్యసాధ్యః. 12

వ్యా. పైజెప్పిన కఫజాదిప్రమేహముల వర్ణంబును, రసంబును, గంధంబును ఆయాదోషమునకు అనుగుణముగ కలిగియుండును. వాతమువలన కలిగిన ప్రమేహము నందు శ్యామవర్ణంబైనను, రక్తవర్ణంబైనను కలిగి, పోటు మున్నగు బాధలతో కూడి మజ్జ వసాదులకు సమానమైన గుణముతో కూడియుండును. ఇయ్యది మిక్కిలి యసాధ్యము.

## ప్రమేహసామాన్యపూర్వరూపములు.

మూ. స్వేదోఽఙ్గగన్ధః శిథిలాఙ్గతా చ శయ్యాసనస్వప్నసుఖే రతిశ్చ,
హృన్నేత్రజిహ్వాశ్రవణోపదేహః ఘనాఙ్గతా కేశనఖాతివృద్ధిః.
శీతప్రియత్వం గలతాలుశోషః మాధుర్యమాస్యే కరపాదదాహః,
భవిష్యతో మేహగదస్య రూపం మూత్రేఽభిధావన్తిపిపీలికాశ్చ.

వ్యా. శరీరముపై చెమట పట్టుట, ఒడలిపై దుర్గంధము, అవయవములు శిథిలములై (సడలి) యుండుట, పరుండియుండుటయందును కూర్చొనియుండుటయందును నిదురించుటయందును కల్గుసుఖమును గోరుట, హృదయమునందును కన్నులయందును నాలుకయందును చెవులయందును మురికి చేరి యుబ్బినట్లుండుట, అవయవములు బలిసి యుండుట, వెండ్రుకలును గోళ్లును మిక్కిలి వృద్ధినొందుట, చలువనుగోరుట, కంఠంబును తాలువులును శోషించుట, నోరు తీపికల్గి యుండుట, అరకాళ్లయందును అరచేతుల యందును మంట పుట్టుట, మూత్రమున చీమలు మూగియుండుట, ఇవి యన్నియు ప్రమేహము కల్గుటకుముందు కల్గు పూర్వరూపములు.

## ప్రమేహచికిత్సాక్రమము.

మూ. స్థూలః ప్రమేహీ బలవానిహైకః కృశస్తథైకః పరిదుర్బలశ్చ,
సంబృంహణం తత్రకృశస్య కార్యం సంశోధనందోషబలాధికశ్చ.
స్నిగ్ధస్య యోగావివిధాః ప్రయోజ్యాః కల్పోపదిష్టామలశోధనాయ,
ఊర్ధ్వం తథాధశ్చ మలేఽపనీతే మేహేషు సన్తర్పణమేవ కార్యమ్.

వ్యా. ప్రమేహరోగము గలమనుజుడు నొకడు, శరీరము స్థూలమై దోషములును, శరీరంబున బలిష్ఠంబులైయుండును. వేరొకడు శరీరము చాల కృశించి మిక్కిలి

బలహీనుడై యుండు. అట్టియెడ కృశించియుండువానికి బృంహణ (శరీరపుష్టికరమైన) చికిత్స చేయనగును. దోషబలాధికునకు తొలుత స్నిగ్ధునిగ జేసి కల్పస్థానమున చెప్పిన మలశోధనయోగముల ప్రయోగించి వమనవిరేచనమూలమున ఊర్ధ్వాధోమార్గముల నుండి మలమును వెడలింపజేయనగును. ఇత్తెరంగున విధ్యుక్తప్రకారము మలమును వెడలించినపిదప అట్టిరోగికి సంతర్పణము జేయుటయే మంచిది.

ప్రమేహరోగికి అపతర్పణనిషేధము, దాన గల్గు నుపద్రవములు.

మూ గుల్మః క్షయో మేహనవస్తిశూలంమూత్రగ్రహాశ్చాప్యపతర్పణేన, ప్రమేహిణస్స్యుఃపరితర్పణాని కార్యాణితస్మాత్ ప్రసమీక్ష్యవహ్నిమ్.

వ్యా. ప్రమేహరోగము గలవానికి అపతర్పణరూపమైన చికిత్స చేసినయెడ గుల్మము, క్షయము, మేఢ్రమునందును వస్తియందును, పోటు, మూత్రబంధము, అను నీయుపద్రవములు కలుగును. కావున ప్రమేహరోగికి సంతర్పణచికిత్సనే జేయవలయునుగాని అపతర్పణము ఒకప్పుడును చేయంజనదు. అట్టి సంతర్పణమును గూడ జాఠరాగ్నిబలమును గమనించి తదనుగుణముగ జేయనగును.

ప్రమేహమున సంశమనవిధి.

మూ. సంశోధనంనార్హతియఃప్రమేహీతస్యక్రియాసంశమనీప్రయోజ్యా,

వ్యా. సంశోధనమునకు అర్హుడు కాని ప్రమేహరోగికి సంశమనరూపచికిత్సను ప్రయోగించవలయును.

ప్రమేహహరమన్థ-చూర్ణ-లేహాదులు.

మూ. మన్థాః కషాయాః యవచూర్ణలేహాః
ప్రమేహశాన్త్యై లఘువశ్చ భక్ష్యాః. 18
యే విష్కిరా యే ప్రతుదా విహఙ్గా
స్తేషాం రసైర్జాంగలజైర్మనోజ్ఞైః,
యవౌదనం రూక్షమథాపి వాట్య
మద్యాత్ (మద్యాత్) సనూక్తానపి చాప్యపూపాన్. 19
ముద్గాదియూషైరథ తిక్తశాకైః
పురాణశాల్యోదనమాదదీత,
దన్తీఙ్గుదీతైలయుతం ప్రమేహీ
తథాతసీసర్షపతైలయుక్తమ్. 20

సషష్టికం స్యాత్తృణధాన్యమన్నం
యవప్రధానస్తు భవేత్ప్రమేహీ,
యవస్య భక్ష్యాన్వివిధాంస్తథాద్యా
త్కఫప్రమేహీ మధుసంప్రయుక్తాన్. 21

వ్యా. మంథములు, కషాయములు, యవచూర్ణములు, లేహములు, లఘుగుణము
గి తేలికగ జీర్ణమగు భక్ష్యములు, వీనిని ప్రమేహశాంతికొరకు ఉపయోగింపనగు.
రియు అట్టి లఘుగుణములు గల.విష్కిరముల (కాళ్లతో భూమిని చిమ్మి ఆహారమును
కి తిను కోడి మున్నగువాని) యొక్కయు, ప్రతుదముల (ముక్కుతో పొడిచి
ంసాదులను కుత్తుక తిను పక్షివిశేషముల) యొక్కయు, మాంసరసములచేతను
ంగల (మెట్టప్రదేశములనుండు.) జంతువుల మనోజ్ఞమైన మాంసరసములతోడను,
వాన్నమును కలిపి భుజించవలయును. లేక యవలచే సిద్ధమయిన సత్తుపిండిని అపూప
లనైనను భుజింపవలయును. మరియు ప్రాతవియగు రాజనముల బియ్యముచే సిద్ధ
న యన్నమును, పెసలపప్పు మున్నగువానికట్టుచేతను, చేదుగల ఆకుకూరతోడను
పి భుజించవలయును. అరువదినాళ్ల సంబావుబియ్యపు అన్నమును దంతీతైలము గార
యనూనె అగసినూనె, ఆవనూనె అను నీతైలములతో కలిపి భుజింపవలయును.
ణధాన్యములగు నీవారములు మున్నగువానియన్నమునైనను, పైజెప్పిన తైలములతో
ర్చి భుజింపనగును. ప్రమేహరోగి ఆహారమునకై యవలనే ముఖ్యముగ నుపయో
పవలయును. మరియు యవలచే జేయబడిన పలుదెరంగులైన భక్ష్యములను తేనెలో
రిపి కఫప్రమేహము గలరోగి తినవలయును.

## ప్రమేహహర సంతర్పణములు.

సూ. నిశిస్థితానాం త్రిఫలాకషాయే
స్యుస్తర్పణాః క్షౌద్రయుతా యవానాం,
తాన్శీఘ్రయుక్తాన్ప్రపిబేత్ప్రమేహీ
ప్రాయోగికాన్మేహవధార్థమేవ. 22
యే శ్లేష్మమేహే పిహితాః కషాయాః
తైర్భావితానాం చ పృథగ్యవానామ్,
సక్తూనపూపాన్సగుడాన్సధానా
న్భక్ష్యాంస్తథాన్యాన్వివిధాంశ్చ ఖాదేత్. 23
ఖరాశ్వగోహంసపృషద్భృతానాం (గోధేనుకసంభృతానాం)
తథా యవానాం వివిధాశ్చ భక్ష్యాః,

దేయా స్తథా వేణుయవా యవానాం
కల్పేన గోధూమమయాశ్చ భక్ష్యాః. 24

వ్యా. యవలను త్రిఫలాకషాయమున నొకరాత్రి యూరబెట్టి వానితో సిద్ధము చేయబడిన సత్తుపిండి మున్నగువానిని తేనెతో గలిపి యైనను శీధువను మద్యముతో గూర్చి యైనను సంతర్పణమునకై ప్రమేహరోగి యుపయోగించవలెను. ఇత్తెరంగున కొంతకాల మలవాటుచేసి యుపయోగించినచో మేహము శమించును.

మరియు:—యవలను "హారీతకీకట్ఫల......మధుసంప్రయుక్తాః" అని చెప్ప బడు కఫప్రమేహహరకషాయములయందు వేరువేరుగ భావనజేసి ఆయవలచే సిద్ధము చేయబడిన సత్తుపిండిని, అపూపముల(రొట్టెల)ను, బెల్లముతో గూడి వేపుడుబియ్యమును, ఇతరములగు పలుదెరంగులైన భక్ష్యములను తినవలెను.

మరియు:—గాడిదెలు, గుఱ్ఱములు, ఎద్దులు, హంసలు, పొదలయిఱ్ఱి(ఆవులు) అనునీజంతువులకు యవలను మేతగా బెట్టి యాజంతువులు దానిని తిని పేడవేసినచో అందుండు యవలను గ్రహించి దానిపిండిచే చేయబడిన రొట్టెలు మున్నగు భక్ష్యములను ప్రమేహరోగి యుపయోగింపవలెను. మరియు వెదురుబియ్యమును గోధుమలను కూడ పైని యవలకు జెప్పిన కల్పనాప్రకారము భక్ష్యముల జేసి యుపయోగింపవలెను. (ఇచ్చట "గోధేనుకసంభృతానామ్" అనుపాఠమే సమంజసముగనున్నది).

## ప్రమేహమున సంశోధనాదివిధి.

మూ. సంశోధనోల్లేఖనలఙ్ఘనాని కాలే ప్రయుక్తాని కఫప్రమేహాన్,
జయన్తి; పిత్తప్రభవాన్ విరేకః సంతర్పణస్సంశమనో విధిశ్చ. 25

వ్యా. సంశోధనము (మలాదులనూర్ధ్వాధోమార్గములనుండి వెడలించునవి), ఉల్లే ఖనము (వమనము చేయించునది), లంఘనము, అనునీమూడు తెరంగులైన చికిత్సలను యుక్తకాలమున చేసినచో కఫప్రమేహములను హరించును. విరేచనము, సంతర్పణము, సంశమనము, అనువానిని యుక్తకాలమున చేసినచో పిత్తప్రమేహముల శమింపజేయును. (ఇచ్చట సంశోధనశబ్దముచేతనే వమనముకూడ బోధింపబడినను కఫప్రమేహమున వమన మునకు ప్రాశస్త్యమును జూపుటకై మరల ఉల్లేఖనశబ్దముచే జెప్పబడెను. పిత్తప్రమేహ ములు సామాన్యముగ యాప్యము లైనను పిత్తహరమని యుద్దేశించి "జయన్తి" అని నిర్దేశింపబడినది. లేక "సాధ్యాస్తు మేదో యది న ప్రదుష్టమ్" అనువాక్యముచేత పిత్త ప్రమేహములు కూడ మేదస్సు దుష్టము కానియెడ సాధ్యములగునని చెప్పబడినదికావున అట్టి సాధ్యకోటిలో చేరిన పిత్తప్రమేహముల నుద్దేశించి "జయన్తి" అని చెప్పబడినదని యెరుంగునది.

## ప్రమేహసామాన్యముగ నుపయోగింపదగిన రెండు కషాయయోగములు.

మూ. దార్వీం సురాహ్వాం త్రిఫలాం సముస్తాం
కషాయముత్క్వాథ్య పిబేత్ప్రమేహీ,
క్షౌద్రేణ యుక్తామథవా హరిద్రాం
పిబేద్రసేనామలకీఫలానామ్.                                  26

వ్యా. మ్రానిపసుపు, దేవదారు, త్రిఫలములు, తుంగగడ్డలు, ఈదినుసులను సమభాగముగ గూర్చి విధ్యుక్తప్రకారము కషాయము కాచి అందు తేనె చేర్చి ప్రమేహము కలవారు త్రాగవలెను. లేక మ్రానిపసుపును ఉసిరికకాయలరసమున కలిపియైనను త్రాగవలెను. (ఈరెండు యోగములును ప్రమేహసామాన్యముగ నుపయోగింపదగును.)

## కఫజప్రమేహములకు పదికషాయయోగములు.

మూ. హరీతకీకట్ఫలముస్తలోధ్రం; పాఠావిడంగార్జునధన్వనాశ్చ;
ఉభే హరిద్రే తగరం విడంగం; కదంబసాలార్జునదీప్యకాశ్చ.                                  27
దార్వీ విడంగం ఖదిరో ధవశ్చ సురాహ్వకుష్ఠాగురుచన్దనాని;
దార్వ్యగ్నిమన్థౌ త్రిఫలాసపాఠా; పాఠాచమూర్వాచతథాశ్వదంష్ట్రా.
యవాన్యుశీరాణ్యభయా గుడూచీ; చవ్యాభయాచిత్రకసప్తపర్ణాః,
పాదైః కషాయాః కఫమేహినాన్తే దశోపదిష్టా మధుసంప్రయుక్తాః.

వ్యా. 1. కరక్కాయలు, కాయఫలము, తుంగగడ్డలు, లొద్దుగుపట్ట, వీనికషాయమునైనను; 2. చిరుబొద్ది, వాయువిడంగములు, మద్దిపట్ట, చంద్రచెక్క వీనికషాయమునైనను; 3. పసుపు, మ్రానిపసుపు, గ్రంథితగరము, వాయువిడంగములు, వీనికషాయమునైనను; 4. కడిమిపట్ట, యేపిచెక్క, మద్దిపట్ట, ఓమము, వీనికషాయమునైనను; 5. మ్రానిపసుపు, వాయువిడంగములు, చంద్రచెక్క, వెలిచంద్రచెక్క, వీనికషాయమునైనను; 6. దేవదారుచెక్క, చెంగల్వకోష్టు, అగరు, శ్రీగంధముచెక్క, వీనికషాయమునైనను; 7. పసుపు, కూరనెల్లి, త్రిఫలములు, చిరుబొద్ది, వీనికషాయమునైనను; 8. చిరుబొద్ది, చాగపట్ట, పల్లేరు, వీనికషాయమునైనను; 9. ఓమము, వట్టివేళ్లు, కరక్కాయలు, తిప్పతీగె, వీనికషాయమునైనను; 10. చవ్యము, కరక్కాయలు, చిత్రమూలము, కానుగపట్ట, వీనికషాయమునైనను; (పైజెప్పిన పదివిధములైన కషాయములలో నెద్దానినైనను.) తేనె కలిపి కఫజప్రమేహములయందు త్రాగింపవలయును. (పైశ్లోకములలో

ఒక్కొక్కపాదశ్లోకముచే చెప్పబడిన ద్రవ్యములు ఒక్కొక్కకషాయయోగముగ నుపయోగించినచో పదికషాయయోగము లగునని యెరుంగునది.)

## పిత్తప్రమేహహారకషాయయోగములు.

మూ. ఉశీరలోధ్రాఞ్జన (ర్జున) చందనానాం
ఉశీరముస్తామలకాభయానాం;
పటోలనిమ్బామలకామృతానాం;
ముస్తాభయాపద్మకవృక్షకాణామ్. 30
లోధ్రాంబుకాలీయకధాతకీనాం;నిమ్బార్జునామ్రాతనిశోత్పలానాం;
శిరీషసర్జార్జునకేశరాణాం; ప్రియంగుపద్మోత్పలకింశుకానామ్. 31
అశ్వత్థపాఠా(యాసా)సనవేతసానాం,కటంకటేర్యుత్పలముస్తకానాం;
పైత్తేషుమేహేషుదశప్రదిష్టాః, పాదైఃకషాయామధుసంప్రయుక్తాః.

వ్యా. 1. వట్టివేళ్లు, లొద్దుగుచెక్క, మద్దిపట్ట, శ్రీగంధము,వీనికషాయముసైనను; 2. వట్టివేళ్లు, తుంగగడ్డలు;ఉసిరికకాయవొలుపు, కరక్కాయలు, వీనికషాయముసైనను; 3. చేదుపొట్ల, వేపపట్ట, ఉసిరికకాయలు, తిప్పతీగె, వీనికషాయముసైనను; 4. తుంగగడ్డలు, కరక్కాయలు, పద్మకము, కొండిశపాలగింజలు వీనికషాయముసైనను; 5.లొద్దుగచెక్క, కురువేరు, మ్రానిపసుపు, ఆరెపువ్వు వీనికషాయముసైనను; 6. వేపపట్ట, మద్దిపట్ట, కొండమామిడిపట్ట, పసుపుకలువగడ్డలు, వీనికషాయముసైనను; 7. దిరిసెనపుపట్ట, అందుగుపట్ట, మద్దిపట్ట, నాగకేసరములు వీనికషాయముసైనను;8. ప్రేంకణపుచెక్క,యెఱ్ఱతామర, నల్లకలువదుంప, మోదుగుపూలు వీనికషాయముసైనను; 9. రావిపట్ట, చిరుబొద్ది, వేగిసపట్ట, ప్రబ్బలి వీనికషాయముసైనను; 10. మ్రానిపసుపు, నల్లకలువగడ్డలు, తుంగగడ్డలు వీని కషాయముసైనను; (పైజెప్పబడిన పదికషాయయోగములలో నెద్దానిసైనను) తేనె గూర్చి పిత్తప్రకోపమున గలిగిన ప్రమేహములయందు త్రాగింపనగును. (ఇచ్చట గూడ పైశ్లోకములలో నొక్కొక్కపాదముచే చెప్పబడిన ద్రవ్యములు ఒక్కొక్క కషాయయోగమని యెరుంగునది.)

## కషాయోపయోగవిధియు, వాతానుబంధప్రమేహచికిత్సయు.

మూ. సర్వేషు మేహేషు మతౌ తు పూర్వౌ
కషాయయోనౌ, విహితాస్తు సర్వే,
మన్థస్య పానే యవభావనాయాం
స్యుర్భోజనే పానవిధౌ పృథక్చ. 33

సిద్ధాని తైలాని ఘృతాని చైవ
దేయాని (యోజ్యాని) మేహేష్వనిలాత్మకేషు,
మేదః కఫశ్చైవ కషాయయోగైః
స్నేహైశ్చ వాయుః శమమేతి తేషామ్. 34

వ్యా. పైజెప్పిన కషాయయోగములలో మొదట "దార్వీం సురాహ్వ...... అథ వా హారిద్రాం పిబేద్రసేనామలకీఫలానాం." అని చెప్పబడిన కషాయయోగములు రెండును ప్రమేహములయం దన్నిటియందును నుపయోగింపదగును. కఫపిత్తముల నుద్దేశించి వేరువేరుగ జెప్పబడిన పదేసికషాయయోగములును కఫ పిత్తములకు వేరువేరుగ నుపయోగింపదగును. మరియు నాకషాయయోగములు, మంథపానమునకును, యవలను భావనచేయుటకును, అన్నపానములను సంస్కరించుటకును, వేరువేరుగ కఫపిత్తప్రమేహములకు నుపయోగింపదగును.

మరియు పైజెప్పిన కషాయముల జేర్చి పక్వముజేయబడిన తైలములను, ఘృతములను, వాతమును అనుబంధము గల కఫప్రమేహములయందును, పిత్తప్రమేహముల యందును నుపయోగింపదగును. అట్లు జేసినచో కషాయయోగములచేత కఫమేదస్సులును, స్నేహములచేత వాతంబును శమించును.

(ప్రమేహములు జనించునపుడే వాతమును ప్రధానముగ జేసి జనించిన ప్రమేహములు అసాధ్యములు గాన వానికి ప్రత్యేకచికిత్స లేదు. కావున ఇచ్చట "అనిలాత్మకేషు" అను స్థళమున ఉత్పత్త్యనంతరము వాతము అనుబంధముగా గల కఫపిత్తప్రమేహముల నుద్దేశించి "సిద్ధాని తైలాని" అని తైలఘృతయోగములు చెప్పబడెనని యెరుంగునది.)

## కఫపిత్తప్రమేహములయందు కంపిల్లకాది చూర్ణప్రయోగము.

మూ. కంపిల్లసప్తచ్ఛదశాలజాని వైభీతరౌహీతకకౌటజాని,
కపిత్థపుష్పాణి చ చూర్ణితాని క్షౌద్రేణ లిహ్యాత్కఫపిత్తమేహీ.
పిబేద్రసేనామలకస్య వాపి కల్కీకృతాన్యక్షసమాని కాలే,
జీర్ణే చ భుఞ్జీత పురాణమన్నం మేహీ రసైర్జాంగలజైర్మనోజ్ఞైః 36

వ్యా. కంపిల్లకము, యేడాకులపొన్న,గుగ్గిలము,తాండ్రకాయలు, ములుమోదుగపట్ట, కొడిశపాలవిత్తులు, వెలగపువ్వులు వీని నన్నిటిని సమభాగముగ జేర్చి చూర్ణము

చేసి తేనెలో కలిపి కఫప్రమేహము గలవారును, పిత్తప్రమేహము గలవారును ఉప యోగింపనగును. లేక పైజెప్పిన ద్రవ్యములను కల్కముచేసి ఉసిరికకాయలరసమున అక్ష ప్రమాణమును కలిపి యుక్తమైనకాలమున త్రాగవలయును. ఆయౌషధము జీర్ణమైనపిదప ప్రాతబియ్యపుటన్నమును మనోహరములైన జాంగలజంతువులయొక్క మాంసరసముతో జేర్చి భుజించవలయును.

## ప్రమేహములయందు అనుబంధరూపమైన వాతచికిత్స.

మూ. దృష్ట్వానుబంధం పవనాత్కఫస్య పిత్తస్య వా స్నేహవిధిర్వికల్ప్యః,
తైలం కఫేస్యాత్స్వకషాయసిద్ధంపిత్తేఘృతంపిత్తహరైః కషాయైః

వ్యా. ప్రమేహములయందు వాతమునకు కఫముతోనైనను అనుబంధము కలిగి నపుడు స్నేహకల్పనమును వేర్వేరుగ చేయనగును. అందు కఫప్రమేహము వాత మను బంధముగ నున్నయెడ పైజెప్పబడిన కఫప్రమేహహరద్రవ్యకషాయములగూర్చి సిద్ధము చేయబడిన తైలము నుపయోగింపతగును. పిత్తప్రమేహములయందు వాతము అనుబంధ ముగా నున్నపుడు పిత్తహరద్రవ్యకషాయముతో కూర్చి సిద్ధముచేయబడిన ఘృతమును ప్రయోగింపతగును.

## దోషసంసర్గజప్రమేహమున త్రికంటకాదిస్నేహము.

మూ. త్రికంటకాశ్మంతకసోమవల్కైః భల్లాతకైః సాతివిషైః సలోధ్రైః,
వచాపటోలార్జుననిమ్బముస్తైః హరిద్రయా పద్మకదీప్యకైశ్చ. 38
మంజిష్ఠయా చాగురుచన్దనైశ్చ సర్వైస్సముస్తైః కఫవాతజేషు,
మేహేషు తైలంవిపచేత్,ఘృతంతు పైత్తేషు,మిశ్రం త్రిషులక్షణేషు.

వ్యా. పల్లేరు, పాషాణభేది, (పిండిబొద్దిచెట్టు,) తెల్లచంద్ర, నల్లజీడిగింజలు, అతివస, లొద్దుగు, వస, చేదుపొట్ల, మద్ది, వేపపట్ట, తుంగగడ్డలు, పసుపు, పద్మకము, ఓమము, మంజిష్ఠి, అగరు, చందనము వీనినన్నిటిని కషాయకల్కములచేసి తైలమును విధ్యుక్తప్రకారము పక్వముచేసి కఫవాతములచే కల్గిన ప్రమేహములయందు ఉపయో గింపనగును. మరియు నాద్రవ్యములు గూర్చి సిద్ధముచేయబడిన ఘృతమును పిత్తానుబంధ మైన ప్రమేహములయందు నుపయోగింపనగును. త్రిదోషలక్షణములు గల ప్రమేహ ములయందు ఘృతతైలముల రెంటిని గలిపి పైజెప్పిన ద్రవ్యముల గూర్చి సిద్ధముచేసి యుపయోగించునది.

## త్రిఫలాదికషాయయోగము.

మూ. ఫలత్రికందారునిశాంవిశాలాంముస్తాంచనిఃక్వాథ్యనిశాంసకల్కాం,
పిబేత్కషాయంమధుసంప్రయుక్తంసర్వప్రమేహేషు సముద్ధతేషు.

వ్యా. త్రిఫలములు, మ్రానిపసుపు, పెద్దపాపర, తుంగగడ్డలు, పసుపు వీని నన్నిటిని సమభాగములుగ కూర్చి కషాయము కాచి అందు తేనె చేర్చి మిక్కిలి తీవ్రముగ నుండు ప్రమేహము లన్నిటియందును త్రాగవలయును.

## ప్రమేహహరమధ్వాసవము.

మూ. లోధ్రంశటీంపుష్కరమూలమేలాం మూర్వాం విడంగంత్రిఫలాం
యవానీం, చవ్యం ప్రియంగుం క్రముకం విశాలాం కిరాతతిక్తం
కటురోహిణీం చ. 41

భార్గీనతంచిత్రకపిప్పలీనాం మూలం సకుష్ఠాతివిషం సపాఠం,
కళింగకాన్ కేశరమిన్ద్రసాహ్వాం నఖం సపత్రం మరిచం ప్లవం చ.
ద్రోణేఽంభసః కర్షసమాని పక్త్వా పూతే చతుర్భాగజలావశేషే,
రసేఽర్ధభాగం మధునః ప్రదాయ పక్షం నిధేయో ఘృతభాజనస్తః.
మధ్వాసవోఽయం (లోధ్రాసవోయం) కఫపిత్తమేహాన్ క్షిప్రం
నిహన్యాత్ ద్విపలప్రయోగాత్, పాణ్ద్వామయార్శాంస్యరుచిం
గ్రహణ్యా దోషం కిలాసం వివిధం చ కుష్ఠమ్. 44

(ఇతి మధ్వాసవః.)

వ్యా. లొద్దుగు, కచోరములు, పుష్కరమూలము, ఏలకులు, చాగపట్ట, వాయువిడంగములు, త్రిఫలములు, ఓమము, చవ్యము, ప్రేంకణము, పోకచెక్కలు, పెద్దపాపర, నేలవేము, కటుకరోహిణి, బారంగి, గ్రంథితగరము, చిత్రమూలమువేరు, పిప్పలీమూలము, (మోడి) చెంగల్వకోష్ఠు, అతివస, చిరుబొద్ది, కొడిశపాలవిత్తులు, నాగకేసరములు, పాపరబోడమ, నఖముచిప్పలు, లవంగపత్రి, మిరియాలు, తుంగగడ్డలు వీని నన్నిటిని ఒకొక్కకర్షప్రమాణముపంతున చేర్చి ద్రోణపరిమితమైన (256) పలములపరిమితియైన) నీళ్లలోచేర్చి, నాల్గవవంతు (ఒకఆఢకము)మిగులునట్లు చుండకషాయముకాచి పడగట్టి యాకషాయమునకు అర్ధభాగము తేనె కలిపి నేతితో మాగిన యొకకుండలో పోసి వానెకట్టి (15) పదునైదుదినములవరకు భూస్థాపితముచేసి యుంచునది. ఇయ్యది

మధ్వాసవమనబడును. దీనిని పూటకు రెండుపలములవంతున సేవించినచో కఫములను, పిత్తమేహములను హరించును. మరియు దీనిని సేవించుటవలన పాండురోగములు, అర్శో రోగములు, అరోచకము, గ్రహణీరోగము, పొడలు, పలుతెరంగులైన కుష్ఠములు, ఇవి యన్నియు శీఘ్రముగ హరించును.

### ప్రకారాంతరముగ మధ్వాసవకల్పనము.

మూ. క్వాథః సఏవాఽష్టపలేచదన్త్యాభల్లాతకానాంచచతుష్పలంస్యాత్,
సితోపలా త్వష్టపలావిశేషః క్షౌద్రంచ తావత్పృథగాసవౌ తౌ.

వ్యా. పైయోగమున చెప్పబడిన లొద్దుగు మున్నగు ద్రవ్యములను కర్ష ప్రమాణమువంతున జేర్చి (8) ఎనిమిదిపలములు దంతివేళ్లను కూడ కలిపి ద్రోణపరిమితజలమును పోసి పైజెప్పిన రీతిగ నాల్గవవంతు మిగులునట్లు (8) ఎనిమిదిపలములు శినాకల్కండను, (8 ఎనిమిదిపలముల తేనెను, కలిపి పైజెప్పినరీతిగ నుంచినచో నిది యొక యాసవయోగము. ఆదంతీకషాయయోగముననే (4) నాలుగుపలములు జీడిగింజముక్కలను వైచి శినాకల్కండను, తేనెను, (8) ఎనిమిదేసిపలములవంతున చేర్చి యుంచినచో నిదియు రెండవ ఆసవయోగము అగును. ఈరెండు ఆసవములును పైజెప్పిన మధ్వాసవము వలెనే ప్రమేహముల నన్నిటిని నిర్మూలముచేయ సమర్థములగును.

### ప్రమేహరోగికి పానీయములు.

మూ. సారోదకం వాథ కుశోదకం వా మధూదకం వా త్రిఫలారసం వా,
శీధుంపిబేద్వానిగదం ప్రమేహీ మాధ్వీకమగ్ర్యం చిరసంస్థితం వా.

వ్యా. (చంద్ర ఏపె మున్నగు సార(చేవ)ప్రధానవృక్షములసారము (చేవ)ను చేర్చి జలపాకవిధిగ పక్వము చేయబడిన జలము సారోదకము.) అట్టి సారోదకంబును, కుశోదకంబును (కుశదర్భలను చేర్చి కాచబడిన జలము), తేనెను జేర్చి తీపి కల్గింపబడిన జలంబును, త్రిఫలముల జేర్చి కాచబడినజలంబును, శీధుమద్యంబును, మాధ్వీకమనెడు ప్రాతమద్యంబును, ఈపానీయములు ప్రమేహరోగము కలమనుజునకు పానార్హములు.

### సంతర్పణముచే గల్గిన ప్రమేహములకు శమనోపాయములు.

మూ. మాంసాని శూల్యాని మృగద్విజానాం ఖాదేద్యవానాం వివి
ధాంశ్చ భక్ష్యాన్, సంశోధనాఽరిష్టకషాయలేహైః సన్తర్పణో
త్థాన్ శమయేత్ప్రమేహాన్.

వ్యా. జాంగలప్రదేశమునందలి మృగములయొక్కయు పక్షులయొక్కయు మాంసములను శూలముల గ్రుచ్చి నిప్పున కాల్చి యామాంసమును యవలచే సిద్ధము చేయబడిన భక్ష్యములను ప్రమేహరోగి తినవలెను.

మరియు సంతర్పణముచే కల్గిన ప్రమేహములను సంశోధనములచేతను అరిష్ట-కషాయ-లేహముల ప్రయోగించుటచేతను శమింపజేయవలెను.

ప్రమేహములు జనింపకుండు నుపాయములు.

మూ. భృష్టాన్ యవాన్ భక్షయతః ప్రయోగాత్, శుష్కాంశ్చ సక్తూన్న భవన్తి మేహాః, శ్విత్రం చ కృచ్ఛ్రం కఫజం చ కుష్ఠం, తథైవ ముద్గామలకప్రయోగాత్. 48

వ్యా. యవలచే సిద్ధము చేయబడిన వేపుడుబియ్యమునైనను, అటుకులనైనను, బొరుగులనైనను సత్తుపిండినైనను నిరంతరముగ నలవాటు చేసి తినుచుండిన ప్రమేహములు సంభవింపవు. మరియు పెసలను ఉసిరికకాయలను ప్రతిదినము తినుచుండిన ప్రమేహంబును శ్విత్రంబును మూత్రకృచ్ఛ్రంబును కఫముచే గల్గిన కుష్ఠంబును సంభవింపదు.

కఫ-పిత్తప్రమేహములయందు విరూక్షణచికిత్స.

మూ. సన్తర్పణోత్థేషు గదేషు యోగాః, మేదస్వినాం యే చ మయోపదిష్టాః, విరూక్షణార్థం కఫపిత్తజేషు, సిద్ధాః ప్రమేహేష్వపి తే ప్రయోజ్యాః. 49

వ్యా. మేదస్సు వృద్ధినొందియుండువారలకు సంతర్పణాధిక్యముచే గల్గు రోగములు హరించుటకై సూత్రస్థానమున నుపదేశింపబడిన సిద్ధయోగము లన్నియు కఫపిత్తములచే గల్గు ప్రమేహములయందును విరూక్షణమునకై యుపయోగింపదగును. (ఇచ్చట సూత్రస్థానమున నిరువదిమూడవ యధ్యాయమున "త్రిఫలారగ్వధాం పాఠాం సప్తపర్ణీం...సన్తర్పణకృతైః దోషైః స్థౌల్యం ముక్త్వా విముచ్యతే." (సూ. అ. ౨౩. శ్లో ౧౦-౨౫) అను గ్రంథముచే జెప్పబడిన సిద్ధయోగముల గ్రహించునది.)

ప్రమేహహర వ్యాయామాద్యుపచారములు.

మూ. వ్యాయామయోగైః వివిధైః ప్రగాఢైః, ఉద్వర్తనైః స్నానజలావసేకైః, సేవ్యత్వగేలాఽగురుచన్దనాద్యైః, విలేపనైశ్చాశు న సన్తి మేహాః. 50

వ్యా. శరీరమునకు చక్కగ శ్రమమును కల్గించు పలువిధంగులైన వ్యాయామములచేతను, శరీరమును నలుగుపిండి మున్నగువానిచే చక్కగ నలుగుపెట్టి రుద్దుటచేతను, స్నానముచేతను, నీళ్లను కాచి శరీరముపై పోయుటచేతను, వట్టివేరు, దాల్చినిచెక్క, ఏలకులు, అగరు, శ్రీగంధము, ఇవి మున్నగువానిని శరీరమునకు బూసికొనుటచేతను ప్రమేహములు శీఘ్రముగ శమించును.

ప్రమేహములయం దపతర్పణవిధానము.

మూ. క్లేదశ్చ మేదశ్చ కఫశ్చ వృద్ధః ప్రమేహహేతుః ప్రసమీక్ష్య తస్మాత్, వైద్యేన పూర్వం కఫపిత్తజేషు మేహేషు కార్యాణ్యపతర్పణాని. 51

వ్యా. శరీరమునందలి క్లేదము (త్వఙ్మాంసములకు నడుమ నుండునీరు), మేదస్సు, కఫము, ఈమూడును వృద్ధినొందుట ప్రమేహములు జనించుటకు కారణమగును. కావున వైద్యుడు అట్టి కారణమును గమనించి కఫపిత్తప్రమేహములయందు అట్టిక్లేద-మేదః-కఫములు వృద్ధినొందక యుండుటకై యపతర్పణముల తొలుత జేయవలెను.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—"గుల్మః క్షయో మేహనవస్తిశూలం...... తస్మాత్ప్రసమీక్ష్య వహ్నిమ్." (౧౭-శ్లో) అను శ్లోకముచే ప్రమేహమున నపతర్పణము చేసినచో గుల్మాదిరోగములు సంభవించుననియు, దానం జేసి సంశమనమే చేయదగునుగాని యపతర్పణము జేయంజనదనియు చెప్పబడినది. అయినను క్లేదాదులు మిక్కిలి వృద్ధి నొందినపుడు ప్రమేహసంప్రాప్తి పూర్ణము కాకముందుగనే గుల్మాదులు కలుగ నవకాశ మొసంగక యుక్తియుక్తముగ నపతర్పణము చేయవలెనని ప్రకృతమూలమునకు భావము.

వాతోల్బణప్రమేహచికిత్స.

మూ. యా వాతమేహాన్ ప్రతి పూర్వముక్తా, వాతోల్బణానాం విహితా క్రియా సా, వాయుర్హి మేహేష్వతికర్శితానాం కుప్యత్యసాధ్యాన్ ప్రతి నాస్తి చిన్తా. 52

వ్యా. పైని చెప్పబడిన చికిత్సాక్రమమున వాతమేహముల నుద్దేశించి "సిద్ధాని తైలాని ఘృతాని చైవ దేయాని మేహేష్వనిలాత్మకేషు, మేహాః కఫశ్చైవ......శమమేతి తేషామ్."(శ్లో. ౩౮.)అనుశ్లోకముచే చికిత్స చెప్పబడినది. ఆచికిత్స అపతర్పణముచే మిక్కిలి కృశించినవారికి కల్గిన కఫపిత్తప్రమేహములయందును వాత ముత్కటముగ ప్రకోపము నొందియుండునుకావున అట్టివాతము శమించుటకై యుపయోగింపవలెను; కేవలము వాతప్రకోపముచేతనే కల్గిన ప్రమేహములు వ్యాధిస్వభావమునం జేసి యసాధ్య

ములు కావున వానికై ప్రత్యేక చికిత్స చెప్పనవసరమే యుండదు. (కావున వాతోల్బణములైన కఫపిత్తప్రమేహములయందు వాతశమనమునకై 'సిద్ధాని తైలాని' అని చెప్పిన సిద్ధక్రియల నుపయోగింపవలెనని భావము.)

### నిదానపరివర్జనము.

మూ. యైర్హేతుభిర్యే ప్రభవన్తి మేహాః తేషు ప్రమేహేషు న తే నిషేవ్యాః, హేతోరసేవా విహితా యథైవ జాతస్య రోగస్య భవేచ్చికిత్సా. 53

వ్యా. ప్రమేహనిదానమున నేయే ప్రమేహములు జనించుటకు ఏయేకారణములు చెప్పబడినవో ఆయాప్రమేహములయందు ఆయాకారణముల విసర్జించుట ఆయాప్రమేహములకు ముఖ్యమైన చికిత్సయగు. ("సంక్షేపతః క్రియాయోగో నిదానపరివర్జనమ్" అను సామాన్యవిధిచేతనే నిదానవర్జనము నిర్ణీతమైనను ప్రమేహములలో నిదానవర్జనమునకు ప్రాముఖ్యమును దెలుపుటకై యిచ్చట మరల చెప్పబడినదని యెరుంగునది.)

### ప్రమేహ-రక్తపిత్తముల పరస్పరభేదము.

మూ. హారిద్రవర్ణం రుధిరం చ మూత్రం వినా ప్రమేహస్య హి పూర్వరూపైః, యో మూత్రయేత్తం న వదేత్ప్రమేహం రక్తస్య పిత్తస్య హి స ప్రకోపః. 54

వ్యా. ప్రమేహమునకు జెప్పిన రూపములు కనుపించక మూత్రము మాత్రము పసుపురంగును రక్తవర్ణంబును కల్గి వెడలుచున్నయెడ నయ్యది రక్తపిత్తప్రకోపమగును కాని ప్రమేహము కానేరదు. (అట్టియెడ ప్రమేహమని భ్రమసి ప్రమేహచికిత్సితము జేయం జనదని తెలియుటకై యిచ్చట నీరెంటికిని భేదము చెప్పబడినది.)

### మధుమేహవిశేషనిర్ణయము.

మూ. దృష్ట్వా ప్రమేహం మధురం సపిచ్ఛం మధూపమం స్యాత్ ద్వివిధో విచారః, క్షీణేషు దోషేష్వనిలాత్మకస్స్యాత్ సన్తర్పణాద్వా కఫసమ్భవస్స్యాత్. 55

వ్యా. ప్రమేహమునందు మధురంబును పిచ్ఛిలంబును తేనెతో సమానమైన వర్ణంబును కల్గిన మూత్రము వెడలుచుండ నియ్యది వాతముచే గల్గినదియా? లేక కఫసంభవమా? యని రెండువిధములుగ విచారించవలసి యుండును. అట్టియెడ కఫము

మేదస్సు మున్నగు దోషదూష్యములు క్షీణించి యుండునపుడు వాతప్రకోపమున జనించిన మధుమేహమని నిశ్చయించి దానికి దగిన చికిత్స జేయందగును. (వాతము వృద్ధినొంది యున్నపుడు కఫపిత్తముల వృద్ధినొందించుకారణములు లేమింజేసి కఫంబును దానికి సంబంధించిన మేదస్సు మున్నగునవియు క్షీణించును. అట్టి పరిస్థితియందు వాతికమని నిర్ణయించి తదనుగుణమైన చికిత్స జేయవలెనని భావము).

మరియు:—సంతర్పణముచేత కఫము వృద్ధినొంది యున్నదని తెలిసినయెడ నయ్యది కఫసంభవమనియు, వాతవర్ధకమగు కారణము లేమింజేసి వాతికము కాదనియు నిర్ణయించి తదనుసారముగ చికిత్స జేయనగును. (అపతర్పణముచే వాతము ప్రకోపించును గాని సంతర్పణముచే వృద్ధినొందదు. కావున సంతర్పణమున కఫము ప్రకోపించునెడ ఇయ్యది కఫప్రకోపజనితమని నిర్ణయింప నగునని భావము.)

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—మధుమేహమునందు మధురపిచ్ఛిలాదిలక్షణములబట్టి వాతిక-శ్లైష్మికసందేహము కల్గిననాడు "గూఢలింగం వ్యాధిం ఉపశయానుపశయాభ్యాం పరీక్షేత" అను న్యాయము ననుసరించి హేత్వాదివిపరీతచికిత్సచే పరీక్షించవలసియుండును. కావున వాతహారములగు నుపచారముల జేసినపుడు కఫపిత్తములును మేదస్సు మున్నగునవియు క్షీణించునెడ నియ్యది వాతికమనియు, కఫమును వృద్ధినొందించు సంతర్పణము చేసినపుడు కఫము వృద్ధినొందునెడ నియ్యది కఫజనితమనియు నిర్ణయించవలెనని ముఖ్యభావము. అట్లు నిర్ణయించి తదనుసారముగ చికిత్స జేయవలెను.

### అవస్థాభేదముచే ప్రమేహసాధ్యాసాధ్యనిర్ణయము.

మూ. సపూర్వరూపాః కఫపిత్తమేహాః క్రమేణ యే వాతకృతాశ్చ మేహాః,
సాధ్యాః న తే; పిత్తకృతాస్తు యాప్యాః సాధ్యాస్తు మేదో
యది న ప్రదుష్టమ్. 56

వ్యా. (సామాన్యముగ కఫప్రమేహములు సాధ్యములనియు, పిత్తప్రమేహములు యాప్యము లనియు, వాతికప్రమేహములు ప్రత్యాఖ్యేయములనియు "సాధ్యాః కఫోత్థాః దశ; పిత్తజాః షట్ యాప్యాః; న సాధ్యాః పవనాచ్చతుష్కాః." (శ్లో. ౭) అనుశ్లోకముచే పైని చెప్పబడినది. అందు అవస్థాభేదమునుబట్టి కల్గు సాధ్యాదిభేదముల మార్పు పైశ్లోకముచే వివరింపబడినది.)

"స్వేదోఽఙ్గగంధః......భవిష్యతో మేహగదస్య రూపం......పిపీలికాశ్చ" (శ్లో. ౧౩-౧౮) అనువాక్యముచే ప్రమేహసామాన్యముగ పూర్వరూపములు నిర్దేశింపబడినవి; సాధ్యములని చెప్పబడిన కఫజప్రమేహములును జనించిన పిదప పైజెప్పిన

స్వేదాదిపూర్వరూపములు అనువర్తించి ప్రమేహములతో కూడ వ్యాపించి యున్నచో నయ్యవి యసాధ్యములగును. మరియు యాప్యములని నిర్దేశింపబడిన పైత్తికప్రమేహములు పైజెప్పిన పూర్వరూపములతో గూడి యుండునెడ నవియు నసాధ్యములు (ప్రత్యాఖ్యేయములు) అగును.

మరియు నిదానక్రమమున "రూక్షకటుకషాయ......వాయుః ప్రకోపమాపద్యతే" (నిదాన-అ. ౪. సూ. ౩౬) అని చెప్పబడిన కారణములచే ప్రకుపితమై వాతమువలన సంప్రాప్తములగు మేహములును సాధ్యములు కానేరవు. వాతము స్వకారణములచే ప్రకోపమునొంది ప్రమేహప్రారంభకారణము గాక కఫపిత్తప్రమేహములు జనించిన పిదప వాని కనుబంధముగ వాతము సంబంధించి యున్నయెడ అట్టి వాతానుబంధప్రమేహములు సాధ్యములుగనైనను, లేక యాప్యములుగనైన నగుననియు, వాతము స్వతంత్రముగ స్వనిదానముచే ప్రకోపింపబడి క్రమముగ నారంభింపబడిన వాతికప్రమేహములు అసాధ్యము లగుననియు భావము.)

మరియు స్వేదాదిపూర్వరూపానుబంధము లేక యాప్యావస్థ నున్న పైత్తిక ప్రమేహములును మేదస్సు మిక్కిలి కాక యున్నయెడ అట్టి పైత్తికప్రమేహములు సాధ్యములగును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది—ఇంద్రియస్థానమున "అన్యస్యాపి చ రోగస్య పూర్వరూపాణి యన్నరమ్, విశన్త్యనేన కల్పేన తస్యాపి మరణం ధ్రువమ్" (ఇంద్రియ అ. ౫.) అని చెప్పబడినది. ఈవాక్యముచేత ఏరోగమునందైనను పూర్వరూపములు అనుసరించి అనుస్యూతములుగ నున్నచో నయ్యది యసాధ్యమని రోగసామాన్యముగ తెలియుచున్నది. అట్లుండ నిచ్చట మరల విశేషముగ చెప్పుటవలన నీనిర్ణయము నెరుంగదగును. పూర్వరూపము లన్నియు ననుసరించి యుండువ్యాధులు అసాధ్యములని అరిష్ట లక్షణముగ నింద్రియస్థానమున చెప్పబడినది. ఇచ్చట స్వేదాదిపూర్వరూపములలో కొన్ని యనుసరించి యున్నను నసాధ్యము లగునని ప్రమేహముల నుద్దేశించి చెప్పబడినదని యెరుంగునది.

ఇందు ఫలితార్థము:—కఫప్రమేహము సాధ్యములుగ సామాన్యముగ నున్నను, అయ్యవి స్వేదము అంగసాదము మున్నగు పూర్వరూపములతో గూడ మిశ్రములై బాధించుచున్న నసాధ్యములగును. యాప్యములుగ జెప్పబడిన పైత్తికప్రమేహములు స్వేదాదిపూర్వరూపములతో గూడి యున్నయెడ నవియు నసాధ్యములగును. వాతము స్వకారణములచే ప్రకోపమునంది ప్రమేహమునకు ప్రధానకారణమై యున్నపుడు

దాన సంభవించిన వాతికప్రమేహములు అసాధ్యములు. అటుగాక పైత్తికశ్లైష్మికప్రమేహములకు వాతమనుబంధముగ నున్నపుడు అట్టిప్రమేహములు సాధ్యములును, లేక యాప్యములు నగును. వాని నుద్దేశించియే "సిద్ధాని తైలాని ఘృతాని చైవ దేయాని మేహేష్వనిలాత్మకేషు" అని చికిత్స విధింపబడినది. పూర్వరూపానుబంధము లేక సామాన్యముగ యాప్యములగు పైత్తికప్రమేహములు మేదస్సు దుష్టము కాకుండునెడ నవియు సాధ్యములగును.

ప్రమేహములకు బీజదోషముచే నసాధ్యత్వము.

మూ. జాతః ప్రమేహీ మధుమేహినో వా న సాధ్య ఉక్తః స హి బీజదోషాత్, యే చాపి కేచిత్ కులజా వికారాః భవన్తి తాంశ్చ ప్రవదన్త్యసాధ్యాన్. 57

వ్యా. ప్రమేహరోగము కలవానికైనను మధుమేహరోగము కలవానికైనను పుట్టినవారికిని ప్రమేహములు సంభవించినచో నయ్యది వానిపుట్టుకకు కారణమైన తండ్రియొక్క బీజమునకు సంబంధించిన దోషమునం జేసి యసాధ్యమగును. మరియు ప్రమేహములే కాక యితరములగు వ్యాధు లేవ్వైయైనను తండ్రితాతల కులక్రమముగ సంభవించుచున్నచో నవి యన్నియు బీజదోషమునం జేసి యసాధ్యములే యగును.

ప్రమేహపిటికాచికిత్సాసూచన.

మూ. ప్రమేహిణాం యాః పిడకా మయోక్తాః రోగాధికారే పృథగేవ తాశ్శల్యవిద్భిః కుశలైశ్చికిత్స్యాః శస్త్రేణ సంశోధనరోపణైశ్చ. [సప్త

వ్యా. కియంతశిరసీయాధ్యాయమున ప్రమేహరోగులకు సంభవించు ప్రమేహపిటికలు ఏడువిధములుగ జెప్పబడినవి; అయ్యవి కేవలము శస్త్రైకసాధ్యములు కావున శల్యతంత్రకుశలులగు వైద్యవరులచే చికిత్స జేయ దగియుండును. కావున చ్ఛేదనభేదనాది శస్త్రకర్మలచేతను, శోధనములచేతను, రోపణములచేతను చికిత్స జేయనగును. (కాయచికిత్సాప్రధానమగు నీతంత్రమున తచ్చికిత్సావిధానము దెలుపుట యప్రస్తుతమని వివరింపబడదయ్యె.)

అధ్యాయవిషయసంగ్రహము.

మూ. భవన్తి చాత్ర:—

హేతుర్దోషో దూష్యం మేహానాం సాధ్యతానురూపశ్చ,
మేహీ ద్వివిధస్త్రివిధం భిషగ్జితమతిశుపణదోషః. 59

ఆద్యాః యవాన్నవికృతిః మన్థా మేహాపహాః కషాయాశ్చ,
తైలఘృతలేహయోగాః భక్ష్యాః ప్రవరాసవాస్సిద్ధాః. 60
వ్యాయామవిధిర్వివిధః స్నానాన్యుద్వర్తనాని గన్ధాశ్చ,
మేహానాం ప్రశమార్థం చికిత్సితే దిష్టమేతావత్. 61

వ్యా. ప్రమేహములకు సంబంధించిన కారణములు దోషములు, దూష్యములు, వానిసాధ్యాసాధ్యత్వములు, పూర్వరూపములు, స్థూలకృశభేదములచే ప్రమేహరోగి ద్వివిధభేదములు, సంశోధన-సంశమన-నిదానపరివర్జనరూపత్రివిధచికిత్సాభేదములు, వాని లక్షణములు,భక్షణార్హములగు భక్ష్యాదులు, యవాన్నభేదములు, యవలను సంస్కారాదులచే జేయదగిన మంథములు మున్నగునవి, ప్రమేహహరకషాయములు, తైలఘృతయోగములు, లేహయోగములు, భక్ష్యభేదములు, ఆసవములు, సిద్ధయోగములు, పలుదెరంగులైన వ్యాయామములు, స్నానములు, ఉద్వర్తనములు, గంధాద్యనులేపములు, ఇవి యన్నియు ప్రమేహశమనమునకై యీ ప్రమేహచికిత్సితమనునధ్యాయమున నగ్నివేశులచే వివరింపబడినవి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, చికిత్సితస్థానే
ప్రమేహచికిత్సితం నామ షష్ఠోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి చికిత్సాస్థానమున ప్రమేహచికిత్సితమనునది షష్ఠాధ్యాయము సమాప్తము.

---

## సప్తమాధ్యాయము.

అవతరణిక.—ప్రాథమికోత్పత్తిక్రమమున "హవిష్ప్రాశాన్మేహకుష్ఠానాం" (ని. అ. ౮-సూ-౧౫) అని ప్రమేహానంతరము కుష్ఠము నిర్దేశింపబడినది. కావున ఆయుత్పత్తిక్రమము ననుసరించి ప్రమేహచికిత్సితమును జెప్పినపిదప కుష్ఠచికిత్సితము చెప్పబడును.—

మూ. అథాతః కుష్ఠచికిత్సితం వ్యాఖ్యాస్యామః. 1
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. 2

వ్యా. ప్రాథమికోత్పత్తిక్రమము ననుసరించి ప్రమేహచికిత్సితమును జెప్పినపిదప కుష్ఠచికిత్సితము ఆత్రేయు లుపదేశించినదానికన్న న్యూనాతిరేకము గాకుండ వివరింపబడునని యర్థము.

## కుష్ఠములకు చేరిన హేత్వాదినిర్దేశము.

మూ. హేతుం ద్రవ్యం లిఙ్గం కుష్ఠానామాశ్రయం ప్రశమనం చ,
శ్రుణ్వాగ్నివేశ సమ్యక్ విశేషతః స్పర్శనఘ్నానామ్. 3

వ్యా. స్పర్శనేంద్రియమును బొత్తుగ చెరచునట్టి స్వభావముకల పదునెనిమిది కుష్ఠములకు సంబంధించిన ఉత్పత్తి కారణములను, (సంప్రాప్తిని), కుష్ఠముల కల్గించు దోషదూష్యరూపద్రవ్యములను, వానిలక్షణములను, (పూర్వరూపములను), కుష్ఠములు జనించుట కధిష్ఠానములను, వానిని శమింపజేయు నుపాయములను, చక్కగ వివరించి చెప్పెద వినుమని యగ్నివేశునితో నాత్రేయు లిట్లు వానినెల్ల వివరింపదొడంగెను.

ఇచ్చట "ప్రశమనం చ" అను చకారమువలన అనుక్తములగు పూర్వరూపంబును సంప్రాప్తియు సంగ్రహింపబడును. హేతులింగాదులు నిదానస్థానమున చెప్పబడినను ఇచ్చట చికిత్సాసౌలభ్యముగ స్ఫురించుటకై వాని విశేషములు కొన్ని సూచింపబడును. వ్యంగము మున్నగు కుష్ఠములును స్పర్శమును చెరచునవి యైనను అందు విశేషముగ స్పర్శమును జెరచునట్టి యష్టాదశమహాకుష్ఠములు వివరింపబడునని "విశేషతః స్పర్శనఘ్నానామ్" అనువాక్యముచే సూచింపబడినది.

## కుష్ఠములు జనించుటకు కారణములు.

మూ. విరోధీన్యన్నపానాని ద్రవస్నిగ్ధగురూణి చ,
భజతామ్, ఆగతాంచ్ఛర్దిం వేగాంశ్చాన్యాన్ ప్రతిఘ్నతామ్. 4
వ్యాయామమతిసన్తాపం అతిభుక్త్వోపసేవినాం,
శీతోష్ణలఙ్ఘనాహారాన్ క్రమం ముక్త్వానిషేవిణామ్. 5
ఘర్మశ్రమభయార్తానాం ద్రుతం శీతామ్బుసేవినాం,
అజీర్ణాధ్యశినాం చైవ పఞ్చకర్మాపచారిణామ్. 6
నవాన్నదధిమత్స్యాఽతిలవణామ్లనిషేవిణాం,
మాషమూలకపిష్టాన్నతిలక్షీరగుడాశినామ్. 7
వ్యవాయం చాప్యజీర్ణేఽన్నే నిద్రాం చ భజతాం దివా,
విప్రాన్ గురూన్ ధర్షయతాం పాపం కర్మ చ కుర్వతామ్. 8

వ్యా. ఆత్రేయభద్రకాప్యయాధ్యాయమున "న మత్స్యాన్ పయసా సహాఽభ్యవహరేత్" అని యుపక్రమించి "తదేవం విధమన్నం స్యాత్ విరుద్ధముపయోజితమ్" (సూత్రస్థానము. అ. ౨౬. శ్లో. ౧౧౨-౧౧౦) అనుగ్రంథముచే నిర్దేశింపబడినగుణ-సం

యోగ-సంస్కారాదులచే విరుద్ధములగు నన్నపానముల సేవించుట, ద్రవంబులును స్నిగ్ధంబులును గురుత్వవిశిష్టంబులు నగుద్రవ్యముల విశేషముగ సేవించుట, వాంతిరానున్నపుడు దానిని రానీయక నిరోధించుట, మలమూత్రాదివేగముల నిరోధించుట, మిక్కుటముగ భుజించి దేహమునకు శ్రమమును పుట్టించుపనుల చేయుట, మిక్కుటముగ భుజించి సంతాపకరమగు పనులచేయుట, శీతమును ఉష్ణమును లంకణమును ఆహారమును వానివిధి ననుసరింపక క్రమము తప్పి సేవించుట (శీతోపయోగమునకు ఉష్ణోపయోగము, లంకణమును చేయవలసినపుడు ఆహారమును భుజించుట, ఇత్తెరంగున క్రమముతప్పి శీతోష్ణాదుల సేవించుట యని యర్థము), ఎండచేతనైనను శ్రమముచే నైనను భయముచే నైనను పీడితులై కొంతసేపైనను విశ్రమించక వెంటనే చల్లనినీళ్లలో మునుగుట, జీర్ణములు కాని పదార్థముల భుజించుట, భుజింపబడిన యాహారము జీర్ణము కాక మునుపే మరల భుజించుట, వమనవిరేచనాది పంచకర్మములను విధ్యుక్తమునకు వ్యత్యస్తముగ నాచరించుట, లేక పంచకర్మలయందు అపథ్యముల నాచరించుట, క్రొత్తబియ్యపు అన్నము నైనను పెరుగునైనను మత్స్యములనైనను తినుట, ఉప్పును పులుపును విశేషముగ సేవించుట, ఉద్దిపప్పును ముల్లంగిని పిండివంటకమును నువ్వులను పాలను బెల్లమును మితిమీరి తినుట, భుజింపబడినయాహారము జీర్ణము కాకుండునపుడు సంభోగించుట, లేక పగటి పూట నిదురించుట, బ్రాహ్మణులను గురువులను ధిక్కరించి తిరస్కారపూర్వకముగ నిందావాక్యముల దూలనాడుట, ఇతరములగు పాపకృత్యముల నాచరించుట, ఇట్టి కారణములచే కుష్ఠములు సంభవించును.

## కుష్ఠములకు దోషదూష్యసంగ్రహము.

మూ. వాతాదయస్త్రయో దుష్టాః త్వగ్రక్తం మాంసమమ్బు చ,
దూషయన్తి సకుష్ఠానాం సప్తకో ద్రవ్యసఙ్గ్రహః. 9
అతః కుష్ఠాని జాయన్తే సప్త చైకాదశైవ చ,
న చైకదోషజం కిఞ్చిత్ కుష్ఠం సముపలభ్యతే. 10

వ్యా. వాతపిత్తకఫములు మూడును పైజెప్పిన కారణములచేతను నిదానస్థానమున నైదవయధ్యాయమున జెప్పిన హేతువులచేతను ప్రకోపమునొంది శరీరమునందలి త్వక్కు, రక్తము, మాంసము, లసీక, అనుధాతువులను చెరచును. వాతాదిదోషములు మూడును త్వగాదిధాతువులు (దూష్యములు)ను జేరి యేడును కుష్ఠముల నారంభించు ద్రవ్యములు (కారణములు) అగును. ఇది కుష్ఠోత్పాదకద్రవ్యసంగ్రహము. అట్టి దోష దూష్యములవలన కపాలకుష్ఠాది మహాకుష్ఠము లేడును, ఏకకుష్ఠాది క్షుద్రకుష్ఠములు పదు

నొకండును జనించును. కుష్ఠము లన్నియును త్రిదోషములు ప్రకోపించుటచే కల్గును కాని ఒకటియైనను ఒకదోషముచేతనే కల్గదు.

ఇచ్చట "వాతాదయః" అనుటచేతనే మూడుదోషములని యర్థమగుచున్నను, మరల "త్రయః" అని నిర్దేశించుటచేత కుష్ఠములయందు మూడు దోషములును ప్రకోపమునొందునని యర్థమగును. నిర్దేశముచేతనే దోషదూష్యములేదు అని యర్థమగుచున్నను కుష్ఠము లన్నిటియందును దోషదూష్యము లీయేడును ఉత్పాదకములని తెలియనగు. క్షుద్రకుష్ఠములు నిదానస్థానమున చెప్పకున్నను చికిత్స దెలుపుటకై యిచ్చట వివరింపబడినవి.

### కుష్ఠపూర్వరూపములు.

మూ. స్పర్శాజ్ఞత్వమతిస్వేదః, న వా, వైవర్ణ్య, మున్నతిః,
కోఠానాం లోమహర్షశ్చ కణ్డూస్తోదః శ్రమః క్లమః, 11
ప్రణానామధికం శూలం శీఘ్రోత్పత్తిశ్చిరస్థితిః,
దాహస్సుప్తాఙ్గతా చేతి కుష్ఠలక్షణమగ్రజమ్. 12

వ్యా. శరీరముపై స్పర్శము తెలియకుండుట, చెమట అధికముగ బట్టుట లేక బొత్తుగ చెమట బట్టకుండుట; శరీరము వర్ణము మారియుండుట, దద్దులున్నతములై జనించుట, రోమహర్షము, దురద, సూదుల గ్రుచ్చినవిధముగ సురసురమని యుండుట, శ్రమము, బడలిక, వ్రణములలో పోటు అధికముగ నుండును. వ్రణములు శీఘ్రముగనే బొడమి చాలకాలము మానకుండుట, మంట పుట్టుట, శరీరము మొద్దుబారియుండుట, ఇవి యన్నియు కుష్ఠములు కల్గుటకు మున్ను సంభవించు పూర్వరూపములు.

### అష్టాదశకుష్ఠనామనిర్దేశము.

మూ. అత ఊర్ధ్వమష్టాదశానాం కుష్ఠానాం కపాలోదుమ్బర మణ్డల ఋశ్యజిహ్వా పుణ్డరీక సిధ్మ కాకణకైకకుష్ఠ చర్మాఖ్య కిటిభావిపాదికాऽలసక దద్రుచర్మదళపామావిస్ఫోటక శతారుర్విచర్చికానాం లక్షణాన్యుపదేక్ష్యామః. 13

వ్యా. కపాలకుష్ఠము, ఉదుంబరకుష్ఠము, మండలకుష్ఠము, ఋశ్యజిహ్వాకుష్ఠము, పుండరీకకుష్ఠము, సిధ్మకుష్ఠము, కాకణ(కాకణంతిక)కుష్ఠము, (ఈయేడును మహాకుష్ఠములు) ఏకకుష్ఠము, చర్మకుష్ఠము, కిటిభ(మ)కుష్ఠము, విపాదికాకుష్ఠము, అలసకకుష్ఠము, దద్రుకుష్ఠము, చర్మదలకుష్ఠము, పామాకుష్ఠము, విస్ఫోటకకుష్ఠము, శతారుకుష్ఠము, విచ

ర్చికాకుష్ఠము, (ఈపదునొకండును క్షుద్రకుష్ఠములు) అను నీపదునెనిమిదికుష్ఠలక్షణములు వేరువేర నీక్రింద వివరింపబడును.

## 1. సప్తవిధమహాకుష్ఠములు: అందు కపాలకుష్ఠలక్షణము.

మూ. కృష్ణారుణకపాలాభం యద్రూక్షం పరుషం తను,
కాపాలం తోదబహుళం తత్కుష్ఠం విషమం స్మృతమ్.　　14

వ్యా. నల్లని రంగైనను అరుణవర్ణంబైనను కల్గి కుండపెంకువలె మిగుల కర్కశంబై కరకుబారి సూక్ష్మరూపమై సూదులతో బొడిచినవిధముగ పోటు కల్గి యొక ప్రక్క యెత్తుగను వేరొకప్రక్క పల్లముగ నుండునది కపాలకుష్ఠమని యెరుంగునది.

## 2. ఔదుంబరకుష్ఠలక్షణము.

మూ. దాహకణ్డూరుజారాగపరీతం లోమపిఞ్జరం,
ఉదుమ్బరఫలాభాసం కుష్ఠమౌదుమ్బరం విదుః.　　15

వ్యా. మంటయు దురదయు నొప్పియు రక్తవర్ణంబును కల్గి విశేషముగ రోమములు కల్గి మేడిపండును బోలిన యాకారము కల్గియుండునది ఔదుంబరకుష్ఠము.

## 3. మండలకుష్ఠలక్షణములు.

మూ. శ్వేతం రక్తం స్థిరం స్త్యానం స్నిగ్ధముత్సన్నమణ్డలం,
కృచ్ఛ్రమన్యోన్యసంసక్తం కుష్ఠం మణ్డలముచ్యతే.　　16

వ్యా. తెలుపురంగైనను ఎరుపురంగైనను కల్గి కఠినంబై నీరుకారుచు నునుపు కల్గి ఉన్నతమైన మండలాకారము కల్గిన పొడలు మండలకుష్ఠ మనబడును. ఈపొడలు శరీరముపై జనించి యొండొంట కలియును. అట్టి పరిస్థితి నున్నపుడు మిక్కిలి కష్టసాధ్యమగును.

## 4 ఋశ్యజిహ్వాకుష్ఠలక్షణము.

మూ. కర్కశం రక్తపర్యన్తం అన్తశ్శ్యావం సవేదనం,
యదృశ్యజిహ్వాసంస్థానం ఋశ్యజిహ్వం తదుచ్యతే.　　17

వ్యా. కఠినమై చుట్టున రక్తవర్ణంబును నడుమ శ్యామవర్ణంబును కల్గి పోటు మున్నగుబాధ కల్గి మనుబోతునాలుకవంటి యాకారము కల్గినది. ఋశ్యజిహ్వాకుష్ఠ మనబడును. వాగ్భటాచార్యులు దీనిని "ఋక్షజిహ్వాప్రతిమం" అని చెప్పిరి. ఎలుగుబంటి నాలుకవలె నుండునది యని యర్థము.

### 5. పుండరీకకుష్ఠలక్షణము.

మూ. సశ్వేతం రక్తపర్యన్తం పుణ్డరీకదళోపమం,
సోత్సేధం చ సదాహం చ పుణ్డరీకం తదుచ్యతే. 18

వ్యా. నడుమ తెల్లనై చుట్టును ఎఱ్ఱగ నుండి తామరాకువలె చారలతో గూడి గుండ్రనై శరీరముపై నున్నతముగ నుండి మంట పుట్టించు పొడలు పుండరీకకుష్ఠ మన బడును.

### 6. సిధ్మకుష్ఠలక్షణము.

మూ. శ్వేతం తామ్రం తను చ యత్ రజోఘృష్టం విముఞ్చతి,
అలాబూపుష్పవర్ణం తత్సిధ్మం ప్రాయేణ చోరసి. 19

వ్యా. సిధ్మకుష్ఠము శ్వేతవర్ణంబైనను తామ్రవర్ణంబైనను కల్గి చేత రుద్దినచో పాముకుబుసమువంటి పలుచని ధూళి రాలుచు సొరపువ్వుల బోలిన యాకారము కల్గి చుక్కలు చుక్కలుగ నుండును. ఈకుష్ఠము తరచుగ ఱొమ్ముపై బొడముచు.

### 7. కాకణకుష్ఠము.

మూ. యత్కాకణన్తికావర్ణం అపాకం తీవ్రవేదనం,
త్రిదోషలిఙ్గం తత్కుష్ఠం కాకణం నైవ సిధ్యతి. 20

(ఇతి సప్తమహాకుష్ఠాని.)

వ్యా. గురిగింజవలె నెఱ్ఱనిరంగుచు ఆకారంబును కల్గి పరిపక్వము గాక తీవ్రమైన వేదనతో గూడియుండునది కాకణకుష్ఠము. ఇయ్యది త్రిదోషలక్షణములును కల్గి యుండును; కావున సాధ్యము కానేరదు. (ఈచెప్పబడిన యేడుకుష్ఠములును మహాకుష్ఠములు.)

### 8. 9. పదునొకండు క్షుద్రకుష్ఠములు: అందు ఏకకుష్ఠ-చర్మకుష్ఠలక్షణములు.

మూ. అస్వేదనం మహావాస్తు యన్మత్స్యశకలోపమం,
తదేకకుష్ఠం; చర్మాఖ్యం బహలం హస్తిచర్మవత్. 21

వ్యా. చెమటబట్టక విశాలమైనస్థలము నాక్రమించి చేపతునకవంటి యాకారము కల్గియుండునది యేకకుష్ఠ మనబడును. ఏనుగచర్మమువలె తాకినచో కఠినంబును ఘనంబును నైయుండునది చర్మకుష్ఠము.

10. 11. కిటిభ-వైపాదికాకుష్ఠలక్షణములు.

మూ. శ్యావం కిణఖరస్పర్శం పరుషం కిటిభం స్మృతం,
వైపాదికం పాణిపాదస్ఫుటనం తీవ్రవేదనమ్. 22

వ్యా. శ్యామవర్ణంబై చేత తాకినచో కురుపువచ్చువలె కఠినంబై కరకరలాడుచునుండునది కిటిభకుష్ఠమనబడును. అరచేతులును అరకాళ్లును పగిలి తీవ్రమైన మంటయు పోటును కల్గియుండునది వైపాదికకుష్ఠమని చెప్పబడును.

12. 13. అలసక-దద్రుకుష్ఠలక్షణములు.

మూ. కణ్డూమద్భిస్సరాగైశ్చ గణ్డైరలసకం చితం,
సకణ్డూరాగపిటకం దద్రుమణ్డలముద్గతమ్. 23

వ్యా. దురద కల్గి యెఱ్ఱగనుండు బొబ్బలతో కూడినది యలసక కుష్ఠము. ఎఱ్ఱగానుండి సన్ననిబొబ్బలతో కూడి గుండ్రని దద్దులువలె పైకుబికి యుండునది దద్రుకుష్ఠము.

14. చర్మదలకుష్ఠలక్షణము.

మూ. రక్తం సకణ్డు సస్ఫోటం సరుగ్దలతి చాపి యత్,
తచ్చర్మదలమాఖ్యాతం సంస్పర్శాఽసహముచ్యతే. 24

వ్యా. రక్తవర్ణమై దురదయు బొబ్బలును నొప్పియు కల్గి చేత స్పృశించినచో నోరువరాకుండి పగులునది చర్మదలకుష్ఠమని చెప్పబడును.

15-16. పామా-విస్ఫోటకుష్ఠలక్షణములు.

మూ. పామాః శ్వేతారుణాః శ్యావాః కండూలాః పిటకా భృశం,
స్ఫోటాః శ్వేతారుణాభాసో విస్ఫోటాః స్యుః తనుత్వచః. 25

వ్యా. శ్వేత అరుణ శ్యావవర్ణంబులును, దురదయు, కల్గిన బొబ్బలు పామాకుష్ఠమనబడును. శ్వేతారుణవర్ణములు కల్గిన బొబ్బలు విస్ఫోటకుష్ఠ మనబడును. ఇయ్యది పలుచని చర్మము కల్గియుండును.

17-18. శతారువిచర్చికాకుష్ఠములు.

మూ. రక్తశ్యావం సదాహార్తి శతారుః స్యాద్బహువ్రణం,
సకణ్డూః పిటకా శ్యావా బహుస్రావా విచర్చికా. 26

(ఇత్యేకాదశకుష్ఠాని.)

వ్యా. రక్తవర్ణంబైనను శ్యామవర్ణంబైనను గలిగి మంటతోడను నొప్పితోడను కూడిన అనేక వ్రణములు నొక్కటిగ చేరియుండిన నయ్యది శతారుకుష్ఠ మనబడును. దురదతో కూడి శ్యామవర్ణంబై చీము రక్తము అధికముగ స్రవించు బొబ్బ విచర్చికా కుష్ఠ మనబడును. ఇత్తెరంగున నుద్దేశక్రమానుసారముగ పదునొకండు క్షుద్రకుష్ఠలక్షణములు చెప్పబడినవి.

పైజెప్పిన కుష్ఠములయందు వాతాది దోషవిభాగము.

మూ. వాతేఽధికతరే కుష్ఠం కాపాలం, మణ్డలం కఫే,
పిత్తే త్వౌదుంబరం విద్యాత్ కాకణం తు త్రిదోషజమ్. 27
వాతపిత్తే, శ్లేష్మపిత్తే, వాతశ్లేష్మణి, చాధికే,
ఋష్యజిహ్వం, పుణ్డరీకం సిధ్మకుష్ఠం చ జాయతే. 28
చర్మాఖ్యమేకకుష్ఠం చ కిటిభం సవిపాదికమ్,
కుష్ఠం చాలసకం జ్ఞేయం ప్రాయో వాతకఫాధికమ్. 29
పామాశతారుర్విస్ఫోటం దద్రుశ్చర్మదళం తథా,
పిత్తశ్లేష్మాధికం ప్రాయః, కఫప్రాయా విచర్చికా. 30

వ్యా. కుష్ఠములన్నియు త్రిదోషప్రకోపమువలననే జనించును. అందు త్రిదోషములలో వాత మధికముగ నుండి కపాలకుష్ఠంబును, కఫంబధికమైనపుడు మండలకుష్ఠంబును, పిత్తము అధికమగుటవలన ఔదుంబరకుష్ఠంబును, మూడుదోషంబులును సమముగ ప్రకోపమునొంది కాకణకుష్ఠంబును జనించును.

మరియు వాతపిత్తములు అధికములై ఋశ్యజిహ్వాకుష్ఠంబును, శ్లేష్మపిత్తము లధికంబు లగునెడ పుండరీకకుష్ఠంబును, వాతశ్లేష్మము లధికములైనచో సిధ్మకుష్ఠంబును జనించును.

మరియు చర్మకుష్ఠము, ఏకకుష్ఠము, కిటిభకుష్ఠము, విపాధికకుష్ఠము, అలసకకుష్ఠము, అనునవి ప్రాయికముగ వాతకఫాధిక్యముచే కల్గును. పామా, శతారు, విస్ఫోటకము, దద్రు, చర్మదల అను నీకుష్ఠములు పిత్తశ్లేష్మము లధికముగ ప్రకోపించుటచే కల్గును. విచర్చికాకుష్ఠము కఫాధిక్యముచే కల్గును. (ఇచ్చట త్రిదోషతారతమ్యము కుష్ఠములకు చికిత్సాసౌకర్యమునకై వివరింపబడినది.)

కుష్ఠములకు దోషబలాబలతారతమ్యముచే చికిత్సావిధానము.

మూ. సర్వం త్రిదోషజం కుష్ఠం దోషాణాం చ బలాబలం,
యథాస్వైర్లక్షణైర్బుద్ధ్వా కుష్ఠానాం క్రియతే క్రియా. 31

దోషస్య యస్య పశ్యేత్కుష్ఠేషు విశేషలిఙ్గముద్రిక్తమ్,
తస్యైవ శమం కుర్యాత్తతః పరం చానుబన్ధస్య. 32

వ్యా. కుష్ఠములన్నియు మూడుదోషముల ప్రకోపముచేతనే సంభవించును. ఐనను నాత్రిదోషములలో వానిబలాబలమును ఆయాదోషముయొక్క లక్షణములచే తారతమ్యమును గుర్తించి చికిత్సచేయనగును. అట్టియెడ కుష్ఠములయందు త్రిదోషములలో నేదోషముయొక్క చిహ్నములు విశేషముగ గనబడునో ఆదోషము ప్రధానమై యుండును. దానిని తొలుత గమనించి మొట్టమొదట దానిని శమింపజేసి పిమ్మట అనుబంధముగ నున్నదోషములను తగిన చికిత్స జేయనగును.

కార్యకారణరూపములైన కుష్ఠ-దోషములకు పరస్పరబోధకత్వము.

మూ. కుష్ఠవిశేషైర్దోషాః దోషవిశేషైః పునశ్చ కుష్ఠాని,
జ్ఞాయన్తే తైర్హేతుః హేతుస్తాంశ్చ ప్రకాశయతి. 33

వ్యా. పైజెప్పబడిన కపాలాదికుష్ఠవిశేషలక్షణములచే నాయాకుష్ఠములకు పైని చెప్పబడిన నిర్ణయప్రకారము ఆయాదోషములును, క్రింద జెప్పబడు దోషలక్షణముల బట్టి ఆయాకుష్ఠవిశేషములును నిర్ణయముగ తెలియదగి యుండును. ఇత్తెరంగున కపాలాది కుష్ఠములు వానికి నిర్ణీతములగు దోషరూపహేతువులను, కుష్ఠోత్పాదకహేతువులు కుష్ఠవిశేషములను స్ఫుటముగ తెలుపును. (లోకమున కార్యమునుపట్టి కారణమును కారణమునుబట్టి కార్యమును నిర్ణయించుట సహజము. అత్తెరంగుననే కార్యరూపమైన కపాల కుష్ఠమునకు జెప్పిన లక్షణములబట్టి యియ్యది కపాలకుష్ఠమనియు, కపాలకుష్ఠమునకు వాతాధిక్యము చెప్పియున్నదికావున అట్టి వాతాధికలక్షణములబట్టి యియ్యది కపాలకుష్ఠమనియు నిర్ణయింపదగియుండును. రోగములకును రోగములకు కారణములైన వాతాదిదోషములకును గల లక్షణములబట్టి పరస్పరసంబంధమును చక్కగ గమనించి సిద్ధాంతము చేయవలెనని భావము. ఇత్తెరంగుననే తక్కిన కుష్ఠములకును కార్యకారణ సంబంధముల నూహించునది.)

కుష్ఠములయందు వాతాదులచే గల్గు వేరువేరులక్షణములు.

మూ. రౌక్ష్యం శోషస్తోదః శూలం సఙ్కోచనం తథాయామః,
పారుష్యం ఖరభావో హర్షః శ్యావారుణత్వం చ. 34
కుష్ఠేషు వాతలిఙ్గం, దాహో రాగః పరిస్రవః పాకః,
విస్రో గన్ధః క్లేదః తథాఙ్గపతనం చ పిత్తకృతమ్. 35

శ్వైత్యం శైత్యం కణ్డూః స్థైర్యం చోత్సేధగౌరవస్నేహాః,
కుష్ఠేషు తు కఫలిఙ్గం జన్తుభిరభిభక్షణం క్లేదః. 36

వ్యా. శరీరమున రూక్షత్వము (జిడ్డు లేక కరుకుబారి యుండుట), శుష్కించుట, సూదుల గ్రుచ్చినవిధముగ పోటు, నొప్పి, చర్మము ముడుచుకొనుట, లాగినట్లుండుట, కాఠిన్యముచేత తాకినచో కర్కశముగ నుండుట, రోమహర్షము, శ్యావ-అరుణవర్ణములు కల్గియుండుట, ఇవి యన్నియు కుష్ఠములలో కల్గు వాతలక్షణములు. (ఈలక్షణములు కుష్ఠములలో కాన్పించినయెడ వాతోత్తరకుష్ఠమని యూహింపనగునని భావము.)

మంట, ఎరుపురంగు, పూయాదిద్రవములు స్రవించుట, పుండగుట, దుర్గంధము, చెమ్మ కల్గియుండుట, అవయవములు శిథిలములగుట, ఇవి యన్నియు కుష్ఠములలో పిత్తముచే గల్గులక్షణములు.

తెలుపురంగు, చల్లదనము, దురద, స్థిరత్వము, ఎత్తు, బరువుగనుండుట, స్నిగ్ధత్వము (జిడ్డు), క్రిములు కల్గి శరీరావయవముల దినుట, ఇవి యన్నియు కుష్ఠములయందు కఫమున గల్గు లక్షణములు. (కుష్ఠములకు వేరువేరుగ జెప్పబడిన లక్షణములబట్టియు, వానియందు గల్గు వాతాది లక్షణముల బట్టియు ఆయాకుష్ఠములను వాతాదిసంబంధమును నిర్ణయించి, ఆయాదోషమును శమింపదగిన చికిత్స జేయనగును.)

## కుష్ఠములసాధ్యాసాధ్యవిభాగము.

మూ. సర్వైర్లిఙ్గైర్యుక్తం మతిమాన్ వైద్యో వివర్జయేదబలం,
తృష్ణాదాహపరీతం శాన్తాగ్నిం జన్తుభిర్జగ్ధమ్. 37
వాతకఫప్రబలం యత్ యదేకదోషోల్బణం న తత్ కృచ్ఛ్రం,
కఫపిత్తవాతపిత్తప్రబలాని తు కృచ్ఛ్రసాధ్యాని. 38

వ్యా. వాతాదులకు ప్రత్యేకముగ జెప్పబడిన లక్షణము లన్నియుు కల్గిన కుష్ఠము అసాధ్యము కావున బుద్ధిమంతుడగు వైద్యుడు దానికి చికిత్స చేయంజనదు. మరియు నట్టి త్రిదోషలక్షణములు కల కుష్ఠమునందు రోగి బలహీనుడై దప్పియుు మంటయుు కల్గి జఠరాగ్ని మందగించి పురుగులు పట్టియున్నచో నయ్యది మిక్కిలి యసాధ్యము కావున ప్రత్యాఖ్యేయము. వాతకఫములు ప్రబలముగ నుండుకుష్ఠములు ఏకదోషముచే కల్గిన కుష్ఠములును కృచ్ఛ్రసాధ్యములు కావు.(సాధ్యములనుట).కఫపిత్తంబులును, వాతపిత్తంబులును ప్రబలముగ నుండుకుష్ఠములు కష్టసాధ్యములు.

### కుష్ఠములయందు వాతాదిదోషానుసారముగ చికిత్సాక్రమము.

మూ. వాతోత్తరేషు సర్పిః వమనం శ్లేష్మోత్తరేషు కుష్ఠేషు,
పిత్తోత్తరేషు మోక్షః రక్తస్య విరేచనం చాగ్రే. 39
వమనవిరేచనయోగాః కల్పోక్తాః కుష్ఠినాం ప్రయోక్తవ్యాః,

వ్యా. వాతము ప్రధానముగ నున్న కుష్ఠములయందు తొలుత ఘృతపానమును, శ్లేష్మప్రధానముగా గల కుష్ఠములయందు తొలుదొలుత వమనమును, పిత్తము ప్రధానముగగల కుష్ఠములయందు తొలుత రక్తమోక్షణము చేయించి పిదప వారివారికి విహితములగు చికిత్సలను జేయనగు. మరియు కుష్ఠరోగులకు కల్పస్థానమున చెప్పబడిన వమనవిరేచనయోగములను శోధనములకై యుపయోగింపనగును.

### కుష్ఠములయందు సిరావ్యధన సంశోధనవిధి.

మూ. ప్రచ్ఛనమల్పే కుష్ఠే మహతి చ శస్తం సిరావ్యధనమ్. 40
బహుదోషః సంశోధ్యః కుష్ఠీ బహుశోఽనురక్షతా ప్రాణాన్,
దోషే హ్యతిమాత్రహృతే వాయుర్హన్యాదబలమాశు 41
స్నేహస్య పానమిష్టం శుద్ధే కోష్ఠే ప్రవాహితే రక్తే,
వాయుర్హి శుద్ధకోష్ఠం కుష్ఠినమబలం విశతి శీఘ్రమ్. 42

వ్యా. క్షుద్రకుష్ఠములయందు శలాకాదులచే స్వల్పముగ కుట్టియు, మహాకుష్ఠములయందు సిరావ్యధనముచేతను రక్తమోక్షణమును చేయించనగును. దోషములు ప్రబలముగనుండు కుష్ఠరోగికి శరీరబలమును, హానికల్గనీయక కొద్దికొద్దిగ పలుమారు శోధనము చేయించవలయును. అటు గాక ఒక్కతూరియే దోషముల నధికముగ వెడలింపజేసినచో వాతము ప్రకోపించి బలహీనుడగు రోగిని చంప జూచును. కావున కొంచెము కొంచెముగ దోషముల వెడలించుట మంచిది. మరియు, పైజెప్పినరీతిగ శోధనముచే శుద్ధమైన కోష్ఠము గల కుష్ఠరోగికి వెంటనే వాతము ప్రకోపమునొందును. కావున కోష్ఠము శుద్ధమునొందినవెంటనే రక్తమోక్షణము చేసినతోడనే వాతము ప్రకోపము నొందకుండుటకై స్నేహపానము జేయించుట చాల మంచిది.

### వమనార్హకుష్ఠములు, వమనద్రవ్యములును.

మూ. దోషోత్క్లిష్టే హృదయే వామ్యః కుష్ఠేషు చోర్ధ్వభాగేషు,
కుటజఫలమదనమధుకైః సపటోలైర్నింబరసయుక్తైః. 43
శీతరసః పక్వరసో మధూని మధుకం చ వమనాని,

వ్యా. కుష్ఠరోగములయందు దోషము హృదయస్థానమునుండి పైకి వెడల నున్న పుడును శరీరమునం దూర్ధ్వభాగమున జనించిన కుష్ఠరోగములయందును, వమనము చేయించవలయును. కొడిశపాలవిత్తులు, మ్రంగకాయ, అతిమధురము, చేదుపొట్ల, వేప, ఇప్ప, వీటిరసముచేనైనను, లేక శీతకషాయముచే నైనను, శృతకషాయముచే నైనను, తేనె కూర్చి వమనమునకై యుపయోగించి దోషమును వెడలింపవలయును.

కుష్ఠహరవిరేచనద్రవ్యములు.

మూ. కుష్ఠేషు త్రివృతా దన్తీ త్రిఫలా చ విరేచనే శస్తా. 44
సౌవీరకం తుషోదకమాలోడనమాసవాశ్చ శీధూని,
శంసన్త్యధో హరాణాం యథావిరేకం క్రమశ్చేష్టః. 45

వ్యా. తెగడ, నేపాళపుగింజలు, త్రిఫలములు, ఇవి కుష్ఠరోగములయందు విరేచనముల జేయించుటకు చాల ప్రశస్తములు. సౌవీరకము నైనను, తుషోదకమునైనను, ఆసవములనైనను, మద్యములనైనను, విరేచనఔషధములతో అనుపానముగ నుపయోగింపనగును. విరేచనానంతరము ప్రధాన-మధ్య-అవర-శుద్ధిభేదములను గమనించి తత్తదనుసారముగ పేయాది క్రమప్రకారము ఆహారమును చేయింపనగును.

కుష్ఠమునం దాస్థాపనవస్తిద్రవ్యములు.

మూ. దార్వీబృహతీసేవ్యైః పటోలపిచుమర్దమదనకృతమాలైః,
సస్నేహైరాస్థాప్యః కుష్ఠీ సకలిఙ్గయవముస్తైః. 46

వ్యా. మ్రానిపసుపు, వాకుడు, వట్టివేరు, చేదుపొట్ల, వేప, మ్రంగకాయ, కానుగ, చేమపుచ్చకాయలు, యవలు, తుంగగడ్డలు ఈద్రవ్యములు కషాయములయందును, స్నేహములను జేర్చి కుష్ఠరోగులకు ఆస్థాపనవస్తి చేయనగును.

కుష్ఠమున అనువాసనవస్తివిధి.

మూ. వాతోల్బణం విరిక్తం నిరూఢమనువాసనార్హమాలక్ష్య,
ఫలమధుకనిమ్బకుటజైః సపటోలైః, సాధయేత్స్నేహమ్. 47

వ్యా. వాతము బలిష్ఠముగానుండు కుష్ఠరోగికి నిరూహవస్తిని చేయించిన పిదప అనువాసనమునకు అర్హుడుగా నెరింగి పిమ్మట మ్రంగకాయ, అతిమధురము, వేపపట్ట, కొడిసెపాల, చేదుపొట్ల, వీనిని చేర్చి పక్వము చేయబడిన స్నేహద్రవ్యముతో అనువాసనవస్తిని ప్రయోగింపవలయును,

### కుష్ఠములయందు నస్యప్రయోగము.

మూ. సైన్ధవద_న్తీమరిచం ఫణిజ్జకః పిప్పలీకరఞ్జఫలం,
నస్యం స్యాత్సవిడంగం క్రిమికుష్ఠకఫప్రకోపఘ్నమ్. 48

వ్యా. సైంధవలవణము, నేపాళములు, మిరియాలు, మరువము, పిప్పలి, కానుగకాయలు, వాయువిడంగములు, వీనినన్నిటిని చూర్ణముచేసి నస్యముగ నుపయోగించిన క్రిములును, కుష్ఠంబును, కఫముయొక్క ప్రకోపంబును హరించును.

### కుష్ఠములయందు శిరోవిరేచనధూమోపయోగము.

మూ. వైరేచనికైర్ధూమైః శ్లోకస్థానేరితైః ప్రశామ్యన్తి,
క్రిమయః కుష్ఠకిలాసాః ప్రయోజితైరుత్తమాఙ్గస్థాః. 49

వ్యా. సూత్రస్థానమునందు చెప్పబడిన శిరోవిరేచనధూపద్రవ్యములచే ఔషధము కల్పించి దానిపొగను నాసారంధ్రములనుండి పీల్చినచో శిరస్సునందలి క్రిములును, కుష్ఠంబును, కిలాసంబును శమించును. (సూత్రస్థానమున వైరేచనికధూమయోగము ఒక్కటే చెప్పబడినను నాగణమునందలి ద్రవ్యములను వ్యస్తసమస్తములుగ విభజించి యుపయోగించినయెడ అనేకయోగములగును గావున ఇచ్చట "ధూమైః" అని బహువచనముచే నిర్దేశించెను.)

### కుష్ఠములయందు దుష్టరక్తమోక్షణము.

మూ. స్థిరకఠినమణ్డలానాం స్విన్నానాం ప్రస్తరప్రణాదీభిః,
కూర్చైర్విఘట్టితానాం రక్తోత్క్లేశోఽపనేతవ్యః. 50
ఆనూపవారిజానాం మాంసానాం పోటలైః సుఖోష్ణైశ్చ,
స్విన్నోత్సన్నం విలిఖేత్కుష్ఠం తీక్ష్ణేన శస్త్రేణ. 51
రుధిరాగమార్థం, అథవా శృంగాలాబూని యోజయేత్ కుష్ఠే,
(శృంగాలబూభిరాహరేద్రుధిరం).
ప్రచ్ఛితమల్పం కుష్ఠం విరేచయేద్వా జలౌకోభిః. 52

వ్యా. స్థిరముగను, కఠినముగను, నుండు పొడలుగల కుష్ఠములయందు స్వేదాధ్యాయమున చెప్పబడిన విధిప్రకారము ప్రస్తరస్వేదము నాడీస్వేదములచేత శరీరముపై చెమట బుట్టించి యాపొడలు గలస్థలములయందు చక్కగనొత్తిడిచేసి కూర్చమను శస్త్రముచే కాటుబెట్టి దుష్టరక్తమును వెడలించవలయును. లేక ఆనూపదేశమందలి జంతువుల

యొక్కయు నీటపుట్టిన జంతువులయొక్కయు, మాంసమును పొట్లము గట్టి వెచ్చజేసి సుఖోష్ణముగ నున్నపుడు కుష్ఠప్రదేశమున కాపడమును బెట్టి చెమటబుట్టించి మృదువైన పిదప తీక్ష్ణమగు శస్త్రముచే లేఖనముచేసి రక్తమును వెడలింపవలయును. లేక చిమ్మన గ్రోవులచే నైనను, సొరకాయబుఱ్ఱచేనైనను, రక్తమును ఆకర్షించి వెడలించవలయును. లేక కుష్ఠప్రదేశమున కొంచెముగ కాటుబెట్టి జలగల గరిపించి దుష్టరక్తము ఆజలగలు పీల్చునట్లు జేసి వెడలించవలయును.

### రక్తమోక్షణానంతరము లేపనములు.

మూ. యే లేపాః కుష్ఠానాం యుజ్యన్తే నిర్హృతాస్రదోషాణాం,
సంశోధితాశయానాం సద్యః సిద్ధిర్భవేత్తేషామ్. 53

వ్యా. పైజెప్పినరీతిగ కుష్ఠరోగులకు వమనవిరేచన నస్యప్రయోగాదులచే సంశోధనములను చేసి శుద్ధకోష్ఠులైనపిదప రక్తమోక్షణము జేసి పిమ్మట నీక్రింద "యేలా కుష్ఠం దార్వీ" అని యుపక్రమించి చెప్పబడు కుష్ఠహరలేపములను జేసినచో శీఘ్రముగ హరించును.

### కుష్ఠములయందు క్షారప్రయోగము.

మూ. యేషు న శస్త్రం క్రమతే స్పర్శేన్ద్రియనాశనాని యాని స్యుః,
తేషు నిపాత్యః క్షారో రక్తం దోషఞ్చ విస్రావ్య. 54

వ్యా. యేకుష్ఠములు శస్త్రప్రయోగమునకు అర్హములు కాకయుండునో స్పర్శేంద్రియమును చెరచునవి యేకుష్ఠములో ఆట్టికుష్ఠములయందు క్షారముల ప్రయోగించి దుష్టమైన రక్తమును వెడలింపవలయును.

### కుష్ఠములయందు పట్టువేయవలసినవిధానము.

మూ. పాషాణకఠినపరుషే సుప్తే కుష్ఠే స్థిరే పురాణే చ,
పీతాగదస్య కార్యో విషైః ప్రదేహోఽగదైశ్చాను. 55
స్తబ్ధాని సుప్తసుప్తాన్యస్వేదనకణ్డులాని కుష్ఠాని,
కూర్చైశ్చర్దంతీత్రివృతాకరవీరకరఞ్జకుటజానామ్. 56
జాత్యర్కనిమ్బజైర్వా పత్త్రైః శస్త్రైః సముద్రఫేనైర్వా,
ఘృష్టాని గోమయైర్వా తతః ప్రదేహ్యైః ప్రదేహ్యాని. 57

వ్యా. రాయివలె కఠినముగను, గరుకులుగలిగియు, స్పర్శజ్ఞానము లేకయు, చిరకాలమునుండి స్థిరముగను, నుండుకుష్ఠములయందు తొలుత నౌషధము నిప్పించి విష

ద్రవ్యములచే పైనపూతపూసి పిమ్మట ఆయామందులచే పట్టువేయవలయును. మఱియు మొద్దుబారి, స్పర్శజ్ఞానము నొకంతయు నెరుగక, చెమటబట్టక, దురద బుట్టకయుండు కుష్ఠములను కూర్చమను శస్త్రముచే నైనను, గన్నేరు, కానుగ, వేప, కొడిశపాల, వీని యొక్క ఆకులచేనైనను, జాజి, జిల్లేడు, వేప, వీనియాకులసముదాయముచేనైనను, శస్త్రములచే నైనను, సముద్రపునురుగుచే నైనను, ఏరుడుపిడకలచే నైనను, కుష్ఠప్రదేశములయందు బాగుగ రుద్ది పట్టువేయుటకు చెప్పినద్రవ్యములచే పట్టువేయవలయును.

## పిత్తాధికకుష్ఠచికిత్సాక్రమము.

మూ. మారుతకఫకుష్ఠఘ్నం కర్మోక్తం పిత్తకుష్ఠినా కార్యం,
కఫపిత్తరక్తహరణం తిక్తకషాయైః ప్రశమనం చ. 58
సర్పీంషి తిక్తకాని చ యచ్చాన్యద్రక్తపిత్తనుత్కర్మ,
బాహ్యాభ్యన్తరమగ్ర్యం తత్కార్యం పిత్తకుష్ఠేషు. 59

వ్యా. వాతకఫకుష్ఠములు హరింపజేయుటకు చికిత్సాక్రమము పిత్తకుష్ఠములయందును జేయనగును. మరియు కఫపిత్తరక్తములను వమనవిరేచనరక్తమోక్షణములచే తొలుత చేయించి తిక్తద్రవ్యములచే సిద్ధమయిన కషాయములచేత శమనచికిత్స జేయవలయును. పిమ్మట తిక్తషట్పలాదిఘృతపానము చేయించి రక్తపిత్తచికిత్సయందు చెప్పబడిన బాహ్యాభ్యంతరదోషహరములగు చికిత్సల నన్నిటిని పిత్తకుష్ఠములయందును ప్రయోగింపనగును.

## కుష్ఠసామాన్యచికిత్స.

మూ. దోషాధిక్యవిభాగాదిత్యేతత్కర్మ కుష్ఠనుత్ ప్రోక్తం,
వక్ష్యామి కుష్ఠశమనం ప్రాయస్త్వద్దోషసామాన్యాత్. 60

వ్యా. ఇంతదనుక కుష్ఠములయందు దోషాధిక్యవిభాగము ననుసరించి కుష్ఠహరమైన చికిత్స చెప్పబడినది. ఈ క్రింద చర్మదోషసామాన్యమును హరించునట్టి చికిత్సావిధానము చెప్పబడును.

## దార్వ్యాదిలేపము.

మూ. దార్వీం రసాఞ్జనం వా గోమూత్రేణ ప్రబాధతే కుష్ఠం,
అభయాం ప్రయోజితా వా మాసం సవ్యోషగుడతైలాః. 61

వ్యా. మ్రానిపసుపునైనను, రసాంజనమునైనను గోమూత్రముతో నూరి పూసినను, కరక్కాయ, త్రికటుకములు, బెల్లము, నువ్వులనూనె వీటితో నూరి ఉపయో

గించినచో నొకనెలరోజులలో కుష్ఠములు మానును. (ఇచ్చట రసాంజనమనగా మ్రాని పసుపు కషాయమును చుండ కాచి గట్టిగ చేసిన దానికి రసాంజనమని పేరు.)

కుష్ఠాదిహరపటోలాదికషాయము.

మూ. మూలం పటోలస్య తథా గవాక్ష్యోః పృథక్పలాంశం త్రిఫలా త్వచశ్చ, స్యాత్త్రాయమాణా కటురోహిణీ చ భాగార్ధికానాగర పాదయుక్తా. 62

పలం తథైషాం సహచూర్ణితానాం జలే శృతం దోషహరం పిబేన్నా, జీర్ణే రసైర్ధన్వమృగద్విజానాం పురాణశాల్యోదన మాదదీత. 63

కుష్ఠాని శోఫం గ్రహణీప్రదోషమర్శాంసి కృచ్ఛ్రాణి హాలీమకం చ, షడ్రాత్రయోగేన నిహన్తి చైష హృద్వస్తిశూలం విషమజ్వరం చ. 64

వ్యా. చేదుపొట్లవేరు ఒకపలము, ఏటిపుచ్చవేరు ఒకపలము, కరకకాయ బెరడు ఒకపలము, తాండ్రకాయబెరడు ఒకపలము, ఉసిరికకాయబెరడు ఒకపలము, కలుక్రానుగ ఆరు (6) ఆరుశాణములు (౧౨. పాతికాపరకపలము) కటుకరోహిణి (6) ఆరుశాణములును [(౧౨, పాతికాపరకపలము), పలములో నాల్గవపంతు(నాల్గుశాణములు)శుంఠియు, (ఈమూడును జేరి ఒకపలము) పైజెప్పబడిన యెనిమిదిదినుసులును చేరిన మొత్తము (6) ఆరుపలములగును.] ఈద్రవ్యముల నన్నిటిని నొకటిగ జేర్చి నలియగొట్టి చూర్ణముచేసి యీసముదాయములో నొకపలము చూర్ణమును గ్రహించి జలమున జేర్చి నాలుగవ వంతు మిగులునట్లు కషాయము కాచి త్రాగునది. ఈకషాయము జీర్ణమైన పిదప మెట్ట భూముల సంచరించు మృగములయొక్కయు పక్షులయొక్కయు మాంసరసముతో ప్రాత బియ్యపు అన్నమును భుజింపనగును. ఇత్తెరంగున ఆరురాత్రులు పైజెప్పిన కషాయమును సేవించినయెడ, కుష్ఠంబులును, శోఫలును, గ్రహణీరోగములును, అర్శోరోగములు(గుదాంకురములు)ను, మూత్రకృచ్ఛ్రములును, హాలీమకంబును, రొమ్ముపొత్తికడుపు వీటియం దు పుట్టెడుశూలలును, విషమజ్వరములును, ఇవి యన్నియును హరించును. (ఆరుపలముల పరిమితిగల పైచూర్ణసముదాయములో ఒక్కొక్క దినమునకు ఒక్కపలమువంతున గ్రహించి విధిప్రకారము కషాయము కాచి ఉపయోగించుచు ఆరుదినములకు ఆరుపలములు పూర్తిజేయునది.)

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—పైజెప్పిన మూలమున "స్యాత్ త్రాయమాణా కటురోహిణీ చ భాగార్ధికా నాగరపాదయుక్తా" అనుచోట 'భాగార్ధికా' 'నాగరపాదయుక్తా' అనుపదములు రెండును 'త్రాయమాణా' 'కటురోహిణీ' అనుపదములతో ఒక్కొకదానికిని విశేషణములై యన్వయించును. అప్పుడు 'త్రాయమాణా' నాగరపాదయుక్తా, 'భాగార్ధికా' "కటురోహిణీ చ, నాగరపాదయుక్తా, "భాగార్ధికా"అని అన్వయము. కల్యుగ్రానుక అర్ధపలములో నాల్గవవంతు (పరకపలము,) (కర్షమున సగము= రెండు శాణములు) శుంఠితో గూడి యర్ధపలంబును, కటుకరోహిణియు అర్ధపలములో నాల్గవవంతు (రెండుశాణములు) శుంఠితోగూడి యర్ధపలంబును నుండవలెనని యర్థము. అట్లైనచో కానుగయు, కటుకరోహిణియు, శుంఠియు చేరి యొకపలమగును. ఎట్లులన పలమునకు పదునారుశాణములు, అర్ధపలమునకు ఎనిమిదిశాణములు, అందు నాల్గవవంతు రెండుశాణములు. ఇత్తెరంగున శుంఠి రెండుశాణములును, కానుగ ఆరుశాణములును చేరి అర్ధపలము పూర్తి యగును. కటుకరోహిణియు నిత్తెరంగుననే అర్ధపలము పూర్తి యగును కావున కానుగ కటుకరోహిణి వేరువేరుగ నారేసిశాణములును, శుంఠి నాల్గుశాణములును చేరిన నీమూడును చేరి యొక పలమగును. తక్కిన చేదుపొట్లవేరును చేదుపుచ్చకాయవేరును త్రిఫలములు మూడును వేరువేరుగ నొక్కొకపలమువంతున నైదుపలములును, కానుగకటుకరోహిణి శుంఠియును చేరి పైవివరించినభాగప్రకారము ఒకపలమును చేరి సముదాయము (ఎనిమిదిద్రవ్యములును) ఆరుపలములగును. ఈసముదాయమును నలియగొట్టి అందొక్కొకనాటి కొక్కొకపలమువంతున గ్రహించి విధ్యుక్తప్రకారము కషాయము కాచి యొక్కొక దినమువంతున నారుదినము లుపయోగించినచో కుష్ఠములు మున్నగురోగములు శమించునని నిష్కృష్టార్థము.

పైవివరణమును తంత్రాంతరవచనము లిట్లు తెలుపుచున్నవి:—"పటోలమూలం త్రిఫలావిశాలా చ పలోన్మితా, పలార్ధా త్రాయమాణా చ తథా కటుకరోహిణీ కర్షార్ధా నాగరం దత్వా, షట్పలాన్యపచూర్ణయేత్, జలే శృతం పిబేత్కోష్ణం చూర్ణస్యాత్ర పలం పలమ్" అని అగ్నివేశతంత్రమున చెప్పబడినది. ఇచ్చట "కర్షార్ధా నాగరం దత్వా పలార్ధా, త్రాయమాణా కటురోహిణీ చ" అను అన్వయముచే పైయర్థము లభించును.

మరియు "పటోలమూలం త్రిఫలా విశాలా చ, పలాంశికా, కటుకా త్రాయమాణా చ పలార్ధా పాదనాగరా, తస్మాత్ షడ్భాగముత్క్వాథ్య జలే దోషహరం పిబేత్" అని తంత్రాంతరమున చెప్పబడినది.

పైవివరణమంతయును చక్రపాణిదత్తవ్యాఖ్యాన సమ్మతమైనది. కొందరు నవీన వ్యాఖ్యాతలు ఈయోగమున భాగముల జెప్పునప్పుడు వ్యాఖ్యానము ననుసరించక స్వతం

త్రముగ వ్రాసిరి. వ్యాఖ్యాతలయభిప్రాయమును గమనించుట సమంజసమని తదనుసారముగ వివరించినాడు.

## కుష్ఠహరముస్తాదిచూర్ణము.

మూ. ముస్తం వ్యోషం త్రిఫలా మఞ్జిష్ఠా దారు పఞ్చమూల్యౌ ద్వే,
సప్తచ్ఛదనిమ్బత్వక్ సవిశాలశ్చిత్రకో మూర్వా. 65
చూర్ణం తర్పణభాగైః నవభిస్సంయోజితం సమధ్వాజ్యం,
సిద్ధం కుష్ఠనిబర్హణమేతత్ ప్రాయోగికం భక్ష్యమ్. 66
శ్వయథుం సపాణ్డురోగం శ్విత్రం గ్రహణీప్రదోషమర్శాంసి,
బ్రధ్నభగన్దరపిటకాకణ్డూకోఠాంశ్చ వినిహన్తి. 67
(ఇతి ముస్తాదిచూర్ణమ్.)

వ్యా. తుంగగడ్డలు, త్రికటుకములు (శుంఠి, పిప్పలి, మిరియాలు), త్రిఫలములు (కరక-తాని-ఉసిరికకాయలు), మంజిష్ఠి, మ్రానిపసుపు, లఘుపంచమూలములు, మహాపంచమూలములు, సప్తచ్ఛద (ఏడాకులపొన్న, వేపపట్ట, ఏటిపుచ్చకాయలు, చిత్రమూలము, చాగపట్ట, వీనినన్నిటిని సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి యాచూర్ణమునకు తొమ్మిదింతలు సత్తుపిండిని కలిపి, అందు తేనెను నేతిని కలిపి ప్రతిదినంబు నుపయోగించుచున్నచో కుష్ఠములనెల్ల హరించును. మరియు వాపు, పాండురోగము, శ్విత్రము, గ్రహణిరోగము, అర్శోరోగము, అండవృద్ధి, భగందరము, ప్రమేహపిటికలు, దురద, కోఠములు, పొడలు, ఇవియన్నియు పైచూర్ణమును సేవించుటవలన నివర్తించును.

## సుప్తికుష్ఠహరచూర్ణము.

మూ. త్రిఫలాఽతివిషాకటుకానిమ్బకలింగకవచాపటోలానాం,
మాగధికారజనీద్వయపద్మకమూర్వావిశాలానామ్. 68
భూనిమ్బపలాశానాం దద్యాద్ద్విపలం తతస్త్రివృద్ద్విగుణా,
తస్యాశ్చ పునర్బ్రాహ్మీ తచ్చూర్ణం సుప్తినుత్పరమమ్. 69

వ్యా. త్రిఫలములు, అతివస, కటుకరోహిణి, వేపపట్ట, కొడిశపాలవిత్తులు, వస, చేదుపొట్ల, పిప్పళ్లు, పసుపు, మ్రానిపసుపు, పద్మకము, చాగమట్ట, చేదుపుచ్చ, నేలవేము, మోదుగపట్ట, వీనిని ప్రత్యేకము రెండేసి పలములును, తెగడ నాల్గుపలములును, సరస్వతి

యాకు (8) ఎనిమిదిపలములును, నొకటిగ జేర్చి చూర్ణముచేసి సేవించినచో సుప్తి (త్వగింద్రియమును) చెరచునట్టి 7 కుష్ఠముల హరించును.

కుష్ఠరోగములయందు మాక్షికాదిప్రయోగము.

మూ. లేలీతక(నవనీతక)ప్రయోగో రసేన జాత్యాః సమాక్షికః పరమః,
సప్తదశకుష్ఠఘాతీ, మాక్షికధాతుశ్చ మూత్రేణ. 70
శ్రేష్ఠం గన్ధకయోగాత్ సువర్ణమాక్షికప్రయోగాద్వా,
సర్వవ్యాధినిబర్హణమద్యాత్కుష్ఠీ రసం చ నిగృహీతమ్. 71
వజ్రశిలాజతుసహితం సహితం వా యోగరాజేన,
సర్వవ్యాధిప్రశమనమద్యాత్కుష్ఠీ నిగృహ్య నిత్యం చ. 72

వ్యా. లేలీతకము (పాషాణభేదము)ను,ఉసిరికకాయలరసముతోను, తేనెతోడను, కలిపి సేవించినచో కాకణకుష్ఠముదక్క తక్కిన పదునేడు కుష్ఠములును హరించును. మాక్షికధాతువును గోమూత్రముతో కలిపి సేవించినను, లేక మాక్షికమును గంధకముతో నైనను, స్వర్ణమాక్షికముతో నైనను చేర్చి గోమూత్రముతో సేవించినను, కుష్ఠముల నన్నిటిని హరించును. మరియు కట్టబడినరసమును వజ్రభస్మముతోను, గోమూత్రశిలాజితుతోను, యోగరాజగుగ్గులతోడను, గూర్చి కుష్ఠరోగి సేవించినచో కుష్ఠములు మున్నగు గొప్పవ్యాధు లన్నియు నివర్తించును. ఈయోగములను ఇంద్రియముల నిగ్రహించి కుష్ఠరోగి ప్రతిదినమును సేవింపనగును.

ఇచ్చట లేలీతకము అనునది ఉత్తరదేశమున (హిమాలయప్రాంతమున) పాషాణభేదమని ప్రసిద్ధమైనది. దీనినిగూర్చి నిఘంటువునం దిట్లు చెప్పబడినవి:—''ఆసీద్దైత్యో మహాబాహుః లేలీహానో మహాసురః, యోజనానాం త్రయః త్రింశత్ కాయేనాచ్ఛద్య తిష్ఠతి. విష్ణుచక్రేణ సంఛిన్నోపపాత ధరణీతలే. వసాతస్య సమాఖ్యాతా లేలీహ(త)ఇతి క్షితౌ'' పూర్వమొకకాలమున లేలీహానుడను గొప్పరాక్షసుడు నిడుపలైన చేతులు కలవాడొకడుండెను. వాడు తన శరీరముచే పదుమూడు యోజనముల దూరము నాక్రమించి యుండెను. వాడు విష్ణుచక్రముచే బ్రద్దలుగ జీల్చబడి భూమిపై బడెను. వాని శరీరమునుండి వెడలిన క్రొవ్వు భూమిపై వ్యాపించి లేలీతకము అనుపేరుగల పాషాణరూపముతో వ్యవహరించబడుచుండును అని యర్థము.

కుష్ఠహరమధ్వాసయోగము.

మూ. ఖదిరసురదారుసారం శ్రపయిత్వా తద్రసేన తోయార్థః,
క్షౌద్రప్రస్థే కార్యః కార్యే తే చాష్టపలికే చ. 73

తత్రాయశ్చూర్ణానామష్టపలం ప్రక్షిపేత్తథాముాని,
త్రిఫలైలే త్వఙ్మరిచం పత్రం కనకం చ కర్షాంశమ్. 74
మత్స్యండికా మధుసమా తన్నాసం జాతమాయసే భాండే,
మధ్వాసవమాచరతః కుష్ఠకిలాసే శమం యాతః. 75

(ఇతి మధ్వాసవః.)

వ్యా. చంద్రచేవ, దేవదారుచేవ, ఈరెంటిని యెనిమిదేసి పలములవంతున గ్రహించి నాల్గుపాళ్లు నీళ్లుపోసి నాల్గవపాలు మిగులునట్లు కషాయము కాచి యీకషాయమును ద్రవమునకై యుంచుకొని అందు 2 ప్రస్థములు తేనెనుచేర్చి ఉక్కురాపొడి చూర్ణమును ఎనిమిదిపలములు కలిపి యొకటిగ చేర్చి యుంచునది. అందు త్రిఫలములు, ఏలకులు, దాల్చినిచెక్క మిరియాలు, లవంగపత్రి, నాగకేసరములు, వీనిని ఒక్కొక్క కర్షమువంతున చూర్ణముచేసి కలిపి యీసముదాయమును తేనెకు సమభాగమైన (ఒక ప్రస్థము) చక్కెరపాకములో (జీరాలో) కలిపి యొక యినుపపాత్రలో పోసి నెలదినములు పదిలముగ భూస్థాపితము చేసి యుంచిన నయ్యది మధ్వాసవమనబడును. దీనిని సేవించినచో కుష్ఠంబులును, కిలాసకుష్ఠంబులు శమించు.

### కుష్ఠహరకనకబిన్ద్వరిష్టయోగము.

మూ. ఖదిరకషాయద్రోణం కుంభే ఘృతభావితే సమావాప్య,
ద్రవ్యాణి చూర్ణితాని చ షట్పలికాన్యత్ర దేయాని. 76
త్రిఫలావ్యోషవిడఙ్గరజనీముస్తాటరూషకేన్ద్రియవాః,
సౌవర్ణీ చ తథా త్వక్ఛిన్నరుహా చేతి తన్నాసమ్. 77
నిదధీత ధాన్యమధ్యే ప్రాతః ప్రాతః పిబేత్తతో యుక్త్యా,
మాసేన మహాకుష్ఠం హన్త్యేవాల్పస్తు పక్షేణ. 78
అర్శః శ్వాసభగన్దరకాసకిలాసప్రమేహశోషాంశ్చ
నాభవతి కనకవర్ణః పీత్వారిష్టం కనకబిన్దుః. 79

(ఇతి కనకబిన్ద్వారిష్టం)

వ్యా. నాల్గుద్రోణముల నీళ్లకు నాల్గవవంతు చంద్రచేవను చేవను నాల్గవపాదము (ద్రోణపరిమితి) మిగులునట్లు కషాయము కాచునది ఆద్రోణపరిమితమైన చంద్రకషాయమును నేతితో మాగి యొకకుండలో పోసి అందు ఈక్రింద చెప్పబడు ద్రవ్యముల

చూర్ణమును చేర్చునది. త్రిఫలములు, త్రికటుకములు, వాయువిడంగములు, పసుపు, తుంగగడ్డలు, అడ్డసరము, కొడిశపాలగింజలు, మ్రానిపసుపుచెక్క, తిప్పతీగె, ఈద్రవ్యములను ప్రత్యేకము అరసేసిపలములవంతున చేర్చి చూర్ణముచేసి పైజెప్పిన కషాయములో జేర్చి మూత మూసి మట్టి లేఖనము జేసి వడ్లధాన్యములో నొకమాస ముంచునది. పిమ్మట ఈరసమును ప్రతిదినము నుదయముపూట బలానుసారముగ యుక్తియుక్తముగ సేవించునది. ఇత్తెరంగున నొకమాసము సేవించినచో మహాకుష్ఠంబులును, పదునైదుదినములు సేవించినచో క్షుద్రకుష్ఠంబులును శమించును. మరియు అర్శోరోగము, శ్వాసము, భగందరము, కాసము, కిలాసము, ప్రమేహములు, క్షయములు, ఇవియన్ని దీనిని సేవించుటచే హరించును. మనుజుడు బంగరును బోలిన చ్ఛాయ కల్గియుండును. ఇదియే కనకబింద్వరిష్ట మనబడును.

ఇచ్చట తేనెయు, శర్కరయు లేక ఆసవారిష్టకల్పన ముండదు గావున ఈ యోగమున చెప్పకున్నను మధ్వాసవయోగమున చెప్పబడినరీతిగ తేనెను చక్కెరను ఒక్కొక్క ప్రస్థపరిమితము జేర్చుకొనవలయునని యెరుంగునది.

### పైచికిత్సకు దోషానుగుణముగ విభాగము.

మూ. కుష్ఠేష్వనిలకఫకృతేష్వేవం పేయాస్తథాపి పైత్తేషు,
కృతమాలక్వాథశ్చాప్యేష విశేషాత్కఫకృతేషు. 80

వ్యా. పైజెప్పిన యౌషధయోగములను వాతకఫకుష్ఠములయందును పిత్తాదికుష్ఠములయందును పానముచేయందగును. మరియు కఫకుష్ఠములయందు రేలకషాయమువిశేషముగ నుపయోగింపనగును.

### కుష్ఠహరత్రిఫలాసవము.

మూ. త్రిఫలాసవశ్చ గౌడః సచిత్రకః కుష్ఠరోగవినిహన్తా,
క్రముకదశమూలదన్తీ వరాంగమధుయోగసంయుక్తః. 81

వ్యా. త్రిఫలములను, చిత్రమూలమును చేర్చి కషాయము గాచి యీకషాయమున పోకచెక్కలు, దశమూలములు, దంతివేళ్లు, దాల్చినచెక్క యీద్రవ్యములచూర్ణమును కలిపి అందు చక్కెరపాకమునకు బదులు గుడపాకమును తేనెయు కలిపి విధ్యుక్తప్రకారము ఆసవమును కల్పించునది. ఇదియే త్రిఫలాసవ మనబడును.(ఈయోగము త్రిఫలాది ద్రవ్యములకు భాగవిశేషము చెప్పకున్నను పైజెప్పబడినయోగముల ప్రకారము భాగముల గల్పించునది) ఈత్రిఫలాసవంబును కుష్ఠరోగముల నన్నిటిని హరించును.

కుష్ఠములయం దాహారనియమము.

మూ. లఘూని చాన్నాని హితాని విద్యాత్ కుష్ఠేషు శాకాని చ తిక్త కాని, భల్లాతకైస్త్రిఫలైస్సనిమ్బైః యుక్తాని చాన్నాని ఘృతాని చైవ. 32
పురాణధాన్యాన్యథ జాఙ్గలాని మాంసాని ముద్గాశ్చ పటోల యుక్తాః, శస్తాః; న గుర్వమ్లపయోదధీని నానూపమత్స్యాః న గుడస్తిలాశ్చ. 33

వ్యా. చులకనగ జీర్ణములగు అరువదినాళ్లసంబావులబియ్యపు అన్నము మున్నగు నవియు, చేదుగనుండు శాకంబులును, జీడిగింజలచేతను త్రిఫలములచేతను వేముచేతను సంస్కరింపబడిన యన్నంబులును ఘృతంబులును కుష్ఠములయందు చాల హితకరములు. మరియు ప్రాతధాన్యంబులును జాంగలదేశమున బుట్టిన జంతువులమాంసంబులును, పెసలును, చేదుపొట్లయు కుష్ఠరోగులకు చాల ప్రశస్తములు.

గురుత్వమును గల్గించునవియు, ఆమ్లరసద్రవ్యంబులును, పాలును, పెరుగును, జలప్రాంతమునందలి జంతువులమాంసంబులును, మత్స్యములును, బెల్లంబును, నువ్వులును హితములు కానేరవు.

కుష్ఠహరలేపములు, అందు ఏలాదిలేపము.

మూ. ఏలా కుష్ఠం దార్వీ శతపుష్పా చిత్రకో విడఙ్గశ్చ,
కుష్ఠాలేపనమిష్టం రసాఞ్జనం చాభయా చైవ. 84

వ్యా. ఏలకులు, చెంగల్వకోష్టు, మ్రానిపసుపు, సదాపవిత్తులు, చిత్రమూలము, వాయువిడంగములు, రసాంజనము, కరకకాయలు, వీనినన్నింటిని మెత్తగ నూరి కుష్ఠములపై పూయుట చాల మంచిది.

మండలకుష్ఠములకు చిత్రకాదిలేపము.

మూ. చిత్రకమేలాం బిమ్బీం (నిమ్బం) వృషకం త్రివృదర్కనాగరకం,
చూర్ణీకృతమష్టాహం భావయితవ్యం పలాశస్య. 85
క్షారేణ గవాం మూత్రస్రుతేన తేనాస్య మణ్డలాన్యాశు,
భిద్యన్తే విలయన్తి చ లిప్తాన్యభ్యఙ్గభితప్తాని. 86

వ్యా. చిత్రమూలము, ఏలకులు, దొండవేరు, (వేపపట్ట) అడ్డసరము, తెగడవేళ్లు, జిల్లేడువేరు, శుంఠి, వీని నన్నిటిని మెత్తగ చూర్ణముచేసి మోదుగాకులక్షోదకము

నను గోమూత్రమునను ఎనిమిదిదినములు భావనచేసి సూర్యపుటమున బాగుగ కాగబెట్టి పూతబూసినచో కుష్ఠము లన్నియుం భేదించి మానును. పొడలును మానును.

## జటామాంస్యాది లేపము.

మూ. మాంసీ మరిచం లవణం రజనీ తగరం సుధా గృహోద్ధూమః,
మూత్రం పిత్తం క్షారః పాలాశః కుష్ఠహా లేపః. 87

వ్యా. జటామాంసి, మిరియాలు, సైంధవలవణము, పసుపు, గ్రంథితగరము, జెముడుపాలు, కరిదూపము, గోమూత్రము, పిత్తద్రవము, మోదుగక్షారము, వీనిని నూరి పైని పూసినచో కుష్ఠములు నశించును.

## మండలకుష్ఠహర లేపములు.

మూ. త్రపుసీసమయశ్చూర్ణం మణ్డలనుత్ ఫల్గు చిత్రకౌ బృహతీ,
గోధారసస్సలవణో దారు చ మూత్రం చ మణ్డలనుత్. 88

వ్యా. తగరము, సీసము, ఇనుపరాపొడి, కుక్కతిపట్ట, చిత్రమూలము, వాకుడు వేరు, వీనిని నూరి పూసినచో మండలకుష్ఠము మానును. మరియు ఉడుమురసము, సైంధవలవణము, మ్రానిపసుపు, గోమూత్రము, వీనిని నూర్చి లేపనముచేసినను మండలకుష్ఠములు మానును.

## మండలకుష్ఠహరములగు కొన్ని లేపములు.

మూ. కదళీపలాశపాటలి నిచుళక్షారామ్బునా ప్రసన్నేన,
మాంసేషు తోయకార్యం కార్యం పిష్టే చ కిణ్వే (క్లిన్నే) చ. 89
తైస్తైర్మేదకస్సుజాతః కిణ్వైర్జనితం ప్రలేపనం శస్తం,
మణ్డలకుష్ఠవినాశనమాతపసంస్థం కృమిఘ్నం చ. 90

వ్యా. అరటిపట్ట, మోదుగాకులు, కలిగొట్టు ఆకు, నీరుప్రబ్బలియాకు, వీనిని కాల్చి బూడిదె చేసి యాబూడిదెను నీళ్లలో బోసి క్షారపాకవిధిప్రకారము క్షారోదకమును సిద్ధముచేయునది. మాంసముల కడుగుటకును పిండిని సిద్ధము చేయుటకును కిణ్వమును (సురాబీజమును) సిద్ధముచేయుటకు నీటితో చేయవలసిన కడుగుట వండుట మున్నగుకార్యములకెల్ల పైజెప్పిన క్షారోదకము తేటనే యుపయోగించునది. మాంసమును పిండిని కలిపి పైజెప్పినరీతిగ క్షారోదకమునే ప్రక్షాళనాదికార్యముల కుపయోగించుచు విధిప్రకారము సంధానముచేసి, దానిచే మేదకమును సురాబీజమును కల్పించి సిద్ధము చేయునది. అట్టి సురాబీజము కుష్ఠములపై పూయుటకు చాలఁ ప్రశస్తముగ నుండును.

అట్టి కిణ్వము(సురాబీజము)ను ఎండలో బెట్టి మండలకుష్ఠములకు పూసినచో నవి మానును. అందలి క్రిములు నశించును.

(సురయందు అడుగున గట్టిగనుండు ఘనపదార్థము మేదకమనియు, ఆ మేదకమును పక్వముచేసి సారము తీసినపిదప మిగిలిన పిప్పి కిణ్వము సురాబీజమనియు నెరుంగునది. పైజెప్పిన రీతిగ మాంసమును పిండిని కలిపి విధ్యుక్తప్రకారము సురాసంధానము చేసి దానకల్గిన కిణ్వమును పూసినచో మండలకుష్ఠములు నివర్తించునని సముదితార్థము).

## కుష్ఠస్నానాదులు.

మూ. ముస్తం మదనం త్రిఫలా కరఞ్జ ఆరగ్వధకలిఙ్గయవాః,
దార్వీ ససప్తపర్ణా స్నానం సిద్ధార్థకం నామ. 91
ఏష కషాయో వమనం విరేచనం వర్ణకస్తథోద్ధర్షః,
త్వగ్దోషకుష్ఠశోఫప్రబాధనః పాణ్డురోగఘ్నః. 92

వ్యా. తుంగగడ్డలు, మ్రంగకాయ, త్రిఫలములు, కానుగ, రేల, కొడిసెపాల గింజలు, యవలు, మ్రానిపసుపు, ఏడాకులపొన్న, తెల్లావాలు, వీని నన్నిటిని చేర్చి కాచబడిన నీళ్లలో స్నానము చేసినను; పైని చెప్పబడిన ద్రవ్యముల జేర్చి కాచబడిన కషాయముచే వమన-విరేచనములు చేయించినను, ఆద్రవ్యములను చేర్చి చూర్ణము (నలుగుపిండి) చేసి శరీరముపై రుద్ది స్నానముచేసినను కిలాసము మంగు మున్నగు చర్మదోషంబులును కుష్ఠంబులును, నంజులును, పాండురోగంబులును శమించును.

## కుష్ఠాదిలేపములు.

మూ. కుష్ఠం కరఞ్జబీజాన్యేడగజః కుష్ఠసూదనో లేపః,
ప్రపున్నాడబీజసైన్ధవరసాంజనకపిత్థలోధ్రాశ్చ. 93

వ్యా. చెంగల్వకోష్టు, కానుగవిత్తులు, తగిరసగింజలు, వీనిని నీళ్లతో నూరి లేపనముచేసినచో కుష్ఠముల హరించు. మరియు తగిరసగింజలు, సైంధవలవణము, రసాంజనము, వెలగపట్ట, లొద్దుగుపట్ట వీనినన్నిటిని నీళ్లతో నూరి లేపనము చేసినను కుష్ఠముల హరించును.

## శ్వేతకరవీరాదిలేపము.

మూ. శ్వేతకరవీరమూలం కుటజకరంజయోః ఫలం త్వచో దార్వ్యాః,
సుమనః ప్రవాళయుక్తో లేపః కుష్ఠాపహః సిద్ధః. 94

వ్యా. తెల్లగన్నేరువేరు, కొడిశపాలవిత్తులు, కానుగువిత్తులు, మ్రానిపసుపుచెక్క, జాజిచిగుళ్లు, వీని నొక్కటిగ చేర్చి నూరి పూసినచో కుష్ఠము హరించును.

### లోధ్రాదిలేపనము.

మూ. లోధ్రస్య ధాతకీనాం వత్సకబీజస్య నక్తమాలస్య,
కల్కాశ్చ మాలతీనాం కుష్ఠేషూన్మర్దనాలేపా. 95

వ్యా. లొద్దుగుపట్ట, ఆరెపూలు, కొడిశపాలవిత్తులు, కానుగవిత్తులు, జాజిచిగుళ్లు, వీని నన్నిటిని కల్కముగ నూరి శరీరముపై నలుగుపెట్టుకొనినను, పూసినను, కుష్ఠముల హరించును.

### శిరీషాదిలేపము.

మూ. శైరీషీ త్వక్, పుష్పం కార్పాస్యాః, రాజవృక్షపత్రాణి,
పిష్ట్వా చ కాకమాచీ, చతుర్విధః కుష్ఠనుల్లేపః. 96
(ఇతి లేపాః.)

వ్యా. దిరిసెనపుపట్టనైనను, పైడిప్రత్తిపువ్వులనైనను, రేలచిగుళ్లనైనను, కాచియాకునైనను, మెత్తగ నూరి పూసిన కుష్ఠములు హరించును. ఇది నాలుగువిధములైన ప్రలేపములు. ఇచ్చట "చతుర్విధలేపః" అని చెప్పుటచేత పైజెప్పిన దిరిసెనము మున్నగు నాల్గు ద్రవ్యములును, నాల్గు యోగములని యర్థమగుచున్నది. కొందరు ఈనాల్గిటిని యొకటిగ జేర్చి అపచూర్ణనము, ఉద్వర్తనము, జలపిష్టలేపనము, రసక్రియాలేపనము, అని నాల్గుతెరంగులైన లేపభేదములను గల్పించి యుపయోగించవలయునని చెప్పెదరు.

### కుష్ఠహరదార్వ్యాది కషాయయోగములు.

మూ. దార్వ్యా రసాంజనస్య చ నిమ్బపటోలస్య ఖదిరసారస్య,
ఆరగ్వధవృక్షకయోస్త్రిఫలాయాః సప్తపర్ణస్య. 97
ఇతి షట్కషాయయోగాః కుష్ఠఘ్నాః సప్తమశ్చ తినిశస్య,
స్నానే పానే చ హితాః తథాష్టమశ్చాశ్వమారస్య. 98
ఆలేపనం ప్రఘర్షణమవచూర్ణనమేత ఏవ చ కషాయాః,
తైలఘృతపాకయోగే చేష్యన్తే కుష్ఠశాన్త్యర్థమ్. 99

వ్యా. మ్రానిపసుపుచే సిద్ధమయిన రసాంజనము ఈరెంటియొక్క కషాయంబును; వేప, చేదుపొట్ల, ఈరెంటియొక్క కషాయంబును; చండ్రచేపయొక్క కషాయంబును; రేలపట్ట, కొడిశపాల ఈరెంటి కషాయంబును, త్రిఫలములు, ఏడాకులపొన్న ఈరెంటి

కషాయంబును, నెమ్మిపట్టకషాయంబును, గన్నేరువేళ్లకషాయంబును, ఈయెనిమిది కషాయయోగంబులును, కుష్ఠహారములు. ఈయోగములను స్నానమునకును, పానమునకు, ఆలేపనమునకును, ఉద్వర్తనమునకును, నలుగుబెట్టుకొనుటకును, తైలములను, ఘృతములను పక్వము జేయుట కుపయోగించినచో కుష్ఠహారములగును.

కఫపిత్తకుష్ఠములయందు త్రిఫలాదికషాయయోగములు.

మూ. త్రిఫలానిమ్బపటోలం మఞ్జిష్ఠా రోహిణీ వచా రజనీ,
ఏష కషాయోఽభ్యస్తో నిహన్తి కఫపిత్తజం కుష్ఠమ్. 100
ఏతైరేవ చ సర్పిః సిద్ధం వాతోల్బణం జయతి కుష్ఠం,
ఏష చ కల్పో దిష్టః ఖదిరాసనదారునింబానామ్. 101

వ్యా. త్రిఫలములు, వేపపట్ట, చేదుపొట్లవేరు, మంజిష్ఠి, కటుకరోహిణి, వస, పసుపు, ఈద్రవ్యములను చేర్చి కషాయము సిద్ధముచేసి యీకషాయమును ప్రతిదినమును పానాదుల కుపయోగించినచో కఫపిత్తములచే కల్గిన కుష్ఠములు హరించును. మరియు నీవస్తువులచే సిద్ధమైన ఘృతమును నుపయోగించినయెడ వాతాధిక్యముగల కుష్ఠముల హరించును. ఈకల్పమునే యనుసరించి చండ్రచేవను, వేగిసపట్టను, దేవదారుపట్టను, వేపపట్టను, కషాయయోగములుగ గల్పించి యుపయోగించినచో కుష్ఠముల హరించు.

కుష్ఠములకు ఆలేపనమునకు కుష్ఠాదితైలయోగము.

మూ. కుష్ఠార్కతుత్థకట్ఫలమూలకబీజాని రోహిణీ కటుకా,
కుటజఫలోత్పలముస్తం బృహతీకరవీరకాసీసమ్. 102
ఏడగజనిమ్బపాఠా దురాలభా చిత్రకో విడఙ్గశ్చ,
తిక్తాలాబుకబీజం కమ్పిల్లకసర్షపం వచా దార్వీ. 103
ఏతైస్తైలం సిద్ధం కుష్ఠఘ్నం యోగ ఏష చాలేపః,
ఉద్వర్తనం ప్రఘర్షణమవచూర్ణన మేష ఏవేష్టః. 104

వ్యా. చెంగల్వకోష్టు, జిల్లేడువేరు, మైలతుత్తము, కాయఫలము, ముల్లంగివిత్తులు, కటుకరోహిణి, కొడిశపాలగింజలు, నల్లకలువగడ్డ, తుంగగడ్డలు, వాకుడు, గన్నేరుపట్ట, అన్నభేది, తగిరసగింజలు, వేపపట్ట, చిరుబొద్ది, దూలగొండివేళ్లు, చిత్రమూలము, వాయువిడంగములు, చేదుసొరగింజలు, కంపిల్లకము, తెల్లావాలు, వస, మ్రానిపసుపు, ఈద్రవ్యములనన్నిటిని సమభాగములుగ చేర్చి కల్కముచేసి యీకల్కమునందు నాల్గింతలు నువ్వులనూనెలో చేర్చి. తైలపాకవిధిప్రకారము తైలమును పక్వముచేయునది.

ఈ తైలమును పూసినయెడల కుష్ఠములన్నియు హరించును. మరియు పైచెప్పిన ద్రవ్యములను చూర్ణముచేసి ఉద్వర్తనమునకును, శరీరముపై రుద్దుటకును అవచూర్ణనమునకు (అద్దుటకు)ను నుపయోగించినచో కుష్ఠములు హరించును.

ఇచ్చట తైలశబ్దముచేత ప్రధానమగు నువ్వులనూనెనే గ్రహింపనగును. కొందరు కుష్ఠములయందు దాలేపనములకు ఆవనూనె ముఖ్యము గావున తైలశబ్దముచేత ఆవనూనెనే గ్రహింప నగునని చెప్పెదరు. కొన్నిచోట్ల పాన తైలయోగములయందు విశేషనిర్దేశము లేనిచో నువ్వులనూనెయే గ్రహింప తగియుండును. మరియు ఇచ్చట ద్రవమును చెప్ప లేదుగాన "ద్రవేఽప్యనుక్తే జలమేవ దేయం" యను సామాన్యపరిభాషచేత కల్క ద్రవ్యములు పక్వమగుటకై తైలమునకు నాలుగింతలు జలమును చేర్చి చెంగల్వకోష్ఠు మున్నగు ద్రవ్యములకల్కమును తైలమునకు నాల్గవవంతు చేర్చి తైలపాకవిధిగ పక్వము చేయవలయునని యెరుంగునది.

### శ్వేతకరవీరాది తైలము.

మూ. శ్వేతకరవీరకరసో గోమూత్రం చిత్రకో విడంగశ్చ,
కుష్ఠేషు తైలయోగః సిద్ధోఽయం సమ్మతో భిషజామ్. 105
(ఇతి శ్వేతకరవీరాద్యం తైలం.)

వ్యా. తెల్లగన్నేరురసము, ఆవుపంచితము, ఈరెంటిని ద్రవములుగా చేర్చి చిత్రమూలము, వాయువిడంగములు, ఈరెంటిని కల్కము చేసి తైలమును పరిభాషానుసారముగ పక్వము చేసి పైపూత కుష్ఠములయం దుపయోగించునది.

### శ్వేతకరవీరపల్లవాది తైలము.

మూ. శ్వేతకరవీరపల్లవమూలత్వగ్వత్సకో విడంగశ్చ,
కుష్ఠార్కమూలసర్షపశిగ్రుత్వగ్రోహిణీ కటుకా. 106
ఏతైస్తైలం సిద్ధం కల్కైః పాదాంశికైర్గవాం మూత్రం,
దత్వా తైలచతుర్గుణమభ్యంగాత్ కుష్ఠకండూఘ్నమ్. 107
(ఇతి శ్వేతకరవీరపల్లవాద్యం తైలం.)

వ్యా. తెల్లగన్నేరుయొక్క చిగుళ్లు, దానివేరు, పట్ట, కొడిశపాలవిత్తులు, వాయువిడంగములు, కోష్టు, తెల్లజిల్లేడువేరు, తెల్లావాలు, మునగపట్ట, కటుకరోహిణి వీని నన్నిటిని సమభాగములుగ కల్కముచేసి యాకల్కమునకు నాల్గింతలు నువ్వులనూనెయు, నూనెకు నాల్గింతలు గోమూత్రమును నొకటిగ జేర్చి తైలపాకవిధిప్రకారము పక్వము జేసి యాతైలము నభ్యంగనముచేసినయెడ కుష్ఠమును, దురదయు మానును.

### కుష్ఠహరతిక్తాలాబ్వాదితైలము.

మూ. తిక్తాలాబుకబీజం ద్వే తుత్థే రోచనా హరిద్రే ద్వే,
బృహతీఫలమేరణ్డాః సవిశాలశ్చిత్రకో మూర్వా. 108
కాసీసహింగుశిగ్రుత్ర్యూషణసురదారుతుంబురువిడంగం,
లాంగలకం కుటజత్వక్ కుటుకాఖ్యా రోహిణీ చైవ. 109
సర్షపతైలం కల్కై రేతైర్మూత్రే చతుర్గుణే సాధ్యం,
కణ్డూకుష్ఠవినాశనమభ్యంగాన్మారకఫహన్తృ. 110
(ఇతి తిక్తేక్ష్వాక్వాదితైలం.)

వ్యా. చేదుసొరవిత్తులు, మైలతుత్తము, పాలతుత్తము, గోరోచనము, పసుపు, మానిపసుపు, వాకుడుగింజలు, ఆముదపువిత్తులు, చేదుపుచ్చవేరు, చిత్రమూలము, చాగపట్ట, అన్నభేది, ఇంగువ, మునగపట్ట, త్రికటుకములు, దేవదారుచెక్క, దనియాలు, వాయువిడంగములు, నాగేటిచాలుగడ్డ (పొత్తిదుంప) కొడిశపాలపట్ట, కటుకరోహిణి, వీనినన్నిటిని సమభాగములుగ కల్కము చేసి యాకల్కములకు నాల్గింతలు ఆవనూనెను కలిపి నూనెకు నాల్గింతలు గోమూత్రమును కలిపి తైలపాకముగ సిద్ధముచేయబడిన తైలము అభ్యంగనము చేసికొనినయెడల వాతకఫములచే కల్గినకుష్ఠములను, దురదను హరించును.

### కనకక్షీరతైలము.

మూ. కనకక్షీరీ శైలా భార్గీ దన్త్యాః ఫలాని మూలం చ,
జాతీప్రవాళసర్షపలశునవిడంగం కరంజత్వక్. 111
సప్తచ్ఛదార్కపల్లవమూలత్వఙ్నిమ్బచిత్రకాస్ఫోతాః,
గుంజైరండం బృహతీ మూలకసురసార్జకఫలాని. 112
కుష్ఠం పాఠాముస్తం తుంబురుమూర్వావచాః సషడ్గ్రన్థాః,
(కుష్ఠం తుంబురుపాఠా మూర్వాముస్తం వచాథ షడ్గ్రన్థా.)
ఏడగజకుటజశిగ్రుత్ర్యూషణభల్లాతకక్షవకాః. 113
హరితాలమవాక్పుష్పీతుత్థం కమ్పిల్లకోఽమృతాసంజ్ఞః,
సౌరాష్ట్రీ కాసీసం దార్వీత్వక్సర్జికాలవణమ్. 114

కల్కైరేతైస్తైలం కరవీరకమూలపల్లవ కషాయే,
సార్షపమథ వా తైలం గోమూత్రచతుర్గుణం సాధ్యమ్. 115
స్థాప్యం కటుకాలాబుని తత్సిద్ధం తేన మణ్డలాన్యాశు,
భిన్ద్యాద్భిషగభ్యంగాత్క్రిమీంశ్చ కండూం చ వినిహన్యాత్.116
(ఇతి కనకక్షీరీతైలమ్.)

వ్యా. కంకుష్ఠము, రాతిపువ్వు, గంటుబారంగి, వెఱ్ఱియాముదపుగింజలు, దానివేరు, జాజికాయ, జాజియాకు, తెల్లావాలు, వెల్లుల్లిపాయలు, వాయువిడంగములు, కానుగపట్ట, ఏడాకులపొన్న, జిల్లేడాకులు, వేరు, పట్ట, వేపపట్ట, చిత్రమూలము, తెల్లదింటెన, గురిగింజలు, ఆముదపుగింజలు, వాకుడుగింజలు, ముల్లంగిగింజలు, నల్లతులసి, తెల్లతులసి, మంగకాయలు, చెంగల్వకోష్టు, చిరుబొద్ది, తుంగగడ్డలు, దనియాలు, చాగపట్టలు, వస, కచోరములు, తగిరశగింజలు, కొడిశపాలపట్ట, మునగపట్ట, త్రికటుకములు, జీడిగింజలు, దుష్టుపాకు, హరిదళము, ఉత్తరేణి, మైలుతుత్తము, కంపిల్లకము, తిప్పతీగ, తువ్వరిమన్ను, అన్నభేది, మ్రానిపసుపుపట్ట, సర్జక్షారము, సైంధవలవణము, వీని నన్నిటిని సమభాగములుగ జేర్చి, కల్కము జేసి, కల్కమునకు నాల్గింతలు నువ్వులనూనె నైనను, ఆవనూనెనైనను జేర్చి, అందు గన్నేరాకులు, గన్నేరువేళ్లు ఈరెంటిచే సిద్ధమయిన కషాయమును తైలమునకు సమభాగముగను నాల్గింతలు గోమూత్రము చేర్చి తైలపక్వముగ సిద్ధముజేసి యీతైలమును చేదుసొరకాయబుఱ్ఱలో పదిలముగ నుంచునది. ఈతైలమును శరీరమున కభ్యంగనము చేసినచో మండలకుష్ఠములను, క్రిములను, దురదను, నతిశీఘ్రముగ హరించును.

## సిద్ధకుష్ఠహరలేపము.

మూ. కుష్ఠం తమాలపత్రం మరిచం సమనశ్శిలం సకాసీసం,
తైలేన యుక్తముషితం సప్తాహం భాజనే తామ్రే. 117
తేనాలిప్తం సిద్ధ్మం సప్తాహాద్వ్యేతి తిష్ఠతో ఘర్మే,
మాసాన్నవం కిలాసం స్నానం ముక్త్వా విశుద్ధతనోః. 118
(ఇతి సిద్ధ్మలేపః.)

వ్యా. చెంగల్వకోష్టు, కానుగఆకులు, మిరియాలు, మణిశిల, అన్నభేది, వీనిని సమభాగములుగ చేర్చి చూర్ణముచేసి యాచూర్ణమున నువ్వులనూనెలో కలిపి యొక రాగిపాత్రలో నేడుదినము లుంచి రోగి తొలుత వమనవిరేచనములచే శోధనము చేసి

కొని యా తైలమును శరీరమునకు బూసికొని యెండలోనుండునది. ఇత్తెరంగున నేడుదినములు చేసినచో సిద్ధకుష్ఠంబును, మాసముదినములు చేసికొనినచో నూతనముగ పుట్టిన కిలాసంబు (తెల్లపొడలు)ను నివర్తించును. దీని నుపయోగించునప్పుడు స్నానమును విడువవలెను.

కుష్ఠసామాన్యముగ నుపయోగింపదగిన తైలములు.

మూ. సర్షపకరఞ్జకోశాతకీనాం తైలాన్యథేఙ్గుదీనాం చ,
కుష్ఠేషు హితాన్యాహుః తైలం యచ్చాపి ఖదిరసారస్య. 119

వ్యా. ఆవనూనె, కానుగనూనె, చేదుబీరగింజలనూనె, గారకాయనూనె, చండ్రగింజలనూనె, ఈయైదు తైలములును కుష్ఠము లన్నిటికిని చాల హితములుగ నుండును. (పైచెప్పినతైలములైదును కుష్ఠములయందు ఆహారపదార్థముల సంస్కరించుటకును, తైలయోగములయందు విశేషనిర్దేశము లేనిస్థలములయందును గ్రహింపనగునని భావము).

విపాదికాకుష్ఠహరయమకస్నేహ లేపము.

మూ. జీవన్తీ మఞ్జిష్ఠా దార్వీ కమ్పిల్లకః పయస్తుత్థం,
ఏష ఘృతతైలపాకః సిద్ధస్సిద్ధే చ సర్జరసః. 120
దేయస్సమధూచ్ఛిష్టః విపాదికా, తేన శామ్యతేఽభ్యక్తా,
చర్మైకకుష్ఠకిటిభం (మం) కుష్ఠం శామ్యత్యలసకం చ. 121
(ఇతి విపాదికాహరఘృతతైలే)

వ్యా. మనుబాల, మంజిష్ఠి, మ్రానిపసుపు, కంపిల్లకము, జిల్లేడుపాలు, మైలుతుత్తము, వీనిని కల్కముగ నూరి కలిపి నెయ్యి నూనె ఈరెంటియందునుకలిపి పక్వము చేసి పక్వమైనపిదప అందు సర్జరసము, మైనము, కలిపి పూసినయెడల యరికాళ్లు పగులునట్టి విపాదికయను కుష్ఠము, శీఘ్రముగ నివర్తించును. మరియు దీనివలన చర్మకుష్ఠము, కిటిభకుష్ఠము, అలసకము, అనునవియు గూడ శమించును.

ఇచ్చట జీవన్తి మున్నగుకల్కద్రవ్యములు తైలమునకు నాల్గవవంతు జేర్పనగును. తైలము సిద్ధమయినపిమ్మట జేర్పదగిన సర్జరసంబును మైనమును జేరి సాహచర్యమునుబట్టి కల్కమునకు సమానభాగముగ నుండవలయును. "ఘృతతైలపాక" అనుచోట ఘృతతైలముల రెంటియొక్క పాకమని యర్థము. ఘృతమును తైలమును సమభాగములుగ నొకటిగ జేర్చి అందు పైజెప్పిన కల్కమును చేర్చి పక్వముచేయవలయునని భావము. తైలఘృతములు రెండు నొకటిగ చేరుటవలన ఇది యమకస్నేహ మనబడును. "పయః తుత్థం"

యనుచోట యౌగికమైన జిల్లేడుపాలను గ్రహింపదగును. ఈవిషయమును అష్టాంగహృదయమున (19) పందొమ్మిదవ యధ్యాయమునందు ఇదే యోగమును చెప్పియున్నది. అచ్చట సర్వాంగసుందరవ్యాఖ్యానమున "క్షీరమత్ర అర్కం గ్రాహ్యం యౌగికత్వాత్ వృద్ధవైద్యవ్యవహారాచ్చ." (అష్టాంగ. అధ్యా. (19) శ్లో. 77-78.) యని వివరించియున్నది.

మణ్డలకుష్ఠహరలేపములు.

మూ. కిణ్వం వరాహరుధిరం పృథ్వీకా సైన్ధవం చ లేపః స్యాత్,
లేపో యోజ్యః కుస్తుంబురూణి కుష్ఠం చ మణ్డలనుత్. 122
పూతీకదారుజటిలా పక్వసురా క్షౌద్రముద్గపర్ణ్యౌ చ,
లేపః సకాకనాసో మణ్డలకుష్ఠాపహః సిద్ధః. 123

వ్యా. సురాబీజము, అడవిపందిరక్తము, నల్లజీలకర్ర, సైంధపలవణము, దనియాలు, చెంగల్వకోష్టు, వీని నన్నిటిని నొకటిగ జేర్చి నూరి పూసినచో మండలకుష్ఠము నివర్తించును.

మరియు కానుగ, దేవదారుచెక్క, జటామాంసి, అన్నముచే సిద్ధము చేయబడిన సురయనుమద్యము, తేనె, అడవిపెసలు, కాకిదొండగడ్డ, వీని నన్నిటిని నూరి పూసిన యెడ మణ్డలకుష్ఠములు హరించును. (ఇచ్చట పక్వసుర యనఁగా పక్వాన్నసంధానముచే సిద్ధమయిన సురయని యర్థము. అనగా కలిసీళ్లు.)

కుష్ఠహరచిత్రకాదియోగములారు.

మూ. చిత్రకశోభాంజనకౌ గుడూచ్యపామార్గదేవదారూణి,
ఖదిరో ధవశ్చ లేపః, శ్యామా దన్తీ ద్రవన్తీ చ. 124
లాక్షారసాంజనైలాః పునర్నవా చేతి కుష్ఠినో లేపః,
దధిమణ్డయుతాః సర్వే దేయాః షణ్మారుతకఫకుష్ఠఘ్నాః. 125

వ్యా. చిత్రమూలము, మునగపట్ట (ఈరెండును యొకయోగము); తిప్పతీగె, ఉత్తరేణి, దేవదారు చెక్క (ఈమూడును చేరి యొకయోగము); చండ్ర, వెలిచండ్ర, (ఈరెండు చేరి యొకయోగము); నల్లతెగడ, దంతివేళ్లు, ప్రబ్బలివేళ్లు, (ఈమూడును చేరి యొక యోగము); లక్క, రసాంజనము, యేలకులు, (ఈమూడు చేరి యొకయోగము); తెల్లగలిజేరు (ఇది యొకటే యొకయోగము); ఈయారుయోగములను వేరువేరుగ నూరి పెరుగుమీది తేటనీటితో పులియబెట్టి పూసినచో వాతకఫకుష్ఠములు హరించును.

క్రిమికుష్ఠాదిహరలేపనము.

మూ. ఏడగజకుష్ఠసైన్ధవసౌవీరకసర్షపైః క్రిమిఘ్నైశ్చ,
క్రిమికుష్ఠమణ్డలాఖ్యం దద్రూకుష్ఠం చ శమముపైతి. 126

వ్యా. తగిరిశగింజలు, చెంగల్వకోష్టు, సైంధవలవణము, రేగుపట్ట, ఆవాలు, వాయువిడంగములు, వీని నన్నిటిని నూరి లేపనము చేసినచో క్రిములతోచేరిన కుష్ఠములు, మండలకుష్ఠము, దద్రుకుష్ఠము, ఇవి శమించును.

సిధ్మకుష్ఠహరలేపములు.

మూ ఏడగజః సర్జరసో మూలకబీజం చ సిధ్మకుష్ఠానాం,
కాంజికయుక్తం తు పృథక్ మతమిదముద్వర్తనం లేపాః. 127

వ్యా. తగిరిశవిత్తులు, సర్జరసము (తెల్లగుగ్గిలము), ముల్లంగివిత్తులు, వీనిని వేర్వేరుగ నూరి పుల్లనిగంజిలో కలిపి యుద్వర్తనము చేసినను, పూతపూసినను సిధ్మకుష్ఠములు నశించును.

స్నానపానాదులకు వాసాత్రిఫలాదికషాయయోగములు.

మూ. వాసా త్రిఫలా పానే స్నానే చోద్వర్తనే ప్రలేపే చ,
బృహతీసేవ్యపటోలాః ససారిబా రోహిణీ చైవ. 128
ఖదిరాశ్వఘాతకకుభః రోహీతకలోధ్రకుటజధవనిమ్బాః,
సప్తచ్ఛదకరవీరాః శస్యన్తే స్నానపానేషు. 129

వ్యా. అడ్డసరమును, త్రిఫలములను కషాయముచేసి త్రాగుటకును; స్నానముచేయుటకును; ఉద్వర్తనమునకును, పూయుటకును కుష్ఠములయందుపయోగింప నగును. మరియు వాకుడు, వట్టివేరు, చేదుపొట్ల, సుగంధపాల, కటుకరోహిణి, చంద్ర, కొండగోగు, ఏరుమద్ది, ములుమోదుగపట్ట, లొద్దుగుపట్ట, కొడిశపట్ట, వెలిచంద్రపట్ట, వేపపట్ట, ఏడాకులపొన్నపట్ట, గన్నేరుపట్ట, ఈద్రవ్యముల ప్రత్యేకకషాయములు, స్నానమునకును, పానమునకును నుపయోగింపదగును.

పిత్తకుష్ఠహరప్రలేపము.

మూ జలవాప్యలోహకేసరపత్రప్లవచందనం మృణాళాని,
భాగోత్తరాణి సిద్ధం ప్రలేపనం పిత్తకఫకుష్ఠే. 130

వ్యా. కురువేరు, చెంగల్వకోష్టు, అగరుచెక్క, నాగకేసరములు, లవంగపత్రి, కైవర్తముస్తలు, శ్రీగంధము, తామరతూండ్లు ఈ ఎనిమిదిద్రవ్యములను ఒకదానికన్న

నొకటి ఒక్కొక్క భాగ మధికముగ నుండునట్లు చేర్చి నూరి పూసినచో పిత్తకఫకుష్ఠములు హరించును.

—పిత్తకుష్ఠహరస్నానపానకషాయములు.—

మూ. యష్ట్యాహ్వాలోధ్రపద్మకపటోలపిచుమర్ద (పిచుమన్ద) చన్దనరసాశ్చ,
స్నానే పానే చ హితాః సుశీతలాః పిత్తకుష్ఠిభ్యః. 131

వ్యా. అతిమధురము, లొద్దుగుపట్ట, పద్మకము, చేదుపొట్ల, వేపపట్ట, చందనము, వీనిని వేరువేరుగ కషాయములు కాచి స్నానపానములకు పిత్తకుష్ఠరోగుల కుపయోగింపవలెను.

—కుష్ఠహరములగుకొన్ని లేపములు.—

మూ. ఆలేపనం ప్రియఙ్గుః హరేణుకా వత్సకస్య చ ఫలాని,
సాతివిషా చ ససేవ్యా సచన్దనా రోహిణీ కటుకా. 132

వ్యా. ప్రేంకణము, రేణుకలు, కొడిసెపాలగింజలు, అతివస, వట్టివేళ్లు, చందనము, కటుకరోహిణి, వీనిని నూరి పూసినచో కుష్ఠములు హరించును.

—మంటతో కూడిన కుష్ఠములకు ఘృతతైలలేపములు.—

మూ. తిక్తఘృతైర్ధౌతఘృతైః అభ్యఙ్గో దహ్యమానకుష్ఠేషు,
తైలైశ్చన్దమధుకప్రపౌణ్డరీకోత్పలయుతైశ్చ. 133

వ్యా. మంటతో కూడిన కుష్ఠములయందు తిక్తఘృత (తిక్తద్రవ్యముల చేర్చి, సిద్ధము చేయబడిన ఘృత)ములచేతను, శతధౌత-సహస్రధౌతఘృతములచేతను అభ్యంగనము చేయుట చాల మంచిది. మరియు చందనము, అతిమధురము, పుండరీకమను గంధద్రవ్యము, నల్లకలువగడ్డలు, వీనిని సమభాగముగ చేర్చి సిద్ధముచేయబడిన తైలములచే నభ్యంగనము చేసినను కుష్ఠములలో కల్గు మంట శమించును.

—అవస్థాభేదముచే కుష్ఠహరలేపము.—

మూ. క్లేదే ప్రపతతి చాఙ్గే దాహే విస్ఫోటకే సచర్మదలే,
శీతాః ప్రదేహసేకాః వ్యధో విరేకః ఘృతం తిక్తమ్. 134

వ్యా. కుష్ఠములయందు నీరుగారుచు అవయవము లూడిపడుచున్నను, సర్వాంగములయందు మంటయు పిటికలును కల్గినను, చర్మము పగులుచున్నను, అట్టి కుష్ఠములయందు స్పర్శ-వీర్యముచే చల్లగనుండు ద్రవ్యముచే పట్టువేయుటయు, అట్టి ద్రవ్యము

లచే సిద్ధమైన కషాయాదులచే తడుపుటయు, సిరావ్యధనముచేసి రక్తమును వెడలించుటయు, విరేచనంబును, తిక్తఘృతము నుపయోగించుటయు చాల మంచిది.

కుష్ఠములయందు ఖదిరాదిఘృతోపయోగము.

మూ. ఖదిరఘృతం నిమ్బఘృతం దార్వీఘృతముత్తమం పటోలఘృతం,
కుష్ఠేషు రక్తపిత్తప్రబలేషు భిషగ్జితం సిద్ధమ్. 135

వ్యా. చంద్రచేవచే సిద్ధము చేయబడిన ఘృతంబును, వేపపట్టచే సిద్ధముచేయబడిన ఘృతంబును, మ్రానిపసుపుచే సిద్ధము చేయబడిన ఘృతంబును, చేదుపొట్లఆకుచే చేయబడిన ఘృతంబును, రక్తపిత్తములయందును, ప్రబలములుగా నుండు కుష్ఠములయందును మిగుల ప్రశస్తము లైయుండును. (ఇచ్చట "సారస్యాత్ఖదిరాదీనాం నిమ్బాదీనాం త్వచస్తథా, ఫలం తు దాడిమాదీనాం పటోలాదేః దళం తథా." అను వచనాంతరమునుబట్టి చంద్రనుండి చేవయు, వేపచెక్కయు, పొట్లచెట్టునుండి ఆకును, గ్రహింపవలయునని తెలియునది.)

కుష్ఠములకు త్రిఫలాదిఘృతము.

మూ. త్రిఫలాత్వచోఽర్ధపలికాః పటోలపత్రఞ్చ, కార్షికాః శేషాః,
కటురోహిణీ సనిమ్బా యష్ట్యాహ్వా త్రాయమాణా చ. 136
ఏష కషాయః సాధ్యో దత్వా ద్విపలం మసూరవిదళానాం,
సలిలాఢకేఽష్టభాగే శేషే పూతో రసో గ్రాహ్యః. 137
తే (తత్ర) కషాయేఽష్టపలే చతుష్పలం సర్పిషశ్చ పక్తవ్యం,
యావత్స్యాదష్టపలం శేషం, పేయం తతః కోష్ణమ్. 138
తద్వాతపిత్తకుష్ఠం వీసర్పం వాతశోణితం ప్రబలం,
జ్వరదాహగుల్మవిద్రధివిభ్రమవిస్ఫోటకాన్ హంతి. 139

వ్యా. త్రిఫలముల (కరక-తాడి-ఉసిరికకాయల) బెరడు ప్రత్యేకము అర్ధపలము, చేదుపొట్లాకు అర్ధపలము; కటుకరోహిణి, వేపపట్ట, అతిమధురము, కల్లుత్రాగుడు, ఇవి ప్రత్యేకము కర్షప్రమాణము, చిరుసెనగపప్పు రెండుపలములు వీని నన్నిటిని నలియగొట్టి ఒక ఆఢకపరిమితమైన (అరువదినాల్గుపలముల) నీళ్లలో చేర్చి యెనిమిదవపాలు (ఎనిమిదిపలములు)మిగుల కషాయము కాచి వడగట్టి ఆయెనిమిదిపలముల కషాయములో నాల్గుపలములు ఆవునెయ్యి కలిపి యెనిమిదిపలములు మిగులునట్లు పక్వముచేసి యాఘృతమును సుఖోష్ణముగ నున్నపుడు త్రాగవలెను.

ఇయ్యది:—వాత-పిత్తకుష్ఠములను, విసర్పమును, వాతరక్తమును, జ్వరము, తాపమును, గుల్మములను, విద్రధిని, భ్రమమును, విస్ఫోటములను హరించును.

(పైజెప్పిన కల్పనము గంగాధరసమ్మతమైనది. ఎట్టులన:—ఏష సలిలాఢకే, అష్టశరావే ద్వైగుణ్యాభావవివక్షాతస్సాధ్యః. అష్టభాగే అష్టపలే శేషే, పూతః వస్త్రపూతం కృత్వా, రసో గ్రాహ్యః. తత్ర-శరావమితే కషాయే, చతుష్పలం ఘృతస్య చతుష్పలం, పక్తవ్యం, శేషం తు అష్టపలం కార్యమ్." అని గంగాధరవ్యాఖ్య యున్నది. ఈవ్యాఖ్యానము ప్రకృతమునకు యథాశ్రుతమైన యర్థమును బోధించుచున్నది. ఈవ్యాఖ్యానము "తత్ర కషాయేఽష్టపలే" అనుపాఠము ననుసరించి యున్నది. "యావత్స్యాదష్టపలం శేషం,పేయం తతః కోష్ణం" అష్టపలశేషమును చెప్పుటచేత ఎనిమిదిపలములను కషాయమును నాల్గుపలములను చేర్చి పక్వముచేయునప్పుడు నాల్గుపలములు కషాయముతో చేరిన ఘృతము అష్టపలశిష్టముగ నుండవలెనని తెలిసెడి.

చక్రపాణిదత్తవ్యాఖ్యానమున:—ఆఢకమునకు "ప్రస్థాదిమానమారభ్య ద్విగుణం తు ద్రవార్ద్రయోః." అను పరిభాషానుసారముగ ద్వైగుణ్యమును కల్పించి ఆఢకద్వయ పరిమిత (నూటయిరువదియెనిమిదిపలముల) జలమున కషాయము సిద్ధముచేసి, అష్టభాగశిష్టమైన (పదునారుపలముల)కషాయమున నాల్గుపలములు ఘృతమును చేర్చి అష్టపలావశిష్టముగ పక్వము చేయవలెనని చెప్పబడినది. ఈవ్యాఖ్యానమున "తే చ కషాయాష్టపలే శేషే" అనుచోట ద్వివచనాంతముగ జేసి రెండు కషాయాష్టపలములను, (ఎనిమిది పలములు) నాల్గుపలములు ఘృతము చేర్చి అష్టపలశిష్టమగునట్లు కాచవలెనని యర్థము. ఈద్వైగుణ్యకల్పమునకన్న యథాశ్రుతకల్పమే సమంజసమని తోచెడి. మరియు కుష్ఠములు మిగుల క్రూరము లగుటంజేసి మాత్రాధికసాధ్యములు కావున నీఘృతవిధానము ఉత్తమమాత్రగ చతుష్పలసమ్మితముగ చెప్పబడినది).

### కుష్ఠాదులకు తిక్తషట్పలకఘృతము.

మూ. నిమ్బపటోలం దార్వీం దురాలభాం తిక్తరోహిణీం త్రిఫలాం,
కుర్యాదర్ధ (పలాంశాం) ఢళాంకం పర్పటకం త్రాయమాణాఞ్చ.
సలిలాఢకసిద్ధానాం రసేఽష్టభాగస్థితే ఽపేతపూతే,
చన్దనకిరాతతిక్తకమాగధికాః త్రాయమాణాం చ. 141
ముస్తం వత్సకబీజం కల్కీకృత్యార్ధకార్షికాన్ భాగాన్,
నవసర్పిషశ్చ షట్పలమేతత్సిద్ధం (మేతత్తిక్తం) ఘృతం పేయమ్.

కుష్ఠజ్వరగుల్మార్శోగ్రహణీపాణ్డ్వామయశ్వయథుహారి,
పామావిసర్పపిటకాకండూమదగణ్డనుత్సిద్ధమ్. 143

(ఇతి తిక్తషట్పలకఘృతమ్.)

వ్యా. వేపపట్ట, చేదుపొట్లఆకు, మ్రానిపసుపు, దూలగొండివేరు, కటుకరోహిణి, త్రిఫలములబెరడు, పర్పాటకము, కలుక్రాసుగ, వీని ఒక్కొక్కటి యర్ధపలమువంతున చేర్చి ఒక ఆఢకపరిమితమైన (64 పలముల) నీళ్లలో వైచి (8) ఎనిమిదవపాలు మిగులునట్లు కషాయము కాచి వడగట్టి అందులో శ్రీగంధము, నేలవేము, పిప్పళ్లు, కలుక్రాసుగ, తుంగగడ్డలు, కొడిశగింజలు, వీనిని ఒక్కొక్కటి అర్ధకర్షము వంతున గ్రహించి నూరి కల్కముచేసి పైకషాయమున జేర్చి, అందు క్రొత్తనేతిని ఆరుపలములు చేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసి యుంచునది. ఇది తిక్తషట్పలఘృత మనబడును. దీనిని సేవించినయెడల కుష్ఠములు, జ్వరములు, గుల్మములు, అర్శోరోగములు, గ్రహణీరోగములు, పాండురోగము, వాపులు, పామా(గజ్జి) కుష్టము, విసర్పరోగము, పిటికలు, దురద, మదము, గండమాలలు వీని నన్నిటిని హరించును.

ఇచ్చట "సర్పిశ్చాప్యనవం హితం" అను సామాన్యవచనముచేత ప్రాతనెయ్యి గ్రహించుట యుక్తమని తెలిసినను, యోగప్రభావముచే నీయోగమున క్రొత్తనెయ్యిని గ్రహించుట యుక్తమని ఈతంత్రకారులు "నవసర్పిషశ్చ" యని క్రొత్తనేతిని విశేషవిధిగ నిర్దేశించిరి.

### మహాతిక్తకఘృతము.

మూ. సప్తచ్ఛదం ప్రతివిషాం శమ్యాకం తిక్తరోహిణీపాఠాం,
ముస్తముశీరం త్రిఫలాం పటోలపిచుమర్దపర్పటకమ్. 144
ధన్వయవాసం చన్దనముపకుల్యాం పద్మకం హరిద్రే ద్వే,
షడ్గ్రన్థాం సవిశాలాం శతావరీం శారిబే చోభే 145
వత్సకబీజం యా(వా)సాం మూర్వామమృతం కిరాతతిక్తఞ్చ,
కల్కాన్కుర్యాన్మతిమాన్యష్ట్యాహ్వం త్రాయమాణాఞ్చ. 146
కల్కశ్చాతుర్భాగో జలమష్టగుణం రసోఽమృతబలానాం,
ద్విగుణో ఘృతాత్ప్రదేయస్తత్సర్పిః పాయయేత్సిద్ధమ్. 147
కుష్ఠాని రక్తపిత్తప్రబలాన్యర్శాంసి రక్తవాహీని,
వీసర్పమమ్లపిత్తం (రక్తపిత్తం) వాతాసృక్పాండురోగఞ్చ. 148

విస్ఫోటకాన్ సపామాన్ ఉన్మాదం కామలాం జ్వరం కణ్డూం,
హృద్రోగగుల్మపిడకాః అసృగ్దరం గణ్డమాలాఞ్చ. 149
హన్యాదేతత్సర్పిః పీతం కాలే యథా బలం సద్యః,
యోగశతైరప్యజితా న్మహావికారాన్మహాతిక్తమ్. 150
(ఇతి మహాతిక్తంఘృతం.)

వ్యా. ఏడాకులపొన్న, అతిపస, రేలపట్ట లేక గుజ్జు, కటుకరోహిణి, విషబొద్ది, తుంగగడ్డలు, వట్టివేరు, కరక-తాని-ఉసిరికకాయలు, చేదుపొట్ల, ఆకు, వేపపట్ట, పర్పాటకము, పిన్నదూలగొండి, చందనము, పిప్పళ్లు,పద్మకము, పసుపు, మ్రానిపసుపు, గంట్లకచోరములు, వెర్రిపుచ్చవేరు, చల్లగడ్డలు, సుగంధపాల, పెద్దసుగంధపాల, కొడిశపాలవిత్తులు, (అడ్డసరము,) పెద్దదూలగొండి, చాగపట్టలు, తిప్పతీగ, నేలవేము, అతిమధురము, కలుక్రానుగ, వీని నన్నిటిని సమభాగములుగ జేర్చి కల్కముచేసి కల్కమునకు నాల్గింతలు ఆవునెయ్యి, నేతికెనిమిదింతలు నీళ్లు, నేతికి రెండింతలు ఉసిరికకాయలరసమును, వీని నన్ని నొకటిగ జేర్చి ఘృతపాకవిధిప్రకారము సిద్ధముచేయునది. ఇది మహాతిక్తకఘృతమనబడును. ఈఘృతమును యుక్తమైనకాలమున రోగియొక్క శరీరముయొక్కయు జఠరాగ్నియొక్కయు బలమును అనుసరించి సేవించినచో రక్తపిత్తముల యాధిక్యముగల కుష్ఠములు, రక్తము వెడలుచుండు అర్శోరోగములు, విసర్పరోగము, అమ్లపిత్తము, (రక్తపిత్తము) వాతరక్తము, పాండురోగము, విస్ఫోటకము, పామాకుష్ఠము, ఉన్మాదము, కామల, జ్వరము, దురద, హృద్రోగము, గుల్మములు, ప్రమేహపిటికలు, రక్తప్రదరము, గండమాల అను నీగొప్ప రోగము లన్నియు ఇతరములగు ననేకౌషధయోగములవలన నివర్తించకున్నను ఈఘృతము తప్పక శమింపజేయును.

కుష్ఠసామాన్యహారోపాయములు.

మూ. దోషే హృతేఽపనీతే రక్తే బాహ్యాన్తరే కృతే శమనే (వమనే),
స్నేహేచ కాలయుక్తే న కుష్ఠమను(అతి)వర్తతే సాధ్యమ్. 151

వ్యా. వమనవిరేచనమూలముగ దోషములు వెడలించుట, రక్తమోక్షణము, శరీరమునందలి బాహ్యాభ్యంతరములకు సంబంధించిన శమనచికిత్స, స్నేహపానము ఈచికిత్సలను ఆయాకాలములయందు విధ్యుక్తప్రకారము చేసినయెడ సాధ్యకోటిలో జేరిన కుష్ఠము తప్పక శమించును.

పామాభ్యంగాదులకు మహాఖదిరఘృతము.

మూ. ఖదిరస్య తులాః పఞ్చ శింశపాఽసనయోస్తులే,

తులార్థాః సర్వ ఏవైతే కరఞ్జారిష్టవేతసాః. 152
పర్పటః కుటజశ్చైవ వృషః క్రిమిహరస్తథా,
హరిద్రే కృతమాలశ్చ గుడూచీ త్రిఫలా త్రివృత్. 153
సప్తపర్ణశ్చ సంక్షుణ్ణో దశద్రోణేషు వారిణః,
అష్టభాగావశేషస్తు కషాయమవతారయేత్. 154
ధాత్రీరసం చ తుల్యాంశం సర్పిషశ్చాఢకం పచేత్,
మహాతిక్తకకల్కైస్తు యథోక్తైః పలసమ్మితైః. 155
నిహన్తి సర్వకుష్ఠాని పానాభ్యఙ్గనిషేవణాత్,
మహాఖదిరమిత్యేతత్ పరం కుష్ఠం వికారనుత్. 156

(ఇతి మహాఖదిరం ఘృతమ్.)

వ్యా. చంద్రచేవ ఐదుతులములు, (ఐదువందలపలములు), ఇరుగుడుచెట్టుపట్ట నొకతులము (నూరుపలములు), వేగిసపట్టనొకతులము (నూరుపలములు), కానుగపట్ట, వేపపట్ట, ప్రబ్బలి, పర్పాటకము, కొడిశపాలపట్ట, అడ్డసరము, వాయువిడంగములు, పసుపు, మ్రానిపసుపు, రేలపట్ట, తిప్పతీగ, (త్రిఫలములు, తెగడ, ఏడాకులపొన్న, ఇది ఒక్కొక్కటి ($\frac{1}{2}$) అర్ధతులము లేక ((50) ఏబదేసి పలములు), వీని నన్నిటిని నొకటిగ జేర్చి నలియగొట్టి (10) పదిద్రోణముల (3840) మూడు వేలయెనిమిదివందలనలువదిపలముల) నీటిలో వేసి ఎనిమిదవపాలు (ఐదు ఆఢకములు) మిగులునట్లు కషాయముకాచి యాకషాయమును దించి వడియగట్టి ఆకషాయమునకు సమభాగములుగ ఉసిరికకాయలరసమును కలిపి అందు ఒక ఆఢకపరిమితమైన ఆవునేతిని కలిపి మహాతిక్తకఘృతమున చెప్పిన ఏడాకులపొన్న మొదలగు కల్కద్రవ్యములను ప్రత్యేకము నొక్కొకపలమువంతున జేర్చి కల్కము చేసి పైఘృతములో గలిపి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసినచో నియ్యది మహాఖదిరఘృతమని చెప్పబడును. దీనిని పానమునకును అభ్యంగనమునకు నుపయోగించుట వలన కుష్ఠముల నన్నిటిని శీఘ్రముగ హరించును. (ఈఘృతయోగము అనార్షమని కొందరిమతము.)

### క్రిమికుష్ఠములయందు స్నానాదియోగములు.

మూ. ప్రపతత్సు లసీకాప్రస్రుతేషు గాత్రేషు జన్తుజగ్ధేషు,
మూత్రం నిమ్బవిడఙ్గే స్నానం పానం ప్రదేహాశ్చ. 157
వృషకుటజసప్తపర్ణాః కరవీరకరఞ్జనిమ్బఖదిరాశ్చ,
స్నానే పానే లేపే క్రిమికుష్ఠనుదః సగోమూత్రాః. 158

వ్యా. కుష్ఠములయందు శరీరావయవములు శిథిలములై పురుగులచే తినబడి యూడి పడుచున్నపుడును, చర్మదోషమువలన అందలి నీరు గారుచున్నను, గోమూత్రమును, వేపపట్టను, వాయువిడంగములను స్నానమునకును పానమునకును పట్టువేయుట కును నుపయోగింపనగును.

మరియు అడ్డసరము, కొడిసెపాల, ఏడాకులపొన్న, గన్నేరు, కానుగుపట్ట, వేప, చంద్రపట్ట, వీనిని వ్యస్తములుగనైనను సమస్తములుగనైనను స్నాన-పాన-ప్రలేప ముల కుపయోగించినయెడ క్రిమికుష్ఠముల హరించును.

### పానాదులయందు విడంగోపయోగము.

మూ. పానాహారవిధానే ప్రసేచనే ధూపనే ప్రదేహే చ,
క్రిమినాశనం విడఙ్గం, విశిష్యతే కుష్ఠహా ఖదిరః. 159

వ్యా. వాయువిడంగములు పానములకును, ఆహారపదార్థము సంస్కారముల యందును స్నానోదకమునందును, పొగవేయుటకును, పట్టువేయుటకును ఉపయోగించి నచో కుష్ఠములలో సంభవించు క్రిముల హరించును. మరియు కుష్ఠహరద్రవ్యములలో చండ్ర మిక్కిలి ప్రశస్తముగ నుండును.

### కుష్ఠహరములగు కొన్ని యోగములు.

మూ. ఏడగజస్సవిడఙ్గః మూలాన్యా రగ్వధస్య కుష్ఠానాం,
ఉద్దాలనం శ్వదన్తా గోఽశ్వవరాహోష్ట్రదన్తాశ్చ. 160
ఏడగజః సవిడఙ్గః రజనీద్వయరాజవృక్షమూలం చ,
కుష్ఠోద్దాలనమగ్ర్యం సపిప్పలీపాకలం యోజ్యమ్. 161

వ్యా. తగిరిశగింజలు, వాయువిడంగములు, రేలవేరుపట్ట, కుక్క గోవు గుఱ్ఱము పంది ఒంటె వీనిదంతములు, వీనిని ప్రలేపాదుల కుపయోగించినచో కుష్ఠహరము లగును. మరియు తగిరిశగింజలు, వాయువిడంగములు, పసుపు, మ్రానిపసుపు, రేలవేరుపట్ట, పిప్పళ్లు, చెంగల్వకోష్టు, వీని నన్నిటిని చేర్చి కుష్ఠములయందు లేపాదుల కుపయో గించిన కుష్ఠములు హరించును. (ఇంతదనుక కుష్ఠచికిత్సితము చెప్పబడినది.)

ఇంతదనుక కుష్ఠచికిత్సను చెప్పి కుష్ఠములబోలె త్వగ్దోషరూపమైన శ్విత్రచికిత్సిత మీ క్రింద చెప్పబడును:—

### శ్విత్రచికిత్సాక్రమము.

మూ. శ్విత్రాణాంసవిశేషం(ప్రశమార్థం)యోక్తవ్యంసర్వతోవిశుద్ధానాం,
శ్విత్రే స్రంసనమగ్ర్యం మలపూరస ఇష్యతే సగుడః. 162

తం పీత్వా సుస్నిగ్ధః యథాబలం సూర్యపాదసన్తాపం,
సంసేవేత విరిక్తాః త్ర్యహం పిపాసుః పిబేత్ పేయామ్ 163

వ్యా. శ్విత్రము కలవారికి తొలుత వమనవిరేచనములచే శోధనము చేయించి పిమ్మట పూర్తిగ శుద్ధలక్షణముల గమనించి కుష్ఠములకు జెప్పిన చికిత్సాక్రమమును శ్విత్రములయందును గాఢముగ చేయనగును.

మరియు శ్విత్రమున తొలుత స్నేహనము చేయించి కుక్కుత్తికాయలరసమున బెల్లమును కలిపి విరేచనములకై యిప్పించవలెను. ఇది శ్విత్రములయందు శ్రేష్ఠమైన విరేచనయోగము, ఆరసము త్రాగి బలానుసారముగ ఎండలో నుండవలెను. విరేచనము లైనపిదప దప్పి కల్గినప్పుడు పేయయను గంజిని త్రాగవలెను.

(ఈ చికిత్సాప్రకరణమున నాయారోగముల నిదానలక్షణాదుల సంగ్రహముగ తొలుత చెప్పి పిమ్మట చికిత్సను వరుసగ జెప్పబడుచున్నది. ఈశ్విత్రమునకు మాత్రము తొలుత చికిత్సను జెప్పి పిమ్మట నిదానము చెప్పుటకు కారణమేమనః— కుష్ఠమునకు జెప్పిన చికిత్సాక్రమమే శ్విత్రమునకు ప్రాయికముగ నతిదేశింపబడును. కావున కుష్ఠ చికిత్సానంతరమే శ్విత్రచికిత్సను చెప్పినచో శీఘ్రస్ఫూర్తి యగును. నడుమ నిదానమును చెప్పినయెడ వ్యవహితమగు కావున తొలుత చికిత్సయే చెప్పబడెను.)

## శ్విత్రములయందు కషాయపానము.

మూ శ్విత్రేఽఙ్గే యే స్ఫోటాః జాయన్తే కణ్టకేన తాన్ భిన్ద్యాత్,
స్ఫోటేషు విస్రుతేషు ప్రాతః ప్రాతః పిబేత్పక్షమ్. 164
మలపూమసనం ప్రియఙ్గుం శతపుష్పాం చామ్భసా సముత్క్వాథ్య,
పాలాశం వా క్షారం యథాబలం ఫాణితోపేతమ్. 165
యచ్చాన్యత్కుష్ఠఘ్నం శ్విత్రాణాం సర్వమేవ తచ్ఛస్తం,
ఖదిరోదకసంయుక్తం ఖదిరోదకపానమగ్ర్యం వా 166

వ్యా. శ్విత్రరోగికి శరీరమునందు బొబ్బ గల్గినచో వానినెల్ల ముండ్లచే భేదించి యందలి ద్రవమెల్ల స్రవించినపిదప, కుక్కుత్తికాయలు, వేగిస, ప్రేంకణము, సదాప విత్తులు, వీనిని నలియగొట్టి నీళ్లు పోసి కషాయము కాచి ప్రతిదినంబును ఉదయము పూట త్రాగవలెను. లేక మోదుగాకులక్షారమును క్షారపాకవిధిప్రకారము క్షారము చేసి యాక్షారమును చక్కెరపాకమున (జీరాలో) కలిపి యైన త్రాగవలెను. ఇత్తెరంగున పదునైదుదినములు క్రమముగ చేయవలెను.

మరియు కుష్ఠహరములగు నితరకషాయాదులలో దేనినైనను, సేవించిన చాల మంచిది. చంద్రకషాయమున కుష్ఠహరములలో దేనినైన చేర్చి సేవించుట చాల ప్రశస్తము.

## శ్విత్రములకు మనశ్శిలాది లేపనము.

మూ. సమనశ్శిలం విడఙ్గం కాసీసం రోచనాం కనకపుష్పం,
శ్విత్రాణాం ప్రశమార్థం ససైన్ధవం లేపనం దద్యాత్. 167

వ్యా. మణిశిల, వాయువిడంగములు, అన్నభేది, గోరోచనము, రేలపట్ట, సైంధవలవణము, వీని నన్నిటిని నూరి లేపనము చేసినచో శ్విత్రములు శమించును.

## శ్విత్రహరములగు కొన్ని లేపములు.

మూ. కదలీక్షారయుతం వా ఖరాస్థిదగ్ధం గవాం రుధిరయుక్తం,
హస్తిమదాధ్యుషితం వా మాలత్యాః కోరకక్షారమ్. 168
నీలోత్పలం సకుష్ఠం ససైన్ధవం హస్తిమూత్రపిష్టం వా,
మూలకబీజావల్గుజలేపః పిష్టో గవాం మూత్రే. 169
కాకోదుంబరికా వాసావల్గుజచిత్రకా గవాం మూత్రే,
పిష్టా మనఃశిలా వా సంయుక్తా బర్హిపిత్తే చ. 170
లేపః కిలాసహన్తా బీజాన్యావల్గుజాని లాక్షా చ,
గోపిత్తమంజనే ద్వే పిప్పల్యః కాలలోహరజః. 171

వ్యా. గాడిదయెముకను కాల్చి బూడిదజేసి అందు అరటియాకులక్షారమును కలిపి ఆవునెత్తురు పోసి నూరి పూసినను; జాజి మొగ్గలను కాల్చి క్షారము చేసి ఏనుగ మదమునందు నానబెట్టి పూసినను; నల్లకలువలు, చెంగల్వకోష్ఠు, సైంధవలవణము వీనిని ఏనుగమూత్రమును పోసి నూరి పూసినను; ముల్లంగివిత్తులు, బావంచివిత్తులు, ఈరెంటిని ఆవుపంచితముతో నూరి పూసినను; కుక్కత్తి, బావంచివిత్తులు, చిత్రమాలము, వీనిని ఆవుపంచితముతో నూరి పూసినను; మణిశిలను; నెమలిపిత్తద్రవమును నూరిపూసినను; బావంచివిత్తులు, కొయ్యలక్క; గోరోచనము, సౌవీరాంజనము, రసాంజనము, పిప్పళ్లు, ఉక్కురాపొడి, వీని గోరోచనద్రవమున నూరి పూసినను శ్విత్రకుష్ఠములు మానును.

### శ్విత్రాసాధ్యత్వము.

మూ. శుద్ధ్యా శోణితమోక్షైః విరూక్షణైః భక్షణైశ్చ సక్తూనాం,
శ్విత్రం కస్యచిదేవ ప్రశామ్యతి క్షీణపాపస్య. 172

వ్యా. వమనవిరేచనాదిశోధనములు, రక్తమోక్షణము, రూక్షణము ప్రధానముగాగలపదార్థముల సేవించుట, సత్తుపిండి తినుట, ఇట్టి చికిత్సలచేత జన్మాంతరకృతంబగు శ్విత్రములను గల్గించు కర్మశేషము నశించిన యొకానొకనికి మాత్రము శ్విత్రము శమించును. (శ్విత్రము జన్మాంతరమున జేసిన పాపఫలములచే సంభవించు క్రూరమయిన కర్మవ్యాధి కావున అట్టి పాపశేషము నశించియున్నవానికి పైజెప్పినచికిత్సలచేత శ్విత్రము శమించునుగాని కర్మశేషము నశించకయున్నయెడ ఎన్నిచికిత్సలు చేసినను శమించదని భావము.)

### శ్విత్రభేదములు.

మూ. దారుణం చారుణం శ్విత్రం కిలాసం నామభిస్త్రిభిః,
విజ్ఞేయం త్రివిధం తచ్చ త్రిదోషం ప్రాయశశ్చ తత్. 173
దోషే రక్తశ్రితే రక్తం తామ్రం మాంససమాశ్రితే,
శ్వేతం మేదశ్శ్రితే శ్విత్రం గురు తచ్చోత్తరోత్తరమ్. 174

వ్యా. దారుణము, అరుణము, కిలాసము, అనుపేర్లచే శ్విత్రము మూడువిధములుగ జెప్పబడును. ఈమూడు శ్విత్రములును ప్రాయికముగ త్రిదోషప్రకోపముచేతనే సంభవించును. మరియు దోషములు రక్తము నాశ్రయించి జనించిన శ్విత్రము రక్తవర్ణముగను, మాంసమునాశ్రయించి యున్నపుడు తామ్రవర్ణముగను, మేదస్సు నాశ్రయించి సంభవించినపుడు తెల్లని రంగుకల్గియు నుండును. ఈచెప్పబడిన రక్తతామ్రశ్వేతవర్ణములచే మూడువిధములయిన శ్విత్రములలో నొకదానికన్న నొకటి క్రూరమై యుండును.

### శ్విత్రసాధ్య-అసాధ్యవిభాగలక్షణములు.

మూ. యత్పరస్పరతోఽభిన్నం బహు యద్రక్తలోమవత్,
యచ్చ వర్షగణోత్పన్నం తత్ శ్విత్రం నైవ సిద్ధ్యతి. 175
అరక్తలోమాతను యత్ పాణ్డునాతి చిరోత్థితం,
మధ్యావకాశే చోచ్ఛూనం శ్విత్రం తత్సాధ్యముచ్యతే. 176

వ్యా. శ్విత్రములయందలి మచ్చలు ఒండొంట కలిసియున్నను శరీరమునందు విశేషముగ మచ్చలు వ్యాపించి యున్నను, మచ్చలయందలి వెంట్రుకలు, యెఱ్ఱగనున్నను,

శ్విత్రము జనించి అనేకసంవత్సరములు గడచియున్నను, అట్టి శ్విత్రములు మిక్కిలి యసాధ్యములు.

మరియు శ్విత్రమునందలి రోమములు ఎఱ్ఱబడకున్నను, మచ్చలు సూక్ష్మముగ నున్నను, పాండువర్ణమైనను, స్వల్పకాలమున జనించినదైనను, మచ్చలొండొంట గలియక దూరదూరముగనున్నను, మచ్చలలో గుంట బడక నున్నతముగనున్నను, అట్టి శ్విత్రములు సాధ్యమగును. (శ్విత్రములు నైసర్గికముననే అసాధ్యములు గావున కృచ్ఛ్రసాధ్య మగునని యర్థము.)

మరియు వాగ్భటాచార్యులు "గుహ్యపాణితలౌష్ఠేషు జాతమప్యచిరన్తనం" అని అసాధ్యలక్షణములను చెప్పిరి. గుహ్యస్థలమునందు, అరచేతులయందును, పెదవుల యందు,పుట్టిన శ్విత్రము కొద్దిరోజులుగ నున్నను అదియు నసాధ్యమే యగునని యర్థము.

శ్విత్రము జనించుటకు కారణములు.

మూ. వచాంస్యపథ్యాని కృతఘ్నభావో నిన్దా సురాణాం (గురూణాః) గురుధర్షణం చ, పాపక్రియా పూర్వకృతం చ కర్మ హేతుః కిలాసస్య విరోధి చాన్నమ్.

వ్యా. అసత్యములును, ఇతరులకు అప్రియములును, నగుమాటలు పలుకుట, ఇతరులు చేసినమేలు మరచి వారికి మరల నపకారముచేయుట, దేవతలను గురువులను నిందచేయుట, లేక తిరస్కరించి పలుకుట, ధర్మమునకు విరుద్ధములయిన పాపకృత్యముల జేయుట, (ఇవి యన్నియు ఈజన్మమున చేయబడిన కృత్యములు.) పూర్వజన్మమునచేసిన పాపకర్మములు, పరస్పరవిరుద్ధములగు క్షీరమత్స్యాదుల నొకటిగ జేర్చి భుజించుట, ఇవి యన్నియు శ్విత్రములు జనించుటకు కారణములు. మరియు కుష్ఠాదిరోగములు సంభవించుకారణములు కొన్ని తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"గురుతల్పగదోషాచ్చ గవిమైథునదోషతః దుశ్చర్మా స్యాత్, అసౌ కుర్యాత్ గురుతల్పాతిదేశితః చాన్ద్రాయణం త్రయం కుర్యాత్ తతో దోషాత్ ప్రముచ్యతే" గురుభార్యలతోను, గోవులతోను, సంభోగించినచో కుష్ఠము, శ్విత్రము మున్నగు చర్మమును చెరచునట్టి వ్యాధులు సంభవించును. అట్టిదోషము నివర్తించుటకు మూడు చాంద్రాయణవ్రతములును గురుభార్యాగమనప్రాయశ్చిత్తమును చేసికొనవలయును.

అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః.—

మూ. హేతుర్ద్రవ్యం లిఙ్గం వివిధం యే యేషు చాధికా దోషాః,
కుష్ఠేషు దోషలిఙ్గం సమాసతో దోషనిర్దేశః. 178

సాధ్యమసాధ్యం కృచ్ఛ్రం కుష్ఠం కుష్ఠాపహాశ్చ యే యోగాః,
సిద్ధాః, కిలాసహేతుర్లింగం గురులాఘవం తథా శాన్తిః. 179
ఇతి సంగ్రహః ప్రణీతో మహర్షిణా కుష్ఠనాశనేఽధ్యాయే,
స్మృతిబుద్ధివర్ధనార్థం శిష్యాయ హుతాశవేశాయ. 180

వ్యా. కుష్ఠములకు సంబంధించిన హేతువులు, ద్రవ్యము, లక్షణములు, ఆయా కుష్ఠములయందు అధికముగ నుండు దోషములవివరణము, కుష్ఠములయందు గల్గు దోష లక్షణములు, సంగ్రహముగ దోషసిద్దేశము,సాధ్య-అసాధ్య-కృచ్ఛ్రసాధ్య కుష్ఠ భేదములు, కుష్ఠముల హరించు సిద్ధయోగములు, కిలాస (శ్విత్ర)ము జనించుటకు కారణములు, వాని లక్షణములు, వాని గురులాఘవము, శ్విత్రచికిత్స, వీని నన్నిటిని మహర్షియగునాత్రేయులు తన శిష్యుడైన అగ్నివేశునకు జ్ఞాపకశక్తియు, బుద్ధియు వృద్ధినొందుటకై కుష్ఠ చికిత్సితమను నీయధ్యాయమును సంగ్రహముగ నుపదేశించెను.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, చికిత్సితస్థానే
కుష్ఠచికిత్సితం నామ సప్తమోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగు చరక సంహితయను నాయుర్వేదతంత్రమునందలి చికిత్సాస్థానమున కుష్ఠచికిత్సిత మనునది యేడవ యధ్యాయము సమాప్తము.

---

## అష్టమాధ్యాయము

అవతరణిక:—కుష్ఠమును బోలె రాజయక్ష్మంబును త్రిదోషజన్యము కావున కుష్ఠచికిత్సానంతరము రాజయక్ష్మనిదానము చెప్పబడును:—

మూ. అథాతో రాజయక్ష్మచికిత్సితం వ్యాఖ్యాస్యామః. 1
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. 2

వ్యా. కుష్ఠచికిత్సితమును జెప్పినపిదప కుష్ఠమును బోలె త్రిదోషములచే గల్గునట్టి రాజయక్ష్మమునకు చేరిన చికిత్సితమును భగవత్స్వరూపుడగు నాత్రేయు లుపదేశించిన దానికన్న న్యూనాతిరేకము కాకుండునట్లు వివరించెదనని యర్థము.

రాజయక్ష్మప్రాగుత్పత్తి, దానికి సంబంధించిన పురాణకథ.

మూ. దివౌకసాం కథయతామృషిభిర్వై శ్రుతా కథా,
కామవ్యసనసంయుక్తా పౌరాణీ శశినం ప్రతి. 3

రోహిణ్యామతిసక్తస్య శరీరం నానురక్షతః,
ఆజగామాల్పతామిన్దోః దేహః స్నేహపరిక్షయాత్. 4
దుహితౄణామసంయోగాత్ శేషాణాం చ ప్రజాపతేః,
క్రోధో నిశ్శ్వాసరూపేణ మూర్తిమాన్ నిస్సృతో ముఖాత్. 5
ప్రజాపతేర్హి దుహితౄ రష్టావింశతిమంశుమాన్,
భార్యార్థం ప్రతిజగ్రాహ న చ సర్వాస్వవర్తత. 6
గురుణా తమవధ్యాతం భార్యాస్వసమవర్తినం,
రజః పరీతమబలం యక్ష్మా శశినమావిశత్. 7
సోఽభిభూతోఽతిమహతా(గురుణా)గురుక్రోధేన నిష్ప్రభః,
దేవదేవర్షి సహితో జగామ శరణం గురుమ్. 8
అథ చన్ద్రమసశ్శుద్ధాం మతిం బుద్ధ్వా ప్రజాపతిః,
ప్రసాదం కృతవాన్; సోమః తతోఽశ్విభ్యాం చికిత్సితః. 9
స విముక్తగ్రహశ్చన్ద్రో విరరాజ విశేషతః,
ఓజసా(తేజసా) వర్ధితోఽశ్విభ్యాం శుద్ధం సత్త్వమవాప చ 10
క్రోధో యక్ష్మా జ్వరః రోగ ఏకార్థో దుఃఖసంజ్ఞకం,
యస్మాత్ సరాజ్ఞః ప్రాగాసీత్ రాజయక్ష్మా తతో మతః. 11
స యక్ష్మా హుఙ్కృతోఽశ్విభ్యాం మానుషం లోకమాగతః,
లబ్ధ్వా చతుర్విధం హేతుం సమావిశతి మానవాన్. 12

వ్యా. మున్నొకకాలమున స్త్రీపురుష కామవ్యసనమునకు సంబంధించిన కథనొక దానిని చంద్రునకు సంబంధించి దేవతలు చెప్పికొనుచుండ నాకథ ఋషివర్యులచే జెప్పబడిన పురాణమూలముగ నిట్లు వినబడుచున్నది:—చంద్రుడు తన శరీరబలమును కాపాడక తనభార్యయైన రోహిణియం దధికమైనకామము కల్గి అత్యాసక్తిచే తనశక్తికి మీరి సంభోగించుటవలన శరీరమునందలి స్నేహరూపమైన శుక్రంబును ఓజస్సును నానాట క్షీణించెను. దానంజేసి (శరీరప్రధానధాతువులు క్షీణించుటవలన) శరీరము నానాట కృశించెను.

మరియు దక్షప్రజాపతికి కూతుండ్లుగానుండు అశ్విన్యాది నక్షత్రములు (అభిజిత్తుతోకూడి) ఇరువదెనిమిదియు చంద్రునకు భార్యలుగా నుండిరి. చంద్రుడును అట్టి

భార్యలందరియందును అనురాగము సమముగ నుంచక కేవలము ఒక్క రోహిణియందే కామాంధపూరితుడై విచ్చలవిడిగ తక్కినభార్యల ననాదరముచేసి రోహిణితో క్రీడా సంభోగముల సల్పుచునుండ తనకూతుండ్లకుకల్గిన పరాభవమునంజేసి దక్షప్రజాపతికి మితిమీరిన కోపావేశము కలిగెను. ఆకోపము దక్షునిముఖమునుండి నిశ్శ్వాసరూపమున బైలువెడలి రూపవంతమై దక్షప్రజాపతికోపమునకు పాత్రుడును, భార్యలందరియందు నొక్కతీరున నుండక యొక్కతెయందే యనురాగాతిశయముతో వర్తించువాడును, అతిసంభోగముచే కృశించి బలహీనుడును నగుచంద్రునియందు ప్రవేశించెను.

పిమ్మట చంద్రుండును గురుక్రోధముచే తనశరీరకాంతియు బొత్తుగ గోలుపోయి తనయవజ్ఞతచే తనకు సంభవించిన దుఃస్థితి నెరింగి పశ్చాత్తాపము నొంది దేవతలతోడను ఋషివర్యులతోడను గూడి దక్షుని చెంత జేరి శరణము వేడెను. పిమ్మట ప్రజాపతియు తన తప్పిదము నెరింగి పరితపించు చంద్రుని జూచి విశుద్ధమతి యని యెరింగి వానియం దనుగ్రహము కల్గియుండెను.

పిదప చంద్రుడు అశ్వినీదేవతలచే చికిత్స జేయబడి ప్రజాపతిక్రోధరూపయక్ష్మరోగముచే విడువబడి మునుపటికన్న నధికముగ ప్రకాశించెను. అశ్వినీదేవతలచికిత్సచేత నోజస్సును తేజస్సును వృద్ధినొంది శుద్ధమైన మనస్సు బలమును బొందెను

మరియు క్రోధము, యక్ష్మము, జ్వరము, రోగము, దుఃఖము, అనుపదములు సమానార్థకములై రోగసామాన్యమును బోధించును. (రాజు అన చంద్రుడు) ప్రజాపతిక్రోధరూపమైన యక్ష్మరోగము తొలుదొలుత చంద్రునకు సంభవించుటంజేసి "రాజయక్ష్మ"మని లోకమున (నాయుర్వేదమున) వ్యవహరింపబడును. ఆరాజయక్ష్మము అశ్వినీదేవతలచే హుంకారారవమూలముగ ధిక్కరింపబడి చంద్రుని బాసి మనుష్యలోక (భూలోక)మున వ్యాపించెను. అయ్యది క్రింద చెప్పబడు నాల్గుకారణములను అవకాశముగ జేసికొని మానవుల నావహించి బాధింపసాగెను.

(ఇచ్చట స్నేహశబ్దముచేత శరీరమున సారభూతమైన యోజస్సును శుక్రంబును గ్రహింపబడును. మరియు నీప్రాగుత్పత్తి సూచకమైన యీకథాప్రస్తావముచే ధాతుక్షయము రాజయక్ష్మకు ప్రధానకారణంబనియు, భార్యలయందు ధర్మవిరుద్ధముగ నటించెనను కారణమును జెప్పియుండుటవలన, అధర్మము కూడ రెండవ కారణమనియు తెలిసెడి).

### రాజయక్ష్మకారణములు నాల్గు.

మూ. అయథాబలమారమ్భం వేగసన్ధారణం క్షయం,
యక్ష్మణః కారణం విద్యాత్ చతుర్థం విషమాశనమ్. 13

వ్యా. తనబలమును మీరినపనులజేయుట, మలమూత్రాదివేగముల నిరోధించుట, శరీరమునందలి శుక్రము ఓజస్సు అను ప్రధానధాతువులు క్షీణించుట, విషమాశనము (అకాలమునందైనను, తానుభుజించవలసిన పరిమితికి న్యూనాధికముగనైనను భుజించుట), ఈనాల్గును రాజయక్ష్మమునకు కారణములు. (పైజెప్పినకారణములలో తొల్లింటివి మూడును విహారరూపములు, నాల్గవది యాహారమునకు సంబంధించినది, కావున నాల్గవది ప్రత్యేకముగ జెప్పబడినది.

మరియు కారణముల నిర్దేశించుటచేతనే నాల్గుకారణములని తెలియుచున్నను "చతుర్థం" అని నిర్దేశించినది సాహసాదియవాంతరభేదములచే కారణము లనేకములుగ నున్నను పైజెప్పిన నాల్గుభేదములలోనే యంతర్భూతములని తెలియుట కని యెరుంగునది).

## సాహసముచే కల్గు రాజయక్ష్మరూపము.

మూ. యుద్ధాధ్యయనభారాధ్వలఙ్ఘనప్లవనాదిభిః,
పతనైరభిఘాతైర్వా సాహసైర్వా తథాఽపరైః. 14
అయథాబలమారమ్భైః జన్తోరురసి విక్షతే,
వాయుః ప్రకుపితో దోషా ఉదీర్యోభౌ ప్రధావతి. 15
స శిరస్థః శిరశ్శూలం కరోతి గలమాశ్రితః,
కణ్ఠోద్ధ్వంసం చ కాసం చ స్వరభేదమరోచకమ్. 16
పార్శ్వశూలం చ పార్శ్వస్థో, వర్చోభేదం గుదే స్థితః,
జృమ్భాం జ్వరం చ సన్ధిస్థః, ఉరస్థస్త్వురసో రుజమ్. 17
క్షణనాదురసః కాసాత్ కఫం ష్ఠీవేత్సశోణితం,
జర్జరేణోరసా కృచ్ఛ్రిమురశ్శూలాతిపీడితః. 18
(క్షణనాచ్చోరసో రక్తం కాసమానః కఫానుగం,
జర్జరేణోరసా కృచ్ఛ్రిం ఉరశ్శూలీ నిరస్యతి)
ఇతి సాహసికో యక్ష్మా రూపైః ఏతైః ప్రపద్యతే,
ఏకాదశభిరాత్మజ్ఞో భజేత్తస్మాన్న సాహసమ్. 19

వ్యా. బలవంతులతో బాహుయుద్ధము (కుస్తీ) చేయుట, అమితముగ చదువుట, అధికమైన భారమును మోచుట, కాలువ మున్నగుదానిని దుమికి దాటుట, నీటిలో నీదుట, ఇవి మున్నగు కారణములచేతను; క్రిందపడుటచేతను, దెబ్బ తగులుటచేతను,

తనబలమును గుర్తింపక బలమును మీరి చేయబడిన యితరములగు వ్యాయామాది సాహస కృత్యములచేతను ఉరస్థ్సలమునం దభిఘాతముకలిగి, వాతము మిక్కిలి ప్రకోపమునొంది, పిత్తకఫముల రెంటిని రేపెట్టి ప్రకోపింపజేసి వానితో కూడ కలిసి శరీరమునందెల్ల నల్గెడల వ్యాపించును.

మరియు:—పైజెప్పినరీతిగ ప్రకోపించి వాతము శిరస్సున జేరి తలనొప్పిని, కంఠమున జేరి, గొంతురాపు దగ్గు కంఠస్వరభేదము అరోచకము అను నీకంఠము నాశ్రయించిన రూపములను, ఇరుప్రక్కలజేరి పార్శ్వశూలమును, గుదస్థానమున జేరి మలభేదమును (మలమున ద్రవము శుష్కించి యుండక లై వెడలుట), కీళ్లయందు జేరి జృంభ (ఒడలివిరుపులు ఆవలింతలు) జ్వరము అనురూపములను, రొమ్మున జేరి రొమ్మునొప్పిని, రొమ్మునం దభిఘాతము కల్గి దగ్గు కల్గుటవలన రొమ్ము పగులదీయునట్లు బాధ కల్గి రక్తముతో కూడిన కఫమును కష్టముచే వెడలించుచు రొమ్మునొప్పిని కల్గించును. ఇత్తెరంగున సాహసకృత్యముల జేయుటచే పైజెప్పిన పదునొకండురూపములుకల రాజయక్ష్మరోగము సంభవించును కావున, మానవుడు మనస్సును తనయధీనమున నుంచుకొని తనబలమున కనురూపములగుపనుల జేయ గడంగవలెనుగాని బలమునకు మీరిన కృత్యముల నొకప్పుడు జేయంజనదు. (ఇచ్చట తలనొప్పి, గొంతురాపు, దగ్గు, స్వరభేదము, అరోచకము, పార్శ్వశూలము, మలభేదము, జృంభ, జ్వరము, రొమ్మునొప్పి, కఫస్రావము, అనునవి సాహసమున గల్గినరాజయక్ష్మమునందు కల్గు పదునొకండు రూపములు. వీని వివరణమే పైని వివరింపబడినది యని యెరుంగునది.) ఇది సాహసముచే గల్గిన రాజయక్ష్మము.

## వేగనిరోధజనితరాజయక్ష్మరూపము.

మూ. హ్రీమత్త్వాద్వా ఘృణిత్వాద్వా భయాద్వా వేగమాగతం,
వాతమూత్రపురీషాణాం నిగృహ్ణాతి యదా నరః. 20
తదా వేగప్రతీఘాతాత్ కఫపిత్తే సమీరయన్,
ఊర్ధ్వం తిర్యగధశ్చైవ వికారాన్ కురుతేఽనిలః. 21
ప్రతిశ్యాయం చ కాసం చ స్వరభేదమరోచకం,
పార్శ్వశూలం శిరశ్శూలం జ్వరమంసావమర్దనమ్. 22
అఙ్గమర్దం ముహుశ్ఛర్దిం వర్చోభేదం త్రిలక్షణం,
రూపాణ్యేకాదశైతాని యక్ష్మాయైరుచ్యతే మహాన్. 23

వ్యా. వాతమూత్రపురీషములు, వెడలనున్నప్పుడు వానివేగమును సిగ్గుచేనైనను, ఇతరులకు బాధకల్గు ననేకారణముచేనైనను, భయముచేనైనను, వెడలనీయక నిరో

ధించినయెడల అట్టివాతాదుల నిరోధించుటవలన వాతము మిగుల ప్రకోపమునొంది కఫ-పిత్తములరెంటిని రేపెట్టి ప్రకోపింపజేసి వానితో గూడి శరీరమునందు ఊర్ధ్వము గాను, అడ్డముగను, క్రిందుగను వ్యాపించి ఈ క్రింద చెప్పబడు పదునొకండురూపముల కల్గించును.

ప్రతిశ్యాయము (పీనసము), దగ్గు, స్వరభేదము, అరుచి, పార్శ్వశూలము, శిరః శూలము (తలనొప్పి), జ్వరము, మూపులయందు నొప్పి, ఒడలునొప్పి, పలుమారు వాంతి యగుట, త్రిదోషలక్షణములతో కూడిన పురీషభేదము అను నీపదునొకండు రూపము లతో కూడిన రాజయక్ష్మమును కల్గించును. ఇది వేగనిరోధజనిత రాజయక్ష్మము.

ధాతుక్షయజనితరాజయక్ష్మరూపము.

మూ. ఈర్ష్యోత్కంఠాభయత్రాసక్రోధశోకాతికర్శనాత్,
అతివ్యవాయానశనాత్ శుక్రమోజశ్చ హీయతే. 24
తతః స్నేహక్షయాద్వాయుర్వృద్ధో దోషావుదీరయన్,
ప్రతిశ్యాయం జ్వరం కాసం అఙ్గమర్దం శిరోరుజమ్. 25
శ్వాసం విడ్భేదమరుచిం పార్శ్వశూలం స్వరక్షయం,
కరోతి చాంససన్తాపమేకాదశగదా నిమాన్. 26
లిఙ్గాన్యావేదయన్త్యేతాన్యేకాదశమహాగదాన్,
సమ్ప్రాప్తం రాజయక్ష్మాణం క్షయాత్ప్రాణక్షయప్రదమ్. 27

వ్యా. ఈర్ష్య (సోర్వమి), ఉత్కంఠము (తొందరబాటు, భయము, ఉలిక పాటు, క్రోధము, దుఃఖము, కారణాంతరములచే శరీరమును కృశింపజేయుట, అధిక ముగ స్త్రీసంభోగముజేయుట, ఆహారము చేయకుండుట, ఈకారణములచేత శరీరము నందలి, శుక్రంబును, సారరూపమయిన ఓజస్సును క్షీణించును. స్నేహరూపమయిన శుక్ర ఓజస్సులు రెండును క్షీణించుటవలన వాతము మిక్కిలి వృద్ధినొంది ప్రకుపితమై కఫపిత్త ములరెంటిని ప్రకోపింపజేసి వానితో కూడి శరీరమున వ్యాపించి రాజయక్ష్మమును కల్గించును.

ఈరోగమునందు పీనస, జ్వరము, కాసము, అంగమర్దము, తలనొప్పి, శ్వాసము, పురీషభేదము, అరుచి, పార్శ్వశూలము, స్వరభేదము, మూపులయందు మంట, అను నీ పదునొకండు రూపములు గల్గును. ఈపదునొకండు లక్షణములును ప్రాణమును నశింప జేయునదియు, రోగములలో గొప్పదియు నగుధాతుక్షయమున గల్గిన రాజయక్ష్మరోగ మును సూచించును. ఇది ధాతుక్షయమున గల్గిన రాజయక్ష్మము.

## విషమాశనజనితరాజయక్ష్మము.

మూ॥ వివిధాన్యన్నపానాని వైషమ్యేణ సమశ్నతః,
జనయన్త్యామయాన్ ఘోరాన్విషమాన్మారుతాదయః. 28
స్రోతాంసి రుధిరాదీనాం వైషమ్యాద్విషమం గతాః,
రుద్ధ్వా రోగాయ కల్పన్తే పుష్యన్తి చ న ధాతవః. 29
ప్రతిశ్యాయం ప్రసేకఞ్చ కాసం ఛర్దిమరోచకం,
జ్వరమంసాభితాపఞ్చ ఛర్దనం రుధిరస్య చ. 30
పార్శ్వశూలం శిరఃశూలం స్వరభేదమథాపి చ,
కఫపిత్తానిలకృతం లిఙ్గం విద్యాద్యథాక్రమమ్. 31

వ్యా॥ పలుతెరంగులైన యన్నపానములను వానికి చెప్పియున్న విధి ననుసరింపక భుజించినయెడ వాతపిత్తకఫములు మూడును ప్రకోపమునొంది విషమముగ సంచరించుచు రసరక్తాదిధాతువులు వ్యాపించుట స్రోతస్సులను అడ్డగించి అట్టి స్రోతోనిరోధమువలన విషమంబులును, క్రూరంబులు నగురోగముల గల్గించుచు రాజయక్ష్మరోగమును గల్గించును. అట్టియెడ రక్తాదిస్రోతస్సులు అడ్డగింపబడి యుండుటవలన ధాతువులు పుష్టినొందక క్షీణించును. ఈరాజయక్ష్మమునందు పీనసము, నోట కఫమువెడలుట, దగ్గు, వాంతి, అరోచకము, జ్వరము, మూపులయందు మంట, రక్తము వాంతియగుట, పార్శ్వశూలము, తలనొప్పి, స్వరభేదము, అను నీపదునొకండు లక్షణములును కఫపిత్తవాతములచే క్రమముగ గల్గును. (ఇచ్చట ప్రతిశ్యాయము (పీనస), ప్రసేకము (నోట కఫము వెడలుట), కాసము (దగ్గు), ఛర్ది (వాంతి), అరోచకము, అనునవి కఫముచే కల్గు లక్షణములు. పార్శ్వశూలము, శిరఃశూలము, స్వరభేదము అనునవి వాతముచే గల్గులక్షణములు. జ్వరము, అంసతాపము, రక్తవమనము అనునవి పిత్తమున గల్గు లక్షణములు.) ఇది విషమాశనమున గల్గురాజయక్ష్మము.

మూ॥ ఇతి వ్యాధిసమూహస్య రోగరాజస్య హేతుజం,
రూపమేకాదశవిధం హేతుశ్చోక్తశ్చతుర్విధః. 32

వ్యా॥ ఇత్తెరంగున అనేకరోగములతో గూడినదియు, రోగములకెల్ల ప్రధానమైనదియు నగు రాజయక్ష్మరోగమునకు ఆయాకారణములచే జనించిన ఏకాదశరూపభేదములును, నాలుగువిధములయిన కారణములును వేరువేరుగ ఆయాకారణభేదములనుబట్టి నాల్గుతెరంగుల విభజించి వివరింపబడినవి.

ఇచ్చట నీవిషయము నెఱుంగునది:— రాజయక్ష్మోత్పత్తికి సాహసము, వేగనిరోధము, ధాతుక్షయము, విషమాశనము అనునవి నాల్గును ముఖ్యకారణములని నిర్దేశించి ఆయాకారణములచే జనించిన రాజయక్ష్మములకు వేరువేరుగ పదునొకండు రూపభేదములను ఒక్కొకదానికి చెప్పబడినది. ఇట్లు చెప్పుటచేత ఒక్కొక కారణముచే జనించిన రాజయక్ష్మమునకును ఏకాదశరూపము లన్నియు పూర్తిగ నున్నచో నయ్యది సంపూర్ణలక్షణ మగునుగాని అందు కొన్ని మాత్ర మున్నచో సంపూర్ణలక్షణము గానేరదని తెలిసెడి. మరియు నీక్రింద "కాసో సతాపో వైస్వర్యం" అని యుపక్రమించి "యక్ష్మిణః షడిమాణివ" యని రాజయక్ష్మమునకు ఆరురూపములను "అంసపార్శ్వాభితాపశ్చ... రాజయక్ష్మణః" అని మూడులక్షణములను, రాజయక్ష్మము నుద్దేశించి చెప్పబడినవి. ఐనను అయ్యవి అసంపూర్ణరాజయక్ష్మలక్షణములుగాని సంపూర్ణము కానోపదని యెఱుంగునది.

రాజయక్ష్మములకు సాహసాది నాలుగు కారణములచే నాల్గుతెరంగుల విభజించి ప్రత్యేకముగ పదునొకండు రూపభేదములు నిర్ణయింపబడినవి. ఈపదునొకండును నాల్గువిధములయిన రాజయక్ష్మములయందును ప్రాయికముగ నొకేవిధముగ కానంబడుచున్నది. అట్లుండి వేరువేరు కారణముల చెప్పుట యుక్తియుక్తము గాదు. ఈపక్షమునే యవలంబించి సుశ్రుతాచార్యులును ఇట్లుచెప్పెను:—"ఏకాదశానాం ఏకత్ర సాన్నిధ్యాతన్త్రయుక్తితః, క్రియాణాం చావిభాగేను ప్రాగేకోత్పాదనేనచ. ఏకఏవ మతః శోషః సన్నిపాతాత్మకో గదః." (సు. ఉ. అ. 41) అని యొక్కటిగనే చెప్పిరి. అట్లుండ కారణభేదముచే నాల్గు తెరంగుల గల్పించి ఏకాదశరూపత్వమును వేరువేర చెప్పుట అనవసరమని కొందరు చెప్పెదరు. కాని ఈయాక్షేపణము సమంజసము కానేరదు. ఏలనన:— రాజయక్ష్మమునకు హేతువులును ఆహేతువులకు సంబంధించిన లక్షణములును, చికిత్సలును, నాల్గిటికిని వేరువేరుగ పరస్పరభిన్నములై కన్పట్టుచున్నవి. అందు సాహసాదిహేతువులకు నాల్గిటికిని వేరువేరుగ వివరణము పైని చూపబడినవి. లక్షణములును సాహసజయక్ష్మమున కంఠోధ్వంసము, రొమ్మునొప్పి, జృంభ, ఈమూడును; వేగనిరోధజయక్ష్మమున అంగమర్దము మాటిమాటికి వాంతియగుట, త్రిదోషలక్షణములతో గూడిన పురీషభేదము, ఈమూడును; క్షయజమున శ్వాసము, పార్శ్వశూలము, అంసతాపము అనునవిమూడును; విషమాశనజయక్ష్మమున రక్తవమనమును చెప్పబడినవి. ఈలక్షణములు పరస్పరభిన్నములుగ నున్నవియేగాని యేకరూపముల గావు. మరియు సాహసజయక్ష్మమున ప్రతిశ్యాయము చెప్పబడలేదు. తక్కిన మూటియందు ప్రతిశ్యాయము చెప్పబడియున్నది. కావున ఈనాల్గిటియందు పరస్పరలక్షణభేదములు కాననగును. చికిత్సయుం ఆయాకారణముల బట్టి పరస్పరభిన్నములుగనే కల్పింపవలసియుండును. కావున! రాజ

యక్ష్మ రోగమునందు హేతులక్షణములను వేరువేరుగ రూపించుట సమంజసమగును. మరియు వాగ్భటులు మున్నగు కొందరాచార్యులు "పీనసశ్వాసకాసాంస......రూపాణ్యేకాదశైతాని జాయన్తే రాజయక్ష్మణః." ఇవి మున్నగు వచనములచేత పరస్పరభేదముల జెప్పక యేకరూపముగనే చెప్పిరిగాని అయ్యది స్థూలదృష్టిచే వారు చెప్పిరి. ఇచ్చట సూక్ష్మదృష్టిచే వేరువేరుగ యేకాదశరూపత్వమును ఈతంత్రకారు డుపదేశించెను. మరియు యక్ష్మ సామాన్యముగ ఏకాదశరూపత్వము "కాసోఽగ్ఃతాపః.........రూపాణ్యేకాదశైతాని." అని స్థూలదృష్టిచేతను నిర్దేశించిరని యెరుంగునది.

## రాజయక్ష్మసామాన్యపూర్వరూపము.

మూ. పూర్వరూపం ప్రతిశ్యాయో దౌర్బల్యం దోషదర్శనం,
అదోషేష్వపి భావేషు కాయే బీభత్సదర్శనమ్. 33
ఘృణిత్వమశ్నతశ్చాపి బలమాంసపరిక్షయః,
స్త్రీమద్యమాంసప్రియతా ప్రియతా చావకుణ్ఠనే. 34
మక్షికాఘుణకేశానాం తృణానాం పతనాని చ,
ప్రాయోఽన్నపానే, కేశానాం నఖానాం చాపి వర్ధనమ్ 35
పతత్రిభిః పతఙ్గైశ్చ శ్వాపదైశ్చాభిధర్షణం,
స్వప్నే కేశాస్థిరాశీనాం భస్మనశ్చాధిరోహణమ్. 36
జలాశయానాం శైలానాం వనానాం జ్యోతిషామపి,
శుష్యతాం క్షీయమాణానాం పతతాం యచ్చ దర్శనమ్. 37
ప్రాగ్రూపం బహురూపస్య తత్ జ్ఞేయం రాజయక్ష్మణః,

వ్యా. రాజయక్ష్మరోగము జనించుటకు ముందు ఈ క్రింద జెప్పబడు పూర్వరూపములు కానంబడును. తొలుదొలుత పడిసెము బట్టును. శరీరము బలహీనముగ నుండును. దోషములు లేని విషయములయందెల్ల దోషములు కనబడును. శరీరమునందు ఏవిధమయిన వికృతము లేకున్నను వికృతరూపమునే కానబడును. దీనత్వమునొందును. పూర్తిగ భుజించుచున్నను శరీరమునందలి బలమును మాంసమును నానాట క్షీణించును. స్త్రీలయందును, మద్యమాంసములయందును వాంఛ కలుగును. తలపై గుడ్డమొదలగు వానిచే ముసుగువేసుకొనుటయందు అభిలాష ఘాఢమును. అన్నపానపదార్థములయందు

ఈగలు, సాలెపురుగులు, వెండ్రుకలు, తృణములు, ఇవి పడియుండినట్లగపడును. గోళ్లను, వెండ్రుకలును అధికముగ పెరుగును. స్వప్నమునందు పక్షులు, పురుగులు, వ్యాఘ్రాది మృగములు మున్నగువానిచే బెదరింపబడును. వెండ్రుకలు, అస్థుల యొక్కయు, భస్మముయొక్కయు రాసులపైనెక్కినట్లు స్వప్నము గాంచును. జలముచే నిండియుండు గుంటలును, నీళ్లులేక ఎండినట్లుండును. పర్వతములు క్షీణించినట్లును, వనము లెండినట్లును, నక్షత్రములు క్రిందపడునట్లును స్వప్నములో చూచును. ఇవి యన్నియు బహురూపమైన రాజయక్ష్మరోగమునకు పూర్వరూపములు గావున నివి కానవచ్చినచో రాజయక్ష్మము రానున్నదని యెరుంగునది.

(ఇచ్చట ప్రతిశ్యాయము పూర్వరూపముగను రూపముగను చెప్పబడినది. అందు ఇతరపూర్వరూపములతో గూడియున్నప్పుడు పూర్వరూపమనియు, ఇతరరూపములతో గూడియున్నపుడు రూపమనియు నెరుంగునది. రోగసంప్రాప్తియనంతరము పూర్వరూపము లన్నియు గానవచ్చినయెడ నయ్యది యరిష్టలక్షణమని "పూర్వరూపాణి సర్వాణి" (ఇంద్రియ-అ-౫) ఇంద్రియస్థానమున జెప్పబడినది. ఇచ్చట ప్రతిశ్యాయ మొక్కటియే వ్యాధిరూపములతో కలసియున్నను అట్టి యరిష్టలక్షణమున కవకాశము లేదని యెరుంగునది).

## రాజయక్ష్మరూపములవివరణము, మలరక్షణావశ్యకత.

మూ. రూపం త్వస్య యథోద్దేశం నిర్దేక్ష్యామి (పరం శృణు) సభేషజమ్.
యథా స్వేనోష్మణా పాకం శారీరా యాన్తి ధాతవః,
స్రోతసాం చ యథా స్వేన ధాతుః పుష్యతి ధాతుతః. ౩౯
స్రోతసాం సన్నిరోధాచ్చ రక్తాదీనాం చ సంక్షయాత్,
ధాతూష్మణాం చాపచయాద్రాజయక్ష్మా ప్రవర్తతే. 40
తస్మిన్కాలే పచత్యగ్నిః యదన్నం కోష్ఠసంశ్రితం,
మలీభవతి తత్ప్రాయః కల్పతే కిఞ్చిదోజసే. 41
తస్మాత్పురీషం సంరక్ష్యం విశేషాద్రాజయక్ష్మిణః,
సర్వధాతుక్షయార్తస్య బలం తస్య హి విడ్బలమ్. 42

వ్యా. పిమ్మట పైననిర్దేశింపబడిన రాజయక్ష్మ రూపము లన్నియు వరుసగ వివరించి పిదపవానిచికిత్సయును నీక్రింద వివరింపబడును:—శరీరమునందలి రసాదిధాతువు ఆయా ధాతువునకు సంబంధించిన అవిరిచే (ధాత్వగ్నిచే)పాకముఁబొందును. పిమ్మట ఆయాధాతు

వులకు సంబంధించిన స్రోతోమార్గమున వ్యాపించుచుండును. అత్తరి నొకధాతువుచే వేరొండుధాతువు పుష్టినొందును. (మనుజుడు భుజించు షడ్రసవిశిష్టమయిన యాహార పదార్థములు కాయాగ్నిచే పాకమునొంది యందలిసారము తొలుత రసరూపము నొందును. అదియే రసధాతువు. ఈరసధాతువు తనయందలి వేడిమిచే పక్వమై రక్తరూప ముగ పరిణమించును. ఇత్తెరంగున రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము, అను సప్తధాతువులును ఒకదానిచే నొకటి యేర్పడును. పిమ్మట అట్టిక్రమము ననుసరించియే రసాదిక్రమముగ నొకధాతువువలన వేరొండుధాతువు పోషింపబడు చుండును).

అట్టియెడ ప్రకోపమునొందిన వాతాదిదోషములచే ధాతువుల స్రోతోమార్గ ములు అడ్డగింపబడుటవలనను, దానం జేసి ధాత్వగ్నులు క్షీణించుటవలనను, పైజెప్పిన రీతిగ రసాదిధాతువులు వేరొండుధాతువులను వ్యాపించి పుష్టినొందించ జాలకుండును. కావున రక్తాదిధాతువులు నానాట క్షీణదశనొందును. వానివలన రాజయక్ష్మరోగము సంభవించును.

మరియు నక్కాలమున యక్ష్మరోగి భుజించు నాహారపదార్థములను కోష్ఠము నందే పాచకాగ్ని పచింప జేసినను అయ్యది ప్రాయికముగ మలముగ నేర్పడునే గాని రసాదిధాతురూపముగ నొందజాలదు. ఐనను క్రొత్తకుండలో నీరు నింపినయెడ కొంచె కొంచెముగ నీరును చెమర్పుభంగి యాహారరసము ధాతువుల వ్యాపించి పోషింపకున్నను సూక్ష్మముగనైన దాని చెమ్మచే ధాతువులు స్వల్పముగనైన నుండనోపును. దానివలన శరీరమునందలి యోజస్సు సూక్ష్మరూపముగనై యెండ గల్గును.

కావున అట్టి పరిస్థితియందు రక్తాదిధాతువులు క్షీణించుటచే చాల బలహీనుడైన రోగికి ఏరోగమునందైనను మలము బలకరమై యుండును. అందును యక్ష్మరోగికి కేవ లము మలమునే నాధారముగ జేసికొని ప్రాణముల నిలచి యుండును. కావున యక్ష్మ రోగికి మలమును కాపాడుట ప్రధానకృత్యము.

## రాజయక్ష్మరూపోత్పత్తిక్రమము.

మూ. రసః స్రోతఃసు రుద్ధేషు స్వస్థానస్థో వివర్ధతే (విదహ్యతే),
స ఊర్ధ్వం కాసవేగేన బహురూపః ప్రవర్తతే. 43
జాయన్తే వ్యాధయః చాతః షడేకాదశ వా పునః,
యేషాం సంఘాతయోగేన రాజయక్ష్మేతి కథ్యతే. 44

వ్యా. పైజెప్పినరీతిగ రక్తాదిధాతువుల స్రోతోమార్గములు ప్రకోపము నొందిన వాతాది దోషములచే అడ్డగింపబడినప్పుడు ఆహారసారరూపమయిన రసము వెడల తెరువు లేక తనకు స్థానమైన హృదయమునందే జేరి వృద్ధినొంది దగ్గుయొక్క వేగముచే పైకినెగగొట్టబడి శిరస్సు మున్నగు స్థానములయందు వ్యాపించి రాజయక్ష్మమునకు జెప్ప బడిన పీనసము మున్నగు పదునొకండు రూపములైన వ్యాధులనైనను, అందారిటినైనను గల్గించును. అట్టి పదునొకండు వ్యాధుల రాశిరూపమైనది రాజయక్ష్మ మని పేర్కొన బడును.

## రాజయక్ష్మమునందలి ఏకాదశ-షడ్రూపములు.

మూ. కాసోంసతాపో వైస్వర్యం జ్వరః పార్శ్వశిరోరుజా,
ఛర్దనం రక్తకఫయోః శ్వాసవర్చోగదోఽరుచిః.　　45
రూపాణ్యేకాదశైతాని; యక్ష్మిణః షడిమాని వా,
కాసో జ్వరః పార్శ్వశూలం సర్వవర్చోగదోఽరుచిః.　　46

వ్యా. కాసము, అంసతాపము, స్వరభేదము, జ్వరము, పార్శ్వశూలము, తల నొప్పి రక్తమును వాంతియగుట, కఫము వాంతియగుట, శ్వాసము, మలబద్ధకము, అరుచి, ఈపదునొకండును యక్ష్మరోగమునకు సంబంధించిన రూపములగును. లేక కాసము, జ్వరము, పార్శ్వశూల, స్వరభేదము, మలబద్ధకము, అరుచి, అనునీయారును రాజయక్ష్మమునకు రూపములగును.

## రాజయక్ష్మసాధ్య అసాధ్యవిభాగము.

మూ. సర్వైరర్ధైస్త్రిభిర్వాపి లిఙ్గైర్మాంసబలక్షయే,
యుక్తో వర్జ్యః; చికిత్స్యస్తు సర్వరూపోఽప్యతోఽన్యథా.　　47

వ్యా. పైజెప్పిన రాజయక్ష్మరోగమునందు రోగికి శరీరమునందలి మాంసంబును, బలంబును, క్షీణించియున్నయెడ రాజయక్ష్మము పైజెప్పిన పదకొండులక్షణములతో కూడియున్నను, ఆరులక్షణములతో కూడియున్నను, తుదకు మూడులక్షణములతో కూడి యున్నను అసాధ్యమగును గావున చికిత్సజేయక విడువందగును. అటుగాక రోగికి శరీ రము మాంస-బలములును క్షీణించక యున్నయెడ తుదకు పదునొకండులక్షణములతో గూడి పూర్ణలక్షణమైన రాజయక్ష్మరోగంబును సాధ్యముగనుండును. కావున అట్టిపరిస్థితి యందు చికిత్సజేయందగును. (ఇచ్చట "త్రిభిః" అనుచోట పైజెప్పిన పదకొండులక్ష

ణములలో నేమూడు లక్షణములైన యున్నను అనియర్థము. కొందరు క్రిందజెప్పబడు "అంసపార్శ్వాభితాపశ్చ" అనెడిలక్షణములు మూడును గ్రహింపదగునని చెప్పెదరు.)

ప్రతిశ్యాయస్వరూపము, అన్వర్థత.

మూ. ఘ్రాణమూలే స్థితశ్శ్లేష్మా రుధిరం పిత్తమేవ వా,
మారుతాధ్మాతశిరసః మారుతం శ్యాయతే ప్రతి. 48
ప్రతిశ్యాయస్తతో ఘోరో జాయతే దేహకర్శనః,

వ్యా. వాతముచే పూరితమగు శిరస్సుకలవానికి ముక్కు మొదటనుండు శ్లేష్మంబైనను రక్తంబైనను శిరస్సుననుండు వాతమున కెదురుగ పైకిపోవును. దానివలన నియ్యది ప్రతిశ్యాయమని యన్వర్థముగ జెప్పబడును. ఇయ్యది మిక్కిలి క్రూరమై శరీరమును కృశింపజేయునది యగును.

రాజయక్ష్మపూర్వరూపమగు ప్రతిశ్యాయలక్షణము.

మూ. తస్య రూపం శిరశ్శూలం గౌరవం ఘ్రాణవిప్లవః. 49
జ్వరః కాసః కఫోత్క్లేశః స్వరభేదోఽరుచిః క్లమః,
ఇన్ద్రియాణామసామర్థ్యం యక్ష్మా చాతః ప్రజాయతే. 50

వ్యా. తలనొప్పి, తలబరువుగనుండుట, గంధమును గ్రహించు ఘ్రాణేంద్రియశక్తి నశించుట, జ్వరము, దగ్గు, నోట కఫము వెడలుట, స్వరభేదము, అరుచి, బడలిక, చక్షురాదీంద్రియములకు వానివాని పనులయందు సామర్థ్యము లేకుండుట, ఈలక్షణములు ప్రతిశ్యాయమునకు స్వరూపలక్షణములు. అట్టి ప్రతిశ్యాయమువలన యక్ష్మరోగము సంభవించును. (ఇయ్యది రాజయక్ష్మమునకు పూర్వరూపముగ జెప్పబడిన ప్రతిశ్యాయలక్షణము. ఇట్టి రూపములతో గూడిన ప్రతిశ్యాయమువలన రాజయక్ష్మము జనించునని భావము).

రాజయక్ష్మమునకు రూపమైన ప్రతిశ్యాయవివరణము.

మూ. పిచ్ఛిలం బహలం విస్రం హారితం శ్వేతపీతకం,
కాసమానో రసం యక్ష్మీ నిష్ఠీవతి కఫాఽనుగమ్. 51

వ్యా. యక్ష్మరోగముకలవాడు దగ్గునపుడు జిగటగను అధిక దుర్గంధముగను పసుపురంగు కల్గినదియు, లేక శ్వేతవర్ణంబైనను పచ్చని రంగైనను కల్గినదియు నగు కఫమును రసధాతువులో గూడి నోట వెడలును. (భుజింపబడినయాహారము పాచకాగ్నిచే పక్వమై దాన కల్గు నాహారసారరూపమైన రసము నిరుద్ధములగు ధాతుమార్గముల వెడలు

తెరవు లేక హృదయమునందు నిలచి కాసవేగముచే పైకి నెట్టబడి కఫరూపమైన నోటి నుండి పైజెప్పిన రంగులుకల్గి వెడలునని భావము.) ఇయ్యది "స ఊర్ధ్వం కాసవేగేన బహురూపః ప్రవర్తతే" అని నిర్దేశించిన రాజయక్ష్మరూపమునకు వివరణము.

### రాజయక్ష్మరూపమైన జ్వరస్వరూపము.

మూ. అంసపార్శ్వాభితాపశ్చ సన్తాపః కరపాదయోః,
జ్వరస్సర్వాఙ్గగశ్చేతి లక్షణం రాజయక్ష్మణః.　　52

వ్యా. అంసముల (మూపుల) యందును ఇరుప్రక్కలయందును హస్తపాదముల యందును మంటతో శరీరమునందెల్ల వ్యాపించియుండు జ్వరము రాజయక్ష్మరోగమునకు లక్షణమైయుండును. (రాజయక్ష్మరూపముగ జెప్పబడినజ్వరము ఈలక్షణములు కల్గి యుండునని భావము.) కొందరు పైజెప్పిన అంసపార్శ్వాభితాపము మున్నగు మూడు లక్షణములును రాజయక్ష్మమునకు జెందినదని చెప్పెదరు. ఇది చక్రపాణిదత్తవ్యాఖ్యాన సమ్మతము కాదు.

### స్వరభేదవివరణము.

మూ. వాతాత్పిత్తాత్కఫాద్రక్తాత్ కాసవేగాత్సపీనసాత్,
స్వరభేదో భవేత్; వాతాద్రూక్షః క్షామశ్చలః ఖరః,　　53
తాలుకణ్ఠపరిప్లోషః పిత్తాద్వక్తుమసూయతే,
కఫాద్భేదో విబన్ధశ్చ స్వరః ఖురఖురాయతే.　　54
సన్నో రక్తవిబన్ధత్వాత్ స్వరః కృచ్ఛ్రాత్ప్రవర్తతే,
కాసాతియోగాత్ కషణః (కరుణః), పీనసాత్ కఫవాతికః　　55
పార్శ్వశూలం త్వనియతం సర్వోఽచాయాసలక్షణం,
శిరశ్శూలం ససన్తాపం యక్ష్మిణస్స్యాత్ సగౌరవమ్.　　56

వ్యా. వాతము, పిత్తము, కఫము, రక్తము, కాసవేగము, పీనసము, అనునీకారణ ములచే స్వరభేదము సంభవించును. అందు వాతముచే జనించిన స్వరభేదమున కంఠస్వ రము కటువుగను హీనముగను చంచలముగను (వణకుకల్గియు), కఠినముగను ఉండును. పిత్తమున జనించిన స్వరభేదమున తాలువులయందును కంఠమునందును తాపము కల్గి మాట్లాడుటకును ఇచ్ఛ లేకుండును. కఫమున జనించిన స్వరభేదమున కంఠస్వరము అడ్డ పడి మంద్రముగ కంఠమున గురగురయనుశబ్దము కల్గి వెడలును. రక్తముచే జనించిన స్వరభేదమున రక్తము అడ్డగింపబడియుండుటవలన కంఠస్వరము మిక్కిలి కష్టముచే వెడ

లును. కాసవేగమున కల్గినస్వరభేదమున మిక్కిలి దీనస్వరముగ నుండును. పీనసమున బుట్టిన స్వరభేదమున పైజెప్పబడిన కఫవాతలక్షణములు కల్గియుండును. నియమము లేక ప్రక్కలయం దొకప్పుడు ముడుచుకొనినట్లును ఒకప్పుడు లాగబడినట్లు నుండును. మరియు రాజయక్ష్మము త్రిదోషజము కావున వాతముచే తలనొప్పియు పిత్తముచే సంతాపంబును, కఫముచే భారముగను ఉండును.

## రక్తమిశ్రకఫము వాంతియగుటకు వివరణము.

మూ. అభిసన్నే (అతిఖిన్నే) శరీరే తు యక్ష్మిణో విషమాశనాత్,
కణ్ఠాత్ప్రవర్తతే రక్తంశ్లేష్మా చోత్క్లిష్టసఞ్చితః. 57

వ్యా. యక్ష్మరోగికి విషమాశనము (భోజనవిధియందు జెప్పిన నియమము నతిక్రమించి భుజించుట)వలన శరీరము మిక్కిలి కృశించి యున్నపుడు కఫము సంచితమై పైకి వెడల నున్నపుడు రక్తముతో కూడ మిశ్రమై నోటినుండి వెడలును. (ఇది "సరక్తం కఫమస్యతి" అనులక్షణమునకు వివరణము.)

## రక్తము వాంతియగుటకు వివరణము.

మూ. రక్తం విబద్ధమార్గత్వాత్ మాంసాదీన్నానుపద్యతే(న్నోపపద్యతే)
ఆమాశయస్థముత్క్లిష్టం బహుత్వాత్కణ్ఠమేతి చ. 58

వ్యా. శరీరమునందలి రక్తము మాంసాదిధాతువులయందు రక్తము ప్రవేశించు మార్గములు వాతకఫములచే నడ్డగింపబడుటవలన వెడలుతెరవు గానక ఆమాశయముననే యుండి వృద్ధినొంది మిక్కుటమై యుండుటంజేసి పైకి ఎగదట్టి కంఠమున జేరి వమన రూపముగ బైటవెడలును.

## శ్వాసవిచ్ఛేదవివరణము.

మూ. వాతశ్లేష్మవిబద్ధత్వాదురసః శ్వాసమృచ్ఛతి,
దోషైరుపహతే చాగ్నౌ సపిచ్ఛమతిసార్యతే. 59

వ్యా. వాతకఫములు రొమ్మునజేరి శ్వాసము వెడలుమార్గము నడ్డగించి యుండుట వలన తీవ్రముగ శ్వాసము వెడలును. దోషములచే జాఠరాగ్ని ప్రతిహతమై మందగించియుండుటవలన ఆహారము చక్కగ జీర్ణించక జిగురుగ నుండుమలము అధికముగ వెడలును.

## అరోచకవివరణము.

మూ. పృథగ్దోషైః సమస్తైర్వా జిహ్వాహృదయసంశ్రితైః,
జాయతేఽరుచిరాహారే ద్విష్టైరర్థైశ్చ మానసైః. 60

కషాయతి క్తమధురై ర్విద్యాన్ముఖరసైః క్రమాత్,
వాతాద్యైరరుచిం జాతాం మానసీం దోషదర్శనాత్. 61

వ్యా. వాతాదిదోషములు వేరువేరుగ నైనను, కలసియైనను, ప్రకోపమునొంది నాలుకయందును, హృదయమునందును చేరి అరోచకమును కల్గించును. మరియు మనస్సుకు విరుద్ధమై యింపుగాని యాహారములచే గూడ అరుచి కల్గును. అందు వాతముచే కల్గిన అరుచియందు నోరు వగరుకల్గియు, పిత్తారుచియందు చేదుగను కఫారుచియందు తీపి కల్గియు నుండును. మనస్సుసంబంధమైన అరోచకమున ఆహారపదార్థములయందు మనస్సుకు ద్వేషము పుట్టును. (ఇచ్చట వాతపిత్తకఫములచే వేరువేరుగ జనించుటచేతను, త్రిదోషసన్నిపాతముచే జనించుటచేతను అరోచకము నాల్గుతెరంగు లుండును. ఈ నాల్గిటియందును మనస్సుకింపుగాని యాహారపదార్థములను సేవించుట అరోచకమునకు కారణములగును. చికిత్సాప్రకరణమున ఈతంత్రకారుడును "చాతురో రోచకాన్ హన్యాః వాతాద్యేకజసర్వజాన్" అనువాక్యముచే ఏకదోషసాన్నిపాతికభేదముచే నాల్గు విధములుగనే చెప్పిరి.)

ఛర్ది (వాంతి) వివరణము.

మూ. అరోచకాత్కాసవేగాద్దోషోత్క్లేశాద్భయాదపి,
ఛర్దిర్యా సా వికారాణామన్యేషామప్యుపద్రవః. 62

వ్యా. అరోచకమువలనను, దగ్గుయొక్క వేగమువలనను, దోషోద్రేకమువలనను భయమువలనను, కల్గిన ఛర్ది(వాంతి)రాజయక్ష్మరోగమున కొక్కదానికే గాక యితరములగు వెక్కిళ్లు మున్నగు రోగములకుకూడ నుపద్రవముగ నేర్పడును.

రాజయక్ష్మచికిత్సాక్రమము.

మూ. సర్వస్త్రిదోషజో యక్ష్మా దోషాణాం తు బలాబలం,
పరీక్ష్యావస్థితం వైద్యః శోషిణం సముపాచరేత్. 63
ప్రతిశ్యాయే శిరఃశూలే కాసే శ్వాసే స్వరక్షయే,
పార్శ్వశూలే చ వివిధాః క్రియాః సాధారణీః శృణు. 64

వ్యా. రాజయక్ష్మము లన్నియు త్రిదోషప్రకోపముననే గల్గును. అందు వాతాది దోషములయొక్క తారతమ్యముచే బలాబలమును నిర్ణయించి రోగియొక్క అవస్థాభేదమునుపట్టి చికిత్సజేయనగును. అంద ప్రతిశ్యాయము, శిరఃశూలము, కాసము, శ్వాసము, స్వరక్షయము, పార్శ్వశూలు, అనునీయుపద్రవములయందు చేయదగిన వేరువేరు చికిత్స

లును, సాధారణచికిత్సలును, ఈక్రింద వివరింపబడును. ఇచ్చట ప్రతిశ్యాయాదుల నారింటికి వేరువేరు చికిత్సలును అన్నిటికి చేరిన చికిత్సలును, ఈక్రింద వివరింపబడునని ''వివిధా క్రియా సాధారణీః'' అనుపదములచే సూచింపబడినవి.

### రాజయక్ష్మమున పీనసాదుల చికిత్స.

మూ. పీనసే స్వేదమభ్యఙ్గం ధూమమూ లేపనాని చ,
పరిషేకావగాహాంశ్చ యావకం (పానకం) వాట్యమేవ చ. 65
లవణామ్లకటూష్ణాంశ్చ రసాన్ స్నేహోపబృంహితాన్,
లావతిత్తిరిదక్షాణాం వర్తకానాం చ కల్పయేత్. 66
సపిప్పలీకం సయవం సకులత్థం సనాగరం,
దాడిమామలకోపేతం స్నిగ్ధమాజం రసం పిబేత్. 67
తేన షడ్వినివర్తంతే వికారాః పీనసాదయః,

వ్యా. రాజయక్ష్మరోగమునందు పీనసము శమించుటకు స్వేదమును అభ్యంగనము, ధూమపానము, లేపనములు, స్నానము, అవగాహస్నానము, యవాన్నము వీనిని సేవించుట ఉత్తమము. మరియు లవణఅమ్లకటురసములను, ఉష్ణవీర్యపదార్థములను, లావుకపిట్ట, తీతుకపిట్ట, కోడి, వెలిచపిట్ట, అనునీజంతువులమాంసములను, నెయ్యి మున్నగు స్నేహద్రవ్యములచే సంస్కరించి ఆహారమున కుపయోగింపబడును.

మరియు పిప్పళ్లు, యవలు, ఉలవలు, శొంఠి, దానిమ్మరసము, ఉసిరికకాయలు, వీనిచే స్నేహద్రవ్యములతో సంస్కరించబడిన మేకమాంసరసమును సేవించవలయును. వీనివలన పీనసము, శిరఃశూలము మున్నగురాజయక్ష్మోపద్రవము లారును శమించును.

### యక్ష్మరోగమున యూషాదులు.

మూ. మూలకానాంకులత్థానాంయూషైర్వా సూపకల్పితైః(సంస్కృతైః)
యవగోధూమశాల్యన్నైః యథాసాత్మ్యముపాచరేత్,
పిబేత్ప్రసాదం వారుణ్యా జలం వా పాంచమూలికమ్. 69
ధాన్యనాగరసిద్ధం వా తామలక్యాథ వా శృతం,
పర్ణినీభి శ్చతసృభిస్తేన చాన్నాని కల్పయేత్. 70

వ్యా. ముల్లంగి, ఉలవలు, వీనియూషములను విధ్యుక్తప్రకారము సంస్కరించి సిద్ధముచేసి, యవాన్నముసైనను గోధూమాన్నముసైనను ఎఱ్ఱవరిబియ్యపు అన్నము

నైనను పైజెప్పిన యూషములతో జేర్చి రోగియొక్క సాత్మ్యమునకు తగినట్లు భుజింప జేసి యుపచరింపవలెను. మరియు వారుణియను మద్యముయొక్క తేటనైనను, పంచమూలకషాయమునైనను త్రాగవలెను.

మరియు దనియాలు, శుంఠి, ఈరెండిటి కషాయముచేనైనను, నేలఉసిరిక కషాయముచేనైనను, పర్ణినీచతుష్టయమును (నేలపొన్న, కోలపొన్న, కారుపెసర, కారుమినుప) చేర్చి సిద్ధము చేయబడిన కషాయముచేనైనను సిద్ధము చేయబడిన యన్నమును యక్ష్మరోగికి పెట్టనగును.

శిరశ్శూలాదులయందు సంకరాది స్వేదవిధులు.

మూ. కృసరోత్కారికామాషకులత్థయవపాయసైః,
సఙ్కరస్వేదవిధినా కణ్ఠం పార్శ్వమురశ్శిరః. 71
స్వేదయేత్ పత్రభఙ్గేన శిరశ్చ పరిషేచయేత్,
బలాగుడూచీమధుకశ్శృతైర్వా వారిభిస్సుఖైః. 72
బస్తమత్స్యశిరోభిర్వా నాడీస్వేదం ప్రయోజయేత్,
కణ్ఠే శిరసి పార్శ్వే చ పయోభిర్వా సవాతికైః. 73
ఔదకానూపమాంసాని సలిలం పాఞ్చమూలికమ్,
సస్నేహమారనాళం వా నాడీస్వేదే ప్రయోజయేత్. 74
జీవన్త్యాః శతపుష్పాయాః బలాయా మధుకస్య చ,
వచాయా వేసవారస్య విదార్యా మూలకస్య చ. 75
ఔదకానూపమాంసానాముపనాహాః సుసంస్కృతాః,
శస్యన్తే సచతుస్స్నేహాః శిరఃపార్శ్వాంసశూలినామ్. 76

వ్యా. కృసరము (నువ్వులు బియ్యము ఉద్దిపప్పు ఈమూడిటిని చేర్చి చేయబడిన పులగము), రొట్టెలు, ఉద్దిపప్పు, యవలు, పాయసము, వాతహరములగు చిగుళ్లు, వీనిచేత సంకరస్వేదవిధిప్రకారము కంఠప్రదేశమునను ప్రక్కలయందును రొమ్ముపైని శిరస్సునందును చెమట పుట్టింపవలెను.

మరియు చిట్టాముట్టి, తిప్పతీగె, అతిమధురము (ఇప్పపట్ట), వీనికషాయముచే సుఖోష్ణముగ శిరస్సుపై తడపవలెను. మేకపోతుతలలనైనను చేపలతలలనైనను నీళ్లుబోసి కాచి యానీటిచే విధ్యుక్తప్రకారము నాడీస్వేదము చేసి, గొంతు శిరస్సు పార్శ్వములు ఈస్థలములయందు ఆవిరి బట్టించి చెమట పుట్టించవలెను. మరియు జలజంతువులమాంస

మును, ఆనూపజంతువులమాంసములను, పంచమూలకషాయమును, స్నేహముతో గూడిన గంజిని, వీనిలో దేనినైనను నాడీస్వేదమున కుపయోగింపవలెను. మరియు—పాలకూర, సదాప, చిట్టాముట్టి, అతిమధురము, (లేక ఇప్ప), వస, వేసవారము, నేలగుమ్మడి, ముల్లంగి, వీనిలో దేనినైన కషాయము కాచి నాడీస్వేదమున కుపయోగించవలెను. జల జంతువులమాంసమును ఆనూపజంతువులమాంసములను విధ్యుక్తప్రకారము సంస్కరించి యుపనాహాస్వేదమున కుపయోగించవలెను. మరియు నుపనాహామునకు నెయ్యి నూనె వస (మూలగ) మజ్జ అనునీస్నేహచతుష్టయముచేత శిరస్సు పార్శ్వములు భుజశిరస్సులు ఈయవయవములయందు శూలకలవారికి ఉపనాహము చేయుటకు చాల ప్రశస్తము.

యక్ష్మమున కల్గు శిరశ్శూలాదులయందు లేపనములు.

మూ. శతపుష్పా సమధుకం కుష్ఠం తగరచన్దనే,
ఆలేపనం స్యాత్ సఘృతం శిరఃపార్శ్వాంసశూలనుత్. 77
బలా రాస్నా తిలాః సర్పిః మధుకం నీలముత్పలం,
పలఙ్కషా దేవదారు చన్దనం కేసరం ఘృతమ్ 78
వీరా బలా విదారీ చ కృష్ణగన్ధా పునర్నవా,
శతావరీ పయస్యా చ కత్తృణం మధుకం ఘృతమ్. 79
చత్వార ఏతే శ్లోకార్ధైః ప్రదేహాః పరికీర్తితాః,
శస్త్రాస్సంసృష్టదోషాణాం శిరః పార్శ్వాంసశూలినామ్. 80

వ్యా. సదాప, అతిమధురము, చెంగల్వకోష్టు, గ్రంథితగరము, చందనము, వీని నన్నిటిని నూరి నేతిలో కలిపి పట్టువేసినచో రాజయక్ష్మమున కల్గిన శిరశ్శూలంబును పార్శ్వశూలంబును అంసశూలంబును నివర్తించును.

మరియు—చిట్టాముట్టి, సన్నరాష్టము, నువ్వులు, అతిమధురము, నల్లకలువలు, వీనినన్నిటిని నూరి నేతిలో కలిపి పట్టుబెట్టినను;

పల్లేరు, దేవదారు, చందనము, నాగకేసరములు, వీనిని నూరి నేతిలో కలిపి పట్టు వేసినను; క్షీరకాకోళి, చిట్టాముట్టి, నేలగుమ్మడిగడ్డ, మునగపట్ట, వీనిని నూరి నేతిని గలిపి పట్టువేసినను; పిల్లిపీచర, క్షీరకాకోళి, కామంచిగడ్డి, అతిమధురము, వీనిని నూరి నేతితో కలిపి పట్టువేసినను, శిరశ్శూలము పార్శ్వశూలము, అంసశూలములు హరించును. మరియు పైని నొక్కొక యర్ధశ్లోకముచే జెప్పబడిన నాల్గుయోగములును దోషసంసర్గ ముచే గల్గిన శిరశ్శూలాదులయందును పట్టువేయుటకు చాల ప్రశస్తములు.

## రాజయక్ష్మమున శిరశ్శూలాదులయందు రక్తమోక్షణము.

మూ. శృఙ్గాలాబుజలౌకోభిః ప్రదుష్టం వ్యధనేన వా,
శిరఃపార్శ్వాంసశూలేషు రుధిరం తస్య నిర్హరేత్.                81

వ్యా. శిరస్సునందును పార్శ్వములయందును అంసప్రదేశమునను తీవ్రమైన శూల (నొప్పి) కల్గినప్పుడు ఆప్రదేశమునందు విధ్యుక్తప్రకారము సిరావ్యధనము చేసి (కాటు బెట్టి) దుష్టరక్తమును కొమ్ములచేనైనను, సొరకాయబుఱ్ఱలచేనైనను, జెలగలచేనైనను వెడలింపవలెను.

ఇచ్చట శరీరమునందలి రక్తము పిత్తముచే దుష్టమైనయెడ జెలగల గరిపించియు, కఫముచే దుష్టమైనరక్తమును సొరకాయబుఱ్ఱచేతను, వాతముచే దుష్టమైనరక్తమును కొమ్ముచేతను పీల్చి విధ్యుక్తప్రకారము వెడలించవలెనని యెరుంగునది. ఈవిషయము స్థలాంతరమున నిట్లు చెప్పబడినది:—"పిత్తాన్వితం జలౌకోభిః, అలాబ్వా తు కఫాన్వితమ్, శోణితం వాతదుష్టం తు విషాణేనాశు నిర్హరేత్."

## శిరశ్శూలాదిహరప్రలేపములు.

మూ. ప్రదేహాస్సఘృతశ్శ్రేష్ఠః పద్మకోశీరచన్దనైః,
దూర్వామధుకమఞ్జిష్ఠా కేసరైర్వా ఘృతాప్లుతైః.                82
ప్రపౌణ్డరీకనిర్గుణ్డీ పద్మకేసరముత్పలం,
(ప్రపౌణ్డరీకం పద్మస్య కేసరం నీలముత్పలం,)
కశేరుకాః పయస్యా చ ససర్పిష్కం ప్రలేపనమ్.                83

వ్యా. పద్మకము, వట్టివేళ్లు, చందనము, వీనిని మెత్తగ నూరి ఆవునేతిలో కలిపి పూయుట మిగుల శ్రేష్ఠము. మరియు తెల్లనిగరిక, అతిమధురము, మంజిష్ఠి, నాగకేసరములు, వీనిని నూరి నేతిలో కలిపి యైనను పట్టువేయవలెను. పుండరీకమగు గంధద్రవ్యము; నల్లవావిలి, తామరపువ్వులయందలి కేసరములు, నల్లకలువలు, నమ్మదుంప (దీనిని నిమ్మటాయి యని సామాన్యులు చెప్పెదరు), క్షీరకాకోలి, వీనిని నూరి నేతిలో కలిపి పూయవలెను. (ఇచ్చట దట్టముగ పట్టువేసిన ప్రదేహమనియు; కొంచెము పలుచగ పట్టుబెట్టిన ప్రలేపమనియు భేదము నెరుంగునది.)

## రాజయక్ష్మమున అభ్యంగము, పరిషేకము.

మూ. చన్దనాద్యేన తైలేన శతధౌతేన సర్పిషా,
అభ్యఙ్గః; పయసా సేకః శస్తశ్చ మధుకామ్బునా.                84

మాహేన్ద్రేణ సుశీతేన చన్దనాదిఘృతేన వా,
పరిషేకః ప్రయోక్తవ్యః ఇతి సంశమనీ క్రియా. 85

వ్యా. చందనాదితైలముచేనైనను శతధౌతఘృతముచేనైనను శరీరమున కభ్యంగనముచేయనగును. మరియు అతిమధురమునుచేర్చి శీతకషాయముగ జేసి పాలతో గూర్చి పరిషేకముచేయుట చాల మంచిది. లేక చల్లగనుండు మాహేంద్రజలము(వర్షోదకము)చేనైనను, చందనాదిఘృతముచేనైనను, పరిషేకము చేయనగును. (పరిషేకమన జలాదులచే శరీరమును తడుపుట యని యర్థము) ఇంతదనుక చెప్పబడినది సంశమనరూపచికిత్స.

రాజయక్ష్మమున వమనవిరేచనవిధి.

మూ. దోషాధికానాం వమనం శస్యతే సవిరేచనం,
స్నేహస్వేదోపపన్నానాం సస్నేహం యన్నకర్శనమ్. 86
శోషీ ముఞ్చతి గాత్రాణి పురీషస్రంసనాదపి,
అబలాపేక్షిణీం మాత్రాం కిం పునః యో విరిచ్యతే. 87

వ్యా. రాజయక్ష్మమునందు దోషములు మిక్కిలి ప్రబలములై పైజెప్పిన శమనములచే శమించకున్నయెడ వానికి విధ్యుక్తప్రకారము తొలుత స్నేహస్వేదముల జేయించి శరీరమును కృశింపజేయక చెడగొట్టకయుండు వమనవిరేచనౌషధములతో దోషానుగుణముగ స్నేహద్రవ్యములను చేర్చి యట్టి మృదువగు నౌషధముచే వమనవిరేచనముల చేయించవలెను.

క్షయరోగపీడితుడు సాధారణముగ పురీషము కొంచెమధికముగ వెడలినను ఓరువజాలక శరీరమును వదలి మృతినందును. అట్లుండ శరీరబలమునకన్న నధికముగ విరేచనములైనచో వానిపరిస్థితి నేమని చెప్పనగును; కావున రోగియొక్క శరీరమునకు హానినికల్గనీయక మృదు వీర్యములగు నౌషధములచేత యక్షరోగికి దోషము లుత్కటములుగ నున్నపుడు యుక్తియుక్తముగ వమనమునైనను విరేచనమునైనను చేయించవలెనని భావము.

యక్ష్మరోగమున కాసశ్వాసాదిహరసిద్ధయోగములు,
అందు నస్యమునకు బలాది-ప్రపౌణ్డరీకాదిఘృతములు.

మూ. యోగాస్సంశుద్ధకోష్ఠానాం కాసే శ్వాసే స్వరక్షయే,
శిరఃపార్శ్వాంసశూలేషు సిద్ధానేతాన్ ప్రయోజయేత్. 88

బలావిదారిగన్ధాద్యైః విదార్యా మధుకేన వా,
సిద్ధం సలవణం సర్పిః నస్యం స్యాత్స్వర్యముత్తమమ్. 89
ప్రపౌణ్డరీకం మధుకం పిప్పలీ బృహతీ బలా,
క్షీరం సర్పిశ్చ తత్సిద్ధం స్వర్యం స్యాన్నావనం పరమ్. 90
శిరఃపార్శ్వాంసశూలఘ్నం కాసశ్వాసనిబర్హణమ్,
ప్రయుజ్యమానం బహుశో ఘృతం చోత్తరభక్తికమ్. 91

వ్యా. పైజెప్పిన వమనవిరేచనాదియోగములవలన పరిశుద్ధమయిన కోష్ఠముగల రాజయక్ష్మరోగముగలవారికి కాసము, శ్వాసము, స్వరక్షయము, శిరఃశూలము, పార్శ్వశూలము, అంసశూలము, అనునీయుపద్రవములయందు నీక్రింద జెప్పబడు సిద్ధయోగములను ప్రయోగించునది:—చిట్టాముట్టి,విదారిగంధాదిగణమున చెప్పబడిన పఞ్చమూలములను చేర్చియైనను; నేలగుమ్మడి, అతిమధురము, వీనిని చేర్చియైనను; సిద్ధము చేయబడిన ఘృతమున సైంధవలవణము కొద్దిగ జేర్చి నశ్యము జేసినచో స్వరభేదము హరించి కంఠస్వరమును చక్కబరచును.

మరియు పుండరీకమను గంధద్రవ్యము, అతిమధురము, పిప్పళ్లు, వాకుడువేరు, చిట్టాముట్టి, వీనినన్నిటిని కల్కముచేసి పాలును జేర్చి సిద్ధముచేయబడిన ఘృతమును నస్యము చేసినయెడ శిరశ్శూలము, పార్శ్వశూలము, కాస-శ్వాసములు, వీనిని హరించును. మరియు, పైజెప్పిన ఘృతమును భోజనానంతరము పలుమారు సేవించిననో శిరఃశూలాదిరోగములు నశించును.

## రాజయక్ష్మమున దశమూలాదిఘృతప్రయోగము.

మూ. దశమూలేన పయసా సిద్ధం మాంసరసేన చ,
బలాగర్భం ఘృతం సద్యో రోగానేతాన్వ్యపోహతే. 92
భక్తస్యోపరి మధ్యే వా యథాగ్న్యభ్యవచారితం,
రాస్నాఘృతం వా సక్షీరం సక్షీరం వా బలాఘృతమ్. 93

వ్యా. దశమూలకషాయమును ఆవుపాలను మాంసరసమును బలాకల్కమును చేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేయబడిన ఘృతమును భోజనోత్తరకాలమునందైనను భోజనమధ్యకాలమునందైనను జాఠరాగ్నికనుగుణముగ మాత్రను కల్పించి త్రాగినచో రాజయక్ష్మమున కల్గిన శిరశ్శూలాదులు అప్పుడే శీఘ్రముగ నివర్తించును. (ఇచ్చట దశమూలకషాయంబును పాలును మాంసరసంబును చేరి ఘృతమునకు నాల్గింత

లును, బలాకల్కము ఘృతమునకు నాల్గవపాలు నుండునట్లు చేర్చి ఘృతపాకవిధిప్రకారము సిద్ధముచేయనగును. లేక "దశమూలేన పయసా" అని విశేషణముగ జేర్చునెడ దశమూలముల జేర్చి కాచబడిన పాలును, మాంసరసంబును ద్రవముగ జేర్పవలెనని యర్థము. ఈరెండుద్రవములును సమభాగములుగ జేరి ఘృతమునకు నాలుగింతలుగ నుండవలెను.)

మరియు కాసచికిత్సితమున చెప్పబడు రాస్నాఘృతమునైనను, రాస్నాక్షీరమునైనను, వాతరక్తచికిత్సితమున జెప్పబడు బలాఘృతమునైనను బలాక్షీరమునైనను పైజెప్పిన విధముగ భోజనానంతర, భోజనమధ్యకాలములయందు అగ్నిబలానుసారముగ సేవించినను పైజెప్పబడిన శిరశ్శూలాదులు నివర్తించును.

(ఇచ్చట కాసచికిత్సితమున "ద్రోణేఽపాం సాధయేద్రాస్నాం......సప్లీహోర్ధ్వానిలాన్ జయేత్." (చర-చి-అ-౧౮-శ్లో ౪3-౪౬) అని చెప్పబడు రాస్నాదిఘృత-క్షీరయోగములను; వాతరక్తచికిత్సితమున "బలా శతావరీ రాస్నా...వాతార్తిఘ్నం శృతం పయః."(చి-అ-౨౯-శ్లో-౮౧)అని చెప్పబడిన బలాక్షీరమును; "బలామతిబలాం మేదాం ......కామలాజ్వరనాశనమ్." (చి-అ-౨౯-శ్లో౧౬-౧౮) అని చెప్పబడు బలాఘృతయోగమును "రాస్నాఘృతం వా......బలాఘృతం" అనువాక్యముచే గ్రహింపనగును. లేక పైజెప్పిన రాస్నాఘృతమును క్షీరముతో జేర్చియైనను, బలాఘృతమును క్షీరముతో జేర్చియైన నుపయోగింపవలెనని యర్థము.)

### కాసాదిహరలేహ-స్వేదములు.

మూ. లేహాన్ కాసాపహాన్ స్వర్యాన్ శ్వాసహిక్కానిబర్హణాన్,
శిరఃపార్శ్వాంసశూలఘ్నాన్ స్నేహాంశ్చాతః పరం శృణు. 94

వ్యా. కాసము, స్వరభేదము, ఎక్కిళ్లు, శిరశ్శూలము, పార్శ్వశూలము, అంసశూలము, ఈయేడిటిని శమింపజేయు లేహములును, తైలఘృతాదిస్నేహములునను ఈ క్రిందజెప్పబడును.

### ఖర్జూరాదిఘృతావలేహము.

మూ. ఘృతం ఖర్జూరమృద్వీకాశర్కరాక్షౌద్రసంయుతం,
సపిప్పలీకం వైస్వర్యకాసశ్వాసజ్వరాపహమ్. 95

వ్యా. ఖర్జూరపుకాయలు, ద్రాక్షపండు, శర్కర, ఈమూటిని ఘృతమున జేర్చి అందు తేనెను, పిప్పలిచూర్ణమును చేర్చి సేవించినచో స్వరభేదమును దగ్గును, శ్వాసమును హరించును.

## దశమూలక్షీరఘృతము.

మూ. దశమూలశృతాత్క్షీరాత్ సర్పిర్యదుదియాన్నవం,
సపిప్పలీకం సక్షౌద్రం తత్పరం స్వరబోధనమ్. 96

వ్యా. దశమూలములను చేర్చి ఆవుపాలను కాచి దానినుండి వెన్నయెత్తి కాచి ఆక్రొత్తనేతియందు పిప్పలిచూర్ణమును, తేనెను కలిపి సేవించినచో, గొంతురాపును, శిరశ్శూల, పార్శ్వశూల, అంసశూలములను, కాసశ్వాసములను జ్వరమును హరించును.

## పంచమూలక్షీరఘృతము.

మూ. శిరఃపార్శ్వాంసశూలఘ్నం కాసశ్వాసజ్వరాపహం,
పఞ్చభిః పఞ్చమూలైర్వా శృతాద్యదుదియాద్ఘృతమ్. 97

వ్యా. ఐదువిధములగు పంచమూలముల గణద్రవ్యముల జేర్చి పాలను కాచి యాపాలను చిలికి వెన్న తీసి నెయ్యిచేసి, అందు పైజెప్పినరీతిగ తేనెను పిప్పలిచూర్ణమును కలిపి సేవించినచో పైజెప్పబడిన స్వరభేదాదులారును శమించును.

## పంచమూలఘృతము.

మూ. పఞ్చానాం పఞ్చమూలానాం రసే క్షీరచతుర్గుణే,
సిద్ధం సర్పిర్జయత్యేతద్యక్ష్మణః సప్తకం బలమ్. 98

వ్యా. మరియు పైజెప్పబడిన పంచమూలపంచకము చేర్చి కాచబడిన పాలనుండి తీయబడిన నేతిని ఐదువిధములైన పంచమూలములను కషాయము కాచి యాకషాయమును మూడుపాళ్లను ఒకపాలు క్షీరమును (ఈద్రవమునకు నాల్గవవంతు పైజెప్పినఘృతమును) చేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసి యాఘృతమును అగ్నిబలానుసారము సేవించినయెడ రాజయక్ష్మమున కల్గులక్షణము లేడును శమించును. (ఇచ్చట ఘృతమునకు సమభాగము పాలును క్వాథము మూడుభాగములును చేరి ఘృతమునకు ద్రవము చతుర్గుణ మగునని యెరుంగునది. ఈవిషయము తంత్రాంతరమున నిట్లున్నది:—"దశమూలశృతాత్ క్షీరాజ్జాతం సర్పిర్నవం పిప్పలీమధుఘృతం యత్, పఞ్చపఞ్చమూలకక్వథితాదుత్థితం యత్ త్రిభాగక్వథితతుల్యపయస్కం పక్వమ్." మరియు ఎక్కుల్లో రాజయక్ష్మరూపముల జేరకున్నను నుపద్రవరూపమని యిచ్చట చేర్చబడినది.)

## కొన్ని లేహములు.

మూ. ఖర్జూరం పిప్పలీ ద్రాక్షా పథ్యా శృఙ్గీ దురాలభా,
త్రిఫలా పిప్పలీ ముస్తం శృఙ్గాటగుడశర్కరాః. 99

వీరా శటీ పుష్కరాఖ్యం సురసశ్శర్కరా గుడః,
నాగరం చిత్రకో లాజాః పిప్పల్యామలకం గుడః. 100
శ్లో కార్ధైర్విహితా నేతాః లిహ్యాన్మధుసర్పిషా,
కాసశ్వాసాపహాః స్వర్యాః పార్శ్వశూలాపహాం స్తథా. 101

వ్యా. ఖర్జూరపుకాయలు, పిప్పళ్లు, ద్రాక్షపండు, కరకకాయలు, కర్కాటకశృంగి; ఇవి చేరి యొకయోగము; దూలగొండి, త్రిఫలములు, పిప్పళ్లు, తుంగగడ్డలు, పొత్తిగడ్డ, బెల్లము, చక్కెర ఇవి యన్నియు చేరి యొకయోగము; క్షీరకాకోళి, కచోరములు, పుష్కరమూలము, నల్లతులసి, చక్కెర, బెల్లము, ఇవి యొకయోగము; శుంఠి, చిత్రమూలము, పరిపేలాలు, పిప్పళ్లు, ఉసిరికకాయలు, బెల్లము, ఇవి చేరి యొకయోగము; ఇత్తెరంగున నొక్కొక శ్లోకార్ధముచే జెప్పబడిన యైదుయోగములను వేరువేరుగ చూర్ణముచేసి తేనెను నేతిని కలిపి సేవించినచో నొక్కొకటియు కాస-శ్వాస-పార్శ్వశూలముల హరించును. గొంతురాపు మాని కంఠస్వరము చక్కబడును.

క్షయములకు సితోపలాది-చూర్ణము.

మూ. సితోపలాం తుగాక్షీరీం పిప్పలీం బహులాం త్వచం,
అన్త్యాదూర్ధ్వం ద్విగుణితం లేహయేన్మధుసర్పిషా. 102
చూర్ణితం ప్రాశయేత్ వా తత్ శ్వాసకాసకఫాతురం,
(శ్వాసకాసజ్వరాపహమ్.)
సుప్తజిహ్వారోచకినం అల్పాగ్నిం పార్శ్వశూలినమ్. 103

వ్యా. శీనాకల్కండ, తవక్షీరి (వెదురుప్పు), పిప్పళ్లు, ఏలకులు, దాల్చినిచెక్క, వీనిని కడపనుండు దాల్చినిచెక్కనుండి పైకి యొక్కొకదానిని విలోమముగ రెండింతలు చేర్చి చూర్ణము చేసి అందు నేతిని తేనెను కలిపి సేవించినచో శ్వాసకాసములు, కఫము, నాలుక మొద్దుబారియుండుట, అరోచకము, అగ్నిమాంద్యము, ప్రక్కనొప్పి, ఇవి యన్నియు నిమ్మళించును. (ఇచ్చట దాల్చినిచెక్క యొకభాగంబును, రెండుభాగములు ఏలకులును, నాల్గుభాగములు పిప్పళ్లును, వెదురుప్పు ఎనిమిదిభాగములు, శీనాకల్కండ పదునారుభాగములును చేర్పవలెను.)

వాశా-శతావరీఘృతములయుపయోగము.

మూ. హస్తపాదాఙ్గదాహేషు జ్వరే రక్తే తథోర్ధ్వగే,
వాశాఘృతం శతావర్యా సిద్ధం వా పరమం హితమ్. 104

వ్యా. హస్తములయందును పాదములయందు తాపము కల్గినను, జ్వరమునందును, నోట రక్తము వెడలుచున్నను, రక్తపిత్తచికిత్సితమున జెప్పబడిన వాసాఘృతమునైనను, యోనివ్యాపచ్చికిత్సితమున చెప్పబడు శతావరీఘృతమునైనను సేవించుట చాల హితకరము.

రక్తపిత్తచికిత్సితమున "వాసాం సశాఖాం...ఆశ్వేవ నిహన్తి రక్తమ్" (చి. అ. ౪. శ్లో.౮౮) అని వాశాఘృతంబును; యోనివ్యాపచ్చికిత్సితమున "శతావరీమూలతులాః ......వాతపిత్తాత్మకాన్ జయేత్." (చి. అ. ౩౦. శ్లో.౬౩-౬౮. అని శతావరీఘృతంబును చెప్పబడినది.)

## దురాలభాదిఘృతము.

మూ. దురాలభాం శ్వదంష్ట్రాం చ చతస్రః పర్ణినీర్బలాం,
భాగాన్ పలోన్మితాన్ కృత్వా, పలం పర్పటకస్య చ. 105
పచేద్దశగుణే తోయే దశభాగావశేషితే,
రసే సుపూతే ద్రవ్యాణాం ఏషాం కల్కాన్ సమావపేత్. 106
శట్యాః పుష్కరమూలస్య పిప్పలీత్రాయమాణయోః,
తామలక్యాః కిరాతానాం తిక్తస్య కుటజస్య చ. 107
ఫలానాం సారిబాయాశ్చ సుపిష్టాన్ కర్షసమ్మితాన్,
తతస్తేన ఘృతప్రస్థం క్షీరద్విగుణితం పచేత్. 108
జ్వరం దాహం భ్రమం కాసం అంసపార్శ్వశిరోరుజం,
తృష్ణాం ఛర్దిమతీసారం ఏతత్సర్పిర్వ్యపోహతి. 109

వ్యా. దూలగొండి, పల్లేరు, పర్ణీచతుష్టయము (నేలపొన్న, కోలపొన్న, అడవిపెసర, కారుమినుము ఇవి పర్ణీచతుష్కము),చిట్టాముట్టి,పర్పాటకము,వీనిని ఒక్కొక్కటి నొక్కొకపలమువంతున జేర్చి అందు ఘృతమునకు పదింతలు నీళ్లుపోసి పదియవపాలు మిగులునట్లు కషాయముకాచి వడగట్టి యుంచుకొని అందు ఈక్రింద చెప్పబడు ద్రవ్యములను కల్కము చేసి చేర్చునది:—కచోరములు, పుష్కరమూలము, పిప్పళ్లు, కలుకానుగ, నేలఉశిరిక, నేలవేము, కొడిసెపాలవిత్తులు, సుగంధపాల, వీనిని ప్రత్యేకము కర్షమువంతున చేర్చి చక్కగ నూరి కషాయమున కలిపి అందు ప్రస్థపరిమితఘృతమును చేర్చి నేతికి రెండింతలు (రెండుప్రస్థములు) ఆవుపాలు కలిపి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసి యగ్నిబలానుసారముగ సేవించునది. దీనివలన జ్వరము, తాపము, భ్రమము,

కాసము, అంసములయందును పార్శ్వములయందును శిరస్సునందును కల్గుశూలము, దప్పి, వాంతి, అతిసారము, ఇవి యన్నియు నివర్తించును.

ఇచ్చట:—"దశగుణే తోయే దశభాగావశేషితే" అనుచోట ఘృతము ప్రస్థ పరిమితము కావున ఘృతమునకు పదింతలు (పదిప్రస్థములు) నీళ్లు బోసి పదియవపాలు (ఒకప్రస్థము) మిగుల కషాయము కాచవలెనని యర్థము. అట్లైనచో కషాయము ఘృతమునకు సమానముగ నుండును. అటుగాక క్వాథద్రవ్యములకు పదింతలని యర్థముచేసినచో ద్రవ్యములన్నియు చేరి యెనిమిదిపలములు కావున దానికి పదింతలు నీళ్లుబోసి పదియవవంతు మిగులుసరికి క్వాథము ఎనిమిదిపలములే యగును. అప్పుడు కషాయము ఘృతమునకు అర్థభాగమే యేర్పడును. కావున ఘృతమునకు దశగుణము జలమనుటయే సమంజసము. కషాయమును ద్విగుణితక్షీరమును జేరి ఘృతమునకు మూడింతలగును. ఇచ్చట విశేషవిధిచేత కల్కద్రవ్యద్రవభాగనిర్ణయ మేర్పడినది. జతూకర్ణతంత్రమునను ఈవిభాగమే సిద్ధాంతితము.

## రాజయక్ష్మహరజీవంత్యాదిఘృతము.

మూ. జీవన్తీం మధుకం ద్రాక్షాం ఫలాని కుటజస్య చ,
శటీం పుష్కరమూలం చ వ్యాఘ్రీం గోక్షురకం బలామ్. 110
నీలోత్పలం తామలకీం త్రాయమాణాం దురాలభాం,
పిప్పలీం చ సమం పిష్ట్వా ఘృతం వైద్యో విపాచయేత్. 111
ఏతద్వ్యాధిసమూహస్య రోగేశస్య సముత్థితం,
రూపమేకాదశవిధం సర్పిరగ్ర్యం వ్యపోహతి. 112

వ్యా. మనుబాల, అతిమధురము, ద్రాక్షపండు, కొడిసెపాలవిత్తులు, కచోరములు, పుష్కరమూలము, వాకుడు, పల్లేరు, చిట్టాముట్టి, నల్లకలువలు, నేలఉసిరిక, కలుగానుగ, దూలగొండి, పిప్పళ్లు, వీని నన్నిటిని సమభాగములుగ చేర్చి కల్కము చేసి కల్కమునకు నాల్గింతలపరిమితికల ఘృతమున జేర్చి ఘృతమునకు నాల్గింతలు జలమును జేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసి యగ్నిబలానుసారముగ సేవించినచో పదునొకండురూపములతో గూడి రోగసమూహరూపంబును రోగరాజంబును నగు రాజయక్ష్మమును శమింపజేయును. ఇది మిక్కిలి శ్రేష్ఠమైన ఘృతము. (ఇచ్చట కల్కాదిపరిమాణము చెప్పలేదు. కావున సామాన్యపరిభాష ననుసరించి కల్కమునకు చతుర్గుణము ఘృతంబును, ద్రవము నిర్దేశించినందున "ద్రవేష్వనుక్తే జలమేవ దేయమ్" అను సామాన్యపరిభాషచేత నాల్గిం

తలు జలంబును జేర్చుట సమంజసము. కొందరాచార్యులు కల్కద్రవ్యములక్వాథమును క్షీరమును రెంటిని పైయోగమువలెనే ద్రవముగ జేర్పవలెనని చెప్పెదరు. ప్రాచీన వ్యాఖ్యాతలు జలమును జేర్పవలెననియే చెప్పిరి.)

బలాదిఘృతము.

మూ. బలాం స్థిరాం పృశ్నిపర్ణీం బృహతీం సనిదిగ్ధికాం,
సాధయిత్వా, రసే తస్మిన్ పయో గవ్యం సనాగరమ్. 113
ద్రాక్షాఖర్జూరసర్పిర్భిః పిప్పల్యా చ శృతం సహ,
సక్షౌద్రం జ్వరకాసఘ్నం స్వర్యం చైతత్ ప్రయోజయేత్. 114
ఆజస్య పయసశ్చైవం ప్రయోగః; జాఙ్గలా రసాః,
యూషార్థే చణకాః ముద్గాః మకుష్ఠాశ్చోపకల్పితాః. 115

వ్యా. చిట్టాముట్టి, కోలపొన్న, ముయ్యాకుపొన్న, ములక, వాకుడు, వీనిని సమభాగములుగ చేర్చి కషాయము కాచి వడగట్టి యుంచునది. శుంఠి, ద్రాక్షపండు, ఖర్జూరపుకాయలు, పిప్పళ్లు, వీనిని కల్కముచేసి పైజెప్పిన క్వాథమున గలిపి ఆవుపాలను ఆవునేతిని చేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసి అందు తేనె జేర్చి సేవించినచో రాజయక్ష్మమునందలి జ్వరంబును కాసంబును స్వరభేదంబును నశించును.

మరియు పైజెప్పిన ఘృతయోగమననే ఆవుపాలకు బదులు మేకపాలను చేర్చి ఘృతమును సిద్ధముచేసియు నుపయోగింపవచ్చును. (ఈఘృతయోగమున క్వాథంబును పాలును సమభాగముగ కలిసి ఘృతమునకు నాల్గింతలును శుంఠ్యాదిద్రవ్యములకల్కము ఘృతమునకు ఎనిమిదవవంతును జేర్పనగును.) మరియు జాంగలజంతువులమాంసరసంబులును, యూషమును సిద్ధముచేయుటకు సెనగలు పెసలు అడవిగోధుమలును ఉపయోగింపవలెను.

రాజయక్ష్మజ్వరశమనవిధి.

మూ. జ్వరాణాం శమనీయో యః పూర్వముక్తః క్రియావిధిః,
యక్ష్మిణాం జ్వరదాహేషు ససర్పిష్కః ప్రశస్యతే. 116

వ్యా. యక్ష్మరోగులకు జ్వరసంతాపములు కల్గినపుడు జ్వరచికిత్సితమున జెప్పబడిన శమనచికిత్సాక్రమమును ఘృతమును జేర్చి యుపయోగించుట చాల ప్రశస్తము.

—౷ శ్లైష్మికరాజయక్ష్మమున వమనవిధి. ౸—

మూ. కఫప్రసేకే బలవాన్ శ్లైష్మికః ఛర్దయేన్నరః,
పయసా ఫలయుక్తేన మధురేణ (మాధుకేన) రసేన వా. 117
సర్పిష్మతా యవాగ్వా వా వామనీయోపసిద్ధయా,
వాన్తోఽన్నకాలే లఘ్వన్నం ఆదదీత సదీపనమ్. 118
యవగోధూమమాధ్వీకసింధ్వరిష్టసురాసవాన్,
జాఙ్గలాని చ శూల్యాని సేవమానః కఫం జయేత్. 119

వ్యా. రాజయక్ష్మమునందు నోట కఫము అధికముగ వెడలునెడ అట్టి శ్లేష్మరోగము కలవాడు శరీరబలము కల్గియుండినయెడ మ్రంగకాయలను నూరి పాలతో కలిపియైనను, మధురరసద్రవ్యములతో మ్రంగకాయను కలిపియైనను, అట్టి వమనద్రవ్యముల చేర్చి యవాగువును సిద్ధముచేసి, అందు నెయ్యికలిపి యైనను త్రాగించి వమనము చేయించవలెను. వాంతియైనపిమ్మట అన్నముతినుకాలమున దీపనములగు శుంఠి మున్నగు ద్రవ్యములచే సంస్కరింపబడినదియు శీఘ్రముగ జీర్ణము కాగలదియు నగునన్నమును లఘువుగ భుజించవలెను. మరియు యవలు, గోధుమలు, మాధ్వీకమనుమద్యము, శీధుమద్యము, అరిష్టములు, సురామద్యము, ఆసవములు శూలములకు గ్రుచ్చి నిప్పున పక్వముచేయబడిన జాంగలజంతుమాంసములు, వీనిని సేవించినచో కఫము హరించును.

—౷ కఫప్రసేకోపచారములు. ౸—

మూ. శ్లేష్మణోఽతిప్రసేకేన వాయుః శ్లేష్మాణమస్యతి,
కఫప్రసేకం తం విద్వాన్ స్నిగ్ధోష్ణేనైవ నిర్జయేత్. 120
క్రియా కఫప్రసేకే యా వమ్యాం సైవ ప్రశస్యతే,
హృద్యాని చాన్నపానాని వాతఘ్నాని లఘూని చ. 121

వ్యా. కఫము అధికముగ నోట వెడలినయెడ వాతము శ్లేష్మముతో గలిసి కఫమును వాంతిచేయును. అట్టి వాతసంబంధము కల్గిన కఫప్రసేకమును స్నిగ్ధంబును ఉష్ణవీర్యంబును నగు నౌషధాదులచే శమింపజేయనగును. మరియు కఫప్రసేకమునకు జెప్పిన చికిత్సనే వమనమునందును చేయుట ప్రశస్తము. మనస్సునకు రమ్యంబులును వాతహరంబులును తేలికగ జీర్ణము లగునవియు నగు నన్నపానముల నుపయోగించుట మంచిది.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—యక్ష్మరోగమున రసరక్తవహాది స్రోతస్సులు అడ్డగింపబడి యుండుటచేత ఆహారసారభూతమైన రసము రక్తాదుల కలియుటకు

తెరవులేక ఆశయమునందే సంచితమై అయ్యది కఫ(గల్ల)రూపముగ మారి నిలచి యుండును. అయ్యది శ్వాసకాసవేగమునంజేసి యూర్ధ్వముఖముగ వెడలి కంఠమున జేరి నోటినుండి (ఉమ్మిరూపముగ) బైట వెడలును. ఇది కఫప్రసేక మనబడును. దీనిలక్షణమే "అతిఖిన్నే శరీరేతు—శ్లేష్మా చోత్క్లిష్టసంచితః" అని పైని వివరింపబడినది. అట్టి సంచితమైన కఫము(గల్ల) అరోచకము కాసవేగము మున్నగుకారణములచే వాంతియైన నయ్యది వమనమనబడును. దీనిలక్షణము "అరోచకాత్ కాసవేగాత్...ఛర్దిర్యాసా...ఉపద్రవః" అని పైని చెప్పబడినది. అట్టి కఫప్రసేకము కేవలము కఫమును ప్రధానముగజేసి జనించుటచేతను వాతమును ప్రధానముగజేసి జనించుటచేతను (అప్రధానంబును) రెండు తెరంగుల నుండును. అందు శ్లేష్మప్రధానమైనదానికి వమనాదిచికిత్స యుచితము. ఈచికిత్సయే "కఫప్రసేకే బలవాన్...కఫం జయేత్" అని పైని చెప్పబడినది. వాతప్రధానమైన కఫప్రసేకమునకు స్నిగ్ధోష్ణాదిచికిత్సచే శమింపజేయనగును. ఇది "శ్లేష్మణోఽతిప్రసేకేన...స్నిగ్ధోష్ణైరేవ నిర్జయేత్" అని చెప్పబడినది.

మరియు పైజెప్పిన వమనంబును కఫ-వాత-ప్రధానభేదములచే రెండుతెరంగు లగును. అట్టి వమనభేదముల రెంటికిని కఫప్రసేకములకు జెప్పిన చికిత్సలనే దోషప్రాధాన్యమునుబట్టి చేయవలెనని "క్రియాకఫప్రసేకే యా వమ్యాం...లఘూని చ" అనువాక్యముచే నతిదేశింపబడినది.

### రాజయక్ష్మమునందలి సారచికిత్స.

మూ. ప్రాయేణోపహతాగ్నిత్వాత్ సపిచ్ఛమతిసార్యతే,
ప్రాప్నోతి చాస్యవైరస్యం న చాన్నమభినన్దతి.　　122
తస్యాగ్నిదీపనాన్యోగానతీసారనిబర్హణాన్,
వక్త్రశుద్ధికరాన్కుర్యాదరుచిప్రతిబాధకాన్.　　123

వ్యా. రాజయక్ష్మరోగికి ప్రాయికముగ జాఠరాగ్ని మందగించియుండును కావున మలము జిగురుగ అనేకపర్యాయములు వెడలుచుండును. అందువలననే నోరు రుచితప్పి అన్నమునందు యిచ్ఛపొడమకుండును. అట్టియెడ జాఠరాగ్నిదీపింపజేయునదియు, అతిసారమును పోగొట్టునవియు, నోటిని శుభ్రపరచునవియు, అరోచకమును నివర్తింపజేయునవియు నగు ఔషధాదియోగములను ప్రయోగింపవలయును.

### అతిసారహరయవాగుయోగములు.

మూ. సనాగరానిన్ద్రయవాన్ పాయయేత్తండులాంబునా,
సిద్ధాం యవాగూం జీర్ణే చ ఛాంగేరీతక్రదాడిమైః.　　124

పాఠాం బిల్వం యవానీం చ పాతవ్యం తక్రసంయుతం,
దురాలభాశ్శృంగిబేరం పాఠా చ సురయా సహ. 125
జంబ్వామ్రమధ్యం బిల్వం చ సకపిత్థం సనాగరం,
పేయామణ్డేన పాతవ్యం అతీసారనివృత్తయే. 126

వ్యా. శుంఠి, కొడిసెపాలవిత్తులు, ఈరెంటిని చూర్ణముచేసి బియ్యపుకడుగునీటిలో కలిపి అతిసారరోగికి త్రాగించవలయును. అయ్యది జీర్ణమైనపిదప పులిచింతాకు మజ్జిగ పుల్లదానిమ్మవిత్తులు, వీనిని చేర్చి సిద్ధముచేసిన యవాగువును త్రాగించవలయును. చిరుబొద్ది, బిల్వము, ఓమము, వీనిని చూర్ణముచేసి మజ్జిగలో కలిపి త్రాగవలయును. దూలగొండి, అల్లము, చిరుబొద్ది, ఈమూటిని నూరి సురామద్యమును కలిపి త్రాగించవలయును. నేరెడుపప్పు, మామిడిపప్పు, మారేడువేరు, వెలగపండు, శొంఠి వీనిని జేర్చి పేయను, మండమును సిద్ధముచేసి త్రాగినచో అతిసారము నివర్తించును.

ఖడయూషములు.

మూ. ఏతానేవ చ యోగాం స్త్రీన్ పాఠాదీన్ కారయేత్ ఖడాన్, ససూప్యధాన్యాన్ (సచుక్రధాన్యాన్) సస్నేహాన్ సామ్లాన్ సజ్గ్రహణాన్పరమ్. 127

వ్యా. పైజెప్పబడిన పాఠాది మూడుయోగములందును చెప్పబడిన ద్రవ్యములను వేరువేరుగ జేర్చి పెసలు మున్నగు పప్పుధాన్యములను, నేతిని, పులుపును గూడ పైయోగముల మూటియందు వేరువేరుగ జేర్చి మూడుఖడయూషములుగ చేర్చి త్రాగినచో విరేచనములను నిలుపును. ఇచ్చట ఖడయూషమన మజ్జిగ, పులిచింతాకు, మిరియాలు, జీలకర, చిత్రమూలము, దీనిని ఆయాయోగములయందు జెప్పబడిన ద్రవ్యములనుకూడ కలిపి పక్వముచేయబడిన గంజియని యెరుంగునది.

వేతసాదిసిద్ధకడయూషము.

మూ. వేతసార్జునజంబూనాం మృణాలీకృష్ణగన్ధయోః,
శ్రీపర్ణ్యా మదయన్త్యాశ్చ యూధికాయాశ్చ పల్లవాన్. 128
మాతులుఙ్గస్య ధాతక్యా దాడిమస్య చ కారయేత్,
స్నేహామ్లలవణోపేతాన్ ఖడాన్ సాంగ్రాహికాన్ పరమ్. 129
చాంగేర్యాశ్చుక్రికాయాశ్చ దుగ్ధికాయాశ్చ కారయేత్,
ఖడాన్ దధిసరోపేతాన్ ససర్పిష్కాన్ సదాడిమాన్. 130

వ్యా. ప్రబ్బలి, మద్ది, నేరుడు, తామరతూండ్లు, మునగ, అడవిగుమ్ముడు, మల్లె, మొల్ల, మాతులుంగము, ఆరెచెట్టు, దానిమ్మ ఈచెప్పబడిన చెట్లయొక్క చిగుళ్లను చేర్చి స్నేహద్రవ్యములను, పులుపును, ఉప్పును, చేర్చి ఖడయూషములను సిద్ధముచేయునది. ఈఖడయూషములు అతిసారము నిలుపుటకు చాల ప్రశస్తములు.

మరియు పులిచింతాకు, చుక్కకూర, పాలకూర, వీనిని చేర్చి పెరుగుమీది తేటను, నేతిని, దానిమ్మపులుసును కలిపి ఖడయూషముగ సిద్ధముచేసి సేవించినను, అతిసారముల నిలుపును.

## వ్యంజనాదులు.

మూ. మాంసానాం లఘుపాకానాం రసాః సాంగ్రాహికైర్యుతాః,
వ్యఞ్జనార్థం ప్రశస్యన్తే భోజ్యార్థం రక్తశాలయః. 131

వ్యా. శీఘ్రముగ జీర్ణమగు గుణము గల మాంసములను మలమును నిరోధించు ద్రవ్యముల జేర్చి సంస్కరింపబడిన మాంసరసములు, వ్యంజనములకును ఎఱ్ఱవరిధాన్యపు బియ్యము భోజనమునకును నతిసారరోగికి నుపయోగింపనగును.

## పానీయములు.

మూ. స్థిరాదిపఞ్చమూలేన పానే శస్తం శృతం జలం,
తక్రం సురా సచుక్రీకా దాడిమస్యాథ వా రసః. 132
ఇత్యుక్తం భిన్నశకృతాం దీపనం గ్రాహి భేషజం,

వ్యా. (ముయ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరు అనునవి స్థిరాది పఞ్చమూలములు. ఇవియే హ్రస్వపఞ్చమూలములు) ఈహ్రస్వపఞ్చమూలములను జేర్చి పానీయవిధిప్రకారము గాచబడిన జలమును, మజ్జిగయు, సురయనుమద్యము, చుక్కాకు, దానిమ్మరసము వీనిని జేర్చి సిద్ధముచేయబడిన మాంసరసమును అతిసారరోగులకు త్రాగుట కుపయోగించునది. ఇత్తెరంగున రాజయక్ష్మరోగమున గల్గు అతిసారమునకు దీపన, పాచన, సంగ్రాహకయోగములు వివరింపబడినవి.

యూషాదిభేదములు తంత్రాంతరమున నిట్లు చెప్పబడినవి:—"పిశితేన రసస్తత్ర, యూషో ధాన్యైః, ఖలః ఫలైః, మూలైశ్చ తిలకల్కామ్లప్రాయః కాంబలికః స్మృతః" మాంసము చేర్చి సిద్ధము చేయబడినది రసము. పెసరపప్పు మున్నగు పప్పుదినుసులు చేర్చి చేయబడినది యూషము. పండ్లరసమును చేర్చి చేయబడినది ఖడము. ముల్లంగి, తెలికపిండి, పులుపు వీని చేర్చిచేయబడినది కాంబలికము.

## అరోచకమును పోగొట్టుయోగములు.

మూ. పరం ముఖస్య వైరస్యనాశనం రోచనం శృణు. 133
ద్వౌ కాలౌ దన్తపవనం భక్షయేన్ముఖధావనమ్,
తద్వత్ప్రక్షాళయేదాస్యం ధారయేత్కబళగ్రహాన్. 134
పిబేద్ధూమం తతో మృష్టమద్యాద్దీపనపాచనం,
భేషజం పానమన్నం చ హితమిష్టోపకల్పితమ్. 135

వ్యా. పిమ్మట నోటియరుచిని పోనడచి రుచిపుట్టించు చికిత్సావిధాన మీక్రింద జెప్పబడును:—ప్రతిదినమునందును ఉదయసాయంకాలములయందు దంతములయందలి మలమును శుభ్రపరచు కానుగమున్నగు పుల్లలచే నమలి దంతధావనము చేసికొని తిక్త కటురసములు గల ద్రవ్యముల చేర్పబడిన జలముచేత నోరు శుభ్రముగ కడుగుకొనవలయును. పిమ్మట కబలగ్రహరూపమైన గండూషములను చేసి విధిప్రకారము ధూమపానముచేయవలయును. పిమ్మట అగ్నిని దీపింపజేసి ఆహారమును పచింపజేయునట్టి ఔషధమును సేవించి తనమనస్సు కింపైన పదార్థములచే గల్పింపబడిన యన్నపానములను సేవింపవలయును.

## అరోచకహరములగు యోగములు.

మూ. త్వఙ్ముస్తమేలాధాన్యాని ముస్తమామలకం త్వచం,
దార్వీ త్వచో యవానీ చ తేజోహ్వా పిప్పలీ తథా. 136
యవానీ తింతిడీకం చ పఞ్చైతే ముఖధావనాః,
శ్లోకపాదేష్వభిహితా రోచనాః ముఖశోధనాః. 137

వ్యా. దాల్చినచెక్క, తుంగగడ్డలు, ఏలకులు, దనియాలు, ఈనాల్గునుచేరి యొకయోగము; తుంగగడ్డలు, ఉసిరికయొలుపు, దాల్చినచెక్క ఇవి చేరి యొకయోగము మ్రానిపసుపు, దాల్చినచెక్క, ఓమము ఇవి చేరి యొకయోగము; పిప్పళ్లు, చవ్యము, ఇవి చేరి యొకయోగము; ఓమము, చింతపండు ఇవి ఒకయొకయోగము, ఇత్తైరంగు నొక్కొక్క పాదముచే చెప్పబడిన యోగములనైదిటిలో ఒక్కొక్కటియు రుచిని కల్గించునదియు, నోటిని శుభ్రపరచునదియు నగును.

## ముఖశోధనఘుటికాదులు.

మూ. గుళీ (టి) కాం ధారయేదాస్యే చూర్ణైర్వా శోధయేన్ముఖం
ఏషామాలోడితానాం వా ధారయేత్ కబలగ్రహాన్. 138

సురామాధ్వీకశీధూనాం తైలస్య మధుసర్పిషోః,
కబళాన్ ధారయేదిష్టాన్ క్షీరస్యేక్షురసస్య చ. 139

వ్యా. పైజెప్పిన ఐదుయోగములను గుటికలుగా చేసి నోటియందుంచుకొనవలయును. లేక చూర్ణముచేసి యాచూర్ణముచే నోటిని శుభ్రముచేయనగును. లేక సురామద్యము, మాధ్వీకము, శీధుమద్యము, తైలము, తేనె, నెయ్యి, పాలు, చెఱకురసము, వీనిలో తనకిష్టమైన ద్రవమునందు పైజెప్పిన యోగముల చూర్ణమును గలిపి కబలగ్రహముగా చేయవలయును. ఈయోగములవలన అరోచకము మానును.

—అరుచ్యాదులకు యవానీషాడబచూర్ణము.—

మూ. యమానీం తింతిడీకం చ నాగరం సామ్లవేతసం,
దాడిమం బదరం చామ్లం కార్షికం చోపకల్పయేత్. 140
ధాన్యసౌవర్చలాజాజీవరాంగం చార్ధకార్షికం,
పిప్పలీనాం శతం చైకం ద్వే శతే మరిచస్య చ. 141
శర్కరాయాశ్చ చత్వారి పలాన్యేకత్ర చూర్ణయేత్,
జిహ్వావిశోధనం హృద్యం తచ్చూర్ణం భక్తరోచనమ్. 142
హృత్ప్లీహపార్శ్వశూలఘ్నం విబన్ధానాహనాశనం,
కాసశ్వాసహరం గ్రాహి గ్రహణ్యర్శోవికారనుత్. 143
(ఇతి యవానీషాడబచూర్ణం.)

వ్యా. ఓమము, చింతాకు, శుంఠి, అమ్లవేతసము (పుల్లప్రబ్బలి), దానిమ్మబెరడు, పుల్లరేగుపండు, ఇవి ప్రత్యేకమొక్కొక్కకర్షము (కాలుపలము), దనియాలు, సౌవర్చలవణము, జీలకర, లవంగపట్ట, ఇవి దినుసుకు అర్ధకర్షము, పిప్పళ్లు నూరు, మిరియాలు రెండువందలు, చక్కెర నాల్గుపలములు, వీనినన్నిటి నొకటిగ చేర్చి చూర్ణముచేసి సేవించినయెడ ఈచూర్ణము నాలుకను దోషము పోగొట్టి శుభ్రపరచును. మనస్సుకింపుగనుండును. అన్నమునందు రుచిపుట్టించును. మరియు, రొమ్మునొప్పి, పార్శ్వశూలము, మలబద్ధకము, కాసశ్వాసములు, గ్రహణీదోషము, అర్శోరోగము, వీని నన్నిటిని పోగొట్టును, విరేచనముల నిలుపును. ఇది యవానీషాడబచూర్ణ మనబడును.

—కాసశ్వాసాదులకు తాళీసాదిచూర్ణము.—

మూ. తాళీశపత్రం మరిచం నాగరం పిప్పలీ శుభా,
యథోత్తరం భాగవృద్ధ్యా త్వగేలే చార్ధభాగికే. 144

పిప్పల్యష్టగుణా చాత్ర ప్రదేయా సితశర్కరా,
కాసశ్వాసారుచిహరం తచ్చూర్ణం దీపనం పరమ్. 145
హృత్పాణ్డుగ్రహణీదోషశోషప్లీహజ్వరాపహం,
వమ్యతీసారశూలఘ్నం మూఢవాతానులోమనమ్. 146
కల్పయేద్గుటికాం చైతత్ చూర్ణం పక్త్వా సితోపలైః,
గుటికా హ్యగ్నిసంయోగాచ్చూర్ణాల్లఘుతరాః స్మృతాః. 147
(ఇతి తాళిసాదిచూర్ణం గుటికాశ్చ)

వ్యా. తాళిసపత్రి ఒకభాగము, మిరియాలు రెండుభాగములు, శుంఠి మూడుభాగములు, మంచిపిప్పళ్లు నాల్గుభాగములు, దాల్చినచెక్క అర్ధభాగము, ఏలకులు అర్ధభాగము, శీనాకల్కండ పిప్పళ్లకంటె నెనిమిదింతలు ((32) ముప్పదిరెండుభాగములు) వీని నన్నిటిని చేర్చి విధ్యుక్తప్రకారము చూర్ణముచేసి సేవించునది. ఈచూర్ణమువలన కాసశ్వాసములు, అరోచకము, హృద్రోగము, పాండురోగములు, గ్రహణీరోగములు, వాపు, ప్లీహవృద్ధి, జ్వరము, వాంతి, అతిసారము, శూలము ఈరోగముల నన్నిటిని హరించును. మూఢవాతమును అనులోమముగ సంచరింపజేయును. అగ్నిని దీపింపజేయుటకు ఇది యుత్తమమైనది. మరియు నీచూర్ణము పైజెప్పిన. కండశర్కరను చూర్ణముచేసి చూర్ణమునకు సమానముగ నీళ్లు కలిపి పాకముపట్టి చూర్ణమును కలిపి మాత్రలుగను చేయనగును. ఈగుటికలు అగ్నియందు పక్వమగుటవలన మిక్కిలి లఘుత్వముకల్గి యుండును. (ఈయోగము శార్ఙ్గధరసంహితయందు "తాళీసం మరిచం శుంఠీ పిప్పలీ వంశలోచనా" అని యున్నది. దీనిననుసరించి వెదురుప్పును కొందరు చేర్చెదరు. హారీత జాతూకర్ణాద్యార్షగ్రంథములయం దీపాఠము కానరాదు).

### క్షయరోగికి మాంసోపయోగము.

మూ. శుష్యతాం క్షీణమాంసానాం కల్పితాని విధానవిత్,
దద్యాన్మాంసాదమాంసాని బృంహణాని విశేషతః. 148
శోషిణే బార్హిణం దద్యాత్, బర్హిశబ్దేన చాపరాన్,
గృధ్రానులూకాంశ్చాషాంశ్చ విధివత్సూపకల్పితాన్. 149
కాకాంస్తిత్తిరిశబ్దేన, వర్మిశబ్దేన చోరగాన్,
భృష్టాన్మత్స్యాన్ శీన్త్రశబ్దేన దద్యాత్ గణ్డూపదానపి. 150

లోపాకాం స్థూలనకులాన్ బిడాలాంశ్చోపకల్పితాన్,
సృగాలశాబాంశ్చ భిషక్ శశశబ్దేన దాపయేత్. 151
సింహాన్నృక్షాం స్తరక్షూంశ్చ వ్యాఘ్రా నేవం విధాం స్తథా,
మాంసాదాన్ మృగశబ్దేన దద్యాన్మాంసాభివృద్ధయే. 152
గజఖడ్గితురఙ్గాణాం వేసవారీకృతం భిషక్,
దద్యాన్మహిషశబ్దేన మాంసం మాంసాభివృద్ధయే. 153
మాంసేనోపచితాఙ్గానాం మాంసం మాంసకరం పరం,
తీక్ష్ణోష్ణలాఘువాచ్ఛస్తం విశేషాన్మృగపక్షిణామ్. 154
మాంసాని యాన్యనభ్యాసాత్ అనిష్టాని ప్రయోజయేత్,
తేష్వాపదా; సుఖం భోక్తుం తథా శక్యాని తాని హి. 155
జానన్ జుగుప్సన్నైవాఽద్యాత్, జగ్ధం వా పునరుల్లిఖేత్,
తస్మాచ్ఛద్మోపసిద్ధాని మాంసాన్యేతాని దాపయేత్. 156

వ్యా. శరీరమునందలి మాంసము నానాట క్షీణించి మిక్కిలి కృశించుచుండు రాజయక్ష్మరోగులకు మాంసమును తినునట్టి మృగములయొక్కయు పక్షులయొక్కయు మాంసములును శరీరమున మాంసమును బలియ జేయునవి కావున అట్టి జంతువులమాంసములను చక్కగ సంస్కరించి రోగిని తినిపించవలెను. అందును శరీరమునకు కండపుష్టిని కల్గించు మాంసములను వైద్యుడు గమనించి తినిపించవలెను. (మరియు నట్టి బృంహణము లగు మాంసములలో కొన్ని భక్షణార్హములు కాకుండును; అట్టి మాంసములను కూడ భక్షింపదగిన జంతువుల పేరు రోగికి క్రింద వివరించువిధముగచెప్పి పెట్టవలెను.)

క్షయరోగికి నెమలిమాంసమును తినిపించవలెను. ఇతరములగు గద్దలు గుడ్లగూబలు, భాసపక్షి, అనుపక్షులమాంసములను కూడ చక్కగ సంస్కరించి ఇది నెమలి మాంసమని రోగికి చెప్పి తినిపించవలెను. ఇత్తెరంగుననే కాకిమాంసమును తిత్తిరిమాంసమనియు, సర్పమాంసమును వర్మి(ములుగుచేప) మాంసమనియు, (వర్మి యనునది సర్పాకారముగ నుండు మత్స్యవిశేషము. ములుగు అని లోకమున దీనిని చెప్పెదరు). ఎఱ్ఱలను వేయించి ఇవి మత్స్యముల ప్రేవులనియు, చెప్పి తినిపించవలెను.

మరియు లోపాకము (మెంట్రువ), పెద్దముంగిసలు, పిల్లులు, నక్కలు, వీనిమాంసములను చక్కగ సంస్కరించి కుందేటిమాంసమని చెప్పి తినిపించవలెను. సింహములు, ఎలుగుబంటులు, సివంగులు, పెద్దపులులు, ఇవిమున్నగుమాంసముల దినునట్టి మృగముల

మాంసములను జింకలమాంసమని చెప్పి రోగికి మాంసము వృద్ధినొందుటకై తినిపించవలెను. ఏనుగు, ఖడ్గమృగము, గుఱ్ఱము, వీనిమాంసమును చక్కగ వేసవారము చేసి సంస్కరించి ఎనుబోతుమాంసమని చెప్పి క్షయరోగికి తినిపించవలెను. ఏనుగు మున్నగుజంతువులు మాంసమును తినునవి కాకున్నను వానిమాంసము మాంసవర్ధకము కావున క్షయరోగికి తినిపించవలెను.

మరియు మాంసమును తినుటవలన పుష్టినొందినజంతువులమాంసము మనుజుల మాంసమును మిక్కిలి వృద్ధినొందించును. కావున మాంసాదమాంసములు క్షయరోగికి మిగుల ప్రశస్తములు. మృగములయొక్కయు పక్షులయొక్కయు మాంసములు తీక్ష్ణ-ఉష్ణ-లఘుగుణములు కల్గియుండును. (కావున చులకనగ జీర్ణమై బలమును కల్గించును) కావున క్షయరోగికి మిగుల ప్రశస్తములు. ఏజంతువులమాంసము తినుటకలవాటు లేకుండు టచే మనసుకు ఇంపు కాకుండునో అట్టి జంతువులమాంసమును అభ్యాసమునుండు నెమలి మున్నగువానిపేరును చెప్పి వాస్తవము రోగికి తెలుపక తినిపించినచో రోగి తినుట కిష్ట ముగ నుండును. అటుగాక ఆజంతువుల వాస్తవ్యమైన పేరు తెలిసినచో రోగి తినుట కిష్టపడడు. ఒకవేళ బలవంతముగ సేవగించుచు తిన్నను వెంటనే యింపుగాక వాంతియు నగును. కావున పైజెప్పినరీతిగ మారుచెప్పి మాంసములను చక్కగ సంస్కరించి యక్ష్మ రోగికి తినిపింపనగును.

ఇచ్చట వేసవారీకృతమన—ఎముకలు లేకుండు మాంసమును మెత్తగ నూరి ఆవిరిచే నుడికించి బెల్లమును పిప్పలిచూర్ణమును మిరియాల పొడిని కలిపి తిరుగబోత పెట్టబడినదని యర్థము. ఈవిషయము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"నిరస్థిపిశితం పిష్టం స్విన్నం గుడసమన్వితం, కృష్ణామరిచసంయుక్తం వేసవార ఇతి స్మృతః." 'ఉపధ' యన నొకదాని నింకొకటిగ మార్చి చెప్పుట యని యర్థము.

## ప్రశస్తములగు మాంసములు.

మూ. బర్హితిత్తిరిదక్షాణాం హంసానాం సూకరోష్ట్రయోః,
ఖరగోమహిషాణాం చ మాంసం మాంసకరం పరమ్. 157

వ్యా. నెమలి, తీతుకపిట్ట, కోడి, హంస, పంది, ఒంటె, గాడిదె, వృషభము, ఎనుబోతు, ఈజంతువులమాంసము మాంసమును వృద్ధినొందించుటకు తక్కిన జంతువుల మాంసములకన్న మిగుల శ్రేష్ఠము.

## క్షయరోగికి అష్టవిధజంతువులమాంసోపయోగక్రమము.

మూ. యోనిరష్టవిధా ప్రోక్తా మాంసానామన్నపానికే,
తాం పరీక్ష్య భిషగ్విద్వాన్ దద్యాన్మాంసాని శోషిణే. 158

వ్యా. సూత్రస్థానమునందలి యన్నపానవిధ్యధ్యాయమున మాంసములకు ప్రధానముగ నుత్పత్తికారణమైన జంతుసముదాయమును ప్రసహాము మున్నగు భేదములచే నెనిమిదివిధముల విభజించి వానిగుణాదులు వేరువేరుగ వివరింపబడినది. అట్టి భేదములు కల జంతుభేదములను పండితుడగు వైద్యవరుడు చక్కగ గుణాదుల బరీక్షించి క్షయరోగికి తత్తదనుగుణముగ నుపయోగింపవలెను.

(అన్నపానవిధ్యధ్యాయమున మాంసవర్గమున మాంసమునకు కారణములైనజంతువులను, ప్రసహాములు, భూమిశయములు, ఆనూపములు, వారిశయములు, వారిచరములు, జాంగలములు, విష్కిరములు, ప్రతుదములు అని యెనిమిదివిధములుగ విభజించి వాని వానికి ప్రత్యేకగుణాదులు నిరూపింపబడినవి. ఆవిషయమంతయు సూత్రస్థానమునందలి యిరువదియేడవ యధ్యాయమున ౩౫-౮౬ శ్లోకములచే వివరింపబడినది. అచ్చట చూచునది.)

వాతశోషికుపయోగింపదగినమాంసములు.

మూ. ప్రసహాః భూశయానూపవారిజాః వారిచారిణః,
ఆహారార్థం ప్రదాతవ్యాః మాత్రయా వాతశోషిణే. 159

వ్యా. పైజెప్పిన యెనిమిదివిధములగు మృగపక్షిజాతులలో ప్రసహాములు, భూశయములు, ఆనూపములు, వారిజములు, జలచరములు, అనుజంతువులమాంసములను వాతాధికక్షయరోగికి ఆహారమునకై ఇప్పింపనగును.

కఫ-పిత్తశోషి కుపయోగింపదగినమాంసములు.

మూ. ప్రతుదా విష్కిరాశ్చైవ ధన్వజాశ్చ మృగద్విజాః,
కఫపిత్తపరీతానాం ప్రయోజ్యాః శోషరోగిణామ్. 160

వ్యా. ప్రతుదములు, విష్కిరములు, జాంగలజములు, అనుపక్షులయొక్కయు మృగములయొక్కయు మాంసములను కఫ-పిత్తము లధికముగగల క్షయరోగులకు ఆహారముగ నియ్యనగును.

భుజింపదగిన మాంసగుణములు.

మూ. విధివత్సూపసిద్ధాని మనోజ్ఞాని మృదూని చ,
రసవన్తి సుగన్ధీని మాంసాన్యేతాని భక్షయేత్. 161

వ్యా. విధ్యుక్తప్రకారము సంస్కరింపబడినవియు, మనసు కింపైనవియు, మెత్తనైనవియు, రసవంతములును, మంచిపరిమళము కల్గినవియు నగునట్లు పైజెప్పబడిన మాంసములను పక్వముజేసి (జఠరాగ్ని బలానుసారముగ) క్షయరోగి తినవలెను.

### మాంసభక్షణప్రయోజనము.

మూ. మాంసమేవాఽశ్నతశ్శోషీ మాధ్వీకం పిబతోఽపిచ,
నియతాఽనల్పచిత్తస్య చిరం కాయే న తిష్ఠతి. 162
వారుణీమణ్డనిత్యస్య బహిర్మార్జనసేవినః,
అవిధారితవేగస్య యక్ష్మా న లభతేఽన్తరమ్. 163

వ్యా. శోషరోగి మాంసమునే ఆహారముగ తిని మాధ్వీకమద్యమును త్రాగి, మనస్సును చంచలముగాక స్థిరముగ నుంచుకొని యుండునెడ నట్టివానిశరీరమున క్షయరోగము చాలకాలము నిలువనేరదు. (శీఘ్రముగ నివర్తించుననుట.) మరియు వారుణీమద్యము పైతేటను ప్రతిదినము త్రాగుచు, బహిశ్శోధములైన శరీరోపచారములజేసికొనుచు మలమూత్రాదివేగముల నిరోధించకయుండువారల కొకప్పుడును యక్ష్మరోగము కల్గదు.

### మాంసభక్షణమున కనుపానములు.

మూ. ప్రసన్నాం వారుణీం శీధుం అరిష్టానాసవాన్ మధు,
యథార్హ మనుపానార్థం పిబేన్మాంసాని భక్షయన్. 164

వ్యా. పైజెప్పినరీతిగ మాంసమును తినునప్పుడు సురామద్యముయొక్క తేటను, వారుణీమద్యమును, శీధుమద్యమును, ఆసవములను, అరిష్టములను, తేనెను వారివారియలవాటునుబట్టి అగ్నిబలానుసారము అనుపానముగ త్రాగవలెను.

### క్షయరోగమున మద్యపానముచే గల్గుప్రయోజనము.

మూ. మద్యం తైక్ష్ణ్యౌష్ణ్యవైశద్యసూక్ష్మత్వాత్ స్రోతసాం ముఖం,
ప్రమథ్య వివృణోత్యాశు తన్మోక్షాత్ సప్తధాతవః. 165
పుష్యన్తి; ధాతుపోషాచ్చ శీఘ్రం శోషః ప్రశామ్యతి,

వ్యా. మద్యము తీక్ష్ణ-ఉష్ణ-విశద-సూక్ష్మగుణముల గల్గియుండునుకావున స్రోతస్సులయొక్క ద్వారములను బలవంతముగ తెరచును. స్రోతోబంధము నివర్తించుటవలన ఆహారసారరూపమైన రసము రక్తాదిస్రోతోమార్గముల వ్యాపించి శరీరమునందలి రసరక్తాదిసప్తధాతువుల పుష్టినందించును. దానంజేసి యక్ష్మరోగము వెంటనే నివర్తించును కావున క్షయరోగికి మద్యపానము గుణవంతము. (క్షయప్రారంభమున వాతాదిదోషములు రస-రక్తాదిస్రోతోమార్గముల నడ్డగించియుండుటచే నాహారరసము రసాదిధాతువులలో వ్యాపించకుండుటంజేసి సప్తధాతువులును వరుసగ శుష్కించి శరీరము కృశించు

నని పైనిచెప్పబడినది. మద్యము తీక్ష్ణాదిగుణముల గల్గియుండుటవలన అట్టిగుణవిశేషములచే నిరోధింపబడిన స్రోతోమార్గముల దెరచును. పిదప నాహారరసము రసాది స్రోతోమార్గముల క్రమముగ వ్యాపింప వీలుండును. దానంజేసి రసాదిధాతువులు క్రమముగ వృద్ధినంది క్షయరోగము నివర్తించునని భావము).

క్షయహరఘృతప్రయోగములు.

మూ. మాంసాదమాంసస్వరసే సిద్ధాం సర్పిః ప్రయోజయేత్. 166
సక్షౌద్రం పయసా సిద్ధం సర్పిర్దశగుణేన వా,
సిద్ధం మధురకైర్ద్రవ్యైః దశమూలకషాయకైః. 167
క్షీరమాంసరసోపేతైః ఘృతం శోషహరం పరం,

వ్యా. మాంసమును తినునట్టి జంతువుల మాంసస్వరసమునుచేర్చి పక్వముచేయబడిన ఘృతమును తేనెకలిపి క్షయరోగి కుపయోగింపనగును. లేక ఘృతమునకు పదింతలు ఆవుపాలను చేర్చి సిద్ధముచేయబడిన ఘృతమునైన నుపయోగింపవలెను. మరియు మధురరసముకల ద్రవ్యముల కల్కమును దశమూలముల కషాయద్రవమును పాలను మాంసరసమును చేర్చి కాచబడిన ఘృతము క్షయముల హరించుటకు మిగుల శ్రేష్ఠమైనది.

ఇచ్చట మధురద్రవ్యములకల్కమును ఘృతమునకు నాల్గవపాలును, దశమూలకషాయమును ఘృతమునకు నాల్గింతలును, క్షీరమును ఘృతమునకు సమభాగంబును మాంసరసంబును సమభాగంబును జేర్చి ఘృతమును పక్వముచేయనగును. "ద్రవాంతరేణ యోగేతు క్షీరంస్నేహసమంవిదుః" అనువిశేషపరిభాషచేత ద్రవాంతరసంబంధ ముండుటంబట్టి క్షీరము ఘృతసమమని యెరుంగునది.

పిప్పల్యాదిఘృతము.

మూ. పిప్పలీపిప్పలీమూలచవ్యచిత్రకనాగరైః. 168
సయావశూకైః సక్షీరైః స్రోతసాం శోధనం ఘృతం,

వ్యా. పిప్పళ్లు, మోడి, చవ్యము, చిత్రమూలము, శుంఠి, యవక్షారము, పాలు, వీనినిచేర్చి సిద్ధముచేయబడిన ఘృతము రసరక్తాదిధాతువుల నిరోధమును నివర్తింపజేయును. (ఇచ్చట కల్కాదిపరిమాణమును చెప్పలేదుకావున సామాన్యపరిభాషచేత పిప్పల్యాది ద్రవ్యములకల్కము ఘృతమునకు నాల్గవపాలును, ఘృతమునకు నాల్గింతలు క్షీరమును, జేర్పవలెను. మరియు కల్కగుణము ఘృతమునజేరుటకై జలమునుగూడ ఘృతమునకు నాల్గింతలు చేర్చవలెను. ఈవిషయము—"స్నేహపాకవిధౌ యత్ర క్షీరమేకస్తు

కథ్యతే, తోయాదీనా మనిర్దేశే క్షీరమేవ చతుర్గుణమ్" "దుగ్ధే దధ్ని రసే... కల్కస్య సమ్యక్పాకార్థం తోయమత్ర చతుర్గుణమ్" అనుపరిభాషలచే జెప్పబడినది. పాలను మాత్రము ద్రవముగ జెప్పిన స్నేహపాకములయందెల్ల నీపరిభాష నెరుంగునది.

### క్షయహరరాస్నాదిఘృతము.

మూ. రాస్నాబలాగోక్షురక స్థిరావర్షాభుసాధితమ్. 169
జీవన్తీపిప్పలీగర్భం సక్షీరం శోషనుత్ ఘృతం,

వ్యా. సన్నరాష్ట్రము, చిట్టాముట్టి, పల్లేరు, ముయ్యాకుపొన్న, గలిజేరు వీనికషాయమును, మనుబాల, పిప్పళ్లు వీనికల్కమును పాలను చేర్చి సిద్ధముచేయబడిన ఘృతము క్షయముల హరించును.

ఇచ్చట రాస్నాదికషాయము నాల్గింతలును, పాలు ఘృతసమంబును కల్కము ఘృతమునకు నాల్గవవంతును జేర్చవలెను.

### సిద్ధఘృతముల కనుపానములు.

మూ. యవాగ్వా వా పిబేన్మాత్రాం, లిహ్యాద్వా మధునా సహ. 170
సిద్ధానాం సర్పిషామేషాం అద్యాదన్నేన వా సహ,
శుష్యతామేష నిర్దిష్టో విధిరాభ్యవహారికః. 171

వ్యా. పైజెప్పబడినఘృతములను జఠరాగ్ని బలానుసారముగ పరిమాణముగల్పించి యవాగువుతోనైనను, తేనెతోనైనను, అన్నముతోనైనను, జేర్చి సేవింపనగును. క్షయ రోగపీడితులకు ఆహారవిధి యిత్తెరంగున నిర్దేశింపబడినది.

### క్షయరోగికి బాహ్యోపచారములు.

మూ. బహిస్స్పర్శనమాశ్రిత్య వక్ష్యతేఽతఃపరం విధిః,
స్నేహక్షీరామ్బుకోష్ఠేషు స్వభ్యక్తమవగాహయేత్. 172
స్రోతోవిబన్ధమోక్షార్థం బలపుష్ట్యర్థమేవ చ,
ఉత్తీర్ణం మిశ్రకైస్స్నేహైః పునరాక్తైః సుఖైః కరైః. 173
మృద్నీయాత్సుఖమాసీనం సుఖం చోత్సాదయేన్నరం,

వ్యా. చికిత్స అన్తఃపరిమార్జనమనియు బహిఃపరిమార్జనమనియు రెండువిధములు. అందు ఔషధసేవనము మున్నగు నంతఃపరిమార్జనము ఇంతదనుక చెప్పబడినది. ఇక బహిః పరిమార్జనస్పర్శాదిరూపమైన అవగాహసంవాహనాది చికిత్సావిధి యీక్రింద చెప్పబడును.—

క్షయరోగికి తైలాదులచే నభ్యంగనము చేయించి యొకతొట్టిలో స్నేహములను పాలను జలమును బోసి నింపి యాజలమునం దవగాహనము చేయించవలెను. అట్లుచేసి నచో రసాదిస్రోతోమార్గములబంధమువలన శరీరమునకు పుష్టి కల్గును. తొట్టిలో నవ గాహనముచేసి లేచినపిదప అరచేతులకు మిశ్రకస్నేహమునుబూసికొని యొకసేవకుడు సుఖ ముగ కూర్చొనియుండు యక్ష్మరోగియొక్క శరీరమును సుఖస్పర్శముగ పిసికి శరీరముపై నుండు మలినమును రుద్ది వదలించవలెను. ఇత్తెరంగున పలుమారు మిశ్రకస్నేహమును పూసికొనుచు మర్దనము చేయవలెను.

ఉద్వర్తనమునకు జీవన్త్యాదిచూర్ణము.

మూ. జీవన్తీం శతవీర్యాం చ వికసాం సపునర్నవామ్. 174
అశ్వగన్ధామపామార్గం తర్కారీం మధుకం బలాం,
విదారీం సర్షపం కుష్ఠం తణ్డులానతసీఫలమ్. 175
మాషాం స్తిలాంశ్చ కిణ్వం చ సర్వమేకత్ర చూర్ణయేత్,
యవచూర్ణం ద్వి(త్రి)గుణితం దధ్నా యుక్తం సమాక్షికమ్. 176
ఏతదుత్సాదనం కార్యం పుష్టివర్ణబలప్రదం,
గౌరసర్షపకల్కేన కల్కైశ్చాపి సుగన్ధిభిః. 177
స్నాయాదృతుసుఖైస్తోయైః జీవనీయౌషధైః శృతైః,

వ్యా. పాలకూర, తెల్లగరిక, మంజిష్ఠి, గలిజేరు, పెన్నేరుగడ్డ, ఉత్తరేణి, తక్కలి, అతిమధురము, చిట్టాముట్టి, నేలగుమ్మడు, ఆవాలు, చెంగల్వకోష్టు, వరిబియ్యము, అవిసెగింజలు, ఉద్దులు, నువ్వులు, సురాబీజము వీనినన్నిటిని సమభాగముగ జేర్చి మెత్తగ చూర్ణముచేసినయెడల చూర్ణమును పైచూర్ణమునకు రెండు(మూడు)భాగములుగ జేర్చి అందు పెరుగును కొంచెముగ తేనెను కలిపి దీనిచేత పైజెప్పినరీతిగ తొట్టిస్నానముచేసి యంగమర్దనముచేసిన రోగికి నలుగుపెట్టినయెడల శరీరపుష్టియు బలంబును కల్గును. మరియు తెల్లావాలకల్కముచేనైనను సుగంధద్రవ్యముల చూర్ణముచేనైనను నలుగుపెట్టి ఆయాఋతువున శీతోష్ణస్థితి కనుగుణముగ జీవనీయగణద్రవ్యముల చేర్చి కాచబడిన నీళ్లచేత స్నానము చేయవలెను.

ఇచ్చట పాలకూర, కాకోళి, క్షీరకాకోళి, మేద, మహామేద, అడవిపెసర, కారుమినుము, జీవకము, ఋషభకము, యష్టిమధుకము, ఇవి జీవనీయములని యెరుంగు నది. మరియు శరీరమునకు బలకరములగు ద్రవ్యములన్నియు జీవనీయములని చెప్ప బడును.

## క్షయరోగికి భోజనవిధి.

మూ. గన్ధైస్సుమాల్యైః వాసోభిః భూషణైశ్చ విభూషితః. 178
స్పృశ్యాన్ సంస్పృశ్య సంపూజ్య దేవతాస్సభిషగ్ద్విజాః,
ఇష్టవర్ణరసస్పర్శగన్ధవత్ పానభేషజమ్. 179
ఇష్టమిష్టైరుపహితం సుఖమద్యాత్ సుఖప్రదం,

వ్యా. పైజెప్పినరీతిగ స్నానముచేసి పరిశుద్ధుడైన క్షయరోగి శరీరమున చందనము పూసికొని పుష్పమాలికలను ధరించి నిర్మలమైన బట్టలగట్టి ఆభరణములను ధరించి స్పృశింపదగిన మంగళకరద్రవ్యములను స్పృశించి ఇష్టదేవతలను, వైద్యులను, బ్రాహ్మణులను, యథోచితముగ పూజించి తనమనస్సు కిష్టమైనవర్ణంబును, రసంబును, స్పర్శంబును, పరిమళంబునుగల్గి శరీరమునకు ఆరోగ్యరూపమైన, సుఖమునుకల్గించునదియు తనకిష్టులైన వారిచే వడ్డింపబడినదియు, నగుపానభోజనములను సుఖముగ భుజింపవలయును.

ఇచ్చట రోగియొక్క మనస్సు కనుకూలమైన ప్రవర్తనము యక్ష్మరోగమును దోషమును హరించును. గావున చేష్టలన్నిటియందును తనమనస్సు కనుకూలముగ నుండవలయునని పైవాక్యముచే విధింపబడినది. మరియు "సమ్పూజ్య దేవతాః సభిషగ్ద్విజాః" అని చెప్పుటచేత దైవవ్యపాశ్రయరూపమైనచికిత్సయు చెప్పబడినది.

## రాజయక్ష్మరోగికి పథ్యములు.

మూ. సమాతీతాని ధాన్యాని కల్పనీయాని శుష్యతామ్. 180
లఘూన్యహీనవీర్యాణి స్వాదూని గన్ధవన్తి చ,
యాని ప్రహర్ష కారీణి తాని పథ్యతమాని హి. 181
యచ్చోపదేక్ష్యతే పథ్యం (కించిత్) క్షతక్షీణచికిత్సితే,
యక్ష్మిణస్తత్ప్రయోక్తవ్యం బలమాంసాభివృద్ధయే. 182

వ్యా. సంవత్సరము దాటి పాతవియగు ధాన్యములును, లఘుగుణము గలిగి తేలికగ జీర్ణమగునవియు, వీర్యము చెడకయుండునవియు నగుపదార్థములను క్షయరోగులకు ఆహారమునకై యుపయోగింపదగును. మిక్కిలి పథ్యములైనవియు, హితకరములగును. మరియు క్షతక్షీణచికిత్సితమున "యద్యత్సంతర్పణం శీతం......వ్యాధిం సాత్మ్యబలం తథా. (చి. అ. 11. శ్లో. 93, 94) అని యుపక్రమించి చెప్పబడిన క్షతక్షీణులకు పథ్యములన్నియు యక్ష్మరోగులకు పథ్యములై యుండును. అట్టి పథ్యాసేవనమువలన శరీరబలంబును మాంసంబును వృద్ధినొందును.

రాజయక్ష్మము నివర్తించుట కుపాయములు.

మూ. అభ్యఙ్గోత్సాదనైశ్చైవ వాసోభిరహతైః ప్రియైః,
యథర్తువిహితైః స్నానైః అవగాహైః విమార్జనైః. 183
వస్తిభిః క్షీరసర్పిర్భిః; మాంసైర్మాంసరసౌదనైః,
ఇష్టైర్మద్యైర్మనోజ్ఞానాం గన్ధానాముపసేవనైః. 184
సుహృదాం రమణీయానాం ప్రమదానాం చ దర్శనైః,
గీతవాదిత్రశబ్దైశ్చ ప్రియశ్రుతిభిరేవ చ. 185
హర్షణాశ్వాసనైర్నిత్యం గురూణాం సముపాసనైః,
బ్రహ్మచర్యేణ దానేన తపసా దేవతార్చనైః. 186
సత్యేనాచారయోగేన మఙ్గళ్యైరప్యహింసయా,
వైద్యవిప్రార్చనాచ్చైవ రోగరాజో నివర్తతే. 187

వ్యా. అభ్యంగనములు, ఉద్వర్తనములు, వస్త్రములు, ఆయాఋతువునకు విధింపబడిన స్నానములు, అవగాహస్నానములు, అంతఃపరిమార్జన-బహిఃపరిమార్జనములు, వస్తికర్మ, వీనినాచరించుట, క్షీరములను, ఘృతములను మాంసములను, మాంసరసములను, అన్నములు వీనినుపయోగించుట, మనస్సు కింపైనమద్యములు, మనోహరములగు సుగంధములు వీనిని సేవించుట; స్నేహితులను, చక్కనిరూపవతులగు స్త్రీలను చూచుట, సంగీతమును, వాద్యములను, ప్రియమైనవాక్యములను వినుట, మనస్సునకు హర్షమును గలిగించు పనులుజేయుట, ఊరడింపుమాటల వినుట, గురువుల సేవజేయుట, ఇంద్రియముల నిగ్రహించి బ్రహ్మచర్యము నవలంబించుట, పీడానివృత్తికరమైన దానముల జేయుట, తపస్సు జేయుట, ఇష్టదేవతల పూజించుట, సత్యములు బల్కుట, సదాచారము నవలంబించుట, మంగళకరమైన కృత్యముల జేయుట, హింసను మానుట, వైద్యులను బ్రాహ్మణులను పూజించుట, వీనియన్నింటిచే రోగరాజమైన యక్ష్మరోగము నివర్తించును.

రాజయక్ష్మహరమగుయిష్టి.

మూ. యయా ప్రయుక్తయా చేష్ట్యా రాజయక్ష్మా పురాజితః,
తాం వేదవిహితాం ఇష్టిం ఆరోగ్యార్థీ ప్రయోజయేత్. 188

వ్యా. మరియు వేదమునందు కామ్యములగు ఇష్టులలో చెప్పబడిన రాజయక్ష్మను నివర్తింపజేయు ఇష్టిని విధ్యుక్తప్రకారము చేసినచో రాజయక్ష్మము పూర్తిగ నివర్తిం

చును. ఇచ్చట "గన్ధైః సమాస్యైః" అని యుపక్రమించి ఇంతదనుక చెప్పబడినది దైవవ్యపాశ్రయరూపమైన చికిత్సయని యెరుంగునది.

అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. ప్రాగుత్పత్తిర్నిమిత్తాని ప్రాగ్రూపం రూపసంగ్రహాః,
సమాసాత్ వ్యాసతశ్చోక్తం భేషజం రాజయక్ష్మణః. 189
నామ హేతురసాధ్యత్వం సాధ్యత్వం కృచ్ఛ్రసాధ్యతా,
ఇత్యుక్తస్సంగ్రహః కృత్స్నో రాజయక్ష్మచికిత్సితే. 190

వ్యా. రాజయక్ష్మరోగమునకు సంబంధించిన ప్రాగుత్పత్తి, హేతువులు, పూర్వరూపము, ఏకాదశరూపములసంగ్రహము, సంగ్రహవిస్తరరూపమైన చికిత్సలు, రాజయక్ష్మ మను పేరుగల్గుటకు కారణము. సాధ్యాసాధ్యకృచ్ఛ్రసాధ్యభేదములు, ఇవి యన్నియుఁ రాజయక్ష్మచికిత్సితమను నీయధ్యాయమున సంగ్రహరూపముగ చెప్పబడినది.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, చికిత్సాస్థానే
రాజయక్ష్మచికిత్సితం నామ అష్టమోఽధ్యాయః.

ఇత్తెరంగున అగ్నివేశవిరచితంబును చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమున చికిత్సాస్థానమునందలి రాజయక్ష్మచికిత్సితమను నది అష్టమోధ్యాయము సమాప్తము.

---

## నవమాధ్యాయము.

అవతరణిక:—రోగముల ప్రాగుత్పత్తిక్రమమున "హవిష్ప్రాశనాత్ మేహకుష్ఠానాం, భయోత్త్రాసశోకైః ఉన్మాదానాం, వివిధాశుచిసంస్పర్శాత్ అపస్మారాణాం" అని ప్రమేహకుష్ఠములను జెప్పినపిదప నున్మాదము చెప్పబడినది. అందును ఉన్మాదము మనోభిఘాతకారణమున జనించునది కావున దానిని వదలి కుష్ఠానంతరము కుష్ఠములబోలె త్రిదోషజన్యత్వసాజాత్యమునంజేసి రాజయక్ష్మచికిత్సితము చెప్పబడినది. పిదప ప్రాగుత్పత్తిక్రమానుసారముగ నున్మాదచికిత్సితము వివరింపబడును:—(ఇచ్చట అధ్యాయములవరుసలో ప్రాచీనముద్రితప్రతిలో భిన్నముగ నున్నది. అది వ్యాఖ్యానవిరుద్ధమని సూత్రస్థానమున నే చెప్పబడినది).

మూ. అథాత ఉన్మాదచికిత్సితం వ్యాఖ్యాస్యామః. 1
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. 2

వ్యా. రాజయక్ష్మచికిత్సితమును జెప్పినపిదప నున్మాదచికిత్సితమును భగవత్స్వరూపుడగు నాత్రేయు లుపదేశించినదానికన్న న్యూనాతిరేకము లేకుండునట్లు వివరించెదనని యర్థము.

## ఉన్మాదచికిత్సప్రారంభము.

మూ. బుద్ధిస్మృతిజ్ఞానతపోనివాసః పునర్వసుః ప్రాణభృతాం శరణ్యః,
ఉన్మాదహేత్వాకృతిభేషజాని కాలేఽగ్నివేశాయ శశంస పృష్టః. 3

వ్యా. బుద్ధి, జ్ఞాపకశక్తి, జ్ఞానము, తపస్సు, వీనికన్నిటికిని ఉనికిపట్టైన ప్రాణులకందరకును రక్షకుడగు పునర్వసు వను నామాంతరముగల యాత్రేయులు ఉన్మాదమునకు సంబంధించినకారణములు, వానిలక్షణములు, వానిని శమింపజేయునౌషధములు, వీనినన్నిటిని చెప్పుమన తనశిష్యుడయిన యగ్నివేశులచే అడుగబడి సకాలము వరుసగ వానినెల్ల నిట్లు చెప్పందొడంగెను.

## ఉన్మాదహేతువులు.

మూ. విరుద్ధదుష్టాశుచిభోజనాని ప్రధర్షణం దేవగురుద్విజానాం,
ఉన్మాదహేతుర్భయహర్షపూర్వో మనోఽభిఘాతో విషమాశ్చ చేష్టాః.

వ్యా. పరస్పరవిరుద్ధములగు క్షీరమత్స్యాదులనైనను, విషాదిదూషితమగునన్నమునైనను, మిక్కిలి దోషములను వృద్ధినొందించు నాహారములనైనను భుజించినను; అపరిశుద్ధమైన అన్నమును భుజించినను; దేవతలను, పూజ్యులగుగురువు మొదలైనపెద్దలను, బ్రాహ్మణులను ధిక్కరించినను; భయముచేనైనను, అధికసంతోషముచేనైనను, మనస్సునకు అభిఘాతము కల్గినను; విషమము లంగికాదిచేష్టలచేసినను ఉన్మాదము సంభవించును. ఇచ్చట భయహర్షశబ్దములచే క్రోధము ద్వేషము మున్నగు మనోవ్యాపారములన్నియు గ్రహింపబడును. క్రోధము మున్నగు మనోవృత్తివ్యాపారములచే మనస్సున కభిఘాతము కల్గినప్పుడు భయము హర్షము మున్నుగ జేసికొని ఉన్మాదము సంభవించునని యైనను అర్థము చేయనగును. విరుద్ధాశనము మున్నగునవి యథాసంభవముగ ఉన్మాదకారణము లగును.

## ఉన్మాదసంప్రాప్తి.

మూ. తైరల్పసత్వస్య మలాః ప్రదుష్టాః బుద్ధేర్నివాసం హృదయం

ప్రదూష్య, స్రోతాంస్యధిష్ఠాయ మనోవహాని ప్రమోహ
యన్త్యాశు నరస్య చేతః.

వ్యా. పైజెప్పినకారణములచేత ప్రకోపమునొందిన వాతాదిదోషములు స్వ
మైన సత్వగుణముగల మనుజునియొక్క బుద్ధికి ఉనికిపట్టైన హృదయమును దుష్టము
జేసి ఆహృదయస్థానమునందలి మనస్సును వ్యాపింపజేయునట్టిధమనులయొక్క స్రోతస
లను చెరచి మనుజునియొక్క మనస్సును మోహింపజేయును. (చిత్తభ్రమను గ
గించును.)

## ఉన్మాదసామాన్యరూపములు.

మూ. ధీవిభ్రమః సత్వపరిప్లవశ్చ పర్యాకులా దృష్టిరధీరతా చ,
అబద్ధవాక్త్వంహృదయంచశూన్యంసామాన్యమున్మాదగదస్యలిఙ్గ

వ్యా. చిత్తభ్రమము, సత్వగుణము, వ్యత్యస్తముగ మారుట, చూపు నిల్కడలే
నలుదెసల వ్యాపించుట, ధైర్యము లేకుండుట, మాట నిల్కడలేక **అసంబద్ధ**ముగ మా
లాడుట, హృదయస్థానమునందు ఏమియు దెలియక శూన్యముగనుండుట ఇవియన్ని
నున్మాదసామాన్యముగ గల్గులక్షణములు. (ఇచ్చట కొందరు ధీవిభ్రమాదులు ఉన్మా
మునకు సామాన్యముగ పూర్వరూపములనియు కొందరు సామాన్యలక్షణములని
వ్యాఖ్యానము చేసినారు.)

## ఉన్మాదస్వరూపము.

మూ. స మూఢచేతా న సుఖం న దుఃఖం నాచారధర్మౌ కుత ఏవ శాన్తిం
విన్దత్యపాస్తస్మృతిబుద్ధిసంజ్ఞో భ్రమత్యయం చేత ఇతస్తతశ్చ.

వ్యా. అట్టి యున్మాదముగలవాడు చంచలమైనమనస్సుగలవాడై సుఖమునైన
దుఃఖమునైనను, సదాచారమునైనను, ధర్మమునైనను, కొంచెమైన తెలిసికొనజాలడ
అట్టివానికి మనశ్శాంతి ఎట్లు కల్గును? (ఒకప్పుడును కల్గదనుట.) మరియు వాడు జ్ఞాప
శక్తియు, బుద్ధి, ఊహ, అను నీమనోవృత్తిజ్ఞానములను బొత్తుగలేనివాడై తనమనస్సు
సారథి గుఱ్ఱములను బలు తెరంగుల త్రిప్పుభంగి నిల్కడలేక పలుపోకల పోనిచ్చి త్రి
చుండును.

## ఉన్మాదనిరుక్తి, ఆగన్తు-నిజభేదములు.

మూ. సముద్భ్రమం బుద్ధిమనః స్మృతీనాం ఉన్మాదమాగాన్తునిజో
మాహుః, తస్యోద్భవం పఞ్చవిధం పృథక్ తు వక్ష్యామి లిఙ్గా
చికిత్సితం చ.

వ్యా॰ బుద్ధి, మనస్సు, స్మృతి, అనువానియొక్క నిల్కడలేనిపరిస్థితి ఉన్మాదమన బడును. ఈయున్మాదము ఆగంతుకము, నైజము (వాతాదిదోషజన్యము), అను భేదముచే నైదువిధములుగనుండును. అట్టి యైదువిధములగు నున్మాదములకు వేరువేరులక్షణము లును, చికిత్సలును, ఈక్రింద వివరింపబడును. (ఇచ్చట వాత-పిత్త-కఫ-సన్నిపాత భేదములచే నాల్గువిధములుగను ఆగంతుకకారణములచే జనించినది ఐదవదియు చేరి యున్మాదములు ఐదు తెరంగు లగును. ఈయైదింటిలో సాన్నిపాతికము అసాధ్యమగుటచే చికిత్సానర్హమైనను ఛత్రన్యాయము ననుసరించి "పఞ్చవిధం...... చికిత్సితం చ" అని చెప్పబడినది.)

## వాతజోన్మాదకారణము.

మూ. రూక్షాల్పశీతాన్నవిరేకధాతుక్షయోపవాసైరనిలోఽతివృద్ధః,
చిన్తాదిజు(తు)ష్టం హృదయం ప్రదూష్య బుద్ధిం స్మృతిం చాప్యుప
హన్త్యశీఘ్రమ్.　　9

వ్యా॰ జిడ్డులేక రూక్షముగనున్న అన్నమును తినుట, తాను భుజించుపరిమితి కన్నను స్వల్పముగ భుజించుట, చల్లనియన్నమును తినుట, విరేచనములగు ధాతు క్షయము, ఉపవాసము ఈకారణములచేత వాతము మిక్కిలి వృద్ధినొంది ప్రకుపితమై చింత మున్నగుకారణములచే దుష్టమైన హృదయమును చెరచి, బుద్ధిని, స్మృతిని, అతి శీఘ్రము నశింపజేయును.

## వాతజోన్మాదలక్షణములు.

మూ. అస్థానహాసస్మితనృత్యగీతవాగఙ్గవిక్షేపణరోదనాని,
పారుష్యకార్శ్యారుణవర్ణతాశ్చ జీర్ణే బలం చానిలజస్యరూపమ్.

వ్యా॰ వాతోన్మాదముగలవాడు కారణములేకయే కటికనవ్వు నవ్వుచుండును. తనలో తానే చిరునవ్వు నవ్వుచుండును. నాట్యమాడును, సంగీతముపాడును, నోరును వికారముగ త్రిప్పుచుండును. హస్తపాదాద్యవయవములను పలుతెరంగుల వికృతములుగ త్రిప్పుచుండును. ఒకప్పుడు కారణములేకయే యేడ్చును. వానిశరీరము కర్కశమై గర గరలాడుచు కృశించి అరుణవర్ణము గల్గియుండును. అట్టి యున్మాదము ఆహారము జీర్ణ మగునప్పుడు ప్రబలముగ నుండును. ఇది వాతజోన్మాదలక్షణము.

## పిత్తోన్మాదకారణములు, సంప్రాప్తి.

మూ. అజీర్ణకట్వమ్లవిదాహ్యశీతైః భోజ్యైః చితం పిత్తముదీర్ణవేగం,
ఉన్మాదమత్యుగ్రమనాత్మకస్య హృది శ్రితం పూర్వవదాశుకుర్యాత్.

వ్యా. అజీర్ణపదార్థములను కారము పులుపు గలపదార్థములను విదాహ(మ
పుట్టించు) పదార్థములను, మిక్కిలి వేడిగనుండుపదార్థములను భుజించుటవలన పి
స్వస్థానముననే మిక్కిలి వృద్ధినొంది ప్రకుపితమై ఇంద్రియముల జయింపజాలని వ
జునియొక్క చింతాదిదూషితమైన హృదయమును జేరి వాతోన్మాదమువలె శీఘ్ర
బుద్ధిని స్మృతిని జ్ఞానమును చెరచి వ్యత్యస్థముగ జేయును.

### పైత్తికోన్మాదలక్షణము.

మూ. అమర్ష సంరంభ వినగ్న భావాః స న్తర్జనాభిద్రవణౌష్ణ్యరోషాః,
ప్రచ్ఛాయశీతాన్న జలాభిలాషః పీతా చ భాః పిత్తకృతస్య లిఙ్గ

వ్యా. ఓర్పులేకుండుట, ఆర్భాటముచేయుట, గుడ్డగోచి లేక దిగంబరుడై స
రించుట, ఒకరిని బెదరించుట, విధినియమములేక నలుదెసల పరుగెత్తుట, శరీరము వే
నుండుట, కారణములేకయే, కోపమువచ్చుట, నీడను చల్లనియన్నమును చల్లనినీళ్లకోర
శరీరము పచ్చగనుండుట ఇనియన్నియు పిత్తోన్మాదలక్షణములు. (ఈయున్మాదము క్ర
మైనది.)

### కఫోన్మాదహేతువులు, సంప్రాప్తి.

మూ. సంపూరణైర్మన్దవిచేష్టితస్య సోష్మా కఫో మర్మణి సంప్రవృద్ధః, బు
స్మృతిం చాప్యుపహత్య చిత్తం ప్రమోహయన్సంజనయే
కారమ్.

వ్యా. మిక్కిలి తృప్తికరముగ భుజించుట విశేషముగ పనులుజేయకుండుట
కారణముచేత కఫము ప్రకోపముతో తనయందలి యూవిరితో కూడి మిక్కిలి బలిష్ఠ
హృదయస్థానమునజేరి బుద్ధిని స్మృతినిజెరచి మనస్సును పలుతెరంగుల భ్రమింపజేయు
నున్మాదమును కల్గించును.

### కఫోన్మాదలక్షణము.

మూ. వాక్చేష్టితం మన్దమరోచకశ్చ నారీ వివిక్తప్రియతాతి నిద్రా,
ఛర్దిశ్చ లాలా చ బలం చ భుక్తే నఖాదిశౌక్ల్యం చ కఫాత్మకస

వ్యా. కఫజోన్మాదముకలవాడు మాట్లాడుటయందును, పనులజేయుటయంద
మందుడై యుండును. అరోచకము కల్గును. స్త్రీలయందును, జనములేనిప్రదేశమ
నుండుటకును కోరికకల్గి యుండును. ఎల్లప్పుడును నిద్రయందాసక్తి కల్గియుండు
వాంతిజేయుచుండును. నోట జొల్లుకారుచుండును. భుజించినవెంటనే రోగము వ
నొందును, గోళ్లు, చర్మము, మున్నగునవి తెల్లబడియుండును. ఇది కఫజోన్మా
లక్షణము.

## సాన్నిపాతికోన్మాదలక్షణము.

మూ. యస్సన్నిపాతప్రభవోఽతిఘోరః సర్వైస్సమస్తైస్స చ హేతుభి స్స్యాత్, సర్వాణి రూపాణి బిభర్తి తాదృక్ విరుద్ధభైషజ్య విధిర్వివర్జ్యః. 15

వ్యా. సన్నిపాతజోన్మాదముపైని వాతాదుల వేరువేరుగ జెప్పబడిన ప్రకోప కారణములచే వాతాదులు మూడు నొక్కుమ్మడి ప్రకోపమునందుటచే కల్గును. కావున ఆయున్మాదమున వాతికాద్యున్మాదములకు వేరువేరుగ జెప్పబడిన లక్షణములన్నియు కల్గియుండును కావున క్రూరమైనది. దానికి పరస్పరవిరుద్ధమగు చికిత్స జేయవలసియుండును. అట్టి చికిత్స పొసగదు కావున సాన్నిపాతికోన్మాదమును చికిత్స జేయక విడువందగును.

## ఆగంతూన్మాదనిదానము.

మూ. దేవర్షిగన్ధర్వపిశాచయక్షరక్షః పితౄణాం అభిధర్షణాని,
ఆగన్తుహేతుః నియమవ్రతాదిమిథ్యాకృతం కర్మ చ పూర్వదేహే.

వ్యా. దేవతలు, ఋషులు, గంధర్వులు, పిశాచములు, బ్రహ్మరాక్షసులు, యక్షులు, రాక్షసులు, పితృదేవతలు అను నీగ్రహములచే భయపెట్టబడి ఆట్టిగ్రహము లావేశించుట, నియమములను వ్రతములను విధి ననుసరించక వ్యత్యస్తముగ నాచరించుట, పూర్వజన్మమునందు చేయబడినకర్మశేషము ఇవియన్నియు నాగంతుక ఉన్మాదమునకు కారణములగును.

## భూతోన్మాదసామాన్యలక్షణము.

మూ. అమర్త్యవాగ్విక్రమవీర్యచేష్టః జ్ఞానాదివిజ్ఞానబలాదిభిర్యః,
ఉన్మాదకాలోఽనియతశ్చ యస్య భూతోత్థమున్మాదముదాహరేత్తమ్.

వ్యా. మనుజులకు పైజెప్పబడిన దేవాదిగ్రహములయావేశముచే గల్గినయున్మాదములయందు మాటలును, బలంబును, శౌర్యంబును, ఆంగికాదిచేష్టలును మనుజులకు సాధారణముగ నుండునట్లుండక భిన్నముగ గన్పట్టును. తత్వజ్ఞానంబును శిల్పజ్ఞానంబును తనకు పూర్వములేకున్నను అట్టిజ్ఞానవిజ్ఞానములు కల్గియుండును. ఉన్మాదము జనించు కాలము నియమము లేకయుండును. ఈలక్షణములబట్టి భూతోన్మాదమని యెరుంగనగు-ది.

## దేవాదిగ్రహములు పురుషదేహమున నావహించువిధము.

మూ. అదూషయన్తః పురుషస్య దేహం దేవాదయః స్వైస్తుగుణ ప్రభావైః, విశన్త్యదృశ్యాః తరసా యథైవ ఛాయాతపౌ దర్పణసూర్యకాన్తౌ. 13

వ్యా. దేవాదిగ్రహములు మనుజులశరీరమును విశేషముగ జెరుపక తమతమ స్వభావసిద్ధములగుగుణములచేతను ప్రభావముచేతను ఇతరుల కగపడకయే అద్దమున ప్రతిబింబంబును సూర్యకాంతపుమణియందు సూర్యకిరణంబులును ప్రవేశించుభంగి పురుషుని శరీరమున తటాలున శీఘ్రముగ ప్రవేశించి యావహించెదరు. (ఇచ్చట "అదూషయన్తః" అనుచోట నఞ్ కొంచెము అనునర్థమును చెప్పును. అనగ విశేషముగ మనుజునిశరీరమును జెరుపక యించుక చెరుపునని యర్థము.)

### భూతోన్మాదప్రాప్తిసమయపూర్వరూపాదినిర్దేశము.

మూ. ఆఘాతకాలో హి సపూర్వరూపః ప్రోక్తో నిదానేఽథసురాదిభిశ్చ,
ఉన్మాదరూపాణిపృథఙ్నిబోధ కాలం చ గమ్యాన్పురుషాంశ్చ తేషామ్.

వ్యా. పైజెప్పబడిన దేవాదిభూతము లావహించుసమయంబును పూర్వరూపములును, నిదానస్థానమునం దేడవయధ్యాయమున జెప్పబడినవి. మరియు దేవాదిగ్రహముల యున్మాదమున గల్గులక్షణములు, అవి యావహించుతిథి మున్నగుకాలవిశేషములు, అట్టిగ్రహము లావహించుపురుషులు ఈవిశేషములన్నియు నీక్రింద సవిస్తరముగ వివరించి చెప్పబడును. వానివిశేషములనెల్ల చక్కగ గమనించి వినుమని శిష్యసంబోధనము. (భూతము లావహించుసమయము "ఉన్మాదయిష్యతామపి ఖలు దేవర్షి.........ఇత్యాఘాతకాలా వ్యాఖ్యాతా భవన్తి." (ని. అ. ౭. సూ. ౧౬.) అనియు; "తత్ర దేవాదిప్రకోప.........ఉన్మాదాభినిర్వృత్తిః" అని పూర్వరూపంబులును వివరింపబడినవి.)

### దేవగ్రహోన్మాదలక్షణము.

మూ. తద్యథా:—సౌమ్యదృష్టిం గమ్భీరమప్రధృష్ట (ష్య) మకోపనం
అస్వప్న భోజనాభిలాషిణం, అల్పస్వేదమూత్రపురీషవాచం(వాతం)
శుభగన్ధం ఫుల్లపద్మవదనమితి దేవోన్మత్తం విద్యాత్. 20

వ్యా. దేవగ్రహ మావహించియున్నమనుజుడు శాంతమైన దృష్టికల్గి యుండును. గంభీరమైన స్వభావంబును, ధైర్యంబును కల్గియుండును. కోపంబును నిద్రాభోజనములయందభిలాషయు లేకయుండును. చెమటయు మూత్రపురీషంబులును వాతంబును స్వల్పముగ వెడలును. మంచి పరిమళము కల్గియుండును. వానిముఖము వికసించిన కమలమును బోలియుండును. ఈలక్షణములుగలట్టి దేవగ్రహావేశముచే గల్గినయున్మాదమని యెరుంగునది.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—దేవత లొకప్పుడును మనుష్యులతో కూడనుండరు. మాటలాడరు. మనుష్యశరీరమును స్పృశింపరు. కావున నొకప్పుడును మనుష్య

శరీరమును స్పృశించి యావహించుట యసంభవము. కావున ఆదేవతలే మనుజుల నావహించి బాధించెదరని చెప్పువారికి భూతవిద్య బొత్తుగ తెలియదు. మరియు వాస్తవ్యమైనట్టి దేవతలసన్నిధిలో రక్తమాంసవసాదుల నాహారముగ జేసికొనుచు రాత్రులలో సంచరించుచు గ్రహరూపము నొందియుండు పరిచారకులు సంఖ్యాతీతముగ నుందురు. అట్టి క్రూరగ్రహములు బలి పూజాసత్కారాదుల నభిలషించి నిదానముల జెప్పిన కారణాది సంవిధానము తటస్థపడినసమయమున నాయాగ్రహమునకు విహితమైనకాలమున మనుజులపై నావహించి పీడింపదొడంగును. అంతమాత్రముననే అట్టిగ్రహము లావహించినపుడు దేవాదిలక్షణములు కానవచ్చినపుడు దేవాదిగ్రహములని లోకమున జెప్పుటయే కాని వాస్తవ్యముగ దేవాదులు మనుజుల నావహించుట యసంభవము. ఈవిషయమును సుశ్రుతాచార్యులిట్లుపదేశించిరి:—"న తే మనుష్యైస్సహ సంవిశన్తి, న వా మనుష్యాన్ క్వచిదావిశన్తి, యే త్వావిశన్తీతి వదన్తి మోహాత్ తే భూతవిద్యావిషయాదపోహ్యాః. తేషాం గ్రహాణాం పరిచారకా యే కోటీసహస్రాయుతపద్మసంఖ్యాః, అసృగ్వసామాంసభుజః సుభీమాః నిశావిహారాశ్చ తమావిశన్తి."

## ఋషిగ్రహోన్మాదము.

మూ. గురువృద్ధసిద్ధర్షీణాం అభిశాపాఽభిచారాఽభిధ్యానాఽనురూప
చేష్టాహారవ్యాహారం తైరున్మత్తం విద్యాత్. 21

వ్యా. గురువులు, వృద్ధులు, సిద్ధులు, ఋషులు వీరిని తిరస్కరించుటవలన వారు కోపించి శాపముబెట్టుటచేనైనను అభిచారతంత్రములచేనైనను ధ్యానించుటచేనైనను సంభవించినయున్మాదమునందు ఆయాశాపాదులు ఏయేరూపముగ నుండునో వానికనురూపములగు ఆహారంబును చేష్టలును కల్గియుండును. ఆయాహారచేష్టాదులబట్టి గురువృద్ధాదికృతశాపాదులచే సంభవించిన యున్మాదములని యెరుంగునది.

## పితృగ్రహోన్మాదము.

మూ. అప్రసన్నదృష్టిమపశ్యంతం నిద్రాళుం ప్రతిహతవాచం అనన్నాభిలాషం అరోచకాఽవిపాకపరీతం చ పితృభిరున్మత్తం విద్యాత్. 22

వ్యా. పితృగ్రహముచే నావహించినపురుషుడు కోపముతోకూడిన దృష్టి కల్గియుండును. బాగుగ చూడకుండును. ఎల్లప్పుడు నిద్రబోవుచుండును. తడబడి మాట్లాడును. అన్నమునం దిచ్ఛలేకుండును. అరోచకంబును కల్గియుండును. భుజింపబడిన యాహారము జీర్ణము కాకుండును. ఈలక్షణములబట్టి పితృగ్రహావేశించుటచే గల్గిన

యున్మాదమని యెరుంగునది. (ఇచ్చట అన్నము నోటికి రుచిగల్గియున్నను తిన నిచ్ఛలేకుండుట అనన్నాభిలాషము (అన్నద్వేషము) అన్నము తినుట కిచ్ఛకల్గియున్నను నోటికి రుచితప్పి యింపుగాకుండుట ఆరోచకమునని యీరెంటికిని భేదము నెరుంగునది.)

### గంధర్వగ్రహోన్మాదలక్షణము.

మూ. (చణ్డం సాహసికం తీక్ష్ణం గమ్భీరమప్రధృష్యం)ముఖవాద్యనృత్యగీతాఽన్నపానస్నానమాల్యధూపగన్ధరతిం, రక్తవస్త్రబలికర్మహాస్యకథానుయోగప్రియం, శుభగన్ధం చ గన్ధర్వోన్మత్తం విద్యాత్.

వ్యా. హింసాస్వభావము, సాహసము, తీవ్రత, గంభీరస్వభావము, ఇతరులచే భయమునొందకుండుట, నోటివాద్యము గానము నృత్యము అన్నపానములు స్నానము పుష్పమాలికలు ధూపములు గంధము అనువానియందు మిక్కిలి ప్రీతికల్గియుండుట, రక్తవస్త్రముల ధరించుటయందును పూజావిధుల నాచరించుటయందును హాస్యమునందును కథలమాట్లాడుటయందును మిక్కిలి ప్రీతికల్గియుండుట, శరీరమున మంచిపరిమళము కల్గియుండుట ఈలక్షణము లున్నది గంధర్వగ్రహోన్మాదమని యెరుంగునది.

### యక్షగ్రహోన్మాదలక్షణము.

మూ. అసకృత్ స్వప్నరోదనహాస్యం (హాసినం)నృత్తగీతవాద్యకథాఽన్నపానమాల్యధూపగన్ధరతిం, రక్తవిప్లుతాక్షం, ద్విజాతివైద్యపరివాదినం, రహస్యభాషిణం చ రక్షోన్మత్తం విద్యాత్. 24

వ్యా. రాక్షసగ్రహావేశముచే నున్మాదము కల్గినవాడు పలుమారు నిద్రబోవుచు ఏడ్చుచు నవ్వుచు నుండును. నృత్తము గీతము అన్నపానములు పుష్పమాలికలు ధూపము గంధము వీనియం దధికముగ నాసక్తికల్గియుండును. కన్నులెఱ్ఱనై కలకబారినట్లుండును. బ్రాహ్మణులతోడను వైద్యులతోడను కలహించును. రహస్యముగ మాట్లాడును. ఈలక్షణములబట్టి యక్షగ్రహోన్మాదమని యెరుంగునది.

### రాక్షసగ్రహోన్మాదలక్షణము.

మూ. నష్టనిద్రం, అన్నపానద్వేషిణం, అనాహారమప్యతిబలినం, శస్త్ర-శోణిత-మాంస-రక్తమాల్యాఽభిలాషిణం, సంతర్జకం చ రాక్షసోన్మత్తం విద్యాత్. 25

వ్యా. నిదురబట్టకుండుట, అన్నపానములయందు ద్వేషముకల్గుట, ఆహారములేకున్నను అధికమైన బలము కల్గియుండుట, ఆయుధములయందును మాంసమునందును ఎఱ్ఱని

పుష్పమాలికయందును అభిలాషకల్గియుండుట, ఇతరుల బెదరించుట ఈలక్షణములు కల్గినది రాక్షసగ్రహోన్మాదమని యెరుంగునది.

## బ్రహ్మరాక్షసగ్రహోన్మాదలక్షణము.

మూ. ప్రహాస-నృత్యప్రధానం దేవవిప్రవైద్యద్వేషాఽవజ్ఞాభిః స్తుతి వేదమన్త్రశాస్త్రోదాహరణైః కాష్ఠాదిభిః ఆత్మపీడనేన చ బ్రహ్మ రాక్షసోన్మత్తం విద్యాత్. 26

వ్యా. బ్రహ్మరాక్షసగ్రహము ఆవేశించినమనుజుడు బిగ్గరగ (కారణము లేకయే) నవ్వును. నృత్యముచేయును. దేవతలయందును బ్రాహ్మణులయందును వైద్యులయందును ద్వేషబుద్ధి కలిగినవారిని (వాదోపవాదములచే) అవమానము చేయుచుండును. స్తోత్ర పాఠములను వేదములను మహామంత్రములను వ్యాకరణాదిశాస్త్రములను పలుమారు నుదహరించి యుచ్చరించును. కఱ్ఱలు మొదలగువానిచే శరీరమును బాదుకొనును. ఉపవాసాదులచే నాత్మకు బాధకల్గించుకొనును. ఈలక్షణములబట్టి బ్రహ్మరాక్షసగ్రహముచే గల్గిన యున్మాదమని యెరుంగునది.

## పిశాచగ్రహోన్మాదలక్షణము.

మూ. అస్వస్థచిత్తం, స్థానమలభమానం, నృత్యగీతహాసినం, బద్ధాఽబద్ధ ప్రలాపినం, సఙ్కరకూటమలినరథ్యాచేల తృణాఽశ్మకాష్ఠాధి రోహణరతిం, భిన్నరూక్షస్వరం, (భిన్నరూక్షవర్ణస్వరం) నగ్నం, విధావన్తం, నైకత్రతిష్ఠన్తం, దుఃఖాన్యావేదయన్తం, నష్టస్మృతిం చ పిశాచోన్మత్తం విద్యాత్. 27

వ్యా. పిశాచగ్రహమావేశించినవాడు చిత్తము స్వాధీనమున లేకుండును. తన కొకస్థానములేదని చెప్పును. నృత్యముచేయును, సంగీతముపాడును, కారణములేకయే నవ్వును. ఒకప్పుడు సంబంధముకలమాటలను మరియొకప్పుడు సంబంధములేనిమాటలను మాట్లాడును. ఒకప్పుడు అర్థములేనిమాటల వదరును. కుప్పదిబ్బలమీదను, మలినమైన మెట్టమీదను, త్రోవయందును, గుడ్డపేలికలమీదను, రాతిగుట్టమీదను, కొయ్యలగుట్ట మీదను ఎక్కుటయం దిచ్ఛగల్గియుండును. పగిలిన కంచుగంటవలె రూక్షమైన (కఠినమైన) కంఠస్వరము కల్గియుండును. ఒకచోటనైన నిలుకడలేక నలుప్రక్కల దిరుగుచుండును. దుఃఖకరములగు విషయముల దెలుపుచుండును. గతించినవిషయములజ్ఞప్తి లేకుండును. ఈలక్షణములబట్టి పిశాచగ్రహోన్మాదమని యెరుంగునది.

దేవగ్రహావేశయోగ్యపురుష-కాలములు.

మూ. తత్ర చౌక్షాచారం (శౌచాచారం) తపస్స్వాధ్యాయకోవిదం,
నరం ప్రాయః శుక్లప్రతిపది త్రయోదశ్యాం చచ్ఛిద్రమవేత్య
అభిధర్షయన్తి దేవాః. 28

వ్యా. పైజెప్పఁబడిన దేవాదిగ్రహములలో దేవగ్రహములు పరిశుద్ధమైన యాచారంబును తపస్సంపన్నుండును వేదాధ్యయనమును చక్కఁగ నెరింగినవాఁడు నగు పురుషుని, శుక్లపాడ్యమినాడైనను త్రయోదశినాడైనను ప్రాయికముగ సమయము నెరింగి యావేశించును. (ఇచ్చట శౌచాచారాదిసంపన్నుఁడు భూతావేశమునకు పాత్రుఁడగుట యుక్తముగాకున్నను పూర్వజన్మకృతకర్మపరిపాకవశమునంజేసి పాత్రుఁడగునని యెరుంగునది. మరియు శౌచాచారాదులు భూతావేశమున కర్హపురుషలక్షణములనియు, శుక్లప్రతిపదాదికాలము భూతావేశకాలమనియు నెరుంగునది. ఇత్తెరంగుననే క్రింద వివరణములయందును పురుష-కాలముల నెరుంగునది. "చౌక్షాచారం" అనుచోట "చౌక్షః-శుచిః, ఆచారోయస్య-సచౌక్షాచారః" అని చక్రపాణివ్యాఖ్యాన మున్నది.) ఇచ్చట 'ప్రాయః' అనుటవలన ఇతరకాలమునందును ఆవహించవచ్చునని యర్థము. ఇత్తెరంగుననే తక్కినస్థలములయందు నూహించునది.

ఋషిగ్రహావేశపురుష-కాలములు.

మూ. స్నానశుచివివిక్తసేవినం, ధర్మశాస్త్రశ్రుతివాక్యకుశలం ప్రాయః,
షష్ఠ్యాం నవమ్యాం చ ఋషయః; (ధర్షయన్తి.) 89

వ్యా. స్నానమునందును పరిశుద్ధమందును ఏకాంతనివాసమునందును ఆసక్తికలిగి ధర్మశాస్త్రములను వేదములను చక్కఁగ నెరింగినవానిని షష్ఠినాడైనను నవమినాడైనను ఋషులు ప్రాయికముగ ఆవహించెదరు.

పితృగ్రహావేశపురుష-కాలములు.

మూ. మాతృ-పితృ-గురు-వృద్ధ-సిద్ధ-ఆచార్యోపసేవినం, ప్రాయో
దశమ్యామమావాస్యాయాం చ పితరః; (ధర్షయన్తి.) 30

వ్యా. తలిదండ్రులను, గురువులను, పెద్దలను, సిద్ధులను, మంత్రములను విద్యను ఉపదేశించిన యాచార్యులను, సేవజేయువారిని, ప్రాయికముగ దశమినాడైనను అమావాస్యనాడైనను పితృగ్రహము లావేశించును.

## గంధర్వగ్రహావేశపురుష-కాలములు.

మూ. గన్ధర్వాః స్తుతి-గీత-వాదిత్ర-రతిం, పరదారగన్ధమాల్యప్రియం, చౌక్షాచారం, ప్రాయో ద్వాదశ్యాం చతుర్దశ్యాం చ, (ధర్షయన్తి.) 31

వ్యా. స్తోత్రపాఠములయందును సంగీతమునందును వాద్యమునందును ఆసక్తికల వానిని పరస్త్రీలయందును గంధమాల్యములయందును ప్రీతికలవానిని సదాచారముకల వానిని ప్రాయికముగ ద్వాదశినాడైనను చతుర్దశినాడైనను గంధర్వగ్రహము లావహించును.

## యక్షగ్రహావేశపురుష-కాలములు.

మూ. సత్త్వ బల రూప గర్వ శౌర్యయుక్తం, మాల్యానులేపనహాస్యప్రియం, అతివాక్ప్రియం, ప్రాయశ్శుక్లైకాదశ్యాం సప్తమ్యాం చ యక్షాః; (ధర్షయన్తి.) 32

వ్యా. సత్వగుణము, శరీరబలము, సౌందర్యము, గర్వము, శౌర్యము, ఈగుణములు కల్గినవానిని, పుష్పమాలికలయందును గంధాద్యనులేపనములయందును పరిహాసమునందును ప్రీతికలవానిని, అధికముగ మాటలాడువానిని యక్షగ్రహములు ప్రాయికముగ శుక్లైకాదశినాడైనను సప్తమినాడైనను యక్షగ్రహము లావహించును.

## బ్రహ్మరాక్షసగ్రహావేశపురుష-కాలము.

మూ. స్వాధ్యాయతపోనియమోపవాస బ్రహ్మచర్యదేవయతిగురుపూజారతిం, భ్రష్టశౌచం, బ్రాహ్మణమబ్రాహ్మణం వా బ్రహ్మవాదినం, శూరమానినం, దేవాగారసలిలక్రీడనరతిం ప్రాయః శుక్లపఞ్చమ్యాం పూర్ణచన్ద్రదర్శనే చ బ్రహ్మరాక్షసాః; (ధర్షయన్తి.)

వ్యా. వేదాధ్యయనము, తపశ్చరణము, నియమము, ఉపవాసవ్రతము, బ్రహ్మచర్యము, దేవ-యతి-గురు-పూజ వీనియందు మిక్కిలి యాసక్తికల్గియు శౌచాచారములేకుండు బ్రాహ్మణునైనను తత్త్వవిచారము చేయునబ్రాహ్మణునైనను, తాను శూరుడని యభిమానము కల్గినవానినైనను ప్రాయికముగ శుక్లపంచమినాడైనను, పూర్ణచంద్రునితోఁగూడిన పూర్ణిమనాడైనను బ్రహ్మరాక్షసగ్రహము లావేశించును. మరియు దేవాలయములయందును జలమునందును క్రీడింప నాసక్తికలవానిని కూడ బ్రహ్మరాక్షసగ్రహము లావేశింపఁజూచును.

## రాక్షస-పిశాచగ్రహముల యావేశకాలములు.

మూ. రక్షఃపిశాచాస్తు హీనసత్త్వం పిశునం(స్త్రైణం) (స్తేనం) లుబ్ధం శఠ
ప్రాయోద్వితీయాతృతీయాఽష్టమీషు; (ప్రాయః ఛిద్రమవేక్ష
అభిధర్షయన్తి ద్వితీయాతృతీయాఽష్టమీషు).

వ్యా. సత్త్వగుణము లేకుండుట, కలహముల బెట్టుట, స్త్రీలోలుడగుట, (బంగ
దొంగలించుట), లుబ్ధత్వము, శఠత్వము, ఈగుణములు కలవానిని ద్వితీయ, తృతీయ
అష్టమి, ఈదినములయందు ప్రాయికముగ సమయముజూచి రాక్షసగ్రహంబులును పిశా
గ్రహంబులును ఆవేశించును. ("ఛిద్రమవేక్ష్య" అనుచోట ఉచ్ఛిష్టాదిస్థలములయ
దుండుట మున్నగునపరిశుద్ధరూపములగు నపచారముల జూచి అట్టి అవకాశములయం
గ్రహము లావేశించునని యర్థము. ఈయర్థము పైవాక్యము లన్నిటియందును సమ
యించి యర్థము చేయునది.)

## అనుక్తగ్రహసంగ్రహము.

మూ. ఇత్యపరిసంఖ్యేయానాం గ్రహాణామావిష్కృతతమాః, హ్యష్ట
వేతే వ్యాఖ్యాతాః.

వ్యా. ఉన్మాదములకు కారణభూతములగు గ్రహములు లెక్కకుడ నలవిగాక
మున గలవు; వానిలో ముఖ్యముగ స్ఫుటముగ గమనింపదగిన గ్రహముల నెనిమిదిమా
మిచ్చుట భూతవిద్యాప్రస్తావమున వివరింపబడినవి.

## అసాధ్యభూతోన్మాదము.

మూ. సర్వేష్వపి తు ఖల్వేషు యో హస్తావుద్యమ్య రోషసంరమ్భా
న్నిశ్శఙ్కం అన్యేష్వాత్మని వా నిపాతయేత్, స హ్యసాధ్యో జ్ఞేయ
తథా యస్సాశ్రునేత్రః, మేఢ్రప్రవృత్తరక్తః, క్షతజిహ
ప్రస్రుతనాసికః, ఛిద్యమానచర్మా, అప్రతిహన్యమానవా(వా)
సతతం వికూజన్, దుర్వర్ణస్తృషార్తః పూతిగన్ధశ్చ హింసా
న్మత్తో జ్ఞేయః, తం పరిత్యజేత్.

వ్యా. పైజెప్పబడి భూతోన్మాదము లన్నిటియందును ఎవడు తనచేతుల రెం
పైకెత్తి రోషావేశముచేత భయ మించుకేనియు లేక యితరులపైనైనను పడవైచ
అట్టివానియున్మాదము సాధ్యము కానేరదు. మరియు కన్నుల నీరుగారుట, మేఢ్ర

నుండి రక్తము కారుట, నాలుక కొరికికొనుట, (లేక ప్రుండగుట), ముక్కున ద్రవము స్రవించుట, ఒడలిపై చర్మమును తానే పగులదీసికొనుట, నోటి కడ్డులేక తనకిచ్చవచ్చినట్లు వదరుట, ఎల్లప్పుడును కూకలిడుట, శరీరవర్ణము చెడి మారుట, దప్పి యధికమగుట, శరీరముపై దుర్గంధముపుట్టుట, ఇట్టి లక్షణములుగల యున్మాదరోగి హింసింపగోరి యావహించినభూతముచే నాక్రమింపబడినవాడు కావున అట్టి యున్మాదము అసాధ్యము, వానికి చికిత్స జేయంజనదు.

ఇచ్చట నీవివరణము నెరుంగునది.—పైజెప్పినరీతిగ భూతములు మనుజుల నావహించి యున్మాదమును కల్గించుటకు ఆభూతములయుద్దేశములు మూడువిధములు. మనుజుని హింసింపజూచుట, సంభోగసుఖముల ననుభవించుట, పూజాబలి మున్నగు వానియం దభిలాష, ఈమూటిలో చంపునుద్దేశముతో నావహించినభూతముచే గల్గిన యున్మాదమునందు రోగిని ఆభూతము తప్పక చంపును. కావున నది యసాధ్యము. ఆయున్మాదమే యిచ్చట "హింసార్థ్యున్మత్తః" అని నిర్దేశింపబడినది. హింసాభిలాషచే నావహించినభూతమువలన సంభవించినయున్మాదరోగి యనియర్థము. అట్టి యున్మాదరోగమున పైజెప్పబడిన లక్షణములు కనబడును. ఇవియేకాక రోగినిచంపుటకు కావలసిన క్రూరకృత్యముల నన్నిటిని ఆభూతము నెరవేర్చి తుదకు రోగిని సమాప్తిచేయజూచును. దీనికి చికిత్స జేసియు లాభములేదు.

తక్కిన రెండువిధములఫలమును కోరి యావహించిన భూతోన్మాదములయందు ఆభూతముల యుద్దేశము నెరింగి క్రీడానుభవమును, పూజాదిసత్క్రియల నాచరించినచో నాభూతములు తృప్తినంది తొలంగును. అప్పుడే యున్మాదము నివర్తించి మనుజుడు సుఖించును. కావున అవిరెండును సాధ్యములు.

ఈవిషయమంతయు నిదానస్థానమున "త్రివిధం తూన్మాదకరాణాం భూతానాముస్మాదనే ప్రయోజనం. తద్యథా—హింసా, రతిః, అభ్యర్చనం చేతి, ......... తమసాధ్యం విద్యాత్, సాధ్యావితరౌ" (నిదాన-అ. ౭. సూ. ౧౭) అని వివరముగ జెప్పబడినది. ఆవిషయమే యీక్రిందను చెప్పబడును.

## రత్యర్చనాకామోన్మాదచికిత్స.

మూ॥ రత్యర్చనాకామోన్మాదినో తు భిషగభిప్రాయాచారాభ్యాం బుద్ధ్వా
తదఙ్గోపహారబలిమిశ్రేణ, మన్త్రభైషజ్యవిధినోపక్రమేత. ౮7

వ్యా॥ సంభోగాదిక్రీడావిశేషములగోరుభూతము ఆవహించుటచే గల్గినయున్మాదము కలవాడు రతికామోన్మాది. బలిపూజాదిసత్కారములగోరుభూతము ఆవహించు

టచే గల్గినయున్మాదముకలవాడు అర్చనాకామోన్మాది. అట్టి యున్మాదములు కల వైద్యుడు ఆవహించియుండు భూతముయొక్క అభిప్రాయముచేతను ఆచారాదిచేష్టావిశేషములచేతను ఆభూతముయొక్క అభిలాష నెరింగి, ఆయభిలాషానుగుణముగ వర్తించుట చేతను పూజాదివిధుల నిర్వర్తించుటచేతను భూతముయొక్క అభిలషితమును నెరవేర్చి, పిమ్మట తత్తదనుకూలమగు ఔషధములచేతను మంత్రవిధులచేతను చికిత్స జేయ నుపక్రమించవలెను.

## ఉన్మాదచికిత్సాక్రమము.

మూ. తత్ర ద్వయోరపి నిజాగన్తునిమిత్తయోః ఉన్మాదయోః,
సమాసవిస్తరాభ్యాం భేషజవిధిమనువ్యాఖ్యాస్యామః. 38

వ్యా. అందు నిజాగంతు భేదములచే రెండు తెరంగులైన యున్మాదరోగములకు సంగ్రహముగను విస్తృతముగను చికిత్సావిధాన మిక్రింద వివరింపబడును.

## వాతోన్మాదచికిత్స, స్నేహపానము.

మూ. ఉన్మాదే వాతజే పూర్వం స్నేహపానం విశేషవిత్,
కుర్యాదావృతమార్గేతు సస్నేహం మృదుశోధనమ్. 39

వ్యా. వాతప్రకోపమునకల్గిన యున్మాదమునందు వాతవిశేషలక్షణముల నెరింగిన వైద్యుడు రోగికి తొలుత స్నేహపానము చేయించవలెను. వాతముయొక్క స్రోతోమార్గము అడ్డగింపబడియుండునెడ స్నేహద్రవ్యముతోగూడిన మృదువైన ఔషధముచే శోధనము చేయించవలెను.

ఇచ్చట వాతము మేదఃకఫములచేత నావరింపబడకుండునపుడు స్నేహపాన ముచితము. అటుగాక వాతము ఆవృతమై యున్నపుడు స్నేహపానము చేసినచో శూలమును అంగసుప్తిని వాపును వృద్ధినొందును. కావున వైద్యుడు వాతముఆవృతమా? అనావృతమా? అని గమనించి ఆవృతము కాకుండునపుడు స్నేహపానమును, కఫమేధస్సులచే వాతమార్గము నిరోధింపబడినపుడు స్నేహయుక్తమైన మృదుశోధనమును చేయవలెనని పైశ్లోకమున రెండువిధములు చికిత్స నిర్దేశింపబడినది. ఈయర్థమును సూచించుటకే ''విశేషవిత్'' అని వైద్యవిశేషణము చెప్పబడినది. నిరుద్ధవాతమున స్నేహపాననిషేధము సిద్ధిస్థానమున నిట్లు చెప్పబడినది:—''మేదః కఫాభ్యామనిలో నిరుద్ధః శూలాఙ్గసుప్తిశ్వయథూన్ కరోతి, స్నేహం నియుఞ్జన్నబుధస్తు తస్మై సంవర్ధయత్యేవ హితాన్ వికారాన్'' (సిద్ధి-అ. ౧.)

